**P. SUNDARAYYA**

# *VEERA TELANGANA VIPLAVA PORATAM —GUNAPATHALU*

[ Telugu Editon Of Telangana People's Struggle And Its Lessons ]

*Published by :*
Andhra Pradesh Committe of Communist Party of India (Marxist)
Vijayawada-2.

# వీర తెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు

రచన :

పుచ్చలపల్లి సుందరయ్య

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ కమిటీ

భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)

విజయవాడ - 2

ప్రథమ ముద్రణ :
1973 మే.

ఆంధ్రానువాదం

వాసిరెడ్డి,
బొమ్మారెడ్డి : తా॥ విరల్.

వెల :
**12 రూపాయలు**

ముద్రణ :
ప్రజాశక్తి ప్రెస్,
విజయవాడ - 2

ప్రతులకు :
మార్క్సిస్టు ప్రచురణలు,
విజయవాడ - 2
ప్రజాశక్తి బుక్ హౌస్,
హైదరాబాద్ - 27.

# విషయసూచిక

మామాట vii

ముందుమాట xi

ఉపోద్ఘాతం 1

## ప్రథమ భాగం

అధ్యాయం :

**1.** హైదరాబాదు సంస్థానం - దాని సాంఘిక - రాజకీయ పూర్వరంగం. 9

బహుభాషలుగలరాజ్యం – 9, ముస్లిం పాలకులకు – హిందూ పాలితులకు మధ్య వైరుధ్యం – 10, ఫ్యూడల్ పీడన – 12; కార్మికుల, మధ్యతరగతి ఉద్యోగుల దుర్భర పరిస్థితులు 21, ఆంధ్ర మహాసభ ప్రారంభ దినాలు – 22, రెండవ ప్రపంచ యుద్ధం – హైదరాబాదు సంస్థానంలో ప్రజాపోరాటాలు – 26.

**2** రైతాంగ విజృంభణ కమ్యూనిస్టుపార్టీ 35

తెలంగాణా వ్యావసాయక తిరుగుబాటును రగిల్చిన అగ్నికణం – 43, దొడ్డి కొమరయ్య ఆత్మార్పణ – 44. మూక ఉమ్మడి అరెస్టులు, పోలీసుభీభత్సకాండ – 48, గ్రామాలపై సాయుధ పోలీసుదాడులు – ప్రజల ప్రతిఘటన – 51, దాడుల అనంతర పరిస్థితి – 60, ఉద్యమంలో ఈ దశనుగూర్చి కొన్ని గుణ పాఠాలు – 64.

**3.** నైజాముకు, రజాకార్లకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటనోద్యమం 69

భూమి పంపిణీ, ప్రజారాజ్య స్థాపన (1947 ఆగస్టు 15 నుండి 1948 సెప్టెంబరు 13 వరకు) – 69; మన వ్యవసాయ కార్య

క్రమం –72, నూతన వెల్లువ– 75; ఆయుధాల సేకరణ, గెరిల్లా దళాల నిర్మాణం, సాయుధ ప్రతిఘటన–78; కొన్ని ముఖ్యమైన సాయుధ చర్యలు–84, క్యాంపుల నిర్మూలన– 120, అమరవీరుల గాథలు–125.

4. నైజాముకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజల సాయుధ విమోచన పోరాటం - ఆ పోరాట విజయాలు 137

దున్నేవానికే భూమి – 139, భూమి పంపిణీ చేపట్టడం సరైనదేనా?–144, గ్రామరాజ్య కమిటీల నిర్మాణం–149, వ్యవసాయ సంస్కరణలు–149, వ్యవసాయ కార్మికుల వేతనాలపెంపు-151, స్త్రీలకు సమానహక్కులు–153, సాంస్కృతిక పురోగమనం–154, సైనిక దృక్కోణంనుంచిపోరాటస్వరూపం–156, బలహీనతలు -162.

5. ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం :
1948–51 మధ్య బీభత్స పాలన 168

ఎన్నికలు – ఆ తర్వాత – 171; దుష్ట శాసనం జారీ నిర్బంధ కాండ ప్రారంభం – 177, స్వాతంత్ర్యం – ఆ తర్వాత – 179, ఆంధ్రలో రెండు సంవత్సరాల బీభత్సకాండ – 182, దాడులను ప్రజలు తిప్పికొట్టారు – 191, ప్రభుత్వంచే మూకవుమ్మడి హత్యా కాండ – 199, ఆంధ్రలో నిర్బంధకాండను గూర్చి కొన్ని ప్రకటనలు – 203.

# ద్వితీయ భాగం

1. భారతసైన్యం ప్రవేశం తదనంతర పరిస్థితి 213

భారత సైన్యం రంగలో ప్రవేశించేనాటి స్థితి – 213; సాయుధ పోరాటం కొనసాగింపుకు నిర్ణయం – 218; భారత ప్రభుత్వ "పోలీసు చర్య" – 219, ప్రజల వెనులుబాటు ఎంతోకాలం నిలవలేదు – 227.

2. బీభత్స పాలన : ప్రతిఘటన 235

బీభత్స పద్ధతులు – 238, మహిళలపై అత్యాచారాలు, మాన భంగాలు – 240: దారుణ హత్యలు – 241; బీభత్స కాండ వైఫల్యం – 244.

3. కృష్ణానదీతీరానగల నల్లమల అరణ్యప్రాంతం 249

దళాల గద్దువల్ల కలిగిన వినాశకరఫలితాలు – 254; వ్యవసాయ కార్మికపోరాటాలు – 257, మనదళాలకు లంబాడీప్రజల అండ దండలు – 266, పార్టీ నిర్మాణం – 268; గెరిల్లాదళాలను తిరిగి ఏర్పాటుజేసిన అనంతర పరిస్థితి – 269, నవంబరు దినోత్సవం, శాంతిదినోత్సవం – 277, 1950 సంవత్సరాంతానికి నల్గొండజిల్లా మైదాన ప్రాంతాలలో మిలటరీ కేంద్రాలచుట్టూ నెలకొనివున్న పరిస్థితి – 278, ఆమరాబాద్ ప్రాంతం – కృష్ణానదీ సరిహద్దు ప్రాంతంలో ఉద్యమ విస్తరణ – 280, కర్నూలుజిల్లా – 285; వికారాబాద్ప్రాంతం – 286, 1951 అక్టోబరులో పోరాటాన్ని ఉపసంహరించేనాటి పరిస్థితి – 288.

4. గోదావరినదీతీరానగల అరణ్య ప్రాంతం 293

"పోలీసుచర్య" అనంతరం ఖమ్మం–కొత్తగూడెం (పాల్వంచ) ప్రాంత పరిస్థితి – 293, కోయప్రజలమధ్య ఉద్యమపరిస్థితి–299; గ్రామాల దహనం, నిర్బంధ శిబిరాల ఏర్పాటు – 304; అడవి ప్రాంతాల్లో గెరిల్లాల కార్యకర్తల దుర్భరజీవితం – 306; మాను కోట–ములుగు–వరంగల్ ప్రాంతం–309; 1950 సంవత్సరంలో 315, 1951 సంవత్సరంలో, ఆదిలాబాద్ జిల్లాలో చెన్నూర్–సిరి పూర్ ప్రాంతానికి విస్తరణ – 319.

5. గెరిల్లా దళాల సాయుధ చర్యలు 325

పోలీసు, మిలటరీ గస్తీ కేంద్రాలపైన, పోలీసు క్యాంపులపైన, దుష్ట భూస్వాములపైన, వాళ్ళ ఏజెంట్లపైన దాడులు – 325; గోదావరిఫారెస్టుప్రాంతం–328, ఖమ్మం–పాల్వంచప్రాంతం–335; ఇబ్రహీంపట్నం – దేవరకొండ – అమరాబాద్ ప్రాంతం – 336,

కరీంనగర్ – జనగామ ప్రాంతం – 338, యూనియన్ భూభాగం లోని పోలీసు స్టేషన్లపై దాడులు – 341, శత్రు ఏజెంట్లూ, దుష్ట భూస్వాములు చంపివేయబడిన ఉదంతాలు – 34?.

6. కరీంనగర్ తదితర ప్రాంతాలలో వెల్లువికిన ప్రజావెల్లువ 34

పోలీసు దాడులు – ప్రజాప్రతిఘటన–35?, ప్రజలచే ధాన్యం – భూమి స్వాధీనం – 356, ఆదిలాబాద్ జిల్లాలోకి ఉద్యమ విస్తరణ – 360.

7. నగరాల్లో కార్మికుల్లో ఉద్యమ పరిస్థితి 36

విద్యార్థుల ప్రదర్శనలు, పోరాటాలు – 366; కార్మికవర్గ పోరాటాలు – 369, ప్రభుత్వోద్యోగులలో అసంతృప్తి – 370, ఆహార సమస్య – 371; హైదరాబాదు నగరంలో నిర్బంధకాండ తీవ్రత – 372.

8. జైళ్ళ లోపల సహితం తెలంగాణాయోధుల పోరాటం 38

9. తెలంగాణా పోరాటంలో స్త్రీల వీరోచిత పాత్ర 40

భూమి నిలుపుకోవటంలో స్త్రీల పాత్ర – 402; కూలి పెంపుదల కోసం స్త్రీల పోరాటం–403, కొందరు వీరనారుల గాథలు–408; తమ మానాలను సంరక్షించుకునేందుకై స్త్రీల పోరాటం – 415; గెరిల్లా దళాలలో, పట్టణాలలోని రహస్య పార్టీ కార్యాలయాలలో స్త్రీల పాత్ర – 419; ఉద్యమంలో కోయ స్త్రీల ముందంజ– 423; వివాహం – నూతన సాంఘిక సమస్యలు – 426.

10. భారత సైన్యం ప్రవేశించిన తర్వాత, ప్రతిఘటనలో ప్రాణాలర్పించిన కొంతమంది దళ నాయకుల, పార్టీ నాయకుల సంగ్రహ చరిత్ర. 43

సూర్యాపేట తాలూకా – 442, మధిర తాలూకా – 447; ములుగు – మానుకోట – 449; జనగామ – 451; హుజూర్ నగర్, మిర్యాలగూడెం – 457; మునగాల – 463, భువనగిరి – 464; ఇతరులు – 468.

11. తెలంగాణా సాయుధ గెరిల్లా ప్రతిఘటన ఉపసంహరణ 471

భారత విప్లవపంథా – 483, చైనా – భారత దేశాల్లోని పరిస్థితుల్లో గలతేడా – 486, కార్మికవర్గ నాయకత్వ పాత్ర, కార్మిక కర్షక మైత్రి – 487, నేటి పరిస్థితిని గురించి, కర్తవ్యాలను గురించి అంచనా – 490, రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం పట్ల మార్క్సిస్టు – లెనినిస్టు అవగాహన; పాక్షిక గెరిల్లా పోరాటం-493, విముక్తి పోరాటంలో అంతర్భాగంగా సాయుధ గెరిల్లా పోరాటం – 495, సాయుధ గెరిల్లా పోరాటం – వ్యక్తిగత హింసావాదం – 496; సాయుధ గెరిల్లా పోరాటానికి వ్యక్తిగత హింసావాదానికి సంబంధించిన కొన్ని సమస్యలు – 498, తెలంగాణా సాయుధ పోరాటం, దాని భవిష్యత్తు – 501, 1951 లో కేంద్ర కమిటీ సమావేశం–దాని నిర్ణయాలు – 502, తెలంగాణాపై 1951 మేలో కేంద్ర కమిటీ చేసిన తీర్మానం-504, పోరాట విరమణ నిర్ణయానికి దారితీసిన పరిస్థితులు – 511; సాయుధ పోరాట ఉపసంహరణపై తీర్మానం – 515, కేడరు సంరక్షణపై – 520, ఉపసంహరణ అనంతరం జరిగిన పరిణామాలు-521, విభేదాల కొనసాగింపు-525

ఉపసంహారం 529

ఇతర రంగాల్లో-533; కొన్ని వైఫల్యాలు 534, కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం – 536, మన కేడరు సిద్ధాంత బలహీనతలు-538 నేటి మన కర్తవ్యాలు-539.

# తృతీయ భాగం

అనుబంధం 1 : వ్యవసాయ కార్మికుల, పేదరైతుల స్థితిగతులు 543

హుజూర్‌నగర్ తాలూకా – 543; దేవరకొండ తాలూకా – 545, ప్రశ్నలు – సమాధానాలు – 546, మహిళలకు సమాన వేతనం సమస్య – 550, ఆదిలాబాద్ తాలూకా – 552, మన శత్రువుల అసత్యప్రచారం – 554; మన డిమాండ్ల విషయంలో ప్రజలకు

నచ్చజెప్పటమెలా ? – 555, రాజకీయ లక్ష్యం – 556, మన నినాదాలు–556, తీర్మానాలు : భూమి సమస్య – 559, ధాన్యం లెవీలు–560, ఆహార సమస్య-561, వ్యవసాయ కార్మికులు–563; మానుకోట ప్రాంతంలో భూ సమస్యపై మన నినాదం – 564; ఇతర విప్లవ ప్రజాపోరాటాలు – 567.

అనుబంధం 2. ప్రస్తుత రహస్య నిర్మాణం-మన కర్తవ్యాలు 569

మనం రహస్య పద్ధతులను ఏ ప్రాతిపదికపై అనుసరించాలి – 569, రాష్ట్రకమిటీ సర్క్యులర్–577, టెక్నికల్ సర్క్యులర్–593.

అనుబందం 3. పోరాటంలో అసువులుబాసిన అమరవీరుల వివరాలు 601

అనుబంధం 4. వీరతెలంగాణా విప్లవ గాథలు : 677
[హరీంద్రనాథ్‌చట్టోపాధ్యాయ గేయం]

# మా మాట

ఇన్నేళ్ళకు యీ మహద్గ్రంథాన్ని తెలుగుజాతికి అందించ గలిగినందుకు ఆనందిస్తున్నాం. తెలుగుజాతి చరిత్రలో అదొక ఉజ్వల ఘట్టం. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికీ, నిజాం ఫ్యూడల్ వ్యవస్థకూ వ్యతిరేకంగానూ, యీ రెండిటి అవశేషాలనూ కొనసాగిస్తున్న కాంగ్రెసు బూర్జువా పాలనను ప్రతిఘటించీ, అయిదేళ్ళపాటు సాగిన మహత్తర తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటు చరిత్ర ఇది. ఆనాడు అది భారత దేశంలో ఏర్పడ్డ 'యేనాన్' అని గర్వించిన వాళ్ళూ వున్నారు; భయపడి ఖండించిన వాళ్ళూ వున్నారు రెండు విధాలా అది జగత్ ప్రసిద్ధి కెక్కింది.

ఆ మహత్తర పోరాటు విశిష్టతను ఇప్పుడు ప్రశ్నించగల వాళ్ళెవరూ లేరు. అయితే అందుకు వక్రభాష్యాలు చేసేవారు లేక పోలేదు. మితవాద కమ్యూనిస్టులు దానికొకవైపు రజితోత్సవం జరుపుతూ మరొకవైపు దాన్ని తాడూ బొంగరంలేని నక్సలైట్ పోరాటంతో జమకట్టారు నక్సలైట్లు దాన్ని తమ పోరాటం వంటిదిగానే చిత్రించుకొని, అసలు అదే బిగువున దాన్ని కొనసాగించి వుండవలసిందని ప్రచారం చేశారు. ఇవి రెండూ ఆనాటి వాస్తవాలకు అతకని వక్ర భాష్యాలు ఆ విషయాన్ని నిరూపిస్తూ కామ్రేడ్ బసవపున్నయ్యగారు రచించిన "తెలంగాణా సాయుధ పోరాటం - వాస్తవాలు" అన్న గ్రంథాన్ని ఇంతకుముందే తెలుగు పాఠకులకు అందించాం. అందుకు ఆధారంగా నిర్వివాదమైన ఆనాటి డాక్యుమెంట్సు గూడా ఆ పుస్తకంలో ప్రచురించబడ్డాయి.

సుందరయ్యగారు రచించిన యీ గ్రంథం అసలు తెలంగాణా పోరాటపు మొత్తం చరిత్ర. ఏ సామాజిక, రాజకీయ భౌతిక పరిస్థితుల్లో ఆ పోరాటం పుట్టి పెరిగిందో వివరించి, మారిన పరిస్థితులరీత్యా దాని ఉపసంహారణ ఎలా అవసరమైనదీ విశదీకరించి, అమూల్యమైన గుణ పాఠాలు తీసిన గ్రంథం ఇది. ఆ పోరాటం నడిచిన తీరు, సాధించిన విజయాలూ ఇందు విదితమవుతాయి అందులో పాల్గొన్న వారు –

స్త్రీలూ పురుషులూ – మట్టిలోనుంచి పుట్టిన మాణిక్యాలవలె, సామాన్య జనంనుండి జనించి మహావీరులై పోరాడిన గాథలు స్మరణకు స్ఫురణకూ వస్తాయి. కనుక భవిష్యత్ మార్క్సిస్టు – లెనినిస్టు విప్లవకారులకు శిక్షణగరిపే పాఠ్యగ్రంథంగా ఇది మనగలదు.

ఇరవయ్యేళ్ళ తర్వాత, స్వయంగా పాల్గొన్న, తీర్చిదిద్దిన ఆ పోరాట జ్ఞాపకాలను, నెమరు వేసుకొని, ఇన్ని వివరాలను సేకరించి సంరక్షించి సమన్వయం చేసుకొని, పుట్టెడు బాధ్యతల మధ్య ఊరుకు పోయికూడా ఇంత శ్రమకోర్చి యీ ఉద్గ్రంథాన్ని రచించడం కామ్రేడ్ సుందరయ్యగారికే చెల్లు. మరొకరికి అలివైన పనిగాదు. ఆనాడు ప్రారంభమైన తెలుగుజాతి ఉజ్వల ఘట్టానికి నాందిగా, కామ్రేడ్ సుందరయ్యగారు 1946 లో "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అన్న పుస్తకం వ్రాసి ఆశాజ్యోతిని వెలిగించారు. కాంగ్రెసు పాలనలో [illegible] అది మరుగున బడగా, యీనాడు దేశాన్ని, ముఖ్యంగా తెలుగుజాతిని భుజంతట్టి మేల్కొలప డానికా అన్నట్లు ఆ పోరాట పాఠాలను నేటి తరాలవారికి సుందరయ్యగారు యీ పుస్తకం ద్వారా అందించారు.

ఇంతకూ జగత్ ప్రసిద్ధిగాంచిన తెలంగాణా సాయుధ పోరాటాన్నిగాని, జగమెరిగిన సుందరయ్యగారిని గాని మేమిక్కడ పరిచయం చేయడానికి సంకల్పించలేదు. లాంఛనప్రాయంగా ప్రచురణకర్తల బాధ్యత నెరవేర్చేందుకే యీ ముక్కలు వ్రాస్తున్నాం.

సుందరయ్యగారు యీ గ్రంథాన్ని ఇంగ్లీషులో రాశారు. "తెలంగాణా పీపుల్స్ స్ట్రగుల్ అండ్ ఇట్సు లెసన్సు" అని దానికి నామకరణం చేశారు. ఈ శీర్షికను చనువుతీసుకొని మేము మార్చాం.

తెలంగాణా ప్రజాపోరాటం అంటే [illegible] సంవత్సరంలో వేరొక పోరాటంగా అర్థంచేసుకునే ప్రమాదంవున్నది. తెలంగాణా సాయుధపోరాటం అన్న పేరిట తెలుగులో ఇంతకుముందే కొన్ని పుస్తకాలు అచ్చయ్యాయి. ఆ గందరగోళానికి తావులేకుండా "వీర తెలంగాణా విప్లవపోరాటం – గుణపాఠాలు" అని యీ గ్రంథానికి తెలుగులో నామకరణం చేశాం.

మనకున్న పరిమితుల్లోనూ, వ్యవధి[illegible] తయారుచేసి అచ్చువేయించడం కష్టసాధ్యం అనిపించి[illegible]

కేంద్రకమిటీ కార్యాలయంవారి తోడ్పాటుతో ఇంగ్లీషులోవున్న మేప్‌లనే తెలుగుపుస్తకానికి జతపరుస్తున్నాం.

ఇది అనువాదం అని ముందే చెప్పాం కేంద్రీకరించి అనతి కాలంలోనే యీ ఉద్గ్రంథంలో ఎక్కువభాగాన్ని కామ్రేడ్ వాసిరెడ్డి సత్యనారాయణ, కొన్ని భాగాలను కామ్రేడ్ బొమ్మారెడ్డి వెంకటేశ్వర రావు, డాక్టర్ ఎ. పి. విఠల్‌గారలు అనువదించి ఇచ్చారు. శ్రీ హరీంద్ర నాథచటోపాధ్యాయ విరచిత తెలంగాణా విప్లవగాథల గేయాన్ని అడిగినదే తడవుగా అంగీకరించి, శ్రీ ఆరుద్ర, అత్యుత్సాహం గొలువు నట్లు అనువదించి యిచ్చారు

ఒకవైపు రొటీన్‌గా పత్రికా ప్రచురణ కార్యక్రమాన్ని కొన సాగిస్తూనే, మరోవైపు యీ అమూల్యమైన గ్రంథాన్ని తెలుగు చదు వరులకు సాధ్యమైనంత త్వరలో అందించాలన్న ఆకాంక్షతో ప్రెస్ కార్మికులు, మేనేజర్లు,సంపాదకులు, ముఖ్యంగా కామ్రేడ్ బొమ్మారెడ్డి అహోరాత్రుళ్లూ కృషిచేశారు.

వారందరికీ హృదయపూర్వకంగా మాకృతజ్ఞతతెలుపుతున్నాం.

తెలుగుజాతి పురోగమనంలో, విముక్తికొరకు పీడిత ప్రజలు చేస్తున్న మహాప్రస్థానంలో తమ అశువులర్పించి ఈ నుట్టాన్ని నిర్మించిన వీరయోధులకు, త్యాగులకు యీ సందర్భంగా మరొకసారి విప్లవాంజలి ఘటిస్తున్నాం. వారు నిర్మించిన చరిత్రను తెలుగుజాతికి కానుకగా సమర్పిస్తున్నాం.

విజయవాడ,
25–4–73

— ప్రచురణకర్తలు.

# ముందుమాట

1. ఇరవైఏళ్లపాటు ఆలస్యంజరిగినతరువాతఎట్టకేలకు "వీరతెలంగాణా ప్రజా పోరాటం – దాని గుణపాఠాలు" అన్న ఈ గ్రంధాన్ని పాఠకుల చేతుల్లో వుంచగలుగుతున్నాం. ఈ ఉద్యమం అనుభవం రీత్యా వెల్లడైన అత్యంత ముఖ్యమైన రాజకీయ గుణపాఠాలను ముందుకు తీసుకొని రావాలనే ఉద్దేశ్యంతో ఈ పోరాటంఅభివృద్ధికి సంబంధించిన సమగ్రమైన కథను, అందుకు సంబంధించి మావద్ధ గల వివరాలను పాఠకులకు అందజేయడమే మా యీ కృషికి లక్ష్యంగా పెట్టుకొన్నాం.

2 ప్రజలు, గెరిల్లాలు, పార్టీ కేడరు నిర్వహించిన కార్యాచరణకు సంబంధించిన ఇంకా అనేక యితర వివరాలకు ఈ గ్రంథంలో స్థానం లభ్యం కాలేదన్న విషయం మాకు తెలుసు. ఆ వివరాలు మావద్ద లేకపోవడమే అందుకు కారణం. అలాగే ఆ మహా పోరా టంలో పాల్గొన్న వారంతా తమ అనుభవాలను గురించిగానీ, ఆ దశలోగాని, ఆ తరువాతగాని తమకు తెలిసిన ప్రజల అభిప్రాయా లను, వాటిని గురించి తమ భావాలను గురించిగాని రికార్డు పూర్వకంగారాసి వుంచకపోవడం మరొకలోపం.

3. ఆ వివరాలన్నీ లభ్యమైనప్పుడు వాటన్నింటినీజేర్చి, తెలంగాణా ప్రజా పోరాటానికి సంబంధించిన మరింత సమగ్రమైన చరిత్రను తీసుకొని రావడంలో కష్టమేమీవుండదు. ఇప్పుడీ కథనంలో చిన్న చిన్న వివరాలకు సంబంధించి ఏవైనా పొరపాట్లు వుండవచ్చు. ఆ పోరాటంలో పాల్గొన్నవారుగాని, పాఠకులుగాని వాటిని ఎత్తి చూపితే వాటినికూడా సవరించవచ్చు.

4. సాధారణంగా పోరాటంలోపాల్గొన్నవారిలో అనేకమంది ముఖ్యంగా ఇప్పటికీ జీవించివున్న వారి కార్యకలాపాలను గురించిగాని, వారి మంచి చెడ్డలను గురించిగాని, అందులోగల చిక్కులరీత్యా వివరించ దలచలేదు. అయినా రాజకీయ సూత్రీకరణలను నిర్దిష్టంగా చెప్ప వలసిన సందర్భంలో స్థూలంగా పేర్కొనక తప్పలేదు. అలాగే పోరాటకాలంలో కొందరు నిర్వహించిన పాత్రను పేర్కొనడం అనివార్యమైంది. వారిలో ఎవరెవరు ఇప్పుడు ఏమిచేస్తున్నారనే దాంతో నిమిత్తంలేదు. [చివరి రెండు వాక్యాలు రచయిత తెలుగు ప్రతిలో చేర్చారు-సం]

5. ఈ ఉద్యమం యిచ్చిన అమూల్యమైన అనుభవాలనూ, ఉద్యమ సందర్భంగా జరిగిన వీరోచిత కార్యాచరణను ఇంకా వివరంగానూ, సమగ్రంగానూ ఈ గ్రంధంలో తీసుకొనిరాలేదని మా సహచరులలో కొందరు నా దృష్టికి తీసుకొని వచ్చారు. ఆ లోపం ఈ గ్రంధంలో గలదనే విషయం నా మనస్సులో హెచ్చుగానే వుంది. అయితే, ఇంతకాలం జరిగిన తరువాతనైనా, ఆ పోరాటంలో పాల్గొన్నవారు తమ అనుభవాలను గురించి రాయడమో లేదా జ్ఞప్తికి తేవడమో జరిగినప్పుడే ఆ లోపాన్ని పూరించడం సాధ్యపడుతుంది.

6. మరీ చిన్న చిన్న వివరాలుకూడా ఇచ్చారనీ, అక్కడక్కడ చెప్పిన దానినే చెప్పడం జరిగిందని, కొన్ని విషయాలు అతిశయోక్తి గానూ, అవాస్తవికంగానూ వున్నట్లు కనబడుతున్నాయని కూడా విమర్శవుంది. సరిగ్గా ఎంతమంది చనిపోయింది, ఎంతమందిగాయ పడిందీ, వివిధ సంఘర్షణల్లో పాల్గొన్నవారి సంఖ్యలూ-వీటన్నింటినీ ఇంతకాలం జరిగినతరువాత సరిచూడటంసాధ్యంకాదు. ముఖ్యంగా, ప్రభుత్వరికార్డులు మనకు లభ్యంకాని పరిస్థితుల్లోను, సత్యాన్ని దాచి వేయడానికి ప్రభుత్వ అధికారులు ప్రయత్నించుతున్న స్థితిలోనూ ఇది మరీ కష్టసాధ్యమైన పని. ఆనాడు పోరాటంలో పాల్గొన్నవారు చెప్పిన కథనాన్నిగానీ, లేదా ఆనాడు జరిగిన ఘటనలను గురించి క్రింది యూనిట్లనుండి పై యూనిట్లకు వచ్చిన [illegible]లనుగాని

మేము ఎడిట్ చేయడానికి ప్రయత్నించలేదు. ఇంతకాలం జరిగిన తరువాత సంగతిని అలా వుంచండి. ఆ ఘటనలు జరిగిన సమయంలో సహితం ఖచ్చితమైన వివరాలను సరిగ్గా తెలుసుకోవడం కష్టంగా వుండేది. అందువలన ఇంకా లోతుకు వెళ్ళకుండా అప్పటి వారు అందజేసిన కథనానికి, ఫైళ్ళలో రికార్డు పూర్వకంగా వున్న రిపోర్టులకు మేము కట్టుబడి వుండవలసి వచ్చింది. అన్ని వివరాలను ఇవ్వడం మానివేసినా, లేదా 'పునరుక్తులు' లేకుండా చేసినా, ఆనాడు పోరాటంలో పాల్గొన్నవారి అభిప్రాయలను, మనోభావాలను, అలాగే ఆనాడు ప్రజలు ఎలా భావించారో, వేటిని విశ్వసించారో మొదలుగాగల విషయాలను తెలపకుండా వుంటే మరీస్థూలంగా మాత్రమే చరిత్రను రాసినట్లవుతుందని మేము భావించుతున్నాం.

7. అమరవీరుల సంగ్రహ చరిత్రను ఇచ్చిన సందర్భంలో రికార్డులలో లభ్యమైన విషయాలను, కామ్రేడ్స్ వారిని గురించి చెప్పిన విషయాలను మాత్రమే ఆధారం చేసుకోగలిగాం. ఇంకా అనేక ముఖ్యమైన పార్టీ కార్యకర్తల, దళ సభ్యుల వీర కృత్యాలనుగురించి, కార్యకలాపాలను గురించి ఈ గ్రంథంలో ఇవ్వలేకపోయాం. అలాంటి అమరవీరులకు సంబంధించిన తమ జ్ఞాపకాలను అప్పటి పోరాటంలో పాల్గొన్నవారు రాయడం అవసరం. అప్పుడే వారి ఆదర్శంతో భావితరాల వారిని ఉత్తేజపరచగలుగుతాం.

8. అలాగే 1946-51 మధ్య పోలీసు, మిలటరీ, భూస్వాముల బీభత్స చర్యల ఫలితంగా సుమారు 4000 మంది చంపివేయబడ్డారని అంచనా వేయబడింది. వీరుగాక వేలాది కోయ ప్రజలు కాన్సెంట్రేషన్ క్యాంపుల్లో జబ్బులతో చనిపోయారు. అలా మొత్తం మీద చనిపోయినవారు.దాదాపు ఆరువేలమంది వుండగలరని పరిశీలకులు కొంతమంది భావించుతున్నారు. వారందరి పేర్లు మన వద్ద లేవు. కనీసం వారిని ఎక్కడ పట్టుకుని చంపివేసిందీ ఆ గ్రామాల పేర్లు సహితం మనకు తెలియదు. ఇప్పటికైనా కామ్రేడ్స్,

ప్రజలూ, పోరాట సందర్భంలో చంపివేయబడిన వారి పేర్లన్నూ, గ్రామాల వారీగా ఎంతెంత మందిని చంపివేసింది వివరాలు సేకరించగలరని ఆశించుతున్నాం. మావద్ద లభ్యమైన పేర్లను మాత్రమే ఈ గ్రంథంలో ఇవ్వగలుగుతున్నాం.

9. అనేక సూచనలను చేయడం ద్వారా ఈ గ్రంథాన్ని మెరుగుపరచడానికి కామ్రేడ్ మాకినేని బసవపున్నయ్యా నాకు సహాయపడ్డారు.

10. ఈ సందర్భంగా మాపార్టీ కేంద్రకమిటీకి చెందిన స్టెనోటైపిస్టు కామ్రేడ్ ఉన్ని కృష్ణన్ గురించి నేను ప్రత్యేకంగా పేర్కొనవలసి వుంది. ఆయన ఎంతో వోపికతో నేను రాసినదాన్ని టైపు చేయడం, తిరిగి అనేకసార్లు టైపు చేయడం జరిగింది. ఆయన అలా సహాయపడివుండకపోతే నేనీ పుస్తకాన్ని పూర్తి చేయగలిగి వుండేవాడిని కాదు. అలాగే మా పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు కామ్రేడ్ రామదాస్ నా వ్రాతప్రతిని అనేకసార్లు చూచి, దాన్ని అచ్చుకి యివ్వడానికి సిద్ధం చేశారు. అలాగే ప్రూఫ్ లన్నింటినీ చూసే బాధ్యతను ఆయనే తీసుకొని ఈ పుస్తకాన్ని బయటకు తీసుకొని రావడానికి తోడ్పడ్డారు.

— సుందరయ్య.

# ఉపోద్ఘాతం

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం 1951 అక్టోబరు 21 వ తేదీన ఉపసంహరించుకోబడింది. ఆ ఉపసంహరణ జరిగి ఇప్పటి కప్పుడే యిరవై సంవత్సరాలుపైగా గడిచిపోయాయి అయినప్పటికీ, నైజాం పరిపాలనక్రిందనున్న ఆ ఫ్యూడల్ హైదరాబాదు సంస్థానంలో రైతాంగం పోరాటం ప్రజల సాయుధ తిరుగుబాటుగా ఎలా పెంపొందింది, 1948 సెప్టెంబరు 13 వ తేదీన భారత సైన్యం ప్రవేశించగా, నెహ్రూ ప్రభుత్వపు సాయుధ బలగాల అండదండలతో భూస్వాములు తిరిగి హస్తగతం చేసుకోకుండా గతంలో తాము పోరాడి సంపాదించుకున్న భూములను కాపాడుకొనటం కోసం సామాన్య రైతాంగం మూడు సంవత్సరాలపాటు వీరోచితమైన సాయుధ ప్రతిఘటన ఎలా సాగించిందీ క్లుప్తంగానైనా వివరించే సాధికార కథనమేదీ ఇంతవరకూ వెలువడలేదు. ఈ మహోద్యమానికి ఆ గర్భశత్రువులు, శత్రుత్వంతో గూడిన విమర్శకులు మాత్రం ఈ పోరాటాన్ని కమ్యూనిస్టు "హింసాకాండ, బందిపోటుతనం, అరాచకత్వం"గా తెగనాడుతూ టన్నుల కొలది పుస్తకాలను తయారుచేయించి ప్రచారంలో పెట్టారు.

ఆ పోరాటాన్ని – ప్రత్యేకించి 1948–51 సంవత్సరాల మధ్య కాలంలో సాగిన సాయుధ ప్రతిఘటనాదశను, ఒంటెత్తు పోకడగా, పిడివాదంగా, ప్రధానంగా వ్యక్తిగత దౌర్జన్యకాండగా చిత్రించటంలో మితవాద కమ్యూనిస్టులు నిమగ్నమైనారు 1951 అక్టోబరులో ఉపసంహరించటంద్వారా, తెలంగాణా పోరాటపు నాయకత్వం, ఆ పోరాటానికి ద్రోహంచేసిందని నక్సలైట్ నాయకులు గుసగుసల ప్రచారం సాగిస్తున్నారు

ఈ వీరోచిత రైతాంగ తిరుగుబాటు మొత్తంమీద సాధించిన లాభనష్టాలను బేరీజువేసి క్లుప్తంగా చెప్పుకొందాం. ఈ పోరాటంలో వీర తెలంగాణా రైతాంగమూ, ఈ రైతాంగ ప్రజల తిరుగుబాటుకు

నాయకత్వం వహించే బాధ్యతను స్వీకరించిన కమ్యూనిస్టుపార్టీ విశాలాంధ్ర రాష్ట్ర శాఖ అనుపమ త్యాగాలు చేసాయి. నాలుగువేల మంది కమ్యూనిస్టులు, రైతుయోధులు చంపివేయబడ్డారు. పదివేల మందికిపైగా కమ్యూనిస్టు కార్యకర్తలు, ప్రజాపోరాట యోధులు కూడా నాలుగు సంవత్సరాలకాలం నిర్బంధ శిబిరాలలో, జైళ్లలో బంధించబడ్డారు. కనీసం, యాభైవేలకు తగ్గకుండా ప్రజలను పోలీసు క్యాంపులలోకి, మిలటరీ క్యాంపులలోకి ఈడ్చుకెళ్ళి వారాల తరబడి, నెలల తరబడిని చిత్రహింసలపాలు చేయడం, దెబ్బలు కొట్టడం, బీభత్సపరచటం జరిగింది. వేలాది గ్రామాలకు చెందిన అనేక లక్షల మంది ప్రజలపై పోలీసు దాడులు, మిలిటరీ దాడులు జరిగాయి. దారుణ మైన లాఠీదెబ్బలకు ప్రజలు గురిఅయ్యారు. ఈ మిలటరీ, పోలీసు దాడుల సమయంలో ప్రజలు లక్షల రూపాయల విలువచేసే ఆస్తులను కోల్పోయారు. ఆ ఆస్తులు లూటీచేయబడటమో, ధ్వంసంచేయ బడటమో జరిగింది. వేలాది మహిళలు మానభంగాలకు, నానావిధాల అవమానాలకు, అత్యాచారాలకు గురయ్యారు. సంక్షిప్తమాటలో చెప్పా లంటే; మొట్టమొదట్లో నైజాము, అతని రజాకార్ల సాయుధమూకలూ, ఆ తర్వాత కేంద్ర ప్రభుత్వానికి, హైదరాబాదు సంస్థానానికి చెందిన సాయుధ బలగాలూ ఐదుసంవత్సరాలకాలం ఈ ప్రాంతం మొత్తంపై పాశవికమైన పోలీసు, మిలటరీ [illegible]పాలనను సాగించాయి. పోలీసు చర్య అనంతరం వివిధ రకాలకు చెందిన పదిహేనువేలమంది సాయుధ బలగాలను దించారు. హింసాకాండద్వారా ఈ ఉద్యమాన్ని అణచి వేయటానికి, చెదిరిపోయిన భూస్వామ్య పాలనను పునరుద్ధరించటానికి ఆ సాయుధ బలగాల నుపయోగించారు. [illegible] ప్రభుత్వం 1947–48 సంవత్సరాలలో [illegible] టానికి ఎంతడబ్బు ఖర్చుచేసిందో, అంతడబ్బును, వనరులను ఆనాడు హైదరాబాదులో ఉపయోగించిందని కొన్ని అధికార అంచనాల వల్ల తేలింది.

అయితే అంతటితోనే ఈ చిత్రీకరణ సమగ్రం కాజాలదు. మరోవైపు రైతాంగ తిరుగుబాటు సాధించిన అసామాన్యమైన విజయా లను చిత్రీకరించినప్పుడే ఆ గాథ పూర్తికాగలదు. ఈ పోరాట కాలంలో ఎక్కువగా నల్గొండ, వరంగల్, ఖమ్మం జిల్లాలకు చెందిన పదహారువేల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల ప్రదేశంలో సుమారు ముప్పై లక్షల జనాభాగలిగిన దాదాపు మూడువేల గ్రామాలలో రైతాంగం

పోరాటం సాగించింది. ఆ పోరాటాల ఫలితంగా ఆ ప్రాంతంలో పంచాయితీల ప్రాతిపదికగా గ్రామరాజ్యాలను నెలకొల్పుకో గలిగారు. తాము ద్వేషించే భూస్వాములను ఈ గ్రామాలనుండి, గడీలని పిలవబడే కోటలవంటి వారి గృహాలనుండి ప్రజలు తరిమివేశారు. వారి పొలాలను రైతాంగం స్వాధీన పరచుకుంది గ్రామీణ ప్రాంతాలలో నైజాం నిరంకుశపాలనకు మూలస్తంభాలుగా వున్నది ఆ భూస్వాములే. ప్రజా కమిటీల ఆధ్వర్యాన పదిలక్షల ఎకరాల భూమి రైతాంగానికి పంపిణీ చేయబడింది. బేదఖళ్ళన్నీ నిలుపుచేయబడ్డాయి వెట్టిచాకిరీ రద్దుచేయబడింది. వడ్డీవ్యాపారంలో సాగుతున్న కొల్లగొట్టే అత్యధిక వడ్డీరేట్లను తీవ్రంగా తగ్గించివేయటమో, మొత్తంగా రద్దుచేయడమో జరిగింది. వ్యవసాయ కార్మికుల రోజుకూలీ పెంచబడింది. కనీసవేతనం అమలు జరపబడింది పీడించే ఫారెస్టు అధికార బృందసంతటినీ ఆ ప్రాంతంలోని అడవులనుండి వెళ్ళగొట్టడం జరిగింది. దీనితో ఆటవికతెగల ప్రజలు, ఈ ఫారెస్టు ప్రాంతానికి అనుకొని నివసిస్తున్న ప్రజలూ తమ శ్రమ ఫలితాన్ని స్వేచ్ఛగా అనుభవించగలిగారు. 12 నుండి 18 మాసాలకాలం ఈ ప్రాంతాలలోని పరిపాలన నంతటినీ గ్రామరైతు కమిటీలే నిర్వహించాయి. నైజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా ఈ పోరాటం సాగించేక్రమంలో రజాకార్ల, నైజాం పోలీసుల సాయుధదాడుల బారినుండి రైతాంగానికి రక్షణ కల్పించటంకోసం, ప్రజలు పదివేల మంది గ్రామదళసభ్యులు దాదాపు రెండువేల గెరిల్లాదళ సభ్యులతో కూడిన శక్తివంతమైన సాయుధ బలగాన్ని నిర్మించుకోగలిగారు. లక్షలాది ప్రజలు తమ జీవితంలో మొట్టమొదటిసారిగా రోజూ రెండుపూటలా భోజనం చేయగలిగారు. ఒక్కమాటలో చెప్పాలంటే, చరిత్రాత్మకమైన ఈ రైతాంగ తిరుగుబాటు అసఫ్ జాహీ వంశపు మధ్యయుగాలనాటి నిరంకుశపాలనను మొదలంటా కుదిపివేసింది, ఆ పాలనపై చావుదెబ్బ గొట్టింది.

వ్యావసాయిక విప్లవ సమస్యను ముందుకు తీసుకొనివచ్చి, అవెంతటి లోపభూయిష్టమైనవైనా, అరకొరచర్యలయినా, వివిధ వ్యావసాయిక సంస్కరణలను ఇష్టంలేని కాంగ్రెసు నాయకులు చేపట్టటం తప్పనిసరి అయ్యేట్లు చేసిన ఖ్యాతి ఈ వీరోచిత రైతాంగ ప్రతిఘటనోద్యమానిదే. రైతాంగాన్ని శాంతింపచేసే కార్యక్రమం పేరుతో, కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం చేయటానికి కాంగ్రెస్

నాయకులచే అక్కడకు పంపబడిన సర్వోదయ నాయకుడు శ్రీ వినోబా భావే ఈ పోరాటం జరుగుతున్న సమయంలోనే భూదానసంఘ పూర్వక జనిత వుద్యమాన్ని ప్రారంభించాడు. బూర్జువా – భూస్వామ్య పాలకుల తియ్యని కబుర్లతో, ఆడంబరమైన వాగ్దానాలతో భూసమస్య ఎన్నటికీ పరిష్కారం కాదని, శక్తివంతమైన సంఘటిత సమరశీల ప్రజాపోరాటం మాత్రమే భూసమస్యను పరిష్కరించగలుగనే సత్యాన్ని ప్రజలు గ్రహించగలిగింది ఈ సుదీర్ఘమైన ఈ సాయుధ పోరాటం సాగుతున్న రోజులలోనే.

భాషా ప్రయుక్తంగా మన దేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ త్వరగా జరగడానికీ, చిన్నాభిన్నమై చెల్లాచెదురుగావున్న అనేక జాతులు తమ చిరకాల వాంఛితమైన ప్రత్యేక రాష్ట్రాలను సాధించుకొనటానికీ తెలంగాణా పోరాటం దోహదపడింది. దీని పాత్ర తక్కువేమీకాదనే విషయాన్ని కూడా మనం గుర్తుంచుకోవాలి దేశంలోకల్లా అతి పెద్దదైన హైదరాబాదు సంస్థానంలో నవాబు పాలనపై ఈ పోరాటం కొట్టిన శక్తివంతమైన దెబ్బతో 1952 లో పొట్టిశ్రీరాములు ఆత్మార్పణ అనంతరం ఆంధ్రరాష్ట్ర సాధనకోసం పోరాడేందుకు ఉత్తేజాన్ని కలిగించాయి. ఆ తర్వాత 1956 లో భారత దేశమంతటా భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమే మార్గాన్ని సుగమంచేసింది. పూర్వపు బ్రిటిష్ పాలకులు సామ్రాజ్య హితంగా, నిరంకుశంగా భారత దేశంలో ఏర్పరచిన పరిపాలనా రాష్ట్రాల, జాతుల విభజనను అంతం చేసేట్లుగా కాంగ్రెసు నాయకత్వాన్ని మెడలు వంచిందికూడా ఈ తెలంగాణా పోరాట ప్రభావమే. భారత దేశపు రాజకీయ పటాన్ని జాతీయ, ప్రజాతంత్ర, భాషా ప్రాతిపదికపై తిరగరాయడానికి ఆ విధంగా వీర తెలంగాణా రైతాంగపోరాటం అసమానమైనపాత్రను నిర్వహించింది.

ఈ చరిత్రాత్మకమైన తెలంగాణా పోరాటానికి నాయకత్వం వహించి, అతి దారుణ నిర్బంధకాండకు గురై అగణిత త్యాగాలతో గర్వకారణమైన పాత్ర వహించింది కమ్యూనిస్టుపార్టీ. కేరళలో వాయలార్ – పున్నప్రా పోరాటానికి నాయకత్వం వహించింది, యుద్ధానంతరం బెంగాల్‌లో సాగిన కార్మికవర్గ పోరాటాలకు, రైతాంగ పోరాటాలకు నాయకత్వం వహించింది కమ్యూనిస్టుపార్టీయే. ఈ కారణంగానే, కమ్యూనిస్టుపార్టీ జాతీయ రాజకీయ రంగంలో విస్తృతంగా గుర్తించబడింది. ఎవ్వరూ నిర్లక్ష్యం చేయడానికి వీలు

లెనంత పటిష్ఠమైన రాజకీయ శక్తిగా పార్టీ రూపొందింది. భారత దేశంలోని కోటానుకోట్లు భవితవ్యాన్ని తీర్చిదిద్దటంలో అప్పటివరకు సమరశీల కార్మికవర్గ ధోరణులకు జెందిన స్వల్పశక్తిగా వుంటూ వచ్చిన కమ్యూనిస్టుపార్టీ 1952 సార్వత్రిక ఎన్నికల అనంతరం, మొట్టమొదటి పార్లమెంటులో అన్నింటికంటే పెద్దదైన ప్రతిపక్ష గ్రూపుగా రూపొందే ప్రతిష్ఠనూ, గౌరవాన్నీ సాధించుకోగలిగింది.

చివరకు, తెలంగాణా రైతాంగ తిరుగుబాటు భారతదేశంలోని కమ్యూనిస్టు ఉద్యమానికి అత్యంత ప్రాధాన్యతగల ఒక బ్రహ్మాండమైన మేలు చేసింది. అదేమంటే, భారతదేశ ప్రజాతంత్ర విప్లవానికి సంబంధించిన వ్యూహం, ఎత్తుగడలకుసంబంధించిన మౌలికసూత్రాలు, సిద్ధాంత సమస్యలను దాదాపు – అన్నింటిని ఈ పోరాటం ముందుకు తెచ్చింది. వాటికి సవ్యమైన, శాస్త్రీయమైన సమాధానాలను వాస్తవికతతోగూడిన, ఆచరణాత్మకమైన పరిష్కారాలను వెదకవలసిన అవసరం ఏర్పడింది. జనతా ప్రజాస్వామ్య విప్లవంలో రైతాంగం పాత్ర, సాయుధ ప్రతిఘటనకు, గ్రామీణ విప్లవ స్థావరాలకుగల స్థానం, ప్రాధాన్యత, రైతాంగాన్ని ఖచ్చితంగా వర్గీకరించడం; రైతాంగంలోని వివిధ తరగతులు విప్లవంలో నిర్వహించే పాత్ర, భారతదేశ విప్లవ లక్ష్యం, మన విప్లవంలో కార్మికవర్గానికి, పట్టణ కేంద్రాలకుగల నిర్దిష్టమైన స్థానం, పాత్ర, కార్మికవర్గ నాయకత్వం అన్న భావానికిగల ఖచ్చితమైన అర్థం, దానికిగల ప్రభావం, ఆధునిక కార్మికవర్గం జనాభాలో నూరింటు ఒకటికి మించని, అభివృద్ధిజెందని, వెనుకబడిన దేశంలో ఆ నాయకత్వాన్ని సాధించటంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించవలసిన పాత్ర – మొదలైన సమస్యలన్నీ ముందుకు వచ్చాయి. పార్టీలో అంతర్గతంగా చర్చలు జరిపి, వానిపై నిర్ణయాలు తీసుకోవలసిన అవశ్యకత ఏర్పడింది. చారిత్రిక పరిణామము, జీవితమూ, అనుభవమూ ఫలితంగా దీర్ఘకాలంపాటు జరిగిన పార్టీ అంతరంగిక పోరాటం అనంతరం, ఈ సమస్యలలో చాలా వాటికి సంతృప్తికరమైన సమాధానాలు లభ్యమయ్యాయి చాలావరకు సవ్యమైన రాజకీయ పంథాను రూపొందించుకొనటానికి పార్టీకి అస్కారం కలిగింది

పోరాటం సాగుతున్న కాలంలో, ప్రత్యేకించి ఆ పోరాటం లోని చివరి రెండు సంవత్సరాల కాలంలో, కమ్యూనిస్టుపార్టీ పై నుండి క్రిందివరకు రెండు ప్రత్యర్థి శిబిరాలుగా చీలిపోయిన

విషయంకూడా ఇక్కడ ప్రస్తావించవలసిన అవసరం వుంది. ఒక శిబిరం, పోరాటాన్ని, దాని విజయాలను సమర్థించేదిగాను, రెండోది ఆ పోరాటాన్ని బీభత్సకాండ అని, ఇంకేమిటో అని తెగనాడేదిగానూ చీలిపోయింది. ఈ పోరాటాన్ని వ్యతిరేకించినవారు బహిరంగంగా పత్రికల కెక్కారుకూడా. ఆ పోరాటంపైన దానికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టుపార్టీపైన బురదజల్లటానికి ఆస్కారం కల్పించారు. నిశితమైన ఈ రాజకీయ, సిద్ధాంత సంబంధమైన చీలిక దేశంలో మొత్తం పార్టీలో ప్రబలింది. అయితే, ఈ వీరోచితమైన పోరాటంలో ప్రత్యక్షంగా నిమగ్నమైవున్న విశాలాంధ్ర కమిటీలో ఈ చీలిక ప్రత్యేకించి మరింత నిశితంగాను, తీవ్రతరంగానూ ఏర్పడింది. 1951 అక్టోబరులో తెలంగాణా సాయుధ ప్రతిఘటనను ఉపసంహరించిన అనంతరం, పార్టీలో సాధించబడినది కేవలం లాంఛనప్రాయమైన, తాత్కాలికమైన పైపై ఐక్యత మాత్రమేననీ, ఆ చీలిక నిజానికి నిర్దిష్టమైన రెండు ప్రత్యర్థ రాజకీయ ధోరణులమధ్య గండిగా పెరిగిపోయిందనీ, ఆ తర్వాత చరిత్ర రుజువు చేసింది. 1962-63 లో పార్టీలో ఏర్పడిన చీలికసందర్భంగా, విశాలాంధ్ర రాష్ట్ర కమిటీ విభజన, 1950-51 పార్టీ అంతర్గత పోరాటంనాటి విభజన స్వరూప, స్వభావాలనే దాదాపుగా కలిగివుండటం యాదృచ్ఛికమేమీకాదు; ఇది ప్రత్యేకించి గమనించవలసిన విషయం. తమ విశ్వాసాలను, రాజకీయ అభిప్రాయాలను మార్చుకున్న బహుకొద్దిమంది కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు మినహా ఏదో ఒకసందర్భంలో తెలంగాణా పోరాటానికి వ్యతిరేకంగా నిలిచిన వారంతా సంస్కరణవాద, రివిజనిస్టు మితవాద కమ్యూనిస్టుపార్టీలోనే చేరిపోవటానికే నిర్ణయించుకున్నారు. ఆ పోరాటాన్ని తుదకంటూ బలపరచినవారిలో అత్యధిక సంఖ్యాకులు భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) వెనుక దృఢంగా నిలిచారు. తెలంగాణా పోరాటాన్ని, వీరోచితమైన ఈ రైతాంగ ప్రతిఘటనోద్యమాన్ని నడిపే సమస్యచుట్టూ పార్టీలో అంతర్గతంగా తలెత్తిన పలు విభేదాలను దృష్టిలోకి తీసుకోకుండా నిర్లక్ష్యంచేస్తే, భారత కమ్యూనిస్టు ఉద్యమాన్నిగూర్చి అధ్యయనంచేసే వారెవరయినా, 1962-1963 లో చీలిక అనివార్యం అవటానికి దారితీసిన మూలకారణాన్ని గ్రహించజాలరు.

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైనప్పటినుండీ, ఆ ఉద్యమాభివృద్ధితో సన్నిహితంగా

సంబంధం కలిగివుండే అవకాశం నాకు కలిగింది అలాగే తెలంగాణా పోరాటంలోని వివిధదశలలో నాకు సన్నిహితసంబంధంవుంది. అంతే కాదు, తెలంగాణా విజయాలన్నింటినీ పూర్తిగా హరించివేయటానికై సాయుధపోరాటం ఉపసంహరణ అనంతరం గత రెండుదశాబ్దాలుగా కాంగ్రెసు భూస్వాములు ప్రయోగిస్తున్న క్రూరనిర్బంధాన్ని, అత్యాచారాలను ఎదుర్కొని సాగిస్తున్న పోరాటంతోనూ నాకు సన్నిహిత సంబంధంవుంది.

ఆ మహత్తర పోరాటంయొక్క అమూల్యమైన, వివిధ విప్లవానుభవాలను, గుణపాఠాలనుగూర్చి కనీసం క్లుప్తంగానైనా వ్రాయటం నా ప్రాథమిక బాధ్యతగా పరిగణిస్తున్నాను. గత రెండు దశాబ్దాలకాలంలో ఈ బాధ్యతను నిర్వర్తించలేకపోయాను ఆనాడు తెలంగాణా పోరాటంలో వివిధ ప్రాంతాల ఆర్గనైజర్లుగా పనిచేసిన వారినుండి అందిన నివేదికల్లోని వాస్తవిక సమాచారం ప్రాతిపదికగా ఆనాడు, ఈనాడు కూడా అచ్చటి ఉద్యమంలో నిమగ్నమైయున్న అనేకమంది ప్రముఖ కామ్రేడ్స్ వ్యక్తిగత అనుభవాల ప్రాతిపదికగా తెలంగాణాపోరాటచరిత్రను వివరించటానికి ఇక్కడప్రయత్నించాను. తెలంగాణా పోరాటం నుండి మనం నేర్చుకోవలసినవిగా నేను భావిస్తున్న అనుభవాలను, గుణపాఠాలను కొన్నింటిని ఈ రచన ద్వారా అందజేస్తున్నాను.

## అధ్యాయం 1

# హైదరాబాదు సంస్థానం:
# దాని సాంఘిక - రాజకీయ పూర్వరంగం

చిట్టచివరి మొగలాయి చక్రవర్తి మరణానంతరం నైజామ్ హైదరాబాదు సంస్థానాన్ని ఏర్పాటు చేశాడు. మహారాష్ట్ర ప్రాంతానికి చెందిన బేరార్, ఆంధ్రకు చెందిన కోస్తా, రాయలసీమ జిల్లాలను బ్రిటిషు వాళ్లకు నైజాం నవాబు ధారాదత్తం చేసిన తర్వాత, ఆ సంస్థానం దాదాపు 83,000 చదరపుమైళ్ళ విస్తీర్ణంగల ప్రధానమైన ఒక సామంత రాజ్యంగా ఏర్పడింది.

### బహుభాషలుగల రాజ్యం

హైదరాబాదు సంస్థానం మూడు భాషా ప్రాంతాలతోకూడి వుండేది. సంస్థానపు రాజధాని హైదరాబాదు నగరంతోసహా తెలుగుభాష మాట్లాడే తొమ్మిది జిల్లాలు తెలంగాణా ప్రాంతం. సంస్థానంలోని వాయువ్యభాగంలోగల మరాఠీ మాట్లాడే ఐదు జిల్లాలూ మరాఠ్వాడా ప్రాంతం. నైరుతిభాగంలో కన్నడం మాట్లాడే మూడు జిల్లాలున్నాయి.

మొత్తం సంస్థానం విస్తీర్ణంలో సగం (నూరింటి యాభై వంతులు) తెలంగాణా ప్రాంతం కాగా, మరాఠ్వాడా ప్రాంతం నూరింట 28 వంతులు, కన్నడ ప్రాంతం మిగతా 22 వంతుల విస్తీర్ణం కలిగి వున్నాయి. 1951 లెక్కల ప్రకారం తెలుగు మాట్లాడే ప్రజల సంఖ్య 90 లక్షలు. మొత్తం సంస్థాన

జనాభాలో నూరింట యాభైమంది తెలుగు మాట్లాడే వారే. మరాఠీ మాట్లాడే వారి సంఖ్య దాదాపు 45 లక్షలు (మొత్తం జనాభాలో నూరింట 25 మంది). కన్నడం మాట్లాడేవారు 20 లక్షలు (నూరింట 11 మంది). ఉర్దూ మాట్లాడే వారు 21 లక్షలు (నూరింట 12 మంది)

హైదరాబాదు నగరం మినహా సంస్థానంలోని ఏ భాగంలోనూ ఉరుదూ మాట్లాడే ప్రజలు జనాభాలో అత్యధిక సంఖ్యాకులుగా లేరు. అయినా, నైజాం ముస్లిం. అది ఆయన రాజ్యం. అందువల్ల ఉరుదూనే అన్ని స్థాయిలలోను కోర్టు భాషగా, పరిపాలనా భాషగా చేసారు. ప్రాథమిక దశ నుండి బోధనా భాషకూడా అదే. తెలుగు, కన్నడ, మరాఠీ వంటి ప్రజల మాతృభాషలలో బోధన జరిపేందుకు, పిల్లలకు ప్రాథమిక పాఠశాలలు ప్రయివేటుగా ప్రారంభించాలన్నా నైజాంనుండి, అతని పరిపాలనా నిర్వాహకులనుండి ప్రత్యేక అనుమతి పొందవలసివుండేది. ఆయా భాషలకు సంబంధించిన గ్రంథాలయాలు, సారస్వత సంఘాలు ప్రారంభించాలన్నా అధికారుల అనుమతి పొందవలసిందే. అందువల్ల నూరింట ఆరుగురు మాత్రమే అక్షరాస్యులుగా వున్నారంటే ఆశ్చర్యమేమీలేదు.

ఆ విధంగా, హైదరాబాదు సంస్థానంలో నివసిస్తుండిన అత్యధిక సంఖ్యాక ప్రజల సంస్కృతి, భాషా పాలకులచే అణచివేయబడుతూ వచ్చాయి. అందువల్ల విద్యకావాలని, సాంస్కృతికంగా అభివృద్ధి చెందాలని, తమ మాతృ భాషకు రక్షణ గావాలని సహజంగావుండే వాంఛ, నైజాం పాలనకు వ్యతిరేకంగా జరిగే పోరాటంతో సహజంగా మిళితమయిపోయింది.

## ముస్లిం పాలకులకు హిందూ పాలితులకుమధ్య వైరుధ్యం

హైదరాబాదు సంస్థానపు నైజాం బ్రిటిష సామ్రాజ్యవాదుల సామంతుడు. హైదరాబాద్ సంస్థానంలోని ప్రజానీకంలో అత్యధిక సంఖ్యాకులు హిందూమతానికీ, అందులోని వివిధ శాఖలకు చెందినవారు. అయినా నైజాం ముస్లిం గావటమనేది, పరిపాలనా యంత్రంలో ప్రతిబింబించేది. ముస్లిములు మొత్తం జనాభాలో నూరింట 12 మందిగా వున్నప్పటికీ, మొత్తం పరిపాలనా యంత్రాంగమంతటిలోను, ప్రత్యేకించి ఉన్నతస్థాయి ఉద్యోగాలలో అత్యధిక సంఖ్యాకులు—దాదాపు నూరింట 90 కి పైగా ముస్లిములే నిరంకుశాధికారులుగా వుండేవారు. ముస్లిములు పరిపాలక వర్గమనీ, వారికి సంస్థానంలోని మిగతా ప్రజలపై అధిక్యత కలదనే భావాన్ని పెంపొందించడంకోసం నిజామూ, ముల్లాలూ ప్రయత్నించేవారు. దీనికి వ్యతిరేకంగా, క్రమేణా అభివృద్ధిచెందు తున్న మధ్యతరగతి మేధావులు, పెంపొందుతున్న హిందూ వాణిజ్య, పారి

్రామిక శక్తులూ ముందుకువచ్చాయి. "ముస్లిం పీడకులకు" వ్యతిరేకంగా "హిందూజన సామాన్యానిక" సంరక్షకులుగా ఆర్యసమాజికులు రంగంలో నిలిచారు. ఈ సెక్షన్లమధ్య అనేక సంఘర్షణలు, వివాదాలు జరిగేయి.

తొలిరోజులలో, 1940 వరకూ భారత జాతీయ కాంగ్రెస్, స్వదేశీ సంస్థానాలలో "సంస్థానాధీశులకు, నవాబులకు" వ్యతిరేకంగా ప్రజా పోరాటాలు చేపట్టటానికి నిరాకరించింది నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడే మొనగాళ్ళుగా ముందు నిలవటానికి ఆర్యసమాజీకులకు ఎదురు లేకుండటానికి ఇదికూడా ఒక కారణం అందువల్ల జాగృతమవుతున్న ప్రజాతంత్ర చైతన్యాన్ని గణనీయమైన మేరకు మతతత్వ ధోరణులలోకి మరలించటానికి వారికి అవకాశం ఏర్పడింది.

సంస్థానంలోని అత్యధిక సంఖ్యాక ప్రజల మాతృభాషలను ప్రధాన భాషలను త్రోసిపుచ్చి, ఉర్దూను సర్వత్రా ప్రజలపై రుద్దడం ఆ సంస్థానంలో ముస్లిమ్ ఫ్యూడల్ పాలనలో ఒక భాగం మాత్రమే

ఆ తర్వాత, 1946-47 తెలంగాణా పోరాటకాలంలో, నైజాం, అతని ఫ్యూడల్ పరిపాలనా నిర్వాహకులు, అతని సాయుధ రజాకార్లు, హిందువుల"కు వ్యతిరేకంగా తమను బలపరచవలసిందిగా సామాన్య ముస్లిం ప్రజానీకాన్ని కూడగట్టటానికి ప్రయత్నించారు. కాని కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహిస్తున్న కారణంగా, ముస్లిం రైతాంగం, గ్రామీణ చేతివృత్తులవారు, గ్రామీణ పేదలు పెద్ద సంఖ్యలో తెలంగాణా రైతాంగయోధుల అండగా నిలిచారు. అయితే పట్టణాలలోను, నగరాలలోను గల ముస్లిమ్‌లలో అత్యధికులు నైజామును, రజాకార్లను బలపరిచారు. అయినా "పోలీసు చర్య" అనంతరం, ముస్లిమ్‌లకు వ్యతిరేకంగా, రెచ్చిపోయి ఉన్న ప్రజలు ప్రతీకార దాడులు తెలంగాణా ప్రాంతంలో జరగకుండా అరికట్టడానికి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం జయప్రదంగా కృషిచేసింది ప్రజాతంత్ర వుద్యమం తెలంగాణాలో వున్నంత బలంగాలేని మరాట్వాడా ప్రాంతంలోని అనేక ప్రాంతాలలో కూడా అలాంటి దాడులు పెద్దఎత్తుననే జరిగాయి

తన పరిపాలనక్రిందగల విస్తారమైన "హిందూ ప్రజల" నుండి ముస్లిం పాలకుడు" పూర్తిగా వేరుబడిపోవటం, అందరూ విద్వేషించేపాలనకు వ్యతిరేకంగా వివిధ తరగతుల ప్రజలు సమీకృతమవటానికి దోహదపడిన ప్రధానాంశాలలో ఒకటి.

## ఫ్యూడల్ పీడన

హైదరాబాదు సంస్థానంలో – ప్రత్యేకించి తెలంగాణాలో ప్రజల సాంఘిక – ఆర్థిక జీవితంలోవున్న మౌలికలక్షణం, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం ప్రారంభమయ్యేంతవరకూ అడ్డూఅదుపులేకుండా సాగుతూ వచ్చిన ఫ్యూడల్ దోపిడీయే.

హైదరాబాద్ సంస్థానంలో వ్యవసాయం క్రిందగల భూమి మొత్తం ఐదుకోట్ల ముప్పైలక్షల ఎకరాలు అందులో మూడుకోట్ల ఎకరాలు అంటే మొత్తం వ్యవసాయ భూమిలో నూరింట అరవైవంతులు, ప్రభుత్వ భూమిశిస్తు వ్యవస్థక్రింద వుండేది దీనినే దివానీ లేదా ఖల్సాప్రాంతం అంటారు. దాదాపు ఒకకోటీ యాభైలక్షల ఎకరాలు అంటే నూరింట ముప్పైవంతులు జాగిరారీ విధానంక్రింద దాదాపు పదిశాతం భూమి నైజాం స్వంత కమతంగాను (సర్ఫ్ ఖాస్ పద్ధతి) వుండేది. పోలీసుచర్య తర్వాతనే, సర్ఫ్‌ఖాస్ జాగిర్దారీ పద్ధతులు రద్దుచేయబడినాయి. ఈ భూములు దివానీలో కలిపివేయబడినాయి. ప్రభుత్వ భూమిశిస్తు విధానం కెందకు తీసుకురాబడ్డాయి.

సర్ఫేఖాస్ ప్రాంతంనుండి వచ్చే ఆదాయం, లేదా కొల్లగొట్టబడిన ధనం ఏటా రెండుకోట్లరూపాయలుండేది. ఈ ధనమంతా నైజాం కుటుంబానికి, కుటుంబ పరివారానికి అయ్యే ఖర్చులక్రింద వాడబడి మిగిలినదంతో ఆ పొలమంతా కూడా అతని స్వంత కమతంగా పరిగణించబడేది. ఆ ప్రాంతంలో ఆర్థిక, సాంఘిక ప్రయోజనంకోసంగాని, ఆ ప్రాంతప్రజల జీవనోపాధిని అభివృద్ధి పరచటానికిగాని ఖర్చుచేయవలసిన బాధ్యత నైజాముకేమీలేదు అందుకోసమేమైనా ఖర్చుచేస్తే, సంస్థానంయొక్క సాధారణ ఆదాయంనుండే ఖర్చుచేయడం జరిగేది. పైగా సంస్థానపు ఖజానానుండి నైజాం నవాబుకు ఏడాదికి డెభై లక్షలరూపాయలు యిస్తుండేవారు.

పోలీసు చర్య అనంతరం, సర్ఫేఖాస్ ప్రాంతం దివానీ ప్రాంతంలో కలిపివేయబడినమీదట, నైజాంకు, అతని కుటుంబ వారసులకు నష్టపరిహారం క్రింద ఏడాదికి యాభైలక్షల రూపాయలు చెల్లించబడుతోంది. అదిగాక, రాజభరణంక్రింద మరో రు 50 లక్షలు ముట్టచెప్పబడుతోంది. ఈ ప్రాంతాల రైతులు సర్వాధికారం గలిగిన నైజాంకు బానిసలుగా మాత్రమే వుండేవారు. దివానీ ప్రాంతంలోగల కాస్త కూస్త హక్కులు సయితం వారికి నిరాకరించబడేవి.

జాగీర్ ప్రాంతాలుమొత్తం సంస్థానంలో నూరింట ముప్పైవంతులు. ఈ ప్రాంతాలలో పైగాలు, సంస్థానాలు, జాగీర్దారు, ఇజారాదారు, బంజరు

దార్లు, ముకేదార్లు, ఈనాందార్లు, అగ్రహారాలు, అనే పేర్లతో వివిధరకాల ఫ్యూడల్ దోపిడీ దార్లుండేవారు వీరిలో కొందరికి, పన్నులనువిధించి వసూలు చేసేందుకు స్వంత రివెన్యూ అధికారులుండేవారు. వారిలో కొందరు పన్నుల వల్ల తమకువచ్చే ఆదాయంలో స్వల్పభాగం సంస్థానానికి చెల్లిస్తుండేవారు. మరి కొందరు అసలేమీ చెల్లించనవసరమేలేదు. ఈ ప్రాంతాలలో, వివిధరకాలయిన అక్రమ వసూళ్ళు, వెట్టిచాకిరి సర్వసాధారణం. ఈ జాగీర్లు, పైగాలు, సంస్థానాలు కొన్ని, ప్రత్యేకించి వాటిలో పెద్దవి తమ స్వంత పోలీసు రెవెన్యూ, సివిల్, క్రిమినల్ యంత్రాంగాలను కలిగివుండేవి అవి, భారత దేశంలో, బ్రిటిష్ నిరంకుశ పాలనక్రింద తొత్తుగా వ్యవహరించే స్వదేశీ సంస్థానమైన హైదరాబాదు నైజాం సంస్థానానికి లోబడిన ఉపసామంత రాజ్యాలుగా వ్యవహరించేవి.

జాగీరు ప్రాంతాలలో నీటిపారుదల సౌకర్యంగల భూమిపై పన్ను, దివానీ (ప్రభుత్వ) ప్రాంతాలలో వసూలుచేసే దానికి రు 15 లు లేదా ఎకరానికి 10బస్తాలనుండి 15 బస్తాలు ధాన్యం (8 నుండి 11 క్వింటాల్సు ధాన్యం) వసూలుచేసే వాళ్ళు

పైగాలంటే నైజాంకుయుద్ధాలలో తోడ్పడటంకోసం సాయుధబలగాలను ఏర్పాటుచేసి పోషిస్తూవుండటంకోసం ముస్లిం భూస్వాములకు,ముఖ్యంగా నైజాం బంధువులకూ మంజూరుచేయబడిన ఎస్టేట్లు నైజాం సేవజేయటంలో ప్రత్యేకత సంపాదించుకున్న అధికార్లకు బహుమానంగా యివ్వబడినవి. జాగీర్లు, సంస్థానములు మక్తాలు, బంజర్లు, అగ్రహారాలు, ఈనాములు వివిధ సేవలు జేయటంకోసం ఇవ్వబడినవి. వాటి స్వంతదార్లు రైతాంగాన్ని జలగల్లా పీల్చి, చేతనైనంత ఎక్కువమొత్తాన్ని రాబట్టుకొనేవారు దేశముఖులు, దేశపాండేలనే వారుండేవారు. వారు గతంలో ప్రభుత్వానికి పన్నులు వసూలుచేసిపెట్టేవారు. కాని, ఆ తర్వాత నైజాం ప్రభుత్వానికి సాలార్‌జంగ్ దివానుగా (ముఖ్యమంత్రిగా) వుండగా సంస్థాన యంత్రాంగం ద్వారానే ప్రత్యక్షంగా పన్నులువసూలుచేసే పద్ధతి ప్రవేశపెట్టబడింది అప్పుడు ఈ దేశముఖులకు, దేశపాండేలకు గతంలో వారు వసూలుచేసిన పన్నుల మొత్తం ప్రాతిపదికపై వతన్లు లేదా మాష్ (ఉద్యోగవిరమణానంతరభృతి) మంజూరుచేయబడినాయి ఈ దేశముఖులు, దేశపాండేలు పన్నులు వసూలు చేసేకాలంలో, సాగులోవున్న అతిసారవంతమైన భూములను వేలాది ఎకరాలను కబళించారు. ఆ భూములను తమ స్వంతఆస్తిగా దఖలు పర్చుకున్నారు. ఈ భూములను సాగుచేసుకుంటున్న రైతులు చిత్తం వచ్చినప్పుడు తొలగించి వేయుటానికివీలుగా, కౌలుదార్లస్థాయికి నెట్టబడ్డారు

ఈ ఫ్యూడల్ భూస్వాములు నానారకాల తప్పుడు పద్ధతులలో సామాన్య ప్రజలనుండి ఆ భూములను గుంజుకున్నారు. రైతులు సాగుచేసుకుంటున్న భూమిలో అధిక భాగాన్ని, మొట్టమొదట సర్వే సెటిల్‌మెంటు సందర్భంగా భూస్వాములు స్వంతం చేసుకున్నారు. అధికారం చేతుల్లోగల ఈ భూస్వాములు, సాగుచేసుకుంటున్న రైతులకు తెలియకుండానే వారి భూములను తమ పేర్లక్రింద నమోదు చేయించుకునేవారు. రైతులకు ఆ విషయం ఆర్వాత ఎప్పుడోగాని తెలిసేదికాదు. అప్పటికే పరిస్థితి చేయిదాటిపోతుంది. ఆ విధంగా ఈ ఫ్యూడల్ భూస్వాములు హద్దూపద్దూ లేకుండా విస్తారమైన భూములను దఖలు పరచుకున్నారు. వాటిపై పట్టాదారీ హక్కులు పొందారు.

సర్వే సెటిల్‌మెంట్ సమయంలో రైతుల ఆధీనంలో [illegible] వేయబడిన భూములను సయితం 1920 – 22, 1930 – [illegible] సంవత్సరాలలో ఆర్థిక సంక్షోభం సందర్భంగా, భూస్వాములు ఆక్రమించుకున్నారు. పంటలు బాగా పండకపోవటంవల్ల ఆ సంక్షోభకాలంలో రైతులు పన్నులు చెల్లించలేకపోయారు. పన్నులు చెల్లించలేకపోయిన రైతులను హింసలకు గురిచేసి ఫ్యూడల్ భూస్వాములు వారి భూములను స్వాధీనం చేసుకునేవారు. రైతులకు తెలియకుండానే పలుమార్లు ఈ విధంగా భూములను స్వాధీనపరచుకోవటం జరుగుతుండేది. భూస్వాములు రైతులకు ధాన్యం, విత్తనాలు, వ్యవసాయ పంటలకు విపరీతమైన వడ్డీరేటుతో అప్పులు ఇచ్చేవారు. ఆ తర్వాత ఈ అప్పులను తీర్చలేదన్న సాకుతో భూములను స్వాధీనం చేసుకునేవారు. తెలంగాణా పోరాటకాలంనాటికి ఈ పద్ధతి అమలులో వుంది.

జన్నారెడ్డి ప్రతాపరెడ్డి కుటుంబానికి లక్షన్నర ఎకరాల భూమి ఉండేది. ఏకఖండంగావున్న 750 ఎకరాల భూమిలో [illegible] వుండేది. భూముల కేంద్రీకరణ ఏ మోతాదులో వుండేదో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. తెలంగాణా పోరాటపు రోజులలో, గ్రామ రాజ్యాలు భూస్వాములకు సంబంధించిన సమాచారాన్ని సేకరించాయి. వాటికి హక్కుదారులయిన రైతులకు తిరిగి అప్పగించారు.

ఈ భూస్వాములు, దేశముఖులు మాత్రమేకాదు, వంశ పారంపర్య హక్కులతో పటేల్, పట్వారీ, మాలీపటేల్ వంటి గ్రామాధికారులుగా కూడా వుండేవారు. ప్రతి ఒక్కరూ ఐదు నుంచి పది గ్రామాలు వతన్‌గా పొందుతుండేవారు.

ఈ వతన్ గ్రామాలపై దేశముఖులు తమ అజమాయిషీని తమ గుమాస్తాలద్వారా, ఏజెంట్లద్వారా (పేశీదార్లద్వారా) చలాయించేవారు. వారికి

ప్రభుత్వ అధికారికుండే అన్ని అధికారాలూ ఉండేవి. ఈ సేరీదార్లు రైతుల నుండి దౌర్జన్య పూర్వకంగా పంటలను వసూలు చేసేవారు. గ్రామానికి సంబంధించిన యావత్తు సమాచారాన్ని అందజేయటంతోసహా అన్ని పనులూ చేసేవారు. గ్రామస్థుల మధ్య ఏదైనా వివాద మేర్పడినా, ఘర్షణ వచ్చినా భూస్వామికి తెలియకుండా పరిష్కరించటానికి వీలులేదు తగాయిదా స్వభావాన్నిబట్టి, దాన్ని తన ఇంటి వద్దనే (గడీలో) పరిష్కారం చేయాలో, వెలుపల గ్రామ కేంద్రంలో పరిష్కారం చేయాలో, లేదా మరెక్కడయినా చేయాలో దేశముఖే నిర్ణయిస్తూ వుండేవాడు చిన్న తగాయిదా అయితే దాని పరిష్కార బాధ్యతను దేశముఖ్ తన ఏజెంటుకు అప్పగించేవాడు. అదే పెద్ద వ్యవహారమయితే, దేశ్‌ముఖ్ సమక్షంలో ఆయన యింటివద్దనే పరిష్కరించబడేది. బాబాసాహెబ్ పేట భూస్వామి విస్నూర్ రామచంద్రారెడ్డి మొదలయిన వారు ఈ తరగతికి చెందిన ధనిక భూస్వాములే.

వడ్డేపల్లి దేశ్‌ముఖ్ పింగళి వెంకట్రామరెడ్డి తెలంగాణా మొత్తానికి ఎక్సైజు కాంట్రాక్టులు తానొక్కడే పొందాడు. ఆ రోజుల్లో ఎక్సైజు (అబ్కారీ) కాంట్రాక్టు అంటే, గ్రామాలపై పూర్తి అజమాయిషీ హక్కు కలిగివుండటమే

రైత్వారీ గ్రామాలలోనే ఫ్యూడల్ భూస్వాముల దోపిడీ పరిస్థితి ఈవిధంగా వుందంటే, జాగీర్దారీ ప్రాంతాలలో ఎలావుండేదో ఎవరయినా ఊహించుకోవచ్చు ఈ జాగీర్దారులకు, దేశముఖులకు రైఫిళ్లు, తుపాకులు కలిగివుండటానికి లైసెన్సులున్నాయి. వారికి అశ్విక దళాలు, సాయుధ దళాలూ వుండేవి.

### వెట్టి విధానం

వెట్టివిధానం (నిర్బంధచాకిరి, వసూళ్ళు) అటవిక తెగలప్రాంతానికి, ఇతర ప్రాంతాలలో బాగా వెనుకబడిన కొన్ని సాంఘిక తెగలకూ మాత్రమే పరిమితమయినదిగా సాధారణంగా భావించబడుతుంది కాని, తెలంగాణాలో వెట్టివిధానం సమాజమంతటా ఆవరించి ఉండేది. ప్రజలలో అన్ని వర్గాల ప్రజలకూ తర తమ స్థాయిలలో అది వర్తించేది. ప్రతి హరిజన కుటుంబమూ వెట్టిచాకిరి చేయటానికి కుటుంబంలోని వారినొకరిని కేటాయించవలసివుండేది. చిన్నపల్లెల్లో ప్రతిఇంటినుండి ఒకమనిషిని పంపటం జరిగేది. పటేల్, పట్వారీ, మాలిపటేల్ లేదా దేశ్‌ముఖ్‌ల ఇండ్లలో గృహసంబంధమైన పనులుచేయటం, పోలీసుస్టేషన్లకు, తాలూకాఆఫీసులకు రిపోర్టులు మోసుకెళ్ళటం, గ్రామ చావిడికి, బందిలిదొడ్డికి కాపలాకాయటం రోజువారీ పనిలో భాగమే.

ఇవిగాక, గ్రామచావిడికి ఎవరయినా అధికారివచ్చినప్పుడు వాళ్ళకు మరింత ఎక్కువ పనివుండేది. చిలుకూరుగ్రామంలో ప్రతిరోజూ 16 మంది హరిజనులు వెట్టి చాకిరి చేస్తుండేవారు. అడవులనుండి కట్టెలుకొట్టి తెచ్చేవారు. టపా మోసుకెళ్ళేవారు. టపాగాని, ఇతర సరఫరాలను గాని మోసుకెళ్ళి నందుకుగాను వారికి రెండున్నర మైళ్ళకు ఒక్కఅణా చొప్పున ఇవ్వబడు తున్నట్లు కాగితాలమీద వుండేది. అయితే ఆచరణలో అదీకూడ ఇచ్చే వారుకారు. ఈ విధానాన్నే "కోసుకు వీసం" అనేవారు.

చర్మకారులుగా పనిజేసే హరిజనులు, తోళ్లను పదునుచేసి చెప్పులు కుట్టినందుకు, వ్యవసాయ పనులకు, నూతులనుండి నీరుతోడటానికి అవసర మైన తోలుపరికరాలు తయారు చేసినందుకు, అరికలకు పట్టెళ్లు తయారు జేసినందుకు భూస్వాములు ఏమీ చెల్లించేవారుకాదు. హరిజనులు భూస్వా ములకు వాటిని ఉచితంగానే సరఫరా చేయవలసి వచ్చేది. మిగతా గ్రామాంగం మాత్రం, ఆ హరిజనులకు ధాన్యరూపంలోనో, ఇతర వ్యవసాయ పంటల రూపంలోనో నిర్ణీతమైన మేర చెల్లించేవారు.

బోయలు, బెస్తలు, రజకులవంటి మరికొన్ని ఇతర వెనుకబడిన కులాలవారు భూస్వామి కుటుంబాలకు చెందిన పురుషులను, స్త్రీలను, పల్లకీల లోనో, మేనాలోనో ఎక్కించుకొని తమ భుజాలమీద మోసుకు వెళ్ళవలసి వచ్చేది. తమ బంధువులను చూచిరావాలనుకున్నప్పుడూ, తీర్థాలు, తిరనాళ్ళను సందర్శించ దలచినప్పుడెల్లా భూస్వాములు ఆ విధంగా వారిచే నిర్బంధంగా మోయించుకునేవారు. భూస్వామి కుటుంబాలవారు వేగంగా నడిచే ఎద్దు బండ్లలో ప్రయాణం చేసేటప్పుడు బండిముందు దారి బాగుచేయటానికి, బండి వెనుక కాపలాదారుగా వారు పరుగెత్తవలసి వచ్చేది. వారు గుర్రాలపై స్వారీ చేసేటప్పుడు, గుర్రాలవద్ద పనిజేసే వ్యక్తులు వాటివెంట పరుగెత్తవలసి వుండేది.

కల్లుగీత కార్మికులు కల్లుగీతగీస్తూ, భూస్వాముల కుటుంబాలకు ఉచితంగా సరఫరా చేయటంకోసం ఐదునుండి పదిచెట్లవరకూ ప్రత్యేకంగా- కేటాయించి వుంచాలి. వారికి రోజుకు ఐదుకుండల కల్లు సరఫరాచేయాలి. పండుగ పబ్బాలప్పుడు మరింత ఎక్కువ కల్లుఇచ్చి రావాలి.

చేనేత పనివారు భూస్వాముల ఇండ్లల్లో పనిచేసే నౌకర్లకు బట్టలు సరఫరా చేయాలి. వడ్రంగులు, కమ్మర్లు భూస్వాములకు వ్యవసాయ పరికరా లన్నీ వుచితంగా సరఫరా చేయాలి. మరమ్మత్తులన్నీ వుచితంగానే చేయాలి.

రజకులు, దేశముఖుల, గ్రామాధికారుల ఇండ్లల్లో బట్టలుతకాలి, అంట్లు తోమాలి. గ్రామ చావడిలో మకాం వేసిన అధికారులకొరకు మంచాలు, పరుపులు మోసుకెళ్ళాలి వంట చేయటాని కవసరమైనవన్నీ చేరవేయాలి వారే అధికారుల ఇండ్లలో పసుపు, కారం కొట్టాలి.

కుమ్మరులు-అధికారులకు, భూస్వాములకు అవసరమైన కుండలివ్వాలి. జాగీర్దారుగాని, దేశముఖుగాని హైదరాబాదులో నివాసముంటున్నా, అంతదూరమూ నడిచివెళ్ళి, అవసరమైన కుండలన్నీ యిచ్చిరావాలి. గ్రామ చావడిలో మకాంవేసిన అధికారికి అవసరమైన కుండల్నిచ్చిరావాలి.వంటకూడా చేసిపెట్టాలి. మంగలివారు ప్రతిరోజూ దేశముఖుల ఇండ్లలో సేవజేసిరావాలి. రాత్రివేళ భూస్వామి పాదాలొత్తాలి. అతని వొళ్ళు మర్దన చేయాలి.

భూస్వాముల ఇండ్లల్లో ఏదైనా వేడుకజరుపుకున్న ప్రతిసారీ, గ్రామానికంతటికీ పండుగవచ్చాలొచ్చినప్పుడూ గొల్లవారు ప్రతి మంద నుంచి ఒక గొర్రెనిచ్చితీరాలి. ఏదో ఒకసాకుతో భూస్వాములు ఎప్పుడు కోరితే అప్పుడు గొర్రెనిచ్చితీరాలి

గ్రామాలలో వ్యాపారంజేసేవారు పోలీసుపటేలు నుండి చీటీ అందగానే, గ్రామంలోకివచ్చిన ఏ అధికారికయినా మంచినెయ్యితోసహా అవసరమైన సరుకులన్నీ వంతులవారీగా సరఫరాజేయవలసివుండేది వాళ్ళవద్ద ఏదైనా సరుకులేకపోయినా, ఏదైనా సరుకు యివ్వకపోయినా, యివ్వటానికి వ్యతిరేకించినా నానావిదాలయిన చిత్రహింసలకు, అవమానాలకు గురిజేయబడేవారు.

గ్రామప్రజలు, ప్రత్యేకించి సరఫరాజేయటానికి ఏ యితర వస్తువులూ లేని పేదప్రజలు ఉచితంగా కోడిపెట్టలు సరఫరాజేయవలసివచ్చేది ఈ వెట్టి నుండి రైతులను కూడా వదలిపెట్టేవారుకాదు. ఎవరైనా అధికారివచ్చినప్పుడల్లా రైతులు వారిని ఉచితంగానే తమ బండ్లలో ఎక్కించుకెళ్ళాలి. ఏవేళప్పుడుబడితే ఆవేళప్పుడు ఎడ్లకు మేతమేపడం కూడా ఆపి వారిని వారి గమ్యస్థానాలకు చేర్చాలి. తమ స్వంత పొలాలలో పని ప్రారంభించటానికి ముందే, గ్రామాధికారుల, భూస్వాముల పొలాలు దున్నిపెట్టాలి భూస్వాముల భూములు తడిసేంతవరకూ, రైతుల పొలాలకు నీళ్ళు అందనిచ్చేవారు కాదు. అధికారుల, భూస్వాములపొలాలలో వ్యవసాయ కార్మికులు ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా పనిచేయాలి. ఆతర్వాతగాని వారు తమ జీవనభృతి కోసం రైతులు పనులలోనికి వెళ్ళటానికి వీలులేదు

వివిధ రూపాలలో సాగుతుండిన ఈ నిర్బంధ చాకిరి చేయించుకొన్నది, వసూళ్లు సాగించింది భూస్వాములు మాత్రమేకాదు. చిన్న ఉద్యో

1) విసునూరు దేశముఖ్ : 40 వేల ఎకరాలు నల్గొండజిల్లా, జనగామ తాలూకాలోని 40 గ్రామాలపై భూస్వామి.

2) సూర్యాపేట దేశముఖ్ . 20 వేల ఎకరాలు.

3) బాబాసాహెబ్ పేట దేశముఖ్ : 10 వేల ఎకరాలు, మిర్యాలగూడెం తాలూకా.

4) కల్లూరు దేశముఖ్ : ఒక లక్ష ఎకరాలు, ఖమ్మం జిల్లా, మధిర తాలూకా.

5) జన్నారెడ్డి ప్రతాపరెడ్డి . ఒక లక్షా 50 వేల ఎకరాలు, సూర్యాపేట తాలూకా.

ఉద్యమం విస్తరించిన ప్రాంతాల్లో ఐదు వేల యకరాలకుపైగావున్న మరి కొంతమంది బడా భూస్వాములు :

దేవరకొండ తాలూకాకు చెందిన మల్లాపురం రంగారెడ్డి, చందంపల్లి దొరలు, కొప్పోలుకు జెందిన మోసంగి దొరలు, మిర్యాలగూడెం తాలూకాకు జెందిన చెరుకుపల్లి నరసింహారెడ్డి, హుజూరునగర్ తాలూకాకు చెందిన చేతపోలు జమిందారు, కాపుగల్లు ముత్తవరపు కుటుంబం, పెనుబాడు సీతారామారావు, భువనగిరి తాలూకాకు జెందిన చందుపట్ల సుదర్శనరావు, దూపల్లి ంకటరామారెడ్డి, ఇబ్రహీం పట్నం తాలూకాలోని తంగడిపల్లికిజెందిన మూసకూరికుటుంబం. పోలపల్లికిజెందిన అల్వాల కుటుంబం, మందమేరి ాధవరావు (10వేల ఎకరాలు), వుసుకూరి కుటుంబం (10-20వేల ఎకరాలు), దిలాబాద్ జిల్లా లక్కిసెట్టిపేటకు జెందిన నర్సాపూర్ సంస్థానం (50 వేల ండి లక్షల ఎకరాలు).

హైదరాబాదు సంస్థానంలో, తెలంగాణా ప్రాంతంలో భూకేంద్రీ క్షణ విపరీతంగా వుంది. నల్గొండ, మహబూబ్ నగర్, వరంగల్లు జిల్లాలలో దువందల ఎకరాలకు పైగా భూమిగల పట్టాదారుల (భూస్వాముల) సంఖ్య 0 అని, సాగులోవున్న మొత్తం భూమిలో నూరింట 60 నుండి 70 వంతుల రకు వారి అధీనంలో కలదని 1950-51 సంవత్సరపు పరిపాలనా నివేదికనుబట్టి తెలుస్తోంది.

ఈ జాగిర్దార్లు, పైగాలు, సంస్థానంలు సాగిస్తున్న దోపిడీ తీవ్రత ఎంతగా వున్నది వారిలో 110 మంది ప్రతి ఏటా, రైతాంగంనుండి వివిధపన్నుల రూపంలో నిర్బంధ వసూళ్ళ రూపంలో పదికోట్ల రూపాయలు వసూలు జేస్తుండటాన్నిబట్టి స్పష్టంకాగలదు. ఈ మొత్తంలో రు 5 కోట్ల 50 లక్షలు వారిలో 19 మందికి దక్కుతూవుండేది. 1940 కి పూర్వం మొత్తం హైదరాబాద్ సంస్థా

నపు రెవెన్యూ ఆదాయం మొత్తం రు 8 కోట్లకు మించిలేదు. అయితే చట్ట బద్ధంగానో, అక్రమంగానో వసూలుచేసే మొత్తం నిజానికి ఈ మొత్తానికి మూడు రెట్లుంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. అక్రమ నిర్బంధ వసూళ్ళను నిషేధిస్తూ నైజాం జారీచేసిన ఫర్మానాలో 82 రకాలయిన అక్రమ నిర్బంధ వసూళ్ళగూర్చి పేర్కొనబడినాయి

అయితే, ఈ ఫర్మానా కేవలం కాగితంమీదనే మిగిలిపోయింది నైజాం సంస్థానపు లంచగొండి అధికారవర్గం నుండి క్రియాత్మకమైన అండ దండలు పొందుతూ, జాగీర్దార్లు, దేశముఖులు, బడా భూస్వాములు తమ అక్రమ నిర్బంధ వసూళ్ళను సాగిస్తూనే వచ్చారు. అందుకు ఒక ఉదాహరణగా దిగువ విషయాన్ని పేర్కొనవచ్చు:

నల్గొండజిల్లా, జనగామ తాలూకాకు చెందిన పేరుమోసిన దేశ్‌ముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి కౌలుదార్లనుండి, రైతులనుండి నిర్బంధంగా భూములు కబళిస్తూనే వచ్చాడు. తన అధీన ప్రాంతంలోని, దాదాపు 40 గ్రామాల రైతులచేత నిర్బంధంగా సంవత్సరం పొడుగునా తన పొలాలలో చాకిరీ చేయించుకొనేవాడు కుటుంబంలో పెద్దపుట్టినా, వివాహం జరిగినా, ఎవరైనా మరణించినా ఆ సందర్భాలలో రైతులనుండి నిర్బంధంగా నజరానాలు (ధనరూపంగాగాని, వస్తురూపంగాగాని బహుమానాలు) పొందు తుండేవాడు

ప్రతి చేతిపనివాడు, వ్యాపారస్తుడూ తన వృత్తిలో కొంతభాగాన్ని లేదా రొక్కరూపంగా నిర్ణీతమొత్తాన్ని చెల్లించకతప్పేదికాదు. చర్మకారులు-చెప్పులను, పశువులకొమ్ములను; గొల్లవారు-కంబళ్ళను, విందులకోసం గొర్రె లను, మేకలను, పాలను, రైతులు - ధాన్యం, కూరగాయలు మొదలైనవి యిచ్చుకొంటూవుండేవారు. 1940 ప్రాంతంలో అయన రెండు లక్షల రూపాయల విలువచేసే భవనం కట్టించాడు. ఆ భవననిర్మాణ వ్యయంలో దాదాపు సగభాగాన్ని వివిధ నిర్మాణపనులకు నిర్బంధంగా చాకిరి చేయించు కొనటంద్వారాను, రొక్కరూపంగాను సేకరించాడు. మూడుగోజులక్రితమే ప్రసవించిన ఒక యువతిని, తన పసికందును ఇంటివద్దవదలి అతని పొలాలలో చాకిరీ జేయటానికి నిర్బంధంగారప్పించుకున్నాడు. దానితో చూసేవారెవరూ లేక, పాలులేక ఆ పసికందు కన్నుమూసింది అతనెంత దుర్మార్గుడుగా పేరు మోశాడంటే, ఆ గ్రామాలలో నివసించేవారికి తమ బిడ్డలనిచ్చి పెండ్లిచేయు టానికి రైతులు జంకుతూండేవారు. అలాంటి నిర్బంధచాకిరికి వ్యతిరేకంగా, అక్రమవసూళ్ళకు, బేదఖళ్ళకు వ్యతిరేకంగా, హైదరాబాదు సంస్థానంలోని ఆంధ్రప్రజల సాంస్కృతికసంస్థయగు ఆంధ్రమహాసభ అసంఖ్యాకమైన పోరా

టాలను సాగించింది. ఈ విసునూరు రామచంద్రారెడ్డి గూండాలు కడవెండి గ్రామంలో 1946 జూలై 4 వ తేదీన, స్థానిక ఆంధ్రమహాసభ కార్యకర్త దొడ్డి కొమరయ్యను కాల్చిచంపారు. దానితో 1946 లో ఈ విసునూరు దేశముఖ్ దురంతాలకు వ్యతిరేకంగానే తెలంగాణా సాయుధపోరాటం అంకురించింది.

## కార్మికుల, మధ్యతరగతి ఉద్యోగుల దుర్భర పరిస్థితులు

1941 లో తెలంగాణా ప్రాంతంలో ఐదువందల ఫ్యాక్టరీ లుండేవి. వాటిలో 23 వేల మంది కార్మికులు పనిజేసేవారు వస్త్రాలు, గుడ్డల మిల్లులు, కాగితం మిల్లులు, ఇంజనీరింగు కర్మాగారాలవంటి పెద్ద ఫ్యాక్టరీలు, గనులు పెద్ద ఎత్తున సబ్సిడీలు పొందుతుండేవి. సాలార్‌జంగ్, బాబూఖాన్, లాహౌటి, అలాయుద్దీన్, దొరాబ్జీ, చినాయ్, తయాబ్జీ, లాయక్ అలీ, పన్నాలాల్ పిట్టీ మొదలగు ఫ్యాక్టరీ యజమానులకు ప్రభుత్వం పెద్ద మొత్తాలు అప్పుగా మంజూరు జేసింది. తమ సరుకులను బ్లాక్ మార్కెట్‌లో అమ్ముకొని, వారు యుద్ధకాలంలో విపరీతమైన లాభాలు గడించేవారు.

అయినా కార్మికుల వేతనాలు కడు హీనంగా వుండేవి. జవుళి కార్మికుల వేతనం నెలకు రు. 10 నుండి 15 కు మధ్యలో వుండేది కార్మికులలో నూరింట 80 మందికి నెలకు రు 15 లు లోపు జీతాలుండేవి. వరంగల్లులోని అజంజాహి మిల్లులో పనిజేసే నాలుగువేలమంది కార్మికులకు 1943 సంవత్సరంలో చెల్లించిన వేతనాలమొత్తం రు. 13 లక్షల 63 వేలు. కాగా మేనేజింగ్ ఏజెంట్లు కమీషన్ రు 7 లక్షల 44 వేలు. హైదరాబాద్‌లోని రామ్‌గోపాల్ మిల్లులో పనిజేసే 15 వందలమంది కార్మికులకు సంవత్సరం మొత్తంలో చెల్లించే వేతనాల మొత్తం నాలుగు లక్షలు రూపాయిలుకాగా మేనేజింగ్ ఏజెంట్లు కమీషన్ ఒక లక్షా 35 వేల రూపాయలు.

15వందలమంది ఉన్నత ప్రభుత్వాధికారుల జీతాలక్రిందసంవత్సరానికి ఐదుకోట్లరూపాయలు చెల్లించేవారు. అదే సమయంలో దిగువ తరగతి ఉద్యోగుల జీతాలు నెలకు 12, 16, 30, 60 రూపాయలు మాత్రమే వుండేవి.

"ముస్లిములు పరిపాలకులు" (అనల్ ముల్క్) అనే పేరుతో వివిధ ప్రభుత్వోద్యోగాలలో దాదాపు రెండులక్షలమంది ముస్లిములు వుండేవారు. అయితే వారిలో అత్యధిక సంఖ్యాకుల నెలజీతాలు రు 12 – 30 మధ్యలోవుండేవి. అందువల్ల ఈప్రభుత్వోద్యోగులు తమ స్వల్ప వేతనాలు చాలక అనేక రకాలయిన అవినీతి పద్ధతులకు పాల్పడటంలో ఆశ్చర్యమేమీలేదు. ముస్లిములలో చాలమంది కంబళ్ళనేత, బట్టల అద్దకం (నాగన్‌నాజి), చేనేత

మొదలైన అనేక చేతి వృత్తులపై ఆధారపడి వుండేవారు. వారంతా దుర్భర జీవితాలు గడపటం తప్పనిసరి అయ్యేది.

“ముస్లిములు పరిపాలకులు” అనే పేరుతో తన రాజ్యానికి సామాన్య ముస్లిం ప్రజానీకంయొక్క అండదండలు పెంపొందించుకొనటంకోసం, 1927 లో మజ్లిస్ ఇత్తెహాద్ – ఉల్ – ముస్లిమీన్ అనే సంస్థ నిర్మాణానికి నైజాం ప్రోత్సహించాడు “రాజుపట్ల, ఆయన ప్రభుత్వంపట్ల విశ్వాసాన్ని పెంపొందించటం” తన లక్ష్యాలలో వొకటిగా ఆ సంస్థ 1928 లో నిర్ణయించింది. రాజరికం దైవదత్తమనే సిద్ధాంతాన్ని వారు ప్రచారం చేసేవారు. నైజాము దేవుని ప్రతిరూపం” (దేవచ్ఛాయ) అని “జిల్ – ఉల్ – అల్లా” అని ఇంకేమేమో అని ప్రచారం చేస్తుండేవారు. బ్రిటిష్ సామ్రాజ్యంతో ప్రత్యక్ష సంబంధం గలిగిన స్వతంత్ర హైదరాబాదు రాజ్యం కావాలనేది వారి కోరిక. అంతకుముందు బ్రిటిష్ వారికి ఇచ్చివేయబడిన ఆంధ్రలోని కోస్తా, రాయలసీమ ప్రాంతాలనూ, బేరార్ ప్రాంతాన్ని నైజాముకు తిరిగి ఒప్పగించాలని వారు డిమాండ్ చేసేవారు. సంస్థానంలో ఏవిధమైన ప్రజాతంత్ర వుద్యమం పెంపొందటానికిగాని, ఏ రూపంలోనైనా ప్రజాతంత్ర లేదా బాధ్యతాయుత ప్రభుత్వ వ్యవస్థ ఏర్పడటానికిగాని ఈ సంస్థ పూర్తిగా వ్యతిరేకం. ముస్లిం కార్మికులు, కర్షకులు, మధ్యతరగతి కష్టజీవులు, హిందూమతానికి చెందిన తమవర్గ సోదరులతో చేతులు గలపకుండా హిందూ – ముస్లిం జాగీర్దార్లకు, భూస్వాములకు పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా, నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా వుమ్మడి పోరాటం సాగించకుండా చూడటానికి వారు శాయశక్తులా అడ్డుపడుతు వుండేవారు

## ఆంధ్రమహాసభ ప్రారంభదినాలు

నైజాం నవాబుది నిరంకుశపరిపాలన. గ్రామ స్థాయినుండి, సంస్థాన స్థాయివరకు ఏ స్థాయిలోనూ ఎన్నికయిన సంస్థలనేవేమీ వుండేవికావు. తానే స్వంతంగా నియమించుకున్న సలహా సమితి, తానే నియమించుకున్న ముఖ్యమంత్రి వుండేవారు. ఫర్మానాలు జారీచేయటంద్వారా అతడు పరిపాలన నిర్వహించేవాడు. ఆ ఫర్మానాలు శాసనం, కార్యనిర్వహణాధికారి వుత్తర్వు మిళితమైన రూపంలో వుండేవి. “నాజిముల”నే పేరుతో, వివిధ శాఖల కార్యదర్శులను నియమించేవాడు.

ఎలాంటి పౌరహక్కులు లేవనేవిషయం ప్రత్యేకంగా పేర్కొనవలసిన పనిలేదు. కనీసం సాహిత్య సంఘాలకు సయితం, సారస్వత ప్రయోజనాలకోసం

గాని ఎలాంటి బహిరంగసభ జరపటానికయినా, స్థానిక అధికారినుండి ముందుగా అనుమతి పొందవలసివుండేది. క్రింది నుండి పైదాకా అధికారులు నిరంకుశ పాలన సాగుతూవుండేది.

నైజాం సంస్థానానికి స్వంత ద్రవ్య (కరెన్సీ) వ్యవస్థ, కస్టమ్సు వ్యవస్థ వుంది. ఆ పేరుతో సంస్థానం చుట్టూ పెద్ద సంఖ్యలో కస్టమ్సు తనిఖీ కేంద్రాలు వుండేవి. ఏ విధమైన అభ్యుదయ సాహిత్యమూ సంస్థానంలో ప్రవేశించకుండా అవి నిరోధించగలిగేవి. తన స్వంత ముల్కీ నిబంధనల ద్వారా, పెద్ద సంఖ్యలోవున్న పోలీసు గార్డులద్వారా, సంస్థానంలో అడుగు పెట్టే ప్రతి వ్యక్తిని నమోదు జేసుకోవటం, చిరునామా వ్రాసుకోవటం, అతనిపై నిఘావేసి వుంచటం, బీభత్సానికి గురిజేయటం జరుగుతుండేది తన హైదరాబాదు సంస్థానికి వెలుపల, భారతదేశంలోగల అభ్యుదయకాముక శక్తులతో సంబంధాలు పెట్టుకొనటం అసాధ్యమయ్యేట్లు చేశాడు నైజాముకు స్వంత రైల్వే వ్యవస్థ వుండేది ప్రతి స్టేషన్‌లోనూ, అతని కస్టమ్సు పోలీసులు రైలు దిగేవారిని ప్రశ్నించటం, సామానులను తనిఖీ చేయటం జరుగుతుండేది. రైళ్ళలో సయితం, నైజాం పోలీసులు, తమకు అనుమానం వేసిన రాజకీయవాదులపై నిఘా వేయటం, బీభత్సానికి గురిచేయటం లాంటివి సాగుతూవుండేవి.

భారతదేశంలో జాతీయ ఉద్యమాభివృద్ధివలన మేధావులు, ఉదారవాదులు అంతకంతకూ ఎక్కువగా ప్రభావితులవుతూ వచ్చారు. అలాంటి వారంతా నైజాంపాలనకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రమహాసభగా, మిగతా రెండు ప్రాంతాలలో మహారాష్ట్ర పరిషత్, కన్నడ పరిషత్తుగా సంఘటితం కాగలిగారు.

నైజాంకు వ్యతిరేకంగా, అతని ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగా 18, 19వ శతాబ్దాలలోను, 20వ శతాబ్దంలోని మొదటి పాతిక సంవత్సరాలలోను ప్రజలు సాగించిన వివిధ పోరాటాలను గురించిగాని, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చేతుల్లో తొత్తుగా నైజాం నిర్వహించిన పాత్రను గురించిగాని, భారతదేశంలో స్వాతంత్ర్య పోరాటాలను ప్రత్యేకించి 1857 స్వాతంత్ర్య యుద్ధాన్ని అణచటంలో అతడు వారికెలా సహాయపడ్డాడనే విషయాన్నిగూర్చి గాని ఇక్కడ వివరించటం సాధ్యంకాదు.

శ్రీ మాడపాటి హనుమంతరావు, తదితరుల నాయకత్వాన 1928 లో ఆంధ్రమహాసభ ఏర్పాటు చేయబడింది. దాని ప్రథమ మహాసభ మెదక్ జిల్లా జోగిపేటలో 1930 లో శ్రీ సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగింది

పరిపాలనా యంత్రాంగంలో కొన్ని సంస్కరణలు చేయాలనీ, ఎక్కువ పాఠశాలలు తెరవాలని, భూములుగల పెద్దమనుషులకు కొన్ని సౌకర్యాలు కల్పించాలనీ, కొన్ని పౌరహక్కులనుభవించటానికి అవకాశం కల్పించాలని ఆ మహాసభలలో తీర్మానాలు చేయబడుతుండేవి. పిడకులకు వ్యతిరేకంగాగాని, నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగాగాని ప్రజలను సమీకరించి పోరాటాలు నడపటానికి ప్రయత్నంమాత్రం చేయలేదు అయితే, హైదరాబాదు సంస్థానంలో ఆనాడున్న దారుణమైన, దుర్భరమైన నిర్బంధ పరిస్థితులలో ఆంధ్ర మహాసభ ప్రజలలో పెంపొందుతున్న ప్రజాతంత్ర భావాలకు, వాంఛలకు వేదికగా, కేంద్రంగా రూపొందింది

స్వదేశీ సంస్థానాలలో జోక్యం కల్పించుకో కూడదనే విధానాన్ని అప్పుడు భారత జాతీయ కాంగ్రెస్ అనుసరించింది సంస్థానాలలో తన శాఖలను ఏర్పాటు జేయటానికి అది పూనుకోలేదు. బ్రిటిష్-ఇండియా అని పిలువబడే భాగంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటాల పద్ధతిలో నయినా, బ్రిటిష్‌వాళ్ళ తొత్తులుగా వ్యవహరిస్తున్న భారతీయ సంస్థానాల్లోని రాజులకు, నవాబులకు వ్యతిరేకంగా ఉద్యమాలు ప్రారంభించలేదు. కొన్ని రాయితీలు సాధించడంకోసం కొంతమేరకు ప్రజలనుండి వత్తిడి తీసుకురావడం, జనసామాన్యంయొక్క ఆగ్రహం, పెల్లుబికి అదుపుదప్పి విప్లవమార్గాలు చేపట్టకుండా చూడడం అనే తమ వర్గ ప్రయోజనాల కనుగుణంగానే భారత జాతీయ కాంగ్రెస్ నాయకత్వం వ్యవహరించింది. స్వదేశీ సంస్థానాధిపతులకు వ్యతిరేకంగా సంస్థానాల ప్రజల పోరాటాలను ప్రోత్సహించలేదు.

అయితే ఈ సంస్థానంలోని యువకులు, సమకాలీన ప్రజాతంత్రవాదులు బ్రిటిష్-ఇండియాభాగంలో నిర్వహించబడిన జాతీయోద్యమాలలో పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. 1930-32 సంవత్సరాలలో ఉప్పు సత్యాగ్రహంలోనూ, సహాయ నిరాకరణోద్యమంలోనూ పాల్గొని అనేక వందల మంది జైళ్ళకు పోయారు. వారిలో అనేక మంది తమ విడుదల అనంతరం తిరుగుబాటు భావాలను ప్రచారం చేశారు. తమ తమ సంస్థానాలలోని ప్రజలను సంఘటితపరచటానికి ప్రయత్నించారు. అందుకుగాను తమకు లభ్యమైన ప్రతి అవకాశాన్ని వుపయోగించుకున్నారు.

హైదరాబాదు సంస్థానంలో, తెలంగాణాప్రాంతంలో ఆంధ్ర మహాసభ అలాంటివారికి వేదికగా రూపొందింది. దానిని విస్తృతమైన రాజకీయ సంస్థగా పెంపొందించటానికి వారు ప్రయత్నం చేశారు. ఇందులో శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ బద్దం యెల్లారెడ్డి గణనీయమైన పాత్రను నిర్వహించారు.

వారు ఆంధ్ర మహాసభలో బాధ్యతాయుత పదవులకు, అధ్యక్ష, కార్యదర్శి పదవులకు సయితం ఎన్నికయినారు. ఆ తర్వాత ఈ నాయకులిరువురూ, చిర్రావూరి లక్ష్మీనరసయ్య, సర్వదేవభట్ల రామనాథం, దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి, కోదండ రామిరెడ్డి మొదలు గాగలవారు, ఆంధ్రమహాసభలోని చురుకయిన, సమరశీల అభ్యుదయ కాముకుల బృందమంతటితోసహా 1940-42 నాటికల్లా కమ్యూనిస్టు వుద్యమంలో చేరిపోయారు. ఉదారవాద సంస్థగావుంటూవచ్చిన ఆంధ్రమహాసభను నైజాం వ్యతిరేక సమైక్య సమరశీల ప్రజాసంస్థగా, నైజాముకు వ్యతిరేకంగా యువజనులను, రైతులను, వ్యాపారస్తులను, చేతివృత్తులవారిని మధ్యతరగతి వర్గాలను నడిపే ఐక్య సంఘటనగా మార్చివేశారు.

స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న భారతదేశప్రజలకు ఆ రోజుల్లో జాతీయగీతంగావుండిన, వందేమాతరం గానం జేయటాన్ని నైజాం పాలకులు 1938 లో నిషేధించారు. అప్పుడు సంస్థానంలోని ప్రజాతంత్రశక్తులన్నింటి అండదండలతో విద్యార్థులు పోరాటం ప్రారంభించారు. తమ దేశభక్తిగీతాన్ని ఆలాపించేందుకు తమకుగలహక్కును నిలబెట్టుకొనటానికి ఆ పోరాటం సాగింది. ఆ పోరాటం సంస్థానమంతటా పాఠశాలలకు, కళాశాలలకు వ్యాపించింది. కళాశాలలుమూసివేయబడినమీదట, దేశభక్తిగలిగిన ఈ విద్యార్థులలో చాలామంది పొరుగురాష్ట్రాలకువెళ్ళి, అచ్చటి కళాశాలల్లో చదువుకొని, తమ సంస్థానంలో పోరాటం సాగించటానికి తిరిగివచ్చారు.

ఈ ఉద్యమం అనంతరమే, స్టేట్ కాంగ్రెస్‌ను ఏర్పాటు జేయటానికి ప్రయత్నం జరిగింది. అయితే అది నిషేధించబడింది. స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ పోరాట మొకటి ప్రారంభించింది. ఆంధ్ర మహాసభకు చెందిన నాయకులనేక మందికూడా అందులో పాల్గొన్నారు.

అప్పటికి, భారతకమ్యూనిస్టుపార్టీ ఆంధ్రశాఖ, సమరశీలురైన, అభ్యుదయ కాముక కార్యకర్త లనేకమందితో సంబంధాలు పెట్టుకోగలిగింది. హైదరాబాదు సంస్థానంలో పార్టీ శాఖలు నిర్మాణం చేయడానికి వారిని సిద్ధపరచ గలిగింది. శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ బద్దం యెల్లారెడ్డి తదితర ప్రముఖ కార్యకర్తలనేకమందిని పార్టీలోకి రాబట్టుకోగలిగినందున తెలంగాణాలో శక్తివంతమైన పార్టీ బృందాలను నిర్మించుకోగలిగింది. ఆంధ్ర మహాసభను తెలంగాణా ప్రాంత ప్రజల ఐక్యపోరాట సంఘటనగా పెంపొందించే కార్యక్రమాన్ని కొనసాగించాలనీ, మహారాష్ట్ర, కన్నడ పరిషత్తులనుకూడా అదే విధంగా ఆ ప్రాంతాల్లో రూపొందించాలని, తద్వారా సంస్థానమంతటా ప్రజా

ఉద్యమాన్ని నిర్మించాలని పార్టీ నిర్ణయించింది. ఈ సంస్థలుకూడా స్టేట్ కాంగ్రెస్ తోపాటే పనిచేయాలని, స్టేట్ కాంగ్రెస్ యొక్క విధానాలను, నైజాం దుష్ట పాలనకు వ్యతిరేకంగా సంస్థాన వ్యాపిత సమరశీల పోరాటాలను బలపరిచేట్లు, పెంపొందించేట్లు సాధ్యమైనంత మేరకు తీర్చిదిద్దటానికి ప్రయత్నించాలనికూడా నిర్ణయించింది.

1940 లో ఆంధ్ర మహాసభ ఏడవసభ మల్కాపురంలో జరిగింది అందులో యువ నాయకత్వం ఏకమైంది. పార్టీ నాయకుడు శ్రీ రావి నారాయణరెడ్డి మొట్టమొదటిసారిగా చిలుకూరులో జరిగిన 8 వ మహాసభకు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. ఆంధ్ర మహాసభ గ్రామ స్థాయిలోనున్న ప్రజలలో సయితం వేరూనింది. వారి దృష్టిని ఆకర్షించింది. ఈ సభలో, అది కేవలం తీర్మానాలు మాత్రమే చేసే సంప్రదాయాన్ని అతిక్రమించింది ఈ తీర్మానాల ప్రాతిపదికగా ప్రజలను ఉత్తేజపరిచి, సమీకరించటానికి పూనుకుంది. ఈ ఉద్యమాన్ని ప్రజలలోకి తీసుకుపోవటంలో కమ్యూనిస్టు పార్టీ అవిరళమైన కృషి చేసింది. ఆంధ్ర మహాసభలోని మితవాదులు అందుకు వ్యతిరేకం. కమ్యూనిస్టుల నాయకత్వాన ఆంధ్ర మహాసభలో వామపక్షీయులు ప్రజాసమస్యలను చేపట్టి ముందడుగు వేశారు. వెట్టివిధానం రద్దు కావాలని విపరీత కౌలురేట్లు రద్దుకావాలని, కౌలుదార్లను బేదఖల్ చేయరాదని భూమిని సాగుజేస్తున్న వారికే పట్టా హక్కులు దఖలుపరచాలని, జాగీర్దారీ విధానాన్ని రద్దుచేయాలని, పన్నులను, కౌళ్ళను బాగా తగ్గించివేయాలని, నిర్బంధంగా సర్వే సెటిల్‌మెంట్లు జరపాలని, హక్కి – మాలిక్నాపేర కల్లు గీసే చెట్లపై విధించే పన్ను రద్దుచేయాలని, సంస్థానంలో పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలని వారు డిమాండ్ చేశారు. ఈ డిమాండ్లు అండగా ప్రజలను సమీకరించారు.

శ్రీ రావి నారాయణరెడ్డి అధ్యక్షతన 1944 లో భువనగిరిలో జరిగిన ఆంధ్రమహాసభ 11 వ మహాసభలో చీలిక వచ్చింది. మితవాద వర్గం సంస్థనుండి వైదొలగి వేరే సభ జరుపుకుంది. ఆంధ్రమహాసభ తెలంగాణా ప్రజల నిజమైన నాయకత్వ సంస్థగా రూపొందింది. 1945 లో ఆంధ్రమహాసభ 12 వ మహాసభ –చివరి మహాసభ యుద్ధకాలంలో ఖమ్మంలో జరిగింది. తమ డిమాండ్ల కోసం చురుకుగా పోరాడవలసిందిగా ఆ మహాసభ ప్రజలకు పిలుపు నిచ్చింది.

## రెండవ ప్రపంచయుద్ధం – హైదరాబాదు సంస్థానంలో ప్రజాపోరాటాలు

1939లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. 1941 జూన్‌లో హిట్లరు సోవియట్ యూనియన్‌పై దండయాత్ర చేయటం; హిట్లరు మూ

లతో మిలాఖత్తయి జపాన్ సామ్రాజ్యవాదులు అమెరికన్ నౌకాస్థావరమగు పెరల్ హార్బరుపై దాడిజేసి, అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి స్థావరాలకు వ్యతిరేకంగా పసిఫిక్ యుద్ధాన్ని ప్రారంభించటంతో అది ప్రపంచ మంతటికి వ్యాప్తి చెందింది.

భారత జాతీయ నాయకత్వంతోను, ఎన్నికయిన శాసన సభలతోను సంప్రదించనయినా సంప్రదించకుండానే, భారతదేశం యుద్ధంలో చేరినట్లుగా బారతదేశపు బ్రిటిష్ పాలకులు ప్రకటించారు. కేంద్రంలో జాతీయ ప్రభుత్వం ఏర్పరచాలని, ఆ విధంగా ఏర్పాటు చేయబడిన జాతీయ మంత్రివర్గం నిర్ణయాల కనుగుణంగా బ్రిటిష్ వైస్రాయి వ్యవహరించాలని తాము చేస్తున్న డిమాండ్‌కు అంగీకరించేటంతవరకూ, యుద్ధానంతరం అధికారాన్ని పూర్తిగా ఒప్పగించటం జరుగుతుందని వాగ్దానం చేసేటంతవరకూ, బ్రిటిష్‌వారి యుద్ధ ప్రయత్నంతో సహకరించరాదని భారత జాతీయ కాంగ్రెస్ నిర్ణయించింది. రాష్ట్రాలలోగల కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేయవలసిందిగా కోరింది. బ్రిటిష్ ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చేందుకుగాను వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించింది.

పసలేని వ్యక్తి సత్యాగ్రహోద్యమాన్ని బ్రిటిష్ ప్రభుత్వం పెద్దగా లెక్కలోకి తీసుకోకుండా, తన యుద్ధప్రయత్నాన్ని కొనసాగించింది. భారతదేశపు వనరులను, మానవబలగాన్ని ఉధృతంగా దోచుకోనారంభించింది. యూరోపా, ఆఫ్రికా, పశ్చిమఆసియాలలోని అనేక కీలకరంగాలకు, ఆ తర్వాత బర్మా, మలయా మొదలైన దేశాలకు, బ్రిటిష్ ప్రభుత్వం తరఫున పోరాడడానికి భారతీయసైన్యాన్ని పంపించారు. సుభాస్‌చంద్రబోస్ నాయకత్వాన, భారత జాతీయ కాంగ్రెసు సమరశీల విభాగం, కాంగ్రెసు నాయకత్వం తీసుకుంటున్న ఈ పసలేని చర్యలను వ్యతిరేకించింది సమరశీల ప్రజాఉద్యమం నిర్వహించాలని వారు కోరారు. సుభాస్‌బోస్ మారువేషంతో భారతదేశం వదచివెళ్ళిపోయాడు. ఆతర్వాత జపాన్‌వాళ్ళ తోడ్పాటుతో భారత జాతీయ సైన్యాన్ని ఏర్పాటుజేశాడు 1942-44 మధ్యలో మణిపూర్, అస్సాములలోకి ఆ సైన్యాన్ని నడిపాడు.

బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని పూర్తిగా కూలద్రోయటం కోసం, తన "కార్మికవర్గ పంథా"లో సమరశీల పోరాటం సాగించాలని భారత కమ్యూనిస్టుపార్టీ నిర్ణయించింది. పార్టీ అజ్ఞాతవాసానికి వెళ్ళి రహస్యంగా పనిజేయవలసివచ్చింది. అది ఒక చిన్న శక్తిగా మాత్రమే వున్నందున, అత్యధిక రాష్ట్రాలలో ప్రచారంమాత్రమే సాగించగలిగింది ఆంధ్రలో "స్వతంత్రభారత్" అనేపేరుతో రహస్యంగా ఒక పత్రికను నడిపింది. ఆ పత్రిక రెండువేల ప్రతులు

రాష్ట్రమంతటా అనేక గ్రామాలకు చేరుతుండేవి. రహస్యనిర్మాణంద్వారా, ఈ సమరశీలపంథా ననుసరించడం, బ్రిటిష్ సామ్రాజ్యవాద యుద్ధప్రయత్నానికి వ్యతిరేకంగా ప్రచారం సాగించడం కారణంగా పార్టీ ప్రతిష్ఠ బ్రహ్మాండంగా పెంపొందింది

అయితే, సోవియట్ యూనియన్‌పై హిట్లరు దండయాత్ర చేయటం, సోవియట్ యూనియన్‌లోకి హిట్లరు సైన్యాలు చొచ్చుకుపోవడం జరిగింది. ఆ తర్వాత మనదేశంలోను, వలసదేశాలలోనూ బ్రిటిష్ సామ్రాజ్యవాద అధిపత్యానికి వ్యతిరేకంగా గట్టిగా పోరాడుతూనే, హిట్లరు–ముస్సోలిని–టోజో ఫాసిస్టు త్రికూటమినీ, సోషలిజానికీ, ప్రపంచప్రజాతంత్రశిబిరానికీ కోటగా నున్న సోవియట్‌పై సాగిస్తున్న దాడిని ఓడించడంకోసం కృషి చేయవలసిన అవసరమేర్పడింది. సోవియట్ యూనియన్‌కు, దాని మిత్రరాజ్యాలకు సహాయపడడంకోసం కార్యక్రమాన్ని రూపొందించుకోవడం ప్రజాతంత్ర వాదులందరికీ ప్రత్యేకించి కమ్యూనిస్టు ఉద్యమానికి కర్తవ్యంగా ముందుకొచ్చింది.

శ్రీ జవహర్లాల్ నెహ్రూ, కాంగ్రెసులోని ఆయన అనుచరులూ, యుద్ధప్రయత్నాన్ని బలపరచటానికి, సోవియట్ గెలుపుకు తోడ్పడటానికి అనుకూలురే. అయితే ఆ తోడ్పాటు పటిష్ఠంగా ఉండటం కోసం, భారత దేశ ప్రజలను ఉత్సాహపరచి యుద్ధప్రయత్నాలలో పాల్గొనేటట్లు చేయడానికి భారత నాయకులకు అసలయిన అధికారాన్ని ఆచరణలో అప్పగించాలనీ యుద్ధానంతరం పూర్తి రాజకీయాధికారాన్ని ఒప్పగించడానికి నిశ్చితమైన ఏర్పాటు జరగాలని వారు పట్టుబట్టారు. బ్రిటిష్ వాళ్ళు ఇరకాటంలో వున్న ఈ సమయం, వాళ్ళపై సాధ్యమైనంత ఎక్కువ ఒత్తిడి ప్రయోగించడాని ఎక్కువ రాయితీలు పొందటానికి అదునైన సమయమని భారత జాతీయ కాంగ్రెసులోని మరికొంతమంది నాయకులు భావించారు. భారత జాతీయ కాంగ్రెస్ నాయకత్వం కోరిన ఈ కనీస కోర్కెలనయినా అంగీకరించడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సిద్ధంగా లేరు. దానితో, 1942 వ సంవత్సరంలో క్విట్ ఇండియా వుద్యమం ప్రారంభించబడింది. ఈ వుద్యమాన్ని బలప్రయోగంతో అణచివేసేందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తీవ్రమైన నిర్బంధకాండను సాగించారు.

సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడి అనంతరం ఆరుమాసాలకు 1941 డిసెంబరులో, కమ్యూనిస్టుపార్టీ నూతన పరిస్థితిపై తన అంచనాను ప్రకటించింది. శీఘ్ర నిర్ణయానికి రావటం అనాడు కమ్యూనిస్టుపార్టీకి అంత సులభం కాదు. 1939 నుండి 1941 వరకు ఆ యుద్ధం రెండు సామ్రాజ్యవాద రాజ్యాల మధ్యనే జరిగింది. అందులో ఒకటి ఫాసిస్టు ముఠా. కాని

సోవియట్ యూనియన్‌పై హిట్లర్ దాడిజరిపిన తర్వాత – సోవియట్ యుద్ధం లోకి ఈడ్వబడిన తర్వాత, ఆ యుద్ధం మునుపటివలె రెండు సామ్రాజ్యవాద కూటాలమధ్య యుద్ధంగా మాత్రమే కొనసాగడంలేదని పార్టీకి స్పష్టమైన అవగాహనవుంది. ఆ నాడు ప్రపంచంలోవున్న ఏకైక సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్‌పై హిట్లరు–ముస్సోలినీ ఫాసిస్టుకూటమి దాడిజేయటం, ప్రపంచ ఆధిపత్యాన్ని సాధించుకొనే పథకంలో భాగమే. వీరికుట్రలను దృఢనిశ్చయంతో ఎదుర్కొంటున్న సోవియట్ యూనియన్‌ను నాశనం చేయటంద్వారా ప్రపంచ ఆధిపత్య సాధనకు మార్గాన్ని సుగమం చేసుకోవాలని తెంపరితనంతో ఒక పథకం ప్రకారం వుద్దేశపూర్వకంగా జరిపిన చర్యయే ఇది.

జర్మన్ సామ్రాజ్యవాదులను పెంచిపోషించి, వాళ్ళకు ఆయుధాలు సమకూర్చి, సోవియట్ యూనియన్‌పై దాడిజేయించడానికి రెండుదశాబ్దాల పాటు అమెరికా సామ్రాజ్యవాదుల మద్దతుతో బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్య వాదులు తాము చేయగలిగినదంతా చేశారు. కాని తాము ఆశించినతీరుగా గాక, హిట్లరు ముందుగా తమపైనే దాడిచేశాడు. ఆ తర్వాత సోవియట్ యూనియన్‌పై హిట్లరు దాడిజేసేలోపల వీరు దాదాపుగా చితైపోయారు. హిట్లరుపై ఆ రెండు సంవత్సరాల యుద్ధంఅనంతరం ఈ రాజ్యాలు హిట్లరుకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్‌తో సహకరిస్తామని పొత్తుపెట్టుకుంటామని ప్రకటించక తప్పలేదు. సోవియట్‌కు వ్యతిరేకంగా హిట్లరుతో చేతులుగలప దలచుకున్నా లేదా తటస్థంగా ఉంటామనుకున్నా ఆ దేశాలలో ప్రజలు సాగనిచ్చేవారు కాదు.

అందువల్ల హిట్లరు ఫాసిస్టు కూటమిపై సోవియట్ యూనియనూ, దానితో మైత్రి నేర్పరచుకున్న బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ సామ్రాజ్యవాద రాజ్యాలూ విజయం సాధించటం, ప్రజాతంత్ర శక్తులను కాపాడు కోడానికి, ప్రపంచమంతటా అవి విజయం సాధించుకోడానికీ అవసర మైంది. తాము విషమస్థితిలో వున్నప్పుడే తమ వలసదేశాలలోని జాతీయ విమోచన పోరాటాల నాయకులతో సర్దుబాటు చేసుకొనటానికి నిరాకరిస్తున్న బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదరాజ్యాలు హిట్లరుపై విజయం సాధించిన తర్వాత తమ వలసలపై ఆధిపత్యాన్ని వదులుకొంటాయన్న హామీ ఏమిటి? సోవియట్ యూనియన్, దాని మిత్రరాజ్యాలూ హిట్లరుపై విజయం సాధించ డానికి చేయగలిగిందంతా చేయటం, అదేసమయంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చేతుల్లోనుండి భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడం అనే ద్విముఖ

కర్తవ్యాన్ని సమన్వయ పరచటమెలా? పార్టీకి ఈ సందిగ్ధస్థితి ఎదురైంది. ఈ పరిస్థితినంతా పరిశీలించి పార్టీ కార్యాచరణ పంథాను నిర్ణయించుకుంది.

ఈ యుద్ధం ఇంకెంత మాత్రం సామ్రాజ్యవాదయుద్ధంకాదు. అదొక ప్రజాయుద్ధంగా మారింది. సామ్రాజ్యవాదులినాడు ప్రజల శిబిరంలో నిర్బంధితులు. ఈప్రజాయుద్ధ విజయం, మన దేశంతోపాటు, ఆనాడు సామ్రాజ్యవాదుల అధీనంలోగల ఇతర వలసదేశాలన్నీ విమోచన పొందటానికి దోహదపడుతుంది. అందువల్ల, సోవియట్ యూనియన్ విజయానికి తోడ్పాటునందించుటకుగాను యుద్ధానికి సంపూర్ణసహకారం, యుద్ధ ప్రయత్నానికి భారతదేశ ప్రజలను వుత్తేజపరచి సమీకరించటానికి ఏకైకమార్గమైన జాతీయ ప్రభుత్వ నిర్మాణం కోసం వుద్యమం సాగించాలని నిర్ణయించింది.

అయితే బ్రిటిష్ ప్రభుత్వం ఈ డిమాండ్‌ను అంగీకరించక నిరాకరించింది కాంగ్రెస్ నాయకులను జైళ్ళలో నిర్బంధించింది. నిర్బంధకాండతో వరిపాలన సాగించ నారంభించింది. ప్రజలపై బ్రిటిష్ ప్రభుత్వం సాగిస్తున్న ఈ నిర్బంధకాండకు హింసాకాండకు వ్యతిరేకంగా మనపార్టీ ఆందోళన సాగించింది. కాంగ్రెసు నాయకుల విడుదలకోసంగూడా మనం వుధృతంగా ఆందోళన సాగించాం ఈ డిమాండ్ల కోసం ఆందోళన గావిస్తున్నామనే కారణంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన కార్యకర్తలను, అభిమానులను కూడా చాలా మందిని జైళ్ళలో నిర్బంధించారు

అయితే అది చాలదు. అధికారాన్ని నిజంగా వదిలి వేయటంద్వారా జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచటానికి బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించినందుకు దానికి వ్యతిరేకంగాను అది సాగిస్తున్న నిర్బంధకాండకు వ్యతిరేకంగాను పోరాటంలో మన పార్టీ తీవ్రంగా పాల్గొని వుండవలసింది. అదే సమయములో, హిట్లరు, జపానులుగావించే యుద్ధానికి ఏమాత్రము తోడ్పడరాదనీ, వాళ్ళు మనదేశాన్ని ఆక్రమించుకొనసారంభించినచో వాళ్ళను ప్రతిఘటించటానికికూడా మన సమరశీల ప్రజలు తయారుగా వుండాలని ప్రజలలో మనము ప్రబోధం చేస్తూ వుండాల్సింది.

కాని బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా అలాంటి పోరాట మేది సాగించినా, అది సోవియట్ పక్షపు యుద్ధ ప్రయత్నాన్ని బలహీన పరుస్తుందని, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో దాని విజయానికి విఘాతం కలుగచేస్తుందని మన పార్టీ మితిమించి భయపడ్డది.

జాతీయ ప్రభుత్వ డిమాండ్‌కు బ్రిటిష్‌వాళ్ళను అంగీకరింపచేయటం కోసం కాంగ్రెసు–ముస్లింలీగు ఐక్యత కావాలనికూడా పార్టీ కోరింది. ఈఐక్య

తను సాధించాలన్న ఆదుర్దాలో, జాతుల స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని పార్టీ తప్పుడుగా అన్వయించింది. పాకిస్తాన్ కావాలన్న ముస్లింలీగు డిమాండు న్యాయమైనదని వాదించింది. ఆ హక్కును అంగీకరించినప్పుడే, అధికసంఖ్యాకులుగానున్న "హిందూజాతి" తమపై ఆధిపత్యం చెలాయిస్తుందన్న ముస్లిముల భయాలు అదృశ్యం కాగలవని, తద్వారానే భారతదేశ ఐక్యతను కాడాడటం, సంఘటిత పరచటం సాధ్యమవుతుందని పార్టీ వాదించింది.

ప్రత్యేక పాకిస్తాన్‌రాజ్యం కావాలనే ముస్లింలీగ్‌కోర్కెలోగల వేర్పాటుధోరణిని పార్టీ గమనించి ఆ వేర్పాటుధోరణికి వ్యతిరేకంగా పోరాడలేదు. అధికారాన్ని ఒప్పగించటానికి నిరాకరిస్తున్న బ్రిటిషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కాంగ్రెసుతో చేతులుగలిపి పోరాడటానికి ముస్లింలీగు నిరాకరించటంద్వారా ఆచరణలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో చేతులు కల్పడమవుతుందని పార్టీ గమనించలేకపోయింది. జాతీయ స్వాతంత్ర్యంకోసం భారతదేశంలో కార్మిక, కర్షక, తదితర ప్రజానీకంయొక్క ఆర్థికాభివృద్ధికోసం ప్రజాతంత్రకోర్కెలసాధనకోసం, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కలసి పోరాడటానికి, ముస్లింలీగు, కాంగ్రెసుల వెనుకగల జనసామాన్యాన్ని సమీకరించటంపై కేంద్రీకరించివుండవలసినది. దానికిమారుగా, కాంగ్రెసు, లీగుల అగ్ర నాయకత్వంయొక్క ఐక్యతనే మనపార్టీ తన నినాదాలకు ప్రాతిపదికగా చేసుకుంది.

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ ప్రయత్నాన్ని బలపరచవలసిన ఆవశ్యకతను గుర్చి మనపార్టీ ఏకపక్షంగా నొక్కిచెప్పటం జరిగింది. పాకిస్తాన్ అనే వేర్పాటు నినాదానికి వ్యతిరేకంగా పోరాడకుండా, స్వయం నిర్ణయ హక్కును గూర్చి నొక్కిచెప్పటం జరిగింది. ఆ కారణంవల్ల పార్టీ మన దేశంలోగల అనేక సామ్రాజ్యవాద వ్యతిరేక సెక్షన్లకు, యువజనులకు దూరమైంది. మన నినాదాలను, కార్యకలాపాలను — సోవియట్ రక్షణ అవసరాలకు మన స్వాతంత్ర్య పోరాటాన్ని బలిజేయటంగా వారు అర్థం చేసుకున్నారు స్వయం నిర్ణయాధికారం వుండాలని మనం కోరడాన్ని—భారతదేశ సమైక్యతను భంగ పరచడానికి, విచ్ఛిన్నం జేయడానికి జరిగే ప్రయత్నాలను బలపరచటంగా వారు అర్థం జేసుకున్నారు.

అయినా ఆనాడు అంతర్జాతీయ సమస్యలపై మనపార్టీ తీసుకున్న సరైన దృక్పథం, ప్రజల నెదుర్కొంటున్న ఆర్థిక రాజకీయ ఇబ్బందులలో వారితోపాటు మనం నిలిచి నిర్వహించిన ప్రజాపోరాటాలు మనం ప్రజలనుండి మరింత దూరంగాకుండా కాపాడాయి.

హిట్లరుపై సోవియట్ యూనియన్ విజయం సాధించాలనీ జపాన్ సామ్రాజ్యవాదంపై చైనా ప్రజలు విజయం చేపట్టాలని కూడా మన ప్రజలు ప్రగాఢమైన వాంఛ కలిగివున్నారు. మొత్తం భారత జాతీయోద్యమమూ, ప్రత్యేకించి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఫాసిజానికి వ్యతిరేకంగా సాగించిన ప్రచారం గత ఒకటి, రెండు దశాబ్దాలలో ఈ వాంఛను పెంచి, పోషించాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో సోవియట్ యూనియన్ సాగించిన శక్తివంతమైన పోరాటాలు, చైనా ప్రజల వీరోచిత పోరాటమూ, ఈ రెండు దేశాల ప్రజల అగణిత త్యాగాలూ మన దేశంలోగల ప్రతి ప్రజాతంత్రవాదియొక్క, కష్టజీవులందరియొక్క ఈ ప్రగాఢవాంఛను మరింత పెంపొందించాయి. సోవియట్ యూనియన్ విజయం పొందాలని, చైనా ప్రజల విమోచన పోరాటం విజయం పొందాలని మన పార్టీ పూర్తిగా కోరుతున్న విషయం ప్రజలు గమనించారు; అభినందించారు.

ఈ దశలో మన పార్టీ బహిరంగంగా పని చేయగలిగింది. అందువల్ల అశేష ప్రజాసామాన్యాన్ని కలుసుకొని, మన కార్యక్రమాన్నంతటిని గూర్చి, కార్యకలాపాలను గూర్చి వివరించి చెప్పగలిగింది. యుద్ధం పేర మోపబడిన భారాలకు వ్యతిరేకంగా, అవినీతికి వ్యతిరేకంగా ప్రజలకు రక్షణ కల్పించటం కోసం; మన పార్టీ నిర్వహించిన బ్రహ్మాండమైన వుద్యమాలను, వారికి అత్యవసర వస్తువులు అందజేయటంకోసం మనం నిర్వహించిన కార్యకలాపాలు బ్లాక్ మార్కెట్ వ్యాపారస్తులకు, దొంగ నిల్వదార్లకూ వ్యతిరేకంగా, అవినీతిపరులయిన అధికారులకు వ్యతిరేకంగా మనం పోరాడటంవలనా, మరి అధికాహారోత్పత్తి వుద్యమాలు, బెంగాల్ కరువుబాధితుల సహాయార్థం నిర్వహించిన వుద్యమం మొదలైన వాటి నన్నింటినీ ప్రజలు చూచారు. "సమ్మె వద్దు" అనే మన విధానం, దాన్ని అమలుపరచటంలో అనుసరించిన విపరీత రూపమూ కార్మికవర్గంలో చాలా పెద్దభాగం మనకు దూరమయ్యేట్లు చేశాయి. అయితే, అదే సమయంలో మనం వారిని సమర్థించుతుండడమూ, అనేక పాక్షిక కోర్కెల విషయంలో అనేక సందర్భాలలో దోపిడీదార్లయిన పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా వారి పోరాటాలలో పాల్గొనటాన్నికూడా వారు గుర్తించారు. హిందూ-ముస్లిం ఐక్యతకోసం, కాంగ్రెస్-లీగు ఐక్యతకోసం మనం వుద్యమం సాగించటం, ప్రత్యేకించి 1946 వ సంవత్సరంలో మత కలహాలకు వ్యతిరేకంగా మనం కృషి సాగించటం ప్రజలు చూచారు.

ఈ దశలోనే స్వతంత్రమైన వర్గసంఘాలను మనం నిర్మాణంజేయటం ఎంతగానో పేర్కొనదగ్గ అంశం; విజయంకూడా. కిసాన్‌సభ (విజయవాడ నేత్రకోనమహాసభలు), యువజన, విద్యార్థి, అభ్యుదయ రచయితల సాంస్కృతిక

సంఘాల విషయంలో ఇది ప్రత్యేకంగా ద్యోతకమైంది. "సమ్మెలు వద్దు" అనే ... విధానం మన పనిని కుంటు బరచినప్పటికీ, పలుకుబడికి విఘాతం కలిగించి నప్పటికీ కార్మికవర్గంలో సయితం గతంతో పోల్చిచూసుకుంటే, మనపార్టీ కార్యకర్తలు చురుకుగా పాల్గొంటూ వుండే స్వతంత్ర కార్మికవర్గ సంఘాలు పెంపొందటం గణనీయంగా జరిగింది.

"పంచమాంగదళం" అంటూ చౌకపారు విసుర్లు మనపై విసరటం జరుగుతున్నప్పటికీ, మనప్రజలపైన, భారత జాతీయకాంగ్రెసు నాయకులపైన, కార్యకర్తలపైన బ్రిటిష్ ప్రభుత్వం సాగించిన పాశవిక నిర్బంధకాండకు వ్యతిరేకంగా మనంసాగించిన పట్టువిడుపులులేనిపోరాటం, వారినివిడుదలచేయాలని, జాతీయప్రభుత్వాన్ని ఏర్పరచాలని కోరుతూ మనం సాగించినఉద్యమం కొంత మేరకు మనప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలకు సంతృప్తి గలిగించింది. జాతీయ'కాంగ్రెసునాయకులను విడుదలచేయాలనీ జాతీయప్రభుత్వం ఏర్పాటు చేయాలని కోరుతూ మనం ఉద్యమం సాగిస్తున్నందుకుగాను పార్టీ సభ్యులు, అభిమానులు పెద్ద సంఖ్యలో జైళ్ళలో నిర్బంధించబడటాన్ని అనేకసార్లు, అనేకచోట్ల లాఠీచార్జీలకు గురిచేయబడటంకూడా ప్రజలుగమనించారు.

అంతేకాదు మనదేశంలో యుద్ధానంతర ప్రజావెల్లువను మనపార్టీ కొంతమేరకు గమనించింది. అంతకుముందటి తన విధానాలను సవరించుకొంది. ...లెత్తుతున్న ప్రజా పోరాటాలకు సమరశీలమైన అండదండలు సమకూర్చింది. భారత జాతీయ సైన్యానికి చెందిన ఖైదీలను విడుదలచేయాలని కోరుతూ మన పార్టీ వుద్యమం నిర్వహించింది. రాయల్ ఇండియన్ నేవీ తిరుగుబాటును ...లపరుస్తూ బొంబాయి కార్మికవర్గం సార్వత్రికసమ్మె జరిపింది. వివిధ రాష్ట్రా...లో, పట్టణాలలో అనేక హర్తాళ్లు జరిగాయి పోస్టల్, తదితర ప్రభుత్వో...ద్యోగుల అఖిలభారత జనరల్ సమ్మెలో మనం పాల్గొనటం, అందులో మనం ...రుకైన పాత్ర వహించడం, ప్రచారం సాగించడం జరిగింది. వివిధ రాష్ట్రా...లలో రైతాంగ జనసామాన్యం సాగించిన అనేక తిరుగుబాట్లులో మనం ప్రముఖ పాత్ర వహించాం. భారతదేశమంతటా నిరంకుశ స్వదేశీ సంస్థానాధీశులకు వ్యతిరేకంగా సంస్థానాల ప్రజలు సాగించిన పోరాటాలలో మన పాత్ర ప్రత్యేకంగా పేర్కొనదగినది కొన్ని కొన్ని దశలలో కొన్ని బలహీనతలున్నప్పటికీ, మన పార్టీ విధానాలను, కార్యకలాపాలను, ప్రజలు అర్థంజేసుకొనటానికి, అవి సత్యమైనవని గ్రహించటానికి యీ పోరాటాల్లో మన పాత్ర ప్రధానంగా తోడ్పడ్డది.

1946 లో హైదరాబాదు సంస్థానంలో మరింత తీవ్రమైన, సమరశీల ప్రజా పోరాటాలు చేపట్టటానికి, యుద్ధానంతర ప్రజా వెల్లువ వాతావర

ణంలో ఆ పోరాటాలను పెంపొందించటానికి మనకు కొంతమేరకు దోహద పడింది మన పార్టీ యొక్క మార్పు చెందిన విధానమే. అయితే, రెండవ ప్రపంచ యుద్ధం సాగుతున్న కాలంలో, అఖిల భారత స్థాయిలో ఆ నాడున్న మన అవగాహన, విధానాల కారణంగా, మనం నైజాం పాలనను [illegible] లని, భూస్వామ్య విధానం రద్దుకావాలనీ అభ్యుదయకరమైన భూ పంపిణీ జరగాలని స్పష్టమైన నినాదం చేపట్టలేక పోయాం.

సగంమంది ఇత్తెహాద్ ఉల్ ముస్లిమీన్ ప్రతినిధులు, మిగిలా సగంమంది స్టేట్ కాంగ్రెస్ (లేదా ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్తుల) ప్రతినిధులు వుండే ఉమ్మడి కార్యనిర్వాహక సమితి ప్రాతిపదికగా హైదరాబాదు సంస్థానంలో మధ్యంతర ప్రభుత్వం ఏర్పరచాలని, యుద్ధానంతరం ఎన్నికయిన ప్రతినిధులకు అధికారం అప్పగించాలనే నినాదాన్ని చేపట్టాం. జాతీయ రక్షణకోసం, జాతీయ ప్రభుత్వంకోసం కాంగ్రెసు - లీగు ఐక్యత అనే పార్టీ నినాదాని కనుగుణంగానే ఇది వుంది. అయితే స్టేట్ కాంగ్రెస్ [illegible] ప్రజాతంత్ర పార్టీలు దీన్ని వ్యతిరేకించాయి.

హైదరాబాదు సంస్థానాన్ని, నైజాము [illegible] అంత [illegible], దానిని జనతా ప్రజాస్వామ్య భారత దేశంలో విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటక భాషా రాష్ట్రాలలో విలీనం చేయాలనే అసలు డిమాండులో మధ్యంతర చర్యయగు పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వానికి [illegible] ప్రథమ సోపానం మాత్రమేనని చెప్పి మన నినాదాన్ని స[illegible]

హైదరాబాదు సంస్థానంలోను, ప్రత్యేకించి తెలంగాణా ప్రాంతంలో కూడా, మన పార్టీని, ఉద్యమాన్ని నిలబెట్టింది - మనం [illegible] సాగించిన కార్యకలాపాలు, నిర్బంధ చాకిరీకి వ్యతిరేకంగా, అక్రమ నిర్బంధ వసూళ్ళకు వ్యతిరేకంగా, సన్నకారు [illegible] నిర్బంధంగా ధాన్యం లెవీ సేకరణకు వ్యతిరేకంగా పోరాటాలు, అ[illegible] అధికారులచే నిర్బంధంగా, అక్రమంగా యుద్ధనిధి వసూళ్ళు జరపటానికి వ్యతిరేకంగా సాగించిన పోరాటమూను. నిరుపేద వర్గాలపై ఈ పీడనను, [illegible]రాలను మోపటాన్ని వ్యతిరేకించి పోరాడాం. ఈ భారాలు [illegible] ధనిక వర్గాలపైనేనని డిమాండ్ చేశాం. ధనిక వర్గాలనుండే ఆ వసూళ్ళు జరుపునట్లుగా అనేక సందర్భాలలో అధికారులను ఒప్పించగలిగాం. యుద్ధ భారంనుండి పేదలకు, స్వల్పాదాయవర్గాలకు వెసులుబాటుకోసం మనం సాగించిన కార్యకలాపాలు, మన పలుకుబడిని నిలబెట్టుకొనటానికి, మన బలాన్ని పెంపొందించుకొనటానికి, ఆ తర్వాత యుద్ధానంతర పరిస్థితుల్లో పెద్ద ప్రజాఉద్యమాన్ని నిర్మించటానికి తోడ్పడ్డాయి.

# అధ్యాయం 2

## రైతాంగ విజృంభణ :

## కమ్యూనిస్టుపార్టీ

ప్రజల కనుకూలంగా నైజాం ఏ ఫర్మానాలు జారీ జేసినా వాటిని అమలు జరపాలని, భూస్వాములు, అవినీతిపరులయిన అధికారులు వాటిని నీరుగార్చకుండా చూడాలని మాత్రమే 1940 నుండి 44 వరకు మన పార్టీ, ఆంధ్రమహాసభలో వామపక్ష కార్యకర్తలు ఆందోళన సాగించారు. విజ్ఞాపన పత్రాలు అందించారు. అందువల్ల ప్రజలలో పార్టీకి విస్తారమైన ప్రతిష్ఠ చేకూరింది. మన పార్టీ నాయకత్వాన, వామపక్షశక్తులు ఆంధ్రమహాసభలోకి వచ్చాయి.

జమీందార్లకు, దేశముఖులకు వ్యతిరేకంగా, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా, అక్రమ నిర్బంధ వసూళ్ళకు వ్యతిరేకంగా, సాగుదార్లను తమ భూములనుండి బేదఖలు జేయటానికి వ్యతిరేకంగా, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ఆంధ్రమహాసభ 1944 ప్రారంభంనుండి సమరశీల పోరాటాలనేకం సాగించింది.

ఆయాపోరాటాలలో పాల్గొన్న ఒక నాయకుని కథనంనుండి కొన్ని సంఘటనలను దిగువ పేర్కొంటున్నాను. యుద్ధానంతర దశ ప్రారంభంలో తెలంగాణాలో రైతాంగ జన సామాన్యంయొక్క సమరశీలతనుగూర్చి, దృక్పథాన్ని గూర్చి ఒక అభిప్రాయానికి రావడానికవి దోహదపడతాయి. ఖమ్మం,

వరంగల్, కరీంనగర్ జిల్లాలలోనూ తదితర ప్రాంతాలలోనూ సాగించబడి అలాంటి అనేక పోరాటాలనుగూర్చి వాటిలో పాల్గొన్నవారు వివరించవచ్చు అయితే, దురదృష్టవశాత్తు ఈనాడు ఈ ప్రాంతాలకు చెందిన ముఖ్యమైన ప్రజా పోరాటాలకు సంబంధించిన లిఖిత పూర్వకమైన ఆధారాలేమీ లేవు అయితే, దిగువ వివరించబడిన, ఘటనలు పరిస్థితినిగూర్చి అవగాహన చేసుకో టానికి దోహదపడగలవు .

1. ధర్మాపురం : నల్గొండ జిల్లా, జనగామ తాలూకా ధర్మాపురం జమీందారు పుసుకూరు రాఘవరావు, 80 ఎకరాల మెట్ట, 25 ఎ రాల మాగాణీగల లంబాడి తండాపైకి తన గూండాలను పంపాడు. సంఘ నాయకత్వాన (ప్రజలు ఆంధ్రమహాసభను ప్రేమపూర్వకంగా "సంఘం" అ పిలుచుకునేవారు) అచ్చటి లంబాడీలు ప్రతిఘటించారు. పంటలను కాపాడ కొనటంకోసం పిట్టలపై రాళ్ళు రువ్వటాని కుపయోగించే వడిసెలలు చేతబట్టి గూండాల నెదుర్కొన్నారు. తమ పొలాలలో ఎర్రజెండాలు పాతారు. పొలా చుట్టూ పహరా తిరుగుతూ తమ పొలాలను కాపాడుకున్నారు. గూండాలన పారద్రోలారు తమ పొలాలను దున్నుకున్నారు. అప్పుడు సరికి, ఆ భూమ లను సాగుకు యోగ్యం చేసుకున్నది, కొన్ని తరాలుగా కాలంనుండి సాగ చేసుకుంటున్నదీ ఆ లంబాడీలే. గ్రామంలో అంతటా తన చేతిలో వున్న భూస్వామి ఆ లంబాడీలను వెళ్ళగొట్టలేకపోయాడు. అతని పథకాలు పారలేదు

2. ముంగ్రాయి : జనగామ తాలూకా ముంగ్రాయి గ్రామంలో లంబాడీలు—30 ఎకరాల మాగాణీ 40 ఎకరాల మెట్ట బంజరుభూమిని సాగు లాయకు చేసుకున్నారు ఆ భూమిని సాగుచేసుకుంటూ జీవిస్తున్నారు. కడా నరసింహారావు అనే భూస్వామి ఈ లంబాడీలకు ఉద్వాసన చెప్పి, ఆ భూమి తన పేర నమోదు చేయించుకున్నాడు. తమ పొలాలను తిరిగి సాధించుకో లని లంబాడీలు కృతనిశ్చయులైనారు. సంఘం నాయకత్వాన, చుట్టుప్రక్క నున్న పది గ్రామాల తోడ్పాటుతో దాదాపు మూడువేలమంది ప్రజల తమకుగల ఏకైక ఆయుధమైన వడిసెలలు తీసుకొని ఆ పొలాల దగ్గరక నడిచారు. ధర్మాపురం అనుభవం తర్వాత భూస్వాములు తెలివిమీరారు 75 మంది సాయుధ రిజర్వు పోలీసులను తీసుకొచ్చి అక్కడ మకాం పెట్టి చారు. పరిసర గ్రామాల భూస్వాములంతా ప్రోగయ్యారు. వాళ్ళ గూండా లందరినీ సమీకరించారు. కడారి నరసింహారావు స్వయంగా రైఫిల్ చేతబూని గుర్రంపై స్వారీజేస్తూ రంగంలో నిలిచాడు. ఆ విధంగా భూస్వాములు, వా గూండాలు, సాయుధ పోలీసులు ఒకవైపున—కర్రలు చేతబట్టుకొని, ఎర్రజెండా లెగురవేస్తూ నడిచిన మూడువేలమంది ప్రజలు మరోవైపున తలపడ్డారు. దృ

నిశ్చయమైన ప్రజాసమూహం ఎదురు నిలిచేసరికి, భూస్వాములు, వారి గూండాలూ సాయుధ పోలీసుల వెనుక రక్షణ తీసుకున్నారు. తమ రైఫిళ్ళను ప్రజలపైకి ఎక్కుపెట్టవలసిందిగా పోలీసు అధికారి గురుదయాళ్ సింగ్ తన పోలీసులను కోరాడు. అచ్చటినుండి చెదిరిపోకపోతే కాల్పులు జరపవలసిందిగా వుత్తర్వు లిస్తానని ప్రజలను హెచ్చరించాడు. సాయుధ పోలీసుల నెదుర్కొని నిలవటం కష్టమని సంఘం నాయకులు సలహాయిచ్చినమీదట, అయిష్టంగానే అయినా ప్రజలు వెనుకకునడిచారు. పోలీసులు 20మంది లంబాడీలను, సంఘంనాయకులను అరెస్టు చేశారు. వాళ్ళచేతులకు బేడీలువేసి గ్రామా లన్నింటూ వారిని ప్రదర్శించారు. ప్రజలలో భయోత్పాతం కల్పించాలనే వారినావిధంగా ప్రదర్శించారు. ఆ తర్వాత జనగామ తీసుకెళ్ళారు. వారిపై కేసులు పెట్టారు. ఇది తమకు లభించిన విజయంగా భావించి, సంఘం నాయకత్వాన్ని అణచి వేయగలిగామని జమీందార్లు చంకలు గొట్టుకున్నారు.

3. ఎర్రపాడు : నల్గొండజిల్లా సూర్యాపేట తాలూకా ఎర్రపాడు గ్రామ భూస్వామి జన్నారెడ్డి ప్రతాపరెడ్డిపేర లక్షన్నర ఎకరాల పొలం వుంది. ఆయన తన గ్రామాలయిన చిల్పకుంట, ఎడవెల్లి, నూతన్‌కల్లు గ్రామాలకుచెందిన అనేకమంది ప్రజలను వాళ్ళ పొలాలనుండి వెళ్ళగొట్టాడు వారి పొలాలన్నీ తనపేర నమోదు చేయించుకున్నాడు. అయితే సంఘం నాయకత్వాన ప్రజలీగూండాయిజాన్ని సాగనివ్వలేదు. ఈ బడా భూస్వామికి కౌలంచాలు, నజరానాలు యివ్వటం నిలిపివేశారు. వెట్టిచేయటం మానివేశారు. ప్రజలు ఆ విధంగా చేసినందువల్ల జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి ఆగ్రహం కలిగింది. గూండాయిజంద్వారా వారి మనోనిబ్బరాన్ని దెబ్బగొట్టాలనుకున్నాడు కాని ప్రజల ఐక్యతనుచూచి ఆ పని చేయిటానికి సాహసించలేకపోయాడు. కౌలు పొలాలనుండి వెళ్ళగొట్టివేస్తానని ప్రజలను బెదిరించాడు. ఎడవెల్లి గ్రామంలో బెదిరింపును అమలుజరపాలని ప్రయత్నించాడు. అయితే ఆ గ్రామస్థులు, గాజుల రామచంద్రయ్య అనే హరిజనుని నాయకత్వాన జమీందారుకుచెందిన వ్యవసాయ పరికరాలను విరగగొట్టారు ఆతని గూండాలను చితకదన్నారు. వాళ్ళంతా బ్రతుకుజీవుడా అంటూ కాలికి బుద్ధిచెప్పారు ఆతర్వాత మూడు గ్రామాలకుచెందిన 40 మంది ప్రజలపై కేసులు బనాయించారు. వారిని ప్రతి రోజూ కోర్టులచుట్టూ తిప్పారు. ఎర్రపాడు గ్రామంలో దేశముఖుతనగడీలోనే పోలీసుక్యాంపు పెట్టించాడు. పెద్దయెత్తున గూండాయిజం సాగించటానికి సన్నాహాలు ప్రారంభించాడు.

సూర్యాపేట తాలూకాలోని మరొక భాగంలో, పాత సూర్యాపేట గ్రామ ప్రజలు వెయ్యి ఎకరాలుగల మరొక దేశముఖ్ కుందూరు లక్ష్మి

కాంలారావు సాగిస్తున్న అన్యాయాలకు వ్యతిరేకంగా, తమ భూముల నుండి బేదఖలు చేయబడటానికి వ్యతిరేకంగా సమైక్యమై నిలిచారు.

4. బేతవోలు : (నల్లగొండజిల్లా హుజూరునగర్ తాలూకా) చిల్కూరులో ఆంధ్రమహాసభ ఎనిమిదవ మహాసభ జరిగిన తర్వాత 1941-44 సంవత్సరాల మధ్యకాలంలో, బేతవోలు మక్తేదారు తడకమళ్ళ సీతారామ చంద్రరావుకు వ్యతిరేకంగా ప్రజల పోరాటం నూతన స్థాయిని అందుకుంది. ఈ బేతవోలు పోరాటం, ఆ తాలూకా మొత్తంమీదా గొప్పగా గుర్తించబడిన పోరాటాలకే తలమానికప్రాయమైంది. ఆ మక్తేదారు క్రిందగల బేతవోలు, జగ్గిరిపోతుల గూడెం, ఆచార్యులగూడెం, చెన్నారిగూడెం, పోలేనిగూడెం గ్రామాల ప్రజలు ఆంధ్రమహాసభ నాయకత్వాన ఏకమయ్యారు. తక్షణమే సర్వే సెటిల్‌మెంట్ జరగాలని, రైత్వారీ ప్రాంతాలలో అమలులోవున్న హక్కుల పంటినే తమ గ్రామాలకూ విస్తరింపచేయాలని, దోపిడికి స్వస్తి చెప్పాలని వారు డిమాండ్ చేశారు. గ్రామస్థులను అప్పుడు కేసులలో ఇరికించటానికి, ఆ ప్రజలు కోర్టుల నుండి తిరిగి వస్తుండగా దాడులు చేయించటానికి, సంఘ నాయకులను ఒంటరిగా హత్యజేయించటానికి ఈ మక్తేదారు పాల్పడ్డాడు. వేనపల్లి రంగయ్య, అలాంటి దాడి నుండి కాస్తలో తప్పించుకొన్నాడు.

ఈ దాడులుజూచి ప్రజలు బెదిరిపోలేదు. మరింత దృఢనిశ్చయంతో, సమైక్యంగా నిలిచారు సర్వే సెటిల్‌మెంటు జరిగేంతవరకూ మక్తేదారుకు పన్నులు చెల్లించరాదని వారు నిర్ణయించుకొన్నారు. దీనితో మక్తేదారుకు కంపరమెత్తింది. స్థానిక రౌడీలకుతోడు, హైదరాబాదునుండి జహంగీర్‌ఖాన్ అనునతని ద్వారా కొంతమంది అరబ్ కిరాయి గూండాలను కూడా తీసు కొచ్చాడు. కొంతమంది సిక్కురౌడీలనుకూడా రప్పించాడు. ఈ అరబ్ సిక్కు గూండాలనుగూర్చి ఎన్నో కథలు ప్రచారంలో వున్నాయి. అరబ్బులు తమ బళ్ళేలను అతి చాకచక్యంతో ప్రయోగిస్తారని, సిక్కులు తమ జుట్టుముడి నుండి తీసిన చక్రాన్ని ఎవరిమీదనైనా విసిరాగంటే, అతని కంఠాన్ని తెగవేసి తిరిగి స్వంత దారుని చేతిలోకొచ్చివేస్తుందని ఇలాంటివేమేమో కథలు ప్రచారంలో వున్నాయి. ప్రజలను భయకంపితులను గావించటమే వారన్నింటి లక్ష్యం. చేతులలో కత్తులు, పిస్తోళ్ళు, లాఠీలు, తమ బెల్టులలో బాకులు ధరించిన ఆ గూండాలను గ్రామాలవెంట కవాతుజేయించారు. బయటినుండి వచ్చిన ఈ తోడ్పాటుతో ఉత్సాహం పొందినందున, స్థానిక గూండాలు ప్రజలను బీభత్స పరచడం ప్రారంభించారు.

అప్పటికే ప్రజలు తమ బాధల నివారణకుగాను కోర్టులకు, ఆఫీసులకు వెళ్ళటం మానివేశారు. పన్నుల నిరాకరణోద్యమంతోసహా, ప్రత్యక్ష చర్యకు

పూనుకునేందుకు సంసిద్ధులయ్యారు. గూండా దాడులనుండి ఆత్మరక్షణ జేసుకొనటానికికూడా వారు సంసిద్ధమయ్యారు. వారు తమ పశువులను జమీందారు పచ్చిక బీడులోకి తోలుకుపోయారు. ఆ భూములపై తమ హక్కులను పునఃస్థాపించుకొనటానికి ప్రయత్నించారు. జమీందారుకు పుల్లరియివ్వటం మానివేయదలచారు. ఈ ముక్తేదారుకు జెందిన అరువందల ఎకరాల పచ్చిక బీటిలోకి వాళ్ళు తమ పశువులను తోలారు అతని గూండాలు తమపై దాడి చేయగా త్రిప్పికొట్టారు. ముక్తేదారు పోలీసు బలగంతో గ్రామానికి వచ్చాడు. వాళ్ళ సహాయంతో బకాయిలను వసూలు జేసుకోవాలని, ప్రజల ఆస్తిని స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించాడు. అయితే, గ్రామంలోని మహిళలు చీపురుకట్టలు చేతబట్టి, వాళ్ళపై దాడిజేసి పారద్రోలారు. ప్రజల సమైక్య శక్తిముందు ముక్తేదారు గూండాలుగాని, వాళ్ళకు ప్రభుత్వమిచ్చిన తోడ్పాటుగాని ఎందుకూ కొరగాలేదు. 1946 నాటికల్లా, ముక్తేదారుకు గర్వభంగం జరిగింది తలెత్తుకు తిరగలేకపోయాడు. సిగ్గుతో చాటుమాటుగా తిరగవలసి వచ్చింది ఆ 600 ఎకరాల భూమినీ ప్రజలు పంచుకున్నారు. ఈనాటికి (1965) ఆ భూమి ఆ ప్రజల అధీనంలోనే వుంది

5. *బక్కవంతులగూడెం :* ఈ గ్రామంలో భోగాల వీరారెడ్డి ఒక పెద్దభూస్వామి. రొక్కంరూపంలోనో, ధాన్యంరూపంలోనో అధికవడ్డీలు గుంజటం ద్వారానో, ఇతర ఫ్యూడల్ పీడనద్వారానో అతడు అనేక కుటుంబాలను నాశనంచేశాడు. గ్రామాలలో తన దోపిడి సాగించటంలో అతడు తన ఆర్థిక శక్తిని, పోలీసు తోడ్పాటును, మాలీపటేల్ వతన్ హోదాను వుపయోగించు న్నాడు అతనిని ఎదిరించటానికెవరూసాహసించలేదు రొక్కంరూపంలోనో, ధాన్యంరూపంలోనో అత్యధిక వడ్డీలు చెల్లించకపోతే, రైతుల సారవంతమైన భూములనో, పశువులనో, ఎరువుల నిల్వలనో స్వాహాజేసేవాడు. అతని నెవరు వ్యతిరేకించినా, అతని రౌడీల దాడికి గురిగావడం తప్పనిసరి. అతని పీడనను ఎదుర్కొనటంకోసం గ్రామ ప్రజలంతా సంఘ నాయకత్వాన ఏకమయ్యారు. వీరారెడ్డి దోపిడికి సంఘం ఒక ఆటంకంగా తయారైంది అందువల్ల అతడు సంఘంపై కత్తి గట్టాడు. సంఘం నాయకులైన ఇరిగేల లింగారెడ్డి, బలపనూరు బాపనయ్య తదితరులపై తన రౌడీలను ప్రయోగించాడు. పోలీసులవద్ద తనకుగల పలుకుబడి నుపయోగించి, తన గూండాలకు తోడు పోలీసులను కలుపుకుని సంఘాన్ని అణచివేయాలని అతడు ప్రయత్నించాడు. ప్రజల ఆస్తి పాస్తులను, పొలాల్లోని పైరు పంటలను కాజేయటానికి ప్రయత్నించాడు. అయితే, ప్రజలు సమూహాలుగా కూడి, గూండాలకు గుణపాఠాలు నేర్పబూను కున్నారు. ఏవో పాత అప్పులో, బకాయీలో సాకుజూపి తమ పొలాలను

అతడు స్వాధీనం చేసుకోకుండా ప్రజలు అడ్డుకున్నారు. వారు ఈ పోరాటాన్ని మూడు-నాలుగు సంవత్సరాలపాటు సాగించవలసివచ్చింది. అయితే, భోగాల వీరారెడ్డి పీడనకు, దోపిడికి చివరకు స్వస్తి జరిగింది.

**6.** మల్లారెడ్డిగూడెం: అది రైత్వారీ గ్రామమే అయినా, గ్రామాధికారులైన పటేల్, పట్వారీల దోపిడీకి అంతులేకుండా వుంది. ఈ గ్రామ ప్రజలు ఆంధ్రమహాసభ నాయకత్వాన, ఈ దోపిడిని ఎదుర్కొని అంతం చేశారు. దానితో గ్రామాధికారులు రెచ్చిపోయారు. అక్రమ సాగు అని సాకుచెప్పి ఆరువందల ఎకరాల బంజరు భూమినుండి ప్రజలను [illegible] బేదఖల్ చేయటానికి ప్రయత్నించారు. ధాన్యం లెవీలు చెల్లించలేదని ఆరోపణ చేసి వారి పొలాల్లో పండిన పంటనంతా కాజేయాలనికూడా గ్రామాధికారులు తల పెట్టారు. తహశీల్దారు, ఒక పోలీసు బృందాన్ని వెంటబెట్టుకునివచ్చి గ్రామంలో మకాం వేశాడు. తాము కష్టించి పండించుకున్న పంటను అధికారులు స్వాధీనం చేసుకోవటమన్న మాటకే ప్రజలు భగ్గున మండిపోయారు. ఒక వూరేగింపు జరిపి, అధికారుల క్రూర పన్నాగాలను [illegible] [illegible].

నాలుగువేల జనాభాగల ఆ గ్రామంలో [illegible] ముస్లిములు వారంతా రైతులూ, వ్యవసాయకార్మికులూను. గ్రామాధికారుల ఉత్తర్వుల మేరకు పోలీసులు ఇండ్లను సోదాచేయ నారంభించారు. వాళ్ళు ముస్లిముల ఇండ్లను సోదాచేయటానికి పోయినప్పుడు, మహిళలు ముందుకొచ్చారు. తాము ఘోషా పాటించే స్త్రీలమనీ, తమ ఇండ్లలో [illegible] ప్రవేశించటానికి వీలులేదని అటకాయించారు. ఏదైనా సమాచారం కావలసివస్తే, సంఘ నాయకులను మాత్రమే తెలుసుకోనివ్వగలమనీ, [illegible] ఇండ్లను పోలీసులు సోదా చేయటానికి అనుమతించేదిలేదని స్పష్టం చేశారు. ఈ [illegible] దృఢ నిశ్చయంతో గూడిన ప్రతిఘటన ఎదురయ్యేటప్పటికి, గ్రామాధికారులూ జిల్లాఅధికారులు నిప్పుదొక్కిన కోతులయ్యారు. కాని వారేమీ చేయలేక పోయారు. హిందూ, ముస్లిం రైతుల ఐక్యత అంతే [illegible]దారులకు, భూస్వాములకు సింహస్వప్నం అయింది.

7. మేళ్ళచెరువు: పేరుకుమాత్రం రైత్వారీ గ్రామం. గ్రామ జనాభా ఆరువేలు. గ్రామంలోని పొలంలో సగభాగం బంజారాదార్లనబడే బడాభూస్వాముల అధీనంలో వుంది. వాస్తవానికి ఆ భూమియావత్తూ రైతుల చేతనే ఆదినుండి సాగుచేసుకోబడుతూవుంది. బంజారాదార్లకు సర్వహక్కులూ వున్నాయి. కౌలుహక్కులు, స్వాధీనహక్కులు ఈ భూస్వాముల దయాదాక్షిణ్యాలపైనే ఆధారపడివున్నాయి. క్రూరులైన ఈ బంజారాదార్లకు వ్యతి

రేకంగా ప్రజలు పలుమార్లు తిరుగుబాటు చేశారు. అయితే ప్రతిసారీ ఆ తిరుగుబాట్లు అణచివేయబడ్డాయి. భూస్వామి చెన్నూరు వీరభద్రరావుకు వ్యతిరేకంగా ప్రజలను ఐక్యంజేయటంలో ఆంధ్ర మహాసభ చొరవ తీసుకొని ప్రధానంగా కృషిచేసింది. ఆ వీరభద్రరావు తండ్రి రైతులపట్ల అత్యంత క్రూరంగా వ్యవహరించాడు అతని క్రూరత్వానికి ఎరయైన ప్రజలు, పట్టపగలే అతనిని చంపివేసి పగ తీర్చుకున్నారు.

ఆ తర్వాత వీరభద్రరావు, ప్రజల ధోరణిని గ్రహించాడు. రైతులతో ఒక ఒప్పందాని కొచ్చాడు. వారికి శాశ్వత కౌలు హక్కులిచ్చాడు. ఇది ప్రజలకు పెద్ద విజయంగా పరిగణించబడింది.

ఈ విజయం చూచిన తర్వాత, బంజరాదార్ల క్రింద వుండి ఎలాంటి హక్కులు లేని వాళ్ళంతా ఉత్తేజం పొందారు. మేళ్ళచెరువు శివారు గ్రామమగు వెంకటాపురం బంజారాదారగు అక్కిరాజు తిరుమలరావుచే పీల్చి పిప్పి జేయబడిన ప్రజలు ఆంధ్రమహాసభ పతాకంక్రింద నిలిచారు. ఆనాటి జిల్లా కాంగ్రెస్ నాయకుడు, తర్వాత కాంగ్రెస్ మంత్రియునగు శ్రీ ఏ. వాసుదేవ రావు అయన కుమారుడే. తన సంపదను, పోలీసువద్ద తనకుగల బలుకుబడిని వుపయోగించి ప్రజలను బీభత్సానికి గురిజేయ ప్రయత్నించాడు ఏదో ఒక సాకుతో ప్రజల పశువులను బందెలదొడ్డిలో నిర్బంధించటం, తన అడవులనుండి కట్టెలు కొట్టుకెళ్ళారనో, తన పొలంలోనుండి వ్యవసాయ పరికరాలను దొంగిలించారనో తప్పుడు కేసులు బనాయించడంద్వారా ప్రజలను బీభత్సపరిచాడు. అయినా ప్రజల మనో నిశ్చయం చెక్కుచెదరలేదు. వారు మరింత రాటు దేరారు. భోగాల వీరారెడ్డిపై చౌటపల్లి, బక్కపంతులగూడెం గ్రామాల ప్రజలు సాగించిన పోరాటాలు, సాధించిన విజయాలు చూచి, వుద్యమం వుధృతమవుతున్నదని గ్రహించి తిరుమలరావు దిగిరాక తప్పలేదు. ఆంధ్రమహాసభ నాయకత్వాన, ప్రజలు శాశ్వత జిరాయితీ హక్కులతో సహా అనేక కోర్కెలను సాధించుకున్నారు.

ఆ తర్వాత, ఆ తాలూకా ప్రజలు కౌలుదారీ హక్కులకోసం, అనంతగిరి దేశముఖ్ ఫతేపురం కేశవరావుపైన, వెలిదండ్ల, చిలుకూరు గ్రామాల భూస్వాములపైన, దొరకుంటలో జాగిర్దారు మొగలా నాయక్‌పైన పోరాటాలు సాగించారు. వెట్టికి వ్యతిరేకంగా, పోలీసు దురంతాలకు వ్యతిరేకంగా కూడా ప్రజలు పోరాడారు సరిగ్గా అదే సమయంలో సూర్యాపేట, జనగామలలో ప్రజలు పోరాటాలు సాగించి విజయాలు సాధించటం వారి దృష్టిలో వుంది. దానితో వారెంతో వుత్తేజం పొందారు. ఆంధ్ర మహాసభ నిజమైన ప్రజాసంస్థగా అభివృద్ధి చెందింది.

8. ఆల్లీపురం, తిమ్మాపురం: ఇవి వరంగల్ జిల్లాలో అన్వార్ పాషా జాగీరు గ్రామాలు. అచ్చట ప్రజలంతా అతనిక్రింద కౌలుదార్లే. కౌలు రేట్లు తగ్గించాలని, సహేతుకమైన పద్ధతిలో [illegible] వసూలుజేసి భూములకు శాశ్వత యాజమాన్య పట్టాలివ్వాలని, బేదఖల్లు ఆపుజేయాలని డిమాండ్ చేస్తూ, వారంతా ఆంధ్రమహాసభ నాయకత్వాన సమైక్యంగా నిలిచారు. జాగీర్దారు పదిమంది రౌడీలను తన ఇంట్లో పెట్టుకున్నాడు. వాళ్ళకు కర్రలు, కత్తులు, బల్లేలు సమకూర్చాడు. తద్వారా బెదిరింపులతో ప్రజలను లొంగదీయాలని ప్రయత్నించాడు. కరపత్రాలు పంచుతున్న ఆంధ్రమహాసభ కార్యకర్తలను బలవంతంగా జాగీర్దారు ఇంట్లోకి ఈడ్చుకెళ్ళి, చిత్రహింసలు పెట్టారు. ప్రజలు కర్రదీసుకుని జాగీర్దారు ఇంటిపైకి వెళ్ళి, వారిని విడిపించుకొచ్చారు. జాగీర్దారు ఇంట్లోనుంచి పారిపోయాడు. పోలీసులను తీసుకొచ్చి, ఇరవై మందిపై కేసులు పెట్టించాడు.

9. ములకల గూడెం: వేలాది ఎకరాలభూములు గలిగి, హైదరాబాదు సంస్థానమంతటా ప్రసిద్ధిగాంచిన జమీందారు పింగళి రంగారెడ్డి మరికొందరితో కలిసి కుట్రచేసి, పాతబాకీలు తీర్చలేదన్న నెపంతో ములకలగూడెంలో సత్తయ్యకు, ఆయన బంధువులకు చెందిన మెట్ట, మాగాణి భూములను బలవంతాన ఆక్రమించుకున్నాడు. ఆంధ్రమహాసభ నాయకత్వాన ఆ భూమిని తిరిగి సాధించుకోవాలని ప్రజలు నిర్ణయించుకున్నారు. చేతికంది వచ్చిన తమ పంటను దక్కించుకోవాలనికూడా వారు నిర్ణయించుకున్నారు. పరిసరగ్రామాల ప్రజలు వారికి అండగా నిలిచారు. వడిసెలలతో రాళ్ళు రువ్వుతూ జమీందారును, అతని గూండాలనూ గ్రామపొలిమేరలదాకా తరిమికొట్టారు. పొలాల్లోని పంటను దక్కించుకున్నారు. ఆ తర్వాత మూడు లారీలనిండా రిజర్వు పోలీసులను రప్పించారు. వారు నాయకులను అరెస్టు జేశారు. నలభైమందిపై కేసులు పెట్టారు. అయినా, ప్రజలు ఆ పొలాన్ని, ధాన్యాన్ని తమ అధీనంలోనే నిలబెట్టుకున్నారు.

10. నాసికల్లు: ఈ గ్రామంలో వెంగళ నరసింహారెడ్డి అనే భూస్వామి వున్నాడు. ఆయనకు రెండువేల ఎకరాల పొలం వుంది. వెయ్యి ఎకరాల భూమినుండి రైతులను బేదఖలు చేయడానికి ప్రయత్నించాడు. గూండాల సహాయంతో, ఆయన గుండాల కొండయ్య పొలాన్ని దున్నించ నారంభించారు. వెంటనే ప్రజలు ప్రోగయ్యారు. కర్రలు, వడిసెలలు చేతబూని గూండాలను, పోలీసులనూ తరిమికొట్టారు. జమీందారు తన గడీలో దూరి తలదాచుకోవలసి వచ్చింది. గూండాలను ఊరి బయటకు పారద్రోలారు.

పోలీసులను వారి క్యాంపుదాకా తరిమారు. ఆ విధంగా తమ పొలాల్ని కాపాడుకున్నారు.

జనగామ తాలూకాలో, విసునూరు రామచంద్రారెడ్డి, తదితర భూస్వాములు నిర్బంధకాండను అధికం జేశారు. కార్యకర్తలపై అనేక తప్పుడు కేసులను బనాయించారు. అదే సమయంలో ప్రజలపై గూండాలచే దాడులు చెయించారు కడవెండి గ్రామంలో ఆడ గూండాలనుకూడా పోగుజేశారు. ప్రజలు వూరేగింపు జరుపుతుంటే, ఆ వూరేగింపును అటకాయించటానికి ఈ ఆడ గూండాలు ప్రయత్నించారు. వూరేగింపులోని ప్రజలను అసభ్యంగా తిట్టారు అయితే ప్రజలు ఆ ఆడ గూండాలను తరిమివేశారు. సామాన్య రైతుల నుండి లెవీ ధాన్యాన్ని నిర్బంధంగా వసూలు చేయడంకోసం జమీందారు, రివెన్యూ అధికారులను తీసుకొచ్చాడు. అయితే ప్రజలు వీరోచితంగా ప్రతిఘటించారు. కడవెండి గ్రామంలో విసునూరు జమీందారుకు జెందిన 800 బస్తాల ధాన్యాన్ని రివెన్యూ అధికారులకు చూపించారు. ఆ ధాన్యాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని కోరారు ఆ విధంగా కోరటంకోసం ప్రజలు ఛీఫ్ సెక్రటరీ గ్రెగ్ సన్‌ను కలుసుకున్నారు ఈలోగా, ఆ ధాన్యాన్ని ఇతర చోట్లకు తరలించుకు పోకుండా ధాన్యపు కొట్లకు కాపలా కాశారు. ధాన్య సేకరణకై వచ్చిన తహశీల్దారు, ఆ ధాన్యాన్ని తరలించటానికి తోడ్పడటానికి జమీందారుతో మిలాఖతయినాడు. అయితే ప్రజలు ఆ పథకాన్ని వమ్ముజేశారు జమీందారుకు జెందిన ధాన్యపు కొట్లన్నింటిని ప్రజలు చూపించారు ఎట్టకేలకు ఆరువేల బస్తాల ధాన్యం లెవీక్రింద తీసుకుపోయారు.

## తెలంగాణా వ్యావసాయిక తిరుగుబాటును రగిల్చిన అగ్నికణం

జనగామ తాలూకాకు జెందిన దేశముఖ్ విసునూరు రామచంద్రా రెడ్డి అందరిచేత ద్వేషించబడేవాడు. ఆయన, తన గ్రామాలలో ఒకటైన పాలకుర్తిలో సంఘాన్ని గట్టిగా బలపరిచే కార్యకర్తయగు అయిలమ్మ అనే రజక స్త్రీకి జెందిన పొలాన్ని స్వాధీనం జేసుకొనటానికి ప్రయత్నించాడు. పొలాల నుండి పంటను కోయించుకెళ్ళాలని పథకం వేశాడు అంతకుముందే ఆ గ్రామంలో జరిగిన ఒక బహిరంగ సభపైకి, సంఘం నాయకులను హత్య చేయటంకోసం గూండాలను పంపించాడు. అయితే ప్రజలాతని పథకం సాగనివ్వలేదు. గూండా నాయకుడగు ఓనమాల వెంకడుని చితకదన్ని పంపించారు. ఈ సాకుతో భూస్వామి, పధ్నాలుగు మంది సంఘ నాయకులను అరెస్టు చేయించాడు. హత్యా ప్రయత్నం జేసినట్లు వారిపై కేసుపెట్టించాడు. ఈ కేసులో ఆ గ్రామానికి, తాలూకాకు, జిల్లాకు జెందిన సంఘనాయకులు

యిరికించ బడ్డారు. ప్రజలు భయభ్రాంతులకు లోనయ్యారు. ఈ పరిస్థితులలో, తాను అయిలమ్మ పొలాలను స్వాధీనం చేసుకోకుండా అడ్డుపడే వారెవరూ వుండబోరని విసునూరు రామచంద్రారెడ్డి భావించాడు.

అయిలమ్మ పొలంలో పంట కోసుకురమ్మని అడ, మగ నౌకర్లను వందమందిని, వందమంది గూండాలను పంపించాడు. అప్పుడు సంఘ నాయకులు, 28 మంది వలంటీర్లతో బయలుదేరారు. ప్రాణాలకు తెగించి, కర్రలు చేతబట్టుకొని, నినాదాలిచ్చుకొంటూ వెళ్ళి గూండాలపైదాడిచేశారు. ఈ వాలంటీర్లు కర్రలు చేతబూని, ఒక వ్యూహంప్రకారం నడుస్తూండటంజూచి, వారి ముఖాలలో కానవస్తున్న దృఢనిశ్చయాన్నిగాంచి గూండాలు బ్రతుకుజీవుడా అంటూ పలాయనం చిత్తగించారు. ఇంకెవ్వరూ మిగలలేదు. వాలంటీర్లే పంట కోసి అయిలమ్మ యింటికి పంపించారు. ఆ రాత్రే విసునూరునుండి పోలీసులు దిగారు. అయినా, అయిలమ్మ ఇంట్లోవున్న ఆ ధాన్యాన్ని ముట్టుకొనటానికి సాహసించలేదు. ఈ సంఘటన ప్రజలను ఉత్తేజ పరిచింది.

ఆ మరునాడు భీమిరెడ్డి నరసింహారెడ్డి, వకిలం యాదగిరిరావు, నల్లుప్రతాపరెడ్డి, కట్కూరు రామచంద్రారెడ్డిగార్లతోసహా అరుగురు నాయకులను అరెస్టుజేసి, విసునూరు పోలీసు స్టేషనుకు తీసుకుపోయారు. వాళ్ళ చేతులకు, కాళ్ళకు బేడీలువేసి అర్ధరాత్రివేళ, కచేరిచావిడిక తీసుకుపోయారు. అక్కడ వాళ్ళను తీవ్రంగా దెబ్బలు గొట్టారు. వారి తలలు పొయ్యిలలోకి నెట్టారు. వారి అసనాలలో కారం కూరారు. వాళ్ళ నోళ్ళలో మూత్రం పోశారు ఫాసిస్టు పైశాచికచర్యలింకా అనేకం చేశారు. అయితే ఇంత జరిగినా అయిలమ్మ పొలాన్నిగాని, ఆ పొలంలో పండిన పంటనుగాని దేశముఖ స్వాధీనం చేసుకోలేకపోయాడు పేరుమోసిన దేశముఖ్ విసునూరు రామచంద్రారెడ్డిపై సాధించిన ఈ విజయం, మొత్తం తెలంగాణా ప్రజలను ఉత్తేజ పరిచింది, ధైర్యాన్నిచ్చింది. ఇది జరిగిన చాలాకాలం తర్వాతకూడా ప్రజలు ఈ వీరోచిత పోరాటాన్నిగూర్చి కథలుగా చెప్పుకొంటూ, ఆగాథలను గూర్చి పాటలు పాడుకొంటూ వుండేవారు.

## దొడ్డి కొమరయ్య ఆత్మార్పణ; 1946 జులై 4.

పైన పేర్కొన్న సంఘటనతో విసునూరు దేశముఖ్ బాగా రెచ్చిపోయాడు. తన జీవితంలోనే ఎన్నడూ ఎరుగనంతటి ఘోరమైన ఓటమిగా దాన్ని పరిగణించాడు. పోలీసుల సహాయంతో కడవెండి గ్రామానికి చెందిన నాయకులను హత్యచేయాలని పథకం వేశాడు. ఈ పథకంలో భాగంగా అనేక మంది ప్రజలపై కేసులు పెట్టాడు. వారిలో 15 మందిని అరెస్టు చేయించాడు.

వారు తర్వాత బెయిలుమీద విడుదల చేయబడ్డారు. ఆ రోజుల్లో, ఎంత అవ్యవధిగా నయినా సరే, ప్రజలు సంఘం కార్యాలయంవద్ద చేరేవారు. తమ కార్యక్రమాన్ని గూర్చి చర్చించుకునేవారు ఆ విధంగా సమావేశమై చర్చించుకోనటాన్ని అరికట్టేందుకుగాను, వారిపై కోర్టులలో కేసులు పెట్టి భయపెట్టేట్లయితే తన హత్యా పథకాలు అమలుజరవచ్చునని అతడు తలంచాడు. పోలీసు అధికారులు, జమీందారుతోను, అతని గూండాలతోనూ కలిసి మొత్తం పథకమంతా తయారు జేశారు. జమీందారు యథేచ్ఛగా వ్యవహరించటంకోసం వాళ్ళక్కడనుండి వెళ్ళిపోయారు

అది 1946 జూలై 4 వ తేది. తప్పత్రాగిన గూండాలు నాయకుల యిండ్లపై రాళ్ళు విసిరారు. లారీలు, వడిసెలలు, చేతబూని నినాదాలు చేసు కుంటూ ప్రజలు ఊరేగింపు జరిపారు ఆ ఊరేగింపు ప్రధానవీధిలోనేవున్న జమీందారు యింటిదాపుకువచ్చేసరికి, జమీందారు యింటిప్రక్కనే ఒక పాకలో అప్పటికే సిద్ధంగావున్న గూండాలు ప్రజలపైకి కాల్పులు జరిపారు. ఊరేగింపుకు నాయకత్వం వహిస్తున్న గ్రామసంఘంనాయకుడు దొడ్డి కొమ్మ రయ్యకు తుపాకీతూటా పొట్టలోగుండా దూసుకుపోయింది ఆయన అక్కడి కక్కడే మృతిజెందాడు. ఆయన అన్నగారైన దొడ్డి మల్లయ్య కాలికి తూటా తగిల క్రిందపడిపోయాడు మంగలి కొండయ్య నుదుటికి దెబ్బ తగిలింది. అతని సోదరుడు నరసయ్య ముంచేయి గాయపడింది .

అయినా ప్రజలు భయకంపితులై పారిపోలేదు. "రక్తానికి రక్తం" అని నినాదాలు చేసుకుంటూ వారు జమీందారు భవనాన్ని చుట్టుముట్టారు జమీందారు భవనానికి ప్రక్కనే పాకలోవున్న గూండాలది జూచి కంపించిపోయారు. ప్రజల కోపాగ్నినుండి తప్పుకుని బ్రతికి బయటుబడటం సాధ్యంకాదని తలంచారు జమీందారు భవనపు ఎత్తయిన గోడలు తమకు రక్షణ నివ్వగలవని భావించారు. జమీందారు భవనంలోకి దూకారు అయితే ప్రజలప్పటికే ఆ భవనాన్ని చుట్టుముట్టారు. పరిసర గ్రామాల ప్రజలకు కబుర్లు పంపారు. జమీందారు భవనానికి నిప్పంటించడంకోసం ఎండుగడ్డి మోపులతో ప్రజలు వచ్చిపడ్డారు. రెండువేలమంది ప్రజలక్కడ చేరారు. కొంతమంది గడీని చుట్టుముట్టారు. మరికొంతమంది వూరి వెలుపల కాపలా కాస్తున్నారు. యింకా కొందరు గ్రామవీధులలో పహరా తిరుగుతున్నారు. ప్రజలు ఆగ్రహంతో అట్టుడికిపోతున్నారు.

ఈ వార్త విని, విసునూరు రామచంద్రారెడ్డి కొడుకు బాబూరావు (జగన్‌మోహన్) విసునూరునుండి, కత్తులు, బల్లేలు, పిస్తోళ్ళు చేతబూనిన రెండువందలమంది గూండాలను తీసుకొచ్చాడు. గ్రామం వెలుపల కాపలా

కాస్తున్న ప్రజలు వాళ్ళనుజూచి ఆకాశం దద్దరిల్లేటట్లు నినాదాలు చేశారు. వడిసెలలతో రాళ్ళు రువ్వుతూ మూకవుమ్మడిగా గూండాలమీదికి నడిచారు. ఆగ్రహావేశపరులైన జనసామాన్యాన్ని చూచిన గూండాలు, తుపాకి కాల్పులు సయితం ప్రజల పురోగతిని ఆపజాలవని తలపోశారు ప్రాణాలు దక్కితే చాలునని కాలికి బుద్ధిచెప్పి పారిపోయారు. ప్రజలు వాళ్ళను మూడుమైళ్ళ దూరం తరిమికొట్టారు. అనేకమంది గూండాలకు రాళ్ళదెబ్బలు తగిలాయి. వాళ్ళలో చాలమంది, పారిపోతూ మాడాపురం గుండాలో దాగుకున్నారు. అయితే, అప్పటి ప్రజలు పరిస్థితిని గమనించి ఆ గూండాలను తరిమివేశారు. పేరుమోసిన గూండా అనుముల రామిరెడ్డిని ఒకచోట పట్టుకున్నారు. కామ్రేడ్స్ భీమిరెడ్డి నరసింహారెడ్డి, సి. యాదగిరిరావు తదితరుల నోళ్ళలో మూత్రంపోసిన వాళ్ళలో అతడూ వొకడని తెలిసిన ప్రజలు అతనిని వితకదన్ని పంపించారు గూండాలు ఎక్కివచ్చిన బండ్లను ముక్కలు ముక్కలు జేశారు. జమీందారు మామిడితోటలో ఒక్క చెట్టయినా మిగిలకుండా జేశారు

సరిగ్గా అదే సమయంలో 60 మంది రిజర్వు పోలీసులు ఆ గ్రామా నికి వచ్చారు. గూండాలపై తాము చర్య తీసుకుంటామని ప్రజలకు చెప్పారు వారిని అక్కడినుండి వెళ్ళిపొమ్మన్నారు. ప్రజలచ్చటినుండి చెదరిపోయిన తర్వాత గూండాలను సురక్షితంగా జమీందారుకు వొప్పగించారు. ఇదంతా జరిగిన తర్వాత సంఘం నాయకులపై అరుకేసులు పెట్టారు. గూండాలపై దాడి జేశారని, గడీని చుట్టుముట్టారని, దానికి నిప్పంటించటానికి ప్రయత్నించారని, గూండా నాయకుని నోట్లో మూత్రం పోశారని వారిపై ఆరోపించారు. గూండాలలో ఎవరినీ అరెస్టు చేయలేదు. వాళ్ళమీద ఏ కేసూ పెట్టలేదు. అయినా ప్రజలు చలించలేదు

దొడ్డి కొమరయ్య స్మృతదేహానికి, శవపరీక్షానంతరం వేలాది ప్రజలు ఆ గ్రామాలన్నింటా పెద్ద ఊరేగింపు జరిపిన అనంతరం అంత్యక్రియలు జరి గాయి పరిసర గ్రామాల ప్రజలుకూడా ఆ ఊరేగింపులో పాల్గొన్నారు. జమీందారు ఎదుట తాము తలవంచేది లేదని, సంఘంకోసం తామంతా ఇనుమం డించిన శక్తితో పనిచేస్తామని వారంతా ప్రతినబూనారు. ఆ తర్వాత మూడు నెలల కాలంలో వారు, జమీందారు మనుషులను పొలాలలోకి రానివ్వలేదు. పనిచేయనివ్వలేదు. ఈ సంఘటన అనంతరం తమకు ప్రియతమమైన ఈ అమర వీరుని శ్లాఘించే పాటలు పాడుకుంటున్నారు.

కొమరయ్యమరణం, అమరత్వం తెలంగాణా రైతాంగంలో నిద్రాణమై వున్న ఆగ్రహాన్ని ప్రజ్వరిల్ల జేసింది. నల్గొండ జిల్లాలోని అన్ని తాలూకాలలో ప్రజలు ఒక్కుమ్మడిగా విజృంభించారు. జిల్లా అంతటాజరిగే అన్నిసభలలోనూ,

ప్రదర్శనలలోనూ ఈ అమరవీరునికి జోహార్లర్పించే పాట పాడటం జరుగు తుండేది. కర్రలు, వడిసెలలు ధరించిన ప్రజలు ఒక గ్రామానికి చెందినవారు మరొక గ్రామానికి వెళ్లివస్తూ వుత్తేజం కలుగజేసేవారు. వారు వుమ్మడిగా భూస్వామిగడీ ముందు బహిరంగసభ జరిపేవారు. ఎర్రజెండాను ఆవిష్కరించే వారు. "ఇక్కడ సంఘం ఏర్పాటు చేయబడింది. వెట్టి, అక్రమ నిర్బంధవసూళ్లు, బేదఖళ్ళు ఇంకెంతమాత్రం సాగవు" అని ప్రకటించేవారు. భూస్వామిగాని, దేశముఖ్‌గాని సంఘంయొక్క ఈ వుత్తర్వులను అమలుజరపకపోతే అతనిని సాంఘిక బహిష్కారానికి గురిజేసేవారు. అతని పొలాలలో ఎవరూ పనిచేయ టానికి వీలులేదు క్షురకర్మకారులుగాని, రజకులుగానీ, ఇంటిపనివాళ్ళుగాని, ఇతరపనివాళ్ళుగాని ఎవరూ అతనికి ఏ పనిచేయటానికి వీలులేదు. ఈయాత్రను నిర్వహించింది, నిర్మించి వ్యాప్తిగావించింది స్థానిక నాయకులే.

పొరుగు గ్రామంనుండి వచ్చిన ప్రజలకు కులమత వివక్షత లేకుండా, భోజనాలుపెట్టి సత్కరించేవారు. వారికి ఘనంగా వీడ్కోలిచ్చే వారు. దూర గ్రామాలనుండి వచ్చినవారు, వెనుకకు వెళ్ళిపోగా, ఆ గ్రామం నుండి మరి కొంతమంది ఆ యాత్రలో చేరి ప్రక్కగ్రామం వరకు వెళ్ళి వచ్చేవారు

ఈ వూరేగింపులు, జమీందార్ల ఇండ్లముందు నిలిచి, 'జమీందారీ విధానం రద్దుకావాలి,' 'భూస్వాముల పీడనకు, పోలీసు జులుముకు స్వస్తి చెప్పాలి,' "నిర్బంధ ధాన్యసేకరణను, వెట్టిని, అవినీతిని అంతం చేయాలి," "అమరజీవి దొడ్డి కొమరయ్య జిందాబాద్" మొదలగు నినాదాలు చేసేవారు. తమ చేతుల్లోని గూటుపొలన్నింటినీ (కర్రలన్నింటినీ), ఒక్కుమ్మడిగా నేలపై కొట్టి పెద్ద శబ్దంచేసేవారు. ఆ శబ్దం యావత్తు గ్రామాన్ని దద్దరిల్లజేసేది. ప్రజాద్రోహుల గుండెల్లో కంపర మెత్తించేది. "గూటుపొల సంఘం" అని వాళ్ళు పిలుస్తుండే సంఘ నినాదాలు వినపడగానే, ఈ ప్రజాద్రోహులు తమ తలుపులు మూసుకొని లోపల కూర్చొని తాళాలు బెట్టుకునేవారు. ఈ వూరే గింపులలోగల ప్రత్యేక లక్షణాలలో వొకటి ఏమిటంటే, పురుషులతోపాటు స్త్రీలు కూడా తమ గ్రామాలలోనేగాక, ఇతర గ్రామాలలో గూడా పాల్గొ నటం. అయిలమ్మ భూమి పోరాటంపై రాసిన పాటలు మహిళలను అత్యం తంగా ఆకర్షించాయి. మొట్టమొదటిసారిగా; భూమి, బేదఖళ్లు, వెట్టి, నిర్బంధ ధాన్యసేకరణవంటి జీవిత సమస్యలను జమీందారీ రద్దు నినాదాన్ని జోడిం చటం జరిగింది ఈ దశలో ప్రధానమైన అంశమిది.

ఈ ప్రజావుద్యమ వెల్లువలో, ప్రభుత్వం లెవీ ధాన్యం సేకరించ లేకపోయింది. లెవీ ధాన్యం వసూలుజేస్తుండే అధికారులను గ్రామంలో అడు

గయినా పెట్టనివ్వటంలేదు. అదేవిధంగా వెట్టికూడా దానంతటదే అంత మయింది. వెట్టి చేయించుకుంటూ వచ్చిన దేశముఖులు, గ్రామాధికారులు గ్రామాలు వదిలి వెళ్ళిపోవలసి వచ్చింది వాళ్ళు వూళ్ళోనే వున్నా తలెత్తుకు తిరగలేకపోయేవాళ్ళు. కొలది వారాలలోనే ఈ ఉద్యమం నల్గొండజిల్లాలోను, పొరుగునే వున్న వరంగలు (ఖమ్మం) జిల్లాలో మూడు - నాలుగు వందల గ్రామాలకు వ్యాప్తి గాంచింది.

**మూకవుమ్మడి అరెస్టులు, పోలీసు బీభత్సకాండ -**
**దాన్ని ప్రతిఘటించవలసిందిగా పార్టీ, ఆంధ్ర మహాసభల పిలుపు**

1946 వ సంవత్సరం ప్రారంభంలో, మనపార్టీ కేంద్రకమిటీ; యుద్ధానంతరం పెంపొందుతున్న ప్రజావెల్లువను సమీక్షించింది. కార్మిక వర్గానికి, రైతాంగానికి సంబంధించిన ప్రజాపోరాటాలను సహరశీలతత్వంతో పెంపొందించాలని నిర్ణయించింది. బ్రిటిష్‌వాళ్ళకు వ్యతిరేకంగా, సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం రాజీలేని పోరాటం సాగించాలని కూడా నిశ్చయించింది. భారత జాతీయసైన్యానికిజెందినవారిపై పెట్టిన కేసులన్నింటినీ బేషరతుగా ఉపసంహరించుకోవలసిందిగా డిమాండ్ జేసింది. నిజానికది, యుద్ధకాలంలో అనుసరించిన తన సంస్కరణవాద విధానాలను మార్చుకుంది.

యుద్ధం చివరికొచ్చేసరికి కాంగ్రెసు నాయకత్వం విడుదల చేయ బడింది బ్రిటిష్‌వాళ్ళనుండి రాజకీయాధికారంరూపంలో సాధ్యమైనంత ఎక్కు వగా రాయితీలను సాధించుకొనటంకోసం బ్రిటిష్‌వాళ్ళకు వ్యతిరేకంగా పెంపొందుతున్న ప్రజల అసంతృప్తిని సమీకరించటంకోసం తన భవిష్యత్ కార్యక్రమాన్ని కాంగ్రెసు నాయకత్వం నిర్ణయించుకొంటోంది కూడా. బ్రిటిష్‌వారి యుద్ధప్రయత్నానికి సహాయపడ్డారని, "క్విట్ ఇండియా" ఉద్య మాన్ని నీరుగార్చారని తప్పుడు ఆరోపణలుచేసి కాంగ్రెసుసంస్థనుండి కమ్యూ నిస్టులను బహిష్కరించారు. ప్రత్యేక అత్యవసర ఆర్డినెన్సుక్రింద మద్రాసు రాష్ట్రంలో ప్రకాశం మంత్రివర్గం మన ముఖ్య కార్యకర్తలను పెద్దయెత్తున అరెస్టు చేయించింది. ఇతరులు అజ్ఞాతవాసానికిపోవటం తప్పనిసరైంది.

1942 వ సంవత్సరంనాటినుండీ ఈ ప్రజాపోరాటాలు నడుపుతూ, తన స్వంత రాజకీయ పునాదిని పెంపొందించుకుంటూ గడించిన అనుభవాన్నిబట్టి కాంగ్రెస్‌గాని, భూస్వాములుగాని ప్రజలపైకి వుసికొల్పే గూండాల బారినుండి తన కార్యకర్తలకు రక్షణ కల్పించుకొనటంకోసం ప్రజావాలంటీరు దళాలు ఏర్పరచుకోవలసిన అవశ్యకత కలదని మనపార్టీ గమనించింది. ఆంధ్ర

ప్రాంతంలో 1945 నాటికే మనకు సంఘటితమైన దళపోరాటంలో చేతికర్ర నుపయోగించి సమర్ధవంతంగా పోరాడగల సుశిక్షితమైన వాలంటీరు దళాలున్నాయి.

ఆ అనుభవం ప్రాతిపదికగా మనపార్టీ, ఆంధ్రమహాసభ, తెలంగాణా ప్రాంతంలో ప్రజావాలంటీరు దళాలకు శిక్షణగరప నారంభించింది. దేశముఖుల, జాగీర్దార్ల కిరాయిగూండాలు కర్రలు, కత్తులు, నాటుతుపాకులు ధరించి మన కార్యకర్తలపై దాడులుసాగిస్తున్న ప్రాంతాలలో ప్రత్యేకించి ఈ శిక్షణ ప్రారంభించబడింది.

1945, 1946 సంవత్సరాలలో, నల్గొండజిల్లాలో భూస్వాముల గూండాలదాడుల బారినుండి రైతులకు రక్షణ కల్పించటానికి సిద్ధంగానిలచింది సుశిక్షితమైన ఈ వాలంటీరు దళాలే. తమ ఇళ్ళు-వాకిళ్ళను కాపాడుకొనటం కోసం, వందలు వేలసంఖ్యలో రైతుయువకులు కర్రలతో, వడిసెలలతో; మహిళలు కారం, రాళ్లు, మరుగుతున్న నీళ్ళతో రంగంలోకి వచ్చేట్లు చేసింది ఈ వాలంటీరు శిక్షణయే.

1945-46 నాటి ఆ పోరాటాలలో, ఆ సంవత్సరం చివరి భాగంలో సైనహా, రైతుదళాలకు తుపాకులవంటి ఆయుధాలను వుపయోగించడంలో శిక్షణ గిరపటం జరగలేదు. తెలంగాణా గ్రామాలలో ఆయుధాలచట్టం ఖచ్చితంగా అమలు జరగడంలేదు. నాటుతుపాకులు పెద్ద సంఖ్యలో సర్వసాధారణంగా వాడబడుతూవుంటాయి. అయితే, వాటిని వుపయోగించటానికి పూనుకోవలదని వాలంటీరు దళాలను పార్టీ ఆదేశించింది. అలా చేసేట్లయితే పోరాటం పూర్తిగా నూతనదశకు చేరుతుందని, అఖిలబారత స్థాయిలో దాని పర్యవసానాలుంటాయనేదే అందుకు కారణం. సాయుధ పోలీసు దాడులు పదే పదే జరిగిన మీదట, రైతాంగ జనసామాన్యంయొక్క ప్రథమ వెల్లువ అణచివేయబడిన తర్వాత, మన కార్యకర్తలు చెల్లా చెదరైపోవలసి వచ్చింది. పోలీసులు, వాళ్ళ భూస్వామ్య ఏజెంట్లూ గ్రామాలపైన, పొలాలపైనవిస్తారంగా దాడులు ప్రారంభించారు. ఆ తర్వాతనే నాటు తుపాకులుపయోగించవలసింది గాను, వేటతుపాకులు, రివాల్వార్లు, రైఫిళ్ళు మొదలగు ఆయుధాలను సేకరించవలసిందిగాను పొలిట్ బ్యూరో ఆమోదంతో కార్యకర్తలకు పార్టీ అనుమతించింది. ఆత్మరక్షణకోసం ఆయుధాలుపయోగించటానికి అనుమతించింది. ఆ తర్వాతమాత్రమే, కొన్ని చిన్న ఆయుధాలనుపయోగించటంలోను, కొన్ని ప్రాథమిక పోరాట సాధనాలనుపయోగించటంలోను, మందు పాతరలు

నాటుటానికి, బాంబులు తయారు జేయటానికి ప్రేలుడు పదార్థాలనుపయోగించడంలోను, శత్రువుకు జెందిన లక్ష్యాలపై దాడులు జేసే ఎత్తుగడల విషయంలోను పరిమితంగా కొందరు కార్యకర్తలకు శిక్షణ యివ్వటం జరిగింది.

ఆంధ్రమహాసభ కార్యకర్తలను, పార్టీ కార్యకర్తలను మూకుమ్మడిగా అరెస్టు చేయటానికి నైజాం ప్రభుత్వం పూనుకుంది. ఆంధ్రమహాసభకు చెందిన వందలాది సమరశీలురైన రైతులను, వ్యవసాయ కార్మికులను, యువజనులను నిర్బంధించబూనుకుంది. దానితో, సమన్లను, అరెస్టు వారంట్లను ఖాతరు జేయనవసరం లేదని, పోలీసులకు పట్టుబడరాదని, అరెస్టులను ప్రతిఘటించాలని, జెయిల్ ను పాటించవలసిన, ప్రభుత్వం నిర్బంధించదలచినా పట్టుబడని వ్యక్తుల ఆస్తుల స్వాధీనాన్ని, వేలాన్ని ప్రతిఘటించాలని, పెద్దపోలీసు బలగం ఎదురైనప్పుడు వెనకడుగువేసి తప్పించుకుపోవలసిందిగాను, పోలీసులు వెళ్ళిపోయిన వెంటనే తిరిగివచ్చి మామూలు కార్యకలాపాలు సాగించవలసిందిగాను పార్టీ పిలుపిచ్చింది. అరెస్టు కాకుండా తప్పించుకొనటానికి, దాని పర్యవసానాలను ఎదుర్కొనటానికి ప్రదర్శించిన సంసిద్ధతనుబట్టే, సమరశీల పోరాట రూపాన్ని చేపట్టటానికి జనసామాన్యం ఎంత మేరకు సిద్ధంగా వున్నారనేది అంచనా వేయటానికి సాధ్యమవుతుంది. కోర్టులను, వారంట్లను ధిక్కరించటానికి, జప్తులను, వేలాలను వ్యతిరేకించి పోరాడటానికి జనసామాన్యం సిద్ధం గాకపోతే, పైగా కోర్టులకు హాజరు కావాలని, బెయిలు వాంగ్మూలపై బయటబడాలని, తమ తరఫున వాదించుటకు న్యాయవాదులను నియమించుకోవాలనికోరుతూవుంటే, వందల, వేలమందిని కోర్టులచుట్టూ తిప్పుతుండగా, జనసామాన్యాన్ని బీభత్సానికి గురిజేసి వారి మనోనిబ్బరాన్ని సడలించటానికి దాన్నొక మార్గంగా చేపట్టిన స్థితిలో – ఎలాంటి వున్నత పోరాట రూపాన్ని చేపట్టే విషయంగాని, ప్రభుత్వాధికారాన్ని జనసామాన్యం సమరశీల పద్ధతుల్లో వుల్లంఘించే విషయంగాని ఆలోచించటం అర్థరహితం.

తెలంగాణా ఉద్యమాన్ని బట్టి విదితమయ్యేదేమంటే జనసామాన్యం వుత్సాహంతో పిలుపునందుకుంది. ఈ ఆదేశాలను అక్షరాలా పాటించారు. తమ స్వంత చొరవపైనే పోలీసు దాడుల నెదుర్కొనేందుకు సరికొత్త ప్రతిఘటనా రూపాలను రూపొందించుకుంటూ పెద్దఎత్తున కదిలారు. ఈ ప్రతిఘటనా చర్యలలో కొన్నింటిని గూర్చిన సవివరమైన కథనం దిగువ నివ్వబడింది. ఆ దశలో ప్రజా కార్యకలాపాలు, ప్రతిఘటన ఎంత ప్రాథమికదశలో వున్నదీ, ఏ విధంగా ప్రాప్తకాలజ్ఞమైనదీ వాటిని పరిశీలిస్తే విదితమవుతుంది.

## గ్రామాలపై సాయుధ పోలీసుదాడులు - ప్రజల ప్రతిఘటన

జనగామ తాలూకా ధర్మాపురం గ్రామంలో, మేజిస్ట్రేటు 50 మంది రిజర్వు పోలీసులను వెంటబెట్టుకుని దాడిజేసి, అచ్చటి ప్రజల పోరాటానికి నాయకత్వం వహిస్తున్న స్థానిక నాయకుడిని అరెస్టు చేశాడు. ఇరుగు పొరుగునేవున్న కడవెండి, ధర్మాపురం, సీతారామపురం, దేవరుప్పుల మొదలగు గ్రామాలనుండి దాదాపు 15 వందలమంది అక్కడికి చేరారు. తమ నాయకుడిని విడుదల చేయాలని కోరుతూ నినాదాలు చేశారు. కాల్పులు జరుపుతామని పోలీసులు బెదిరించారు. అయినా ప్రజలక్కడినుండి చెదిరిపోలేదు. పోలీసులకు కొలది గజాల దూరంలోనే నిలబడే వున్నారు. ఆ తర్వాత వారి నాయకునకు ఏ విధంగానూ హానిచేయబోమని జనసమూహానికి మేజిస్ట్రేటు, పోలీసు అధికారులు హామీ యిచ్చారు. అదేవిధంగా ఆ నాయకునిచేత కూడా ప్రజలకు చెప్పించారు అప్పుడుగాని, జనసమూహం అచ్చటినుండి కదలలేదు.

అయితే, ఆ తర్వాత నాలుగు గ్రామాలలోను 144వ సెక్షను ప్రకటించారు. కొందరిని అరెస్టు చేయడంకోసం పోలీసులు రాత్రింబవళ్లు దాడులు చేశారు. నల్లా నరసింహులు, మోహనరెడ్డి, మంగలి కొమరయ్య, లింగయ్య మొదలైన వారిని అరెస్టుచేశారు. అరెస్టు చేయబడినవారిపై తీవ్రమైన కేసులు పెట్టారు. పోలీసులకు, దేశముఖులకు లొంగేట్లు చేయటంకోసం పోలీసులు వారిని చిత్రహింసలకు గురిచేశారు. వాళ్ళను పాశవికంగా కొట్టారు. వారి ఆసనాలలో కర్రపుల్లతో కారంకూరారు. వాళ్ళపై వుమ్మివేశారు. వారి నోళ్ళలో మూత్రంపోశారు. వారం రోజులపాటు ఆ విధంగా అత్యాచారాలు, చిత్రహింసలు జరిపినప్పటికీ వారి మనోనిబ్బరాన్ని సడలించలేకపోయారు. తాము సంఘాన్ని వదిలేదిలేదని, సభ్యత్వానికి రాజీనామా యిచ్చేదిలేదని, భూస్వాములముందు తాము మోకరిల్లేది లేదని ఒకే సమాధానం వారి నోటి నుండి పదే పదే వెలువడింది. ఈ ఘటనకు కొంచెంముందు సూర్యాపేటలో కూడా 13 ని మంది అరెస్టు చేశారు.

ఆ తర్వాత ప్రభుత్వం ఎక్కడా, యింకెవరినీ అరెస్టు చేయలేకపోయింది. గృహనిర్బంధంవిధించబడిన వారుగ్కూడా బయటకొచ్చారు పోలీసులకు చిక్కకుండా, ప్రజలమధ్యనే వుండి పనిచేయసాగారు. తమ పార్టీ నాయకులను తాము కాపాడుకోకపోతే, తమనుఆదుకునేవారెవరూ వుండరనిప్రజలు అప్పటికే గ్రహించారు. పార్టీ నాయకులను కంటిపాపలా కాపాడుకున్నారు. ఇదే అనతికాలంలో ఉద్యమరూపం దాల్చింది. పోలీసులు ఏ గ్రామానికివెళ్ళి, మీ నాయకు లెక్కడున్నారో, చెప్పండని ప్రశ్నించినాసరే ప్రజలు తమకు లంబాడీ నాయకులు తప్ప మరేనాయకులు తెలవదని మాత్రమే చెప్పేవారు.

యువకులు, వృద్ధులు, చిన్నపిల్లలు అందరినోటినుండి ఒకే సమాధానం. తమ ఏజెంట్లుద్వారా పార్టీ నాయకుల జాడ తెలుసుకోవడం ప్రభుత్వానికి అసాధ్యమైంది. ఆ ఏజెంట్లెవ్వరూ గ్రామాలలో అడుగుపెట్టటానికి సాహసించటంలేదు. ఎవరైనా అందుకు సాహసించినా ప్రజలు వాళ్ళను చితకదన్ని పంపేవారు గ్రామాలపై ఆకస్మికంగా దాడిజేసి, జాడతెలియని నాయకులను అరెస్టు చేయాలని ఆ తర్వాత ప్రభుత్వం నిర్ణయించింది.

బాలేముల : 1946 నవంబరు చివరి వారంలో, సూర్యాపేట తాలూకా బాలేముల గ్రామంలో పార్టీ నాయకులు ఆశ్రయం పొందివున్నారని తెలుసుకుని, వారిని అరెస్టు చేయటంకోసం పోలీసులు ఆగ్రామంపై దాడి జేశారు వాళ్ళు గ్రామంలో ప్రవేశించి, కామ్రేడ్ మట్టారెడ్డి ఇంటినిచుట్టుముట్టారు. ఆ యింట్లో ప్రవేశించటానికి ప్రయత్నించారు. పోలీసుల రాకను గమనించినమీదట, కామ్రేడ్ మట్టారెడ్డి నిద్రమేల్కొంచాడు కర్రచేతబట్టుకున్నాడు. వాళ్ళను లోపలకు అడుగుబెట్టకుండా అడ్డుకున్నాడు. పోలీసులొచ్చారని హెచ్చరిక చేస్తూ కేకలువేశాడు. ఆయన కేకలు విన్నమీదట, ఇరుగు పొరుగువాళ్ళు కర్రలు చేతబట్టుకుని, నినాదాలు చేసుకుంటూ ఆయన యింటికి పరుగెత్తుకొచ్చారు. ఒక సబ్ ఇన్స్పెక్టరు చెయ్యి విరగ్గొట్టారు. అనేకమంది కానిస్టేబుళ్ళ తలలు పగలగొట్టారు. వాళ్ళ చేతుల్లోని రెండు రైఫిళ్ళనుకూడా విరగగొట్టారు. దీనితో సర్కిల్ ఇన్స్పెక్టరు రెచ్చిపోయాడు. గూటుపా తీసుకొని ముందుకొస్తున్న మట్టారెడ్డిపైన, తదితరులపైన గురిబెట్టి కాల్పులు జరిపాడు. మట్టారెడ్డి తలలోను, పొట్టలోను తూటాలు దూసుకుపోయాయి. "సంఘంకి జై" అంటూ నినదిస్తూ ఆయన అసువులు వీడాడు. మరో ముగ్గురు తీవ్రంగా గాయపడ్డారు. ప్రజలు మృతదేహాన్ని తీసుకోబోయే సరికే పోలీసులు దాన్ని తమ వ్యాన్లో వేసుకుని వెళ్ళిపోయారు. వేగంగా పోతున్న వ్యాన్ను అటకాయించటానికి, ప్రజలు ప్రయత్నించారుకాని, ఆపలేకపోయారు. తమ నాయకుడు మృతిచెందినందుకు, మరికొందరు గాయపడినందుకు తమ హృదయాలలో దుఃఖం పెల్లుబికివస్తున్న ప్రజలు, శత్రువు తమ చేతుల్లోనుండి తప్పించుకు పోయినందువల్ల ఆగ్రహావేశులయ్యారు శత్రువు దాడిని ఎదుర్కొనటంకోసం వారు కర్రలు, వడిసెలలు చేతబూని కాపలాకాశారు. ప్రజల ధైర్య సాహసాలను చవిచూచిన పోలీసులు ఆగ్రామంలో యింకే యితర యింటిపైనా దాడిచేయుటానికి సాహసించలేక పోయారు. ఆ గ్రామంలోని మిగతా పార్టీనాయకులు కాపాడబడ్డారు.

తెల్లవారే గ్రామప్రజలంతా సూర్యాపేట చేరుకున్నారు. శవ పరీక్ష అనంతరం మృతదేహాన్ని తీసుకున్నారు. ఊరేగింపుతో తమ గ్రామానికి తీసు

వెళ్ళి, దహనసంస్కారాలు చేశారు. పది గ్రామాల ప్రజలు వేలాదిగా ఆ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రజల ఆగ్రహం మరింత అధికమయింది. ఈ సంఘటన అనంతరం నాయకులు ప్రజలకిచ్చిన విప్లవసందేశం, తన భర్త మరణానికి ప్రతీకారం తీర్చుకుంటానని మల్లారెడ్డి భార్య ప్రతినబూనటం ప్రజలను ఎంతగానో ఉత్తేజపరిచాయి. వారిలో నూతనోద్వేగం పూరించాయి. తామంతా, అమరవీరుడు ప్రారంభించిన కృషిని కొనసాగిస్తామని, నైజాము, జమీందార్లు, పోలీసులు సాగిస్తున్న నిర్బంధకాండను రూపుమాపుతామని స్మశానవాటికవద్ద వారంతా ప్రతినబూనారు.

ఈ దాడిలోనే ఆ ప్రాంతానికి చెందిన మరొక ముఖ్యనాయకుడు కామ్రేడ్ అనంతరెడ్డి చంపివేయబడ్డాడు. అయితే ఆయన వీరోచిత జీవితానికి, సాధించిన విజయాలకు సంబంధించిన వివరాలు నాకు లభ్యంకాలేదు.

## ప్రజల సన్నాహాలు

సూర్యాపేట తాలూకా పాతసూర్యాపేట, జనగామ తాలూకా దేవరుప్పుల, హుజూర్‌నగర్ తాలూకా మల్లారెడ్డిగూడెం గ్రామాలపై పెద్దఎత్తున పోలీసుదాడులు జరుగుతాయని అనుకున్నారు. ఈ వార్త ప్రజలకు చేరింది. ఈ కేంద్రాలను కాపాడుకోవాలని ప్రజలు వెంటనే నిర్ణయించుకున్నారు. పరిసరగ్రామాల ప్రజలు ఈ గ్రామాలకువచ్చి, స్థానిక ప్రజలతోపాటు రాత్రంతా కాపలాకాచి తెల్లవారి వెళ్ళిపోతుండేవారు. పగటివేళ వ్యవసాయ పనులు, సంఘానికి సంబంధించిన యితరపనులు, రాత్రివేళ కాపలాకాయటం వారి రోజువారీ కార్యక్రమంగా వుంటూవచ్చింది.

సైనిక దాడులెలా వుంటాయో, వారి ఆయుధా లెలావుంటాయో, వారి బలం ఎలావుంటుందో, ఆ దాడుల ఫలితా లెలావుంటాయో పార్టీ కార్యకర్తలకు స్పష్టంగా తెలియదనే విషయాన్ని ఈ సందర్భంగా గుర్తించాలి. కర్రలు, వడిసెలలు చేతబూని, శరీరమంతా గోనెపట్టాతో కప్పుకుంటే రైఫిల్ కాల్పులను ఎదుర్కొనవచ్చుననేదే స్థానిక కార్యకర్తలకుగల అభిప్రాయం. తూటా దూసుకుపోదని, గోనెపట్టాలో చిక్కుకు పోతుందని వారనుకునేవారు! అమాయకమైన ఈ నమ్మకానికి తోడు, బిగ్గరగా నినాదాలుచేసి సైన్యాన్ని భయపెట్టి తరిమివేయవచ్చుననే దింకొకటి. ప్రతి వొక్కరికి ఒక కర్ర చేతిలో వుంటుంది. రాళ్ళు రువ్వటానికి వడిసెల వొకటుంటుంది. పిట్టలను తోలటానికి అది బలమైన సాధనమే. కాని, సాయుధ పోలీసుల రైఫిళ్ళముందు ఎందుకూ కొరగానిదే. గ్రామాలలో రాళ్లు గుట్టలుగా పోగుచేసుకున్నారు పైన పేర్కొన్న గ్రామాలలో ఈ సన్నాహాలు అతివేగంగా సాగాయి ప్రతి ఇంట్లో

ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు పోరాడటానికి ప్రతినబూనారు. ప్రతివీధిలోను రాళ్లు గుట్టలుగా పేర్చివుంచారు. ప్రతి యింట్లోనూ రాళ్లు సిద్ధంగా వుంచుకున్నారు. అదిగాక కారం, రోకళ్లు మొదలయినవన్నీ సిద్ధంజేసుకున్నారు. గ్రామానికి అన్నివైపులా రాత్రింబవళ్ళు కాపలా ఏర్పాటు జేసుకున్నారు. పెద్ద భేరీ నొకదానిని గ్రామకేంద్రంలో పెట్టుకున్నారు. ఆ భేరీ మ్రోత వినబడిన వెంటనే, ఎక్కడున్నాసరే అందరూ తమ తమ ఆయుధాలతో సహా రణరంగంలోకి వచ్చి చేరవలసి వుంటుంది ఈ భేరీనినాదం పరిసర గ్రామాలకుకూడా వినపడేది. వార్తలు పంపటానికి, వార్తలు తెప్పించుకొనటానికి కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరిగాయి. పోలీసుల రాకపోకలకు సంబంధించిన వార్తలను తెచ్చి ఇతర గ్రామాలకు అందించే వార్తాహరులుండేవారు. తాలూకా, జిల్లా నాయకుల సవివరమైన ప్రతి ఆదేశాన్నీ గ్రామ కార్యకర్తలు అమలు జరుపుతుండేవారు. ఆనాడు ప్రజల ధోరణి, వుత్తేజం, క్రమశిక్షణ, విశ్వాసం ఆ విధంగా వుండేవి.

మరో ముఖ్యవిషయమేమిటంటే, గ్రామాలలో శత్రుఏజెంట్లనేవారే లేరు అలాంటివారు గ్రామాలువదలివెళ్ళిపోవటమో, ప్రజాభీష్టానికి తలయొగ్గటమో జరిగింది. మొత్తంమీద అన్నికుటుంబాలూపోరాటాలలో పాల్గొన్నాయి.

## పాతసూర్యాపేటపై దాడి

ఒకనాడు తెల్లవారుఝామున సుమారు మూడుగంటలవేళ సైనికులు తమ లారీలను ఊరిబయట ఆపుకున్నారు. రైఫిళ్ళు, బ్రెన్-గన్లు తదితర ఆయుధాలు చేతబూని నిశ్శబ్దంగా నడిచారు. గ్రామ పొలిమేరలకు ఒక ఫర్లాంగు దూరంలోవుంటూ గ్రామాన్ని చుట్టుముట్టారు. గ్రామానికి యింకా దూరంగా వున్న ప్రధానమైన రోడ్డుమీద మరొక సైనికదళాన్ని దించారు. తెల్లవారే వరకు తమ రాకనుగూర్చి గ్రామస్థులు పసికట్టకుండావుండేట్లు చూడటానికి వాళ్లు అన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. వాళ్ళకు కనిపించిన వాళ్ళందరినీ అటకాయించి, నిశ్శబ్దంగా తమ దగ్గరనే కూర్చుండబెట్టుకున్నారు తెల్లవారేసరికి గ్రామ పొలిమేరలపొడవునా సైన్యం విస్తరించివుండటం కనిపించింది. రణభేరి ఎక్కువసేపు మ్రోగింది. "సంఘంకి జై" అనే నినాదాలు మార్మోగాయి. వడిసెలలు అన్నివైపులా ఉపయోగించబడ్డాయి. వాటినుండి వెలువడిన రాళ్ళు సైనికుల ఉక్కుటోపీలకు టపటపమని తగిలాయి. సైనికులు ఆ రాళ్ళకు అందకుండా కాస్త వెనుకకునడిచారు. దాన్నిజూచి ప్రజలు ఎంతో ఉత్సాహం పొందారు మరింత ముందుకు నడిచారు. నినాదాలు మార్మోగుతుండగా, ఇంకా చాలా రాళ్ళు రువ్వారు. చాలాసేపు ఇలాగే సాగింది. ఈపాటికే,

ప్రజలంతా తమ గ్రామం నుండి వెలుపలికి వచ్చేశారు. ఈ పోరాటంలోగల ప్రత్యేకలక్షణమేమిటంటే, వడిసెలలతో ప్రయోగించటానికి రాళ్ళు అందిస్తూ స్త్రీలు తమ పురుషుల సరసనే నిలబడటం.

ప్రజలు తమ ఆయుధాలనుదించి, తమ నాయకులను ఒప్పగించేట్లయితే, ప్రజలకు ఎలాంటిహాని జరగదని సైనిక అధికారి, కలెక్టరు, స్థానిక భూస్వామి మనుషులూ పదేపదే ప్రకటించారు. అయినా, ఆ మాటలు వినిపించుకునే ధోరణిలో ప్రజలులేరు. దాడి సాగిస్తూనేవున్నారు ఇంతలోనే సైనికదాడి వార్త మెరుపులాగా పరిసర గ్రామాలన్నింటికీ వ్యాపించింది. ఎక్కడి ప్రజలక్కడనే చేతికందిన సాధనాలన్నింటినీ పట్టుకొని గుంపులు గుంపులుగా పురికారు. దూరంనుండి, అన్నివైపులనుండీ వస్తున్న ప్రజలందరినీ సైన్యం ఆపుజేసింది. వాళ్ళంతా గ్రామానికి చేరకుండా ఆటంక పరిచారు.

సైన్యంతోపాటే పటేళ్ళు, పట్వారీలు, భూస్వాముల తాలూకు మనుషులు అక్కడేవున్నారు. ప్రజలను సాంత్వనపరచటానికీ, బెదిరించటానికీ పదేపదే ప్రయత్నించారు. ప్రజలు తమ ఆయుధాలను క్రిందబెట్టకపోతే సైనికులు తమ రైఫిళ్ళను, బ్రెన్‌గన్లను వుపయోగిస్తారనీ, మైలుదూరంలో వున్నవాళ్ళనుకూడా కాము పేల్చివేయగలమనీ, అచ్చట ప్రజలంతా చచ్చిపోతారనీ బెదిరించారు. అయినా ప్రజలు బెదరలేదు ప్రభుత్వమూ, భూస్వాముల తాలూకు మనుషులూ తమను సర్వనాశనం చేశారనీ, వాళ్ళ నింకెంతమాత్రం నమ్మజాలమనీ ప్రజలు చెప్పారు. వడిసెలలు తమ చేతుల్లో వున్నంతకాలం తూటాలు తమనేమీ చేయజాలవనికూడా అన్నారు. ఈ రకంగా మాటలు చాలాసేపు సాగాయి. ప్రజలు నినాదాలిస్తూనే వున్నారు.

పరిసర గ్రామాలనుండి ప్రజలు వచ్చిపడుతూనే వున్నారు అనేక వేలమంది పోగయ్యారు. అయినా, సైనికులు వాళ్ళను గ్రామం దగ్గరకు చేరనివ్వలేదు ప్రధానమైన రోడ్లమీదనే ప్రజా బృందాలలో ఒకదానికి మరొకదానికి మధ్య సైనికులు అడ్డంగా నిలిచారు. సైన్యానికి చుట్టూ ప్రజలు నిలిచారు 15-20 మైళ్ళ దూరానగల గ్రామాల నుండి బయలుదేరిన ప్రజలింకా దారిలోనే వున్నారు. సైన్యానికి, ప్రజలకూ తినటానికి తిండిలేదు. ప్రజలు లొంగేట్లు లేరని గుర్తించిన అధికారుల ఉత్తర్వుల మేరకు సైనికులు గ్రామ ప్రజల మీదకీ, రెండోవైపునున్న జనసమూహంవైపుకు నడిచారు.

సైనికులు ముందుకు నడవటాన్ని ప్రజలు గమనించారు. మరల రాళ్ళ వర్షం కురిపించారు. తమ వద్దగల నాటు తుపాకులు పేల్చారు. సైనికులుకూడా కాల్పులు జరిపారు. పాత సూర్యాపేటకు జెందిన కామ్రేడ్

నరసయ్య, పాతర్లపాడుకు చెందిన కామ్రేడ్ భిక్షమయ్య మృతిచెందారు. మరో ముగ్గురు గాయపడ్డారు ప్రజలు రైఫిలు కాల్పులు, వాటి హోరు చూచారు. అక్కడికక్కడే మరణించటం, గాయపడటం చూచారు. ఆధునిక ఆయుధాలుగల సైన్యం ముందు తమ వడిసెల లెందుకూ పనికిరావని గుర్తించారు. బెదిరిపోయారు. గ్రామంలో అనేకమంది స్త్రీలను, పురుషులను అరెస్టు జేసి, దారుణహింసలపాలు చేశారు. అరెస్టు చేయబడినవారిలో, ఆ గ్రామస్తులకు సహాయపడటంకోసం గత రాత్రి అచ్చటికి వచ్చిన ఇతర గ్రామాలకు చెందిన వారుకూడా వున్నారు అనేకమంది ప్రజలను అరెస్టుచేసి, వేరు వేరు జైళ్ళలో నిర్బంధించారు. అరెస్టు చేయబడినవారిలో, స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువజనులూ వున్నారు.

అదేరోజున బాలేముల గ్రామంపై వందలాది సైనికులు మరల దాడి జేశారు స్వల్పకాలం పోరాటం సాగించిన అనంతరం దాదాపు రెండువందల మందిని అరెస్టుజేసి వేర్వేరు జైళ్ళకు పంపారు.

## దేవరుప్పులపై దాడులు :

సైన్యం పెద్ద సంఖ్యలో వెళ్ళి తెల్లవారుజామున నాలుగు గంటలవేళ దేవరుప్పుల గ్రామాన్ని చుట్టుముట్టింది. పాత సూర్యాపేటలోవలెనే బయటి ప్రజలను వాళ్ళ గ్రామంలోకి పోనివ్వలేదు. ప్రజలు పాత సూర్యాపేటలో వలెనే ప్రతిఘటించారు. స్త్రీలు, వృద్ధులు, యువజనులు అందరూ పోరాటానికి నిలవడం చూచారు. ప్రజలు రువ్విన రాళ్ళవల్ల సైనికులు కొందరు గాయపడ్డారు. ఆ తర్వాత అధికారి వుత్తర్వులమేరకు సైన్యం ప్రజలమీదికి నడిచి, కాల్పులు జరిపింది కడవెండి గ్రామానికి చెందిన ముండాది సోమిరెడ్డి, సీతారామపురానికి చెందిన మరొకరు అక్కడికక్కడే మృతిచెందారు. అనేక మంది గాయపడ్డారు. ప్రజలు చెల్లాచెదరయిపోయారు. సైనికులు తమకు చిక్కినవాళ్ళనెల్లా పట్టుకుని, దారుణంగా హింసించారు. నాలుగువందలమంది ప్రజలను అరెస్టుచేసి వివిధ జైళ్ళకు పంపారు.

మరుసటిరోజున, చాలా దూరప్రాంతాలనుండి సయితం అనేకమంది ప్రజలు అచ్చటికి వచ్చారు. అరెస్టు కాకుండా మిగిలివున్న గ్రామస్తులు, ఇతర గ్రామాలనుండి వచ్చినవారి తోడ్పాటుతో వూరేగింపుజేసి, సభ జరిపారు. సభానంతరం ఇతర గ్రామాలనుండి వచ్చిన ప్రజలు ముంద్రాయి వద్దగల మిలటరీ క్యాంపుపై దాడి చేయాలనుకున్నారు. కాని, సైనికులకు అధునాతన ఆయుధాలున్నాయని, ప్రజలవద్ద ఆయుధాలే లేవని, అలాంటి పరిస్థితిలో ఆ విధంగా దాడి చేయటం వృధా అని నాయకులు వారికి వివరించి చెప్పారు.

అయినా నాయకుల మాట పాటించకుండా, పడిశాల, కొండూరు, తాటిపాముల గ్రామాలకు చెందిన వెయ్యిమంది ప్రజలు నినాదాలు చేసుకుంటూ ముంద్రాయి వైపుకు నడిచారు. కాని, సైన్యం వారిని దూరంగా తరిమివేసింది.

మల్లారెడ్డిగూడెం హుజూర్‌నగర్ తాలూకాలో కృష్ణానదీతీరాన గల ఈ గ్రామం పార్టీ కార్యకలాపాలకు కేంద్రంగా వుండేది. ఈ ప్రాంత భూమి సారవంతమైన నల్లరేగడి నేల. వ్యాపార పంటలు పండుతాయి. అయినా, ఎలాంటి రహదారి సౌకర్యాలు లేవు పటేల్, పట్వారీల పీడనక్రింద అచ్చటి ప్రజలు అన్ని విధాలా వెనుకబడి వున్నారు. వారిపై సాగుతున్న దోపిడి, ఆంధ్రమహాసభ ఆందోళన ఫలితంగా అంతమయింది. దానితో ప్రజలు వుత్సాహపడ్డారు. ఆ సమయంలో జనగామ తాలూకాలో పోరాటాలు తారాస్థాయి నందుకున్నాయి. ఆ పోరాటాలనుండి ప్రజలు గుణపాఠాలు నేర్చుకుంటున్నారు భూస్వాముల గూండాదాడులనుండి, నైజాము సైన్యాలదాడుల నుండి, కొమరయ్యహత్యనుండి పాఠాలు నేర్చుకొన్నారు. తమనాయకత్వాన్ని కాపాడుకోవలసిన అవశ్యకతను గుర్తించారు మల్లారెడ్డిగూడెం ప్రజలు ఆత్మ రక్షణ పద్ధతులు నేర్చుకున్నారు. వ్యక్తులుగాగాని, గుంపులుగాగాని గూండాలు దాడిచేస్తే వాళ్ళ నెదుర్కొనటానికి స్త్రీలు, పురుషులు శారీరకంగాను, మానసికంగానూ సంసిద్ధులయినారు ఆ గ్రామమంతా రాతిచేలతో గూడివుంది. ఇళ్ళన్నీ రాళ్ళలోను, మట్టితోనూ కట్టబడినాయి ఆత్మరక్షణకోసం ప్రతి ఇంటా పైభాగాన రాళ్ళగుట్టలు పోసుకున్నారు. చిన్నవి, పెద్దవి కర్రలు, కారపు కుండలు మొదలైనవి సిద్ధంగా వుంచుకోవాలని ప్రతి ఒక్కరూ నిర్ణయించుకున్నారు. భూస్వాముల గూండాలముందు, పోలీసులముందు, ఒకప్పుడు నిస్సహాయులుగావున్న ప్రజలు, సమైక్యంగా నిలవటంద్వారా బలం చేకూర్చుకున్నారు. ఆత్మరక్షణకు సన్నద్ధమయ్యారు. 1947 డిసెంబరు 29న పది, పన్నెండు లారీలనిండా సైన్యం హుజూర్‌నగర్‌లో దిగింది.

సైన్యం గ్రామాలపైదాడిచేసినప్పుడు, ప్రజలు సైనికులతో సంఘర్షణ పడకుండా నివారించాలని, తప్పుకోవాలని ప్రజలకు ఆదేశాలు పంపబడినాయి. అయితే, స్థానిక నాయకులు ఈ ఆదేశాలనుగూర్చి ప్రజలకు తెలియజేయలేదు. అందువల్ల ప్రజలపోరాట ఎత్తుగడలలో ఎలాంటి మార్పు జరగలేదు. వారు రాత్రంతా కాపలాగాచారు. తెల్లవారుజామున సైన్యం తమ గ్రామానికి రావటం చూచారు. దాడి జరగబోతున్నట్లు హెచ్చరికలు చేశారు. ప్రజలు ఎవరి పనులకు వాళ్ళు వెళ్ళటానికిమారుగా, దాడికి సన్నద్ధమయ్యారు. గ్రామంలోకి ప్రవేశించేరోడ్ల మొగలలో కొందరు, సందులలో కొందరు, ఇండ్లపైకప్పులపైన కొందరు సిద్ధంగా నిలిచారు. గ్రామం వెలుపలికి వార్తలందజేయటానికి,

బయటనుండి వార్తలు తీసుకురావటానికి కొందరు నియోగించబడ్డారు. ఆ విధంగా ప్రతివారూ తమతమపనులలో నిమగ్నమైనారు. మొత్తం గ్రామం యావత్తూ అట్టుడికిపోతోంది. గ్రామంచుట్టూ పొలాలలో జొన్న పెరిగివుంది. సైనికుల సంచలనంగాని, వాళ్ళసంఖ్య ఎంతవున్నదోగాని దట్టంగా పెరిగిన జొన్నపైరు అడ్డంవుండటంవల్ల గ్రామంలోకి కనిపించటంలేదు. సాయుధ సైనికులు పెద్దసంఖ్యలో గ్రామంచుట్టూ మోహరించినిలిచారు జొన్నచేలువాళ్ళు కనపడకుండా కప్పివుంచాయి. ఉభయపక్షాలూ సర్వసన్నద్ధంగా నిలిచాయి.

ముందు జాగ్రత్త చర్యగా గ్రామ నాయకత్వం ఆ రాత్రి గ్రామం నుండి బయటకు వెళ్ళింది. దాడి జరగబోతున్నట్లు హెచ్చరికలువిని గ్రామానికి తిరిగి రావాలనుకున్నారు. సైన్యం గ్రామాన్ని చుట్టుముట్టి వుండటంవలన వారు గ్రామంలోకి రాలేదు నాయకత్వానికి ప్రజలకున్న సంబంధమేదీలేదు. ప్రజలు నాయకులకోసం వేచియుండనూలేదు. ఆత్మరక్షణకు సన్నద్ధమయ్యారు. తెల్లవారుతోంది. ప్రతిఘటనా బలగాలు సైనిక సంచలనాన్ని గమనించాయి. వారు అన్నివైపులనుండి ఏకసమయంలో రాళ్ళురువ్వారు. ఆరాళ్ళు సైనికుల ఉక్కుటోపీలకు తగిలాయి. సైనికులు కాస్తదూరం వెనకకుపోయారు. ప్రజా ప్రతిఘటన బలగాలు ముందుకునడిచాయి. రాతిగోడల చాటున రక్షణ పొందుతూ సైనికులపై మరలా రాళ్ళురువ్వారు. అలసిపోయిన వాలంటీర్లస్థానే, క్రొత్తవాలంటీర్లు రంగంలోకొచ్చారు. వృద్ధులు, పసిపిల్లలు, మహిళలు తమ మగవాళ్ళకు రాళ్ళు, వడిసెలలు అందిస్తున్నారు. గ్రామం నలువైపులనుండి గర్జిస్తున్నారు, సైనిక అధికారులూ ప్రజలనుద్దేశించి మైకులలో ప్రసంగించారు. కాని, ఆ గర్జన ఘోషలో ఆ మాటలు వినిపించలేదు. ప్రజలు దానిని వినిపించుకునే స్థితిలో కూడాలేరు తమ ప్రతిఘటన వారికి వుత్తేజం కలుగజేసింది. అందరికీ మజ్జిగ సరఫరా చేశారు. ప్రతివారూ వంతులవారీగా విశ్రాంతి తీసుకుంటూ ప్రతి ఘటనలో పాల్గొంటున్నారు.

ప్రొద్దెక్కిపోతోంది. అయినా పోరాటానికి అంతంలేదు. పోరాటాన్ని కొంచెంసేపు నిలువుజేసి, అధికారులు చెప్పే దేమిటో వినటంకోసం తమ తరపున ముగ్గురు – నలుగురు పెద్దలను పంపవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి జేశారు. అందుకిష్టం లేకపోతే వెనుకకయినా వెళ్ళిపోవలసిందిగా కోరారు. ఈలోగా ఎక్కడివాళ్ళక్కడనే వుండవచ్చునని చెప్పారు. సంప్రదింపుల కెందుకు వెళ్ళకూడదనే చర్చ ప్రజలలో తలెత్తింది. తమ పోరాటానికి ఏకైక నాయకుడగు ఎర్రబోలు అప్పిరెడ్డిని తమ ఏకైక ప్రతినిధిగా నియమించారు. ఆయన వంద గజాలు ముందుకెళ్ళి, అధికారులతో చర్చలు జరపవలసి వుంది. ఉత్తరంవైపున మాత్రం పోరాటం ఆపవలసియుంది. మిగతా మూడుప్రక్కలా

కొనసాగించవచ్చు. ఉదయం పదిగంటలయింది. అప్పిరెడ్డితోపాటు మరో నలుగురు బయలుదేరారు. వాళ్ళు యాభై గజాల దూరం నడిచారో లేదో సైనికులు వాళ్ళపైకి గురిజూచి కాల్చారు. కామ్రేడ్ అప్పిరెడ్డి అక్కడికక్కడే నేలవాలాడు. ఎదురుగావున్న యింటి అరుగుపైన కూర్చుండివున్న మరొక వ్యక్తికి పొట్టలోగుండా తూటా దూసుకుపోయి మృతిజెందాడు. సరిగ్గా యిదే సమయంలో, గ్రామానికి దక్షిణపు ప్రక్కన పోరాడుతున్న ప్రజలపైనకూడా సైనికులు తుపాకులు కాల్చారు. తన భర్తకు రాళ్ళందిస్తున్న ఒక మహిళకు తూటాదెబ్బ తగిలి మృతిజెందింది. ఇంకా అనేకమంది గాయపడ్డారు. అప్పిరెడ్డి, మరో ముగ్గురు తూటా దెబ్బలతో మృతిజెందటానికి, యింకా అనేకమంది గాయపడటానికి దారిదీసిన ఈ సంఘటన ప్రజలుఊహించింది కాదు అందువల్ల వారు భయవిహ్వలులైపోయారు. సైన్యం ముందుకు దూసుకొచ్చింది. ప్రతిఘటన నిలిచిపోయింది.

సైన్యం ముగాలు మురాలుగా వెళ్ళి అత్యాచారాలు సాగించింది. పట్టుబడిన ప్రజలను కొట్టారు. తాళ్ళతో కట్టి తమ వెంట తీసుకపోయారు. ఉదయం 11 గంటలనుండి మధ్యాహ్నం 3 గంటల వరకూవాళ్ళు స్వైరవిహారం సాగించారు. ఆ తర్వాత స్త్రీలను, పురుషులనూ తమ లారీలలో ఎక్కించుకుపోయారు. అయితే, వాళ్ళను లారీలలోకి ఎక్కించేముందు ప్రజలలోని ముస్లిములను విడదీశారు. వారు పోరాటానికి నాయకత్వం వహిస్తున్నప్పటికీ వారిని వదిలేశారు ముస్లిములకిది ఆశ్చర్యం గొలిపింది. మిగతా సోదరులతో పాటే తామూ లారీలలో ఎక్కుతామని వారు కోరారు అయినా, వాళ్ళమాట వినిపించుకోలేదు. సైనికులు, దాదాపు నాలుగు వందలమంది ముస్లిమేతరులను లారీలలో వేసుకుని వెళ్ళిపోయారు. గ్రామం యావత్తూ సర్వనాశనమైపోయిన స్థితిలోవుంది. మిగిలిన ప్రజలకు వుత్సాహం కల్పించే వారెవరూ లేరు. వదిలి వెళ్ళబడిన ముస్లిములు మృతవీరుల కుటుంబాలను పరామర్శించి, నోదార్చటానికి ప్రయత్నించారు. ఈలోగా, గ్రామంలోని ప్రజావ్యతిరేక శక్తులు, ఇది ముస్లిముల పనేనని, ముస్లిముల ఇండ్లలో సైనికులు యింకా వున్నారని వదంతులు వ్యాపింపజేశారు. దానితో, అమాయక ప్రజల మనసులలో సందేహాలు రేకెత్తాయి. ఆ వదంతులు నిజమేనేమోననుకోనారంభించారు. వెంటనే గ్రామంలోకి రావలదని, మరల తమనుండి కబురందేంతవరకూ వేచియుండవలసిందనీ గ్రామం వెలుపలనున్న నాయకులకు కబురంపారు. ప్రజా వెల్లువ తాత్కాలికంగా విచ్ఛిన్నమైపోయింది. దారుణనిర్బంధకాండవల్ల కార్యకర్తలు చెల్లాచెదరైపోయారు.

## దాడుల అనంతర పరిస్థితి

సైనిక దాడులు అంతటితో ఆగలేదు. మొత్తం జిల్లా అంతటినీ సైన్యానికి వొప్పగించారు. అనేక గ్రామాలలో సైనిక క్యాంపులు ఏర్పాటు చేశారు. అనేక రోజులపాటు, రాత్రింబవళ్ళు దాడులు జరిగాయి ప్రజలపై భీభత్సకాండ సాగింది. గ్రామసంఘం కమిటీ సభ్యులను, వాలంటీరుదళ నాయకులను, సంఘానికిచెందిన ఇతరముఖ్యనాయకులనూ పట్టించవలసిందిగా ప్రజలపై వొత్తిడి తెచ్చారు. సైనికులు ప్రజలను నిర్బంధించి, పొలాలల్లో, నూతులలో, కంచెలలో, తుప్పలలో తదితరస్థలాలలో వెదకటంకోసం తమతో పాటుతీసుకపోతుండేవారు. అదేసమయంలో, ధాన్యం లెవీచెల్లించవలసిందిగా ప్రజలను కోరేవారు. తమ నాయకులను పట్టిస్తామని, సంఘంనుండి రాజీనామా ఇస్తామనీ వ్రాసివ్వవలసిందిగా కోరేవారు. నైజాము కుమారుడు ముఖరంజా అనేక తాలూకా కేంద్రాలను సందర్శించి అనేకమంది ప్రజలకు వస్త్రాలు పంచియిచ్చేవాడు రాజు ప్రజలకు తండ్రివంటివాడని, ప్రజల బాగోగులను విచారించటానికి ఆయన విచ్చేశాడని పెద్దఎత్తున ప్రచారం సాగించారు అ విధంగా నైజాం కుమారుని పర్యటన, సంఘానికి – ప్రజలకు మధ్య విభజన కల్పించటానికి వుపయోగించబడింది. సైనిక దాడులు, అనేక వారాలపాటు, నెలలపాటు సాగాయి. ధైర్యం కోల్పోకుండా ప్రతిఘటనకు తట్టుకుని నిలిచారు. రాత్రివేళల్లో మగవాళ్ళంతా, గ్రామంనెలుపల పొలాల్లో చెల్లాచెదురుగా గడిపేవారు. మహిళలు తమ మాన సంరక్షణ సాధించుకోగలందులకై పదిహేనుమంది, ఇరవైమంది బృందాలుగా కలసిపండుకొనేవారు.

గ్రామాలువదలి, పట్టణాలకు చేరిన పటేళ్లు, పట్వారీలు, దేశముఖులు ఈ దాడులను ఆసరాగా దీసుకుని తిరిగివచ్చారు. అంతకుముందు వాళ్లు ప్రజల విజృంభణధాటికి తలవంచారు వాళ్లిప్పుడు ప్రజలలోని నాయకులను సైన్యానికిపట్టించడం, వాళ్లపై భీభత్సకాండ జరిపించటం ప్రారంభించారు

సైన్యం దెబ్బకు తట్టుకొనజాలరని చెప్పి, ప్రజలను నిరుత్సాహపరచటానికి గ్రామాలలో కొందరు పెద్దలు పూనుకున్నారు. సైన్యంతో రాజీపడవలసిందిగా ప్రజలకు వారు సలహాయిచ్చేవారు. సంఘంనుంచి రాజీనామా యిచ్చేట్లయితే, సైనికదాడులు ఆగిపోతాయని, వారెవరికీ ఎలాంటి హాని జరగబోదనీ రాత్రింబవళ్లు వాళ్ల చెవుల్లో మార్మోగించబడుతుండటంవల్ల, కొంతమంది, సంఘంపట్ల తమకెంతో ప్రేమవున్నప్పటికీ రాజీనామా యివ్వటానికి అంగీకరించారు. అయితే ఈ రాజీనామాల అనంతరం సైనికులు వాళ్లను సంఘం నాయకులను, కమ్యూనిస్టుపార్టీ నాయకులను వెదకటంకోసం తమతో పాటు ప్రతిచోటుకూ తీసుకుపోయేవారు:

ఐదారు పరిసర గ్రామాలనుండి కొన్ని వేలమంది ప్రజలను తీసుకొచ్చి సైన్యం ప్రక్కనే నిలబడి, ఆ ప్రజలచేతనే నిర్బంధంగా సూర్యాపేట తాలూకా లోని కందగట్ల, అరువపల్లి, ఉర్లుగొండ, రాగిపాడు, కోటపాడు కొండలలో వెదికించారు గ్రామస్థులనుండి నిర్బంధంగా ధాన్యం లెవీలు వసూలుచేశారు. గడువుకుముందే భూమిశిస్తునుకూడా నిర్బంధంగా వసూలు చేశారు. ప్రజా వుద్యమం ఒక విధంగా కుంటుబడింది. నిస్పృహ వ్యాప్తి గాంచింది అయినా సంఘంపట్ల, నాయకులపట్ల వారి ప్రేమాదరాలు, వారిని కాపాడుకోవాలన్న కాంక్ష ఎన్నడూ అంతరించిపోలేదు. వారు నాయకులకు ఆశ్రయమిచ్చేవారు. భోజనాలు పెట్టేవారు. అయితే గ్రామాలలోగల ద్రోహులకంటబడితే హాని జరుగుతుందిగాబట్టి, కొంతకాలం మరే ప్రాంతానికయినా వెళ్ళవలసిందిగా కోరేవారు దారుణమైన పోలీసు నిర్బంధకాండ ముందు తమ నిస్సహాయ తను ప్రకటించేవారు

గ్రామాలలోవుండే ద్రోహులు ధైర్యం పుంజుకున్నారు. సైన్యం సహాయంలేకుండా కూడా, ఆ ప్రాంతమంతటా, నాయకులను వెదకటం కోసం ప్రజలను వెంటబెట్టుకు పోసాగారంభించారు. బీభత్స కాండకుగురిజేసి, ఈ తప్పుడుపనికి నిర్బంధంగా పంపబడుతున్న ప్రజలు, ఆ దాడులలో సయితం తమ నాయకులను కాపాడుతుండేవారు. నాయకులు కనిపించినా చెప్పేవారు కాదు. వెదకటానికి వెళ్లేముందే నాయకులకు కబురు పంపేవారు. ప్రజలు ప్రదర్శించిన ఈ పట్టుదల ఫలితంగా, అంతకుముందే అరెస్టు చేయబడి, దాపునే వున్న బొప్పారం క్యాంపుకు తీసుకుపోబడిన ఏపూరు గ్రామనాయకుడు విడుదల పొందాడు.

అయితే, అనేకమంది స్థానిక, గ్రామ నాయకులు అరెస్టు చేయ బడ్డారు. మిగతావారికి రక్షణ ఇవ్వజాలకపోయారు. పాత సూర్యాపేట నాయ కుడు కందగట్ల కొండపై అరెస్టు చేయబడ్డాడు. అరెస్టు చేయబడిన వారిని, సైన్యమూ, గ్రామాధికారులు, భూస్వాములు, వాళ్ళ గూండాములూ చిత్ర హింసలకు గురిజేసేవారు. జనగామ తాలూకా నర్మెట గ్రామంలో గ్రామ నాయకుడొకరిని విపరీతంగా కొట్టారు. అదే ప్రాంతంలో మరో కార్యకర్తను స్పృహతప్పేదాకా కొట్టారు. విసునూరు భూస్వామి గూండాలు దేవరుప్పుల గ్రామాన్ని పూర్తిగా లూటీజేశారు. అనేక విధాలుగా గ్రామప్రజలపై పగ సాధించుకున్నారు. ఆ తర్వాత, ఈ ప్రజావ్యతిరేక శక్తులు తమంత తాము గానే, ఏ యితర సహాయం లేకుండానే నాయకులకోసం గాలించటం ప్రారం భించాయి. 1947 మే వరకు పరిస్థితులిలాగే వున్నాయి. గ్రామాలలో సైనిక

క్యాంపులుండడంవల్ల ధైర్యంపుంజుకున్న ద్రోహులు, గూండాలు, తదితర ప్రజావ్యతిరేక శక్తుల కార్యకలాపాలను అదుపులో పెట్టటం అవసరమని ప్రజలు గుర్తించారు.

కందగట్లకొండపై ఒక నాయకుడు అరెస్టుచేయబడినమీదట,సూర్యాపేట తాలూకా పాత సూర్యాపేట గ్రామంలో ప్రజలు పోలీసులను, పటేలును భూస్వామిని బాగా కొట్టారు. వాళ్ళ కాళ్ళు, చేతులు విరగగొట్టారు. అదే విధంగా పేరుమోసిన విద్రోహియగు చందుపట్లభూస్వామిని, కొత్తగూడెంలో పేరుమోసిన అతని గూండాలను వాళ్ళు ప్రయాణంచేస్తున్న బండిలోనుండి బయటకులాగి గట్టిగా కొట్టారు. చిల్పకుంటవద్ద ప్రజలు, జన్నారెడ్డి ప్రతాపరెడ్డి గూండాలను, తిమ్మాపురం, కొత్తగూడెం, గానిపాడు భూస్వాముల గూండాలను కూడా బాగా కొట్టారు జనగామతాలూకా కదవెండి గ్రామంలో విసునూరుదేశ్‌ముఖ్ గూండాలు ఇండ్లను లూటీచేయుటానికి ప్రయత్నిస్తుండగా ప్రజలు కత్తులు, కర్రలు, తదితర సాధనాలుచేతబట్టి ప్రతిఘటించారు వాళ్ళను తలెత్తనివ్వలేదు. సీతారామపురంలో పోలీసు పటేల్ తన యింటికి ముగ్గురు పోలీసులను కాపలా పెట్టుకుని ప్రజలపై బీభత్సకాండ సాగించేవాడు. అతడు ప్రజల చేతుల్లోనే ప్రాణాలు గోల్పోయాడు. అతని ఇంటికి కాపలా గాస్తున్న పోలీసులు పారిపోయారు రామన్నపేట తాలూకాలో, ప్రజల విద్వేషానికి గురైన పీడకుడగు పల్లెర్ల దేశముఖ్‌ను ప్రజలే చంపివేశారు. నల్గొండ తాలూకా, అడ్డగూడూరు గ్రామంలో మారువేసాలతోవచ్చిన ముగ్గురు సి. ఐ. డి. వాళ్ళను ప్రజలు బాగా తన్నారు. వారుగాని వారిలాంటి ఇతరులుగాని తమ గ్రామంలో మరోసారి అడుగు పెట్టేట్లయితే ప్రాణాలతో బయటకు పోవడం జరగదని హెచ్చరించి పంపారు.

మహబూబ్‌నగర్ తాలూకాలో, ఈ ప్రాంతాలలో ప్రజావ్యతిరేక శక్తులు సాగించిన బీభత్స కాండకు అంతులేదు నెలిదండ, దొరకుంట, బక్కమంతులగూడెం, ఫత్తేపురం గ్రామాల భూస్వాములు ఈ దురాగతాలలో ఒకరికంటే మరొకరు మించిపోయారు. చౌటపల్లి ప్రాంతంలోని బక్కమంతుల గూడెం భూస్వామి భోగాల వీరారెడ్డి, అతనిసోదరుడు పిచ్చిరెడ్డి స్వయంగా, నాయకులను పట్టుకోవడానికై అడవులలో గాలింపు సాగించారు. గ్రామ నాయకుడు సైదిరెడ్డి భార్యను అవమానపరిచారు. భూస్వాములకు స్వంతంగా మారణాయుధాలున్నాయి. అయినప్పటికీ, కర్రలు, కత్తులు తీసుకుని వాళ్ళ ఇండ్లపైకి వెళ్ళి, వాళ్ళను చావగొట్టి, వాళ్ళకు బుద్ధిగరపాలని ప్రజలునిర్ణయించు కున్నారు. ప్రజలు భూస్వామియింటిని చుట్టుముట్టారు. గూండా నాయకుడగు భోగాల వీరారెడ్డి యింట్లో ప్రవేశించారు. తన రైఫిళ్ళతో ప్రజలనెదుర్కొనా

లని అతడు తలంచాడు. కాని ప్రజల చేతుల్లోని కర్రదెబ్బలకు అతని రైఫిల్ విరిగిపోయింది. భూస్వామి కాళ్ళు, చేతులు విరగగొట్టబడినాయి. అతని సోదరుడు పిచ్చిరెడ్డి ఒక కర్రచేతబట్టుకొనివచ్చి, కాపలాకాస్తున్న వాలంటీర్లపై బడ్డాడు. వారాదాడిని త్రిప్పికొట్టారు. ఆ పోరాటంలో అతనికి తలపై గట్టిదెబ్బ తగిలింది. అక్కడికక్కడే మృతిజెందాడు.

తెల్లవారేసరికి ఈ వార్త తాలూకా అంతటా వ్యాపించింది. యావన్మంది భూస్వాములు, వాళ్ళ గూండాలు తమవద్దగల నగా నట్రా తీసుకొని తాలూకా కేంద్రాలకు పారిపోయారు. చిలుకూరి దేశముఖ్ జూపూడి నరసింహారావు, పోలీసు స్టేషనునుండి వస్తుండగా దారిగాచి కొట్టారనే వార్త, దొరకుంట జాగీర్దారును హరిజన వ్యవసాయ కార్మికులు ప్రతిఘటించి, అతని ఆస్తిని ధ్వంసం చేశారనే వార్త తాలూకాలో నూతనోత్తేజం కల్పించాయి. సంఘానికి అనుకూలమైన వాతావరణ మేర్పడింది.

ద్రోహులు, భూస్వాములు, గూండాలు తదితర ప్రజావ్యతిరేక శక్తులపై కొట్టబడిన ఈ దెబ్బల ఫలితంగా మొత్తంనల్గొండజిల్లాలో, పరిస్థితిలో ముఖ్యమైన మార్పువచ్చింది. గ్రామంలోని సంఘవ్యతిరేక శక్తులను హెచ్చరిస్తూ స్థానిక ప్రజలు పోస్టర్లు కరపత్రాలు వ్రాయటం, వాటిని ప్రత్యేకించి ఆ శక్తుల యిండ్ల తలుపులపై అతికించటం ప్రారంభించారు. కొన్నిచోట్ల, ఆ యిండ్లలో పనిచేసే పాలేర్లు ఈ కరపత్రాలను భూస్వాముల యిండ్లలోని మేజాబల్లలు, మంచాలు మొదలైనవాటిమీద పడవేసేవారు అనేకచోట్ల ప్రజలు మారువేషాలతో వెళ్ళి ఈ భూస్వాములకు దేహశుద్ధి జేశారు. అయితే, ఇవన్నీ చేస్తూనే, ప్రతి ఒక్కడూ తన రోజువారీ పనులు మామూలుగానే చేసుకుంటుండేవారు. అందువల్ల, ఈ చర్యలలో వారి పాత్రనుగూర్చిన ఆచూకీ శత్రువుకు దొరకకుండా వుండేది.

పోలీసులను బెదిరించే కరపత్రాలు పోలీసు స్టేషన్లలో పడవేయబడుతుండేవి. ఈ కరపత్రాలు శత్రువు గుండెలు బేజారెత్తించేవి. ఇందువల్ల, అనేకచోట్ల శత్రువులు గ్రామాలు వదిలి, పట్టణాలకు చేరుకున్నారు. రక్షణ లేకుండా ఎటూ కదలలేకపోయేవారు. కొందరు సంఘవ్యతిరేక శక్తులు తమ గూండాయిజానికి స్వస్తిచెప్పి, ప్రజలను అర్థించి, తమ గ్రామాలలోనే వుండిపోయారు. సంఘ నాయకులకోసం గాలింపు ఆగిపోయింది. సంఘం తిరిగి తమ మధ్య నిలదొక్కుకుందన్న భావం ప్రజల కేర్పడింది.

## ఉద్యమంలో ఈ దశనుగూర్చి కొన్నిగుణపాఠాలు

1945, 1946 సంఘటనలనుండి తేలుతున్న ఒక పరమసత్యం ఏమంటే యుద్ధం అయిన వెంటనే ఏర్పడిన పరిస్థితిలో జనసామాన్యంలో పెల్లుబికిన విప్లవ వెల్లువయొక్కలోతును పార్టీ గ్రహించలేకపోయిందనేది. యుద్ధ కాలంలో పార్టీకిగల సంస్కరణవాద అవగాహన, పనిపద్ధతులు ఈ పరిణామాలను ముందుగానే వూహించటాన్ని, అందుకనువుగా తాను సన్నద్ధమవటాన్ని, ప్రజలనిర్మాణాన్నిసన్నద్ధంచేయటాన్నికష్టమయ్యేట్లుచేశాయి.

"విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే నినాదమివ్వగలిగింది, హైదరాబాదు సంస్థానాన్ని రద్దుజేసి పొరుగునేవున్న ఆయా భాషాప్రాంతాలలో విలీనం చేయాలని కోరగలిగిందీ మనపార్టీ ఒక్కటేననే విషయం వాస్తవమే. స్వతంత్ర భారతదేశంలో, విశాలాంధ్రలో ప్రజారాజ్యం వివిధ రంగాలలో ఎలావుండేది ముందుగా వూహించి పేర్కొనగలిగిందీ అదే. "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే పేరుతో ఆంధ్రరాష్ట్రకమిటీ ప్రచురించిన ఎన్నికల కరపత్రంలో ఫ్యూడల్ వ్యతిరేక, ప్రజాతంత్ర వ్యవసాయిక కార్యక్రమాన్ని ప్రజలముందుంచింది. ఆ రోజుల్లో ఆ కరపత్రం ఇరవైవేల ప్రతులు అమ్ముడయినాయి. అయితే, ఇదంతా నెమ్మదిగా జరిగింది.

1946 వ సంవత్సరపు రెండవ అర్ధభాగంలో మనపార్టీ సమరశీల ప్రజాపోరాటాలు పెంపొందించ బూనుకుంది. ఆంధ్రప్రాంతంలో బంజరు భూములను, జమీందారీ ఫ్యూడల్ భూస్వాముల అక్రమ ఆక్రమణలోగల భూములను సంఘటితశక్తితో ఆక్రమించుకొనటానికి పూనుకున్నప్పుడుకూడా కాంగ్రెస్ ప్రభుత్వ నిర్బంధకాండ ఎదురయినప్పుడు పార్టీ వాటిని వుపసంహరించింది.

ఆంధ్ర ప్రాంతంతో సహా మద్రాసు రాష్ట్రంలో పార్టీ ఆచరణలో నిషేధంలోనే వుంది. 1947 వ సంవత్సరం మొదట్లో కొలది మాసాలపాటు ప్రకాశం ఆర్డినెన్సు క్రింద పెద్ద సంఖ్యలో నాయకులు నిర్బంధించబడ్డారు. లేదా అజ్ఞాతవాసానికి వెళ్ళవలసివచ్చింది. అయితే, 1947 ఆగస్టు 15 వ తేదీన రాజ్యాధికారం బదలాయింపు సందర్భంగా వారంతా విడుదల చేయబడడం వెలుపలికి రావడం జరిగింది. సమరశీల ప్రజాపోరాటాలు సాగించాలనే పంధా వెనకడుగు బట్టింది. కొత్తగా సాధించుకున్న స్వాతంత్ర్యానికి గోతులు దవ్వటానికి సిద్ధంగావున్న బ్రిటిష్ సామ్రాజ్యవాద కుట్రలను, సంకుచితమైన వల్లభాయ్ ముఠాను-వోడించడం పేరుతో జాతీయ స్వాతంత్ర్య ప్రభుత్వమగు నెహూ ప్రభుత్వాన్ని పూర్తిగా బలపర్చటమా లేదా అనే చర్చలో పార్టీ అంతా నిమగ్నమైంది.

స్వాతంత్ర్యం రావటంతో, అంతవరకు బ్రిటిష్- ఇండియాగావున్న ప్రాంతంలో సాగుతుండిన సమరశీల వుద్యమాలు కాస్తా మందగించాయి. నెహ్రూ నాయకత్వానగల కాంగ్రెస్ ప్రభుత్వం, పెద్దపెద్ద చర్యలేవో తీసుకుంటుందని, స్వాతంత్ర్యం తెచ్చినట్లే, తమ సమస్యలనుకూడా పరిష్కరించ గలదనీ ప్రజలు భావించుతుండటం అందుకు ప్రధాన కారణం మన పార్టీ, బలహీనంగా వుండి, మిగతా ప్రజాతంత్రపార్టీలతో, గ్రూపులతో సంబంధం లేకుండావుండి జన సామాన్యానికి సరైన నాయకత్వాన్ని సమకూర్చలేక పోవటంకూడా అందుకు కొంతవరకు కారణం.

భారత్ యూనియన్‌లో చేరటానికి నిరాకరించిన హైదరాబాదు, తిరువాన్కూరు సంస్థానాలలో మాత్రమే ప్రజల అసంతృప్తి, పోరాటాలు మరింతగా పెంపొందాయి భారత జాతీయకాంగ్రెసు, భారత ప్రభుత్వమూ కొంతమేరకు అందుకు ప్రోత్సాహమిచ్చాయి, బలపరిచాయి. పెద్ద మొత్తాలు రాజభరణాలుగా యిస్తామని, వారి ప్రత్యేక హక్కులకు రక్షణ కల్పిస్తామనీ హామీయిచ్చి వల్లభాయ్ పటేల్ భారత యూనియన్‌లోకి తీసుకొచ్చిన ఇతర సంస్థానాలనేక వాటిల్లో, సంస్థానప్రజావుద్యమాలుకూడా తగ్గుస్థాయికి గొనిరాబడ్డాయి. వుపసంహరించబడ్డాయి. తిరువాన్కూరు మహారాజాకు, ఆయన దివాన్ సి పి. రామస్వామి అయ్యర్‌కు వ్యతిరేకంగా మన పార్టీ నాయకత్వాన సాగిన వాయలార్, పున్నప్రా పోరాటాలు, మనపార్టీ నాయకత్వాన్నే హైదరాబాదు సంస్థానంలో సాగిన తెలంగాణా పోరాటమూ, యుద్ధానంతర అసంతృప్తిని ప్రతిబింబించాయి వ్యావసాయిక తిరుగుబాటుకు అవి ప్రతీకలుగా నిలిచాయి.

పరిస్థితులు పరిణమిస్తున్న తీరును గూర్చి మనకు సవ్యమైన విప్లవ అవగాహన వుండి యున్నట్లయితే, మన పార్టీని సరైన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాల కనుగుణంగా పెంపొందించివుంటే, తెలంగాణా విషయమే తీసుకున్నా మనం మన కార్యకర్తలను, ప్రజలను మొత్తం ఫ్యూడల్ వ్యవస్థపై ఉధృతమైన దాడులు జేయటానికి సన్నద్ధం జేసివుండవలసింది. భూస్వాముల వద్దనుండి; అక్రమంగా స్వాహాజేసిన భూమిని, వారి మిగులుభూమిని కూడా ఆ తర్వాత తటపటాయిస్తూ, అంచలంచెలుగా జేసిన విధంగా అంతకుముందే స్వాధీనం చేసుకునేట్లు చేసియుండవలసింది. మన కార్యకర్తలను కర్రలతో ఆత్మరక్షణ జేసుకొనటానికేగాక, సాయుధంగా ఆత్మరక్షణ జేసుకొనటానికి శిక్షణ గరపియుండవలసింది. నాటుతుపాకులు సంపాదించి, వాటిని ఉపయో

గించటానికి సయితం అంత దీర్ఘకాలంపాటు తటపటాయించి యుండవలసింది కాదు. అలా తటపటాయించినందువల్ల, ప్రజల మొట్టమొదటి విజృంభణ పూర్తిగా చెల్లాచెదరైపోయి, విచ్ఛిన్నమైపోయింది.

అయితే, మనం ఎంతగా తటపటాయించినప్పటికీ, తెలంగాణా ప్రజల అసంతృప్తి, ప్రజావెల్లువ ఎంత లోతుగా, ఎంత బలంగావున్నదంటే, ఎన్ని పరిమితులున్నప్పటికీ, మనపార్టీ మార్గదర్శకత్వంక్రిందనే వారంతటవారు సాగించిన కార్యకలాపాలవల్ల దిగువపేర్కొన్న విజయాలు సాధించబడినాయి

1. వెట్టిచాకిరీ, అక్రమ నిర్బంధవసూళ్ళు, నిర్బంధ ధాన్యం లెవి అంతం జేయబడినాయి భూస్వాములు, దేశముఖులు అంతకుముందు స్వాహాజేసినభూములను తిరిగి ఆక్రమించుకోవటం ప్రారంభమైంది. ఆ ఉద్యమం ఫ్యూడల్ భూస్వామ్యవిధానాన్ని, నైజాం పాలనను సయితం రద్దుచేయటంకోసం ఉద్దేశించినట్టిదిగా రూపొందింది. కొలదివారాలలోనే వందలాది గ్రామాలకు వ్యాపించటాన్నిబట్టి ఈ ఉద్యమ ఉధృతి, ప్రజాస్వభావమూ విదితమవుతున్నాయి.

2 భూస్వాముల సాయుధ గూండాల దాడులను ప్రతిఘటించి తిప్పి కొట్ట నారంభించిన ప్రజలు ఆ తర్వాత సాయుధ పోలీసులను, నైజాం సైనిక బలగాలను సయితం ఎదుర్కొనటానికి సన్నద్ధ మయ్యారు.

3 పోలీసు దాడులకు గురయిన గ్రామప్రజలకు సహాయపడటంకోసం ఇరుగుపొరుగు గ్రామాల ప్రజలు హుటాహుటిని వెళ్లుతుండేవారు.

4 దాడుల నెదుర్కొనటంలో మహిళలుకూడా తమ పురుషులకు సాధ్యమైన అన్నివిధాలుగా తోడ్పడుతుండేవారు.

5. "సంఘం" వారి నాయకుడుగా, మార్గదర్శిగా రూపొందింది. భార్యా భర్తలమధ్య తగాదాలతోసహా అన్ని సమస్యల పరిష్కారానికి సంఘం తోడ్పడుతుండేది. సమరశీలమైన పాటలు, జానపద కళలతో గూడిన సమరశీలమైన ప్రజాసాంస్కృతిక వెల్లువ వెల్లువికింది.

హైదారాబాదు సంస్థానంలో ప్రత్యేకమైన, విలక్షణమైన అనుకూల పరిస్థితులలో జనసామాన్యంలో అసంతృప్తి, ప్రజావిజృంభణ యింతబలంగా వుండబట్టే, అంతకుముందు తీవ్రమైన దెబ్బలు తినియున్నప్పటికీ, 1947 అగస్టులో నైజాం, భారతయూనియన్‌లో చేరటానికి నిరాకరించినప్పుడు ప్రజలు మరింత విజృంభించారు.

1940 నుంచి 1946 వరకు తెలంగాణా ప్రజల ఫ్యూడల్ వ్యతిరేక, నైజాం వ్యతిరేక పోరాటాన్ని నడిపిన ఖ్యాతి, ఆంధ్రమహాసభను సమైక్య ప్రజా సంస్థగా, నైజాం వ్యతిరేక ప్రజాశక్తుల వేదికగా రూపొందించిన ఖ్యాతి మన పార్టీది, మన పార్టీ ఆంధ్ర శాఖది. మన పార్టీ ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నది. ఈ సంస్థకు, ఐక్యసంఘటనకు నాయకుడుగా రూపొందింది. తెలంగాణా ప్రజాపోరాటాన్ని, విశాలాంధ్ర అనే భావననూ అది ప్రచారం చేసింది. పోరాడుతున్న తెలంగాణా రైతాంగానికి విస్తృత స్థాయిలో అండదండలను సమీకరించింది. నైజాం దాడులకు గురవుతున్న కార్యకర్తలకు, ప్రజలకు కోస్తా ప్రాంతాలలో ఆశ్రయం కల్పించింది. తోడ్పాటు నిచ్చింది కోస్తా జిల్లాలను, ఈ తెలంగాణా ప్రజోద్యమానికి అండగా నిలిచే వెనుకతట్టు ప్రాంతంగా తయారు చేసింది. ఇందుకుగాను, 1947 వ సంవత్సరపు మొదటి అర్ధభాగంలో సయితం పార్టీ, కాంగ్రెస్ ప్రభుత్వపు దాడికి గురైంది. ఆ తర్వాత స్వల్పకాలంపాటు చట్టబద్ధంగా పనిచేయటానికి స్వాతంత్ర్యానంతరం అవకాశం కలిగినా, మరల పార్టీపై నిషేధం విధించబడింది. 1948 జనవరి 30 వ తేదీన దాడికి గురైంది. ఈ మధ్య కాలమంతటిలోనూ, తెలంగాణాలో చెల్లాచెదరైపోయిన వుద్యమాన్ని తిరిగి కూడదీయటానికి పార్టీ తోడ్పడింది. సక్రమమైన మార్గంలో ఆ వుద్యమానికి నూతనోత్తేజం కల్పించగలిగింది. సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయవలసిందిగా కోరటానికి జరిగే పోరాటంలో స్టేట్ కాంగ్రెస్ నాయకులతో కలిసి పని చేసింది. దానికి ప్రజాపోరాట స్వభావాన్ని కలుగజేసింది. దానినే, ఫ్యూడల్ వ్యతిరేక, నైజాం వ్యతిరేక వ్యావసాయిక తిరుగుబాటుగాను, ఆ తర్వాత దానినే, నైజాం పాలనకు వ్యతిరేకంగా విమోచన పోరాటంగాను పెంపొందించింది. ఆ పోరాటం నైజాం పాలనయొక్క పునాదులనే కుదిపివేసింది. ఫ్యూడల్ వ్యతిరేక వ్యావసాయిక పోరాటపు అలలు విస్తరించుతున్నకొలదీ, బడా బూర్జువావర్గ నాయకత్వానగల, స్వతంత్ర భారతదేశపు బూర్జువా - భూస్వామ్య ప్రభుత్వం, కాంగ్రెసు, నెహ్రూ నాయకత్వం వహిస్తున్న ప్రభుత్వం - తెలంగాణా వ్యావసాయిక తిరుగుబాటును అణచటంకోసం, అది మరింత వ్యాప్తి చెందకుండా అరికట్టటంకోసం, హైదరాబాదు సంస్థానంలోను, మిగతా భారతదేశంలోనూ తమ వర్గ పాలననే అంతం చేయకుండా నివారించేందుకుగాను తెలంగాణా వ్యావసాయిక తిరుగుబాటును అణచటంకోసం తన సైన్యాలను పంపించింది!

ఈ అంశాలకు సంబంధించిన పరిణామాలనుగూర్చి తర్వాతి అధ్యాయాలలో వివరించబడుతుంది.

## అధ్యాయం 3

# నైజాముకు, రజాకార్లకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటనోద్యమం

**1947 ఆగస్టు 15 నుండి 1948 సెప్టెంబరు 13 వరకు**

**భూమి పంపిణీ, ప్రజారాజ్య స్థాపన**

1947వ సంవత్సరపు మొదటి నాలుగు మాసాలలోనూ, పార్టీ, ఆంధ్రమహాసభ, నైజాం తీవ్రనిర్బంధకాండ తాకిడివల్ల చెల్లాచెదరైపోయిన నిర్మాణాన్ని కూడదీసుకొనటంలో నిమగ్నమైనాయి. ఆంధ్రప్రాంతంలోకూడా పార్టీ నిషేధించబడి, దాడులకు గురవుతూవుంది. అయినప్పటికీ, గుంటూరు, కృష్ణా, గోదావరిప్రాంతం తెలంగాణా సమరయోధులకు రక్షణ స్థావరంగానే ఉపయోగపడుతూ వచ్చింది.

1947 ఆగస్టు 15వ తేదిన బ్రిటిష్ సామ్రాజ్యవాదంనుండి బూర్జువా వాదంనుండి బూర్జువా భూస్వామ్య కాంగ్రెసుకు అధికారం బదలాయించ బడింది. తాను భారత యూనియన్‌లో చేరబోనని, స్వతంత్రంగానే (ఆజాద్ హైదరాబాద్) వుండిపోతానని నైజాం ప్రకటించాడు. భారత యూనియన్‌లో విలీనం కావలసిందిగా నైజాం నవాబుపై వొత్తిడి తెచ్చేందుగాను హైదరా బాదు సంస్థానంలో సత్యాగ్రహపోరాటం ప్రారంభించడం భారత జాతీయ కాంగ్రెసుకు తప్పనిసరియైంది.

దానివల్ల, మనకు తెలంగాణా ప్రజలపోరాటాలను పెంపొందించేందుకు, ఎంతో మంచి అవకాశం, నూతనమైన అనుకూల పరిస్థితులూ ఏర్పడినాయి. సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయాలని కోరుతూ సాగించే పోరాటంలో మనం స్టేట్ కాంగ్రెస్‌తో సహకరించాం. మన పార్టీ, ఆంధ్రమహాసభ అచ్చట ప్రధాన రాజకీయ శక్తులుగా వున్నాయి. పెద్ద రాజకీయ పలుకుబడి, ప్రజాపునాది, మంచినిర్మాణం మనకు అప్పటికే అక్కడున్నాయి. అందువల్లనూ, ప్రత్యేకించి 1944–46మధ్యకాలంలో నడిపిన పోరాటాల కారణంగాను ఈ ఉద్యమంలో మనకు నిర్ణయాత్మక పాత్ర లభించింది.

ఈ సంస్థాన ప్రజాపుద్యమానికి ఆంధ్ర ప్రాంతాలలో ప్రజలు అన్ని తరగతులవారూ బ్రహ్మాండమైన అండదండలు సమకూర్చారు. రజాకార్లపైన, నైజాంపైన పోరాడటానికి ఆయుదాలు సమకూర్చటంకోసం కేవలం రెండు మూడు రోజులలోనే, ఒక్క విజయవాడ పట్టణంలోనే మనం ఇరవై వేల రూపాయలు వసూలు చేయగలిగాం.

జాతీయజెండాలు, ఎర్రజెండాలు సరసనే ఎగురుతుండగా, ఉమ్మడి సభలు, ప్రదర్శనలు జరిగాయి. కాంగ్రెస్ రూపొందించిన కార్యక్రమమేదైనప్పటికీ మనం వాటిలో పాల్గొనటానికి వేలాది ప్రజలను సమీకరించి, బ్రహ్మాండమైన ప్రజోద్యమంగా పెంపొందించాం. పరిమిత సంఖ్యలో సత్యాగ్రహులు ప్రదర్శన చేయాలనిగాని, పికెటింగ్ జరపాలనిగాని కాంగ్రెస్ పిలుపిస్తే, మనం దానిని బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనగాను, పెద్దఎత్తున ప్రజలు పాల్గొనే పికెటింగుగాను మార్చివేశాం.

కళాశాలలను, పాఠశాలలను, కోర్టులను బహిష్కరించవలసిందిగా కాంగ్రెసు పిలుపిచ్చినప్పుడు కూడా మనం దానినొక పెద్ద ప్రజా కార్యక్రమంగా నిర్వహించాం. విద్యార్థులను పెద్దసంఖ్యలో మన వాలంటీరుదళాలలోకి, ఆంధ్రమహాసభలోకి సమీకరించాం. విద్యార్థులీవిధంగా కుప్పతెప్పలుగావచ్చిచేరటంవల్లనే, ఉద్యమం వురకలు, పరుగులతో పురోగమించింది. వారిలో చాలామంది ఆ తర్వాత ప్రజాసంఘాలకు, గెరిల్లాసంస్థలకు స్థానిక నాయకులుగాను, ప్రాంతీయనాయకులుగానూ పెంపొందారు.

భారత యూనియన్‌కు – నైజాం భూభాగానికిమధ్య కస్టమ్సుకు సంబంధించిన విధి నిషేధాలను భగ్నంచేయాలని, పటేళ్లు, పట్వారీలు రాజీనామాలివ్వాలని కాంగ్రెసు పిలుపిచ్చింది. ఈ ఉద్యోగాలకు సంబంధించిన రికార్డులన్నింటిని ధ్వంసంజేసే ఉద్యమంగా మనపార్టీ, ఆంధ్రమహాసభ దానిని పెంపొందించాయి.

నైజాం సంస్థానానికిగల ప్రధానమైన ఆదాయపు వనరులలో కల్లు దుకాణాలపై వచ్చే ఆదాయం ఒకటి. ఆ ఆదాయం నైజాం ప్రభుత్వానికి దక్కకుండా చేయాలనే వుద్దేశంతోను, మద్య నిషేధం అనే తన స్వంత చాద సంవల్లనూ కల్లునిచ్చే తాడిచెట్లు, ఈతచెట్లు గెలలు కోసివేయవలసిందిగా కాంగ్రెసు పిలుపిచ్చింది. అనేకరోజులపాటు, తాడి, ఈతచెట్లను పెద్ద ఎత్తున ధ్వంసం చేయటం కల్లు గీయకుండా గీత కార్మికులను ఆటంక పరచటంగా మనం దానిని నిర్వహించాం. కల్లుగీత పనివారిలో అత్యధిక సంఖ్యాకులు గ్రామీణ పేదలు ఈ కార్యక్రమంవల్ల, వారు తమ వృత్తిని జీవనోపాధిని కోల్పోతున్నారు. అందువల్ల వారా కార్యక్రమానికి వ్యతిరేకంగా నిలుస్తున్నారు. ఈ విషయాన్ని మనం త్వరలోనే గుర్తించాం. పార్టీ ఈపొరపాటును సవరించుకొంది. తన నినాదాన్ని మార్చుకుంది. "కల్లుగీయండి, ప్రజలకు దానిని పరిశుభ్రంగాను, చౌకగాను అందించండి, పన్నులు మాత్రం చెల్లించవద్దు" అని పిలుపిచ్చాం. దీనికి ప్రజల హృదయపూర్వక ఆదరణ లభించింది. మన గెరిల్లాదళ సభ్యులు, గ్రామస్థాయికి చెందిన వారితోసహా రాజకీయ కార్యకర్తలూ కల్లు త్రాగటాన్ని మన పార్టీ నిషేధించిందనే విషయాన్ని కూడా ఈ సందర్భంగా పేర్కొనవలసియుంది ఆ నిషేధం ఖచ్చితంగా పాటించబడింది కూడా.

హైదరాబాదు సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేయాలనే నినాదాన్ని కాంగ్రెస్ చేపట్టింది. అదేసమయంలో సంస్థానాన్ని రద్దుజేసి అందులోని వివిధ భాషాప్రాంతాలను పొరుగునేవున్న ఆయా భాషాప్రాంతాలలో విలీనం చేయాలని, భారత ప్రజారాజ్యంలో సమైక్య భాషారాష్ట్రాలను నిర్మాణం చేయాలని, నైజాం పాలనను రద్దుజేయాలని మనం కోరాం.

మొత్తం జాతిఅంతటి అభిప్రాయం ఈ ఉద్యమానికి అనుకూలంగా వుంది. బడాబూర్జువావర్గం నాయకత్వానగల స్వతంత్ర భారతదేశపు బూర్జువా-భూస్వామ్య ప్రభుత్వంకూడా హైదరాబాదు సంస్థాన విలీనీకరణనే కోరింది. యావద్భారత దేశంలోగల ప్రజాతంత్రశక్తులన్నీ అందుకు అనుకూలంగా వున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదపుతొత్తు, బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని బలపరచేవాడూనగు నైజాం నవాబును గద్దెదింపాలని వారంతా కోరటమే అందుకు కారణం. ముస్లిం ఫ్యూడల్ నవాబుపాలన పోవాలని హిందువులంతా కోరారు. తమ స్వంత భాషాప్రాంతాలలో విలీనమై తమభాషను, సంస్కృతిని అభివృద్ధి జేసుకోవాలన్న ప్రగాఢమైన వాంఛకారణంగా మూడు భాషలవారూ విమోచన చెందాలని అభిలషించారు. నైజాం నిరంకుశపాలన, దాని ఫ్యూడల్ వ్యవస్థా అంతంకావాలని, దాని స్థానంలో తమ స్వంత ఆర్థిక రాజకీయాభి

వృద్ధి సాధనకై "భారతదేశంలో భాగంగా ప్రజాతంత్ర బాధ్యతాయుత ప్రభుత్వం" ఏర్పడాలని అభివృద్ధి జెందుతున్న బూర్జువావర్గమూ, పెట్టుబడిదారీ భూస్వాములు, ధనికరైతులుకూడా కోరారు. ఫ్యూడల్ భూస్వామ్య దోపిడీ, వెట్టి (బేగార్) విధానం, నిర్బంధచాకిరీ, అక్రమ నిర్బంధవసూళ్లు, నిర్బంధంగా ధాన్యం లెవీసేకరణ మొత్తంగా రద్దుకావాలని, సాగుజేసుకొనేందుకు భూమి కావాలని కష్టజీవులైన రైతులు, గ్రామీణ పేదలూ కోరారు. ఉద్యోగావకాశాలు కావాలని, వేతనాలు మెరుగుపడాలని కార్మికులు కోరారు. భారత యూనియన్‌లో అంతర్భాగంగా ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడాలని కోరుతూ సాగించబడుతున్న ఈ నైజాం వ్యతిరేకపోరాటంలో అన్ని ప్రవాహాలూ వచ్చిజేరాయి అభ్యుదయ భావాలుగల ముస్లిములుకూడా ఈఉద్యమంలో చేరారు

## మన వ్యవసాయ కార్యక్రమం

కాంగ్రెసు కార్యక్రమంలోని అంశాలు కార్యరూపం తీసుకొనేటట్లు, వాటిలో జనసామాన్యం పెద్దయెత్తున పాల్గొనేట్లుచేయటంతోనే మన పార్టీ, ఆంధ్రమహాసభ పరిమితంకాలేదు దానిని మనం ఖచ్చితమైన ఫ్యూడల్ వ్యతిరేక వ్యావసాయిక తిరుగుబాటుగా రూపొందేటట్లు చేశాం.

— అన్నివిధాలైన నిర్బంధచాకిరీకి, అక్రమ నిర్బంధవసూళ్ళకు స్వస్తి జెప్పేట్లుగా మనం ప్రజలను నడిపాం.

— నిర్బంధ ధాన్యం లెవీ చెల్లించ నిరాకరించేట్లు చేశాం.

— భూస్వాములనుండి కౌలుకు తీసుకొని సాగుచేసుకుంటున్న భూములను నిలబెట్టుకొనటానికేగాక, భూస్వాములు అక్రమంగా స్వాహాజేసిన భూములన్నింటినీ తిరిగి ఆక్రమించుకోవటానికి కూడా ప్రజలను సంఘటితపరచి నడిపాం. కౌలు తగ్గింపు, ఆ తర్వాత బడాభూస్వాములకు, ప్రజాశత్రువులకు కౌళ్ళు చెల్లించకుండా వుండటం కూడా అమలు జరిపాం.

— ప్రభుత్వానికి, బడా భూస్వాములకు జెందిన బంజరు భూములను ఆక్రమించుకొని, సాగుచేసుకొనటానికి నాయకత్వం వహించాం.

— దుర్మార్గులైన భూస్వాములవద్దగల ధాన్యం నిల్వలను స్వాధీనం జేసుకోవటం, వాటిని అవసరంలోవున్న గ్రామీణ పేదలకు పంపిణీ జేయటం ప్రారంభించాం.

—పటేళ్ళ, పట్వారీల రికార్డులతోపాటే, భూస్వాముల రికార్డులను, వడ్డీ వ్యాపారస్తుల రికార్డులను, వాళ్ళ పేర వ్రాయబడియున్న ప్రాంసరీ నోట్లను, బాండ్లనుకూడా మనం దగ్ధంజేశాం.

—చివరకు, కొలది నెలల కాలంలోనే, భూస్వాముల మిగులు భూములను స్వాధీనం చేసుకోవటం, వాటిని పేద రైతాంగానికి పంపిణీ జేయటం; దానితోపాటే భూస్వాముల పశువులను, వ్యవసాయ పరికరాలను స్వాధీనం చేసుకుని పంపిణీ చేయటం పూర్తిజేశాం. భూగరిష్ఠ పరిమితిని 500 ఎకరాలతో ప్రారంభించాం. అనుభవం గడించినకొద్దీ, భూమికోసం పేద ప్రజల డిమాండును తీర్చవలసిన అవశ్యకత పెరిగినకొద్దీ, క్రమక్రమంగా ఆ గరిష్ఠ పరిమితిని వంద ఎకరాల మెట్టకు, పది ఎకరాల మాగాణికి తగ్గించాం.

ఆ ఉద్యమం విస్తృతమైన ప్రజాఉద్యమంగా రూపొందింది. దేవరుప్పుల, పాతసూర్యాపేట, బాలేముల, మల్లారెడ్డిగూడెం పోరాటాలనాటి ఉత్సాహం తిరిగి కనిపించింది. అయితే, ఈ సారి వూపు మరింత బలమైనది, సంస్థాన వ్యాపితమైనదీను "గూటపాలసంఘం' (లారీసంఘం) మరల కదిలిందని ప్రజలు భావించనారంభించారు. అయితే ఈ సారి కర్రలతోనే పరిమితం కాలేదు. కాంగ్రెసు, కమ్యూనిస్టు, ఆంధ్రమహాసభకు జెందిన దళాలన్నీ, ప్రజలూ లభ్యమైన మారణాయుధాలన్నింటినీ సమకూర్చుకున్నారు.

నైజాం పాలన పునాదులంటూ కదిలిపోయింది. పెద్ద ఎత్తున భీభత్సకాండకు నైజాం పూనుకున్నాడు. మజ్లిస్ ఇత్తెహాద్ – ఉల్ – ముస్లిమీన్‌కు జెందినకాశింరజ్వీ నాయకత్వాన రజాకార్‌దళాలను ఏర్పాటుజేశాడు.వాళ్ళను సైన్యం అండదండలతో గ్రామాలపైకి పంపాడు. లూటీలు, గృహదానాలు, ప్రజలను హింసలపాలుజేయడం, హత్యలు, మానబంగాలు విచ్చలవిడిగా సాగాయి. ప్రజలు తమకు ఏ ఆయుధం లభ్యమయితే, ఆ ఆయుధం చేతబట్టుకుని, ఏ విధమైన నిర్మాణం లభ్యమైతే ఆ విధమైన నిర్మాణంతో ప్రజలు ఆత్మరక్షణచేసుకోవటానికి, రజాకార్లను తరిమికొట్టటానికి పూనుకోవలసివచ్చింది.

దారుణమైన ఈ బీభత్సకాండ సాగుతున్నందువల్ల అనేకమంది ప్రజలు, ప్రత్యేకించి ధనికవర్గాలలోని ఉన్నతశ్రేణికిజెందినవారు రక్షణకోసం భారతయూనియన్ భూభాగంలోకివెళ్ళిపోయారు. కాంగ్రెసు సత్యాగ్రహ శిబిరాలు, దళాలు కూడా ఆ ప్రాంతాన్నివదిలి భారతయూనియన్ భూభాగంలోకి తరలించబడ్డాయి. తమ సాయుధశిబిరాలను సరిహద్దులలో నెలకొల్పారు. అచ్చటినుండి ఎదురుదాడులు ప్రారంభించారు. నైజాం సంస్థానంలోపలనే వుండి రజాకార్ల, నైజాము బీభత్సకాండకు వ్యతిరేకంగా పోరాటం సాగించగలిగింది కమ్యూనిస్టు, ఆంధ్రమహాసభదళాలు మాత్రమే.

హైదరాబాదు సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనంచేయాలనికోరుతూ ఉద్యమం ప్రారంభించబడిన తొలిదశలో కాంగ్రెసు, ఆంధ్ర మహాసభ కార్యకర్తలకుమధ్య కనిపించిన సహకారం కొలదివారాలలోనే అదృశ్యమైంది ఫ్యూడల్ వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం వూపు నందుకోవటం, నైజాం వ్యతిరేకఉద్యమ ప్రజాస్వభావంచూచిన తర్వాత కాంగ్రెసు నాయకత్వపు ఉత్సాహం చల్లారిపోయింది అంతేకాదు, అలాంటి తీవ్రవాద కార్యక్రమం వాళ్ళకుమింగుడుబడకపోవటం, కష్టజీవులలో వాళ్ళకు పునాదిలేకపోవటంకారణంగా వాళ్ళదళాలు దోపిడీదారులైన భూస్వాములకు అండగా ప్రజలపై దాడులుసాగించేస్థితికి దిగజారాయి.

మన దళాలు కలుగజేసుకుని, ఈ కాంగ్రెసు దళాలలో చాలావాటిని నిరాయుధం చేయవలసి వచ్చింది. ఈ కాంగ్రెస్ దళాలలోని సమరశీల స్వభావం గలిగిన, నిజాయితీపరులైన సభ్యులు పెద్ద సంఖ్యలో ఆ తర్వాత మనతో సహకరించారు. మనతోపాటే పోరాడారు.

నైజాం ప్రభుత్వము, దాని పోలీసు, సైనికబలగాలూ సంస్థానంలో గల ప్రజలపైన, స్వాతంత్ర్య యోధులపైన పాశవికమైన దాడులు సాగిస్తుండగా, భారత ప్రభుత్వం నైజాముతో గుట్టుచప్పుడుగా ఒప్పందంజేసుకుని నైజాం బలగాలకు ఆయుధాలు, మందుగుండు సామాగ్రి సరఫరా చేస్తూండటం చరిత్రలో నిలిచివుండే వాస్తవికాంశం. గాయపడినయోధు లొకసారి, మునగాల పరగణానుండి విజయవాడకు వెళ్తుండగా నైజాం పోలీసులు దాడి జేసి, వాళ్ళను పట్టుకెళ్ళారు. వారిని విడుదల చేయించటానికిగాని, అలాంటి దాడులు పునారావృతం కాకుండా అరికట్టేందుకుగాని, భారత ప్రభుత్వం చాలాకాలం వరకు ఎలాంటి చర్యలూ తీసుకోలేదు

రజాకార్ వ్యతిరేక, నైజాం వ్యతిరేక సాయుధ పోరాటం తెలంగాణా ప్రాంతంలో శీఘ్రగతిన వ్యాపించింది. దాదాపు పదివేలమంది సభ్యులతోగూడిన గ్రామ దళాలు, రెండువేలమందికి పైగా సభ్యులతోగూడిన గెరిల్లా దళాలు ఏర్పడినాయి. అసంఖ్యాకమైన పోరాటాలు, వీరోచిత చర్యలు సాగించారు సుమారు రెండువేలమంది సమరశీల కార్యకర్తలు, యోధులు, నాయకులు తమ ప్రాణా లర్పించారు. అయితే, నైజాం సాయుధ బలగాలకు జెందిన వారిని, పోలీసు ఏజెంట్లనూ, రజాకార్లను, భూస్వాములను, వాళ్ళ గూండాలను అనేకమందిని మట్టుబెట్టి, గ్రామాలనుండి పారద్రోలారు. మూడు వేల గ్రామాలలో గ్రామ రాజ్యా లేర్పరచి, గ్రామ పంచాయితీ కమిటీల

ద్వారా పరిపాలనను సాగించారు. భూమి పంపిణీ, విద్య, ఆరోగ్యం, గ్రామీణ పరిపాలనా వ్యవహారాలన్నీ ఈ ప్రజాపోరాటు కమిటీలే నిర్వహించేవి.

తెలంగాణా ప్రజాపోరాటానికి, తెలంగాణా వీరులకు, తెలంగాణా అమరవీరులకుసంబంధించిన వీరగాధలనుకొన్నింటినిఇక్కడపొందుపరుస్తున్నాం.

# వీరగాథలు

## నూతనవెల్లువ

పది, పదిహేనుగ్రామాలకు జెందిన వేలాదిప్రజలు కర్రలు చేత బూని, జాతీయజెండాలను, ఎర్రజెండాలనుఎగురవేసుకుంటూ ఇతరగ్రామాలకు యాత్ర సాగించటం, భూస్వాముల ధాన్యంకొట్లను బద్దలు గొట్టటం, ఆ ధాన్యాన్ని ప్రజలకు పంచడం ఆనాడు సాధారణ కార్యక్రమంగా తయా రైంది. మిర్యాలగూడెం తాలూకాలో, తడికమళ్ళ భూస్వామి ధాన్యపు కొట్లను మూడువేలమంది ప్రజలు చుట్టుముట్టారు అందులోనుంచి నాలుగువందల బస్తాలవడ్లు తీసుకొని ప్రజలు పంచుకున్నారు

హుజూరునగర్, సూర్యాపేట తాలూకాల గ్రామాలప్రజలు దాదాపు మూడువేలమంది అన్నారం, పొట్లపాడులమీదగా అనంతారానికి జైత్రయాత్ర సాగించారు. తమ మామూలు కార్యక్రమం అనంతరం, వారు భూస్వామి ధాన్యపుకొట్లను బద్దలుగొట్టి పంచుకున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే, లారీసంఘం అనిపిలుచుకొనే సంఘాన్ని "*జైత్రయాత్రసంఘం*" అని పిలువనారంభించారు.

## రజాకార్ దళాల ఏర్పాటు-వాటి దాడులు

"ఆజాద్ హైదరాబాద్" ముస్లిం సామ్రాజ్యమని, అసఫ్ జాహీ పాలనలో ప్రతిముస్లిమూ ఒక పాలకుడేనని, ఈ ప్రభుత్వాన్ని కాపాడాలనేది దేవుని ఆజ్ఞయని, అందువల్ల రజాకార్ సైన్యంలోచేరి హిందువుల నెదుర్కొ నటం ప్రతి ముస్లిముయొక్క పవిత్ర కర్తవ్యమని పేర్కొంటూ, ఇత్తెహాద్-ఉల్-ముస్లిమీన్ నాయకుడు కాశిం రజ్వీ నాయకత్వాన రజాకార్ సైన్యం ఏర్పాటు జేయబడింది

ఈ రజాకార్లు నగరాలలో, పట్టణాలలో స్థావరా లేర్పరచుకొని గ్రామాలపై దాడులు సాగిస్తూ ప్రజల ఆస్తిపాస్తులను కొల్లగొడుతూ, జాతీయ జెండాలను, ఎర్రజెండాలను లాగివేస్తూ వుండేవారు. వాళ్ళవద్ద బల్లేలు, జంబి

యాలు, బాకులు, నాటు తుపాకులు, రైఫిళ్ళు మొదలగు ఆయుధాలు వుండేవి. వాళ్ళు తమ దాడులలో వాటినన్నింటినీ ఉపయోగించేవారు. ఈ సందర్భంగా ఒక్క విషయం గమనార్హం అంతకుముందు దశలోవలెనే హిందువులు, ముస్లి ములనే తేడా లేకుండా ప్రజలందరూ సమైక్యంగా నిలిచి భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడారు అదేవిధంగా ఇప్పుడుకూడా మత దురభిమానానికి ఎరగాకుండా ముస్లిమ్‌లు రజాకార్లకు వ్యతిరేకంగా కూడా తతిమ్మా ప్రజ లతో భుజం, భుజం కలిపి పోరాడారు.

## తుంగతుర్తి, ఆలేరు, నోముల పరదాల గ్రామాల్లో పోరాటాలు

జమీందార్లకు వ్యతిరేకంగా, ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన ప్రజలను, అంతకుపూర్వం అణచివేశారు రజాకార్లకు వ్యతిరేకంగా ప్రతిఘట నోద్యమంలో ఆ ప్రజలంతా ఇనుమడించిన వుత్సాహంతో పాల్గొన్నారు తమవద్ద కర్రలు, ఈటెలు తప్ప వేరే ఆయుధాలు లేకపోయినప్పటికి వారు పోరాటం సాగించేవారు.

సూర్యాపేటనుండి దాదాపు యాభైమంది రజాకార్లు ఎక్కారం గ్రామానికి వచ్చారనే వార్త, బాలేముల, కందగట్ల, తిమ్మాపురం, పాత సూర్యాపేట తదితర గ్రామాలకు అందింది. దానితో ఆ గ్రామాలకు చెందిన మూడువేలమందికి పైగా ప్రజలు వడిసెలలు చేతబూని, నినాదాలు చేసుకుంటూ ఎక్కారం గ్రామం చేరుకున్నారు. రజాకార్ల నెదుర్కొన్నారు. వాళ్ళ దగ్గర గల ఆయుధాలను గుంజుకొనటానికి ప్రయత్నించారు. అంతటితో రజాకార్లు గ్రామాన్ని లూటీ జేయాలనే పథకాన్ని విడనాడి, తమ చేతుల్లో ఆధునిక ఆయుధా లున్నప్పటికీ, ప్రాణాలు దక్కించుకోవటంకోసం పలాయనం చిత్తగించవలసి వచ్చింది.

రివెన్యూ అధికారులు రజాకార్లతో కలిసి, భూమిశిస్తు పసూలు జేయటానికి కొంతపల్లి, పినఘూర గ్రామాలకు వెళ్ళారు. ప్రజలు వాళ్ళను చుట్టుముట్టి చంపివేశారు.

మిర్యాలగూడెం తాలూకా పాములపాడు గ్రామంలో ప్రజలు లక్ష్మారెడ్డి అనే భూస్వామిని వూరినుండి వెళ్ళగొట్టారు. పోలీసుల తోడ్పాటుతో తిరిగి గ్రామంలో ప్రవేశించటానికి అతడు ప్రయత్నించగా ప్రజలు కర్రలు, ఈటెలు చేతబూని వాళ్ళను ఎదుర్కొన్నారు. మూడురోజుల తర్వాత అదనపు బలగాలు వచ్చేంతవరకూ పోలీసులు గ్రామంలో అడుగుబెట్ట లేక పోయారు.

నైజాం అధికారులపట్ల, భూస్వాములపట్ల ప్రజలకుగల ద్వేషం యొక్క తీవ్రత, ప్రతిఘటించి పోరాడాలన్న వాళ్ళతత్వం ఈ సంఘటనలను బట్టి విదితమవుతోంది.

సూర్యాపేట తాలూకాలోని తుంగతుర్తి పోలీసుస్టేషన్ను, గానుగబండ, వెంపటి తదితర గ్రామాలకుచెందిన ప్రజలు చుట్టుముట్టారు. ప్రజలు నినాదాలు జేశారు వడిసెలలతో రాళ్ళురువ్వుతూ పోలీసులమీదికి నడిచారు. పోలీసులు ప్రజలపైకి కాల్పులు సాగించారు. ఈ దాడిలో ప్రజలకు నాయకత్వంవహిస్తూ నినాదాలిస్తూవుండిన కరివిరాల గ్రామానికి చెందిన కామ్రేడ్ మల్లిపాక మైసయ్య అక్కడికక్కడే మృతిచెందాడు. మరో ఇరువురు గాయపడ్డారు, మృతకళేబరాన్ని, గాయపడినవారిని తమతోపాటేతీసుకొని ప్రజలు వెనక్కుతగ్గారు

భువనగిరి తాలూకా కొలనుపాకలో జాగిర్దారు పెద్ద రజాకారు క్యాంపును ఏర్పాటుచేసి ప్రజలను కొల్లగొడుతుండేవాడు 1947 నవంబరు 23 న దాదాపు ఆరువేలమంది ప్రజలు ఈ క్యాంపుపై దాడిచేయడానికి సమీకృతులయ్యారు. జాగిర్దారు మరింత బలగంతో, అదనపు ఆయుధాలతో సిద్ధంగావున్నాడని గమనించిన ప్రజలు ఆ ప్రయత్నాన్ని విరమించారు. వారు జెండాలను ఎగురవేస్తూ వేరువేరు సమూహాలుగా ఇతర గ్రామాలకు వెళ్ళారు. 1947 నవంబరు 29 న ఎసిరెడ్డి నరసింహారెడ్డి నాయకత్వాన మూడువేలమంది ఉదయం ఆరుగంటలకల్లా ఆలేరు చేరుకొని అనేకతావుల్లో జెండాలు ప్రతిష్ఠించారు. ఊరేగింపుగా సాగిపోనారంభించారు. సాయుధ పోలీసులు రైఫిళ్ళు ఎక్కుపెట్టి వారి దారికడ్డం నిలిచారు అయినా ప్రజలు ముందుకు చొచ్చుకుపోయారు పోలీసులు వారిపై తూటాలవర్షం కురిపించారు. ఊరేగింపుకు నాయకత్వం వహిస్తున్న కామ్రేడ్ ఎసిరెడ్డి నరసింహారెడ్డికి తుంటిలో గుండుదూసుకుపోయింది. మరో ఇద్దరు అక్కడికక్కడే నేలకొరిగారు. మరో 80 మంది గాయపడ్డారు. గాయపడ్డవారిలో ముగ్గురు భువనగిరి ఆస్పత్రిలో మృతి చెందారు. పద్నాలుగుమందికి ఎముకలు విరిగిపోయాయి. ఆ ప్రాంతమంతా రక్తపు మడుగుల్తో నిండిపోయింది. మృతి చెందినవారు : పుసులోజి వీరయ్య, చిన్నం కొమరయ్య, మార్పు పుల్లయ్య, బిర్రు నారాయణ — వీరంతా గుండ్లగూడెం గ్రామానికి, ఎలగందుల లక్ష్మినరసయ్య తుంగతుర్తి గ్రామానికి చెందినవారు.

నకిరెకల్లు క్యాంపునుండి 20 మంది రజాకార్లు సాయుధ పోలీసులు నల్గొండ తాలూకాలోని నోముల గ్రామంపై దాడి జేశారు. నోముల, కొడవత్తి గ్రామాలకు జెందిన దాదాపు నాలుగువందలమంది కర్రలు వడిసెలలు, చేత

బూని, "కమ్యూనిస్టుపార్టీకి జై" "సంఘంకి జై" అనే నినాదాలు మారోగిస్తూ వాళ్ళవెంట బడ్డారు. రజాకార్లు పోలీసులు వున్మాదంతో ప్రజలపై కాల్పులు జరిపారు. యాభైసంవత్సరాల వయస్సుగల కరారి సోమయ్య, మత్సా వీరమల్లు యువకులైన వెంకయ్య, వీరయ్య, తమ ప్రాణాలను కోల్పోయారు. ఇంకా అనేకమంది గాయపడ్డవారిలో మరో యిద్దరు మృతిజెందారు తన పొట్టలోని ప్రేవులు చీలిపోయినా పన్నాల పాపయ్య పై పంచను పొట్టకు బిగించి కట్టి ధైర్యంగా లేచి నిలబడ్డాడు ఈ కాల్పుల అనంతరం ప్రజలు వెనకడుగు వేశారు. మృతిజెందినవారిని గాయపడ్డవారిని తమతో తీసుకుపోయారు.

కటుంగూరు క్యాంపునుండి రజాకార్లు పోలీసులు పరదాల గ్రామంపై దాడిచేసినప్పుడు మూడువందలమంది ప్రజలు కర్రలు, వడిసెలలు, చేతబూని వాళ్ళను వూరినుంచి తరిమి కొట్టారు. అయితే పోలీసులు దాగివుండి ప్రజలపై కాల్పులు జరిపారు. నలుగురు అక్కడికక్కడే మరణించారు.

మిర్యాలగూడెం తాలూకా రావులపెంట పోలీసుక్యాంపు ఆ పరిసర గ్రామాలపై దాడులకు కేంద్రం. ఆ గ్రామాలకు చెందిన ప్రజలు ఆగ్రహంతో ఆ క్యాంపును ధ్వంసం చేయాలని, ఎర్రజెండా ఎగురవేయాలని అనుకున్నారు. వేలాది ప్రజలు ఆ క్యాంపున్న గ్రామాన్ని చుట్టుముట్టారు. కాని నిరాయుధులైన ప్రజలు పోలీసుకాల్పులకు గురై చెల్లా చెదరై పోయారు.

## ఆయుధాల సేకరణ, గెరిల్లాదళాల నిర్మాణం, సాయుధ ప్రతిఘటన

ప్రజలు చొరవ తీసుకున్నారు. గ్రామాల్లోని యువకులు తమంత తామే గ్రామదళాలుగా ఏర్పడ్డారు. వీలైనచోటల్లా ఆయుధాలు సంపాదించారు. ప్రజలు తమ నాటుతుపాకులు, ఈటెలు, కత్తులు మొదలైన వాటినన్నింటినీ తీసుకొచ్చారు. వేటలో వుపయోగించే సాధనాలన్నీ చేతబట్టారు. గ్రామస్థులతో ఏదో ఒకవిధమైన ఒప్పందానికి వచ్చిన పటేళ్ళు, పట్వారీలు తమ ఆయుధాలు కూడా ప్రజలకు వొప్పగించేట్లు చేశారు. అందుకు నిరాకరించిన సందర్భాల్లో ప్రజలు వారియిండ్లలో ప్రవేశించి ఆయుధాలకోసం వెదకడం, దొరికిన ఆయుధాలను స్వాధీనం చేసుకోవటం జరిగింది. కొన్నియిండ్లలో దాచివుంచిన ఆయుధాలు ప్రజలకు కనిపించలేదు. అలాంటి సందర్భాలలో ఆ యిండ్లపై రాత్రింబవళ్లు నిఘా ఏర్పాటుజేసి, దాచివుంచబడిన ఆయుధాలను దాటవేయకుండా చూడటంకోసం ఆ యిండ్లలోని వాళ్ళ రాకపోకలను కనిపెట్టి చూస్తుండేవారు. స్థానిక ప్రజలపద్దగల ఆయుధాలను స్వాధీనం జేసుకొనటానికి, ప్రభుత్వానికి ఒప్పగించటానికి గ్రామాధికారులు ప్రయత్నం చేసినప్పుడు, ప్రజలు వాళ్ళ ప్రయత్నాలను వమ్ముచేసేవారు. ఉదాహరణకు జనగామ

తాలూకా కేశవపురం పటేలు ప్రభుత్వానికి ఒప్పగించటంకోసం దాదాపు పది బర్మార్లు ప్రోగుజేశాడు. చీటాకోడూరు గ్రామయువజనులు ఈ వార్తను పసిగట్టారు. హుటాహుటినివెళ్ళి వారే వాటిని స్వాధీనం చేసుకున్నారు. ఈ విధంగా ప్రజలు ప్రదర్శించిన చొరవఫలితంగా ప్రతి గ్రామంలో ఐదో, పదో బర్మార్లు లభ్యమైనాయి.

ఈ బర్మార్లతోపాటు, దేశముఖులనుండి తోతేదార్ తుపాకులు, షికారీ రైఫిళ్ళు మొదలైన వాటినికూడా స్వాధీనం చేసుకున్నారు. శత్రువు వొంటరిగా ఉన్నప్పుడో, అజాగ్రత్తగా ఉన్నప్పుడో ఇండ్లపై దాడులుజేసి ప్రజలీ ఆయుధాల్ని స్వాధీనం చేసుకునేవారు. ఈ కార్యక్రమంలో దేశముఖులకు బంధువులైన పార్టీ సభ్యులు, వారి యిండ్లలో పాలేర్లుగా, పనివాళ్ళుగా వుంటున్న అనేకమంది పార్టీ సభ్యులు ఎంతగానో తోడ్పడేవారు. వాళ్ళ ద్వారా దేశముఖుల కార్యకలాపాలకు సంబంధించిన వివరాలను చాకచక్యంగా తెలుసుకోవడంద్వారా వాళ్ళ ఆయుధాలను స్వాధీనం చేసుకోవడం సులభతరమవుతూ వుండేది. ప్రతిఘటించే స్థితిలో లేనప్పుడు దేశముఖుల యిళ్ళపై దాడులుచేసి ఆయుధాలు స్వాధీనం చేసుకునేవారు.

బర్మార్లు, పాట్‌గన్లు మొదలుగాగల అన్నిరకాల ఆయుధాలను ప్రజలూ, స్థానిక దళాలూ స్వాధీనం చేసుకునేవారు. ఆయుధాలను ప్రజలు, వారితోపాటే దళాలు వుపయోగించుకునేవారు. ఈ ప్రయత్నాలలో చాకచక్యంతోగూడిన పద్ధతులు వుపయోగించబడేవి. జనగామ తాలూకా సీనపల్లి దేశ్‌ముఖ్‌నుండి, హుజూర్‌నగర్ తాలూకా కొండాపురం దేశ్‌ముఖ్‌నుండి, సూర్యాపేట తాలూకా కాసర్లపాడుకు చెందిన సోమ్మేరు నరసింహారావు తదితర భూస్వాములనుండి, కూనూరులో చింతకుంట రాఘవరెడ్డినుండి, సైనిక దళానికి చెందిన ఒక జవానునుండి, కొండ్లపల్లి గ్రామానికి చెందిన కోరం ప్రతాపరెడ్డినుండి, రాజారం గ్రామానికి చెందిన పాగలి మల్లారెడ్డినుండి, కుమ్మరికుంట్లకు చెందిన జన్నారెడ్డి భూస్వాములనుండి ప్రజలు ఆయుధాలను స్వాధీనం చేసుకున్నారు. (ఇవన్నీ వరంగల్ తాలూకాకు చెందిన గ్రామాలు)

అదేవిధంగా పోలీసు, కస్టమ్స్ కేంద్రాలపైనా, రైల్వే రక్షణ పోలీసు బలగాలపైనా దాడులు జేసి ఆయుధాలు స్వాధీనం చేసుకున్నారు. ఉదాహరణకు కొన్ని . భువనగిరి తాలూకా కొలనుపల్లి; జనగామ తాలూకా అప్పావురం; కాబర్తి, పెంబర్తి; మధిర తాలూకా మోటమర్రి, హుజూర్‌నగర్ తాలూకా మాధవగూడెం, కరీంనగర్‌జిల్లా హుజూరాబాద్ తాలూకాకు చెందిన హుస్నాబాద్; సిద్దిపేట తాలూకాకు చెందిన దుబ్బాక, ఖానాపురం మొదలుగాగల అనేక క్యాంపులు.

ఆయుధాలు సంపాదించడం కోసరం శత్రు కేంద్రాలపై దాడులకు పథకాలు వేయటంలోనూ, దాడులు చేయటంలోనూ ప్రజలు స్థానిక దళాలు ప్రదర్శించిన చాకచక్యానికి వుదాహరణగా వంగపల్లి రైల్వే పోలీస్ శిబిరంపై జరిపిన దాడిని పేర్కొంటే సరిపోతుంది.

## వంగపల్లి స్టేషనుపై దాడి

వంగపల్లి రైల్వేస్టేషన్‌లో బందోబస్తుకై యిద్దరు పోలీసులు నియమించబడ్డారు. వాళ్ళవద్ద 303 రకం రైఫిళ్ళున్నాయి ఒక రోజు సాయంత్రం నాలుగు గంటల వేళ, నలుగురు కామ్రేడ్స్ బ్రాహ్మణ పురోహితుల లాగా వస్త్రాలు ధరించి స్టేషన్‌మాస్టరు గదిలోకి వెళ్ళారు. తాము నరసింహస్వామి దేవాలయాన్ని సందర్శించటానికి యాదగిరి గుట్టకు పోదలచామని, రైలు టిక్కెట్లిమ్మని అడిగారు అప్పుడు ఒక పోలీసు, తన రైఫిలును గోడ కానించి కూర్చొని వున్నాడు రెండవ పోలీసు స్టేషనులోనే లేడు ఒక కామ్రేడ్, రైలుచార్జీ ఎంత, ఏమిటి అని వివరాలడుగుతూ స్టేషను మాస్టరును సంభాషణలో దించాడు మరో యిద్దరు పోలీసును పట్టుకున్నారు. నాలుగో కామ్రేడ్ రైఫిల్ చేతబట్టాడు. పోలీసును, స్టేషను మాస్టరును బెదిరించి నలుగురూ ఆ రైఫిలు చేతబట్టుకుపోయారు మరునాడు వుదయం పోలీసులు యాదగిరి గుట్ట గుడికి వెళ్ళి పోలీసు రైఫిలు లాక్కుపోయారంటూ అచ్చటి అర్చకులను పట్టుకుని కొట్టారు. అదే సమయంలో ప్రజలు గ్రామ దళాలను ఏర్పరచుకొంటున్నారు. గ్రామాలపై దాడులు చేస్తున్న రజాకార్లను పోలీసులను ప్రతిఘటిస్తున్నారు. తమ యిళ్ళు వాకిళ్ళను, ఆస్తిపాస్తులను, మానమర్యాదలను, సంరక్షించుకోవడానికి వారు సంసిద్ధమై యున్నారు లెవీ, భూమిశిస్తు, ఆబ్కారీ సుంకం చెల్లించడం మానివేశారు. లెవీ క్రింద సేకరించబడిన ధాన్యం, భూస్వాములకు ప్రజావ్యతిరేక శక్తులకు చెందిన ధాన్యం ప్రజలకు పంపిణీ చేయబడింది. ప్రజలను బీభత్సానికి గురిజేస్తూ రజాకార్లకు సమాచారం అందచేస్తూన్న ద్రోహులపై వారనేక చర్యలు తీసుకునేవారు. వారు ద్రోహులను ముందుగా హెచ్చరించేవారు. అప్పటికీ ఫలితంలేకపోతే ప్రజలందరి ముందు ముక్కు నేలకు తగిలేట్లుగా సాగిలపడజేసి క్షమాపణ చెప్పించేవారు. జనగామ తాలూకా వడ్లకొండ గ్రామంలో లింగారెడ్డి అను నతడు ప్రజలను నానా రకాలుగా బీభత్సపరుస్తూ వుండేవాడు. ప్రజలాతనిని పట్టుకొని ముక్కు కోసివేశారు. గ్రామ ప్రజలను కొందరిని హత్యజేయించిన వాళ్ళను ప్రజాదళాలే చంపివేశాయి. అయితే ఆ విధమైన మొరటైన హింసా పద్ధతులను, క్రూరమైన ప్రతీకారాన్ని సంఘము, పార్టీ నిరుత్సాహపరిచాయి. ఆ తరువాత నిషేధించాయి.

## గెరిల్లా దళాల నిర్మాణం

రజాకార్లు, పోలీసులు ప్రతిరోజూ గ్రామాలపై దాడులు చేసేవారు. మహిళలను అవమానపరుస్తూ, చెరుస్తూ వుండేవారు ఇళ్ళు తగులబెట్టేవారు. ప్రజలను చంపేవారు నిర్బంధంగా లెవీ, ఎక్సైజు సుంకం వసూలు చేసేవారు. ప్రజలు వాళ్ళను ప్రతిఘటించడం ప్రారంభించారు. పార్టీ సుశిక్షితమైన సాయుధ గెరిల్లా దళాలను నిర్మాణం చేసింది. అవేలేకపోతే ప్రజాప్రతిఘటన పటిష్ఠంగా వుండటంగాని, విజయవంతమవడంగాని సాధ్యపడేది కాదు. ప్రారంభంలో జిల్లా గెరిల్లా దళాలు ఏర్పరచబడ్డాయి. ఆ తరువాత తాలూకా గ్రామదళాలు ఏర్పడ్డాయి అధీనంలోఉన్న కొలదిపాటి ఆధునిక ఆయుధాలు జిల్లా దళాలచేతుల్లో వున్నాయి. గ్రామ, తాలూకా దళాలకు అధునాతన ఆయుధాలు లేవు రజాకార్లను పోలీసులను ప్రతిఘటించడం జిల్లా దళాలు మాత్రమే నిర్వర్తించజాలవు. ఆచరణలో ఈ విషయాన్ని పార్టీ గుర్తించింది. తాలూకా దళాలను నిర్మాణం చేసింది జిల్లాదళాలనుండి వాటికికూడా అధునాతన ఆయుధాలు కొన్నింటిని అందజేసింది. జిల్లా దళానికి వివిధ తాలూకా దళాలకు మధ్య సమన్వయం, పరస్పర సహాయం ఏర్పాటు చేయబడింది.

సూర్యాపేట, హుజూర్‌నగర్, నల్గొండ తాలూకాలలో ఒక ప్రత్యేక దళంలోని సభ్యుల సంఖ్య పది-ఇరవైనుండి నూరు, నూటఇరవైకి పెరిగింది. వాటిని కంపెనీ దళాలనేవారు

ఈ కంపెనీ దళాలు గెరిల్లాలకు ప్రజలకు ఉత్సాహ ప్రోత్సాహాలు కల్పించుతున్నప్పటికీ నిర్వహణ విషయంలో భారంగా తయారయ్యాయి. శత్రువు దాడికి సులభంగా గురవుతూ వుండేవి. దళసభ్యులకు, అవసరమైన శిక్షణ దళ నాయకులకు శిక్షణ, దళ సహాయక సిబ్బందికి శిక్షణ, కంపెనీ స్థాయిలో లోపించింది. మొత్తం కంపెపీ పోరాటం సాగించడానికి అవసరమైన సాంకేతిక, సైనిక నైపుణ్యం, దాని వివిధ దళాలమధ్య ఎత్తుగడల విషయంలో సమన్వయీకరణ, చేతిలోవున్న ఆయుధశక్తిని, మానవశక్తిని సమన్వయ పరచటం జరగడంలేదు. సరఫరాల ఏర్పాటు, శీఘ్రంగా చెదిరిపోవడం, తిరిగి సమీకృతం కావడం, ఆకస్మికదాడులు జరపడం, శత్రువును దెబ్బగొట్టి శీఘ్రగతిని వెళ్ళిపోవటంవంటి చర్యలు వాటివల్ల సాధ్యపడలేదు. గెరిల్లా కార్యకలాపాలకు అవసరమైన ఈ మౌలిక లక్షణం లోపించటం తీరని నష్టాలకు, సర్వనాశనానికి దారితీసి వుండేది. కాని నైజాం బలగాల మనోనిబ్బరం అధమ స్థాయిలో ఉండటం, అవి పూర్తిగా ప్రజలనుండి వేరుబడి యుండటంవల్ల అలా జరగలేదు. తొలిదశలో కొన్ని నష్టాలకు గురై, అనుభవాలు గడించినమీదట

ఈ కంపెనీ దళాల నిర్మాణం ఈ దశలో చేపట్టదగింది కాదని వదిలివేయటం జరిగింది. పదిమంది సభ్యులుగల చిన్న గెరిల్లా దళాలే ఆచరణయోగ్యమైన ప్రామాణికమైన దళాలుగా అంగీకరించబడింది. ఎక్కువబలగం అవసరమైన సందర్భాల్లో రెండు మూడు దళాలను సమీకరించటం జరిగేది.

ఆ తరువాత భారత యూనియన్ సైన్యం ప్రవేశించినమీదట ఈ దళాల పరిమాణం ఐదునుండి మూడువరకు తగ్గించబడింది. శత్రువుకు అంతు దొరక్కుండావుండటంకోసరం, తగిన ఆశ్రయం పొందటంకోసరం కార్యాచరణకుగాను సులువుగా కదలటంకోసరం ఈ మార్పు అవసరమైంది.

గెరిల్లా బలగాల అన్నింటి నిర్మాణస్వరూపం దిగువ పేర్కొన్న విధంగావుంది .

1. గ్రామ దళాలు :- గ్రామంలోని యువకులు ఈ దళాల్లో చేరతారు తమ సాధారణ కార్యకలాపాలను సాగిస్తూనే, వారు బర్మార్లతో, ఈటెలతో, రజాకార్లను పోలీసులను ప్రతిఘటించేవారు గ్రామంలోగల శత్రువులు తలెత్తకుండా చూచేవారు గ్రామంలోని దిగజారుడు మితవాదులు, పోరాటసమయాల్లో ప్రజలను నిరుత్సాహపరచకుండేట్లు, గందరగోళం వ్యాపింపచేయకుండేట్లు, ధాన్యం లెవీ పన్నులు మొదలైనవి చెల్లించమని ప్రోత్సహించకుండునట్లు చూసేవారు. వారు ప్రజల్లో రాజకీయ ప్రచారం సాగించేవారు ప్రజలను ఉత్తేజ పరచేవారు గ్రామకమిటీల దైనందిన కార్య కలాపాల్లో తోడ్పడేవారు.

2. నిర్మూలన దళాలు · ఈ బలగాలు తమ తమ వృత్తి సంబంధమైన కార్యకలాపాలు సాగిస్తూనే శత్రువాహనాలు ప్రవేశించకుండా నిరోధించేందుకు రోడ్లకు గండ్లు త్రవ్వటం, శత్రువాహనాల కుర్ర గాలితీయటం కోసరం ఇనప సీలలు దించిన చెక్కలను నాటటం, పోలీస్ శిబిరాలలోను, శత్రు శిబిరాలలోను వుంటున్న శత్రువుల ఆస్తులను ధ్వంసం చేయటం ఈ దళాల కార్యక్రమం. వాటివద్ద బర్మార్లు, పారలు, పలుగులు, గింపలు, చెక్కలు, ఇనపసీలలు మొదలైన పరికరా లుండేవి. గ్రామదళాలతో సమన్వయపరచి తమ కార్యకలాపాలు సాగించేవారు. ఈ దళాల సభ్యులు ఫలానా అని ఇతరులకు తెలియనివ్వకుండా ఉంచేవారు.

3. గెరిల్లా దళాలు తమ వృత్తులను వదిలిపెట్టి పూర్తికాలం ఉద్యమం కోసమేవారుపనిజేసేవారు. ధైర్యసాహసాలుగలవారు, సమయస్ఫూర్తి గలవారు, ప్రజల విశ్వాసాన్ని పార్టీ విశ్వాసాన్ని చూరగొన్నవారు, ఎంతో క్రమశిక్షణ గలవారు, ఈ దళాల్లోకి చేర్చుకోబడేవారు. బర్మార్లు, ఈటెలు

మొదలగువాటితో పాటు వారికి అధునాతన ఆయుధాలు పరిమితంగావుండేవి. రజాకార్, పోలీసు దాడులను ప్రతిఘటించటం, శత్రువును నిర్మూలించటం ప్రజలను సంరంక్షించటం వారి ప్రధానమైనపని. ఒక్కొక్క దళంలో దాదాపు పదిమంది చొప్పున ఉండేవారు. అవసరమైనపుడు దాడులుచేసి వెనువెంటనే చెదిరిపోయేవారు గ్రామదళాలు ఈ గెరిల్లా దళాలతో సహకరించి పనిచేసేవి. అవసరమైనప్పుడు వాటికి తోడ్పడేవి. ఈ బలగాలలోకి చేర్చుకోబడిన ప్రతిసభ్యుడూ ఒక ప్రమాణం తీసుకోవాలి. అంతేగాక ఎల్లప్పుడూ దానిని గుర్తుంచుకొని, దానిపైనే కేంద్రీకరించవలసి యుండేది. ఆ ప్రతిజ్ఞ దిగువ విధంగా వుండేది :

> "నేను గెరిల్లా బలగంలో చేరుతున్నాను. దోపిడీదారుల పాలనను అంతంజేసి ప్రజారాజ్యం స్థాపించటానికి నేను దృఢనిశ్చయంతో ప్రతిన బూనుతున్నాను. శత్రువుపై పోరాడి నిర్మూలించుటం, ప్రజలకు సహాయపడడం నా ఏకైక కర్తవ్యం. ఆయుధాలు ప్రాణంకంటె విలువైనవి. ఆయుధాలు సంపాదించటంలో, వాటిని కాపాడటంలో ప్రాణాన్నర్పించటానికైనా నేను సంసిద్ధుడనై వున్నాను. నేనెన్నడూ పిరికితనాన్ని ప్రదర్శించను. శత్రువుముందు తలవంచను. అమరవీరుల ఆదర్శాన్ని పాటిస్తాను. అరుణపతాకం ఎదుట నేనీ ప్రమాణం తీసుకొంటున్నాను."

గెరిల్లా దళాల నిర్మాణానంతరం పార్టీ పని, రాజకీయ సైనిక శాఖలుగా విభజించబడింది. ఇదొక ప్రధానమైన చర్య. ఈ రెండు శాఖల పనికి మధ్య సన్నిహిత సమన్వయం వుంది. గెరిల్లా దళాల నిర్మాణంలో, సాయుధ ప్రతిఘటనోద్యమంలో మార్పు వచ్చింది. గెరిల్లాలు శత్రు బలగాలపై ముఖాముఖిని తలపడి పోరాడటం శత్రు శిబిరాలపై దాడులు జరిపి ధ్వంసం చేయటం జరుగుతుండేది. ఈ ప్రతిఘటనా దాడుల్లో గెరిల్లా దళాలు నైపుణ్యం సంపాదించాయి. శిక్షణ పొందని యువకులు దళాల్లో చేరటం ప్రజల తోడ్పాటుతో దేశముఖుల యిండ్లపై దాడులు జరిపి బర్మార్లను, తుపాకులను స్వాధీనం చేసుకోవడం, రజాకారు దాడులను ఎదుర్కొని పోరాడటం ఎలా జరుగుతున్నదీ యింతకుముందే వివరించబడింది. వీరిలోనుండి సమర్థులైన యువకులను గెరిల్లా దళాల్లోకి చేర్చుకునేవారు. నాటు ఆయుధాలతోగూడిన ఈ దళాలు ప్రజా సాయుధ బలగాలకు మూలకందంగా రూపొందాయి. ఒక గ్రామం తరువాత మరొక గ్రామంలో ప్రభుత్వ అధికారాన్ని కూలద్రోసి తెలంగాణాలో మూడువేల గ్రామాల్లో ప్రజారాజ్యాన్ని స్థాపించడానికి ప్రజలకవి దోహదపడ్డాయి.

## కొన్ని ముఖ్యమైన సాయుధచర్యలు

**1.** రాఘవులవెంట క్యాంపుపైదాడి : జిల్లా సాయుధ దళాల నిర్మాణానంతరం జరిగిన మొట్ట మొదటిదాడి ఇదే. ఈ క్యాంపును ధ్వంసంచేసి ఆయుధాలు స్వాధీనం చేసుకోవాలని దళం నిర్ణయించింది సెంట్రీపై కాల్పు లెవరు జరపవలసింది, క్యాంపు హౌస్‌ను ఎవరెవరు చుట్టుముట్టవలసింది, సెంట్రీని చావగొట్టినతరువాత లోపలికి ఎవరుప్రవేశించవలసింది, ఆయుధాలు ఎవరు తీసుకోవలసింది అంతా ముందుగానే నిర్ణయించబడింది. ఎవరి పనికి వారు సిద్ధంగా నిలిచారు రాత్రి 11 గంటలకు సెంట్రీపై కాల్పులు జరిపారు. అయితే లోపలున్న పోలీసులు ఎదురు కాల్పులు జరిపారు ఈ పోలీసు కాల్పుల ఫలితంగా గెరిల్లాలు తమ పథకం ప్రకారం లోపల ప్రవేశించలేక పోయారు. ఈజిల్లా దళం నాయకులైన కామ్రేడ్స్ వెంకటరెడ్డి, దేవబత్తిని వెంకటేశ్వర రావుగార్లు లోపల ప్రవేశించడానికి సాహసోపేతంగా ప్రయత్నించారు వారు తమ స్థానాలనుండి కదిలి ముందుకువచ్చారు. పోలీసుల తుపాకీ గుండ్లకు ఎరయై వారిద్దరు అక్కడికక్కడే మృతిజెందారు. ఆ దాడి విఫలమైంది. తమ కామ్రేడ్స్‌యొక్క మృతదేహాలతో గెరిల్లాలు వెనక్కు వెళ్ళిపోయారు. శత్రువుకు సంబంధించిన యిద్దరు వ్యక్తులుకూడా ఈ పోరాట సందర్భంగా మరణించారు మరొకముగ్గురు గాయపడ్డారు

## 2. కోటపాడు వూదరబాంబు

సూర్యాపేట తాలూకా కోటపాడు గ్రామసమీపాన ఐదుగురు రజాకార్లు, ఏడుగురు పోలీసులు ఒక స్త్రీని చెరచడానికి ప్రయత్నించారు. ప్రజలూ, గెరిల్లాదళమూ వాళ్ళ వెంటబడి తరిమారు. వాళ్ళు వంగేటి లింగారెడ్డి అనే భూస్వామియింట్లో ప్రవేశించారు ఆ యింటి రెండో అంతస్థులోదూరి తలుపులు బిగించుకొని కిటికీలలోగుండా గెరిల్లాలపై కాల్పులు ప్రారంభించారు గెరిల్లాలు గ్రామంచుట్టూ కాపలాపెట్టారు. ఆ ఇంటిగోడలనే మాటు జేసుకొని రజాకార్లపై కాల్పులను జరిపారు. తమ కాల్పులు వృధా అవు తూండటం గమనించి గెరిల్లాలు కాల్పులు నిలిపివేశారు. శత్రువుమాత్రం నిరంతరాయంగా కాల్పులు సాగిస్తున్నాడు. గ్రామస్తులంతా ఆ భవనానికి చుట్టూ చేరారు. గెరిల్లాల కన్ని విధాల సహాయపడుతూ నిలిచారు. ఎండుగడ్డి తీసుకొచ్చి ఆ భవనం చుట్టూ వేసి వూదరపెట్టాలని వారిలో ఒకరు సూచించారు. గెరిల్లాలు దీనికి అంగీకరించారు. ఆ తరువాత అనేక సందర్భాల్లో ఈ ఎత్తుగడ అనుసరించబడింది. అదే ఊదర బాంబుగా ప్రసిద్ధి కెక్కింది.

గ్రామస్థులు అత్యంత ఉత్సాహంతో భూస్వాముల వాములలోని గడ్డినంతా తెచ్చి పడేశారు తన ఇంటిని ధ్వంసం చేయవద్దని ఆ భూస్వామి ప్రజలను ప్రాధేయపడ్డాడు. రజాకార్లను కాపాడ్డానికి కూడా అతడు ప్రయత్నించాడు. అందువల్ల ప్రజలు అతని కోర్కెను త్రోసిపుచ్చి ఆ ఎండు గడ్డికి నలువైపులా నిప్పుముట్టించారు. మంటలు వేగంగా వ్యాప్తిగాంచాయి. పొగ శత్రువును పూదరపెట్టింది. దాంతో వాళ్ళు వేడిమిని భరించలేక పోయారు. తాము లొంగిపోతామని, తమ ప్రాణాలను కాపాడమని శత్రువు మొరబెట్టుకున్నాడు. ఆయుధాలను ముందుగా క్రింద పడేయమని గెరిల్లాలు వారిని కోరారు గత్యంతరం లేక శత్రువు గెరిల్లాల డిమాండుకు అంగీకరించాడు ప్రజలు వెంటనే ఇంకా ఎక్కువ గడ్డితీసుకొచ్చి ఆ ఇంటిచుట్టూ తివాచీలా పరిచారు పైనుంచి పడవేసిన ఆయుధాలు ఏవీ చెడిపోకుండా వుండటం కోసం వారాపని చేశారు. కొన్ని ఆయుధాలను మాత్రమే బయట పడవేసి గెరిల్లాలను మోసగించాలని శత్రువు ప్రయత్నం చేశాడు ఈ లోగా ప్రజలు మంటలు ఆర్పివేశారు.

గెరిల్లా నాయకుడు కొందరు దళ సభ్యులతో కలిసి మేడమీదకు వెళ్ళాడు. శత్రువును లొంగిపోవలసిందిగా కోరాడు. ఒక రైఫిల్‌ను తనవద్ద దాచి వుంచుకొన్న పోలీసువాడు గెరిల్లా నాయకునిపై కాల్చడానికి ఎక్కుపెట్టాడు. వెంటనే గెరిల్లాదళం వాళ్లపై కాల్పులు జరిపి వాళ్ళందరినీ చావగొట్టారు.

మరునాడు తెల్లవారేసరికి సుమారు అరువందలమంది సైనికులు, పోలీసులు, రజాకార్లు వచ్చి గ్రామాన్ని చుట్టుముట్టారు. ఆ పరిసరాల్లో పదిమైళ్ళవరకూగల ప్రదేశాలన్నింటినీ గాలించారు. దురదృష్టవశాత్తు ఈ సైనిక ముట్టడిలో గెరిల్లాదళం పట్టుబడింది. అయినా అత్యంత నైపుణ్యంతో శత్రువు మీద కాల్పులుజరుపుతూ ఎలాంటి నష్టంలేకుండా తప్పించుకొని బయటపడింది.

కామ్రేడ్ గొల్ల కొమరయ్య దిట్టమైన మనిషి. గెరిల్లాలకు తోడుగా పనిచేసిన స్థానిక ప్రజల్లో ఆయనొకరు బరువైన పెద్ద తుపాకి నొకదానిని శత్రువు చేజిక్కకుండా కాపాడాలని ఆయన ప్రయత్నించాడు. దాన్ని కొంత దూరం మోసుకెళ్ళాడుకూడా. అంతలోనే శత్రువు ప్రేల్చిన తూటా వొకటి ఆయన పొట్టలోగుండా దూసుకుపోయి మృతిజెందాడు. ఆ తుపాకి శత్రువుల హస్తగతమైంది. అదేరోజు శత్రువులు కోటపాడు గ్రామమంతటినీ నిప్పుపెట్టి దగ్ధం చేశారు. పారిపోతున్న ప్రజలపై కాల్పులు జరిపారు. ఆ కాల్పుల్లో నలుగురు ప్రజలు మరణించారు. తాము దాడి జరిపిన అనంతరం దాడి జరిపిన పరిసరాలలో ఎక్కడా వుండకూడదని గెరిల్లాలు ఈ ఘటన సంపర్భంగా అను

భవంద్వారా తెలుసుకున్నారు బాగా దూరంగా వెళ్లిపోవాలని, తాము శీఘ్రంగా వెళ్లిపోవటానికి ఆటంకంగావుండే బరువైన ఆయుధాలనుగాని ఇతర పరికరాలనుగాని, వేటినీ వెంటవుంచుకొనరాదని తెలుసుకున్నారు. అందు కనుగుణంగా అన్ని దళాలకూ ఆదేశాలను వెంటనే పంపించారు. అంతేగాదు, అవసరమైనప్పుడెల్లా సాధ్యమైనప్పుడెల్లా, శత్రువుజాడను పసిగట్టటంకూడా దళాలన్నింటి సాధారణ ఎత్తుగడలలో ఒకటిగా తయారైంది

3. *చింతలమ్మ గూడెంలో పెద్దనష్టం కలుగజేసిన సంఘటన*. జిల్లాదళంలో ఒకభాగం హుజూర్‌నగర్ తాలూకాలో సమాచారసేకరణ జరుపుతోంది. చింతలమ్మగూడెం శివారుగ్రామానికి సమీపంలోని పెదవీడులో మకాం వేసింది.

పెదవీడు, చింతలమ్మగూడెం గ్రామాలురెండూ పార్టీకి బలమైన కేంద్రాలు. ఈ గ్రామాల్లో అనుభవం కలిగిన సమరశీలురైన పార్టీ సభ్యులున్నారు. దుర్మార్గుడుగా పేరుమోసిన గురువయాళ్‌సింగ్ అనే సబ్ ఇనస్పెక్టరుకు వారు గట్టిగా బుద్ధిచెప్పారు. వ్యవసాయ కార్మికులు సమ్మె చేస్తుండగా ఆ సమ్మెను విచ్ఛిన్నం చేయడం కోసరం భూస్వాములు హిందూ ముస్లిం విభేదాలు లేవనెత్తారు సమ్మె చేస్తున్న కార్మికుల్లో ఎక్కువమంది ముస్లిములు. హిందూ భూస్వాములు కార్మికులకు ధాన్యం యివ్వటం మానివేశారు. ఈ పరిస్థితిని ఆధారంగా చేసుకొని ముస్లిం కార్మికులను వేరేసంఘంగా ఏర్పాటు చేయడానికి రజాకార్లు మత పెద్దలు ప్రయత్నం చేశారు. ఈ సమ్మె కారణంగా ఆ రెండు గ్రామాలు ఉద్రిక్తంగావున్నాయి.

స్థానిక గ్రామ కామ్రేడ్స్ తమకు దగ్గర్లోనే దళం వున్నసంగతి తెలుసుకున్నారు తాలూకా నాయకుల సాయం కోరారు సమస్యను పరిష్కారం చేయడంకోసం మొత్తం దళంతోసహా తాలూకా నాయకుడు గ్రామంలోకి వచ్చాడు. దగ్గర్లోనేవున్న రఘునాథపాలెంలోగల రజాకార్లకు ఈ వార్త చేరింది. వాళ్ళూ, పోలీసులు కలిసివచ్చి గ్రామాన్ని చుట్టుముట్టారు. పోలీసులు రజాకార్లు గ్రామానికొస్తూ వుండడాన్ని చెట్టుమీద కూర్చొనివున్న సెంట్రీ గమనించలేకపోయాడు. దళంలో కొంతభాగం గ్రామంలోకి ప్రవేశించేమార్గాన్ని నిరోధించి శత్రువు లోపలికి ప్రవేశించకుండా అడ్డుపడింది. మరొకభాగం శత్రువు ముట్టడిని బ్రద్దలుగొట్టి సురక్షితంగా వెనకడుగు వేయడానికి ప్రయత్నించింది

రజాకార్లు పోలీసులు గ్రామంలో ప్రవేశించలేకపోయారు. పోరాటం సాగుతోంది. కామ్రేడ్ లింగన్న పొట్టకు గుండుదెబ్బ తగిలి గాయపడ్డాడు. అయినప్పటికీ లింగన్న అసమానమైన ధైర్యసాహసాలను ప్రదర్శించి దృఢ

నిశ్చయంతో పోరాడాడు. శత్రుశ్రేణిని ఛేదించుకొని ఒక మైలుదూరం పరుగెత్తాడు ఇక వోపికలేక పరుగెత్తలేకపోయిన స్థితిలో వెంటాడుతున్న అశాసరూఢులైన పోలీసులు ఆయనను పట్టుకొని చంపివేశారు. చివరకు పోలీసుల్నూ రజాకార్లు గ్రామంలో ప్రవేశించారు. కామ్రేడ్ సీతారామయ్య అని పిలువబడే, గోపయ్య బొడ్డురాతి వెనుక నిలిచి శత్రువులను ఎదుర్కొంటున్నాడు. ఒక నెలా రోజులక్రితం తన రైఫిల్‌తో సహా సైన్యానికి సలాంకొట్టి దళంలో వచ్చి చేరిన ఒక సైనికుడు ద్రోహంచేసి సీతారామయ్య వీపుమీద ఈటెతో పొడిచాడు. సీతారామయ్య కదలలేకపోయాడు. శత్రుబలగం లోపలికి చొచ్చుకొనివచ్చింది. చివరి క్షణంలో ఒక పోలీసును చంపి సీతారామయ్య ప్రాణాలు విడిచాడు.

ఈ సంక్షోభంలో ప్రతిఘటనను విడనాడి వెనుకకు తప్పుకోవాలని మిగిలిన దళం నిర్ణయించింది. దళసభ్యులు గ్రామంనుంచి బయటపడ్డారు కాని శత్రువు వాళ్ళను చుట్టుముట్టాడు. శత్రుతూటా దెబ్బతగిలి కామ్రేడ్ శంకర రెడ్డి మరణించాడు ఈటె పోటువల్ల కామ్రేడ్ పుల్లయ్య గాయపడ్డాడు. భీషణ పోరాటానంతరం మాత్రమే వారు శత్రుముట్టడినుండి ఆయనను విడిపించుకొని సురక్షితంగా వెనకడుగు వేయగలిగారు. శత్రుబలగంలోనూ ముగ్గురు మరణించారు. అయితే పార్టీ తీవ్రంగా నష్టపడింది. ముగ్గురు అత్యుత్తమ కామ్రేడ్స్‌ను కోల్పోయింది. మూడు ఆధునిక ఆయుధాలు, నాలుగు చేతి బాంబులు నష్టపోయింది ఇదొక గుణపాఠం. అనుభవంలేని సైనికదళం తన గెరిల్లా నిబంధనలను విస్మరించినపుడు పెద్ద నష్టానికి గురవుతుంది.

**4.** *గెరిల్లాల ప్రతీకారం* : రావులపెంట గ్రామంపై గెరిల్లా దాడి సందర్భంగా ఇద్దరు కామ్రేడ్స్ మృతిజెందారు. చింతలమ్మగూడెంపై శత్రుదాడి సందర్భంగా మరో ముగ్గురు ఆహుతయ్యారు తాలూకాలోని అన్ని గ్రామాలనుండి వచ్చిన దాదాపు ఐదువందలమంది దళ సభ్యులతో సమావేశం జరిగింది. తమ కామ్రేడ్స్ మృతికి ప్రతీకారం తీర్చుకోవాలని ప్రతి ఒక్కరూ ప్రతినబూనారు అనేకమంది జిల్లా దళంలో చేరారు. కంపెనీదళం ఆ విధంగా ప్రారంభమయింది

రఘునాథపాలెం క్యాంపుతోసహా ఆ ప్రాంతమంతటాగల రజాకార్లు పెదవీడు గ్రామంలో చేరారు. చింతలమ్మగూడెం దాడి అనంతరం ఐదవ రోజున గెరిల్లా దళం పెదవీడును చుట్టుముట్టింది. ఆ గ్రామాలకు వచ్చే రోడ్లన్నింటినీ గెరిల్లాలు నిరోధించారు. గ్రామం మధ్యలో రజాకార్లతో తలపడ్డారు. ఉదయం 5 నుండి 10 గంటలవరకు పోరాటం సాగింది. రజాకార్లు ఇళ్ళపై అంతస్తుల పైకెక్కి అక్కడినుండి కాల్పులు జరపడం ప్రారంభించారు. శత్రువును నిర్మూలించడంకోసరం దళ సభ్యులు ముందుకు సాగిపోయారు.

చివరకు వారికి కోటపాడు ఊదర బాంబు విషయం స్ఫురణకొచ్చింది. శత్రువు తిష్ఠవేసివున్న ఇండ్లకు నిప్పంటించాలని నిర్ణయించారు. దాంతో వాళ్ళు తమ స్థావరాలనుండి బయటకు రాక తప్పలేదు. అందులోనుండి మరీ పేరుమోసిన వాళ్ళను బయటకు లాగి పోరాటం సాగించారు ఈ పోరాటంలో పేరు మోసిన రౌడీ రజాకార్లు ఆరుగురు మరణించారు. జై జై ధ్వానాలమధ్య దళ సభ్యులు గ్రామం నుండి వెళ్లారు. ఆ తరువాత సైన్యం వచ్చి తమ వారి మృత కళేబరాలను తీసుకుపోయింది. తాలూకా అంతటినుండి, ప్రతి గ్రామం నుండి గెరిల్లా దళానికి అభినందన సందేశా లందాయి. శత్రువు తలదీసి నట్లయింది. మరింత మనోనిబ్బరం కోల్పోయాడు.

5. *కందగట్ల నూతులవద్ద దాడి* ఒక గెరిల్లాదళం, ఆ ప్రాంతపు రాజకీయ ఆర్గనైజర్, కందగట్ల నూతులవద్ద మకాం వేశారు. భూమి పంపిణీకి సంబంధించిన తమ సమస్యలనుగూర్చి చర్చించడానికి ప్రజలక్కడకు వెళ్ళారు. చర్చలు సాగుతున్నాయి. గెరిల్లాల శిబిరం ఆచూకీ తెలుసుకొని జిల్లా కలెక్టరు ఉదయం పదిగంటలవేళ యాభైమంది రజాకార్లను పోలీసులను పౌరదుస్తులలో వెంటబెట్టుకొని అక్కడకు వెళ్ళాడు. డ్యూటీలో వున్న సెంట్రీ అజాగ్రత్తగా వుండటంవల్ల శత్రువు రెండువందల గజాలదూరంలోకి వచ్చే వరకు గమనించలేకపోయాడు. గెరిల్లాలు శత్రువుపై కాల్పులు జరుపుతూ రాతిగుండ్లమాటున రక్షణపొందారు. తమ ఆధునిక ఆయుధాలతో విచ్చల విడిగా కాల్పులు జరుపుతూ గెరిల్లాలపై దెబ్బగొట్టాలని శత్రువు ప్రయత్నిం చాడు. అయితే తమ ఆర్గనైజర్ ఆదేశానుసారం గెరిల్లా దళసభ్యులు క్రమ పద్ధతుల్లో క్రమశిక్షణతో వెనుకకు వుపసంహరించుకున్నారు. ఒకదళం వుపసంహరించు కుంటుండగా మరొక దళం శత్రువు కన్నుగప్పుతూ చివరకు అందరూ సురక్షితంగా రాతి ప్రదేశానికి చేరుకున్నారు. ఈ పోరాటంలో శత్రుబలగంలోని యిద్దరు మృతిజెందారు. దాంతో శత్రువు గెరిల్లాదళంపై ధూకడానికి సాహసించలేదు. ఈ పరిస్థితి గెరిల్లాలకెంతో ఉపయోగపడింది. గెరిల్లాలు రక్షణ పొందినరాతి గుండ్లకు రెండువందల గజాలదూరంలోనే త్రిభుజాకారంలో మూడు పెద్ద రాతి బండలున్నాయి. గెరిల్లాలు ఒకబండ చాటుకు చేరగా, రజాకార్లు రెండో బండమాటున రక్షణ పొందారు. శత్రువుకు అవకాశమివ్వకుండా, గెరిల్లాలు మూడవరాతిబండను శీఘ్రమే ఆక్రమించు కున్నారు. అనుకూలమైన స్థానంనుండి శత్రువు కాల్పులు జరపనారంభించాడు. శత్రు బలగం ఆయుధాలు, మందుగుండు సామాగ్రి తగినంత చేతిలో బెట్టుకొని,

పెద్ద సంఖ్యాబలం కలిగివుంది. అయినా, తాము రక్షణ పొందినచోటునుండి ముందుకు రాలేకపోయారు. చాలాసేపు పోరాటం సాగిన అనంతరం శత్రువు రంగంవిడిచి వెళ్ళిపోయాడు.

ఇక్కడ గమనార్హమైన విషయమేమంటే, గెరిల్లాల కండగావున్న ప్రజలు, శత్రుసంచారానికి సంబంధించిన సమాచారాన్నిగూర్చి వుత్సాహంతో బిగ్గరగా కేకలువేసి చెబుతూ గెరిల్లాలకు తోడ్పడ్డారు. అచ్చటినుండి వెళ్ళిపో వలసిందిగా ప్రజలకు గెరిల్లాలు సలహాయిచ్చారు. అయినా, గెరిల్లాలు తమ దగ్గరున్నంతకాలం, శత్రువువల్ల తమకెలాంటి హాని జరగబోదన్న విశ్వాసంతో, శత్రువు సర్వనాశనం కావాలని, గెరిల్లాలకు సంపూర్ణ విజయం చేకూరాలని ఆకాంక్షిస్తూ అక్కడే నిలబడ్డారు. పాత్ర సామగ్రితోసహా, గెరిల్లాలకు సంబంధించిన అన్నింటి విషయంలోనూ ప్రజలు అత్యంత శ్రద్ధాసక్తులు కనబరిచారు. ఆ కాల్పులలో జిల్లాకలెక్టరుకు చెవిప్రక్కనే తూటాదెబ్బ తగిలింది. ఆ దెబ్బతో ఆ కలెక్టరు బెదిరిపోయాడని, ఇంకెప్పుడూ పోరాటం జరుగుతుండగా రంగానికి దరిదాపుల్లో ఎక్కడా వుండబోనని లెంపలేసుకున్నాడని ప్రజలు చెప్పుకున్నారు.

6. *మామిళ్లగూడెం క్యాంపుపై మెరుపుదాడి:* సూర్యాపేట తాలూకా మామిళ్ళగూడెంలో దాదాపు యాభై మంది పోలీసులు మకాం వేశారు పరిసర గ్రామాలలో పిచ్చెత్తినట్లు సంచరిస్తూ, ప్రజలను బీభత్స పరుస్తూ, రాత్రివేళల స్త్రీలను మానభంగాల పాలుజేస్తూ వుండేవారు. ఈవార్త విని గెరిల్లా దళ సభ్యులిరువురు తెల్లదుస్తులు ధరించి బయలుదేరారు. తమ తూటా తుపాకీలను తమ చొక్కాల క్రింద వుండునట్లుగా, వొంటికి కట్టుకున్నారు. పోలీసు లంతాచేరి కులాసా కబుర్లు చెప్పుకుంటుండగా, రాత్రివేళ ఆ క్యాంపు దగ్గర కెళ్ళారు. ఆకస్మికంగా ఆ పోలీసులపై వొక చేతిబాంబు విసిరారు. తమ వద్దగల తుపాకులను ప్రేల్చారు. ముగ్గురు పోలీసులు మృతిజెందారు. ఇది జరిగిన తర్వాత, రాత్రివేళల్లో గ్రామాల పైబడి భీభత్సకాండ సాగించే పనిని శత్రువు మానుకున్నాడు అయితే, ఏ మాత్రం శబ్దం వినిపించినా భయంతో కంపించిపోయి యిష్టం వచ్చినట్లు కాల్పులు జరుపుతుండేవారు.

7. *బిక్కుమళ్ల మామిడితోటపై దాడి* నలభైమంది రజాకార్లు, పోలీసులు, దేశముఖ్ గూండాలు బిక్కుమళ్ళ గ్రామంపై దాడి జేశారు వాళ్ళు తమ వంటకు గ్రామంలో ఏర్పాటు జేసుకున్నారు. పొరుగునేవున్న మాచినేపల్లి గ్రామంపై దాడిచేయటానికి బయలుదేరారు. గ్రామసమీపంలోని రాతిగుండ్లమాటున దాగియున్న గెరిల్లాలు తమ సెంట్రీ ద్వారా శత్రుసంచారాన్నిగూర్చిన జాడ తెలుసుకున్నారు. దూరదర్శిని యంత్రంతో పరికించిచూచి, ఆ వార్తను ధృవపరచుకున్నతరువాత గెరిల్లా

దళం కదిలింది. దళం రెండు భాగాలుగా విడివడింది. ఒకభాగం గ్రామంలో ప్రవేశించటానికి, మరొకభాగం గుంటలలో దాగివుండి శత్రువు గ్రామంలో ప్రవేశించకుండా, శత్రువుది పైచేయికాకుండా కనిపెట్టివుండటానికి నిర్ణయించారు. శత్రువు సమీపించేసరికి గెరిల్లాలు అన్నివైపులనుండి ఒకేసారి కాల్పులు జరిపారు. శతృవుకు దెబ్బ తగిలింది. పారిపోనారంభించారు దళం వారిని వెంటాడి తరిమింది ఒక మైలుదూరంపోయిన తరువాత శత్రువులు మామిడితోటలో ప్రవేశించారు. గెరిల్లాలపై కాల్పులు జరిపారు. గెరిల్లాలు కూడా మామిడిచెట్లమాటున రక్షణ తీసుకున్నారు. గెరిల్లాలను తోటలో ప్రవేశించనీయకూడదని శత్రువు వేసుకున్న పథకం వమ్మయిపోయింది. గెరిల్లాలు తోటలో ప్రవేశించి శత్రువును మూడువైపుల నుండి లాకిడికి గురిజేశారు. మామిడితోటంతా తుపాకీకాల్పులతో మార్మోగిపోతోంది.

తమకు సమీపంలోనే పోరాటం సాగుతోందని మూడు నాలుగు మైళ్ళ దూరానగల గ్రామ ప్రజలుకూడా గ్రహించారు. చిన్ననెమిలి, పెద్ద నెమిలి, బిక్కుమళ్ళ గ్రామాల ప్రజలు బయటకువచ్చి దూరాన్నుండే ఈభీషణ పోరాటాన్ని గమనిస్తూ గెరిల్లాలకు విజయం చేకూరాలని హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తూ నిలుచున్నారు మధ్యాహ్నం రెండుగంటలవరకూ శత్రువు అడుగడుగునా ప్రతిఘటించాడు. తాడిచెట్ల మాటున నిలిచి విచ్చలవిడిగా కాల్పులు జరిపాడు. గెరిల్లాలు తమ తూటాలను ఆచి తూచి శత్రువును చంపడానికి మాత్రమే వాడుతూ ముందుకు నడుస్తున్నారు. శత్రువును మామిడితోట నుండి బయటకు వెళ్ళగొట్టారు. తాము ప్రయాణం చేసిన కంచరగాడిదలను తమ ఆహార పదార్థాలు మొదలైన వాటిని ఎక్కడివక్కడే వదిలేసి ప్రాణాలు అరచేత బట్టుకొని ఎర్రపాడు క్యాంపుకు పారిపోయారు. పోరాటంలో శత్రు బలగంలోని నలుగురు గాయపడ్డారు

**8. చీటకోడూరులో రజాకార్లచే హత్య :** జనగాము తాలూకా చీటకోడూరులో రెవిన్యూ అధికారికి తోడ్పడటంకోసరం జనగామునుండి రజాకార్లు వస్తుండేవారు ఒకరోజున ఆరుగురు రజాకార్లు ఆ గ్రామంలోని ఒక మహిళను చెరిచారు. ఆ తర్వాత, ఇక తమ నెవరూ అడ్డుకొనగలవారు లేరని భావిస్తూ నిరాయుధంగా కూడా గ్రామంలో తిరగనారంభించారు. ఒకనాడు తాటితోపులో కల్లుత్రాగుతూ కూర్చున్న ముగ్గురు రజాకార్లను ప్రజల సహకారంతో గెరిల్లాలు పట్టుకున్నారు. వాళ్ళలో వొకడు గతంలో గెరిల్లా దళాలలో వున్నవాడు. ఆతనిని మందలించి వదలివేయటం జరిగింది. అతడు వెళ్ళి రజాకార్ల క్యాంపులో ఈ విషయం చెప్పుకున్నాడు. మూడవరోజున, సుమారు

రెండువందలమంది రజాకార్లు, పోలీసులు ఆ గ్రామంపైబడి, కొత్త వీరారెడ్డి, కొత్త రాజారెడ్డి, కొండం హనుమయ్య, అయ్యోరు రామయ్యలతోసహా పలువురు కామ్రేడ్స్‌ను చంపివేశారు. గ్రామానికి నిప్పంటించి, ధ్వంసంచేశారు.

9. *పులిగిళ్ళ గ్రామంపై రజాకార్ల, పోలీసుల దాడి ఇరవైరెండుమంది గ్రామస్థుల హత్య* పాత భువనగిరి తాలూకాలోని పులిగిళ్ళ గ్రామంలో గెరిల్లా ఆర్గనైజర్ గ్రామం వెలుపల ప్రజల సమావేశం జరుపుతున్నాడు. ద్రోహులద్వారా ఈ సమాచారం తెలుసుకొని ముస్త్యాలపల్లి క్యాంపునుండి సుమారు 30 మంది రజాకార్లు, పోలీసులు ఆ సమావేశంపై దాడి చేయడానికి ఒక లారీలో వచ్చారు డ్యూటీలో వున్న సెంట్రీ వాళ్ళ రాకను గూర్చి గెరిల్లాలకు తెలియపర్చాడు. గెరిల్లాలు ఒక ఫర్లాంగు వెనక్కు వెళ్ళి, రాతిగుండ్ల మాటున ఆశ్రయం పొందారు. రజాకార్లు అరక్షిత స్థానానికిగారానే ఎత్తుమీదవున్న గెరిల్లాలు వాళ్ళపై కాల్పులు జరిపారు. శత్రువుకు రక్షణ ఏదీ లేదు కాన, వాళ్లు వెంటనే నేలపై పండుకొని కాల్పులు ప్రారంభించారు వాళ్ళ తూటాలు ఎవరికీ తగులలేదు కొంతసేపటికి గత్యంతరంలేక తమ లారీని దగ్గరకు పిలిపించుకొని దాని చాటునుండి రక్షణపొందుతూ మెల్లగా లారీలోకి ఎక్కిపారిపోయారు రెండువైపులా ఎవరికీ నష్టాలుజరగలేదు. ఈ సంఘటనతో శత్రువుకు తలవంపైంది. ఆ గ్రామంపై మరల దాడి చేశారు కనిపించిన వాళ్ళనెల్లా చంపివేశారు. శత్రువు కాల్పులకెరయై 22 మంది ప్రజలు మృతి చెందారు.

**10.** *అడ్డగూడూరు క్యాంపును ఎత్తివేయించటంకోసం పోరాటం.* పరిసర గ్రామాలపై దాడులు జేయటానికి స్థావరంగా వుండగలందులకై రజాకార్లు రామన్నపేట తాలూకా అడ్డగూడూరులో ఒక క్యాంపు ఏర్పాటు జేసుకున్నారు. ఆ క్యాంపులో సుమారు యాభైమంది రజాకార్లు, పోలీసులు మకాం పెట్టారు పరిసర గ్రామా లన్నింటినుంచి గెరిల్లా దళాలు ఐదువందలమంది ప్రజలను సమీకరించి ఆ క్యాంపు దగ్గరకు తీసుకువచ్చారు. అప్పటికే చీకటిపడింది. అందువల్ల వారా రాత్రికి మూలరేగడి గ్రామంలో పూరిబయట మకాం వేశారు. రజాకారు క్యాంపుపై ఉదయమే దాడి చేయాలనుకున్నారు. పోలీసులకీవార్త తమ మనుషులద్వారా చేరింది. తెల్లవారు ఝాము నాలుగు గంటలకు వాళ్ళుముందుగా గెరిల్లా దళాలపై దాడి చేశారు.

డ్యూటీలోవున్న సెంట్రీ, పోలీసులను చూడగానే ప్రమాద సంకేతాన్ని చూపించాడు. ప్రజలు, గెరిల్లాలు శత్రువుపై రాళ్ళు రువ్వుతూ విజృంభించారు. శత్రువు ప్రజలపై కాల్పులు సాగిస్తూ ముందుకు నడిచాడు. తూటా దెబ్బలు తప్పించుకోవడం కోసరం ప్రజలు దేనినో ఒకదానిని చాటుచేసుకొని

నిలచారు. భూమిమీద పండుకొన్నారు. ప్రజలు ఆ ప్రాంతమంతా చెల్లా చెదురుగా వున్నారు. గెరిల్లాలు కూడా శత్రువుపై తిరిగి కాల్పులు జరిపారు. శత్రుబలగంలోని నలుగురు అక్కడికక్కడే మరణించారు. మరోముగ్గురు గాయపడ్డారు. చచ్చినవాళ్ళను, గాయపడ్డవాళ్ళను తీసుకొని శత్రువు వెనక్కు వుడాయించాడు ప్రజా బలగాలకు నాయకత్వస్థానంలోవున్న నన్నెబోయిన శాయన్న (ఆదింపేట), పొడిచెడు లింగయ్య (అనాచిపురం) శత్రు తూటా దెబ్బలు తగిలి గాయపడ్డారు. లింగయ్యకు పొట్టలో గుండుదెబ్బ తగిలి అక్కడికక్కడే మృతిజెందాడు. శాయన్న చాలా బలమైన మనిషి. అయినా తలకు తూటాదెబ్బతగిలి చావుబ్రతుకులమధ్య వున్నాడు. గెరిల్లాదళం ఆయనకు చికిత్స చేస్తూ, ఇంకా గాయపడిన వారెవరైనా వున్నారేమోనని వెదుకు తోంది. అప్పటికే తెల్లగా తెల్లవారిపోయింది. పోలీసులు మరింత విసురుగా వచ్చిపడ్డారు. దూరంనుండే కాల్పులు ప్రారంభించారు గ్రామప్రజల్లో ఒకరి తుంటికి తూటాదెబ్బ తగిలింది ఆయన కాలు విరిగింది. గెరిల్లాదళాలు తిరిగి కాల్పులు సాగించాయి ఆ తరువాత వెనకకు తగ్గాయి. శత్రువుగ్రామంలో ప్రవేశించాడు. అప్పటికే చావు బ్రతుకులమధ్యనున్న శాయన్న గొంతుకను బాయినెట్‌తో పొడిచారు. అయితే, ఈ పోరాటానంతరం అడ్డగూడూరు క్యాంపు ఎత్తివేయబడింది.

**11. *అనంతపూరులో మహిళా మానసంరక్షణ*:** జన గామ తాలూకా అనంతపూరుకు ఇరవైమంది పోలీసులొచ్చారు. ప్రజలపై బీభత్సకాండ ప్రారంభించారు. వాళ్ళలో నలుగురు ఒక మహిళను చెట్ల చాటుకు లాక్కుపోయారు. సమీపంలోనేవున్న దళం ఆ మహిళను రక్షించ టానికి హుటాహుటిని ముందుకువచ్చింది. వాళ్ళనుజూచి పోలీసులు కాల్పులు ప్రారంభించారు. అయినా గెరిల్లాలు నూతిస్థంభాల చాటునసలిచి తిరిగి కాల్పులు సాగించారు. ఈ అవకాశం చూచుకొని ఆ మహిళ తప్పించుకొని పోయింది. ఆ గ్రామంలోవున్న పోలీసులు ప్రజలను బీభత్సపరుస్తూన్న వాళ్ళల్లా కాల్పులు జరుపుతూ దళంమీదికి వచ్చారు. తమవద్ద ఒక రైఫిల్ మాత్రమే వున్నప్పటికీ పోలీసులు ముందుకు రాకుండా గెరిల్లాదళం అటకాయించ గలిగింది. ఆ తరు వాత పోలీసులు, దళం అక్కడినుండి వెళ్ళిపోయారు. పోలీసు బీభత్సంనుండి గెరిల్లాలు తమకు రక్షణ కల్పించారని ప్రజలెంతో సంతోషపడ్డారు. విజయో త్సవం జరుపుకున్నారు.

**12. *కొండూరు సమీపంలో లెవీ ధాన్యం బండ్లను విడి పించడంకోసం పోరాటం*:** పడిశాల, ఎలమాయిగూడెం గ్రామాలలో మమారు 15 మంది పోలీసులు నిర్బంధంగా ధాన్యం లెవీ వసూలుచేసి 20 బండ్ల

మీద వేసుకొని కొండూరు గ్రామంమీదుగా తీసుకువెళుతున్నారు. ఈ గ్రామాలన్నీ పాత భువనగిరి తాలూకాకు చెందిన గ్రామాలు. తమవద్ద బర్మార్లు మాత్రమేవున్న గెరిల్లాలు ఆ బండ్ల వెనక రక్షణ తీసుకొని బండ్లకు ముందున్న శత్రువుపై కాల్పులు జరిపారు. పోలీసులేమో ముందుబండ్ల చాటున రక్షణపొంది వెనుకకు కాల్పులు జరిపారు. బండ్లను వేగంగా తోలవలసిందిగా బండ్లవాళ్ళపై వత్తిడిచేశారు. దళసభ్యుల్లో ఒకరు తన బర్మార్‌లో తుపాకి మందుతో పాటు ఒక సీసపుగుండు కూడా పెట్టి పేల్చాడు. తూటాలాగా పెద్ద శబ్దంచేస్తూ దూసుకుపోయింది. దాంతో పోలీసులు భయపడ్డారు ఈ విధంగా కాల్పులు జరుగుతుండగా వెనుక భాగంలోని బండ్లుకొన్ని వెనకకు మరలి తప్పించుక పోయాయి.

*నసింపేటలో*. సూర్యాపేట తాలూకా నసంపేట గ్రామం నుండి రజాకార్లు, పోలీసులు నిర్బంధంగా లెవీ ధాన్యంసేకరించి బండ్లమీద వేసుకుపోతున్నారు. కామ్రేడ్ గోపాలరెడ్డి నాయకత్వాన గెరిల్లాలు నలుగురు శత్రువులను కాల్చి చంపారు. బండ్లవాళ్లుకూడా పారిపోయారు. నేలమీద పండుకొని విచ్చలవిడిగా కాల్పులు సాగించిన శత్రువులుకూడా ఆబండ్ల నక్కడే వదలిపెట్టి పారిపోయారు. ఆ తరువాత గెరిల్లాల సహాయంతో గ్రామస్థులు ఎవరి ధాన్యాన్ని వారికి వొప్పగించారు.

*నూతనకల్లులో*: గెరిల్లాలు ప్రజలు కలిసి జరిపిన కృషి ఫలితంగా 160 బస్తాలు లెవీధాన్యం రైతులకు తిరిగి వొప్పగించబడింది

*అమ్మనబ్రోలు గ్రామంలో*: పాత భువనగిరి తాలూకాకు చెందిన అమ్మనబ్రోలు గ్రామానికి సుమారు 20 మంది రజాకార్లు, పోలీసులు వచ్చారు. లెవీ ధాన్యాన్ని నిర్బంధంగా వసూలు చేశారు. ఆ ధాన్యాన్ని బండ్లపై వేసుకొని బయటకు తోలుకువెళ్ళ నారంభించారు. వూరుదాటి ఒక ఫర్లాంగుదూరం వెళ్లేసరికి గెరిల్లాలు ఆ బండ్లను కలుసుకున్నారు. మూసీ కాలువ కట్టను మాటుగా పెట్టుకొని శత్రువుపై కాల్పులు జరిపారు. శత్రువు, వెనక భాగంలో వున్న బండ్లను వదలివేసి ముందుభాగంలో వాటితోనే వెళ్ళి పోయారు. వెనక భాగంలో వున్న బండ్లను వెనకకు మరలించి ఆ ధాన్యాన్ని రైతులకు తిరిగి యిచ్చివేశారు.

**13.** *అశ్వికదళ దాడులకు వ్యతిరేకంగా పోరాటం*: అశ్వారూఢులైన సుమారు 30 మంది రజాకార్లు, పోలీసులు వేకువజామునే పాతభువనగిరి తాలూకాలోని అర్రూరు గ్రామాన్ని చుట్టుముట్టారు. వాళ్ళ ఇండ్లపై దాడులుజేసి కొన్ని యిళ్ళు లూటీ జేశారు కొందరు స్త్రీలను మాన భంగం చేశారు. గ్రామస్థులందరిని నిర్బంధించి కొండపక్కనేవున్న చింత

చెట్లక్రిందకు తీసుకువచ్చారు. ప్రజలను కొట్టడంకోసరం చింత బరికెలు నరకడంలో పోలీసులంతా నిమగ్నమయ్యారు. ఉదయం 9 గంటలయింది. గెరిల్లాదళానికీవార్త చేరింది దళంలోని 40 మంది సభ్యులు మూడుబృందాలుగా చీలి శత్రువుపై దాడిచేయడానికి పథకం వేశారు. నిర్ణయించుకున్న ప్రకారం ఒక బృందం గ్రామంలోని ఒకబంగళాపైకెక్కి కూర్చున్నారు. రెండవబృందం ప్రజలందరూ మందవేయబడియున్న కొండపైకెక్కారు. మూడవ బృందం గ్రామాని కవతల ప్రక్కనున్న చిన్నచెరువులో సన్నద్ధంగా కూర్చున్నారు. మూడువైపులనుండి ఒకేసారి కాల్పులు జరిపారు. చెట్లకు కట్టివేయబడియున్న శత్రుగుర్రాలు రెండు వెంటనే చనిపోయాయి. శత్రుబలగాలు నేలమీద బోర్లా పండుకున్నాయి. గ్రామస్థులు విముక్తిపొందారు. గ్రామంలోకి తిరిగి వెళ్ళారు శత్రువుకి రక్షణ ఏదీలేదు. అందువల్ల వాళ్ళు నేలమీద పాకుకుంటూ పశువులశాలలో చేరారు వాళ్ళచ్చటినుండి కాల్పులు జరిపినా, ఆ తూటాలు గెరిల్లాలకు తగలవు. పైగా బంగళామీదినుంచి గెరిల్లాలు కాలుస్తున్న తూటాలు సూటిగా పశువులశాలకు తగులుతున్నాయి. శత్రువు పశువులశాలగోడల మాటున రక్షణపొంది నిలిచాడు ఆ విధంగా ఎంతసేపు నిలవగలమనేది వారికే తెలియదు, వాళ్ళు బయటకు రానూలేకపోయారు. కొంతిసేపైన తరువాత గెరిల్లాదళం వెనక్కు వుపసంహరించుకొంది. శత్రువు వెనక్కితిరిగి చూడ కుండా పారిపోయాడు.

వెలమజాల గ్రామం. పాత భువనగిరి తాలూకాలోని వెలమ జాల గ్రామంలో దళం అధ్వర్యాన బహిరంగసభ జరుగుతూండగా 12 మంది అశ్వారూఢులైన సాయుధ సైనికులు అక్కడకు వచ్చారు. సెంట్రీ ఆ విష యాన్ని దళానికి ఎరుకపరచాడు. వారు సభను రద్దుజేసి గ్రామం వెలుపలికి వెళ్ళిపోయారు. కానీ పోలీసులు అతివేగంగా వాళ్ళను వెన్నంటి తరిమారు. అది బహిరంగసస్థలం. దళ సభ్యులకు రక్షణగాని, మాటుగాని ఏదీలేదు. శత్రు వుపై కాల్పులు జరుపుతూ తప్పించుకు పోవడానికి ప్రయత్నించారు. కామ్రేడ్ గంటా పాపిరెడ్డి అత్యంత ధైర్యసాహసాలతో నిలచి తన బర్మార్‌తో సబ్ ఇన్‌స్పెక్టరుకి గురిపెట్టి కాల్చాడు. అది కొద్దిలో తప్పిపోయింది. అప్పుడు శత్రువు తన కాల్పులన్ని ఆ కామ్రేడ్‌పైనే గురిపెట్టి సాగించాడు. ఆయన రొమ్ముకి గుండుదెబ్బ తగిలింది, తాను మరణించడం ఖాయమని తెలుసుకున్న ఆ వీరుడు లేచి నిలబడ్డాడు శత్రువు కాల్పులన్నీ తనమీదే కేంద్రీకరించబడే ట్లయితే దళంలోని మిగతా సభ్యులంతా తప్పుకుపోవడానికి వీలవుతుందనే ఉద్దే శంతో వీరోచితంగా పోరాడాడు.

గంటా పాపిరెడ్డి భువనగిరి తాలూకా కప్రాయపల్లి గ్రామ వాస్తవ్యులు. ఆయన గెరిల్లా బలగాల్లో చేరి ఆ ప్రాంతమంతటా బాగా పని చేశాడు. తన జీవితాన్ని త్యాగం చేసి తన కామ్రేడ్స్‌ని కాపాడాడు.

రాపాక గ్రామం : మోతుకూరు క్యాంపునుండి ఒక అశ్వికదళం బయలుదేరి పాత భువనగిరి తాలూకాలోని రాపాక గ్రామంపై దాడిచేసింది. గ్రామంలోవున్న గెరిల్లా దళం తప్పుకుపోవడానికి ప్రయత్నించింది. శత్రువు అది గమనించి వారిని వెంటాడాడు. గెరిల్లాలు గ్రామ పొలిమేరలు దాటక ముందే గుర్రాలు వారిపైకి వచ్చిపడ్డాయి. గెరిల్లాలు నేలపైన బోర్లా పండుకొని శత్రువుపై కాల్పులు జరిపారు గెరిల్లా దళపు కాల్పుల ధాటికి ఆగలేక శత్రువు వెనుదిరిగి వెళ్ళిపోయాడు. తిరిగి వెళుతుండగా వాళ్ళకు ఆదింపేట గ్రామ నాయకుడు కామ్రేడ్ కొండుకూరు మల్లయ్య కనుపించాడు. ఆయన దగ్గర ఆయుధమేదీ లేదు. తప్పించుకుపోవడానికి ప్రయత్నిస్తుండగా పోలీసు లాయన్ని కాల్చిచంపారు. ఈ దాడినుండి గడించిన అనుభవం ఫలితంగా ప్రజలకు, గెరిల్లాలకు, అశ్విక దళాలను సైతం ఎదుర్కొని జయప్రదంగా పోరాడగలమన్న విశ్వాసం యేర్పడింది.

సోలిపేట తాటితోపుల్లో పోరాటం : నల్లగొండ తాలూకా సోలిపేట తాటితోపుల్లో కంపెనీ దళం వున్నదనే వార్త తెలుసుకొని సుమారు 40 మంది రజాకార్లు, 20 మంది అశ్విక పోలీసులతో సహా ఉదయం 11 గంటలకు అక్కడకు చేరారు గెరిల్లా దళమే చొరవ తీసుకొన్నది తాడిచెట్లను మాటు చేసుకొని శత్రువుపై మూడువైపులనుండి కాల్పులు జరిపారు. ఒక గుర్రమూ, ముగ్గురు పోలీసులూ తక్షణమే మరణించారు. వెనక్కు కాల్పులు జరుపుకొంటూ మిగిలినవాళ్లు పారిపోయారు. పారిపోతున్నవాళ్ళను గెరిల్లాలు వెంటాడి తరిమారు. ఈ పరాజయానికి ప్రతీకారం తీర్చుకోవడంకోసం, ప్రజల వుత్సాహాన్ని చల్లార్చడంకోసం రజాకార్లు బీభత్సకాండకు పూనుకున్నారు. ఓగోడులో ఏడుగుర్ని, కాపర్తిలో ఆరుగుర్ని, వల్లాలలో ఐదుగుర్ని కాల్చి చంపారు.

14. ఎర్రబెల్లి కొండపై భీషణ పోరాటం : వరంగల్ తాలూకా ఎర్రబెల్లి గ్రామంపై ఒక రోజున పోలీసులు దాడి జేశారు. గ్రామంలో భోజనం చేస్తున్న దళం, వాళ్ళను తరిమివేసింది. పోలీసులు ప్రజలమధ్యన దాక్కొని నెమ్మదిగా వెళ్ళిపోయారు. ప్రజలకు తగులుతాయేమోనన్న భయంతో గెరిల్లాలు కాల్పులు జరపలేకపోయారు, హుజూరాబాద్ తాలూకాలోని ముల్కాపూర్ క్యాంపునుండి 60 మంది సైనికులు నారాయణగిరి, ముప్పారం గ్రామాలపై దాడిచేశారు. వాళ్ళు ఎర్రబెల్లి గ్రామ

ప్రజలపైన కూడా బీభత్సకాండ సాగించారు. ఆ తరువాత ఆ వూరి తాటి తోపులో కల్లుత్రాగుతూ కూర్చున్నారు ఈలోగా వంట చేయించుకొంటు న్నారు. సైన్యం ఎక్కడకు వెళ్ళినప్పటికి గెరిల్లాదళం వెన్నాడుతూనేవుంది. ఈ మూడు గ్రామాల ప్రక్కనే ఒకే శ్రేణిలో చిన్న కొండలున్నాయి వాటిని "ఇనుపర్తిగట్లు" అనేవారు. దళసభ్యులు చెట్ల కొమ్మలను మాటుజేసుకొని ఆ కొండలపైకి వెళ్ళారు చివరకు ఎర్రబెల్లినుండి ముల్కాపూర్ క్యాంపుకు వెళ్లేదారిలో కొండరాళ్ళ మాటున కాచుకు కూర్చున్నారు. సాయంత్రం 5 గంటల ప్రాంతంలో సైనికులు, తప్పద్రాగి నాలుగు పెద్దబండ్లలో ఆ దారినే వస్తున్నారు. వండిన ఆహార పదార్థాలను ప్రజలచేత మోయించుకుపోతున్నారు. కొందరు సైనికులేమో వాళ్ళ వెనుకనే నడుస్తున్నారు. మొట్టమొదటిబండి మాత్రమే సవారీ బండి. మిగతా బండ్లన్నీ పైన కప్పులేని బండ్లు

వాళ్ళు తమ కాల్పులకు అందే దూరంలోకి రాగానే, గెరిల్లాలు తమవద్దగల రైఫిళ్ళు, గైడర్, తదితర ఆయుధాలతో ఆ బండ్లపై కాల్పులు జరిపారు. ప్రత్యేకించి, గైడర్‌నుంచి తూటాలు శతృవుకు సూటిగా తగిలాయి. మొదటిదెబ్బలోనే శతృబలగంలోని 11 మంది మరణించారు. మరికొంతమంది గాయపడ్డారు మొట్టమొదటిబండిలో కూర్చొనివున్నవాళ్ళ అధికారి పారి పోయాడు. అతనిజాడ తెలియలేదు మిగతా సైనికులు ఆ బండ్లమాటు నుండి కాల్పులు ప్రారంభించారు. శతృవుకు ఆహారపదార్థాలు మోసుకు వెళ్తున్నవారూ వాళ్ళవెనుకనున్న సైనికులూ పారిపోయారు. ఒకఎద్దు చచ్చి పోయింది. మిగతావి పారిపోయాయి ఒక బండికి తగిలించిన రైఫిల్ కూడా బండితోపాటే వెళ్ళింది. చచ్చిన, గాయపడిన సైనికులు రోడ్డుమీదే పడి వున్నారు. మిగతావాళ్ళు దళ సభ్యులను దగ్గరకు చేరనీయకుండా కాల్పులు జరుపుతున్నారు. అయినా దళం భీషణపోరాటం సాగించింది. ఉభయపక్షాలకు పూర్తిగా మాటువుంది. రాత్రి 8 గంటల వరకు పోరాటం సాగింది. ఇంకా ఎక్కువ సైన్యం వచ్చేట్లయితే ప్రమాదం ఏర్పడుతుంది గాబట్టి దళం వుపసంహరించుకుంది ఆ తరువాత అదనపు సైన్యపు బలగాలు వచ్చాయి. వెలుతురు బాంబుల సహాయంతో ఆ కొండలన్నీ వెదికారు. కాల్పులు సాగి స్తూనే తమవాళ్ళ శవాలను, గాయపడిన వారినీ తీసుకొని వెళ్ళిపోయారు. బండికి వ్రేళ్లాడుతున్న రైఫిల్‌ను బండి యజమాని దళానికి అందజేశాడు. దానికి "ఎర్రబెల్లి రైఫిల్" అని పేరుపెట్టారు. ఆ రైఫిల్ స్వంతమవటం ఆ దళానికి ఎంతో గర్వకారణంగా వుండేది. ఈ సంఘటన జరిగిన మూడు రోజుల తరువాత సైన్యం తిరిగి ఆ గ్రామంమీదికివచ్చి ముగ్గురు లంబాడీలను కాల్చి చంపారు.

**15. కొత్తకొండలో :** హుజూరాబాద్ తాలూకాలో సెంట్రీ నిదురబోతున్నందువల్ల సాయుధపోలీసుల రాకతో దళం విస్తుపోయింది. అయినా కాల్పులు జరుపుతూ కొండలమీదికి వెళ్ళిపోయింది. సైన్యం వారిని వెంటబడి తరిమింది అయినా దళ సభ్యులు కొండలకు చేరి రక్షణ పొందారు. అయితే దళంతో కలిసి మాట్లాడాలని వచ్చిన విద్యార్థులు రామచంద్రం (కరీంనగర్) దేవానందం (వరంగల్) వాళ్ళతోపాటుపరుగెత్తలేక ఒక పశువుల చావిడిచాటున తలదాచుకున్నారు. సైనికులు వాళ్ళిద్దరినీ పట్టుకొని కలిపికట్టి కాల్చిచంపారు. సైనికులు వెళ్ళిపోయిన తరువాత దళం వెనక్కు తిరిగి వచ్చింది. తమ నష్టాలకోసరం వెతుక్కున్నది ఈ రెండు మృతదేహాలనూ చూసి తగువిధంగా అంత్యక్రియలు జరిపారు. ఈ నష్టానికంతా కారణమైన వ్యక్తిని చంపివేశారు. ఇది జరిగినతరువాత దళం సమావేశమయింది. కీలక సమయంలో బలహీనత ప్రదర్శించిన నాయకుణ్ణి తొలగించి మరొక నాయకుడిని ఎన్నుకున్నారు.

**16.** *లింగంపల్లివద్ద పెద్దనష్టం* హుజూరాదాద్ తాలూకా లింగంపల్లిలో రెండు దళాలున్నాయి. వాళ్లు గ్రామం వెలుపల కాపలా పెట్టారు. దళ నాయకుల్లో ఒకరు అజాగ్రత్తగా గడ్డం గీసుకొంటున్నాడు. పోలీసు లాయన దగ్గర కొచ్చేసరికి, ఆయన కేకలు వేస్తూ పరుగెత్తాడు దళం లోని యితర సభ్యులు పోలీసులపై కాల్పులు జరుపుతూ ఆ ముట్టడినుండి తప్పించుకోవడానికి ప్రయత్నించారు. ఆ ప్రయ్నం కొంతమేరకే సఫలమయింది. కామ్రేడ్సు నర్రా గోపాలరెడ్డి (జనగామ తాలూకా), రేగుల ఔరా పురం, మల్లారెడ్డి (పసరమడ్ల), బోడా అయిలయ్య (మద్రిగడ), మరో యిరువురు హుజూరాబాద్ కామ్రేడ్సు ఈ పోరాటంలో మృతిజెందారు. ఇది పగలు 11 గంటల వేళ జరిగింది.

**17.** *మానుకోట తాలూకాలో పోరాటం ;* చెట్లముప్పారం గ్రామంలోవున్న గెరిల్లా దళాన్ని దాదాపు వందమంది పోలీసులు చుట్టుముట్టారు. అది అటవీ ప్రాంతం. అయినా, సెంట్రీ అజాగ్రత్త ఫలితంగా, పోలీసులు మొత్తం ప్రాంతమంతటినీ చుట్టుముట్టేవరకూ గెరిల్లాలు గమనించలేకపోయారు. దళ నాయకుడు, అత్యధిక ధైర్యస్థయిర్యాలతో, తన స్టెన్ గన్‌తో శత్రువుపై అన్నివైపులా కాల్పులు జరిపాడు, శత్రుబలగంలోని పది మంది మృతిజెందారు. ఇంకా అనేకమంది గాయపడ్డారు. మిగతా పోలీసులూ నేలమీద బోర్లా పండుకొన్నారు. శత్రువు మృతి జెందినచోట పెద్ద ఖాళీ ఏర్పడింది. శత్రువు భయకంపంతో క్రింద పరుండటంతో గెరిల్లాలకు ఆ ముట్టడి నుండి తప్పించుకుపోవడానికి అవకాశం కలిగింది శత్రుశ్రేణిలో ఏర్పడిన

ఖాళీ ప్రదేశంగుండా తప్పుకుపోతున్న వారిపై శత్రువు తిరిగి కాల్పులు సాగిం చాడు. దళ నాయకుడు మాత్రం శత్రువుపై తన కాల్పులను కొనసాగిస్తూనే వచ్చాడు. ఆ విధంగా శతృవు ముందడుగు వేయడానికి అవకాశం లేకుండా చేశాడు మూడు తూటాలు అతని ముంజేతికి తగిలాయి. అయినా విరిగిన ముంజేతితోనే తన స్టెన్‌గన్‌ను పట్టుకొని విడువలేదు. గాయాలనుండి రక్తం కారుతున్నా ఆయన తన పట్టును విడవలేదు. కాస్త వెనకడుగువేసి తుప్పల మాటున నిలద్రొక్కుకున్నాడు. గెరిల్లాలవైపునుండి కాల్పులు ఆగడంతో శతృవు ముందుకు వచ్చాడు. రక్తపు మరకల జాడనే వెదకనారంభించారు. దళనాయకుడు దాగియున్న తుప్పలచుట్టూ వెదికారు. చివరకు చీకటిపడింది. తమవైపువాళ్ళ మృతదేహాలను తీసుకొని శత్రువులు వెళ్ళిపోయారు. ఇక దళ నాయకుడొకడే మిగిలాడు ఆయనకు దాహం వేస్తోంది రక్తం కారిపోయి నందువల్ల చాలా బలహీనంగా వున్నాడు. అతి కష్టంమీద సమీపంలోని గ్రామానికి చేరుకున్నాడు గ్రామస్తుల సహాయంతో సురక్షితమైన ఆశ్రయానికి చేరుకున్నాడు అక్కడినుండి ఆయనను చికిత్సకోసం వేరొక స్థలానికి పంపారు. స్త్రీ వేషంలో ఒక పల్లకిమీద శతృశ్రేణిని దాటవలసివచ్చింది. ఆ దళ నాయకుడు గొప్ప సమయస్ఫూర్తి, ధైర్యం ప్రదర్శించివుండకపోతే 40 మందిగల మొత్తం దళమంతా పూర్తిగా తుడిచిపెట్టుకుపోయి వుండేదే.

అమ్మనబ్రోలు పోరాటం ; మోతుకూరు క్యాంపుకు చెందిన డెబ్భైమంది రజాకార్లు, పోలీసులు, పాత భువనగిరి తాలూకాలోని అమ్మనబ్రోలు గ్రామంపై దాడిచేశారు. ఇళ్ళకు నిప్పు పెట్టారు. గ్రామంలోని ముస్లిములను తమతో తీసుకుపోతున్నారు. పోలీసులు గ్రామంలో ప్రవేశించగానే పరిసర గ్రామాల ప్రజలకు కబురు లంపబడ్డాయి. ఉదయం 9 గంటలకల్లా స్థానిక దళంతోసహా వేలాది ప్రజలు అక్కడకు చేరారు. మూసీనది గుండా ఆ గ్రామంలోకి రావటానికిగల ఏకైకమార్గాన్ని వారు మూసివేశారు. రోడ్డుకు గండి కొట్టారు. ఆ గండిపైన చెట్లకొమ్మలువేసి మట్టి కప్పారు. ఈ పనిచేసిన తరువాత నది గట్టు పైనగల చెట్లక్రింద వారంతా దాక్కున్నారు. రజాకార్లు, పోలీసులు నదిలోకి రాగానే ప్రజలు వాళ్ళను చుట్టుముట్టారు. దిక్కులు పిక్కటిల్లేట్లు నినాదాలుచేస్తూ శత్రువుపై పోరాటం ప్రారంభించారు.

ప్రజలు శత్రువును బెదిరించారు. ఆయుధాలు క్రిందపడవేసి లొంగి పోవలసిందిగా హెచ్చరించారు ఆ ప్రాంతం యావత్తూ ప్రజల నినాదాలతో గర్జనలతో ప్రతిధ్వనిస్తోంది. ఆ తరువాత రాళ్ళు రువ్వటం బర్మార్లతో కాల్పులు జరపటం ప్రారంభించారు. తమతోపాటు 50 ముస్లిమ్ కుటుంబాలను వెంటబెట్టుకొని వెళుతున్న శత్రువు వాళ్ళచేతనే రోడ్డు బాగుచేయించుతూ

ప్రజలపై కాల్పులు సాగించాడు. వాళ్ళను దగ్గరకు రానివ్వలేదు. అమ్మన బ్రోలు దళనాయకుడు పర్నా జానకిరెడ్డి (25 సం.) ముందుకు వెళ్ళి తన బార్మార్‌తో కాల్పులు జరిపాడు. కాని శత్రు తూటాకు ఎరయై ఆయన మృతి చెందాడు. మృతదేహాన్ని ఆయనవద్దగల ఆయుధాన్ని ప్రజలు తమ అధీనం లోకి తీసుకున్నారు. ఆ గ్రామానికి జెందిన మరొక కామ్రేడ్ శత్రువుపై కాల్పులు జరుపుతూ శత్రు తూటా కెరయై కాలు పోగొట్టుకున్నాడు. ప్రజలు ఆయనను, ఆయన తుపాకిని గూడా తీసుకొని వెళ్లారు. శత్రువు నిరంతరా యంగా కాల్పులు సాగించటంవల్ల ప్రజలు ముందడుగు వేయలేకపోయారు. కాని శత్రువును నిర్మూలించాలని ప్రగాఢకాంక్ష కలిగి వున్నందున వారు వెనక్కి పోలేదు కొన్ని గంటల పాటిలాగే సాగింది. ఈలోగా రోడ్డు బాగు జేయబడింది శత్రువులు నదిని దాటారు. ఇంతసేపు ప్రజలు సమీపించకుండా వాళ్లు కాల్పులు సాగిస్తూనే ఉన్నారు. ప్రజలు కూడా బర్మార్లను ఉపయో గించి కాల్పులు జరుపుతూనే వున్నారు తమ వడిసెలలతో రాళ్ళు రువ్వుతూనే వున్నారు. శత్రువులు బుజులాపురం కొండలను సమీపించారు. బుజులాపురం దళ సభ్యుల్లో ఒకరగు గుగ్గిళ్ళ మల్లయ్య ఒక రాతిగుండు చాటున దాగియుండి శత్రువుపై రాయి విసిరాడు.

ఆయన మరొక రాయి విసరకముందే శత్రువు తూటా తగిలి మృతి జెందాడు. చీకటి పడుతూండటంతో శత్రువు ఆ కొండను గబ గబా దాటి వెళ్ళాడు. ఆ తరువాత ప్రజలు మృతవీరులకు తమ తమ గ్రామాల్లో సముచిత రీతిని అంత్యక్రియలు జరిపారు శత్రువును తమ గ్రామాలనుండి తరుముతూ ప్రజలు మూడు గంటలపాటు వీరోచితంగా పోరాడారు.

19. *వడ్లకొండలో ప్రజాపోరాటం* : వడ్లకొండ గ్రామ ప్రజలు భేరీమ్రోత వినగానే బర్మార్లు, వడిసెలలు తీసుకొని పోరాటానికి సిద్ధంగా నిలుస్తుండేవారు. ఒకసారి పోలీసులు, రజాకార్లు ఆ గ్రామంపై దాడి చేశారు. అయితే స్థానిక వాలంటీర్లు, గెరిల్లా దళం వాళ్ళను తరిమివేశారు. 15 రోజుల తరువాత మిలటరీవాళ్లు ఆ గ్రామాన్ని చుట్టుముట్టారు ప్రజలు ఇది గమనించి భేరీ మ్రోగించారు. స్థానిక దళం ప్రజలు గ్రామానికి చుట్టూ గల గోడను మాటు చేసుకొని శత్రువుపై రాళ్ళు రువ్వారు. తమ బర్మార్లతో కాల్పులు జరిపారు. మిలటరీవాళ్లు ఆటోమాటిక్ ఆయుధాలనుకూడా ఉపయో గించారు. వాళ్ళు లెక్కలేనన్నిసార్లు కాల్పులు జరిపారు. తన వడిసెలతో ఒక సైనికుని కాలు విరగగొట్టిన కామ్రేడ్ యాదగిరి పొట్టలో తూటా దెబ్బ తగిలి మరణించాడు. గోడమాటునుండి బర్మారుతో కాల్పులు జరుపుతున్న కుమ్మరి నరసింహులుకు తుంటిలో గుండు దూసుకుపోయింది. ఆయన కాలు

విరిగిపోయింది. నూతి మాటునుండి కాల్పులు జరుపుతున్న మరొక కామ్రేడ్‌కు శత్రువు తూటా పొట్టలో తగిలింది. ఆ తరువాత శత్రువులు గ్రామంలో జొర బడ్డారు ఇప్పుడిక ప్రజలకు రక్షణలేదు. వాళ్ళు తమవద్దగల ఆయుధా లన్నిం టినీ నూతుల్లో పడవేశారు. సైనికులు వాళ్ళను నిర్దాక్షిణ్యంగా హింసించారు సరిగ్గా అప్పుడే చిటకోడూరు గ్రామంనుండి సుమారు మూడువందలమంది ప్రజలు తమ వడిసెలలతో, బర్మార్లతో వడ్లకొండ ప్రజలకు సహాయపడడానికి వచ్చారు కాని వారు శత్రుధాటికి ఆగలేక తిరిగిపోవలసి వచ్చింది.

**20.** ఆకునూరులో పోరాటం ఆకునూరు జనగామ తాలూ కాలో చరిత్రాత్మకమైన స్థలం. 1945 లో అచటి ప్రజలు నిర్బంధ లెవీకి వ్యతి రేకంగా తిరుగుబాటు చేశారు వారి ఆగ్రహానికి తట్టుకోలేక పోలీసులు, అధి కారులు తిరోగమించారు. ఆ తరువాత ప్రభుత్వం పెద్ద సాయుధ బలగాన్ని ఆ గ్రామంపై దాడికి పంపింది. అనేకమంది స్త్రీలకు మానభంగాలుచేసి, చెరచి వాళ్ళు ప్రజలపై కక్ష సాధించుకున్నారు. అయినప్పటికీ ప్రజలు పోరాడటం మానలేదు తమ వడిసెలలతో బర్మార్లతో రజాకార్లపైనా పోలీసులపైనా పోరాడటానికి వారు సిద్ధంగానేవున్నారు శత్రుజాడను కనిపెట్టివుంటూ, శత్రురాకనుగూర్చి హెచ్చరించడంకోసం మంచెలు ఏర్పాటు చేసుకొన్నారు.

ఒక రోజున రజాకార్లు గ్రామం సమీపానికి వచ్చారు ప్రజలు తమకు పదివేల రూపాయలు చెల్లించేట్లయితే బీభత్సకాండ జరగదని కబురు పంపారు కాని అలా చెల్లించడానికి ప్రజలు ఖచ్చితంగా నిరాకరించారు రజాకార్లు వెలుపలినుండి, ప్రజలు లోపలనుండి కాల్పులు సాగించారు. రజాకార్లు వెనకడుగు వేయక తప్పలేదు. ఇంతలోనే గెరిల్లా దళం అక్కడకు వచ్చింది. వారు ఇద్దరు రజాకార్లను చంపివేశారు. కొలది రోజుల తరువాత ఒకనాటి తెలవారుజామున 4 గంటలకు పెద్ద సంఖ్యలో సైనికులు వచ్చి గ్రామాన్ని ముట్టుముట్టారు. తెల్లవారుతుండగానే జొన్న చేలలోని మంచెలపై గల సెంట్రీలు వాళ్ళ రాకను గమనించారు ప్రజలకు హెచ్చరికగా భేరీ ప్రయోగించారు ప్రజలు గోడలను మాటుచేసుకొని శత్రువును ఎదుర్కొన్నారు. కాని శత్రువు బ్రెన్‌గన్‌లతో స్టెన్‌గన్‌లతో నిరంతరాయంగా కాల్పులు సాగిం చాడు. ఈ పోరాటంలో 7 గురు ప్రజలు మృతిజెందారు. వారిలో యిద్దరు తమ చేతులలో బర్మార్లను గట్టిగా పట్టుకొనే నేలకొరిగారు. సైనికులు గ్రామంలో ప్రవేశించి గ్రామాన్ని పూర్తిగా తగులబెట్టారు. ఆ మంటలలో మూడువేల బస్తాల ధాన్యం దగ్ధమైపోయింది.

**21.** *జనగామ, వరంగల్ సరిహద్దుల్లో బైరానుపల్లి వద్ద భీకర పోరాటం :* బైరానుపల్లి ప్రజాపోరాటం తెలంగాణా ప్రజా పోరాట చరిత్రలోనే అత్యున్నత స్థాయికి జెందినది. ఆ గ్రామంలో ప్రతి పురుషుడు, స్త్రీ, యువకుడు, వృద్ధుడు ఈ పోరాటంలో పాల్గొన్నారు. శత్రువుపై అడుగడుగునా పోరాటం సాగించారు ఆ గ్రామమే ఒక భయంకర యుద్ధ రంగంగా మారింది. ఈ గ్రామంలో ఎత్తయిన బురుజొకటుంది ఇది, చాలా పురాతనమైనది. అయినప్పటికీ కోటవలె చాల బలంగా వుంది. దానికి మెట్లు లోపలవైపునే వున్నాయి. ఈ బురుజుపైనుండి గ్రామం నలువైపులా చాలా దూరంవరకు పరికించి చూడవచ్చు ఆ బురుజుపైన ఒక పెద్ద రణభేరి, ఒక పెద్ద దేశవాళి తుపాకి, ఒక కరబ్బీ అమర్చబడి వున్నాయి. తుపాకిమందుతో నింపిన గోనెసంచులు సీసపుగుండ్లుకూడా అక్కడ నిలవజేయబడివున్నాయి ఆ బురుజు పైన ఒక దళం ఎల్లప్పుడూ వుంటూ వుండేది. వారి వద్ద తగినన్ని తుపాకులు ఇతర ఆయుధాలు, మందుగుండు సామగ్రి వున్నాయి. శత్రువు గనుక బురుజును సమీపించగలిగేట్లయితే వాళ్ళు పై కెక్కకుండా క్రింద పడవేయడంకోసరం దళంవద్ద ఈటెలు, కర్రలు, రాళ్ళు, వడిసెలలు, మరుగుతున్న నీళ్ళు సిద్ధంగా వుండేవి. వారు గ్రామానికి అన్నివైపులా సెంట్రీలను ఏర్పాటు చేశారు. ప్రతి రోడ్డుమీదా ఒక దళం ఎల్లప్పుడూ పోరాటానికి సిద్ధంగా వుండేది. ఏక్షణంలో నయినా శత్రువుతో పోరాడటానికి వారు సర్వసన్నద్ధంగా వుండే వారు. వాళ్ళకు సహాయపడటానికి, వాళ్ళను కట్టుదిట్టంగా నడపడానికి ఒక గెరిల్లాదళం అక్కడ వుండేది

ఒకరోజున లద్దనూరు క్యాంపునుండి సుమారు 60 మంది రజాకార్లు పోలీసులు వచ్చి గ్రామంపై దాడిచేశారు. బురుజుపై నున్నవారు భేరీ మ్రోగించారు. తమ నాటు తుపాకిని, కరబ్బీని వుపయోగించి, కాల్పులు జరిపారు యుద్ధనినాదాలు చేశారు. శత్రువు దిమ్మరపోయి గ్రామానికి కొలది దూరంలోనే నిలిచిపోయాడు. ఈ లోగా రెండు వందలమంది ప్రజలు వడిసె లలు, బర్మార్లు తీసుకొని శత్రువుమీదికి నడిచారు. కొంతసేపు ముఖాముఖి పోరాటం జరిగింది. అయితే ప్రజల ధాటికాగలేక శత్రువులు పారిపోయారు. మరొకరోజున ఒక క్యాంపునుండి సుమారు 70 మంది రజాకార్లు, పోలీసులు ఆ గ్రామంపై తిరిగి దాడిచేశారు. ప్రజలను ఎలాగైనా ఓడించాలని పట్టుదలతో వచ్చారు. అయితే ఈసారికూడా ప్రజలు సన్నద్ధంగావుండి వాళ్ళను ఎదుర్కొ న్నారు. స్థానిక దళసభ్యుల్లో వొకరు సింహంవలె శత్రువుపైకి దుమికాడు. రజాకారు చేతితో రైఫిల్ పట్టుకొని అతని పొట్టలో తన్నాడు అయితే ఈ పోరాటంలో రైఫిల్ ప్రేలింది. ఆ కామ్రేడ్‌కు దెబ్బతగిలింది. అయినా

ఆయన రైఫిల్ వదలలేదు ఈపాటికే ప్రజల ఆగ్రహానికి తాళజాలక శత్రువు పారిపోనారంభించాడు ఆ రజాకారుగూడా తన రైఫిల్‌ని వదిలిపెట్టి పారి పోయాడు దళానికి రైఫిల్ చిక్కింది. చికిత్సానంతరం ఆ కామ్రేడ్ కోలు కున్నాడు పోరాటంలో తిరిగి పాల్గొనజొచ్చాడు ఆ గ్రామంపై దాడిచేయా లని రజాకార్లు అనేకసార్లు ప్రయత్నించారు. పోరాడటానికి ప్రజలు సన్నద్ధంగా వుండటంచూసి వెనుదిరిగిపోయారు. తమ గ్రామాన్ని కాపాడుకోవాలని ఈ గ్రామప్రజలు ప్రదర్శించిన దృఢదీక్ష ధూళిమిట్ట, ఆకునూరు, లింగాపురం, కూటిగల్లు మొదలైన గ్రామాలకుగూడా వ్యాపిగాంచింది. భేరీమ్రోగితేచాలు ఒక చోట చేరడానికి వారలవాటు పడ్డారు శత్రువు వెళ్ళిపోయిన తరువాత వారుకూడా తిరిగి వచ్చేవారు. బలమైన శత్రువును ఎలా ఎదుర్కోవాలో భూమిపై బోర్లాపడుకొని శత్రువు కాల్పులను ఎలా తప్పించుకోవాలో మున్నగు విషయాల్లో వారు సైనిక శిక్షణ పొందారు.

ఒకరోజున గెరిల్లాదళం గ్రామంలోవుంది వారు వేరుశనగకాయలు తింటున్నారు. ఉదయం 8 గంటల సమయంలో రెండువందలమంది రజాకార్లు, పోలీసులు దాడిచేయడానికివచ్చారు గెరిల్లాలు బురుజుపైకిఎక్కారు. బురుజు పైనుండి నాటు తుపాకితో, కరబ్బీతో, రైఫిల్‌తో కాల్పులు జరిపారు. ఈ కాల్పులు కొంతసేపు సాగాయి. అప్పుడు గెరిల్లాలకు కామ్రేడ్ రేణిగుంట రామిరెడ్డి పోరాటంయొక్క అనుభవం గుర్తుకు వచ్చింది. తాము దెబ్బగాచు కొనేస్థితిలోనే వుండేటట్లయితే తమ వద్దగల తూటాలు అయిపోతాయని తాము శత్రువుయొక్క చక్రబంధంలో యిరుక్కుపోతామని తలంచారు. అందు వల్ల వారు బురుజుపైనుండి దిగివచ్చారు. గోడలనుమాటు జేసుకొని, శత్రువుపై గురిజూసి కాల్పులు జరిపారు. ఒక యింటికి నిప్పంటిస్తున్న పోలీసు చచ్చి క్రింద పడ్డాడు. బురుజుపైనుండి, గోడల వెనకనుండి కాల్పులు సాగుతూనే వున్నాయి ఐదుగురు పోలీసులు మృతి జెందారు. శత్రువును ఊపిరిసలుపుకో నివ్వలేదు దాంతో తమవాళ్ళ మృతదేహాలను తీసుకొని శత్రువులు కాలికి బుద్ధి చెప్పారు.

కొలది రోజుల తరువాత శత్రువు మరింత పెద్ద ఎత్తున దాడికి వస్తున్నట్లు కబురందింది. ప్రజలూ దళమూ అంతా సిద్ధంగా వున్నారు. ఒక రోజు తెల్లవారే 500 మందిరజాకార్లు పోలీసులు గ్రామాన్ని ముట్టడించారు. బురుజుపై నుండి గోడలమాటు నుండి, శత్రువు వెనుక భాగాన్నుండి, గ్రామం వెలుపలి నుండి శత్రువుపై కాల్పులు జరిపారు. బురుజుపై నున్నవారిని గురిజూచి కాల్చాలని ఒక పోలీసు చెట్టెక్కాడు. ప్రజల రైఫిల్ తూటా దెబ్బతగిలి అతడక్కడినుండి చచ్చి క్రిందపడ్డాడు. శత్రువులు అతని శవాన్నైనా తీసుకు

పోలేకపోయారు శత్రు బలగంలోని మరో 9 మంది మరణించారు. వాళ్ల 9 శవాలను మోసుకెళ్ళలేక పోయారు. ఊరిబయట నూతిలో పడవేసి పారిపోయారు.

మరొకరోజు ఉదయం రెండు వందలమంది రజాకార్లు, పోలీసులు ఆ గ్రామంపై తిరిగి ముట్టడి చేశారు. అశ్వారూఢుడైన ఒక పోలీసు రైఫిల్ చేతబట్టుకొని చుట్టూ తిరుగుతున్నాడు. బురుజు పై నుండి మామూలు ప్రకారం భేరీ మ్రోగింది. కాల్పులు ప్రారంభమైనాయి. గెరిల్లా దళం గ్రామం వెలుపల మామిడితోటలో వుంది. వాళ్ళు పోలీసులకు కనుపించకుండా నేలపైనే ప్రాకుతూ గుర్రంమీదవున్న పోలీసు వాడికి గురిబెట్టి కాల్చారు అతడు చచ్చి పడ్డాడు మరికొంతమంది మరణించిన తరువాత, యింకా కొందరు గాయపడిన తరువాత ఆ శవాలను గాయపడినవారిని పోగుచేసుకొని శత్రువు కాలికి బుద్ధి చెప్పాడు.

బైరాన్‌పల్లి, కూటిగల్లు గ్రామాలపై దాడి జేయడంకోసం, జనగామకు పెద్ద సైనిక బలగం దిగింది. గెరిల్లాలు గ్రామం విడిచిపోవాలని ప్రజలు గూడా గ్రామాన్ని ఖాళీ చేయాలని వొక ముఖ్యమైన కామ్రేడుద్వారా పార్టీ నాయకులు కబురు పంపించారు. అయితే ఈ ఆదేశాలు అమలు జరగలేదు. ఉదయం 6 గంటలకల్లా సైన్యం గ్రామాన్ని చుట్టుముట్టి కాల్పులు సాగించనారంభించింది సైన్యంపైకి ప్రజలుకూడా కాల్పులు సాగించారు. అయితే సైనికుల కాల్పులు, పోలీసుల కాల్పులవంటివికాదు సైన్యంవద్ద ఫిరంగులు, బ్రెన్‌గన్లు, మంటలబాంబులు తదితర అధునాతన ఆయుధాలనేకం వున్నాయి. గురిజూచి నిశితంగా కాల్పులు జరుపుతున్న ప్రజలచేతుల్లో కొందరు సైనికులుకూడా మృతిజెందారు. అలా మృతిజెందినవారిలో ఫిరంగులు ప్రేల్చుతున్న సైనికులుకూడా వున్నారు. సైన్యం తన దృష్టిని గెరిల్లాలపైన కేంద్రీకరించింది మంటబాంబులు, ఫిరంగులు, బ్రెన్‌గన్లు ప్రేల్చింది. దళం ఇకనక్కడ తట్టుకొని నిలవజాలకపోయింది శత్రువులు తుపాకి దెబ్బకు అందకుండా వుండేంతదూరం వెనకడుగు వేశారు.

గ్రామంలో, బురుజుపైనున్నవారు నాటు తుపాకితో, క్రింది అంతస్థునుండి కరబ్బతో, శత్రువుపై కాల్పులు సాగుతూనే వున్నాయి. గోడలను మాటు జేసుకుని ప్రజలు పోరాడుతూనే వున్నారు. ఈ పోరాటంలో ఒక మిలటరీ కెప్టెన్‌తోసహా 13 మంది మృతి జెందటమో, గాయపడటమో జరిగింది అయితే, శత్రుఫిరంగులముందు ప్రతిఘటన సన్నగిల్ల జొచ్చింది. బురుజు పై అంతస్థుకు పెద్ద గండికొట్టబడింది. పై అంతస్థుమీదినుండి నాటు తుపాకితో కాల్పులు జరుపుతున్న ముగ్గురు కామ్రేడ్స్ మోటం పోశాలు, మోటం

రాములు (అన్నదమ్ములు), బలిజె నాగయ్య మృతి జెందారు. మిగతావారు క్రిందికి దిగి వచ్చారు. ప్రజలలోను, స్థానిక దళసభ్యులలోనూ మరికొంతమంది కూడా మృతి జెందారు. శత్రువు చాలా శక్తివంతంగా వున్న విషయం, అధునాతన ఆయుధాలన్నింటినీ కలిగియున్న విషయము గుర్తించినమీదట అనేక మంది ప్రజలు తప్పుకున్నారు.

80 మంది ప్రజలను నిర్బంధించి కట్టివేసి మరతుపాకితో కాల్చి చంపారు. వీరోచితంగా పోరాడిన కొందరు యువకులను నిర్దాక్షిణ్యంగా హింసలపాలుజేసి, ఆ తరువాత కాల్చి చంపారు.

మరునాటి ఉదయం పరిసరాలనుండి గెరిల్లా దళాలు ఆ గ్రామానికి వచ్చేసరికి అక్కడ 88 మృతదేహాలు పడివున్నాయి గెరిల్లాలు ప్రజలకు ధైర్యం జెప్పి వోదార్చారు. మృతవీరులకు అంత్యక్రియలు జరిపారు. ప్రజలంతా అంత్యక్రియల్లో పాల్గొని అమరవీరులకు జోహార్లర్పించారు. పోశాలు, రాములు అనువారల తండ్రి ఇద్దరు కుమారులను గోల్పోయిన దుఃఖాన్ని దిగమ్రింగి ఈ హంతకుల పైనా, ప్రభుత్వం పైనా పగసాధించవలసిందిగాను, అంతిమ విజయం లభించేంతవరకు పోరాడవలసిందిగాను ఆ ప్రాంతీయ కమాండరుకు విజ్ఞప్తి చేశాడు.

22. *మరొక రణరంగం-కూటిగల్లు*: జనగామ తాలూకా కూటిగల్లుగ్రామంపై రజాకార్లు బైరాన్‌పల్లి గ్రామంమీద జరిపినట్లే అనేక మారులు దాడులు జరిపారు. అచటి ప్రజలు వాళ్ళపై జయప్రదంగా పోరాటం సాగించారు బురుజుపై అన్నీ ఏర్పాట్లు చేసుకున్నారు. రజాకార్లను పోలీసులను త్రిప్పికొట్టారు. గెరిల్లా దళంకూడా వాళ్ళకు తోడ్పడుతోంది.

ఆ గ్రామానికి చెందియుండి అక్కడినుండి వెళ్ళిపోయిన రజాకార్లు పోలీసులు తమ పశువులను తోలుకొని పోవడానికి ఒకసారి ఆ గ్రామాని కొచ్చారు ప్రజలు రణభేరి మ్రోగించారు. ప్రజలు వాళ్ళను గ్రామంలో అడుగు పెట్టనివ్వలేదు. ఒక కామ్రేడ్ ఒక ఈటెకు తాటి పండును గ్రుచ్చి బాంబు బాంబు అని అరుస్తూ వాళ్ళ వెంటబడ్డాడు. రజాకార్లు భయకంపితులై పారిపోయారు పారిపోతుండగా తమకు కనిపించిన ఒక గ్రామస్థునిపై దాడి చేశారు. ఆయనకు ఆగ్రహంవచ్చి తన చేతిలోవున్న గొడ్డలితో యిద్దరు రజాకార్లను అక్కడికక్కడే చావకొట్టారు. మిగతా వాళ్ళంతా ఆయన పైబడి కనుగ్రుడ్లు తోడారు. ఆ తరువాత గొడ్డలితో ఆయనను ముక్కలు ముక్కలుగా నరికారు. అప్పటినుండి కర్రగాని, గొడ్డలిగాని చేతిలో వున్నవాళ్ళనుచూస్తే రజాకార్లు భయపడుతుండేవారు. వాళ్ళ జోలికి పోయేవాళ్ళు కాదు. మరొక

సారి 500 మంది పోలీసులు, రజాకార్లు వచ్చారు. గెరిల్లా దళం గ్రామంలోనే వుంది. భేరీ మ్రోగించబడింది. ప్రజలు సన్నద్ధమయ్యారు. శత్రువును గ్రామానికి చేరకుండా దూరంలోనే నిలవేశారు. తాటిచెట్ల మాటున, పొలాల్లోని వాముల మాటునవుండి కాల్పులు సాగించారు. ఉభయపక్షాలమధ్య కాల్పులు కొన్ని గంటలపాటు సాగాయి. ప్రజలు, గెరిల్లాలు శత్రువును మూడువైపుల నుండి ఎదుర్కొన్నారు. ప్రజల ధాటికాగలేక రజాకార్లు పోలీసులు పారిపోయారు. ప్రజలు, గెరిల్లాలు వాళ్ళను మద్దూరు క్యాంపుకు అరమైలు దూరాన గల గుగ్గిల్లాపురం దాకా వెంటబడి తరిమి వచ్చారు.

బైరాన్‌పల్లిలో పోరాటం జరిగిన రోజునే సుమారు 200 మంది సైనికులు ఈ గ్రామంపైనకూడాదాడి చేశారు. ఇక్కడగూడా కొంతమంది ప్రజలు దేశ్‌ముఖ్ మాటలు నమ్మారు. తప్పుకుపోవడానికి మారుగా గ్రామంలోనే వుండిపోయారు. పోరాడేదళం బురుజుపైనుండి క్రిందికి దిగివచ్చింది. కొంతమంది ప్రజలు గ్రామంలోనే చంపబడ్డారు. మరికొంత మందిని వూరిబయట మర్రిచెట్టుక్రిందికి తీసుకెళ్ళి కాల్చిచంపారు. చేతుల్లో తుపాకులుబట్టి పోరాడుతుండగాగాని, సైనికులచే నిర్బంధించబడిన తర్వాత గాని ఈ పోరాటంలో మొత్తం యిరవైమంది ప్రజలు మృతిజెందారు. బురుజు మీద మృతిజెందినవారిలో సిద్దిపేటతాలూకా గనాపురానికిజెందిన కామ్రేడ్ యెంబయ్య ఒకరు. ఆయన తన గ్రామంలో దేశముఖుకు వ్యతిరేకంగా పోరాడాడు. ఆ దేశముఖుకు జెందిన ముప్పై పశువులను కూటిగల్లుకు తోలాడు. ఆపనిజేస్తుండగా, ఆయన వీరోచితంగా పోరాడి మృతిజెందాడు. గెరిల్లాదళం అక్కడికివెళ్ళేసరికి, ఆ ప్రాంతమంతటా మృతదేహాలు చిందరవందరగాపడివున్నాయి. కాస్త శ్వాస ఆడుతున్న కామ్రేడ్‌ను గెరిల్లాలు చేతుల్లోకి తీసుకున్నారు. ఆ కామ్రేడ్ వారిచేతుల్లోనే అసువులు బాశాడు.

ఈ రెండు గ్రామాలపై మిలిటరీదాడుల అనంతరం రజాకార్లు పోలీసులు ఆ గ్రామాలను లూటీచేయడానికి మరలావచ్చారు. తమను ప్రతిఘటించే వాళ్ళెవరూ బ్రతికివుండరని వాళ్ళనుకున్నారు. నాలుగువందలమంది రజాకార్లు, పోలీసులు బైరాన్‌పల్లిలో ప్రవేశించి యిళ్ళను లూటీచేసి, ఇళ్ళకు నిప్పంటించటం ప్రారంభించారు. వాళ్ళు బురుజుపై కెక్కారు. గడ్డపలుగులతో దాన్ని పడగొట్టటానికి ప్రయత్నిస్తున్నారు. అచ్చటికి కొలదిదూరంలోనే సమావేశం జరుపుకుంటున్న దళం ఈ వార్తవిని వెంటనే అక్కడికొచ్చి దాడి జేశారు. బురుజుపైనున్నవాళ్ళిద్దరూ క్రిందబడి మరణించారు. శత్రువులు తమవాళ్ళ మృతదేహాలను మాత్రమే తీసుకోగలిగారు. తమ బండ్లను, తాము కొల్లగొట్టిన వాటిని అక్కడే వదిలేసి ప్రజలమీద కాల్పులు జరుపుకొంటూ పారిపోయారు.

300 మంది రజాకార్లు, పోలీసులు కూటిగల్లు గ్రామాన్ని కూడా చుట్టుముట్టారు ఇళ్ళకు, గడ్డివాములకు నిప్పుబెట్టారు. గ్రామానికి వెలుపల వున్న గెరిల్లాలు చెట్లను మాటుచేసుకొని శత్రువుపై కాల్పులు జరిపారు శత్రు బలగంలోని ముగ్గురు మరణించారు. సరిగ్గా అదేసమయంలో అంతకుముందొక దాడి సందర్భంగా గడ్డివామిలో పెట్టబడిన తూటా పెద్దశబ్దంతో ప్రేలింది. ఈ సంఘటన అనంతరం "పోలీసుచర్య" జరిగేంతవరకూ రజాకార్లుగాని పోలీసులుగాని ఆ గ్రామంపై దాడి చేయలేదు

23 వర్ధన్నపేటపై దాడులు : బుచ్చిరెడ్డి నాయకత్వానగల 48 మందితోగూడిన ఒక దళం వరంగల్ తాలూకా కలనుపల్లె గ్రామానికి వెళ్ళి ఉదయం 11 గంటల ప్రాంతంలో భూస్వాముల భూములను పంచిపెడుతూ వుంది. తమ ఆయుధాలను ఒకచోట దాచి వుంచుకొని ప్రజలు దళసభ్యులు భూ పంపిణీ కార్యక్రమంలో నిమగ్నమై వున్నారు వారా వుత్సాహంలో సెంట్రీనిగూడా ఏర్పాటు చేసుకోలేదు. అలాంటి పరిస్థితిలో రాయపర్తి క్యాంపు నుండి 30 మంది రజాకార్లు, పోలీసులువచ్చి వారిని చుట్టుముట్టారు. దళ సభ్యుల్లో ఇద్దరు మాత్రమే తప్పించుకుపోగలిగారు. మిగతా దళ సభ్యులందరినీ చిత్ర హింసలకు గురిచేశారు. అయినా తమ ఆయుధాలెక్కడ దాచిందీ వారెవరూ చెప్పలేదు తమకు ఆయుధాలేమీలేవని మాత్రమే వారు చెప్పారు. వాళ్ళనుంచి ఆయుధాలు రాబట్టుకోగలమన్న ఆశను పోలీసులు వదులుకున్నారు. కాని వాళ్ళు దళ కమాండర్ దుసులను సోదా చేసినప్పుడు చిన్న నోట్‌పుస్తకం దొరికింది. అందులో పార్టీ గ్రామ కమిటీ సభ్యుల పేర్లూ, గ్రామ నాయకులపేర్లూ అలాంటి ఇతర విషయాలు వ్రాయబడివున్నాయి.

ఈ జాబితా ప్రాతిపదికగా వాళ్ళు దళంతోపాటు గన్నవరం గ్రామానికి వెళ్ళారు మగవాళ్ళంతా వూరినుండి తప్పుకున్నారు. గ్రామంలో స్త్రీలు మాత్రమే మిగిలారు వాళ్ళందరినీ ఒక చోటికి జేర్చి గ్రామ నాయకులకు వాలంటీర్లకు సంబంధించిన సమాచారం చెప్పవలసిందిగా కొట్టి హింసించారు. అయితే వారు తమకేమీ తెలియదని వాదించారు అదేవిధంగా ఆ మహిళల ముందు దళ సభ్యులను చిత్రహింసలకు గురిచేసి వారికి సహాయపడిన కుటుంబాల పేర్లు చెప్పవలసిందిగా కోరారు. అయినా శత్రువుకు రవ్వంతైనా ఆచూకీ దొరకలేదు. ఇది చూసిన తరువాత గెరిల్లాలు రహస్యాలు కాపాడతారనే విషయాన్ని మహిళలు గ్రహించారు. అది వాళ్ళకు మరింత ధైర్యం కలుగజేసింది. మహిళలు శత్రువును తిట్టడం ప్రారంభించారు. తమను తాకడానికి సాహసిస్తే ప్రాణాలు తీస్తామని హెచ్చరించారు

రజాకార్లు మొత్తం గ్రామమంతా గాలించారు. రాజిలి వెంకటురెడ్డి అనే వృద్ధ రైతు వాళ్ళకు కనుపించాడు. ఆయననుకూడా వదలకుండా దెబ్బలు కొట్టారు. ఆ తరువాత 10 యిళ్ళు తగులబెట్టారు. ఇందులో ఒకటి దళ సభ్యునికి జెందిన యిల్లు. అందులో ఒక రైఫిల్ కూడా వుంది మందుగుండు సామగ్రికి నిప్పంటుకుంది భయంకరమైన శబ్దంతో ప్రేలుడు జరిగింది. పోలీసులు భయకంపితులైపోయారు. ఇంకో దళంవచ్చి పడిందనుకున్నారు. దళ సభ్యులను వెంటబెట్టుకొని కాలికి బుద్ధి చెప్పారు. వారిని క్యాంపులోబెట్టి హింసించారు.

అదే రాత్రి ప్రజలు తమ దళసభ్యులను విడుదల చేయించుకోవడం కోసం సన్నద్ధమయ్యారు శత్రువుకు పట్టుబడకుండా తప్పించుకున్న దళ సభ్యులు కామ్రేడ్స్ కుక్కల రాములు, బత్తిని కొమరెల్లి ప్రజలకు నాయకత్వం వహించారు. వారందరూ కలిసి దళ సభ్యులు నిర్బంధించబడివున్న వర్ధన్నపేటకు వెళ్ళారు. ఈ ప్రజా వెల్లువను గాంచి పోలీసులు భయకంపితులైనారు. క్యాంపునుండి పారిపోయారు. ప్రజలు ఆ క్యాంపులో ప్రవేశించారు. తలుపులు, తాళాలు పగులగొట్టారు. తమకు ప్రియతములైన బిడ్డల విడుదల సాధించుకున్నారు. ఆ ప్రాంతమంతటా ఈ సంఘటనవల్ల ప్రజల్లో అమితమైన వుత్సాహం కలిగింది.

ఈ సంఘటన జరిగిన మూడు రోజులలోపలే వరంగల్, జనగామ తాలూకాలకుజెందిన దళాలు ఒకచోట సమావేశమై రాయపర్తి, వర్ధన్నపేటల్లో గల క్యాంపులను ఎత్తివేయించాలని నిర్ణయించారు. వేలాది ప్రజలను సమీకరించడానికి పథకం తయారుజేశారు.

ఉదయం 11 గంటలవేళ వందలాది ప్రజలు వర్ధన్నపేట క్యాంపుకు తరలిపోయారు. గ్రామమంతటినీ చుట్టుముట్టారు. ఆ గ్రామం ట్రంకురోడ్డుపై వుంది. అక్కడ తగినంత రక్షణలేదు. అయినా ప్రజలు దానినేమీ లెక్కజేయలేదు. క్యాంపువద్దకు తరలిపోయారు. శత్రువు క్యాంపువదలి పారిపోయి, ధాపునేవున్న పెద్ద గుట్టపైకి చేరాడు. అక్కడినుండి ప్రజలపైకి కాల్పులు సాగించనారంభించాడు ప్రజలలో ఒకరికి తుంటిమీద గాయమైంది. అయినా ప్రజలు జంకలేదు. గోడలను మాటుజేసుకున్నారు. గెరిల్లాలుకూడా కాల్పులు జరిపారు.

తుపాకులతో ఈ పోరాటం సాగుతుండగా ప్రజలు ఆ గ్రామంలోని రజాకార్ల యిండ్లపైన, ప్రజాశత్రువులైన యితరుల యిండ్లపైన దాడి జేశారు. 70 బస్తాల ధాన్యాన్ని, 200 పశువులను, ఇతర ఆస్థులనూ స్వాధీనం జేసుకున్నారు. అయితే, శత్రువు ఎంతో సురక్షితమైన స్థలంలో వుండటున్న,

వాళ్ళపైదాడిజేయడం దళానికి సాధ్యపడలేదు. శత్రు బలగాలు వర్ధన్నపేట నుండి వరంగల్లుకు పారిపోయాయి అంతలో దళాలు, ప్రజలూ తిరిగివచ్చారు

అదేరాత్రి, పెద్ద ప్రజాసమూహం, దళాలతోకలిసి రాత్రి 11 గంటల వేళ రాయపర్తిగ్రామానికి చేరుకున్నారు. ఈ ప్రజాసందోహాన్ని చూచి చూడడంతోనే, గ్రామంలోని రజాకార్లు వరంగల్లుకు పారిపోనారంభించారు. శత్రువుల్లో ఎవ్వరూ పట్టుబడలేదు అయితే, వాళ్ళ యిళ్ళపైదాడులుజరిగాయి రెండువందల బస్తాల ధాన్యం, బండ్లకొద్దీ ఇతర వస్తువులు స్వాధీనం చేసుకొన్నారు. రజాకార్ నాయకుడైన షంసుద్దీన్‌కు జెందిన 80 వేలరూపాయల విలువజేసే పెద్దబంగళాను ప్రజలు నేలమట్టంగావించారు. ప్రజా శత్రువులైన యితరుల యిండ్లనుగూడా నేలగూల్చివేశారు స్వాధీనం చేసుకోబడిన ఆస్తులను ప్రజలకు పంపిణీచేశారు.

**ఖమ్మం-మధిర-కొత్తగూడెం (పాల్వంచ) ప్రాంతం.**

ఈ ప్రాంతం కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలకు అనుకునివుంది. అందులో తూర్పు భాగాన గోదావరినది కానుకుని పాల్వంచ అడవివుంధి. ఈ ప్రాంతానికి, మిగతా తెలంగాణా ప్రాంతానికి భిన్నమైన ప్రత్యేకమైన ఆర్థిక లక్షణాలున్నాయి. ఈ ప్రాంతం ఆర్థికంగా మిగతా ప్రాంతంకంటె అభివృద్ధి జెందింది. ధనిక, మధ్య తరగతి రైతాంగం ఏర్పడింది ఆంధ్రప్రాంతంలో ఇతోధికంగా, ఆర్థిక-సాంఘిక సంబంధాలేర్పడి వున్నాయి.

ఇక్కడ వుద్యమానికి పునాది, మిగతా ప్రాంతాలలోవలె వ్యవసాయ కార్మికుల, పేదరైతుల డిమాండ్లు మాత్రమే కావు. ఇతర ప్రాంతాలకంటే ఎక్కువగా, మధ్యతరగతి రైతుల, ధనిక రైతుల డిమాండ్లే యిచ్చటు వుద్యమానికి ప్రాతిపదిక. 1942-45 మధ్యకాలంలో ధాన్యం లెవీకి వ్యతిరేకంగా బంది పట్టాలవంటి వ్యావసాయికావసరాల సరఫరాకోసం ఆందోళన సాగించబడింది.

ఈ ప్రాంతం ఆంధ్రమహాసభకుకూడా బలమైన కేంద్రం. కామ్రేడ్స్ చిర్రావూరి లక్ష్మీనరసయ్య, ఎస్. రామనాధం మొదలుగాగల ఆంధ్రమహాసభ నాయకులలో అత్యధిక సంఖ్యాకులు 1940 లోనే కమ్యూనిస్టు పార్టీలో చేరారు. వాళ్ళ నాయకత్వాన్నే 1945 లో తెలంగాణా ఆంధ్రమహాసభ చివరి మహాసభ అచటనే జరిగింది. ఆ మహాసభే అంతకుముందు జరిగిన వాటన్నింటికంటే పెద్ద సభ. ఆ సందర్భంగా జరిగిన బహిరంగసభకు ఇరవైవేల మందికి పైగా హాజరయ్యారు.

భారత యూనియన్‌లో జేరడానికి నైజాం నవాబు నిరాకరించి నప్పుడు స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహం ప్రారంభించగా, కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభ ఆ వుద్యమంలో చురుకుగా పాల్గొన్నాయి. వారు పెద్ద ప్రదర్శనలు జరిపారు. ఫారెస్టు శాసనాలను ధిక్కరించారు. కస్టమ్స్ పోస్టులపై ప్రత్యేకంగా దాడులు జేశారు.

ఖమ్మం, మధిర, బోనకల్లు, నేలకొండపల్లి, కల్లూరు, వైరా వంటి అన్ని పట్టణాలలో కీలక కేంద్రాలలో నైజాం ప్రభుత్వం పెద్ద రజాకారు క్యాంపు వేర్పాటు జేసింది. ఆ క్యాంపులనుండే పరిసర గ్రామాలపై దాడులు జరుగుతుండేవి. మధిరనుండి వరంగల్ వరకు సైనికులతో ఒక రైలు గస్తీ తిరుగుతుండేది. అదిగాక ప్రతి రైల్వేస్టేషన్‌వద్ద నైజాం సైనిక దళాలు కాపలా వుండేవి.

ఆయుధాలు చేతబట్టాలనే నిర్ణయం తీసుకున్న తరువాత కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలో ద్వీపంలాగా వున్న పరిటాల గ్రామంవద్దగల నైజాం పోలీసు పరిపాలనా కేంద్రంపైన జయప్రదంగా దాడి చేయటం జరిగింది. నాలుగు తుపాకులు, 20 బర్మార్లు, సుమారు రు. 300 లు రొఖ్ఖం స్వాధీనమయింది. అదే విధంగా మోటమర్రి రైల్వే పోలీసు కేంద్రంపై జిల్లా గెరిల్లా దళం దృఢనిశ్చయంతో జరిపిన దాడి ఫలితంగా మరికొన్ని రైఫిళ్ళు చేజిక్కాయి. అక్కడున్న మిలటరీ వాళ్ళలో కొంతమందిని చంపటమో, గాయపర్చటమో జరిగింది

ఈ మైదాన ప్రాంతంలోని వివిధ ప్రాంతాలకు చెందిన భూస్వాముల నుండి దళాలు నలభై తుపాకులను స్వాధీనం చేసుకున్నాయి తమ ఆయుధ సంపత్తిని మెరుగుపరచుకున్నాయి. గ్రామ దళాలకు బర్మార్లను, గెరిల్లా దళాలకు షాట్ గన్స్ వాటికితోడు అదనంగా ఒకటో రెండో ఆధునిక ఆయుధాలను సమకూర్చుకున్నాయి.

కల్లూరు ప్రాంతానికి సరిహద్దున తిరువూరు తాలూకాలోని తునికి పాడు వద్ద జలగం వెంగళరావు నాయకత్వాన కాంగ్రెసు తన స్వంతక్యాంపును నిర్వహించింది. (ఈ వెంగళరావు పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకి, 1969–71 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హోంమంత్రి, ఆ తరువాత పరిశ్రమల మంత్రి) ఆ శిబిరంలోని ఒక విభాగాన్ని కమ్యూనిస్టుపార్టీ తనవైపుకు రాబట్టుకో గలిగింది. ఆ తరువాత ఆ క్యాంపు ఎత్తివేయబడింది. అయితే గెరిల్లాలకు వారి నుండి 12 రైఫిళ్ళు లభ్యమయ్యాయి

1948 ఏప్రిల్ నాటికల్లా మనం ఇరవైయ్యేసిమంది సభ్యులుగల 6 ఫిర్కాదళాలను ఏర్పాటుచేయగలిగాం. సుమారు వేయిమంది ప్రజలతో గూడిన 40-50 కోయప్రజాదళాలను నిర్మించుకోగలిగాం. అవిగాక 50-60 గ్రామదళాలను కూడా ఏర్పరచగలిగాం.

కోయ యువజనులను, ప్రజలను రాబట్టగలిగాము:

పేరింతలపల్లి సాధు సింగరాజు కోయజాతి ప్రజలకోసం ఒక ఆశ్రమం నడుపుతూండేవాడు. అనేకమంది కోయ యువకులు అచ్చటికి ఆకర్షించబడ్డారు. యూనియన్, నైజాంప్రాంతాల రెండింటికిజెందిన కాంగ్రెసు దానికి తోడ్పడింది. అచ్చటవారికి ఒకరకమైన సాయుధశిక్షణ కూడా యివ్వబడింది తాము కోయజాతి పరిపాలనను ఏర్పరచుకోవచ్చునని, తమ కష్టాలన్నీ అంతమవుతాయని, వారిలో ఆశలు రేకెత్తించబడ్డాయి ఆ ఆశ్రమం గోదావరి నదిగట్టున, పూర్వం అల్లూరి సీతారామరాజు 1922-24 సంవత్సరాల్లో బ్రిటిషు జులుంకి వ్యతిరేకంగా తూర్పుగోదావరి, విశాఖజిల్లాలకు చెందిన ఏజెన్సీ ప్రాంతాల కోయప్రజలకు నాయకత్వం వహించినడిపినచోటనే ఏర్పాటు చేయబడింది ఆనాటి గాథలింకా అచ్చటి ప్రజల స్మృతిపథంలో మెదులుతూనే వున్నాయి.

కమ్యూనిస్టుపార్టీ ఈ కోయ యువకులతో సంబంధాలు పెట్టుకుంది. వారికోసం తరగతులు నడిపింది. చర్చలను నిర్వహించింది. వారిలో అనేక మందిని తనలోకి రాబట్టుకుంది

గోండులు, కోయలు, మొదలగు ఆటవిక తెగలకు జెందిన ప్రజల స్థితిగతులనుగూర్చి విచారించి తీసుకోవలసిన చర్యలను సూచించవలసిందిగా ప్రభుత్వంచే పంపబడిన హెమెన్‌డ్రాఫ్ తన సాంఘిక ఆర్థిక చిట్కాల ద్వారా కోయ ప్రజలను జోకొట్టడానికి చేసిన ప్రయత్నాలను పార్టీ వమ్ముచెయగలిగింది.

విశాలాంధ్రలో ప్రజారాజ్యం ఏర్పడిన తరువాత కోయ ప్రజల స్వపరిపాలనా ప్రాంతం నెలకొల్పబడుతుందనీ, ఫారెస్టు అధికారుల జులుముకు, అంచగొండి చర్యలకు స్వస్తి చెప్పబడుతుందనీ, పార్టీ యిచ్చిన నినాదం; అటవీ సంపదను స్వేచ్ఛగా వుపయోగించుకోవడానికి కోయ ప్రజలకు తోడ్పడటం కోసం పార్టీ చేసిన కృషి ఈ విజయానికి కారణం. పాల్వంచ ఫారెస్టు ప్రాంతంలోని కీలకమైన కోయ గ్రామమగు పోతువారిగూడెంలో భూస్వాములు సాగిస్తున్న వడ్డీ వ్యాపారానికి, నిర్బంధ చాకిరీకి విపరీత కౌళ్ళకు మనం స్వస్తి చెప్పించాం. దీనితో పార్టీ పలుకుబడి ఆ ప్రాంతమంతటా విస్తరించింది. అచే

విధంగా ముల్కలపల్లి వద్దగల రజాకారు, పోలీసు క్యాంపుపై గెరిల్లా దళాలు దాడిజేశాయి. ఈ దాడిలో ఆ పరిసరాలలోగల సుమారు రెండువేలమంది కోయ ప్రజలను సమీకరించి పాల్గొనేట్లు చేయగలిగాం. ఆ తరువాత ఆ క్యాంపు ఎత్తివేయబడింది.

ఈ చర్యలన్నింటి ఫలితంగా, పేరంటాల సాధుచే తయారుచేయ బడిన రెండువందల మందికి పైగాగల కోయ యువకులు వుత్సాహపడ్డారు. ఉత్తేజం పొందారు. తమవద్దగల షాట్‌గన్లతో, కొన్ని వందల చేతిబాంబులతో సహా ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీల వైపుకు వచ్చేశారు.

ఈ తొలిదశలోనే కామ్రేడ్ సోయం గంగులు, కంగల బుచ్చయ్య మనవైపుకు వచ్చి చేరారు.

*భూమి, ధాన్యం పంపిణీ :* నాగులంచ భూస్వామి భూములను అతనినుండి స్వాధీనం చేసుకున్న ధాన్యాన్ని పార్టీ వ్యవసాయ కార్మికులకు పేదరైతులకు పంచిపెట్టింది.

కలకోట భూస్వాముల భూములను ధాన్యాన్నికూడా అదేవిధంగా పంపిణీ చేసింది.

అన్నపరెడ్డిపల్లె, అమ్మపాలెం, గుండపూడి, గార్లఒడ్డు మొదలుగా గల 80 కి పైగా గ్రామాలలో కల్లూరి వంశానికి జెందిన భూస్వామికి ఎనభైవేల ఎకరాల భూమి వుంది. అతడే, ఈ ప్రాంతంలో కెల్లా అతి దుర్మార్గమైన భూస్వామి ప్రజలు అమితంగా ద్వేషించే భూస్వామి. అతని భూము లన్నింటినీ పార్టీ పంచిపెట్టింది. కవులుదార్లందరికీ తాము సాగుజేసుకుంటున్న భూములపై యాజమాన్య హక్కులు దక్కించుకుంటానికి తోడ్పడింది. ఇందువల్ల అత్యధికంగా లాభపడింది కోయ ప్రజలే.

ఎప్పుడో 1935 లోనే కల్లూరి రాజేశ్వరరావును, అతని దుర్మార్గా లతో విసుగెత్తిపోయిన ప్రజలు చంపి వేశారు. పోలీసు చర్య అనంతరం ఆ కుటుంబం తమ భూములన్నిటినీ తిరిగి స్వాధీనం చేసుకుంది. అయితే, తెలం గాణా పోరాటం తరువాత నైజాం ప్రభుత్వం చేసిన కవుల్దారీ చట్టాన్ని వుప యోగించుకొని రైతులు ఆ భూముల్లో నాలుగోవంతు దక్కించుకోగలిగారు. కమ్యూనిస్టుపార్టీ సాగించిన నిరంతర కృషే ఈ విజయానికి కారణం. అదే విధంగా మధిర తాలూకా ఆరెకాయలపాడుకు జెందిన భూస్వామి ఏడునూతల గోపాలరావుకు జెందిన భూములనుకూడా పంచి పెట్టడం జరిగింది. భారత సైన్యాలు ప్రవేశించిన తరువాత ఆ భూములను తిరిగి స్వాధీనం చేసుకోవడానికి అతడు ప్రయత్నించాడు. దానికి వ్యతిరేకంగా ప్రజలు పోరాడారు. చివరకు

లాంఛన ప్రాయంగా ఎకరానికి పది రూపాయలు ఖరీదు తీసుకొని నాలుగు వందల ఎకరాల భూమికి పట్టా హక్కు లివ్వడానికి అతడే అంగీకరించ వలసి వచ్చింది.

తెల్దారుపల్లి ముస్లిం జాగీరు గ్రామం. ఆంధ్రమహాసభకు అది బలమైన కేంద్రం. అచ్చట రైతులు తమహక్కులను నిలబెట్టుకొంటూ కవుల్దారీ పోరాటాలనేకం సాగించారు. 1947 ఆగస్టు 15 కు కొలదిరోజుల క్రితమే. ఖమ్మంపట్టణంనుండి జాగీర్దారు గూండాలువచ్చి ఆ గ్రామంపై దాడిజేశారు, ప్రజలు ఆ గూండాలను లొంగగొట్టి, వాళ్ళ చేతుల్లో గల మారణాయుధాలను స్వాధీనం చేసుకున్నారు. రజాకారు రోజుల్లో ఈ గ్రామంపై పదే పదే దాడులు జరిగాయి. ప్రజలు వాటినన్నింటినీ ప్రతిఘటించి భూములను తమ అధీనంలో నిలబెట్టుకున్నారు. భారత యూనియన్ "పోలీసుచర్య అనంతరం కూడా రైతులు తమ భూములను వదులుకోలేదు. చివరకు హైదరాబాదు కౌల్దారీ చట్టంక్రింద పట్టాహక్కులుకూడా పొందారు.

అదే విధంగా అశ్వారావుపేట జమీందారుకు వ్యతిరేకంగా రైతులను, కోయ ప్రజలను మేల్కొలిపి, ఆతని అక్రమ, నిర్బంధవసూళ్లకు వ్యతిరేకంగా, వెట్టిచాకిరీ మొదలైనవాటికి వ్యతిరేకంగా పార్టీ పోరాటాలునడిపింది.

అనేక గ్రామాల్లో వ్యవసాయ కార్మికులు బంజరుభూములను ఆక్రమించుకోవడానికి పార్టీ నాయకత్వం వహించింది.

అనేక గ్రామాల్లో చెరువుల్లోని నీరు భూస్వాములే గుత్తకుగొని, తమ పొలాలకే పారించుకొంటుండగా పార్టీ, ఆంధ్రమహాసభ జోక్యం కల్పించుకున్నాయి. చిన్నరైతులకుకూడా సకాలంలో తగినంత నీటిసరఫరా జరుగునట్లు ఏర్పాటు జేశాయి.

మానుకోట ప్రాంతంలో, తొలిదశలో భూస్వామ్య వ్యతిరేక సమస్యలను తీసుకోలేదు. కాని ఆ తరువాత కామ్రేడ్ వెంకటేశ్వరరావు, గంగవరపు శ్రీనివాసరావు పెద్దఎత్తున భూసమస్యను, వడ్డీవ్యాపారం సమస్యను, ఋణభారం ధాన్యం పంపిణీ సమస్యలను తీసుకొని పనిజేశారు.

మానుకోట తాలూకాలోని గార్ల ప్రాంతంలో మూడువందల ఎకరాల భూమికలిగి, పెద్దఎత్తున వడ్డీవ్యాపారంచేస్తున్న తనస్వంత మేనమామకు వ్యతిరేకంగా కామ్రేడ్ వెంకటేశ్వరరావు పోరాడవలసి వచ్చింది. ఆ దుర్మార్గుడు తన మేనల్లుని అనుపానులను గురించి నైజాం పోలీసులకు తెలియజేశాడు

ఒక రోజున బుచ్చిమట్లలో నైజాం ఆశ్విక పోలీసులు ఆయనను చుట్టు ముట్టారు. కామ్రేడ్ వెంకటేశ్వరరావు వాళ్ళనుండి తప్పించుకొని పోవడానికి ప్రయత్నిస్తుండగా, వాళ్ళాయనను కాల్చి చంపారు.

ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం ప్రత్యేకించి సూర్యాపేట తాలూకాలో జన్నారెడ్డి కుటుంబానికి వ్యతిరేకంగా సాగించబడిన పోరాట ప్రభావం, ఆ కుటుంబానికే జెందిన అనేకమంది భూస్వాములు పెద్ద భూఖండాలు కలిగియున్న మానుకోట ప్రాంతంపైన కూడా పడింది. అందువల్ల ఇక్కడ కూడా గెరిల్లా దళాలు, సంఘం ఆ సమస్యను తీసుకొని ఉధృతంగా పనిచేశాయి.

మానుకోట తాలూకాలో "పోలీసు చర్య"కు ముందు 1947–48 సంవత్సరాల్లో ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు, దళాలు పన్నెండు వేల బస్తాల ఆహార ధాన్యాలను ప్రజలకు పంచిపెట్టారు లక్షా ముప్పైఐదువేల రూపాయలు వసూలు జేశారు. 20 దళాలు దేశముఖుల గడీలపై దాడులు సాగించాయి ఈ దళాల్లో మొత్తం 400 మంది సభ్యులుండే వారు. కొంతకాలం వరకు ఇవి పెండ్రిపోలు సంకీశ, గార్ల, మేటురాజుపల్లి గ్రామాలను కేంద్రంగా చేసుకొని కంపెనీ దళాలుగా పనిచేశాయి. నైజాం పోలీసులతో సైన్యంతో చెట్లముప్పారం, శ్రీరామగిరి, జానపాడులవద్ద ఘర్షణపడి గెరిల్లాలు నష్టపోయారు. గార్ల కార్యకర్త కామ్రేడ్ వెంకటేశ్వరరావు బుచ్చిమట్ల ఘర్షణలో మృతిజెందాడు.

1948 జూన్ నెలలోనే ఇద్దరు ఆర్గనైజర్లతోసహా 50 మంది కాల్చి చంపబడ్డారు. వారిలో 38 మంది గార్ల ప్రాంతానికి చెందినవారే.

కంపెనీ దళాలు రద్దుచేయబడినాయి. చెల్లాచెదరైపోయిన దళ సభ్యులు తిరిగి సంఘటితపరచబడ్డారు. తరువాత రెండుమాసాలకాలంలో "పోలీసుచర్య" నాటికే గెరిల్లాలు నిరంతర దాడులద్వారా నైజాం పోలీసులు, రజాకార్లు 16 క్యాంపులను ఖాళీచేసేట్లు చేశాయి. ఒక కిలోమీటరు పొడవు రైలుమార్గం ధ్వంసం చేయబడింది. అబ్బాయిపాలెం–మానుకోట రోడ్డు కూడా ధ్వంసం చేయబడింది. ఈ చర్యలలో వేయిమందికిపైగా ప్రజలు పాల్గొన్నారు. ఈ ప్రాంతంలోని 30 గ్రామాల్లో భూస్వామి కుటుంబాలకు ఒక్కొక్కదానికి 5 ఎకరాల మాగాణి 50 ఎకరాలమెట్ట వదిలివేసి మిగతా భూమిని పంపిణీ చేయడం జరిగింది.

అల్లీనగరం ; మధిర తాలూకా అల్లీనగరం ఆంధ్ర మహాసభకు బలమైన కేంద్రం. ఈ గ్రామంనుండి అనేకమంది కమ్యూనిస్టుపార్టీలోనూ

గెరిల్లా దళాల్లోనూ చేరారు. సమీపంలోనే వున్న మోటమర్రి గ్రామంలోగల మిలిటరీ కేంద్రంపై గెరిల్లాలు దాడి జరిపి ఆయుధాలు స్వాధీనం చెసుకున్న తరువాత 200 మంది రజాకార్లు, సైన్యమూ అల్లీనగరం గ్రామంపై దాడి చేశారు. మొత్తం గ్రామ మంతటినీ తగులబెట్టి నేలమట్టం చేశారు.

1948 జనవరి 13 వ తేదీన మధిర తాలూకా మీనవోలు గ్రామ ప్రజలు రజాకార్ల దాడిని ప్రతిఘటించి తరిమికొట్టారు. ఈ పోరాటంలో కామ్రేడ్స్ తోట వెంకయ్య, తోట లాలయ్య, బండి వీరయ్య, మెట్టల శ్రీరాములు, లక్కిశెట్టి లక్ష్మీనరసయ్య, రాటకొండ వెంకయ్య తమ ప్రాణా లర్పించారు. అయితే ప్రజలు రజాకారు దళ నాయకుని చంపివేయగలిగారు. అతని రైఫిల్‌ను స్వాధీనం చేసుకొని గెరిల్లా దళానికి వొప్పగించారు. కాని ఆ మరునాడే 200 మంది సైనికులు దాడిజేసి ఆ గ్రామాన్ని తగులబెట్టారు. రాంపల్లి రామయ్య, పిళ్ళా కోటయ్య, సుఖభోగ ముత్తయ్య అనే ముగ్గురు వృద్ధులను కాల్చి చంపారు. ఆ గ్రామస్తులు అమరవీరుల స్మారక చిహ్నం నిర్మించుకొని ఏటేటా వారి స్మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు.

రాయనపేట: మధిర తాలూకా రాయనపేట గ్రామంపై రజాకార్లు దాడిజేశారు గ్రామంలోని పశువులను స్వాధీనం చేసుకొని బయటకు తోలారు. అప్పుడు గెరిల్లా దళం రజాకార్లను ఎదుర్కొన్నది. తమ చదువులు వదిలిపెట్టి గెరిల్లా దళంలో చేరిన కామ్రేడ్సగు కలకోట గ్రామానికి చెందిన పగిలిపల్లి భోగయ్యను, రాయనపేట గ్రామానికి చెందిన బోడేపూడి పుల్లయ్యను రజాకార్లు పట్టుకొని బొమ్మకల్లు క్యాంపుకు తీసుకెళ్ళారు వాళ్ళ నక్కడ చిత్రహింసలకు గురిజేసి అనంతరం కాల్చి చంపారు.

లక్ష్మీపురం, గోవిందాపురం ప్రజలు వడిసెలలతో, రాళ్ళతో రజాకారు దాడుల నెదుర్కొని పోరాడే సందర్భంలో రజాకారు కాల్పులకు గురై ఖమ్మం తాలూకా ప్రొద్దుటూరు గ్రామానికిచెందిన ముత్తయ్య మృతిచెందాడు.

మధిర తాలూకా సిరిపురం (కనకగిరి గ్రామం)లో రజాకార్లు సమర శీలురైన రైతులు మచ్చా పట్టయ్యను, తాళ్ళూరు అప్పయ్యను కాల్చిచంపారు. ఈ గ్రామం ఆంధ్రమహాసభకు బలమైన కేంద్రం. రజాకార్లు అనేక ఇళ్ళను, 50 పశువులను తగులబెట్టారు.

*రజాకార్, నైజాం మిలిటరీ క్యాంపులపై పోరాటం:* రజాకార్ మిలిటరీ క్యాంపులకు రహదారి సౌకర్యాలు లేకుండా ధ్వంసం చేయడం కోసరం వేలాది ప్రజలను సమీకరించడం జరిగింది. బోనకల్లు — వైరారోడ్డు, కోదాడ — ఖమ్మం — సీతంపేట రోడ్డు ప్రజలదాడులకు

ప్రధాన లక్ష్యాలయినాయి. ఆ రోడ్లపై పెద్ద పెద్ద గండ్లుగొట్టి సైనిక రవాణాకు వాటిని నిరుపయోగం చేశారు. అశ్వారావుపేట రోడ్డుపైగల లంకపల్లి వంతెనను ధ్వంసం చేశారు. వేలాదిప్రజలు గడ్డపలుగులు వగైరా సాధనాలను వుపయోగించి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. డైనమైట్‌ను కూడా వుపయోగించారు.

కొత్తగూడెం బొగ్గుగనులు ఈ ప్రాంతంలోనే వున్నాయి. అచ్చటి కార్మికుల్లో పార్టీకి గణనీయమైన పలుకుబడివుంది. వారి ద్వారా పార్టీకి పెద్ద మొత్తాలలో జెలిగ్నైట్ స్టిక్స్ (ప్రేలుడు పదార్థాలు) అవసరమైన డిటోనేటర్లు అందుతూండేవి. అవి ఈ చర్యలలోనూ, నాటు బాంబులు తయారుచేయడం లోనూ వుపయోగించబడేవి రజాకార్లకు నైజాముకు వ్యతిరేకంగా పోరాడు తున్న సమయంలోనే గాక భారత యూనియన్ సైన్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్న సమయంలోకూడా ఈ సరఫరాలు అందుతూనే వుండేవి. గెరిల్లా దళాలు రజాకార్ల, నైజాం మిలటరీ క్యాంపులపై మెరుపుదాడులనేకం చేశాయి. బహిరంగ స్థలంలో ఏర్పాటు చేయబడిన గన్నవరం సమీపంలోని క్యాంపుపైదాడి ఫలితంగా ఇద్దరు సైనికులు మరణించారు. తరువాత ఆ క్యాంపు ఎత్తివేయబడింది.

నైజామును బలపరిచే ముస్లిం జనాభా అధికంగాగల కల్లూరువద్ద ఏర్పాటు చేయబడిన క్యాంపుపై దాడి జేయాలని అనేకసార్లు ప్రయత్నం జరిగింది. అయితే స్థానిక ప్రజల సహకారం లేనందువల్ల గట్టి. దాడి చేయటం సాధ్యపడలేదు.

దమ్మపేట - పాల్వంచరోడ్డుపైగల ముల్కలపల్లిపై వేలాది కోయ ప్రజలను సమీకరించి దాడి జేసిన ఫలితంగా నైజాం చివరకు ఆ క్యాంపును ఎత్తివేసుకోవలసి వచ్చింది.

కోదాడ - ఖమ్మం రోడ్డుపై : కోదాడ - ఖమ్మం రోడ్డును, సీతంపేటతో కలిపేరోడ్డుపై ఒక లారీనిండా సాయుధపోలీసులుప్రతిరోజూ గస్తీ తిరుగుతుండేవాళ్ళు. ఆ లారీపై దాడిచేసి ఆయుధాలు సంపాదించాలని జిల్లా గెరిల్లాదళం నిర్ణయించింది. దళం మూడు విభాగాలుగా చీలి, ఒకదానికొకటి కొద్దిదూరంలో వుండేట్లుగా రోడ్డు ప్రక్కనున్న బండలమాటున కూర్చున్నారు. సాయుధ పోలీసుల లారీ దళంలోని మొదటిభాగాన్నిదాటి రెండవభాగంవున్న దగ్గరకొచ్చేసరికి రైడర్ (చిన్న సబ్ మెషన్‌గన్)తో కాల్పులు జరపాలని నిర్ణ యించుకున్నారు. లొంగిపోకుండా ఆ లారీ ముందుకే వెళ్లినట్లయితే మూడవ

భాగం కాల్పులు సాగించాలని లారీలోపల పడేట్లు చేతిబాంబు విసరాలని నిర్ణయించుకున్నారు. లారీ వెనుదిరిగి పారిపోవడానికి ప్రయత్నిస్తే మొట్ట మొదటి విభాగం దానిని ఎదుర్కోవాలనుకున్నారు.

లారీలోని పోలీసులు నిలబడి పాటలు పాడుకుంటూ చప్పట్లు కొట్టు కొంటూ పోతున్నారు. ఆకస్మికంగా వారిపై గైడర్‌తో కాల్పులు పరంపరగా జరిగాయి. కొంతమంది లారీలోనే చచ్చిపడ్డారు. మరి కొందరు ఎదురు కాల్పులు సాగించారు. డ్రైవరు లారీ వేగంపెంచి ముందుకే పోతున్నాడు కొలది సెకండ్లలోనే దళంలోని మూడవవిభాగం నుండి లారీపైకి కాల్పులు జరిగాయి. మూడవ విభాగం నాయకుడైన కామ్రేడ్ మాధవరెడ్డి నిబ్బరంగా గురితప్పకుండా చేతిబాంబును లారీపైకివిసిరాడు. ఇంకా అనేకమంది సాయుధ పోలీసులు చావడమో, గాయపడటమోసంభవించింది. డ్రైవరులారీని వేగంగా తోలుకొని వెళ్ళిపోయాడు. అధునాతన ఆయుధాలతో అంత జయప్రదంగా దెబ్బలుతినడం అదే మొదటిసారిగాబట్టి పోలీసులు హడలెత్తిపోయారు. ఈ దాడిలో సుమారు 20 మంది ప్రత్యేక సాయుధపోలీసులు చంపబడటమో, గాయపడటమో జరిగిందని ఖమ్మం పట్టణంలో చెప్పుకునేవారు. అయితే లారీని ఆపి ఆయుధాలు స్వాధీనం చేసుకోవడం గెరిల్లాలకు సాధ్యపడలేదు.

*కల్లూరు అడవుల్లో సుదీర్ఘ పోరాటం :* ప్రజావుద్యమం పెద్ద ఎత్తున విజృంభించకుండా అరికట్టడం కోసరం ఇక్కడ నైజాం సైన్యం ప్రత్యే కంగా దించబడింది కోయ ప్రజలలో అశాంతి ప్రబలంగా వున్నట్లుకూడా పాళ్ళకు వార్తలు అందాయి. కల్లూరు, ములకలపల్లి, గన్నవరం, గుంపెన గ్రామాల్లో రజాకార్ల, స్థానిక పోలీసు క్యాంపులు ఏర్పాటు చేయబడినాయి. అవిగాక ఆరు లారీలనిండా నైజాం సైనికులు బ్రెన్ గన్లతో ఆ ప్రాంతమంతా నిరంతరం గస్తీ తిరుగుతుండేవారు. అప్పటి జిల్లా దళంలో 70, 80 మంది వున్నారు వారంతా అత్యుత్తమమైన సైనిక శిక్షణ, మంచి రాజకీయ చైతన్యం కలిగినవారు. వారంతా ఆ కంపెనీలో వున్నారు. ఆ దళం గన్నవరం, ముల్కాల పల్లి క్యాంపులను ఎత్తివేయించింది.

అయితే ఒకరోజున గుంపెనవద్ద ఆదళం శత్రువుచే చుట్టుముట్ట బడింది. ఆ కంపెనీలోని వివిధదళాలు సన్నద్ధంగా నిలిచాయి. తమను దెబ్బ కొట్టడంకోసరం నైజాం బలగాలు త్రోసుకు వస్తున్నందున గెరిల్లాదళ నాయకుడు తన గైడర్‌తో కాల్పులు ప్రారంభించాడు. కామ్రేడ్స్ మాధవరెడ్డి, ఎనుకూరు బుచ్చయ్య మొదలుగాగల ప్రవీణులైన దళనాయకులు తమ రైఫిళ్ళతో కాల్పులు ప్రారంభించారు. శత్రుబలగంలోని 8 మంది నేలకొరిగారు. మిగతావాళ్లు నేలమీద బోర్లా పండుకున్నారు. సరిగ్గా ఈ సమయంలోనే

కామ్రేడ్ మాధవరెడ్డి మొత్తం దళమంతటినీ అడవిలోని ఒక గుట్టమాటుకు హుటాహుటిని నడిపించాడు. ఆరెకాయలపాడుకు చెందిన గెరిల్లా కామ్రేడ్ వాసిరెడ్డి కోటయ్య ఈ సందర్భంలో మృతిజెందాడు. మరొక కామ్రేడ్ గాయపడ్డాడు అంతకుమినహా మిగతా కంపెనీ అంతా కాపాడబడింది. ఈ పోరాటానికిముందు మరొకసారి ఘర్షణ జరిగింది. అందులో నైజాం సైనిక సిబ్బంది లోని ముగ్గురు చంపబడ్డారు. ఒక రైఫిల్ స్వాధీనం చేసుకోబడింది. అయితే గుంపెన అనుభవం తర్వాత పెద్దకంపెనీ నిర్మాణానికి స్వస్తిచెప్పబడింది. 20 మందితోగూడిన దళాలు ఏర్పాటు చేయబడ్డాయి.

ప్రధానమైన రోడ్ల ధ్వంసం: ప్రజల ప్రతిఘటనోద్యమం రోజు రోజుకూ బలపడుతూండటం చూచి నైజాము గూండాలకు పిచ్చెత్తిపోయింది. మరింత క్రూరంగా ప్రజలపై దాడులు చేశారు అనేక అత్యాచారాలు జరిపారు. ఒకదానివెంట ఒకటి గ్రామాలకు గ్రామాలనే తగులబెట్టనారంభించారు. పెద్ద సైనికబలగం రాత్రింబవళ్ళు గ్రామాలపై దాడులుచేసి ప్రజలను బీభత్స పరుస్తున్నారు. అనేకమంది ప్రజలను నిండు ప్రాణాలతో మంటల్లో పడవేశారు. సూర్యాపేట తాలూకాలోని ఎనుబాముల, ఎర్రపాడు, క్యాంపులలో కొంతమంది ప్రజలచేత గోతులు త్రవ్వించి బలవంతాన వాళ్ళనందులో పండుకోబెట్టి నిండు ప్రాణాలతోవున్న వారిపై మన్నుగప్పి సమాధి చేశారు. గ్రామాలపై దాడులు అధికమవుతూండటంతో ప్రజా శత్రువులు, దిగజారుడు మితవాదులు తిరిగి తలెత్తడం ప్రారంభించారు. వాళ్ళు కొన్ని గ్రామాల్లో గెరిల్లాలు ప్రవేశించకుండా అడ్డుపడగలిగారు.

స్థానిక దళాలు గెరిల్లా దళాలు అనేకచోట్ల ఈశత్రువును మొగ్గలోనే త్రుంచివేశాయి. సైనిక శకటాలను గ్రామంలోనికి రానివ్వకుండా వుండట్లం కోసం గ్రామాలచుట్టూ కందకాలు తవ్వేవారు. రోడ్లకు గండ్లుకొట్టి రోడ్లపై అడ్డంగా చెట్లను, పెద్ద బండలను పడవేసి గ్రామానికిగ్రామానికి మధ్య రోడ్డు సంబంధాలను త్రెంచివేశారు. సూర్యాపేట తాలూకాలో ఈ కార్యక్రమం పెద్ద ఎత్తున సాగించబడింది. ట్రంకురోడ్డుకుకూడా గండిపెట్టారు. తిరుమలగిరికి సూర్యాపేటకు మధ్యగల రోడ్డుకు ప్రతి అర ఫర్లాంగుకొక గండి కొట్టారు. సూర్యాపేట–ఖమ్మం, సూర్యాపేట–నాయకలగూడెం మధ్యగలరోడ్లకుగూడా అదేవిధంగా గండ్లుకొట్టబడ్డాయి. అనేక వంతెనలు ధ్వంసం చేయబడ్డాయి. సూర్యాపేట, హుజూర్‌నగర్, నల్లగొండతాలూకాలలోని అనేక దళాలు, ప్రజలు అనేక సార్లు మూసీనదిపై వంతెనను ధ్వంసం చేయడానికి ప్రయత్నించారు. కొన్నిచోట్ల డైనమైట్ వుపయోగించబడింది బలమైన వంతెనలు గూడా కొన్ని కూల్చివేయబడ్డాయి. (ఉదాహరణకు హుజూరునగర్‌లో ఒక

వంతెన) ఈ కూల్చివేత కార్యక్రమంలో ప్రజలు, స్థానిక దళాలు, వాటితోపాటు గ్రామాల్లోని నిర్మూలన దళాలు అద్భుతమైన కృషిచేశాయి. ఈ కార్యక్రమం సాగుతుండగా అనేక గెరిల్లా దళాలు రోడ్లపై కాపుదలకై నిలిచేవి. ఈ నిర్మూలనా కార్యక్రమం సాధ్యమైనచోట్ల ప్రతిరోజూ సాగుతుండేది. ఈ కార్యక్రమం నెలలతరబడిసాగింది. ప్రజలు రోడ్లకుకొట్టిన గండ్లను శత్రువు పగటిపూట పూడ్చివేస్తూండేవాడు అయితే తిరిగి రాత్రివేళల్లో ప్రజలు ఆ గండ్లను యథాప్రకారం తయారుచేసేవారు. రోడ్లను కాపాడుకోవడమే శత్రువుకు ప్రధాన కర్తవ్యంగా తయారయింది. అందుకోసం వాళ్ళు గ్రామాలపై దాడులను అధికంచేశారు. ప్రజలను బీభత్సపరచి రోడ్లకు గండ్లు త్రవ్వకుండా అరికట్టగలమన్న ఆశతో వాళ్ళు రోడ్డుపై కన్పించిన వాళ్ళను కాల్చివేస్తుండేవాళ్ళు.

జాజిరెడ్డిగూడెం ప్రాంతం.. సూర్యాపేట తాలూకా జాజిరెడ్డి గూడెం ప్రాంతంలో సైనికులు ప్రజలను బలవంతంగా తీసుకువచ్చి రోడ్లమీద గండ్లు పూడ్పించడానికి పూనుకున్నారు. తుపాకులు చూపి బెదిరిస్తుండగా ప్రజలు గండ్లు పూడ్చవలసి వచ్చేది. ఆ విధంగా పూడ్చే ప్రజలపై కాల్పులు జరిపి ఆరుగురిని చంపి ఆ శవాలను ఆ గండ్లలో పడవేసి మట్టిబోయించారు. జనగామ–సూర్యాపేట రోడ్డును ధ్వంసం చేయటం కోసం సాగిన పోరాటంలో కాసర్లపాడుకు చెందిన 18మందిని రామన్నగూడేనికి చెందిన 18 మందిని పాతర్ల పాడుకు చెందిన 12 మందిని, బల్లవపల్లికి చెందిన 12మందిని మొత్తం 60మందిని కాల్చి చంపి రోడ్డుమీద గండ్లలో పడవేసి పూడ్చారు. అయినా కామ్రేడ్ అనిరెడ్డి రామిరెడ్డి నాయకత్వాన గెరిల్లాలు 13 మైళ్ళ రోడ్డును ధ్వంసం చేయగలిగారు. ఈ భీకర పోరాటం సాగుతున్నంతకాలం ప్రజల వుత్సాహాన్ని నిలబెట్టుటానికి కామ్రేడ్ రామిరెడ్డి కృషిచేశాడు. ఆరునూర్ల తట్ట, పార, మూడు నూర్ల గడ్డపార" అని బాలమూరు కొండయ్య రాసిన పాటను వారు ఆచరణలో పెట్టారు.

ప్రజలను భయంకంపితులను చేయుటకు నైజాం పోలీసులు మిలిటరీ అనేక అత్యాచారాలు జరిపారు. అయినా ప్రజలు జంకలేదు. ఈ విధ్వంస కార్యక్రమంతోపాటు ట్రంకురోడ్డుమీద సైనిక శకటాల ప్రభుత్వ బస్సుల టైర్లకు రంధ్రాలు పెట్టడానికి దళాలు నూతన పద్ధతులను అనుసరించాయి.

ఇందుకోసమే ప్రత్యేకంగా తయారు చేయబడిన పెద్ద ఇనుప సీలలు సూర్యాపేట తాలూకా మోతేగ్రామం సమీపాన రోడ్డుపై నాటారు అయితే అవి పనిచేయలేదు తిరిగి ఆదేరోడ్డుమీద యినుపసీలలు దిగగొట్టిన చెక్కలను పడవేశారు. ఆ సీలలు 'చాలా చిన్నవి. అందువలన ఈ చెక్కలు

కూడా పెద్దగా పనిచేయలేదు. అందువల్ల ఆ తరువాత వారు 6 అంగుళాలు పొడవు అర అంగుళం మందంగల సీలలను చెక్కకు రెండువైపుల దిగగొట్టి రోడ్డు మధ్యలో పడవేసేవారు. దానితో రెండు వైపులనుండివచ్చే అనేక లారీలకు బస్సులకు టైర్లుబ్రద్దలయిపోయేవి, ఆ వాహనాల డ్రైవర్లు క్రిందకు దిగి టైరు మార్చుకోవడానికిగూడా సాహసించలేకపోయేవారు.

చివరకు గ్రామాలపై దాడులను వుధృతం జేయడంకోసరం శత్రువు లెక్కలేనన్ని క్యాంపులు ఏర్పాటుచేశాడు. ప్రతినాలుగైదు మైళ్ళకు ఒక క్యాంపు పెట్టాడు కొన్నిచోట్ల రెండుమూడుమైళ్ళకొక క్యాంపు పెట్టాడు. మూడు నాలుగు క్యాంపులలోని సైన్యం మొత్తం కలిసి 8-10 మైళ్ళవరకూగల ప్రాంతంలోని గ్రామాలన్నింటిపైనా దాడులు సాగించేవారు. ఈ విధంగా ఒకరోజున ఒక ప్రాంతంలో, మరుసటిరోజు మరొక ప్రాంతంలో తమదృష్టిని కేంద్రీకరించి దాడులు గాలింపులు జరుపుతూండేవారు. ఈ క్యాంపులు దేశ ముఖుల బంగళాలలో ఏర్పాటు చేయబడేవి. దీనినిచూచి అనేక ప్రాంతాల్లో ప్రజలు స్థానికదళాలు భూస్వాముల బంగళాలను కూల్చివేశారు. కొన్నిచోట్ల వాడు యిళ్ళపై పిట్టగోడలను పడగొట్టారు. అందువల్ల ఆ గోడలను మాటు జేసుకొని ప్రజలపై కాల్పులు జరపడానికి వీలులేకుండా పోయింది. బంగళా లను ధ్వంసం చేసే ఈ కార్యక్రమం ఎంతో జయప్రదంగా అమలు జరిగింది. ఇందులో గ్రామప్రజలంతా పాల్గొనేవారు సూర్యాపేట తాలూకాలో యిది సమధికోత్సాహంతో సాగింది. అందువల్ల శత్రువు క్యాంపులేర్పాటుచేయాలను కున్న అనేకచోట్ల అందుకోసం బంగళాలు లేకపోవడంతో క్యాంపులు ఏర్పాటు చేయలేకపోయారు దళాలు, క్యాంపులను చుట్టుముట్టి దాడీజేయడం ప్రారం భించిన తరువాత క్యాంపుల సంఖ్యకూడా తగ్గిపోయింది. క్యాంపులసంఖ్య తక్కువైనా వాటిలోవుండే మనుష్యుల సంఖ్య హెచ్చింది. గెరిల్లాలు శత్రువు కంటబడకుండా సంచరించటంకోసం నైజాం అశ్విక పోలీసుదళాల బారినుండీ తప్పించుకొనడంకోసం నల్లగొండ తాలూకాలో ప్రజలు కొన్నిమైళ్ల పొడువున కందకాలుత్రవ్వారు.

అయితే నైజాం బలగాలు తమ పాశవిక బీభత్సకాండను మరింత ఉధృతం చేశాయి.

సూర్యాపేట తాలూకాలోని పాతర్లపాడు గ్రామంలో 20 మంది యువకుల (స్థానిక వాలంటీర్లు, గ్రామస్థులు) ను ఒక వరుసలో నిలబెట్టి వారి చేతులుగట్టి కాల్చిచంపారు. వారిలో ఇరువురిని ప్రాణంతో వుండగానే గడ్డి పెంటుటాకులుకప్పి సజీవదహనం చేశారు.

సూర్యాపేట తాలూకా ఎర్రబాడు గ్రామానికి సుమారు మైలున్నర దూరంలోగల చందుపట్ల గ్రామంలో ఆజానుబాహులైన దిట్టమైన మనుష్యులగు స్థానిక దళసభ్యులు 12 మందిని అదేవిధంగా నిలబెట్టి కాల్చి చంపారు.

భువనగిరి తాలూకా కోటమర్తి గ్రామంలో శత్రువులు, మహిళలతో సహా గ్రామప్రజలందరినీ ఒకచోట మందవేశారు. వారందరినీ పూరిబయటకు తీసుకువెళ్ళి బట్టలూడదీసి భయంకరంగా కొట్టారు. నేలమీద ముళ్ళుజల్లి, ఆ ముళ్ళమీద నిలబెట్టారు. వాళ్ళచుట్టూ చెట్లకొమ్మలు పడవేసి నిప్పంటించారు. శత్రువులు తమ చేతుల్లో కర్రలు, రైఫిళ్ళు పట్టుకొని గడ్డపు అమీను మీద వ్రాయబడిన పాటను పాడవలసిందిగా అడుగుతూ నిలబడ్డారు. (దుర్మార్గానికి పేరుమోసిన గడ్డమున్న సబ్ ఇనస్పెక్టర్) పాదాలక్రింద ముళ్ళతో, చుట్టూ మంటలతో, ప్రజలబాధ వర్ణనాతీతం. లప్పగూడెంనుండి, వరంగల్ తాలూకా ఘనపురానికి వచ్చిన రామచంద్రారెడ్డి అనే రైతును శరీరమంతా ఈటెలతో పొడిచారు ఆయన మరణించాడనుకొని వదిలేశారు.

జనగామ తాలూకా ధర్మాపురం తండాలో ముగ్గురు లంబాడీలచేత కట్టెలు తెప్పించారు. వాళ్ళచేతనే ఆ కట్టెలకు నిప్పు పెట్టించారు. ఆ తరువాత వారిని సజీవంగా ఆ మంటల్లో పడవేశారు.

అక్కరాజుపల్లెలో 22 మందిని శరీరమంతా ఈటెలతో పొడిచి, ఆ తరువాత ముక్కలు ముక్కలుగా నరికి చంపారు.

జనగామ తాలూకా కొడకండ్లలో పదే పదే దాడులు జరిపి 30 మందిని చంపారు. విసునూరు దేశముఖ్ కుమారుడు బాబూరావు నాయకత్వాన ఈ కిరాతకత్వం జరిగింది.

**క్యాంపుల నిర్మూలన :**

శత్రు దాడులు అధికమవటంతో ఈ దాడుల నరికట్టటంకోసం శత్రువును ముప్పుతిప్పలు పెట్టటంకోసం క్యాంపులను ధ్వంసంజేసే కార్యక్రమాన్ని దళాలు, ప్రజలు చేపట్టారు.

ఆత్మకూరు క్యాంపుపై దాడి : సూర్యాపేట తాలూకా ఆత్మకూరు గ్రామంలో మిలటరీ క్యాంపొకటుంది. అందులో యాభైమంది సైనికులున్నారు. అచ్చటికి ఉత్తరాన, దక్షిణాన ఏపూరు, ఏనుబాముల అనే సమీప గ్రామాల్లో పెద్దక్యాంపులున్నాయి. ఆత్మకూరు క్యాంపుపై దాడిజేయడంకోసం వందమంది గెరిల్లాలు, స్థానిక దళసభ్యులు, 600 మంది ప్రజలు అర్ధరాత్రివేళ ఆ గ్రామసమీపాన కూడారు. తమ రహస్య వార్తాహరుల సహాయంతో

గూండాల తోడ్పాటుతో శత్రువు అచ్చటి ప్రజలచేత చుట్టూ కాపలాకాయిస్తూ వుండేవాడు. కాపలాకాస్తున్నవారు హెచ్చరిక చేసేట్లయితే, శత్రువు రోడ్ల మీదికి వచ్చేట్లయితే క్యాంపును చుట్టుముట్టి దాడిజేయటం దళానికి సాధ్యం కాదు. పైగా శత్రువుది పైచేయవుతుంది. దళాలు ఆత్మరక్షణ జేసుకోవటం కోసం తంటాలు పడవలసివస్తుంది. అందువల్ల తమకు అంతకుముందు అందిన సమాచారానికి అనుగుణంగా దాడికి పధకం వేసుకున్నారు. దళసభ్యుల్లో కొందరు కాపలాదారుల కంటపడకుండా గ్రామాని కొకవైపునుండి గోడలపై కెక్కి లోపల ప్రవేశించారు. క్యాంపును చుట్టుముట్టి డ్యూటీలోవున్న సెంట్రీని కాల్చిచంపారు. అదేసమయంలో ఇతరులపైనకూడా కాల్పులు జరిపారు. గెరిల్లాలు కాల్పులు జరిపిన మొదటిమోత వినపడగానే వెలుపలనున్న దళ సభ్యులు, ప్రజలు గ్రామంచుట్టూ కాపలాకాస్తున్న వాళ్ళను తుడిచిపెట్టి లోపల ప్రవేశించారు. సమీపంలోవున్న పెద్దక్యాంపులనుండి శత్రువుకు సహాయం అందకుండా అరికట్టటంకోసం వారు సాయుధకాపలా ఏర్పాటు జేశారు. ప్రేలుడుశబ్దం వినటంతోనే శత్రువులు క్యాంపుహౌస్ లోపలికివెళ్ళి తలుపులు బిడాయించుకొని, కిటికీలద్వారా నిరంతరాయంగా కాల్పులు ప్రారంభించారు.

లోపలికి వెళుతూ వుండగానే గెరిల్లాల తూటాలు తగిలి యిద్దరు మృతి చెందారు. అయితే ఆ తరువాత దళం జరిపిన కాల్పులు శతృవుకు తగల లేదు. దళాలు ఆ యింటిని చుట్టుముట్టాయి. శతృవు జాడ కనిపించటంలేదు. దానితో కిటికీలద్వారా చేతిబాంబులు విసరాలని నిర్ణయించుకున్నారు. అయితే సరిగ్గా అదే సమయంలో ఒక కామ్రేడ్ గొప్ప వుద్రేకంతో కిటికీలగుండా శతృవుపై దెబ్బగొట్టాలనే ఆదుర్దాతో కిటికీలున్న గోడవెంబడే నడిచిపోయాడు. శతృవు తూటా ఆయన గొంతుకలో దూరి అక్కడికక్కడే మరణించాడు. అప్పటికే తెల్లవారింది దళాలు జాగ్రత్తగా మృతదేహాన్ని బయటకు తీసుకు వచ్చాయి. చేతిబాంబులు విసరాలని వారెంతో ప్రయత్నించారు. కాని శతృవు మెళకువతో వుండటంవల్ల అది సాధ్యపడలేదు. కిటికీలవద్ద ఏ మాత్రం శబ్దమైనా శతృవు కాల్పులు జరిపాడు. ఉదయం 10 గంటలవరకు, ప్రయత్నించి గెరిల్లాలు దాడిని వుపసంహరించారు.

*ఎర్రపాడు క్యాంపుపై దాడి :* ఈ క్యాంపుపై దాడి పెద్ద యెత్తున సన్నాహాల అనంతరం సాగింది. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి భవనం పెద్ద కోటలాగావుంది అందులోనే క్యాంపు ఏర్పాటు చేయబడింది. ఆ క్యాంపును ధ్వంసంచేయాలని ప్రజలు, దళాలు ఆదుర్దాగావున్నాయి. మొత్తం కోటనంత టినీ నామరూపాలేకుండాచేయాలని వారనుకున్నారు. అందువల్ల గడ్డపలుగులు, గొడ్డళ్ళు చేతబూని సుమారు 2000 మంది ప్రజలు అర్ధరాత్రివేళకు అక్కడకు

చేరారు. వాళ్ళు భవనాన్ని సమీపించారు. భవనానికి అన్నివైపులా శత్రువుకు అదనపుబలగాలు రావటానికి అవకాశమున్న అన్నిరోడ్లపైనా గట్టి కాపలా ఏర్పాటు చేశారు

వారు, తమతోపాటు మూడు నాటు ఫిరంగులు కూడా తెచ్చారు. వాటిని బండ్లపై అమర్చారు. తాళ్ళు, గొలుసులుబెట్టి బిగించారు. ఆ భవనానికి గురిజూచి ఆ బండ్లను తగినస్థానంలో నిలబెట్టారు. వాటిలో ఒకటి ప్రేల్చారు. ఆ ఫిరంగి పెద్దశబ్దంతో దూసుకుపోయింది. పరిసరప్రాంతమంతటినీ దద్దరిల్ల జేసింది. అయితే అందులోని రవ్వలు చెల్లాచెదురైపోయాయి. కోటగోడలు చెక్కుచెదరలేదు ఫిరంగిప్రేల్చే సమయంలో దాన్ని అమర్చినబండి కదల కుండా చూడటానికి ప్రయత్నం జరగనందువల్ల ఆ బండి ముక్కలైపోయింది. ఈ అనుభవంతో దళాలు, మిగతా ఫిరంగులను మోకులలో గొలుసులలో మఱ్ఱిచెట్టుకు బిగించికట్టి ప్రేల్చారు. వాటివల్ల కోటగోడ లూగిపోయాయి. అయితే గోడకొక్క రంధ్రమయినా పడలేదు. దానితో అంతా నిరుత్సాహ పడ్డారు. అనాటి నుండి దానిని ఫిరంగిపథకం అని పిలిచేవారు. సర్వసన్నాహాలూచేసినా జయప్రదంకాకుండాపోయిన పథకాలనులేక అసాధ్యంగా కనుపించే పథకాలను ఘుజ్జాయిపథకం అని పిలవటం అలవాటయింది.

ఇంత జరిగినా దాడి ప్రయత్నం విరమించలేదు. ఫిరంగి దెబ్బ తగిలిన చోట్లలో ప్రజలు పలుగులతో, గొడ్డళ్ళతో గోడను త్రవ్వడం ప్రారంభించారు. అ గోడ గట్టితనం ముంధు, గడ్డ పలుగులుకూడా వంకర్లు పోయాయి. అయినా ప్రజలు తమ ప్రయత్నం మానలేదు. ఒకవైపున గోడకు గండి కొట్టే అవకాశం వుంది. ఆశ్చర్య చకితుడైపోయి, ఫిరంగి మోతలతో గందరగోళానికి లోనైన శత్రువు అప్పటికి తేరుకున్నాడు. వాళ్ళలో కొంతమంది ఆయుధాలు చేతబట్టి బురుజుపై కెక్కారు. నలువైపులా పరికించి చూస్తున్నారు. అప్పుడు దళ సభ్యుల్లో ఒకరు, వాళ్లు క్రిందికి దిగిపోకముందే తన రైఫిల్‌తో వారిలో ఇద్దరిని కాల్చాడు. దళ నాయకులొకరు ఫిరంగి బండిని గోడ ప్రక్క కీడ్చి ఆ బండిమీద నిలబడి గోడలోపల శత్రుసమూహంపై చేతిబాంబు విసిరాడు. ఆ బండికి చుట్టూరాగల ప్రజలు గోడను త్రవ్వే పనిలో నిమగ్నమైయున్నారు. తనకు సమీపంలోవున్న ప్రజలందరినీ దూరంగా వెళ్ళవలసిందిగా కోరటం అవసరం అనైనా దళ నాయకుడనుకోలేదు. ఆయన బాంబును శత్రువు మీదికి విసిరాడు దురదృష్టవశాత్తు అది గోడ పైభాగానికి తగిలి ప్రజలమీదే వచ్చి పడింది. వారిలో యిద్దరు అక్కడికక్కడే మరణించారు. 12 మంది తీవ్రంగా గాయపడ్డారు. అది జరిగే టప్పటికే తెల్లవార వస్తోంది. దీనితో దాడిని పునః సంహరించారు. మృతదేహాలను, గాయపడిన వారిని తీసుకొని వారంతా

నాలుగు మైళ్ళ దూరానగల సురక్షిత ప్రాంతానికి వెళ్ళిపోయారు. గాయపడిన వారిలో ఇరువురు ఆ తరువాత చికిత్స పొందుతూ మరణించారు. మిగతా వారిని సాయుధ రక్షణతో తగిన ఏర్పాట్లుచేసి పరిసర ప్రాంతాల్లోగల మిలటరీ క్యాంపు లన్నింటినీ తప్పించుకొని 30 మైళ్ళ దూరానగల మరింత సురక్షిత మైన స్థలానికి పంపించారు. భారత సైన్యం సంస్థానంలోకి ప్రవేశిస్తున్నదన్న వార్త వినగానే ప్రజలు ఆ కోటను నేల మట్టం చేశారు.

కొడకండ్ల క్యాంపు ధ్వంసం : కొడకండ్ల జనగామ తాలూకాలోని గ్రామం. అది సూర్యాపేట తాలూకా సరిహద్దున వుంది. అదొక పెద్ద రజాకార్ మిలిటరీ కేంద్రం. ఆ కేంద్రాన్ని ధ్వంసం చేయాలని సూర్యాపేట తాలూకా దళాలు నిర్ణయించాయి అర్థరాత్రి వేళ, పెద్దసంఖ్యలో వెళ్ళి ఆ గ్రామాన్ని చుట్టుముట్టారు. తెల్లవారుజామునే పోరాటం ప్రారంభ మైంది. గోడలను మాటుజేసుకొని శత్రువు కాల్పులు సాగిస్తున్నాడు దళాలను గ్రామంలో ప్రవేశించనివ్వటంలేదు. కోటపాడు అనుభవాన్ని గుర్తుంచుకొని దళాలు రజాకార్ల యిండ్లకు నిప్పంటించారు. వాళ్ళను యిండ్లలోనుంచి బయ టకు రప్పించటంకోసం ఆ పని చేశారు. శత్రువు పోరాటరంగంనుంచి తప్పు కొని తిరోగమించాడు. దళాలు గ్రామంలో ప్రవేశించాయి. అయితే శత్రువు ఇంటితర్వాత ఇంటిని మాటుజేసుకొని ప్రతిఘటిస్తున్నాడు. శత్రుమారాన్ని ధ్వంసంచేసి, దళాలు క్యాంపుపైపుకు పురోగమించాయి

గెరిల్లాలు నలుగురేసిగల బృందాలుగా చీలి ముందుకు చొచ్చుకు పోయారు. కొన్ని తావుల్లో ఇండ్లలో ప్రవేశించి శత్రువును నిర్మూలిస్తూ సాగి పోయారు. తాము ప్రవేశించలేకపోయిన ఇండ్లకు, శత్రువులోపలే వుండగా నిప్పంటించారు. తమ చేతికి చిక్కిన శత్రువులందరినీ చంపివేశారు. తమ దారి కడ్డంరావలదని గెరిల్లాలు స్త్రీలకు విజ్ఞప్తి చేశారు. ఒక్క స్త్రీకయినా ఎలాంటి హాని జరగలేదు. అడుగడుగునా పోరాడుతూ, యింటింటివద్దనూ పోరాడుతూ దళాలు క్యాంపు దగ్గరకుచేరి, చుట్టుముట్టాయి. అక్కడకూడా సైన్యంతో భీషణ పోరాటం జరిగింది. చివరకు, ఆ భవనానికి నిప్పంటించి ధ్వంసం జేశారు. ఈ మహాపోరాటం సాయంత్రంవరకూ సాగింది. శత్రువుకు అపారమైన నష్టాలు సంభవించాయి. శత్రువు పారిపోతూ తనతో తీసుకెళ్ళలేక వదలివేసిన శత్రు శవాలు పదిహేను, దళాలకు కనిపించాయి. యాభైమందదాకా గాయపడ్డట్లు ప్రజలు లెక్కబెట్టారు. పదిహేను 303 – రైఫిళ్ళు, ఒక స్టెన్‌గన్, చాలా బర్మార్లు, ఈటెలు చేజిక్కాయి. దళాలు ఎలాంటి నష్టాలు పొందకుండా విజయం సాధించాయి. అవి తమ ధైర్యసాహసాలను, పోరాటనైపుణ్యాన్ని ప్రదర్శించాయి.

ముష్త్యాలపల్లి క్యాంపుపై దాడి : భువనగిరి తాలూకా ముష్త్యాలపల్లి క్యాంపుపై దాడి జేయడానికి దళాలు వెళ్ళాయి. అయితే దళాలు ఆ గ్రామానికి చేరేసరికే తెల్లతెల్లవారింది. శత్రువు వారిని చూచాడు మూడు వైపులనుండి క్యాంపుదగ్గరకు వస్తున్న దళాలపై కాల్పులు ప్రారంభించాడు. గ్రామం చివరిలోగల ఇండ్లవెనుక శత్రువు ఆశ్రయం పొందాడు. తుపాకులను గోడలపైన అమర్చి గెరిల్లాలపై కాల్పులు జరిపారు. అప్పటికి తెల్లవారింది దళాలు ఆత్మరక్షణకోసం వేటినో చాటుజేసుకోవలసి వచ్చింది. అయినా వారు వెనుదిరగలేదు. గోతుల వెనుకనుండి, కాలవగట్లు మాటునుండి పోరాటం సాగించారు. దళ సభ్యులలో వొకరు శత్రువు కంట పడకుండా ఒకవైపుకు సాగి పోయి, తుపాకి ప్రేల్చుతున్న శత్రువుపై కాల్పులు జరిపాడు. అతడు చచ్చి పడిపోయాడు. అతని తుపాకి మూగబోయింది. శత్రువుపై ఆగ్రహావేశాలతో కాల్పులు జరుపుతూ దళం ముందుకు దూసుకుపోయింది. శత్రు బలగంలోని మరో నలుగురు నేలకూల్చబడ్డారు శత్రువులు మాటుజేసుకుంటున్న యిండ్లకు దళాలు నిప్పంటించాయి పెద్ద బంగళాలో యేర్పాటు చేయబడివున్న తను క్యాంపుకు వారు పారిపోకతప్పలేదు.

బంగళా ముందున్న లాడీలకు నిప్పంటించారు. అయినా దళాలు బంగళాలో ప్రవేశించలేకపోయాయి. సాయంత్రం 7 గంటలవరకూ పోరాడి దళాలు వెనకకు మరలాయి. ఈదాడి విఫలమవటానికి కారణం, సరైన పద్ధతిలో ముందుగా పథకం వేసుకోకపోవడమేనని, తాము ఆ గ్రామానికి తెల్లవార బోతుండగా చేరటం సరైంది కాదని ఈ సంఘటన అనంతరం తమ చర్చల ఫలితంగా వారు నిర్ణయించుకున్నారు. 150 మంది సభ్యులు గలిగిన పెద్ద శత్రు శిబిరంపై, స్వల్ప సంఖ్యలోగల దళాలు దాడి జరపటం, వాళ్లలో ఐదుగురిని చంపివేయటం, వాళ్ళ తుపాకులలో వొకదానిని నష్టపరచటం—శత్రువుయొక్క మనో నిబ్బరం అధమస్థాయిలో వుండటాన్ని, ప్రజల, గెరిల్లాల ధైర్యస్థయిర్యాలు వున్నత స్థాయిలో వుండటాన్ని చూపుతున్నాయి.

క్యాంపులను ముట్టడించి ధ్వంసంజేసే ప్రయత్నాలు పెద్ద ఎత్తున సాగాయి. అనేక సందర్భాలలో ప్రజలు విజయం చేపట్టలేకపోయారు. అయినా, ఇంకా అనేక ఇతర విజయాలు, ప్రయోజనాలు సాధించగలిగారు. శత్రు క్యాంపుల సంఖ్య తగ్గిపోయింది. ఇతర క్యాంపులలో శత్రుబలగాలసంఖ్య అధికమయింది. అయినా, క్యాంపుల సంఖ్య తక్కువయిన కొలదీ, ప్రతి గ్రామంపై జరిగే ధాడులసంఖ్య తగ్గిపోయింది.దాడికి దాడికి మధ్య వ్యవధి అధికమయింది



1952 లో అజ్ఞాతవాసంనుండి బయటకువచ్చిన తరువాత
కామ్రేడ్ సుందరయ్యగారు మృతవీరుల కుటుంబాలను
సందర్శించి పరామర్శించుచున్న దృశ్యం.

సైన్యమూ, పోలీసులు భయకంపితులైపోయారు. దాడులు సాగించే టప్పుడుకూడా చచ్చేంతభయంతో వణుకుతుండేవారు. సైన్యం ఖాళీచేసిన వెంటనే ప్రజలు ఆ క్యాంపు భవనాలను ధ్వంసం చేస్తుండేవారు. శత్రువుకు నిలవనీడ లేకుండా చేయాలనేదే వారి ఏకైక వాంఛ. క్యాంపులు పెద్ద బంగళాలలో మాత్రమే ఏర్పాటు చేయబడుతుండేవి. శత్రువుపై పోరాడుతూ గ్రామస్తులను కాపాడుతూ గెరిల్లా దళాలు ప్రజలకు తోడ్పడుతుండేవి. ఈ పెద్ద క్యాంపులనుండి గ్రామాలపై దాడులు చేయడం అంతకంతకూ తగ్గజొచ్చింది. గ్రామాలపై దాడులు చేయడానికి పగటివేళల అవకాశాలు అంతకంతకూ సన్నగిల్లజొచ్చాయి. ఆ విధంగా వారు గ్రామాలను శత్రువు పిడికిలి నుండి విముక్తి చేశారు ఆ విధంగా విముక్తి చేయబడిన మూడువేల గ్రామాలలో ప్రజల పరిస్థితులు మెరుగైనాయి అత్యవసరమైన రాజకీయ ఆర్థిక కర్తవ్యాలను వారు జయప్రదంగా నిర్వర్తించగలిగారు.

పైన ఇవ్వబడిన కథనంలో ప్రస్తావనకు రాకుండాపోయిన, తెలంగాణా ప్రజాపోరాటంలో నిర్దిష్టమైన ప్రత్యేకలక్షణాన్ని ప్రతిబింబించేవిధంగా త్తమ జీవితాలను గడిపి ప్రాణాలర్పించిన కొలదిమంది ముఖ్యకార్యకర్తల అమర గాథలతో ఈ అధ్యాయాన్ని ముగించుదాం :

## అమరవీరుల గాథలు

*అమరజీవి కామ్రేడ్ ప్రభాకరరావు, తదితర-కరీమ్ నగర్ నాయకులు :* కామ్రేడ్ ఎ. ప్రభాకరరావు కరీంనగర్ తాలూకా పొలంపల్లి గ్రామానికి చెందినవారు. ఆయన 30 మంది సభ్యులుగల దళాన్ని తీసుకొని హుజూరాబాద్ తాలూకా మండాపురం గ్రామానికి వచ్చాడు. వారు ఈతచెట్లను, తాటిచెట్లను నరికివేశారు. పటేళ్ళ, పట్వారీల రికార్డులను దేశముఖులవద్దగల ప్రాంసరీనోట్లను తగులబెట్టివేశారు. ఆయన ఈ పార్టీ కార్యక్రమాన్ని అనేక గ్రామాల్లో అమలుజరిపి తన దళంతో మండాపురం వచ్చాడు. గ్రామస్తులు వారికి భోజనాది వసతులు ఏర్పాటు చేశారు. వారు భోజనం చేస్తుండగా గ్రామపటేల్ అంతకుముందే పంపిన సమాచారం ఆధారంగా రిజర్వు పోలీసులు ఆ గ్రామానికి వచ్చారు. గ్రామాన్ని మూడు వైపులా చుట్టుముట్టారు. కొండకు వెళ్ళేవైపున మాత్రం వదలివేశారు దళసభ్యులు తప్పించుకోవటానికి ఆ వైపుగా కొండమీదికి వెళ్ళటానికి ప్రయత్నించినపుడు వాళ్ళను తుడిచిపెట్టవచ్చునన్న ఉద్దేశ్యంతో రిజర్వ్ పోలీసులు తమ వాళ్ళతో

కొందరిని ఆ వైపున కనపడకుండా కూర్చోబెట్టారు. కామ్రేడ్ ప్రభాకరరావు దళాన్ని ముఖాముఖి ఎదుర్కోవటానికి పోలీసులు సాహసించలేకపోయారు. ఆ దళమంటే పోలీసులకు హడల్. అనేకచోట్ల ఈ దళం చేతుల్లో వాళ్ళు ఛావు దెబ్బలు తిన్నారు. కొండపై సురక్షిత ప్రాంతానికి చేరడానికి ప్రయత్నిస్తుండగా దాగియున్న పోలీసులు గెరిల్లాలపై కాల్పులు జరిపారు. గ్రామాన్ని చుట్టుముట్టిన వాళ్ళుకూడా కాల్పులు జరుపుతూ వాళ్ళ వెంట బడ్డారు. పోలీసులు దళాన్ని చుట్టుముట్టారు. అయినప్పటికీ కాల్పులు సాగించుకొంటూ దళం కొండవైపుకే పరుగెత్తింది. ప్రభాకరరావు గొప్ప సాహసంతో పోలీసులను ఎదుర్కొన్నాడు. నాయకుని సాహసం ఇతర సభ్యులను ఉత్తేజపరచింది. వారిలో మరింత విశ్వాసాన్ని పాదుకొల్పింది. వారు తీవ్రంగా పోరాడారు. వాళ్ళను వెంటాడుతున్న పోలీసులు ముందుకు అడుగు వేయలేకపోయారు. దళ సభ్యులలో అధిక సంఖ్యాకులు సురక్షితంగా కొండపైకి చేరారు. దళ నాయకుడు కామ్రేడ్ ప్రభాకరరావు ఒక పోలీసువాడిని పడద్రోసి చావగొట్టాడు. అయితే, అదేసమయంలో మరొక పోలీసు చేతి రైఫిల్ నుండి వచ్చిన తూటా ప్రభాకరరావు పొట్టకు తగిలింది. అయినా ఆయన ఊపిరున్నంతవరకూ పోరాడాడు సిరిసిల్లకు చెందిన మరొక కామ్రేడ్ భూపతిరెడ్డి కూడా ప్రభాకరరావు వలెనే మరొక పోలీసును పడగొట్టి చంపాడు ఆయన వీరమరణం చెందాడు. నల్గొండజిల్లాకు చెందిన మరొక కామ్రేడ్ దామోదర రెడ్డికూడా ముఖ్యమైన దళ నాయకుడే. ఆయనా తన దళంతో ఈ పోరాటంలో మృతిజెందాడు. ప్రజలకోసం ర్యాతింబవళ్ళు పాటుబడుతూ కరీంనగర్ జిల్లాలో శత్రువుపై పోరాడుతూ వుండిన కామ్రేడ్స్ ప్రభాకరరావు, భూపతిరెడ్డి, దామోదరరెడ్డి, వారి అనుచరులు తమ ప్రాణాలర్పించినారు. అమరులయ్యారు. ఆ పోరాటంలో ఆ జిల్లా తన నాయకులను కోల్పోయినందువల్ల వాటిల్లిన నష్టం పూడనేలేదు.

**భువనగిరికి చెందిన రేణిగుంట రామిరెడ్డి, ఆయన దళం అమరత్వం పొందిన గాథ :**

అమరజీవి రేణిగుంట రామిరెడ్డి : వీరు నల్లగొండజిల్లా భువనగిరి తాలూకా రేణిగుంట గ్రామానికి చెందిన పలుకుబడి గలిగిన అభ్యుదయ కాముకులైన భూకామందు. ఆయన ఆంధ్రమహాసభలో చురుగ్గా పనిచేసే వాడు. ఆయన సహజంగానే గ్రామానికి నాయకుడుగా రూపొందాడు. రజాకారు, నైజాం సాయుధ పోలీసులు తెలంగాణా గ్రామాల్లో గృహదహనాలు లూటీలు మహిళా మానభంగాలు ప్రారంభించిన తరువాత

ఆయన తన గ్రామ యువకులను రక్షణ దళంగా సంఘటితపరిచాడు. వాళ్ళకు బర్మార్లు, షాట్ గన్లు వుపయోగించడంలో శిక్షణ గరిపాడు. ఆయన అనేకసార్లు తన గ్రామంనుండేగాక పరిసరగ్రామాలన్నిటినుండీకూడా దాడికి వచ్చిన రజాకార్లను తరిమివేశాడు. తెలంగాణాలోని అనేక ఇతర గ్రామాలలోవలెనే ఆ గ్రామంలోనూ యిళ్ళపై బురుజులున్నాయి. అక్కడవుండి బయటనుండి వస్తున్న శత్రువులను కనిపెట్టడానికి కాపలాకాయడం జరుగుతుండేది. అవి రక్షణప్రాంతాలుగాకూడా వుపయోగపడేవి. వాటిని ధ్వంసం చేయకుండా గ్రామంలో ప్రవేశించడానికిగానీ, లూటీచేయడానికిగానీ బీభత్సకాండ జరప డానికిగానీ ఏ శత్రువూ సాహసించజాలడు. ఆ బురుజును అభేద్యమైన కోటగా రామిరెడ్డి తీర్చిదిద్దాడు.

నైజాం సాయుధ పోలీసు బలగం, రజాకార్లు పెద్ద సంఖ్యలో వచ్చి గ్రామంపై దాడిచేశారు. రామిరెడ్డి, 20 మందిగల ఆయన దళమూ ఆ దాడిని తీవ్రంగా ప్రతిఘటించారు. ప్రతిఘటన గంటలకొద్దీ సాగింది. రజాకార్లు, గూండాలూ, నైజాం పోలీసులూ అనేకమంది చంపబడ్డారు, గాయపరచబడ్డారు. అయినా శత్రువు దాడిని మరింత వుధృతం చేశాడు. ఆకస్మికంగా సమీపం లోని చెట్టునెక్కిన కొలనుపాక తహసీల్దారు తాను ప్రత్యేక లక్ష్యంగా పెట్టు కున్న రామిరెడ్డిని గురిజూచి కాల్చడానికి అవకాశం కలిగింది. ఆయనపైకి గుండ్లవర్షం కురిపించాడు. ప్రజల ప్రియతమ నాయకుడు, ధైర్యశాలియగు రామిరెడ్డి యికలేడు. దళాన్ని నడిపించడానికీ, వుత్సాహపరచడానికీ ఆయన మరిలేడు. మందుగుండు సామగ్రికూడా అయిపోవచ్చింది. బురుజునుండి బయటికివచ్చి వెనక్కి వెళ్ళిపోవాలని దళం ప్రయత్నించింది. శత్రువు వారిని చుట్టుముట్టాడు. దాదాపుగా వారందరూ కిరాతకుడైన శత్రువు చేతుల్లో చిత్రవధకుగురై మృతిచెందారు.

అయితే ఈ వీరోచిత పోరాటమూ, రామిరెడ్డి వీరమరణమూ, ఆయన దళంచేసిన అఖండ త్యాగమూ పోరాటాన్ని సాగిస్తున్న తెలంగాణాకు అమర సందేశంగా వుత్తేజం కలుగజేశాయి. అతి శక్తివంతమైన యుద్ధగీతాల్లో ఒకటి ఆయన పేరుమీదుగానే వ్రాయబడింది. అపాట తెలంగాణా అంతటా యుద్ధ గీతంగా యింటింటా మారుమ్రోగింది.

## కా॥ మేడ్ గోపాలరెడ్డి వీరోచితపోరాటం

కా॥ మేడ్ గోపాలరెడ్డి దళం సూర్యాపేటతాలూకా, పాతర్ల పాడు గ్రామంలో వున్న విషయం తెలిసి వందమంది సైనికులు, రెండువందల మంది రజాకార్లు గ్రామంపై దాడిచేశారు. గ్రామాన్ని చుట్టుముట్టారు.

దళనాయకుడు గోపాలరెడ్డి, తన రైఫిల్‌ను దాడికివస్తున్న శత్రువుపై గురిచూచి కాల్పులు జరిపాడు. శత్రుబలగంలో యిద్దరు అక్కడికక్కడే ప్రాణాలు విడిచారు. మిగతావాళ్ళు నేలమీద బోర్లాపండుకొని దళంపై తూటాలవర్షం కురిపించారు. శత్రువు తమను చుట్టుముట్టినప్పటికీ, ఆ ముట్టడి నుండి బయటపడటానికి ప్రయత్నించాలేగాని ఏ పరిస్థితుల్లోనూ ఎవరూ తమ ఆయుధాలను క్రింద పెట్టకూడదని శత్రువుకు లొంగిపోకూడదనీ గోపాలరెడ్డి తన కామ్రేడ్స్‌కు ఆదేశించాడు. నేలమీద పండుకొనియున్న వారిపై కాల్పులు జరుపుతూ వారిని తలెత్తకుండాజేస్తూ తాను స్వయంగా శత్రుశ్రేణితో తల పడ్డాడు. ఆయన దళసభ్యులు కూడా అదేవిధంగా ధైర్యంతో ఆయనను అనుసరించారు. అయితే శత్రువు సబ్ మెషిన్‌గన్‌లతో కాల్పులు జరిపారు. అన్నివైపులనుండి వందలాది తూటాలు వర్షించబడుతున్నాయి అందువల్ల మొత్తం దళం సురక్షితంగా బయటపడలేకపోయింది. వారికి నాయకత్వం వహిస్తున్న గోపాలరెడ్డికి పొట్టలో తూటాదెబ్బ తగిలింది. అయినప్పటికీ ఆయన తనవద్దగల చివరితూటావరకు ప్రేలుస్తూనేవున్నాడు. మరికొన్ని తూటాలు ఆయన మెడకు, రొమ్ములకు తగిలిబలైపోయాడు. ఈ పోరాటంలో ఆ దళ సభ్యులు మరో నలుగురు కూడా మృతిజెందారు. వారిలో ఇద్దరు తాము ముట్టడినుండి బయటపడి మిగతావాళ్ళు సురక్షితంగా బయటపడటంకోసం శత్రుకాల్పులను తమపైకే ఆకర్షించి యితర సభ్యులపై కాల్చకుండాజేసి మృతి జెందారు. దళనాయకుడు నలుగురు యితరదళసభ్యులు ప్రదర్శించిన గొప్ప ధైర్యసాహసాలకారణంగా మొత్తం 15 మంది దళ సభ్యులూ తుడిచిపెట్టబడ డానికిబదులు 10 మందిని రక్షించుకోవటం సాధ్యమయింది. ఈ పోరాటంలో శత్రుబలగంలోని వారు కూడా ఆరుగురు మరణించారు. ఈ దళమూ, దాని నాయకుడూ ప్రదర్శించిన ధైర్యసాహసాలు శత్రువుకుసైతం విభ్రాంతి కలుగ జేశాయి. శత్రువు పెద్దసంఖ్యలో వున్నప్పటికీ కనీసం ఒక గెరిల్లానైనా సజీవంగా పట్టుకోలేకపోయాడు. శత్రువు తూటాలదెబ్బకు తనప్రేవులు బయటు కొచ్చినతరువాత కూడా దళ నాయకుడు వీరోచితంగా పోరాడాడు. దళ సభ్యుల్లో పదిమంది ఆ ముట్టడినుండి సురక్షితంగా బయటపడ్డారు. ఈ విషయా లన్నింటినీ ప్రజలు కథలుగా గానంచేసి వారిని అమూల్యంగా ఆరాధించటం జరుగుతోంది. అన్నిదళాలూ ప్రజలూ ఈ ఐదుగురు కామ్రేడ్స్ మృతిపట్ల సంతాపంతో వినమ్రులయ్యారు. ధైర్యశౌర్యాలకు చిహ్నాలుగా, వారిని పరిగ ణించారు. విజయం సాధించేంతవరకూ శత్రువుపైపోరాడడానికి ప్రతినబూనారు.

కామ్రేడ్ గోపాలరెడ్డి, సూర్యాపేటతాలూకా ఆత్మకూరుగ్రామంలో పేదరైతు కుటుంబంలో జన్మించాడు. ఆయన మాధ్యమిక పాఠశాలలో చదువు

కున్నాడు. ఇంకా చదువుకోవాలని ఆయనకు ఆసక్తి వున్నప్పటికీ పేదరికం కారణంగా చదువుకోలేకపోయాడు. పొలంలో పని చేయడం ప్రారంభించాడు. 1946 లో 20 సంవత్సరాల వయస్సులో ఆయన నైజాం వ్యతిరేకోద్యమంలో చేరాడు ప్రజలకు సేవజేయటంకోసం పార్టీలో కొచ్చాడు. ఆయన గ్రామ వాలంటీరుగా, గ్రామ నాయకుడుగా వుండేవాడు కేంద్ర ఆర్గనైజరు స్థాయికి, కేంద్ర గెరిల్లా దళ నాయకుని స్థాయికి పెంపొందాడు

ఆయన అనేకసార్లు ఆత్మకూరు, ఎనుబాముల తదితర క్యాంపుల్లో శత్రువుపై పోరాడాడు శత్రుదాడి ఎక్కడ జరుగుతున్నా, అక్కడల్లా ఆ దళం ప్రత్యక్షమవుతుండేది. క్యాంపులపై మెరుపుదాడులు చేస్తుండేది శత్రుబలగాల్లో ఒకరినో, ఇదరినో చంపకుండా వారెన్నడూ పూరకే తిరిగిరాలేదు క్యాంపులలో నిర్భయంగా శత్రువు నిద్రపోయి ఎరగడు. ఈ దళం సమీపంలో ఎక్కడో వున్నదన్న వార్త విని, కొన్ని కొన్ని సందర్భాల్లో శత్రువు రాత్రంతా తమ రైఫిళ్ళతో కాల్పులు జరుపుతూనే వుండేవాడు గోపాలరెడ్డంటే శత్రువుకు సింహస్వప్నం. "సై సై గోపాలరెడ్డి" అని తాము వ్రాసుకున్నపాట పాడుకొంటూ ప్రజలీనాటికీ ఆయన వీరత్వాన్ని కొనియాడుతూ వుంటారు. అనేక మంది తమ కుమాళ్ళకు గోపాలరెడ్డి అనిపేరు పెట్టుకున్నారు

## అమరయోధుడు - కామ్రేడ్ పసునూరు వెంకటరెడ్డి

నల్గొండ తాలూకాకు జెందిన కామ్రేడ్ పసునూరు వెంకటరెడ్డి, 1947 కళాశాలల బహిష్కరణోద్యమం సందర్భంగా, కళాశాలచదువుకు స్వస్తిజెప్పి ప్రజాపోరాటంలో చేరాడు. అప్పుడక్కడ ప్రజావుద్యమం తారాస్థాయినందుకునివుంది. ఆయన ప్రజల ప్రేమాదరాలను చూరగొన్నాడు. ప్రజలాయనను ప్రేమతో పి. వి అని పిలుచుకునేవారు వారంతా ఏకకంఠంతో ఆయన ధైర్యసాహసాలను, దృఢనిశ్చయాన్ని, ప్రజాసేవానురక్తిని కొనియాడుతుండేవారు. పి వి దళమంటే భూస్వాములకు, ప్రజాశత్రువులకూ సింహ స్వప్నం. ఆయన అనేకమంది శత్రువులను నిర్మూలించాడు ఎన్నో ఆయుధాలు స్వాధీనం జేసుకున్నాడు ఆయన దళాన్ని నిర్మూలించాలని పోలీసులు తమ దృష్టినంతా కేంద్రీకరించారు. అశ్వారూఢులైన సైనికులు ఆయనను వెంటాడారు. ఆయన అన్నారం గ్రామంలో వొంటరిగా వుండగా, తమ వార్తాహరులు అందజేసిన సమాచారాన్ని ఆధారంజేసుకుని సైన్యం ఆ గ్రామాని కెళ్ళింది. కామ్రేడ్ పి. వి.ని, మరొక కామ్రేడ్ ముసుకు వెంకటరెడ్డిని చంపివేశారు.

## కామ్రేడ్ గానుగుపాటి నారాయణరెడ్డి వీరమరణం

ప్రాంతీయ ఆర్గనైజర్‌గా కామ్రేడ్ గానుగుపాటి నారాయణరెడ్డి శత్రువుతో అడుగడుగునా పోరాడుతూ పార్టీ కార్యక్రమాన్ని నిర్వర్తించు తుండేవాడు. ఒకరోజున జనగామ తాలూకా సోలిపురం గ్రామంలో ఆయన, భూపంపిణీ జరుపుతూ, పేరుకొనిపోయిన సమస్యలను పరిష్కరిస్తూ పొలాల్లో వున్నాడు. అదొక బహిరంగ స్థలం. అచ్చట ఎలాంటి రక్షణా లేదు. అప్పటికే మిట్టమధ్యాహ్నమయింది. శత్రువు జీపులపైవచ్చి ఆ పరిసర ప్రాంతంపై దాడులు జరుపుతున్నాడు ఆ గ్రామానికి కూడా వచ్చాడు. వాళ్ళు తమ దృష్టినంతా కామ్రేడ్ నారాయణరెడ్డిపైనే కేంద్రీకరించాడు. మిగతా వాళ్ళనుండి ఆయనను గుర్తుపట్టడం సులభం. ఆ కామ్రేడ్, నిరాయుధుడుగా వున్నప్పటికీ శత్రువుకు లొంగలేదు. జీప్ వస్తున్న దారికి, జీపులోనుండి తూటాలు వస్తున్న మార్గానికి ఎదురుగా వుండకుండా తప్పించుకొనటంకోసం ఆయిన వంకర టింకరగా పరుగెత్తాడు. కూటిగడ్డవద్ద లంబాడితండా సమీపంలోవుండగా, ఆయన అలసి పోయివున్నాడని సరిగా పరుగెత్తజాలడని శత్రువు గమనించాడు. శత్రువు తన జీపును సూటిగా ఆయనపైకే తోలి, కక్షతో కాల్పులు జరిపాడు. ఆకునూరుకు చెందిన మరొక కామ్రేడ్ వడ్ల రాజయ్యకూడా ఆయనవద్దనే వున్నాడు. శత్రువు లాయననూ కాల్చి చంపారు. శత్రువు దీనిని తమకొక ఘన విజయంగా పరిగణించాడు. ప్రజలు దుఃఖంలో మునిగిపోయారు. ఆగ్రహంతో వుడికిపోతున్నారు. శత్రువుపై పగసాధిస్తామని ప్రతినబూనారు.

కామ్రేడ్ నారాయణరెడ్డి, జనగామ తాలూకా గానుగుపాడు గ్రామంలో రైతు కుటుంబంలో జన్మించాడు ఆయన ఇంటర్మీడియట్ వరకు చదువుకున్నాడు. జనగామ, మెదక్‌లలో మాధ్యమిక పాఠశాలల హెడ్ మాష్టరుగా పని చేశాడు విద్యార్థి వుద్యమానికి తోడ్పడ్డాడు. 1947 లో సహాయ నిరాకరణోద్యం సందర్భంగా ఆయన తన వుద్యోగాన్ని వదిలివేశాడు. గ్రామాలలో వుద్యమాన్ని నిర్మించాడు. ఖాసాపురం గ్రామంలో ఆయన పోలీసులతో పోరాడి వాళ్లవద్దగల ఆయుధాలను గుంజుకున్నాడు. ఆయన యింకా అనేక విజయాలు సాధించాడు. దృఢకాయుడైన ఆయన పేరు వింటేనే చాలు. శత్రువు కంపించిపోయేవాడు. ఆయన ఎంతో ఓర్మితో ప్రజా సమస్యలను పరిష్కరించేవాడు. భూస్వాములకు, ప్రభుత్వానికి చెందిన వేలాది ఎకరాల భూమిని ప్రజలకు పంపిణీజేశాడు. ఆయన ప్రజల ప్రియతమ నాయకుడుగా రూపొందాడు.

లక్ష్మీదేవిగూడెముకు చెందిన కందాడ బాలిరెడ్డి దళం, కోదండ రామిరెడ్డి దళం, 1948 జనవరిలో గుండ్రంపల్లి వద్దగల పేరుమోసిన రజాకార్

క్యాంపులపై దాడి జేశాయి. ఈ క్యాంపులోని శత్రువులు, ఆ పరిసర గ్రామాలలోగల రైతుల ననేకమందిని హత్య జేశారు. ఈ దాడిలో పదిమంది రజాకార్లను చంపివేశారు. దీనితో ఆ ప్రాంతమంతటా ప్రజలకు బ్రహ్మాండమైన మనఃస్థయిర్యం ఏర్పడింది. ఆ క్యాంపు ఎత్తివేయబడింది.

కొలది వారాల అనంతరం, కందాడ బాలిరెడ్డి దళానికి, అంతకు ముందు తప్పుడు ప్రవర్తనకుగాను బాలిరెడ్డిచే మందలించబడిన గ్రామస్థుడొకరు ద్రోహం చేశాడు. లక్ష్మీదేవిగూడెంలో వుండగా రాత్రివేళ రెండు లారీల నిండా రజాకార్లు, సాయుధ పోలీసులు ఆ దళాన్ని చుట్టుముట్టారు. రాఘవాపురానికి జెందిన బాలిరెడ్డి, చాకలి రాజయ్య, గౌడ వెంకయ్యలతో సహా 12 మంది దళ సభ్యులను పట్టుకుపోయి కాల్చి చంపారు.

గుండ్రంపల్లి క్యాంపుపై దాడిజేసిన తరువాత కొలదిరోజులకు, అప్పుడు తప్పించుకుపోయిన రజాకార్ నాయకుడు, కాపరికిజెందిన షేరు మోసిన భూస్వామి పాశం పుల్లారెడ్డి, ప్రక్కనే వున్న కుగ్రామమగు ఆరెగూడెంపై దాడిజేశారు. గెరిల్లాలకు భోజనం పెట్టారన్న సాకుతో నలుగురు రైతులను కాల్చిచంపారు.

బొల్లేపల్లి గ్రామంలో, ఆరుగురు పాలేర్లను, (వారిపేర్లు లభ్యం కాలేదు), రావి రాఘవరెడ్డిని, బాగా పాటలుపాడుతూ బాలసంఘాన్ని నడుపుతున్న ఆయన మైనరు కుమారుడిని 1947 లో రజాకార్లుకాల్చిచంపారు.

ఇలాంటి పెద్ద పెద్ద దెబ్బలు తగిలినప్పటికీ, భువనగిరి ప్రజలు ఆ దెబ్బలను తట్టుకుని నిలచి, ఇంకా అనేకం పోరాట దళాలను ఏర్పాటు జేశారు రజాకార్లకు, నైజాం సైన్యానికి వ్యతిరేకంగా, ఆ తర్వాత భారత సైన్యాలకు, వాళ్ళ తాబేదార్లకూ వ్యతిరేకంగా అనేకపోరాటాలు సాగించారు.

## కొత్తగూడెం గని కార్మికుల నాయకుడు కామ్రేడ్ శేషగిరిరావు

కామ్రేడ్ శేషగిరిరావు ఆంధ్రప్రాంతానికి జెందినవాడు. విద్యార్థిగా వుండగానే కమ్యూనిజం వైపుకు ఆకర్షించబడ్డాడు. పార్టీకి పూర్తికాలం పనిజేసే కార్యకర్తగా రూపొందాడు పార్టీ ఆదేశానుసారం, ఆయన, కొత్తగూడెం వెళ్ళి, గని కార్మికుల యూనియన్ నిర్మాణం ప్రారంభించాడు. స్వల్ప వ్యవధిలోనే కార్మికుల గౌరవాన్ని, విశ్వాసాన్ని చూరగొన్నాడు. 1946-47 సంవత్సరంలో రజాకార్ల, నైజాం బీభత్స కాండ సాగుతున్న సమయంలో ఆయన అజ్ఞాత వాసానికి వెళ్ళవలసివచ్చింది. పోలీసులు, వాళ్ళ ఏజెంట్లూ ఆయనకోసం నిరంతరం గాలించుతూనే వున్నారు. నైజాం పోలీసులు ఆయనను

పట్టుకున్నారు. జిల్లా కేంద్రానికి తీసుకువెళ్తుండగా ఆయన వాళ్ళచేతుల్లో నుండి తప్పించుకున్నాడు. డోర్నకల్లు సమీపంలో తిరిగి దళాలతో చేరాడు. అయితే, కొలదిమాసాల అనంతరం, తన రహస్య స్థావరంనుండి అటవీ మార్గంగుండా, భద్రాచలానికి వెళ్తుండగా, ఎవరో విద్రోహానికి పూనుకున్నందువల్ల, మార్గ మధ్యంలో తుమ్మల చెరువువద్ద ఆయనను, ఆయన సహచరులను అరెస్టుజేసి, కాల్చిచంపారు చాలా కాలం వరకు ఆ వార్తను సయితం ప్రజలకు పొక్కనివ్వలేదు గని కార్మికులలో ఆయనకుగల పలుకుబడినిజూచి శతృవు అంతగా భయపడ్డాడు. వాళ్ళనుండి పెద్ద ప్రతీకారాన్నెదుర్కోవలసి వస్తుందని కంపించిపోయాడు.

## కామ్రేడ్ మాదవరెడ్డి మృతి

కామ్రేడ్ మాధవరెడ్డి మధిర తాలూకాకు చెందిన చిన్న భూస్వామి కుటుంబంలో జన్మించాడు ఆయన హైదరాబాదు నగరంలో కళాశాల విద్య నభ్యసించాడు. కళాశాల చదువుకు స్వస్తిచెప్పి ఆంధ్ర మహాసభలో, కమ్యూనిస్టుపార్టీలో చేరాడు ఆయన సాహసోపేతుడు, చొరవగలవాడు ఖమ్మం ప్రాంతంలో సరిహద్దు సమీపంలోగల రాష్ట్ర పార్టీ కేంద్రంనుండి సాహిత్యాన్ని, ముఖ్యమైన ఆదేశాలను చేరవేయుటానికి ఆయన అనేకమార్లు హైదరాబాదు నగరానికి ప్రయాణాలు చేశాడు తన ప్రాంతపు రాజకీయ నాయకుడుగా రూపొందాడు. స్టెన్‌గన్, రైఫిల్ వుపయోగించటంలో నేర్పరితనం గడించాడు. ఆయన సమర్ధవంతుడైన గెరిల్లా దళ నాయకుడు.

వ్యవసాయ కార్మికులకు, ధనిక రైతులకు మధ్య ఏర్పడిన ఒక వివాదాన్ని పరిష్కరించటంకోసం ఆయన ఒకరోజు కలకోట గ్రామానికి వెళ్ళాడు. వ్యవసాయ కార్మికుల్లో ఒక భాగం మిషనరీ స్కూలు ఉపాధ్యాయుని పలుకుబడిలో వున్నారు ఈ మిషనరీ స్కూలు ఉపాధ్యాయుడు నైజాం పోలీసులకు అమ్ముడుబోయాడు. ఆ రోజు ఈ వివాద సందర్భంగా చర్చల పేరుతో తన అనుచరులంతా మాధవరెడ్డిని చుట్టుముట్టి హత్య చెయ్యాలని ఈ ఉపాధ్యాయుడు పథకం వేశాడు.

ఇలా విద్రోహం జరుగుతుందని కామ్రేడ్ మాధవరెడ్డి అనుమానించనేలేదు వాళ్ళందరూ ఆయనకు బాగా తెలిసినవారే. అందువల్ల ఎలాంటి రక్షణ ఏర్పాట్లూ చేసుకోలేదు. చర్చలు సాగుతున్నతీరూ, ఆ ఉపాధ్యాయుని ప్రవర్తనా ఆయన సహాయకునికి ఎంతమాత్రం నచ్చలేదు. తగు జాగ్రత్తలో వుండవలసిందిగా మాధవరెడ్డికి ఆయన హెచ్చరిక చేశాడు అయితే అకస్మికంగా మాధవరెడ్డివద్దగల స్టెన్‌గన్‌ను లాగివేసుకొని, ఆయన

మీదబడి కత్తితో పొడిచారు. ఆయన సహాయకుడు, మరో యిద్దరు అనుచరులూ కొలది గజాలు అవలికి పరుగెత్తి ఆ సమూహంపై నాటుబాంబు విసిరి తప్పించుకుపోగలిగారు.

అయితే పార్టీ అత్యంత ప్రతిభావంతుడైన యువకార్యకర్తను, విప్లవకారుని కోల్పోయింది.

ఆ తరువాత దళం ఆ ఉపాధ్యాయుణ్ణి ఈ హత్యకు బాధ్యులైన ముఖ్యమైన రౌడీలలో కొందరినీ చంపివేయ గలిగింది. ఆ విధంగా మాధవరెడ్డి మరణానికి ప్రతీకారం తీర్చుకోబడింది. వారు సమీపంలోనేవున్న ఒక రజాకార్ క్యాంపుపై దాడిజేసి మాధవరెడ్డి హత్యకు ప్రతీకారంగా, అక్కడున్న రజాకార్లందరినీ తుడిచిపెట్టారు

## కామ్రేడ్ ఎర్రా సత్యం

కామ్రేడ్ ఎర్రా సత్యం నల్లగొండజిల్లా హుజూర్‌నగర్ తాలూకా చీమిరేల గ్రామంలో ఒక ధనిక రైతు కుటుంబంలో జన్మించాడు. తన తలిదండ్రుల వ్యతిరేకతను లెక్కజేయక 1946 లో ఆయన ఆంధ్ర మహాసభలో చేరాడు ఆయన పగలు తన పొలంలో పని జేసుకునేవాడు. రాత్రివేళల్లో హరిజన యువకులను పోగుజేసి వారికి రాజకీయ విజ్ఞానాన్ని బోధించేవాడు. పోరాటవార్తలు చెప్పి, వారిని వుత్తేజపరిచేవాడు ఎర్రజండాక్రింద వారిని సంఘటితపరిచాడు. కనీస వేతనాలకోసం, స్థానిక భూస్వాములకు వ్యతిరేకంగా వారి పోరాటాలను ఆయన నడిపాడు. అందువల్ల భూస్వామ్యవర్గానికి ఆయన శత్రువయ్యాడు.

స్థానిక భూస్వాముల ఆహ్వానంపై రెండు వందలమంది పోలీసులు ఆ గ్రామంపై దాడిచేసి ఆయనను అరెస్టుచేశారు. అయితే ఆయిన వాళ్ళకు టోపీ బెట్టి తప్పించుకున్నాడు. సరాసరి అజ్ఞాతవాసానికి వెళ్ళాడు. తన స్వగ్రామంలోనేగాక, పరిసరగ్రామాలన్నింటాతనకార్యకలాపాలనుకొనసాగించాడు

సాయుధ ప్రతిఘటన ప్రారంభమవటంతో ఆయన ఒక గెరిల్లాదళాన్ని ఏర్పాటు చేశాడు. రజాకార్లను, ఫాసిస్టు నైజాం పోలీసు గూండాలను ఎదుర్కొని పోరాడనారంభించాడు. క్రమక్రమంగా ఆయన తన ప్రాంతంలోగల గెరిల్లా దళాలన్నింటికి జనరల్ కమాండర్‌గా పెంపొందాడు. పేరుమోసిన అనంతగిరి జమీందారుకు, బుద్ధవరం దేశముఖుకు, లక్కవరం వెంకటరెడ్డికి వ్యతిరేకంగా పోరాటాలు నడిపాడు. వందలాది ఎకరాల పొలాన్ని, వేలాది

బస్తాల ధాన్యాన్ని పేదలకు పంచిపెట్టాడు. ఆయనొక పార్టీ ఆర్గనైజరు, గెరిల్లా నాయకుడు, ప్రజానాయకుడు. సుమారు ముప్పై గ్రామాలలో అందరి గౌరవాదరణలను చూరగొన్నాడు.

ఒకరాత్రి ఆయన, ఆయన దళమూ పొలాలలోగుండా నడుస్తున్నారు. తననేదో కుట్టినట్లు ఆయనకనిపించింది. కొలది నిముషాల అనంతరం ఆయనకు తల తిరగనారంభించింది. విషపూరితమైన పాము కాటువేసిందన్న నిర్ణయానికొచ్చాడు. ఆయనను హుటాహుటిని వైద్యచికిత్స నిమిత్తం మోసుకెళ్ళాలని ఆయన సహచరులు ప్రయత్నించారు. రహస్యస్థలంలో ఏర్పాటు చేయబడిన ఆ చికిత్సా కేంద్రంలో పాముకాటుకు మందుకూడా సిద్ధంగా వుండేది. కామ్రేడ్ ఎర్రా సత్యం తన జేబులోని నోట్ పుస్తకంనుండి ఒక కాగితంముక్క చింపాడు. "కామ్రేడ్స్ నేను మీనుండి శాశ్వతంగా సెలవు తీసుకొంటున్నాను. ఇదిగో నా తుపాకి. దీనిని పోలీసు చేతుల్లో పడనివ్వవద్దు. శత్రువును నిర్మూలించటానికే దానినుపయోగించండి. శలవు" అని ఆకాగితం ముక్కపై వ్రాశాడు. ఆయన స్పృహ కోల్పోయాడు. దళం ఆయనను చికిత్సా కేంద్రానికి చేర్చేసరికే ప్రాణం గోల్పోయాడు "శత్రువును నిర్మూలించండి" అనే ఆలోచనతోనే తుది ప్రబోధంతో కన్నుమూసిన ఈ వీరుని స్మృతికి శ్రద్ధాంజలిఘటిస్తూ పార్టీ, ఆయన సహచరులూ ఎర్రజెండాను అవనతం జెశారు.

## కామ్రేడ్ యాదగిరి

కామ్రేడ్ యాదగిరి, సూర్యాపేటతాలూకా చిల్పకుంట గ్రామంలో వ్యవసాయ కార్మిక కుటుంబంలో జన్మించాడు. జన్నారెడ్డిప్రతాపరెడ్డియింట్లో వ్యవసాయకార్మికుడుగా పనిజేస్తుండేవాడు. ప్రజలకడగండ్లనుగాంచి, ఆయన గ్రామ గెరిల్లాలలో చేరాడు. కందగట్ల, కోటపాడు పోరాటాలలో ఆయన వీరోచితంగా పోరాడాడు. ఆయన అజానుబాహుడు. దృఢకాయుడు. అందువల్ల మిలటరీ యూనిఫారంలో ఆయనను చూడగానే శత్రువుకు గుండె బేజారెత్తేది. తిరుమలగిరివద్ద బస్సుమీద, మిలటరీ లారీపైన దాడిజేసిన సందర్భంగా ఆయనను అరెస్టు చేశారు. రోజుల తరబడి దారుణమైన చిత్రహింసలకు గురిజేశారు. ఆయన గోళ్ళక్రింద గుండుసూదులు దిగగొట్టారు. బ్లేళ్ళతో శరీరంపై కోసి, ఆ గాయాలలో కారంపెట్టారు. మిలటరీవాళ్ళు ఆయనచుట్టూకూర్చుండి, సిగరెట్లు కాల్చుకుంటూ, ఆసిగరెట్లతో ఆయన శరీరంపై అంటించుతుండేవారు. ఆయన కాలిబొటనవేళ్ళకు తాళ్ళుగట్టి తలక్రిందుగా వ్రేళ్ళాడదీశారు. కర్రలతో, బూట్లతో, రైఫిల్ మడాలతో దెబ్బలుకొట్టారు. ఆయనను బెట్టిన చిత్రహింసలు

వర్ణనాతీతం.ఇన్ని హింసలకు గురిజేసినా కామ్రేడ్ యాదగిరి లొంగలేదు రహస్యా లేమీ చెప్పలేదు. "ద్రోహులైన మిమ్ములను నిర్మూలించడానికి నేను ప్రతిన బూనాను. మీ ఎదుట నేను మోకరిల్లను. నేను చచ్చినాసరే నా సంఘం తన కార్యక్రమం కొనసాగిస్తుంది. మీ అందరినీ నిర్మూలిస్తుంది. నిర్బంధించిన వ్యక్తిని చిత్రహింసలు పెట్టడం వీరోచిత చర్యకాదు. నా చేతికొక రైఫిల్ ఇవ్వండి మీ వీరత్వం ఎక్కడుంటుందో అప్పుడు చూడండి" ఇదీ ఆయన సమాధానం. ఆ కామ్రేడ్ ప్రదర్శించిన ధైర్యమూ, పట్టుదల శత్రువుకు విభ్రాంతి గొలిపాయి ఒకరోజున సైనిక అధికారి, ఆయనను తనముందు కూర్చుండ బెట్టుకుని సైన్యంలో చేరవలసిందిగా ఆయనకు సలహా యిచ్చాడు. యువకుడు, సమర్థుడు గనుక అన్నివిధాలయిన వసతులు కల్పించబడతాయని ఆశగొల్పాడు. అయితే ఆ కామ్రేడు అతనిని తిట్టాడు. ముఖంపై ఉమ్మివేశాడు. తక్షణమే ఆ అధికారి అతనిని ముక్కలు ముక్కలుగా నరికివేయవలసిందిగా వుత్తరువు చేశాడు. వాళ్ళతన్ని కాళ్ళూ చేతులూ కట్టి పడవేసి నెమ్మదిగా అతని ప్రతి అవయవముపైనా వరుసగాకాల్పులు జరిపారు. ఆ సమయంలోకూడా కామ్రేడ్ యాదగిరి వాళ్ళకు మోకరిల్లలేదు. పైగా వాళ్ళపై తన సంఘం ప్రతీకారం తీర్చుకొంటుందనీ వాళ్ళను సర్వనాశనం చేస్తుందనీ బిగ్గరగా పలికాడు. ఆయన అమరజీవి.

## అధ్యాయం 4

# నైజాముకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజల సాయుధ విమోచన పోరాటం

## — ఆ పోరాట విజయాలు

తరతరాలుగా సాగుతున్న దారుణమైన ఫ్యూడల్ దోపిడీతో నిర్బంధ చాకిరి, అక్రమ వసూళ్ళతో, క్రూరమైన, దుర్భరమైన, ఫ్యూడల్ పాలనతో అవస్థపడుతూ, తమ భాషా సంస్కృతులు అణచివేయబడుతూ క్రూరమైన, అవినీతికాలవాలమైన నిరంకుశ పాలనక్రింద క్రుగ్గిపోతూ వున్న తెలంగాణా ప్రజలు నెమ్మదిగా నూతన జీవితంలో ఎలా అడుగుబెట్టిందీ – ఇంతవరకు వివరించిన కథనాన్ని బట్టి విదిత మవుతుంది.

తమ దుర్భరజీవితంలో కొన్ని ప్రాథమికమైన వెసులుబాట్లకోసం, వెట్టిచాకిరివద్దు, అక్రమ నిర్బంధ వసూళ్ళువద్దు, భూములనుండి బేదఖళ్ళువద్దు, చిత్రహింసలు, అవమానాలూవద్దు అనే నినాదంతో, ప్రాథమిక హక్కులకోసం; విద్యా, సంస్కృతులకోసం, బాధ్యతాయుత స్వయం పరిపాలనకోసం వుద్యమంగా ప్రారంభమైంది. అదే కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర మహాసభల నాయకత్వాన, ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగా, నైజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా, భూమికోసం, విమోచనకోసం శక్తివంతమైన సాయుధ ప్రజా పోరాటంగా పెంపొందింది. తెలంగాణా ప్రాంతంలోని దాదాపు మూడోవంతు ప్రాంతానికి, దాదాపు మూడువేల గ్రామాలకు అది విస్తరించింది ఆ గ్రామాలలో గ్రామ రాజ్య

పోరాట కమిటీలు స్థాపించబడినాయి నైజాం ప్రభుత్వ అధికారులు, భూస్వాములు – ప్రజల పరిపాలనా నిర్వహణను పంచాయితీ కమిటీలకే వదిలేసి గ్రామాలు వదిలి వెళ్ళవలసివచ్చింది వెట్టిచాకిరి, అక్రమ నిర్బంధవసూళ్ళు, భూములనుండి బేదఖళ్ళు, అధిక వడ్డీలుగుంజే అప్పులు, లంచగొండి అధికారుల చేత, గ్రామాలలోని దోపిడీదార్ల చేత చిత్రహింసలపాలుగావటం, అవమానాలకు గురిగావటం అంతమొందించబడినాయి. అంతేకాదు బంజరు భూములను, భూస్వాముల మిగులు భూములను పదిలక్షల ఎకరాలమేరకు పంపిణీ చేయటం జరిగింది. దానితోపాటే వ్యవసాయాని కవసరమైన పశువులను, వ్యవసాయ పరికరాలనుకూడా పల్లెటూళ్ళ పేద ప్రజలకు పంచిపెట్టటం జరిగింది. వ్యవసాయ కార్మికులకు న్యాయమైన వేతనాలు అమలుజరపబడ్డాయి. ధాన్యం పంపిణీ చేయబడింది. తమ జీవితాలలో మొట్టమొదటిసారిగా రెండుపూటలా కడుపునిండా తిండి తినగలిగామని ప్రజలు చెప్పుకొనజొచ్చారు. గెరిల్లాదళాలు, గ్రామ రక్షణదళాలు ఏర్పాటుజేయబడ్డాయి. నైజాం పోలీసు, సైన్యమూ, గ్రామాలలోని దోపిడీదార్లు పెద్ద క్యాంపులకే పరిమితమైపోయారు అక్కడి నుండే పగలు నిర్ణీత సమయాలలో తమ దాడులను సాగించుతుండేవాళ్ళు. కమ్యూనిస్టులు – చీకటిదొరలు అని పేర్కొంటూ చీకటిపడిన తర్వాత కమ్యూనిస్టులఅజమాయిషియేసాగుతోందని భూస్వాములు,పోలీసులు పగటివేళమాత్రమే పాలించగలుగుతున్నారని శత్రుపత్రికలు సయితం అంగీకరించవలసివచ్చింది.

మొత్తం నైజాం సంస్థానమూ, అతని సమాజమూ మొదలంటా కదిలిపోయాయి వుద్యమం యింకా ఎక్కువ ప్రాంతాలకు విస్తరించింది. మొత్తం తెలంగాణా అంతటికీ వ్యాప్తి గాంచింది. తెలంగాణా అవలకుకూడా ప్రాకింది. సరిగ్గా ఈ కీలక సమయంలోనే, భారతప్రభుత్వం జోక్యం చేసుకోవాలని నిర్ణయించింది. ప్రజలపై రజాకార్ దౌర్జన్యాన్ని అరికట్టడం అనే సాకుతోనూ, "కమ్యూనిస్టు దౌర్జన్యాన్ని" అణచివేయటమనే ప్రకటిత ప్రధాన లక్ష్యంతోనూ తన సైన్యాలను పంపాలని నిర్ణయించుకొంది

భారత ప్రభుత్వపు "పోలీసు చర్యను," తెలంగాణా సాయుధ పోరాటాన్ని వుపసంహరించేంతవరకూ సాగిన పరిణామాన్ని, దాని పర్యవసానాన్నీ సమీక్షించబోయేముందు, తెలంగాణా ప్రజల ఈ మహోద్భుత వెల్లువ విజయం పొందటానికి కారణభూతమైన పరిస్థితిని పరిశీలిద్దాం. తెలంగాణా ప్రాతికేయ పితామహుడు హైదరాబాదు సంస్థానంలో తెలుగు పునరుజ్జీవనోద్యమ నాయకులలో నొకరు నగు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, పెద్ద భూస్వామ్య కుటుంబానికిజెందినవాడే అయినా, ప్రశంసాపూర్వకంగా దిగువ విధంగా తన ఆశ్చర్యం ప్రకటించాడు :

"ఈ కమ్యూనిస్టులవద్దఏ యింద్రజాలమున్నదో, ఏ మహామంత్ర మున్నదోగాని, 'నీ బానిసోడ్నిదొరా, నీ ముందు సాష్టాంగపడతా, నీపాదాలకు మొక్కుతా' అంటూండేవాళ్ళను వీరులుగా మలచారు. మట్టిలోనుండి మహా వీరులను సృష్టించారు"

"దున్నేవానికే భూమి" అనే నినాదమే ఆశక్తి, కమ్యూనిస్టుల రహస్యమదే. కలచివేస్తున్న ఆ సమస్యను కమ్యూనిస్టులు సగర్వంగాచేపట్టారు. భూమికోసం అగ్రులు చాస్తూ, పోరాడుతున్న రైతాంగ జనసామాన్యానికి నాయకత్వం వహించారు. ఆచరణలో దాన్ని సాధించుకొనేందుకు నడిచారు. ఈ సామాన్య రైతాంగంతోపాటు వారూ పోరాడి, తమ ప్రాణాలర్పించారు.

"దున్నేవానికే భూమి"

పెంపొందుతున్న వుద్యమం తాకిడివల్లనే, ఈ నినాదం తక్షణమే అమలు జరపవలసిన ఆవశ్యకతగా రూపొందింది.

తాము సాగుజేసుకుంటున్న భూములనుండి ఏ రైతునూ బేదఖల్ చేయరాదంటూ, ఆ హక్కును నిలబెట్టుకొంటూ వుద్యమం ప్రారంభమయింది. విసునూరు దేశముఖుబారినుండి అయిలమ్మ పొలంలోని పంటను జయప్రదంగా కాపాడటం మొదలుగాగల గణనీయమైన విజయాలు సాధించబడినాయి. తర్వాత "బేదఖళ్ళన్నీ నిలుపుజేయాలి. భూస్వాములు హస్తగతం జేసు కున్న భూమిని తిరిగి సంపాదించాలి" అనేది సంస్థానమంతటా ఆచరణ నినాదంగా రూపొందింది.

అధికవడ్డీరేట్లతో రోజురోజుకూ తడిసిమోపెడవుతూ పేరుకుపోతున్న అప్పులను తీర్చలేదనో, కౌలు చెల్లించలేదనో, మరేదోవిధమైన సాకుతోనో దేశముఖులచే అంతకుముందు తమ భూములు స్వాహాచేయబడిన రైతు లున్నారు. భూములను కబళించి, తమ స్వంతం జేసుకోవాలని భూస్వాము లకు బుద్ధిపుట్టి నిరంకుశంగా బేదఖల్ చేయబడిన రైతులున్నారు. వారంతా, ఈ భూములను తిరిగి స్వాధీనం చేసుకోవాలనే సమస్యను లేవనెత్తారు. "బేదఖళ్ళన్నిటినీ నిలుపుజేయాలి" అనే నినాదంనుండి "అక్రమ బేదఖళ్ళను, ఆక్రమణలనూ రద్దు చేయాలి" అనే నిర్ణయానికి రావటానికి ఎంతో కాలం పట్ట లేదు. గతంలో భూస్వాములచే బేదఖల్ చేయబడిన రైతులు, భూస్వాములచే తమ భూములు కబళించబడిన రైతులు, ఆ భూస్వాములచేతనే యిప్పుడు బేదఖలు చేయబడిన రైతులూ యావన్మందిని ఐక్యం చేయటం తక్షణమే ఆచరణకు రావలసిన కర్తవ్యంగా రూపొందింది. అందువల్ల ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీ ఎలాంటి తటపటాయింపులేకుండా "అక్రమంగా కబళించబడిన భూము

లను అసలు రైతులకు వొప్పగించాలి" అనే సామాన్య రైతాంగపు నినాదాన్ని చేపట్టారు. ఇది దావానలంలాగా వ్యాప్తిగాంచింది.

ఈ నినాదం ఫలితంగా పంచాయితీ కమిటీలకు, సంఘం కార్యకర్తలకు అనేక సమస్యలు ముందునిలిచాయి భూస్వాములు ఆ భూములను మరి కొందరు యితర చిన్న రైతులకు కౌలు కివ్వటమో, వాళ్ళకు అమ్మటమో జరుగుతుంది. అందువల్ల, అన్ని సందర్భాలలోనూ, ఈ భూములను అసలు స్వంతదారులకు వొప్పగించటం సాధ్యంకాదు. ఎందుకంటే క్రొత్తగా స్వంతదారులయిన వీరు కూడా కాస్తంత మెరుగైన పరిస్థితిలో వున్నా సన్నకారు రైతులే భూస్వాములకు, నైజాం పాలనకు వ్యతిరేకంగా పోరాడుతూ మన శిబిరంలో వున్నవారే. కార్యకర్తలు, పంచాయితీ కమిటీలు వారికి అంతమంచి భూమిని లేదా అంతకంటే సారవంతమైన దానినో, ఆ భూస్వాములకు చెందిన దానినే నష్టపరిహారంగా యివ్వజూపినా, రైతులు "ఆ భూములనే ప్రస్తుత ఆక్రమణదారుల కివ్వండి, మా తాతముత్తాతలనుండి అనుభవిస్తూ వచ్చిన మాభూమినే మాకివ్వండి" అని పట్టుబట్టటం కద్దు. తమకే ఏకాకులనే యిద్దరు రైతులమధ్య అతి కష్టంమీదగాని అంగీకృత పరిష్కారం సాధించటం కుదిరేదికాదు. ఉభయులకూ నచ్చజెప్పి, పరిష్కారంచేసే పద్ధతే అనుసరించబడింది పైనుండి ఏదో పరిష్కారాన్ని వాళ్ళ నెత్తిన రుద్దటం జరగలేదు. ఐక్యత ఆవశ్యకతను గుర్తించటంవల్లనూ, ప్రజాభిప్రాయానికి తలవొగ్గి వారు సర్దుబాటుకు రావటం జరుగుతుండేది.

తాను కోల్పోయిన పాత నేలనే తిరిగి పొందాలని రైతు పట్టుబట్టటమనేది గుర్తుపెట్టుకొన వలసిన ప్రధానాంశం. తన కివ్వజూపిన కొత్తభూమి భూస్వామిదికాగా, "అది నాది" అనే తన ఆస్తి సంబంధమైన మనోభావం ఫలితంగా గాని, తన స్వంత భూమి తన చేతుల్లో వుంటే, అది న్యాయసమ్మతమైన హక్కని, దానిని మరెవ్వరూ తన నుండి గుంజుకొనజాలరన్న విశ్వాసం కారణంగాగాని, మరొకరికి చెందిన భూమిని తాను తీసుకుంటే "న్యాయసమ్మతమైన" "శాశ్వత యాజమాన్యహక్కు"కు అంతటి హామీ వుండదని భావించడం వల్లగాని వారలా కోరటం జరిగేది. అంతేకాదు, భూస్వాముల మిగులు భూములను ఆక్రమించుకునేట్లు చేయటంకన్నా, తాను కోల్పోయిన భూములను తిరిగి ఆక్రమించుకోవటమనే సమస్యపై రైతును కదిలించటం మరింత సులభమనే విషయంకూడా గమనించబడింది. భారత యూనియన్ సైన్యం జోక్యం తరువాత, భూస్వాములు, దేశముఖులు తిరిగి వచ్చిన తర్వాత, రైతులు తాము సాగుజేసుకుంటూవచ్చిన భూస్వాములమిగులు భూములను మరింత సులభంగా వదులుకున్నారు తిరిగి తమ అధీనంలోకి తెచ్చుకున్న తమ

స్వంత భూములను నిలబెట్టుకొనటానికి తుదకంటా పోరాటం సాగించారు. ఇదికూడా గమనార్హమైన లక్షణం, నిజానికి పోరాటం వుపసంహరించబడి నప్పుడు, అప్పటికీ సామాన్య రైతాంగం అధీనంలోవున్న భూమిలో అత్యధిక బాగం ఈ విధంగా తిరిగి ఆధీనంలోకి తెచ్చుకున్న భూములు," కౌలుభూములు, గ్రామాలపేదలు కొత్తగాతుప్పలుకొట్టి, ఆక్రమించుకొని సాగుజేసుకుంటున్న బంజరుభూములు మాత్రమే కాగా, పంపిణీచేయబడిన మిగులు భూములలో చాలా భాగం భూస్వాములచే తిరిగి స్వాధీనం చేసుకోబడినాయి.

**బంజరు భూములు**

అదేవిధంగా సంవత్సరంలో గణనీయమైన భాగంలో ఒక విధంగా గ్యారంటీగా ఉపాధిని కల్పించే ఏకైకవనరుభూమే కావటంవల్ల గ్రామీణపేదలు భూదాహంలోవున్నారు. అందువల్ల, వ్యవసాయకార్మికులు, భూమిలేని పేద రైతులు ప్రభుత్వంక్రిందనో, భూస్వాముల ఆక్రమణ క్రిందనోగల బంజరు భూములను ఆక్రమించుకొన్నారు అప్పు పుట్టాలన్నా, ఇతర సౌకర్యాలు పొందాలన్నా, భూమి కలిగి వుండటం ప్రాతిపదికగావుంది అదొక గౌరవ చిహ్నంగానూ వుండేది పరిస్థితి యిప్పటికీ అంతే ఈ భూములను సాగుజేసు కోవడం ఎంతో కష్టం. పెద్ద పెట్టుబడులు పెట్టకుండా నీటి పారుదల సౌక ర్యాలు కల్పించకుండా ఎక్కువ పంటలు పండించటం కష్టం అయినప్పటికీ లక్షలాది ఎకరాలభూమి ఆక్రమించుకోబడింది గ్రామంలోని బంజరుభూమిలో పదిశాతం సమిష్టిగా పశువులు మేపుకొనటానికి, ఇతర సమిష్టి అవసరాలకోసం వదిలివుంచాలనే పాత నిబంధనలు విస్మరించబడినాయి. అదేవిధంగా ఫారెస్టు ప్రాంతంలోని సాగుకులాయకైన భూమికూడా ఆక్రమించబడింది.

పోలీసుచర్య అనంతరం, ఈ భూములను తిరిగి తీసుకొనటానికి ప్రభుత్వం సర్వశక్తులా ప్రయత్నించింది అయితే ఆ ప్రయత్నంలో అది దారు ణంగా విఫలమైంది. ఈ బంజరు భూములను సాగుజేసుకోవటానికి అనుమతించే ట్లయితే, తమ పశువులను, గొర్రెలను మేపుకొనటానికి భూమిలేకుండా పోతుందని చెప్పి గొర్ల కాపరులను, హరిజనులపైకి, వ్యవసాయకార్మికులపైకి వుసికొల్పటానికి వారు ప్రయత్నించారు. అయినా, తెలంగాణారైతు వుద్యమం అలాంటి ఆటంకాలన్నింటినీ అధిగమించింది. ఇరవై సంవత్సరాల తర్వాత ఈనాటికీ, ఈ భూములపై పట్టాహక్కులు, యాజమాన్య హక్కులు, పొందటం కోసరం పోరాటం కొనసాగిస్తూనేవుంది ఈ సాగుదార్లలో అత్యధిక సంఖ్యా కుల విషయంలో ప్రభుత్వం క్రమక్రమంగా ఈ డిమాండ్‌కు అంగీకరిస్తూవుంది.

## భూస్వాముల మిగులు భూములు

ఈ విధంగా బంజరు భూములను ఆక్రమించుకున్నా బేదఖళ్ళను నిరోధించినా గతంలో అక్రమంగా స్వాహాచేయబడి భూములను తిరిగి సంపాదించుకున్నా గ్రామీణపేదల భూదాహం తీరలేదు. భూమి కావాలన్న వారి కోర్కెకు తృప్తికలుగలేదు.

ఆ విధంగా భూస్వాముల భూములను స్వాధీనం జేసుకోవటమనే సమస్య, వుద్యమంముందు నిజమైన, ఆచరణసంబంధమైన సమస్యగా తయారైంది. ఈ బడా దేశముఖుల, పట్టాదార్ల, జాగీర్దార్ల భూములను స్వాధీనం జేసుకుని పంపిణీ చేయటం రాజకీయంగా సులభమూ, అవసరమూను. అయితే భూదాహాన్ని ఎంతో కొంతమేరకు సంతృప్తిపరచడానికి, తర్వాత ప్రజా పోరాట పునాదిని దిటవుపరచి నిలదొక్కుకొనటానికిగాను, మిగులుభూమి సంతటినీ స్వాధీనం జేసుకునే విషయాన్నిగూర్చి తీవ్రంగా ఆలోచించటం అవసరమైంది.

ఐదువందల ఎకరాలకు పైనగల భూములను స్వాధీనం చేసుకోవటంతో ఈ చర్య ప్రారంభమైంది. నైజాం పాలనకు వ్యతిరేకంగా పోరాడుతూ మనతోపాటు నిలచిన పెద్ద భూస్వాములు కొందరున్నారని రాజకీయంగా ఒక వాదన చేయబడింది. పార్టీ నాయకత్వం ఆ వాదనను అంగీకరించింది. అలాంటివారిని మనతోనే నిలబొట్టుకొనటంకోసం, మనం గరిష్ఠ పరిమితిని తగినంత హెచ్చుగా వుంచవలసి వచ్చింది. అంతేకాదు 1946 లో ఆంధ్రలో "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే ఎన్నికల కరపత్రంలో వంద ఎకరాల గరిష్ఠ పరిమితి, స్వాధీనం చేసుకున్న భూమికి తగిన నష్టపరిహారం అనే నినాదమిచ్చిన విషయంకూడా దృష్టిలో వుంది.

అయితే తెలంగాణా వుద్యమం పెంపొందినకొలది భూమికావాలన్న కోర్కె అంతకంతకూ తీవ్రమయినకొలదీ, భూగరిష్ఠ పరిమితులు రెండువందల ఎకరాలకు తగ్గించబడినాయి. చివరకు 1948 మధ్యభాగానికల్లా వందఎకరాలు మెట్ట, పది ఎకరాల మాగాణి గరిష్ఠపరిమితిగా నిర్ణయించబడింది. అయితే దానిని అమలుజరిపేటప్పుడు పలువురు అన్నదమ్ములుగల వుమ్మడి కుటుంబానికి యిది వర్తిస్తుందా? అనే ప్రశ్న తలెత్తింది. పంపిణీకోసం తగినంతభూమి కావలసిన ఆవశ్యకత దృష్ట్యా వుమ్మడి కుటుంబానికయినాసరే పది ఎకరాల మాగాణి, వందఎకరాల మెట్ట గరిష్ఠపరిమితిగా వుండాలని స్పష్టం చేయబడింది. అయితే అదే సమయంలో వుద్యమంలో చేరే అవకాశం వున్నవారి భూములను మనం స్వాధీనం చేసుకోరాదనే విషయంకూడా దృష్టిలో వుంచుకోవాలి.

కాని ఈ వివరణ లివ్వటానికి, వాటిని అమలు జరపటానికి ముందే "పోలీసు చర్య" అడ్డం వచ్చింది. కాంగ్రెస్ ప్రభుత్వం ఆ తర్వాత ప్రకటించిన గరిష్ఠ పరిమితులతో వీటిని పోల్చిచూడండి.

హైదరాబాదు ప్రభుత్వం ప్రకటించిన గరిష్ఠ పరిమితి 50 ఎకరాల మాగాణి,250 ఎకరాల మెట్ట. ఆతర్వాత కాంగ్రెసుప్రభుత్వం దీనిని 27 ఎకరాల మాగాణి, 216 ఎకరాల మెట్టకు తగ్గించింది. ఈ గరిష్ఠ పరిమితులు, తెలంగాణా వుద్యమం విధించవలపెట్టినవాటికంటె చాలా ఎక్కువే. అంతేకాదు. ఆచట్టంలో అనేక లొసుగులున్నాయి. అదసలు అమలు జరపబడనేలేదు. మిగులు భూమిని స్వాధీనం జేసుకోవటంగాని, పంపిణీ చేయటంగాని జరగనేలేదు.

పైగా భూస్వాములు తమ మిగులు భూములను, కొనుక్కోగల వాళ్ళకు అమ్ముకొనటానికి అనుమతించటం జరిగింది. అంతేగాదు భూమిని తక్కువ ధరలకు కొనేందుకు మొదటి అవకాశం రక్షిత కౌలుదార్లకివ్వబడింది. తెలంగాణా ప్రాంతంలో, చాలాపెద్ద మొత్తంలో భూములను కౌలుదార్లు కొనటమో, నిలబెట్టుకొనటమో జరిగింది తెలంగాణాలోనయితం, 1960 నాటి కల్లా, రక్షిత కౌలుదార్లలో నూరింట యాభైమంది బేదఖలు చేయబడ్డారు. అలా తొలగించబడినవారిలో అత్యధికభాగం, తెలంగాణా వుద్యమం విస్తరించని, లోతుగా వేరూనని జిల్లాలకు, ప్రాంతాలకు జెందినవారే

1946 ఎన్నికల కరపత్రంలో, ఆంధ్రలో పార్టీ సూచించిన గరిష్ఠ పరిమితి, సంస్కరణవాద అవగాహననుండి రూపొందినట్టిదనే విషయం విదితమే. అందులో, ఆనాటి వర్గ విభజనను విశ్లేషించడం, తగిన వ్యవసాయ కార్యక్రమాన్ని రూపొందించడం జరగలేదు. ఫ్యూడల్ దోపిడీ సాగిస్తూ, విపరీతమైన కౌళ్ళు గుంజుతూ, అధికవడ్డీరేట్లు పిండుతూ, ఇతర అక్రమ నిర్బంధ వసూళ్ళుచేస్తూ, నైజాముతో చేతులు కలిపిన భూస్వాములభూములను, జాగీర్దార్ల దేశముఖుల భూములను స్వాధీనం చేసుకోవటం జరుగుతుందనే నినాదాన్ని తెలంగాణాలో పార్టీ ప్రచారంలో బెట్టియుండవలసింది. నైజాం వ్యతిరేక వుద్యమంలో కలిసివచ్చే వాళ్ళకు, తమ కుటుంబ సభ్యుల శ్రమతో, వేతనాలిచ్చి పనివాళ్ళను నియమించి చేయించుకున్న పనిని కొంతమేరకు జోడించి సాగుజేసుకుంటూ సాఫీగా జీవితం సాగించటానికి తగినంత భూమిని వదలటం జరుగుతుందని పేర్కొనియుండవలసింది. వుద్యమాభివృద్ధిపై ఆధారపడి, ఆ నినాదాన్ని ఆచరణలో బెట్టటం మరింత త్వరితంగా జరిగియుండవలసింది. పార్టీ భూ పంపిణీని ధైర్యంగా జరిపియుండవలసింది. అలా జరిగితే వుద్యమం వుధృతి మరింత విస్తృతంగా వుండివుండేది.

మిగులు భూములను స్వాధీనం చేసుకోవటం, దాన్ని పంపిణీ చేయటానికి పూనుకోవటం, పోరాడుతున్న జనసామాన్యంనుండి వొత్తిడి అధికమయిన మీదటనే జరిగిందనే విషయాన్ని కొంత తటపటాయింపు అనంతరం 1947 చివరిభాగంలోమాత్రమే అందుకుగాను పొలిట్ బ్యూరోనుండి అనుమతిపొందటం జరిగిందనే విషయాన్ని దృష్టిలో వుంచుకొనటం ముఖ్యం. దినాడు పార్టీ నాయకత్వం, 1947 ఆగస్టులో సాధించబడిన స్వాతంత్ర్యాన్ని ఆటవుపరచటం పేరుతో సంకుచితమైన వల్లభాయ్ మురాకు వ్యతిరేకంగా, అభ్యుదయకాముక కాంగ్రెస్ సెక్షన్లతో సంఘటనను (జాతీయ సంఘటన) నిర్మించే విధానాన్ని అనుసరిస్తూ వుంది.

భూమి పంపిణీ చేపట్టడం సరైనదేనా ?

ఆ తర్వాత శ్రీరావి నారాయణరెడ్డి, ఆయనను సమర్థించే వారనేక మంది భూ పంపిణీ సరైనదనటాన్ని సవాలు జేశారు వారంతా ఈనాడు మితవాద కమ్యూనిస్టుపార్టీలో వున్నారు. మొత్తం భారతదేశంలో జనతా ప్రజాస్వామ్యం లేకుండా, స్వాధీనం చేసుకుని, పంపిణీచేసిన భూమిని నిలబెట్టుకొనజాలమనీ, ఒక్క హైదరాబాదు సంస్థానంలోనే ఐనా కాంగ్రెస్ బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం అలాంటి పంపిణీని అనుమతించజాలదనీ పూర్తిగా తెలిసి వుండే, ఆ కార్యక్రమం చేపట్టడం అపరిపక్వ చర్యఅని వారు వాదించారు

తెలంగాణా వుద్యమం, నెహ్రూకు, భారత ప్రభుత్వానికి సయితం వ్యతిరేకమైన విమోచన పోరాటమని, భారతదేశపు "యెనాన్" అని, చైనాలో వలె, జనతా ప్రజాస్వామ్య విప్లవానికి ప్రారంభమని అనాడు పార్టీయిచ్చిన తప్పు నినాదంనుండి ఆ భూ ఆక్రమణ, పంపిణీ తలెత్తాయని కూడా వారు వాదించారు. భూ ఆక్రమణ నినాదం, విమోచన పోరాట కార్యక్రమంలో భాగంగా మాత్రమే చేపట్టవలసి నట్టిదిగా వారు పేర్కొన్నారు "బేదఖళ్ళకు వ్యతిరేకంగా, కౌలు తగ్గింపుకోసం" ఆందోళనకే మనం పరిమితమై యుండవలసిందనీ, విప్లవాత్మకంగా భూముల ఆక్రమణకు పూనుకొని యుండవలసింది కాదని వారు వాదించారు!

ప్రధానంగా తెలంగాణా రైతు ఉద్యమాన్ని అణచటానికే తన సైన్యాలను పంపిన భారత ప్రభుత్వానికివ్యతిరేకంగా, విమోచన పోరాటంగా తెలంగాణా సాయుధ పోరాటాన్ని కొనసాగించాలని ఆనాడు ఆంధ్రలో మన పార్టీ నిర్ణయించినమాట వాస్తవమే. జనతా ప్రజాస్వామ్యంకోసం, భారత

దేశపు సాయుధపోరాటం ప్రారంభంగా దాన్ని పరిగణించిన దాని అవగాహన తప్పు. ఎందుకంటే, ఆనాడు అలాంటి పరిస్థితిలేదు. వివిధశక్తుల బలాబలాలు అందుకనుగుణంగాలేవు.

అయితే, తెలంగాణా ఉద్యమం చిన్న పాక్షికకోర్కెలతో ప్రారంభమైంది. ఆ కోర్కెలసాధనకై సాయుధ పోరాటంగా పెంపొందింది. ఆతర్వాత, అదే నైజాం పాలననే కూలదోయటానికి సాయుధ పోరాటంగా కూడా రూపొందింది గ్రామరాజ్యకమిటీలు నిజానికి ఒకవైపున పోరాటసాధనాలు, మరొకవైపున అధికారాన్ని చెలాయించే సాధనాలు కూడా కాని, భారత సైన్యం ప్రవేశించటంతో, హైదరాబాదు సంస్థానం భారత యూనియన్‌లో విలీనమవటంతో వివిధవర్గశక్తుల బలాబలాల పరిస్థితి పూర్తిగా మారిపోయింది. అందువల్ల, నైజాం వ్యతిరేక విమోచనపోరాటం, దానంతటదే భారత యూనియన్ రాజ్యపు నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విమోచన పోరాటంగా రూపొందలేదు

అయినప్పటికీ, తెలంగాణా రైతాంగం భూమిని, సాధించుకున్న యితర విజయాలను కాపాడుకోవటమనే సమస్య వుండనే వుంది. అందువల్ల, రైతులనుండి భూములను తిరిగి స్వాధీనం జేసుకుని, భూస్వాముల కొప్పగించటానికి నెహ్రూ సైన్యాలు చేసిన ప్రయత్నాలకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటన సాగించటం సరైన పనే. పాక్షిక విజయాలను కాపాడుకొనటానికి, పాక్షిక కోర్కెల సాధనకు సాగించబడిన అలాంటి సాయుధ ప్రతిఘటన, రైతాంగ సాయుధ పోరాటమే అలాంటి సాయుధ పోరాటాలను, సాయుధ విమోచన పోరాటం సందర్భంగా సాగించబడిన సాయుధపోరాటంగా గందరగోళ పరచరాదు ప్రతి సాయుధ పోరాటమూ విమోచన పోరాటమే అయి వుండనవసరంలేదు.

1950 చివరిలోను, 1951 ప్రారంభంలోనూ, మన పార్టీ ప్రతినిధివర్గం, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వంతోనూ, కామ్రేడ్ స్టాలిన్‌తోను కలుసుకున్న మీదటనే మన పార్టీకి ఈ వివరణంతా లభ్యమయింది.

ఆ దశలో భూములు స్వాధీనం చేసుకోవడం, పంపిణీ చేయడంతప్పు అని శ్రీ రావి నారాయణరెడ్డిలాగా వాదించడం కేవలం బూర్జువా సంస్కరణవాదమూ, బూర్జువావర్గం తోకబట్టుకుపోయే విధానమూ మాత్రమే.

నిజానికి, పోరాటంలో నిమగ్నమైయున్న రైతాంగంయొక్క వొత్తిడి ఫలితంగానే, వుద్యమంయొక్క వాస్తవిక అవసరాల దృష్ట్యానే, పార్టీ భూమి పంపిణీ సమస్యను చేపట్టవలసివచ్చిందనే విషయంవిదితమవుతూనేవుంది.

సవ్యమైన ఈ చర్య తీసుకున్నందువల్లనే, మనం తెలంగాణా ప్రజానీకాన్ని ప్రత్యేకించి, వ్యావసాయిక విప్లవానికి వెన్నెముకయైనరైతాంగ జన సామాన్యాన్ని వుత్తేజపరచగలిగాం నైజాముకు, క్రూరులైన అతని తొత్తులకూ, వ్యతిరేకంగా, రజాకార్ల తదితర సాయుధ బలగాలకు వ్యతిరేకంగా, పాశవికమైన బీభత్సకాండకు, హింసాకాండకూ వ్యతిరేకంగా భీషణ పోరాటం సాగించునట్లు చేయగలిగాం. కాంగ్రెసు, ఇతర బలగాలన్నీ యూనియన్ భూభాగానికి పారిపోక తప్పని పరిస్థితిలో, పార్టీ, ఆంధ్రమహాసభ తెలంగాణాలోనే రంగంలో నిలచివుండగలగటానికి దోహద పడిందిదే.

భూపంపిణీలో సాధించుకున్న విజయాలను నిలబెట్టుకోవడంకోసం తమ సాయుధ పోరాటాన్ని కొనసాగించవలసిందిగా, నెహ్రూ సైన్యం తోడ్పాటుతో భూస్వాములు తిరిగి వచ్చి, రైతుల భూములను స్వాధీనం చేసుకోవటానికి పూనుకున్నప్పుడు – పార్టీ సవ్యంగానే పిలుపిచ్చింది "పోలీసు చర్య" అనంతరం మరో మూడు సంవత్సరాలపాటు పోరాటం కొనసాగింది. అశేషమైన త్యాగాలుచేసినప్పటికీ, ఈ పోరాటం ఫలితంగానే హైదరాబాదు కౌలుదారీ చట్టం చేయబడింది. అప్పటికి చేయబడిన భూశాసనాలలోకెల్లా అత్యంత తీవ్ర స్వభావం కలిగినట్టిదిదే. అదిగాక, ఇతర పెద్ద ప్రజాతంత్ర విప్లవాత్మక విజయాలుకూడా సాధించబడినాయి. వాటినిగూర్చి యింతకుముందే ప్రస్తావించటం జరిగింది.

నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, విమోచన పోరాటంగా, దానిని గందరగోళ పరచియుండకపోతే, భూసమస్య పాక్షిక పరిష్కారంకోసం ముందుగానేసంప్రదింపులద్వారా ఒకఅంగీకారానికి రావటానికిగాను విన్నమైన ఎత్తుగడలను అనుసరించి వుండగలిగేది మరింత గొప్పవిజయాలను సాధించి వుండగలిగేది. కనీసం, మరింత తక్కువ నష్టాలతో, త్యాగాలతో పార్టీని ఆంధ్రమహాసభ నిర్మాణాన్ని మరింత సమైక్యంగా వుంచుకుంటూనే వుపసంహరించుకుని వుండగలిగేవాళ్ళం.

మన కేంద్ర కమిటీ, 1952 మార్చిలో జరిగిన తెలంగాణా ముఖ్య కార్యకర్తల సమావేశమూ, రావి నారాయణరెడ్డి వాదనను నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చాయి సాధించుకున్న భూమిని సాయుధంగా కాపాడుకోనడం సరైనదేనని, మనం అలా చెసివుండకపోతే, రైతులు తమకు మనం ద్రోహం చేశామని తలంచియుండే వారేనని ఆ సమావేశాలు నిర్ణయానికొచ్చాయి. ఆ సమావేశం ముగింపు సందర్భంగా, ఆనాటి పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ అజయ్‌కుమార్‌ఘోష్ దిగువ విధంగా చెప్పాడు :

"నా ప్రసంగాన్ని ముగించేముందు, తెలంగాణా పోరాటాన్ని గూర్చి నా అభిప్రాయాన్ని వివరిస్తాను. కాంగ్రెస్ ప్రభుత్వ సైన్యాలు తెలంగాణాలో ప్రవేశించిన వెనువెంటనే సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాన్ని ఉపసంహరించి యుండవలసిందని వాదిస్తున్నవారు కొంత మంది వున్నారు. భారత యూనియన్ సైన్యాలు ప్రవేశించిన వెను వెంటనే ఆయుధాలు క్రిందబెట్టడం తప్పని నేను భావిస్తున్నాను. ఆనాడు తెలంగాణా రైతు పోరాటాని కెదురయిన సమస్య, భీషణ పోరాటం సాగించి సాధించుకున్న భూమిని, ప్రజాతంత్ర హక్కులను పోరాటం లేకుండా వదులుకోవటమా ? దేశముఖులకు, భూస్వాము లకు ఆ భూములను వొప్పగించటమా ? లేక వాటిని కాపాడుకొన టానికి అవసరమైన మేరకు వారు సాయుధ రైతాంగ గెరిల్లా ప్రతిఘట నను కొనసాగించటమా ? అనేదే. ప్రతిఘటనను కొనసాగించటం విప్లవ పంథాఅని, ఆయుధాలుక్రింద బెట్టటం ప్రజలకు ద్రోహంజేసే పంథా అని నా అభిప్రాయం.

"ఆనాడు, సాయుధ గెరిల్లా పోరాటాన్ని వుపసంహరించటాన్ని సమర్థిస్తూ తీసుకురాబడిన మరొకవాదన, భూములన్నింటినీ లేదా భూమిలో ఎక్కువభాగాన్నీ భూస్వాములు, దేశముఖులు తిరిగిస్వాధీనం చేసుకోవటం జరిగిందనేది. అదే నిజమయినప్పటికీ, ఆ కారణంతో సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాన్ని వుపసంహరించటం సరైనపని కాదనేది నా దృఢమైన అభిప్రాయం మనం సాయుధ పోరాటాన్ని వుపసంహరించి వున్నట్లయితే, మనపార్టీ నాయకత్వం తమకు ద్రోహం చేసిందని రైతాంగం భావించివుండేది. నిజానికి, అది వాస్తవంగా విద్రోహమే.

"ఇక మనం ఏమిచేసి యుండవలసింది ? మనం ఏమి మార్పులు చేసియుండవలసింది ? విప్లవ ప్రజాఅధికార స్థాపనా లక్ష్యంతో, నెహ్రూ ప్రభుత్వాన్ని కూలదోయటంకోసం పోరాడటం తప్పు దానిని, రైతాం గానికి భూమికోసం, రైతాంగం సాగించిన సాయుధ గెరిల్లా పోరాటంగా కొనసాగించి యుండవలసింది. మొత్తంమీద ప్రజలకు, యింకా నెహ్రూ ప్రభుత్వంపై భ్రమలుంటూ వుండగానే, నెహ్రూ ప్రభుత్వాన్ని కూల దోయటమనే తక్షణ లక్ష్యంతో పోరాటాన్ని కొనసాగించటం విస్తార మైన జనబాహుళ్యాన్ని సమీకరించటానికి దోహదపడదు. అందువల్లనే, మనం ఆ నినాదాన్ని మార్చుకొని యుండవలసింది. భూమినంతటినీగాని,

భూమిలో అధికభాగాన్నిగాని శత్రువు తిరిగి స్వాధీనం చేసుకోగలిగి నప్పటికీ, తెలంగాణా పోరాటానికి బ్రహ్మాండమైన విప్లవ ప్రాధాన్యత వుంది. తెలంగాణా పోరాటంనుండి మనం గొప్పపాఠాలు నేర్చుకున్నాం.

"అది రుజువుజేసిన లేదా ముందుకు దెచ్చిన అత్యంత ప్రధానమైన అంశమేమిటంటే, తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటాన్ని బలహీనమైన మనోనిబ్బరం సడలిన నైజాం బలగాలపైనేగాక, అధునాతన ఆయుధాలు సమకూర్చబడిన కాంగ్రెస్ ప్రభుత్వ సాయుధ బలగాలపైనకూడా సాగించగలిగాం ముప్పైవేలనుండి యాభైవేల వరకుగల సాయుధ బలగాలతో తెలంగాణా రైతులు మూడు సంవత్సరాలపాటు పోరాడారు. మూడు సంవత్సరాల అనంతరంకూడా తానా పోరాటాన్ని అణచివేశానని చెప్పుకొనటానికి ప్రభుత్వం సాహసించ లేదు అందువల్ల నెహ్రూ సైన్యాలు అజేయమనే తప్పుడు భావనను (వాటినిపోడించటం సాధ్యంకానంతబలమైనవన్న అభిప్రాయాన్ని) తెలంగాణాపోరాటంపటాపంచలుగావించింది. ఆ విధంగా తెలంగాణా రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం యొక్క బలాన్ని, వారివిప్లవసత్తాను ప్రదర్శించింది. కార్మికవర్గంకూడా దానితో చేతులుగలిపియున్నట్లయితే, మరికొన్ని ప్రాంతాలలోకూడా రైతాంగం పోరాటాలు అదే స్థాయికి చేరుకున్నట్లయితే, ఎలాంటి గొప్ప పరిణామాలు సంభవించి యుండేవో వూహించుకోవచ్చు మన విప్లవానుభవం మొత్తమంతటి యొక్క గొప్ప గుణపాఠమిదే. ఈ గుణపాఠాలను మనం శ్రద్ధతో అధ్యయనం చేయాలి.

"అయితే మరో ప్రశ్న తలెత్తుతుంది. ఆ పోరాటాన్నెప్పుడు వుపసంహరించి యుండవలసింది? ఖచ్చితంగా ఫలానాప్పుడు వుపసంహరించి యుండవలసిందని నేనిప్పుడు ఖచ్చితంగా చెప్పజాలను.."

అయితే, దురదృష్టవశాత్తు, కామ్రేడ్ అజయకుమార్‌ఘోష్‌పైన చెప్పిన విషయాలను పాటించనూలేదు. తెలంగాణా పోరాటపు అనుభవాలను అధ్యయనం చేయనూలేదు. తెలంగాణాలోనేగాక, భారతదేశమంతటా ఉద్యమాన్ని బలహీనపరచటానికి ఎంతగానో దోహదపడిన విభిన్నమైన కార్యాచరణమార్గాన్ని చేపట్టాడు. మొత్తం పార్టీనంతటినీ పూర్తిగా సంస్కరణవాద పంథాలో పెట్టాడు.

హుజూర్‌నగర్ తాలూకా కోమట్లగూడెం గ్రామంలో వృద్ధ రైతు ఒకరు, భూమిని భూస్వామికిజెందినదిగా అంగీకరించ నిరాకరించుతూ,

"ఈ భూమి నాది" అని తుదకంటా అంటూనేవుండటంవంటి ఉదాహరణ నుండి, భూదాహం ఎంతగా వున్నదీ, తెలంగాణా రైతులు ఎంతటి పట్టుదలతో ఈ పోరాటం సాగించిందీ విదితమవుతుంది. నైజాం ప్రభుత్వ సైనికులు, పోలీసు రాక్షసులు ఆ వృద్ధరైతును కాళ్ళుచేతులుకట్టి చెదలుపుట్టమీద పడవేసి, ఆయనను చదలు తినివేసేంతవరకూ మూడురోజులపాటు అక్కడే వుంచారు. అయినా, ఆ వృద్ధరైతు స్పృహవున్నంతసేపూ "ఈ భూమి నాది" అన్నమాటను మాత్రం వదులుకోలేదు.

## గ్రామరాజ్య కమిటీల నిర్మాణం

ఉద్యమకాలంలో గ్రామాలలో నైజాం ప్రభుత్వమనేదేలేదు. గ్రామాధికారులలో ప్రజలచే ద్వేషించబడే దేశముఖులలో అత్యధిక సంఖ్యాకులు గ్రామాలనుండి పారిపోయారు వారిలో కొందరు, గెరిల్లా దళాలను, ప్రజలను క్షమాపణగోరుకొని, దయజూపవలసిందిగా వేడుకొని, వారిపాలనకు కట్టుబడివుంటామని వాగ్దానంచేసి గ్రామాలలో వుండిపోయారు.

గ్రామంలోని వయోజనులందరిచేత ఎన్నుకోబడిన కమిటీలచే గ్రామ పరిపాలనా నిర్వహణ సాగింది. వాటినే గ్రామరాజ్యకమిటీలని పిలిచేవారు.

ఈ కమిటీలలో ఐదుగురునుండి ఏడుగురు వరకు సభ్యులుండేవారు. ఈ కమిటీలలోకి పురుషులు, స్త్రీలు, గ్రామదళాల నాయకులూ ఎన్నుకోబడే వారు. అంతకుపూర్వం సాగుతుండిన అవినీతి, లంచగొండితనం, తదితర తప్పుడు పద్ధతులు లేకుండా ప్రజల సమస్యలన్నింటినీ గ్రామరాజ్య కమిటీలు పరిష్కరిస్తుండేవి. ఈ కార్యక్రమంలో కమిటీ సభ్యులతోపాటు అనేకమంది సామాన్యప్రజలు కూడా పాల్గొంటూవుండేవారు. అన్ని సమస్యలూ ప్రజా తంత్రపద్ధతిలో పరిష్కరించబడేవి. గందరగోళం సృష్టించే మితవాదులపైన, అభివృద్ధి నిరోధకులపైన, శత్రువులపైన బహిరంగ విచారణ జరిపి వారివారి నేరాలకు తగినట్లు శిక్షించేవారు. గ్రామరాజ్యకమిటీలు వాళ్ళ నేరాల స్వభావాన్నిబట్టి వాళ్ళను హెచ్చరించటమో, సాంఘిక బహిష్కరణకు గురి జేయటమో, జరిమానాలు విధించటమో, వారి ఆస్తులను స్వాధీనం చేసుకోవటమో చేస్తుండేవి. పోలీసులతోకలసి తిరుగుతుండేవారిని, ప్రజలపై దాడులు సాగించే వాళ్ళనూ తగువిధంగా శిక్షించేవారు.

## వ్యవసాయ సంస్కరణలు

వ్యవసాయ సంస్కరణలు జయప్రదంగా అమలు జరపబడినాయి. భూస్వాములు, వడ్డీవ్యాపారస్తులు యిరవై సంవత్సరాలకు పూర్వపువయినాసరే

అప్పుతీర్చలేదనే సాకుతోనో, బెదిరింపులతోనో, పన్నులు చెల్లించలేదనే సాకుతోనో, ఏనో తప్పుడు "ఆరోపణల" తో జరిమానాలు విధించటం పేరు తోనో నిర్బంధంగా స్వాహాచేసిన భూములు సయితం వాటి అసలు స్వంత దార్లకు తిరిగి వొప్పగించబడినాయి.

భూస్వాములు ప్రజల నుండి మంచి భూములను గుంజుకొని, వాటికి బదులు వారికి అంతకంటే తక్కువ సారవంతమైన భూముల నిచ్చారు. వ్యవసాయ సంస్కరణల క్రింద ఈ పద్దతి మారిపోయింది. కౌలుదార్లకు, వారు దున్నుకునే భూములపై పూర్తి హక్కు లివ్వబడ్డాయి. ఈ భూములపై భూస్వాములకు కౌలు హక్కుగాని నష్టపరిహారంపొందే హక్కుగాని లేదు కౌలుదార్ల పొలాలు వారి స్వంతంగా ప్రకటించబడ్డాయి. ఆ భూమికిగాను కౌలుదారు ఏమీ చెల్లించనవసరంలేదు. ఈ రెండు విధాలయిన భూపంపిణీ పద్దతులలోనూ, వ్యవసాయ కార్మికులు పేద మధ్య తరగతి రైతులతోపాటు, ధనిక రైతులు, కొన్ని సందర్భాలలో ప్రజలపక్షానవున్న చిన్న భూస్వాములు సయితం ప్రయోజనం పొందారు

భూమికి గరిష్ఠపరిమితి నిర్ణయించబడింది మిగులు భూమి వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచబడింది. అందులో కొంతమధ్యతరగతిరైతులకు కూడా పంచబడింది. గరిష్ఠ పరిమితి ఎంత వుండాలన్న విషయమై పెద్ద చర్చ జరిగింది. ఐదువందలఎకరాలకు పైగావున్న భూములనుమాత్రమే పంచాలని మొదట నిర్ణయించబడింది. ఆ తర్వాత ఆ పరిమితి వందఎకరాల మెట్ట, పది ఎకరాల మాగాణిగాగాని, లేదా ఇరవై ఎకరాల మాగాణిగాగాని వుండునట్లుగా తగ్గించబడింది. అదే తుది నిర్ణయం. దీని ప్రకారం భూమి పంపిణీ జరపబడింది.

ప్రజలపట్ల శతృత్వం వహించని భూస్వాములకు మాత్రమే ఇది వర్తిస్తుంది. ప్రజాశతృవులైనవాళ్ళకుగల భూములను ఒక్క ఎకరమైనా మిగల్చకుండా స్వాదీనం జేసుకోవటం జరిగింది. ఆ భూములన్నీ ప్రజలకు వుచితంగా పంపిణీ చేయబడినాయి ప్రతిగ్రామంలోనూ అలా జరిగింది

సూర్యాపేటతాలూకాలో, ఎర్రపాడు, ఏపూరుల చుట్టూగల 110 గ్రామాలలో భూస్వాములకు జెందిన ఇరవైవేల ఎకరాల భూమి పంపిణీ చేయబడింది వుద్యమం వ్యాప్తిగాంచిన మూడువేలగ్రామాలలో మిగులు భూములు, అన్యాక్రాంతాలు, కౌలుభూములు, బంజర్లు, పోరంబోకలు, అడవులు, పచ్చికబయళ్ళు మొత్తం పది లక్షల ఎకరాలభూమి గ్రామీణ పేదలకు, మధ్యతరగతి రైతులకు పూర్తి యాజమాన్య హక్కులతో పంపిణీ చేయబడింది. ఎర్రపాడు, ఏపూరు ప్రాంతాలలోనే ఒక లక్ష ఎకరాలు ప్రభుత్వ భూమి పంచబడింది.

## పశువుల పంపిణీ

భూములతోపాటే, భూస్వాములకు జెందిన మిగులుపశువులు కూడా ప్రజలకు పంచబడ్డాయి. ప్రజాశత్రువులకు జెందిన పశులమందలు మొత్తంగానే స్వాధీనం జేసుకోబడి, పంచబడ్డాయి. అలా పంచబడినవి పదుల వేలసంఖ్యలో వున్నాయి. ఒకప్రాంతంలోని పశువులను, మరొకప్రాంతానికి తోలుకెళ్ళి పంచారు. దాడుల సందర్భంగా శత్రువులు వాటిని తిరిగి స్వాధీనం చేసుకోకుండా నిరోధించటంకోసం ఆ విధంగా ఒకప్రాంతం పశువులను వేరొక ప్రాంతంలో పంపిణీ చేశారు.

ఒక్క ఏపూరు, ఎర్రపాడు ప్రాంతంనుండి, యితర ప్రాంతాలకు తోలి, ప్రజలకు పంచబడిన పశువులే రెండువేలకు పైగా వున్నాయి. తెలంగాణా పోరాట ప్రాంతాలలో ఎన్ని పశువులు పంపిణీ చేయబడిందీ దీన్నిబట్టే సులభంగా అర్ధం జేసుకోవచ్చు.

పశువులతోపాటు, వ్యవసాయ పరికరాలనుకూడా ప్రజలకు పంచారు. వారికి మేకలు, గొర్రెలుకూడా పెద్ద సంఖ్యలోనే లభించాయి ఇవన్నీ ఎలాంటి ఖరీదు చెల్లించనవసరం లేకుండా వుచితంగానే లభించాయి.

## ఋణపత్రాల రద్దు

భూస్వాములు, దేశముఖులు, వడ్డీవ్యాపారస్థులు ప్రజల కిచ్చిన అప్పులన్నీ రద్దు చేయబడినాయి. ప్రతి గ్రామంలోనూ, రొక్కరూపంలోనో, ధాన్యంరూపంలోనో ఈ అప్పులు రు 5000 ల నుండి రు 15,000 ల దాకా వున్నాయి. అప్పులు రద్దుజేయటంతో, ప్రజల నెత్తినుండి పెద్ద బరువు దించి నట్లయింది. ఏపూరు, ఎర్రపాడు పరిసర గ్రామాలలోనే సుమారు ఎనిమిది లక్షల రూపాయల మేరకు అప్పులు రద్దు చేయబడినాయంటే, ప్రజల నెత్తినగల భారాలనుగూర్చి, వారు పొందిన వెసులుబాటునుగూర్చి అవగాహన జేసుకోవచ్చు.

## వ్యవసాయ కార్మికుల వేతనాల పెంపు

ఈ గ్రామాలలో వ్యవసాయ కార్మికులు తమ సంవత్సర జీతాలను, రోజువారీ వేతనాలను హెచ్చించాలని కోరుతూ కొన్ని సందర్భాలలో సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు. గ్రామ కమిటీలలోని తమ ప్రతినిధులద్వారా వొత్తిడి తెచ్చారు. తద్వారా తమ తమ డిమాండ్లను చాలవరకు సాధించుకోగలిగారు. దినసరి వేతనాలు రెండు, మూడు కిలోల ధాన్యంనుండి, నాలుగు కిలోల ధాన్యానికి, పాలేర్లకు ధాన్యం రూపంలో చెల్లించే నెలసరి వేతనాలను

40 నుండి 60 కిలోల వరకు వుండేవాటిని, 80 నుండి 90 కిలోల వరకూ, కొన్ని సందర్భాలలో 120 కిలోల వరకూ పెంచడం జరిగింది. ప్రభుత్వానికి జమీందార్లకూ వ్యతిరేకంగా సమైక్య పోరాటం సాగించటంద్వారా తాము బ్రహ్మాండమైన ప్రయోజనాలు పొందినప్పటికీ, వాటిని సాధించటంలో వ్యవసాయ కార్మికులు ప్రధాన పాత్ర వహించినప్పటికీ ధనిక రైతులు, వ్యవసాయ కార్మికుల దినసరి వేతనాలు హెచ్చించటానికి అయిష్టంగానే వున్నారనే విషయం ఈ సందర్భంగా గమనార్హం వేతనాల హెచ్చింపును తప్పుకోనటానికి వారు అనేక కారణాలు చెప్పేవారు వేతనాలు పెంచటానికి ధనిక రైతులూ, పెట్టుబడిదారీ భూస్వాములు తీవ్రంగా ప్రతిఘటించేవారు. అందువల్లనే వ్యవసాయ కార్మికుల సమ్మెలు, ప్రదర్శనలు ప్రత్యేకించి "పోలీసు చర్య" అనంతరం అనివార్యమైనాయి. ఈ సమ్మె పోరాటాలు లేదా, సమ్మెలు జరుపుతామన్న హెచ్చరికలు జరిగిన తరువాతనే వారి వేతనాలలో నిజమైన హెచ్చింపు జరిగింది భూమి చేతికి దక్కటం, వేతనాలు పెరగటంవల్ల, వ్యవసాయ కార్మికుల రాజకీయ చైతన్యంలోను, జీవన విధానంలోనూ గణనీయమైన మార్పు వచ్చింది. తమ జీవితాలలో మొట్టమొదటిసారిగా, రోజూ రెండు పూటలా తిండి తినగలిగామని ఈ గ్రామాల ప్రజలు చెప్పుకోనారంభించారు

## ఇతర సౌకర్యాలు

ఈ గ్రామరాజ్యాల అధ్వర్యాన, ప్రజలు అనేక ఇతర లాభాలుపొందారు.

1 పన్నులు వసూలుజేయటానికి ప్రభుత్వ ఏజెంటెవరూ లేనందువల్ల, డబ్బు ప్రజలవద్దనే వుండిపోయింది

2. కల్లునిచ్చే తాటి ఈతచెట్లను నరికివేసే కార్యక్రమాన్ని అనుసరించిన సందర్భంలో కల్లుగీత పనివారిలో ఏర్పడిన అసంతృప్తిని, వ్యతిరేకతను పార్టీ, సంఘమూ అర్థం జేసుకున్నాయి. అందువల్ల ఆ కార్యక్రమానికి స్వస్తి జెప్పబడింది. పైగా, కల్లు గీయండి, ప్రజలకు చౌకధరకు మంచికల్లు సరఫరా చేయండి, ప్రభుత్వానికి పన్నులు చెల్లించవద్దు అని వారికి చెప్పడం జరిగింది ప్రజలు ఈ వైఖరిని అర్థంజేసుకొని అభినందించారు. దానివల్ల సత్ఫలితాలు కలిగాయి.

3. వ్యవసాయాభి వృద్ధికోసం నీటిపారుదలగల కాలువలు, చిన్న చెరువులుత్రవ్వే కార్యక్రమం చేపట్టి, అములుజరప బడింది.

4. వైద్యసౌకర్యాలు, ఆరోగ్య సంరక్షణకు అవసరమైన జాగ్రత్తలు, కనీస పారిశుధ్యాన్ని పాటించటానికి ప్రజలకు శిక్షణ గరపటం విస్తృతమైన

స్థాయిలో చేపట్టబడినాయి. ప్రత్యేకించి కలరావ్యాధి సోకిన గ్రామాలలో ప్రజలకు తగిన తోడ్పాటు, కలరా నిరోధక ఇంజక్షన్లు మొదలైనవాటిని అందజేసి రక్షణ కల్పించటం జరిగింది. వ్యాధి నిరోధంకోసం అనేక గ్రామాలకు పెద్దఎత్తున మందులు సరఫరా జేయబడినాయి. అలాంటి వైద్యసహాయం చేస్తుండగానే, కోటమర్తి గ్రామానికిజెందిన కామ్రేడ్ గోనె వెంకటయ్య కలరా వ్యాధి వాతబడి, మృతిజెందాడు. అయన భువనగిరి తాలూకాలో పైకివస్తున్న స్థానిక కార్యకర్త.

౯. పోరాట సందర్భంగా గృహదహనాలవల్ల యిండ్లుకోల్పోయిన రైతులు తమయిండ్లు తిరిగి కట్టుకొనటంకోసం కలప, తాటియాకులు, గడ్డి మొదలైనవి సరఫరా చేయబడినాయి భూస్వాముల తాటితోపులనుండి, ప్రభుత్వ అడవులనుండి వాటిని యివ్వటం జరిగింది.

## స్త్రీలకు సమాన హక్కులు

ఈ పోరాటంలో పురుషులతో సమానంగా స్త్రీలూ పాల్గొన్నారు. అందువల్ల, పురుషులకంటె స్త్రీలు తక్కువవారని సమాజంలో తరతరాలుగా జీర్ణించియున్న భావాలకు వ్యతిరేకంగా ప్రచారం సాగించటం గ్రామకమిటీలకు, సంఘానికి, పార్టీకి సులువైంది. గ్రామరాజ్య కమిటీలు స్త్రీ, పురుషులకు సమానహక్కులున్నట్లు ప్రకటించాయి. అందుకోసం వుద్యమం నిర్వహించాయి. గ్రామపంచాయితీ కమిటీలకు స్త్రీలు ఎన్నుకోబడ్డారు కుటుంబాల పరిస్థితులను గూర్చి, పరస్పర సంబంధాలనుగూర్చి స్థానిక ప్రజలకు బాగాతెలియటం సహజం అందువల్ల, గ్రామకమిటీలు కుటుంబ తగాయిదాలను సామరస్యంగా పరిష్కరించటం, వారిమధ్య సామరస్యం సాధించటం, పరాయివాడి భార్యను లేవదీసుకు పోయినందుకుగాను నష్టపరిహారం చెల్లించే సమస్యను ఆయా కేంద్రాలలో అమలులోవున్న సాంప్రదాయాల కనుగుణంగా పరిష్కరించటం; ఇష్టంలేని పెళ్లిళ్లను అంటే తమకిష్టంలేని వ్యక్తులను పెండ్లాడవలసిందిగా బాలికలను బలవంతం చేయటాన్ని అరికట్టటం, తగిన సందర్భాలలో ఎడాకులు మంజూరు జేయటం, నూతన దంపతులు గౌరవప్రదమైన జీవనం సాగించటానికి దోహదపడటం గ్రామ కమిటీలకు సాధ్యమయింది.

## అంటరానితనం నిర్మూలనం

గ్రామాలలో కుల విభేదాలు లోతుగా వేరూని యున్నాయి. ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో ప్రజలందరూ ఎలాంటి కుల వివక్షతలేకుండా కలసికట్టుగా పోరాడవలసివచ్చింది. అందువల్ల దీని తర్వాత అంటరానితనానికి

వ్యతిరేకంగా పోరాడటం మొదలైంది. గెరిల్లాదళాలలో సమానత్వం, పరస్పర గౌరవమూ ఖచ్చితంగా పాటించబడ్డాయి. ఈ ఆచరణవల్ల ప్రజల ఆలోచన లలో మార్పు వచ్చింది.

దేవుళ్ళు, దయ్యాలు మొదలైన వాటిపై విశ్వాసం చాలవరకు తగ్గి పోయింది. ప్రత్యేకంగా యువజనులలో అది గణనీయంగా అంతరించిపోయింది.

## సాంస్కృతిక పురోగమనం

రాజకీయ ప్రచారం విస్తృతంగా సాగించబడింది. గ్రామ కమిటీలు, గ్రామ దళాలు మొదలుకొని ఆర్గనైజర్లు, గెరిల్లా దళాలవరకు ప్రతి ఒక్కరూ ప్రజా సమావేశాలలో ప్రతి సమస్యనూ వివరించుతుండేవారు. దీనితోపాటు, బుర్రకథ, గొల్లసుద్దులు, వుయ్యాలపాట, కోలాట పాట, భజనలవంటి అనేక సాంస్కృతిక రూపాలు విరివిగా వుపయోగించబడ్డాయి ప్రతి సమస్యనుగూర్చి, పోరాట సందర్భంగా జరిగిన పెద్ద సంఘటనలనుగూర్చి, మృతవీరులనుగూర్చి శత్రువు జరిపిన అత్యాచారాలనుగూర్చి, శత్రు పరాజయాలు మొదలైనవాటిని గూర్చి పాటలనేకం వ్రాయబడ్డాయి. వీటినన్నిటినీ వ్రాసింది బాగా చదువుకున్న రచయితలు కాదు సామాన్య ప్రజలే జానపదగేయాల రూపంలో స్వయంగా వాటిని అల్లుకున్నారు. అవి ఎంతో శ్రావ్యంగా వుండేవి. ప్రజానీకాన్ని వుత్తేజ పరిచేవి. కళాకారులు సయితం శిక్షణ పొందినవారు కాదు. ప్రజలే సాంస్కృతిక దళాలుగా ఏర్పడి ప్రదర్శన లిస్తుండేవారు. ఈ కార్యక్రమాలు, ఈ పాటలు పాడటమూ నిర్ణీత సమయాలలోనో, నిర్ణీతస్థలాలలోనోగాక, ఎక్కడంటే అక్కడ, ఎప్పుడంటేఅప్పుడు సాధ్యమైనచోటనెల్లా, అవసరమైనప్పుడెల్లా జరుగు తుండేవి. గెరిల్లా దళాలు, తమ సైనిక పరిజ్ఞానాన్ని ప్రజలముందు ప్రదర్శించు తుండేవి. స్థానిక దళాలుకూడా ప్రతిరోజూ సైనిక శిక్షణ పొందుతుండేవి

ఈ కార్యక్రమాలన్నింటినీ, ప్రజలు గొప్ప ఆసక్తితోను, వుత్సాహం తోనూ తిలకించుతుండేవారు. కొన్ని సమయాలలో, వారి ఉత్సాహమే వారిని కార్యక్రమంలోకి దించుతుండేది.

పశువులగాచే కుర్రవాళ్ళు ఈ సాంస్కృతిక ప్రదర్శనలిస్తూండే వారు. మిలటరీ డ్రిల్లుకూడా చేసేవారు. తత్ఫలితంగా కొన్ని సందర్భాలలో తీవ్రమైన ప్రమాదాలు సంభవించాయి.

సూర్యాపేట తాలూకా, చిల్పకుంట గ్రామంలో ఈ గొడ్లుగాచే కుర్రవాళ్ళు ఒకసారి ఒక నాటకం ప్రదర్శించారు. వాళ్ళలో ఒకరు పేరు మోసిన దుష్టభూస్వామి జన్నారెడ్డి ప్రతాపరెడ్డిగాను, మరొకరు పేరుమోసిన

రజాకారు అబ్బాస్ అలీగాను, మిగతావాళ్ళు గెరిల్లాలుగాను నటించారు. భూస్వాముల పాత్ర ధరించిన నటులు తీవ్రంగా దెబ్బలుతిన్నారు. అదేవిధమైన నాటకాలు అనేకచోట్ల ప్రదర్శించబడ్డాయి.

శత్రు దాడులు వుధృతంగా సాగుతున్న తరుణంలో సయితం, వయోజన విద్యా కార్యక్రమం చేపట్టి, అమలు జరపబడింది. గ్రామ కమిటీలు, గ్రామ దళాలు తాము విద్య నభ్యసించటమేగాక, యితరులకుకూడా బోధించుతుండేవి. దళాలలోని నిరక్షరాస్యు లనేకమంది, తదితరులు కొలది మాసాల అనంతరం వార్తాపత్రికలు, పుస్తకాలు చదవగలిగేవారు. రాజకీయ చైతన్యం కారణంగా, అనేకమంది చదువుకొనటానికి ముందుకొచ్చారు. అతిస్వల్ప వ్యవధిలోనే చదువు నేర్చారుకూడా. దానినొక రాజకీయ కర్తవ్యంగా స్వీకరించినందుననే ఈ పని జయప్రదంగా నెరవేర్చగలిగారు.

పై కమిటీలు నిర్దేశించిన సూత్రాలను, ఆదేశాలను అనుసరించి గ్రామ కమిటీలు ఈ కర్తవ్యాలను నిర్వర్తించాయి దీనికి, గ్రామ దళాలు పూర్తి మద్దత్తునిస్తుండేవి వాళ్ళందరికీ సహాయపడటానికి, ఆర్గనైజరూ, గెరిల్లా దళమూ సర్వదా సిద్ధంగా వుండేవారు

శత్రువును ప్రతిఘటించి పోరాడటానికి గెరిల్లాలు సర్వదాసన్నద్ధంగా వుండటంతో, గ్రామాలలో భూమిసాగు నిరంతరాయంగా సాగిపోయింది. తమ ధాన్యమూ, ధనమూ శత్రువుకు చేజిక్కకుండా అరికట్టటంకోసం వారు పొలాలంతటా పాతర్లలో దాచివుంచేవారు. దొంగల భయమనేదేలేదు. చిన్న దొంగతనాలు జరిగినప్పటికీ గ్రామకమిటీలు, గెరిల్లాదళాలు ఆవిషయంపట్టించుకుని, దొంగిలించబడిన వస్తువులను వాటిస్వంతదారులకువొప్పగించేవారు.

## పట్టణాలతో వర్తకం

పట్టణాలతో వర్తకం సాగించటానికి, అత్యవసరవస్తువులసరఫరానిరంతరాయంగా సాగేందుకు, పట్టణంనుండి సరుకులు తీసుకువచ్చేందుకు, రైతులు పండించిన పంటలను పట్టణాలలో అమ్ముకునేందుకుగాను పట్టణాలతో వర్తకం సాగించేందుకు గ్రామకమిటీలు ఎర్పాట్లు చేయవలసి వచ్చింది. పట్టణాలలో శత్రు కేంద్రీకరణ వున్నందున గ్రామాలలోని వ్యాపారస్తులు, వాళ్ళతో వ్యాపారంజేసే పట్టణాలలోనివారూ నైజాము అధికారులకు కొంతవరకు లంచాలివ్వటం, ఒక విధమైన అవగాహనకు రావటం అవసరమవుతూ వచ్చింది. అంతేకాదు. గ్రామరాజ్యకమిటీలు అంతులేని విధినిషేధాలు విధించజాలవు. ఈ వ్యాపారస్థులను శత్రుఏజెంట్లుగా తయారయ్యే అవకాశం వున్నవారుగా అనుమానించనారంభించి, జోక్యం కల్పించుకొనజాలవు

ఈ వ్యాపారం ద్వారానే, తుపాకిమందు తయారుజేయటానికవసర మైన ముడిపదార్థాలను, నాటుబాంబులనుసయితం సేకరించటం సాధ్య మవుతుంది.

ఒకసారి కరెన్సీ కొరత ఫలితంగా ఈ వ్యాపారం దెబ్బతినే పరిస్థితి ఏర్పడగా, వస్తుమార్పిడి ద్వారా వ్యాపారం జరపాలన్న అభిప్రాయాలు తలెత్తాయి.

అయితే, పట్టణాలతో సంబంధాలు, సాధారణవ్యాపారమూ పెద్దగా దెబ్బతినలేదు. ఆ సంబంధాలను అరికట్టాలనిగాని, వ్యాపారాన్ని నిరోధించా లనిగాని శత్రువు తలంచకపోవటమే అందుకు ప్రధాన కారణం. ఎదురైన యిబ్బందులన్నింటికీ ప్రధాన కారణాలు రజాకార్లనుండి, అవినీతిపరులైన నైజాం పోలీసులనుండి భద్రతారాహిత్యం, లూటీలు చేస్తారనేభయం, అక్రమ లాభార్జన జేయాలన్న వాళ్ళతత్వమూ మాత్రమే. అంతేకాదు మొత్తంమీద భద్రతారహిత పరిస్థితులలముకొనియున్న కారణంగా, నగరాలలోనూ, పట్ట ణాలలోనూసయితం వస్తువుల సరఫరాలో కొరత ఏర్పడింది.

గ్రామాలలో గ్రామరాజ్యకమిటీలు, తమ స్థానిక దళాల ద్వారా, చిన్ననేరాలను సమర్థవంతంగా అదుపులో బెట్టాయి అలాంటి నేరాలపట్ల మొత్తం ప్రజలవైఖరియే, సాధారణ నేరస్థులను అదుపులో వుంచింది అలాంటి కార్యకలాపాలలో పాల్గొంటుండే కొందరు సంఘ వ్యతిరేకశక్తులను ప్రజలు, దళాలూ పట్టుకొని వాళ్ళపట్ల తగువిధంగా వ్యవహరించేవారు.

## సైనిక దృక్కోణంనుండి పోరాట స్వరూపం

ఈ కార్యకలాపమంతటిలోకీ అత్యంత సంతృప్తికరము, ఉత్తేజ పూర్వకమూనగు లక్షణం, గ్రామ దళాల క్రమశిక్షణ, కార్యదీక్ష, గెరిల్లా దళాలలో ఈ లక్షణాలు మరింత వున్నతస్థాయిలో వున్నాయి అదే లేకపోతే వుద్యమం నైజాం వ్యతిరేక విమోచనదశలో అది అందుకున్నవూపు నందుకొని వుండగలిగేదికాదు. రెండు దశలలోనూ, సంభవించిన విపరీతమైన నష్టాలను, ప్రత్యేకించి 1948–51 మధ్యకాలంలో భారత సైన్యపు విధ్వంసపాలనలో సంభ వించిన భయంకరమైన నష్టాలను తట్టుకొని నిలవగలిగేదికాదు. వారు ప్రజల వుద్యమాలతో సన్నిహితంగా అనుసంధించబడియున్నందుననే ఈ క్రమశిక్షణ, కార్యదీక్ష కలిగియుండటం సాధ్యమయింది. ఈ దళాలు ప్రధానంగా కష్టజీవి వర్గాలనుండే వచ్చాయి. తమ కష్టాలను, కడగండ్లను తొలగించటంకోసం ఆ దళాలు పోరాడేవి. అంటే వారు తమ యొక్క తమ కుటుంబాలయొక్క

దుర్భరపరిస్థితుల బారినుండి బయటపడటానికి పోరాడారు. సహజంగానే ప్రజలు వారికి అన్ని విధాలా సహాయపడుతూవుండేవారు. రజాకారు దోపిడీ మూకలు, నైజాం సాయుధ పోలీసులు గ్రామాలపై కేంద్రీకరించి దాడులు జరుపుతున్న సమయంలో వారికి తమ ఇండ్లలో, పొలాలలో, చెల్లాచెదరుగావున్న నూతులవద్దగల గుడిసెలలో, గ్రామాలకు దూరంగావున్న మరింత సురక్షితమైన స్థానాలలో ఆశ్రయం కల్పించి కాపాడుకున్నారు. ఆ తర్వాత భారత ప్రభుత్వ పోలీసులు, సాయుధబలగాలు, భూస్వాముల గూండాలూ, హోంగార్డులు దాడులు చేసినప్పుడూ అదే విధంగా ప్రజలు వారికి ఆశ్రయం కల్పించారు. ప్రజలు గెరిల్లాలను ప్రేమాదరాలతో గౌరవించారు. ప్రశంసించారు. తామూ ప్రజలలో ఒకరేనని, ప్రజలకు తోడ్పడటానికి తాము చేయగలిగిందంతా చేయాలని వారికి హాని కలుగజేయరాదని వారిని బీభత్సపరచరాదని అవసరమయితే ప్రజలకోసం తమ ప్రాణాలయినా అర్పించాలనిగెరిల్లాలు భావించారు.

అద్భుతమైన ఆక్రమశిక్షణకు, కార్యదీక్షకు, అంతటి కఠోరమైన కష్టాలను సహించే శక్తికి, త్యాగాలు జేయటానికి సన్నద్ధతకూ వెనుకగల రహస్యమిదే.

మొత్తం ఈ ఐదు సంవత్సరాల కాలంలో, భూస్వాముల ఇండ్లపైన, వాళ్ళ తాబేదార్ల యిండ్లపైన జరిగిన వేలాది చర్యలలో, దాడులలో గెరిల్లాలు తప్పు పనులు చేసినట్లు ఫిర్యాదులు దాదాపుగా లేవు. లేదా ఆశ్చర్యం గొల్పేంత తక్కువగా మాత్రమే ఫిర్యాదులు వచ్చాయి. శత్రువుల యిండ్లనుండి స్వాధీనం చేసుకోబడిన ఆస్తులు, సరఫరాలు, వస్తువులు, నగలు, రొక్కం ఖచ్చితంగా లెక్కలు వ్రాసి, పై కమిటీలకు అందజేయటం జరిగేది. స్థానిక కమిటీ ఆదేశంగాని, ఆర్గనైజరు ఆదేశంగాని, నిర్ణయంగాని లేకుండా ఏ శత్రువుపైనైనా, ఆతని తాబేదారుపైనైనా ఎలాంటి చర్య తీసుకోవటమైనా అరుదు. దళ నాయకులు, రాజకీయ ఆర్గనైజర్ల సూచనలను, ఆదేశాలను ఖచ్చితంగా శిరసావహించారు.

శత్రువుకు సంబంధించిన వారైనాసరే, మహిళలపై చేయి వేయటం గాని, మహిళల మానభంగాలుగాని, వృద్ధులపట్ల అపసవ్యంగా వ్యవహరించటం గాని జరగలేదు గెరిల్లాలు, శత్రువుపై చర్యతీసుకుంటున్న సందర్భాలలో సయితం స్త్రీలకుగాని, బిడ్డలకుగాని హాని కలుగజేయవలదు—అని సాధారణ ఆదేశాలివ్వబడినాయి. కొన్ని సందర్భాలలో, స్త్రీలపై కొన్ని చర్యలు తీసుకోబడినాయంటే, ఆస్త్రీలు గెరిల్లాలకు వ్యతిరేకంగా నిలచి వారి చర్యకేగాక, వారి భద్రతకే ప్రమాదం కలుగజేసేందుకు పూనుకున్నందువల్లనే జరిగాయి. అత్యంత క్రూరమైన అధికారుల, భూస్వాముల దర్పాన్ని అదుపులో బెట్టడం

కోసం స్త్రీలపై కొన్ని చర్యలు తీసుకోవడం జరిగిన అరుదైన సందర్భాలుకొన్ని వుంటే వుండవచ్చు. అయితే, అలాంటి ఘటనలను వుద్యమానికి హానికలిగించే చర్యలుగా పేర్కొంటూ, పైకమిటీలు, సీనియర్ కామ్రేడ్స్ సకాలంలో విమర్శించటం, అలాంటి ఘటనలు పునరావృతం చేయవలదని తీవ్రమైన హెచ్చరికలు జేయటం జరిగింది.

గెరిల్లాలు ఎంతటి క్రమశిక్షణను పాటించారో వివరించటానికి దిగువ పేర్కొన్న రెండు వుదహరణలు పరిశీలిస్తేచాలు. నా స్వంత అనుభవంనుండి వాటిని వుదహరిస్తా :

## గెరిల్లా దళ సభ్యులు - మద్యపానం

1951 జులైలో, ఆ ప్రాంతానికి జెందిన మా రాజకీయ కార్యాలయానికి చేరడంకోసం మేము కృష్ణానదీతీరస్థ అటవి ప్రాంతానికి వెళ్తున్నాం. సురక్షితమైన అడవులలో అడుగుబెట్టేముందు మేము వంద మైళ్ళకుపైగా మైదాన ప్రాంతాన్ని దాటి వెళ్ళవలసియుంది. ఈ ప్రాంతమంతటా, ఈ మార్గమంతటా పోలీసులు, హోంగార్డులు కొల్లలుగా వున్నారు దళాలు రాత్రి వేళల్లో మాత్రమే ప్రయాణం చేయగలగాలి. మార్గమధ్యంలో వచ్చే జనావాస ప్రాంతాలన్నింటినీ తప్పుకొని, పొలాలలోగుండా, రాతిగుట్టలలోగుండా ప్రయాణంచేసి, తమ కదలికలకు సంబంధించిన జాడ దెలియకుండా జాగ్రత్త పడేవారు. దాదాపు మూడు సంవత్సరాలపాటు అకలిదప్పులతో, కృష్టాలనుభవించిన తరువాత, దళాలు దాదాపు 15-20 కిలోల బరువుండే రేషన్లు, ఆయుధాల సరఫరాలు మొదలైన వాటిని మోసుకుని 20 నుండి 30 మైళ్ళవరకూ ప్రయాణం చేయటం చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది.

ఆకస్మికంగా, దళసభ్యులొకరు వెనకబడటం, అతికష్టంమీదగాని, ముందుపోతున్న దళంతో కలవలేకపోవటాన్ని నేను గమనించాను అయనకు అకస్మాత్తుగా వేడిచేసిందని, ఎర్రరంగులో మూత్రం విసర్జిస్తున్నాడని దళ నాయకుడు నాకు చెప్పాడు మావద్ద నిల్వవున్న నీరు అయిపోయింది. నీళ్ళు దొరకాలంటే, మేము చాలాదూరం నడవవలసియుంది. మేము తాటి ఈత చెట్లలోగుండా నడిచిపోతున్నాం. అక్కడ కల్లుమాత్రం అందుబాటులోవుంది. అదళ సభ్యుడిని ఒక ముంతో రెండు ముంతలో కల్లు త్రాగనిచ్చేట్లయితే, కొంచెంసేపట్లోనే ఆయన మామూలు పరిస్థితికి వస్తాడు. ఆయనను కల్లు ఎందుకు త్రాగనివ్వగూడదని నే నాశ్చర్యం ప్రకటించాను. "గెరిల్లాలెవరూ కల్లు త్రాగరాదనే వుత్తర్వులున్నాయి ఈ వుత్తర్వును వుల్లంఘించితే తీవ్రమైన శిక్షకు పాత్రుడవుతాడు. అందువల్ల ప్రాంతీయ నాయకత్వంగాని, రాష్ట్ర

కేంద్రానికి జెందిన ముఖ్య కామ్రేడ్‌గా మీరుగాని అవసరమైన అనుమతి నివ్వవచ్చు" అని దళ నాయకుడు సమాధానమిచ్చాడు. నేను వెంటనే అందుకు అనుమతించాను. విషయమేమిటో ప్రాంతీయ కమిటీకి వివరిస్తానని ఆయనకు హామీనిచ్చాను. తెలంగాణా ప్రాంతంలో పేదవర్గాలలో కల్లు తాగటమనేది మామూలు అలవాటుగా వున్నదనే విషయాన్ని మనం దృష్టిలో వుంచుకుంటే, వ్యక్తిగత క్రమశిక్షణ ఎంతగా పాటించబడుతున్నదీ దీనినిబట్టి విదితమవుతుంది.

సైన్యమూ, సాయుధ పోలీసులు, గ్రామాలకుగల అటవీమార్గాలన్నింటినీ మూసివేసి, కొలది వారాలక్రితమే దాదాపు రెండు మాసాలపాటు, తమకు సరఫరాలన్నీ ఏ విధంగా అరికట్టబడిందీ ప్రాంతీయ కమిటీ నాయకత్వం నాకు చెప్పింది. దళసభ్యులు రోజుల తరబడి, వుప్పుకూడా లేకుండా రోజుకు రెండుసార్లు పావులీటరు చొప్పున సజ్జ గంజితోనే సంతృప్తి జెందవలసి వచ్చింది. అయినా, సెంట్రీ ఈ కొండలలో అరమైలు దూరంలో గట్లమీద, రాతిగుండ్లమధ్య, గుట్టలలోనూ నిలిచి పహారాకాస్తూనే వుండేవాడు. అతి కష్టంమీద మాత్రమే ఈ అత్యవసర కర్తవ్యానికి అంటిపెట్టుకొని వుండటం జరిగింది. కొన్నిసమయాలలో, దళసభ్యులలో ఎవరో ఒకరు అలసిపోయి సొమ్మసిల్లిపడటం జరుగుతుండేది. అయినా వంటబాధ్యతచూచే కామ్రేడ్ రేషన్‌లో సెంట్రీవాటాను వేడివేడిగా, తినటానికి సిద్ధంగా వుంచుతుండేవాడు అకలిగొన్న మనిషి నోరూరించే గంజిముందు బెట్టుకొని డ్యూటీలో వుండే మనిషికోసం వేచియుండేవాడు!

## "తెలంగాణా గెరిల్లాలు మాత్రమే అంతసాహసం చేయగలరు!" కామ్రేడ్ ముత్తురెడ్డి వెంకటచలం గాథ

కామ్రేడ్ ముత్తురెడ్డి వెంకటచలం, గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాకుజెందిన మధ్యతరగతి రైతు కుటుంబంలోజన్మించాడు. ఆయిన పొలాలలో పనిజేసుకుంటూ, కృష్ణానదిలోని లంకలలో పశువులను మేపుతూవుండేవాడు. బాగావరదలొచ్చినప్పుడు కూడా కృష్ణానదిలో ఈదటానికి ఆయన అలవాటు పడ్డాడు. చాలా లొలిరోజుల్లోనే, ఆయన కమ్యూనిస్టు ఉద్యమంలో చేరాడు. 1948-49 లో ఆంధ్రలో కాంగ్రెసు ప్రభుత్వం పోలీసు బీభత్సకాండను విచ్చలవిడిగా ప్రయోగించినప్పుడు, హత్యజేయాలన్న దుష్టబుద్ధితో పార్టీ కార్యకర్తలపై దాడులు ప్రారంభించినప్పుడు ఆత్మరక్షణకోసం ఎదురుదెబ్బ తీయవలసిందిగా పార్టీ పిలుపిచ్చింది. పోలీసు బీభత్సకాండ సాగుతుండగా అక్కడ

తట్టుకొని నిలవటం అతికష్టంగా మారినతరువాత, వారిని ఫారెస్టు ప్రాంతాలకు తప్పుకోవలసిందిగాను, పోరాడుతున్న తెలంగాణా గెరిల్లా దళాలలో చేరవల సిందిగానూ పార్టీ కోరింది. అలా వెళ్ళినవారిలో ఆయనా వొకరు.

1951 జులైలో ఒక రోజున, నేను కృష్ణానది సమీపాన దేవరకొండ కొండలలో ఆ ప్రాంత నాయకులతో మాట్లాడుతున్నాను. వందగజాలదూరంలో సాధారణ దుస్తులు ధరించిన ఒక యువకుడు, యిద్దరు లంబాడీ యువకులతో తీవ్రంగా సుదీర్ఘ చర్చలు సాగిస్తుండటం గమనించాను. దాదాపు ఒక గంట సేపు తర్వాత వారక్కడినుండి వెళ్ళిపోయారు. ఆ సాయంత్రం, ఆ ప్రాంతానికి చెందిన మన నాయకుడు ఖిన్న వదనంతో నా దగ్గర కొచ్చాడు. కామ్రేడ్ సుబ్బయ్య (వెంకటచలం మారుపేరు) కృష్ణానదిలో కొట్టుకు పోయాడనే వార్త చెప్పాడు. ఆ కథఅంతా నాకు వివరించాడు.

కృష్ణానదిని దాటి, అవలి వైపునవున్న గెరిల్లా దళాన్ని కలుసుకుని, ఆంధ్రప్రాంతంలో అది చిక్కుకొనియున్న ప్రమాదకర పరిస్థితినుండి బయట పడడంకోసం ఆదళాన్ని సురక్షితంగా తెలంగాణాకు చేర్చేపని కామ్రేడ్ వెంకట చలంకు వొప్పగించబడింది. ఈతలో నిపుణులైన యిరువురు లంబాడీలు, కృష్ణా నదిని దాటటంలో అయనకు తోడ్పడటంకోసం వొప్పగించబడ్డారు. అయితే దురదృష్టవశాత్తు, వాళ్ళు కృష్ణానదిని దాటటానికి నిర్దేశించబడినరోజు ఆకస్మి కంగా పెద్ద వరదలొచ్చాయి. ఆ కొండలవద్ద అప్పుడు నదిని దాటవలదని నిపుణులైన ఆ లంబాడీ ఈతగాండ్రు సలహాజెప్పారు. వరదలు తగ్గుముఖం పట్టేంతవరకు కొలదిరోజులు ఆగటంగాని, లేదా 50 మైళ్ళు దిగువకువెళ్ళి అచ్చట మైదాన ప్రాంతాలలో నదినిదాటి, అవలివొడ్డునుండి మరల వెనుకకు నడిచి ప్రమాదంలో చిక్కుకొనియున్న దళంవున్న ప్రాంతానికి చేరటంగాని- ఏదోఒకటి చేయదగుననివారు సూచించారు వెంకటచలం బదులుచెపుతూ "ఇది మనకు అసాధ్యం. ఒప్పగించబడిన పనిని నిర్వర్తించడంలో తప్పకవిఫలమవుతాం. శత్రుముట్టడిలోచిక్కుకొని, ఆ దళంసర్వనాశనంచేయబడే ప్రమాదం ఎంతగానో వుంది." అని పార్టీ యిచ్చిన పనినివిడనాడవలదని అయన లంబాడీ ఈతగాండ్రకు విజ్ఞప్తిజేశాడు. పార్టీ ఆదేశాన్ని నిర్వర్తించటంకోసం, తమ ప్రాణాలను కోల్పోవటానికయినా సిద్ధంకావలసిందిగా ఆయన వారిని కోరాడు. తద్వారా పదిమంది సభ్యులుగల దళంయొక్క ప్రాణాలు కాపాడవలసిందిగా విజ్ఞప్తి చేశాడు. పార్టీపేరు జెప్పడంతోనే, లంబాడీ కామ్రేడ్స్ తమ అభ్యంతరాలను వదులుకున్నారు.

ముగ్గురూ మూడు ఎండుదుంగలు చేతబట్టుకొని పరవళ్ళు ద్రొక్కు తున్న కృష్ణానదిలో దూకారు. కామ్రేడ్ వెంకటచలం నడిపేటిలోకి నెట్టుకు

పోయాడు. మిగతా యిరువురూ ఒడ్డుకు నెట్టబడ్డారు. వెంకటుచలంతో కలుసుకోవాలని వారు పదే పదే ప్రయత్నించారు. కాని కలవలేకపోయారు ప్రవాహవేగంలో వెంకటుచలం నీటిక్రిందికి నెట్టబడటం, ఆయన తన దుంగనే గట్టిగా అంటిపెట్టుకొని, వీరోచితంగా పైకి తేలుతుండడం వారు గమనించారు. వారు ఖిన్నవదనంతో, నదిఒడ్డునుండి ఆయననుఅనుసరించారు. ఆయన వారికి కనుపించకపోయిన తర్వాత ఆ విషాదవార్తను తెలియజేయటానికి వారు తిరిగి వచ్చారు ప్రస్తుత నాగార్జునసాగర్ ఆనకట్టకు కొంచెంపైనే యిది జరిగింది.

మేమంతా నిర్ఘాంతపోయాం! అలాంటి కామ్రేడ్‌ను కోల్పోవటమా? అని. ముగ్గురు కామ్రేడ్స్ ప్రాణాలను ప్రమాదానికి లోనుజేయటానికి సిద్ధమై కృష్ణానదిని దాటటానికి ప్రయత్నించటానికి ఆయనను మేమనుమతించటం సరైనదేనా? మొత్తం దళం ప్రాణాలుగోల్పోయే ప్రమాదానికైనా సిద్ధపడి, ఆ దళాన్నికాపాడేయత్నం విరమించితేబాగుండేదికాదా? అయితే ఆసమస్యకు సమాధానంకోసంగాని, ఆదేశంకోసంగాని, ఆ ప్రాంత నాయకత్వానికిగాని, నాకుగాని నివేదించటం జరగలేదు! కామ్రేడ్ వెంకటుచలం, కార్యదీక్షాపరులైన ఆ యిరువురు లంబాడీ కామ్రేడ్స్ తమంతతామే ఆ సమస్యను పరిష్కరించారు.

ఎంతటి సంతోషకరమైన విషయం! నాలుగురోజుల తర్వాత, ఒక నాటి సాయంత్రం కామ్రేడ్ వెంకటుచలం మాకు కనిపించాడు దళాన్ని వెంటబెట్టుకొని వచ్చి, ఆయన మాకు సైనిక వందనం చేశాడు! మేమాయనను ఆలింగనం జేసుకుని, జరిగిన దాన్నిగూర్చి ప్రశ్నలు గుప్పించాం.

"కామ్రేడ్స్, అసాధారణమైనదేమీ జరగలేదు. నేను ధైర్యం కోల్పోలేదు నా కొయ్యదుంగను గట్టిగాపట్టుకున్నాను ఆవలిఒడ్డుకు చేరాను. అచ్చటి గొడ్లకాపరులు నాకు సహాయపడ్డారు. దళాన్ని కలుసుకోవటానికి నిర్దేశించబడినచోటికి వారు నన్నుచేర్చారు. వరదలు తగ్గుముఖం పట్టిన తర్వాత మేము కృష్ణానదిని దాటాం. ఇదిగో మొత్తం దళమంతా సురక్షితంగా వుంది" అని ఆయన చెప్పాడు.

అయితే ఆ దళ నాయకుడు ఆయనకు అడ్డు దగిలి, గొడ్లకాపరులు చెప్పగా తాను విన్నగాధను వివరించాడు. కామ్రేడ్ వెంకటుచలం తెంపరితనంతో ఈదుతున్నాడు ఆయన చిన్న సుడిగుండాన్నొకదాన్ని సమీపిస్తున్నాడు. చిట్టచివరి ప్రయత్న ధైర్యసాహసంతో సాగించవలసిందిగా కోరుతూ గొడ్లకాపరులు ఆయనను కేకలు పెట్టారు. తమ పైపంచెలు ముడివేసి దానిని, పొడవాటి వెదురుబొంగునూ ఆయనవైపుకు విసిరి పట్టుకొనవలసిందిగా కోరారు.

ఆయన సుడిగుండంలోనికీడ్వబడితే మరణం తథ్యం. కా।మేడ్ వెంకటుచలం ఈదాడు; వెదురుబొంగును పట్టుకున్నాడు ఒడ్డుకు చేరుకున్నాడు. సురక్షితంగా బయటుపడ్డాడు.

వాళ్ళకు తన విషయం చెప్పటానికి ఆయన ప్రయత్నిస్తున్నాడు. అయినా వారాయనను మాట్లాడనివ్వలేదు. "కా।మేడ్ మీరు చెప్పనవసరం లేదు. ఈ వరదలలో కృష్ణానదిని దాటటానికి తెలంగాణా గెరిల్లాకాక మరె వరు సాహసించగలరు! ఈ రాత్రికిక్కడ విశ్రాంతి తీసుకోండి" అని కోరారు కామే9డ్ వెంకటుచలం విశ్రాంతి తీసుకో నిరాకరించాడు. తాను వచ్చిన పని వివరించి చెప్పాడు. వారు, ఆ రాత్రంతా నడిచారు నిర్ణీత ప్రకారం చేరవల సినచోటుకు చేరారు. దళాన్ని కలుసుకున్నారు

మేమంతా ఆనందించాం. 1951 అక్టోబరు 21న తెలంగాణా పోరాటం వుపసంహరించబడినప్పుడు ప్రభుత్వం అంతకుముందు చేసిన వాగ్దా నాలను పాటించకుండా పగసాధింపు చర్యలకు పూనుకొన్నది

కా।మేడ్ వెంకటుచలం ఒక గ్రామంలో జరిగినసభలో, కమ్యూనిస్టు (పి. డి యఫ్) అభ్యర్థికి వోట్లువేయివలసిన ఆవశ్యకతనుగూర్చి వివరిస్తు న్నాడు. పోలీసులు ఆకస్మికంగా ఆ సభను చుట్టుముట్టి వెంకటుచలంను కాల్చి చంపారు

తెలంగాణా మహాయోధుల త్యాగం, దీక్ష అంతటి మహత్తరమైనది. అవి రానున్న తరాలను ఉత్తేజ పరుస్తాయి. ప్రజావిప్లవం విజయంకోసం, నవ సమాజంకోసం పయనించే వారిమార్గాన్ని కాంతివంత మొనరించగలవు.

## బలహీనతలు

అయితే, కొన్ని లోటుపాట్లూ జరగకపోలేదు. నైజాం వ్యతిరేక పోరాట కాలంలోను, భారతసైన్యం జోక్యంతర్వాత మొట్టమొదటి కొలది వారాలలోను అనేకసార్లు, పర్వత ప్రాంతాలలోగాక, మైదానాలలో నియ మించబడిన సెంట్రీలు తమ స్థావరాలవద్ద మెళకువతో వుండజాలకపోయారు. తత్ఫలితంగా గెరిల్లాబలగాలు తీవ్రమైన నష్టాలకు గురైనాయి. ప్రత్యేకప్రాధా న్యతగల ఈ కర్తవ్య నిర్వహణకై మరింత హెచ్చుశిక్షణ గరపివుంటే, మరింత రాజకీయ చైతన్యం, ఈ బాధ్యతపట్ల మరింత జాగరూకత పాదుకొల్పి వుండ గలిగితే ఈనష్టం నివారించటం సాధ్యమయ్యేది.

సైనిక దృక్కోణంనుండి చూచినప్పుడు, అతి పెద్దబలహీనతఏమంటే, ఎలాంటి సైనిక శిక్షణ లేకపోవడం, అంటే ప్రేలుడు ఆయుధాలను వుపయో

గించటానికి సంబంధించిన పరిజ్ఞానం, వాటిని వుత్పత్తి జేయటం, వాటిని మరమ్మత్తు జేయటంవంటి విషయాలలో పరిజ్ఞానం బహుస్వల్పం. అందువల్ల, ఎంతో వుత్సాహం, త్యాగం ప్రదర్శించబడినా ఆ లోపాన్ని అధిగమించటం సాధ్యం కాలేదు. దాడులకు పథకం వేయటంలోగాని, వెనుకకు వుపసంహరించటంలోగాని సైనిక ఎత్తుగడలు ప్రాథమికంగానే లోపించటం ఎంతగా కొట్టవచ్చినట్లు కనిపించిందంటే, శత్రువుపై చిన్న గెరిల్లాదళాల చర్యలను మనం సమన్వయ పరచలేకపోయాం. శత్రువుపైన, వాళ్ళ క్యాంపులపైన గంటల తరబడి తలపడి పోరాడటం జరిగింది. వాటిలో వుత్సాహ పూరితమైన ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. అయినా వారు సుసంఘటితంగా లేరు. అందువల్ల మనం తీవ్ర నష్టాలకు గురయ్యాం. శత్రువు కృతనిశ్చయంతో ఆత్మరక్షణ గావించుకొంటుండగా వెనకడుగు వేయటం తప్పని సరైంది. సైనిక దాడులు జరుగుతుండగా నిరంతరం పరుగులు బెడుతూ వుండవలసి వచ్చింది. శత్రువును బీభత్స పరిచె చిన్న తరహా గెరిల్లా చర్యలను జోడించి, ఎదురు మదురుగావున్న స్థావరాల నుండి శత్రువును పారద్రోలి, మరింత విస్తృత ప్రాంతాలనుండి శత్రువును తుడిచిపెట్టేందుకు తగినంత పెద్ద తరహా చర్యలుగా పెంపొందించలేకపోయాం.

భారత సైన్యం జోక్యం జరిగేంతవరకూ మనం శత్రువును దెబ్బదీసి, చెప్పుకోదగ్గ సంఖ్యలో అధునాతన ఆయుధాలను హస్తగతం చేసుకోనూ లేకపోయాం అప్పుడు, రజాకార్లు, నైజాం సాయుధబలగాలూ దిక్కుదోచని స్థితిలో పారిపోతుండగా, ప్రజావెల్లువను తోడుచేసుకొని మన దళాలు, తమ క్యాంపులనుండి దిక్కుదోచని స్థితిలో పారిపోతున్న రజాకార్లవద్ద నుండి చెప్పుకోదగ్గ సంఖ్యలో ఆయుధాలు సంపాదించగలిగాయి. అయితే, అప్పటికే మనకు మరింత అననుకూలంగా తయారైన, పూర్తిగా భిన్నమైన రాజకీయ పరిస్థితిలో మనం సుశిక్షితమైన, క్రమశిక్షణ గలిగిన భారత సైన్యంతో ఎదుర్కొనవలసి వచ్చింది !

మనకు ఒక విధమైన సైనిక శిక్షణ, కనీసంగా ఆధునిక ఆయుధాల సరఫరా వుండి వున్నట్లయితే, తెలంగాణాలో మన వుద్యమం మరింత విస్తరించి వుండేది. బహుశా, మొత్తం తెలంగాణా అంతా మరింత పెద్ద సంఖ్యలో, కంపెనీ స్థాయిలోనో, బెటాలియన్ స్థాయిలోనో సైనికంగా పోరాటం జరిపి వుండగలిగేది. బారత సైన్యం దాడిని ఎదుర్కొనటానికి మరింత మెరుగైన పరిస్థితిలో వుండి వుండేది. ఆ దశలో, తెలంగాణా సాయుధ పోరాటాన్ని, నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా విమోచన పోరాటంగాకాక,

రైతాంగ పాక్షిక పోరాటంగా పరిగణిస్తూ సరైన రాజకీయ వ్యూహాన్ని చేపట్టి వున్నట్లయితే, భూస్వామ్య వ్యతిరేక వ్యావసాయిక రంగంలో మరింత గొప్ప విజయాలను సాధించుకొని, నిలబెట్టుకోనటం సాధ్యమైవుండేది !

ఈ విషయంలో. దారుణమైన బలహీనత లున్నప్పటికీ, ప్రజలు తమంత తాముగా విజృంభించటం, ఆ విజృంభణలనుండి ఆవిర్భవించిన ఈ దళాలు, వుద్యమం పూవులో కమ్యూనిస్టుపార్టీ అందించగలిగిన కొద్దిపాటి మార్గదర్శకత్వంతోనే అంతటి గొప్పవిజయాన్ని సాధించగలగటం, నైజాం పాలనను కుదిపివేయటం, అంత దీర్ఘకాలంపాటు భారతసైన్యాన్ని, ప్రభుత్వాన్ని ఎదుర్కొని నిలవగలగటం అద్భుతమైన విషయమే ! అది, పారిస్ కమ్యూన్ యోధులు "నభోంత రాళాలను దద్దరిల్ల జేయటం" వంటిదే ! అయితే, దురదృష్ట వశాత్తు మనం ఈ తెలంగాణా పోరాటంనుండి భవిష్యత్ విప్లవోద్యమాన్ని పెంపొందించటానికయినా సరైన గుణపాఠాలను తీయలేకపోయాం.

## కార్మికవర్గమూ,
## బస్తీకేంద్రాలూ కదలలేదు

హైదరాబాదు సంస్థానంలోని నగరాలలో, పట్టణాలలో ప్రజాతంత్ర వుద్యమం బలహీనంగా వుండటం, మొత్తం తెలంగాణా వుద్యమకాలంలో వున్న అతిపెద్ద లోపాలలో వొకటి. ఈ నగరాలలో పారిశ్రామికాభివృద్ధి అతిస్వల్పం. అందువల్ల కార్మికవర్గం చాలా తక్కువ. వున్న కార్మికవర్గంలోనైనా, సంఘటిత కార్మిక వుద్యమం మరీతక్కువ అందులోనూ మనపార్టీ మరింత బలహీనంగా వుండేది. మేధావివర్గం పెంపుదల స్వల్పంగా జరిగింది. వున్నకాస్త మేధావి వర్గమూ పెద్దఫ్యూడల్, తదితర భూస్వామ్య కుటుంబాలకు చెందినట్టిది. వారు నైజాం అనుకూలురు. నిరంకుశ ఫ్యూడల్ పాలన సాగుతుండటం, మొత్తం పరిపాలనా నిర్వహణ, పోలీసు, సైనిక వుద్యోగాలూ ముస్లింలతో నింపబడటం ఉదారవాద ప్రజాతంత్ర భావమేదివ్యక్తమైనా పదేపదే అణదివేస్తుండటం జరుగుతుండగా, నగరాలలో ప్రజాతంత్ర వుద్యమం పెంపొందకపోవటంలో ఆశ్చర్యమేమీ లేదు. పోరాడుతున్న రైతాంగంతో చేరటంకోసం సమరశీల విద్యార్థులు నగరాలు విడిచిపెట్టడంతో అక్కడవున్న కాస్త తీవ్రవాద విద్యార్థి వుద్యమమూ చల్లబడి పోయింది.

హైదరాబాదులో యుద్ధానంతరంప్రజావెల్లువప్రారంభమైన తర్వాత నగరాలు, పట్టణాలు మరింత వెనుకబడిపోయాయి. శత్రువు వాటిని, తమ సైనిక, పోలీసు చర్యలకు స్థావరంగా చేసుకున్నాడు. గ్రామాలనుండి తరిమి

వేయబడిన భూస్వాములకు, వారి దాబేదార్లకూ అవి బలమైన స్థావరాలుగా తయారైనాయి. ఈ దశలో, ఈ నగరాలలో ప్రజాతంత్ర ఉద్యమాన్నిగాని, కార్మికవర్గ వుద్యమాన్నిగాని పెంపొందించడం కష్టంగా తయారైంది.

పోరాడుతున్న తెలంగాణా రైతాంగానికి అండగా సంఘీభావ పోరాటాలు జరగలేదు! పెద్ద ప్రదర్శనలు లేవు. హర్తాళ్ళు లేవు. సార్వత్రిక సమ్మెలులేవు శత్రువుబలానికి తూట్లుబొడిచే చర్యలేవీలేవు శత్రువుపై ప్రతీకార చర్యలులేవు. శత్రు కదలికలనుగూర్చి రహస్యాల సేకరణ ప్రయత్నాలైనా లేవు.

నగరాలనుండి, ఆచరణలో ఎలాంటి అండదండలుగాని, నగరాలలో ఎలాంటి కార్యాచరణగానిలేకపోవటంతో, గ్రామీణ ప్రాంతాలలో పోరాటం సాగించటం కష్టంగా తయారైంది. అత్యవసర సరఫరాలను సేకరించటం, మందులు సేకరించటం సయితం తీవ్రమైన సమస్యగా తయారైంది. భారత యూనియన్ భూభాగంలోని పెద్ద నగరాలనుండి, పట్టణాలనుండి, వాటిని సంపాదించవలసి వచ్చేది.

మనతో ఏమాత్రం సంబంధాలున్నా, అలాంటివారందరు తెలంగాణా వుద్యమానికి బ్రహ్మాండంగా సాయపడ్డారు. అజ్ఞాతంగా అనేకకార్యాలయాలను ఏర్పాటు జేయటానికి, అజ్ఞాత కేంద్రాలను నిర్వహించటానికి వారు మనకు తోడ్పడ్డారు. అచ్చటినుండే మనం పొరుగునేవున్న పోరాట ప్రాంతాలతో సంబంధాలు పెట్టుకొనగలిగాం. అవసరవస్తువులను, కొన్ని ఆయుధాలనుకూడా సేకరించగలిగాం అయితే చాలా ఎక్కువ ఆర్థిక వ్యయంతోనే మనం అలా సేకరించగలిగేవాళ్ళం. అంతేకాదు మన అజ్ఞాత కేంద్రాలను పదేపదే దెబ్బకొట్టటం జరుగుతూవచ్చింది. అమూల్యమైన కార్యకర్తలను అరెస్టు చేయటం, చిత్రహింసలకుగురిజేయటం,కాల్చిచంపివేయడం జరుగుతూవుండేది.

నగరాలలో లభించిన పరిమితమైన ఈ తోడ్పాటుసయితం, పోరాటంలో మనకు ఎంతగానో వుపకరించింది. అదికూడా లేకపోయినట్లయితే, మన తెలంగాణా వుద్యమం మరెంతగా దెబ్బదినిపోయేదో సులభంగా వూహించుకోవచ్చు!

తెలంగాణా వుద్యమం ప్రధానంగా రైతాంగ సాయుధపోరాటం. శత్రువుపై నిజమైన కార్మిక—కర్షక సమైక్య ప్రతిఘటనగా దానిని పెంపొందించ లేకపోయాం! ప్రజాతంత్ర వుద్యమంయొక్క బలహీనత, ప్రత్యేకించి నగరాలలో విప్లవ కార్మికోద్యమమూ, కమ్యూనిస్టుపార్టీల బలహీనత అలాగే కొనసాగింది. అయితే ఆ దశలో కష్టజీవులైన జన సామాన్యంపైన, మధ్యతరగతి వర్గాలపైన బ్రహ్మాండమైన తెలంగాణా వెల్లువయొక్క ప్రభావంపడింది. వారంతా ఆ పోరాటంపట్ల సానుభూతినే కలిగియున్నారు!

## అఖిలభారత సంఘీభావ చర్యయేదీ జరగలేదు

తెలంగాణా రైతు ఉద్యమం, సాయుధ పోరాట స్వభావం తీసుకునే సరికి, ఆ తర్వాత నైజాంపాలనకు వ్యతిరేకంగా విమోచనపోరాట స్వభావం సంతరించుకునేసరికి భారతదేశంలోని మిగతా ప్రాంతంలో ప్రజ్వరిల్లిన యుద్ధానంతర వెల్లువను పాలకవర్గాలు జయప్రదంగా అణచివేయగలిగాయి. సామ్రాజ్యవాదులు రాజకీయాధికారాన్ని, భారతదేశ బూర్జువా-భూస్వామ్య వర్గాలకు వొప్పగించారు. భారతదేశం స్వాతంత్ర్యం పొందింది. సంస్థానా ధీశులకు రాజభరణాలిస్తామని, ఇతర సౌకర్యాలు కల్పిస్తామని వాగ్దానం జేశారు. తమ కష్టాలు గట్టెక్కుతాయనీ, నవశకం ఆరంభమవుతుందనే ఆశ లను కాంగ్రెసు నాయకత్వం సంస్థానాల ప్రజలకు కల్పించింది. కాంగ్రెసు ప్రభుత్వం ఆ విధంగా సంస్థానాలను భారత యూనియన్‌లో విలీనం చేయ గలిగింది. సంస్థానాల ప్రజాపోరాటాలను ఆపుచేయగలిగింది. కమ్యూనిస్టు ఉద్యమాన్ని, దాని బలమైన స్థావరాలైన కేరళ, ఆంధ్ర, బెంగాల్‌లలో దెబ్బ గొట్టటంద్వారా అణచివేయటానికి ప్రయత్నించింది. అక్కడ విప్లవోద్య మాన్ని పెంపొందించటానికిగల అవకాశాలను, దాన్నిచూసి దేశంలోనిమిగతా ప్రాంతాల ప్రజలు ఉత్తేజపడి అనుసరించే అవకాశాలను వమ్ముచేయడానికి అది ప్రయత్నించింది

ఆ పరిస్థితుల్లో, మనపార్టీ అనుసరించిన ఒంటెత్తు విధానాలు పార్టీని ప్రజలనుండి మరింత వేరుపరచడానికే సహాయపడ్డాయి. అందువల్ల తెలంగాణా వుద్యమానికి అండగా, నిజమైన సంఘీభావ చర్యలను నిర్వహించటం సాధ్యపడ లేదు. భారత సైన్యం హైదరాబాదు సంస్థానంలో జోక్యం కల్పించుకునే టప్పటికి పార్టీ ఏకాకిగానే పోరాడవలసి వచ్చింది. మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో మాత్రమే పార్టీ, ప్రజలూ తెలంగాణా పోరాటానికి వెనుక తట్టు ప్రాంతంగా నిలవగలిగారు. అయితే కాంగ్రెస్ ప్రభుత్వం ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని అంతంజేయటానికి దుర్మార్గమైన దాడిని ప్రారంభించింది. మొట్టమొదటి దాడి 1947 ప్రథమార్థ భాగంలోను, రెండవ దాడి 1948 జనవరి ప్రారంభం నుండీ 1951 మధ్య భాగం వరకూ సాగాయి. 1949 అక్టోబరు ప్రారంభంనుండి ప్రభుత్వం, వ్యక్తులుగాకూడా కమ్యూనిస్టులను నిర్మూలన జేయటం ప్రారంభించింది. మూడువందలమంది కమ్యూనిస్టు నాయకు లను, కార్యకర్తలను అరెస్టుచేసి, పనిగట్టుకొని హత్యగావించింది.

తెలంగాణా ఉద్యమానికి వెనుకతట్టు ప్రాంతంగావుండి అండదండలను చేకూర్చిన ఆంధ్రప్రాంతంలో పార్టీ, ప్రజాతంత్ర వుద్యమమూ సాగించిన పోరాటాన్నిగూర్చి క్లుప్తంగానైనా ప్రస్తావించకపోతే తెలంగాణాగాధ సమగ్రం కాజాలదు. భవిష్యత్తులోనైనా విప్లవోద్యమ అభివృద్ధికి తగిన గుణపాఠాలను తీసుకోవటం సాధ్యం కాదు.

అందువలన ఆంధ్ర ప్రాంతంలోని ఉద్యమాన్నిగూర్చి దిగువన క్లుప్తంగా వివరించుతున్నాం

## అధ్యాయం : 5

# ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం :

# 1948-51 మధ్య బీభత్సపాలన

### చారిత్రక పూర్వరంగం

ఆంధ్ర, తెలంగాణాకు సరసనే ఆనుకునివున్న ప్రాంతం. ఇప్పుడు అంటే 1971 లో, అందులో 12 జిల్లాలున్నాయి మూడు కోట్ల జనాభావుంది. ఆంధ్ర ప్రాంతంలోని ఆ 12 జిల్లాలనూ సర్కారు లేదా కోస్తా జిల్లాలు (8) రాయలసీమ జిల్లాలు (4) గా విభజించవచ్చు తొమ్మిదితెలంగాణాజిల్లాలూఅవీ కలిసి నేడుఆంధ్రప్రదేశ్ లో వున్నాయి. ఇప్పుడు రాష్ట్ర సరిహద్దులు. తూర్పున సముద్రతీరం; దక్షిణాన-తమిళనాడు; పశ్చిమాన-కర్నాటక, ఉత్తరాన మహా రాష్ట్ర; ఈశాన్యాన-మధ్యప్రదేశ్ లోని బస్తర్ప్రాంతం, ఒరిస్సా రాష్ట్రం.

ఆంధ్రలో ప్రధానంగా రైతాంగ ఆర్థిక వ్యవస్థ వుంది. కోస్తా జిల్లాలలో అనేక ప్రాజెక్టులు, యితర నీటి పారుదల సౌకర్యాలూ వుండటంవలన అవి ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా మిగతా ప్రాంతంకంటే అభివృద్ధి చెంది వున్నాయి. రాయలసీమ జిల్లాలు, వ్యవసాయంలో వెనుకబడి, పెద్ద ప్రాజెక్టు లేవీలేక, ఫ్యూడల్ సంబంధాల ఆధిపత్యం, పీడన అధికంగా వుండి, అన్నివిధాలా వెనుకబడి వున్నాయి. విశాఖజిల్లాలో తప్ప ఆంధ్ర ప్రాంతంలో దాదాపుగా పెద్ద పరిశ్రమలేవీ లేవు. విశాఖ పట్టణంవద్ద సింధియాల యాజ

మాన్యాన నౌకా నిర్మాణ కేంద్రం, పాశ్చాత్యుల యాజమాన్యాన రెండు జూట్ మిల్లులూ వున్నాయి అవిగాక మొత్తం ఆంధ్ర ప్రాంతంలోవున్న రైల్వే లింకొక పరిశ్రమ. మిగతా కార్మికవర్గమంతా, తన జీవనోపాధికిగాను, పొగాకు, అభ్రకం గనులు, ఫౌండ్రీలు, బియ్యం, నూలు మిల్లులు మొదలైన చిన్న పరిశ్రమలమీదనే ఆధారపడి వుంది. మొత్తం జనాభాలో నూరింట తొంభైమంది గ్రామాలలో, వ్యవసాయంపైనే ఆధారపడి జీవిస్తున్నారు.

## కమ్యూనిస్టు పార్టీ

ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ అధికార పూర్వకంగా, 1934 సెప్టెంబరులో నెలకొల్పబడింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం పెంపొందటమంటే సామ్రాజ్యవాదులకు హడల్. అందువల్ల పార్టీ శాఖలు ఆంధ్రలో ఏర్పాటు జేయకముందే, 1934 లోనే పార్టీని నిషేధించారు.

కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సంస్థలో పనిజేస్తూనే, గ్రామాలలోని వ్యవసాయ కార్మికుల, పేదరైతుల డిమాండ్లపైన, పట్టణాలలోని కార్మికుల డిమాండ్లపైన ఆందోళనలు నిర్వహించేవారు. గణనీయమైన మేరకు, వారిలో స్వతంత్ర పునాది నిర్మించుకోగలిగారు.

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ పరిస్థితి వొత్తిడి ఫలితంగా, సామ్రాజ్యవాదులు 1942 లో కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించారు. ఇక దానితో కమ్యూనిస్టులు బహిరంగంగానే పనిచేయటం ప్రారంభించారు. సరాసరిన వారు ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాటంలో దుమికారు. కాంగ్రెస్ నాయకుల విడుదలకోసం, జాతీయ ప్రభుత్వ నిర్మాణం కోసం నిరంతర ఆందోళన సాగిస్తూనే, వారు ప్రజల దైనందిన సమస్యలు తీసుకుని పనిచేసేవారు. వ్యవసాయ పరికరాల సరఫరా, చెరువుల, కాలవల మరమ్మత్తు వంటి సమస్యలపైన, బ్లాక్ మార్కెట్ కు వ్యతిరేకంగా, ధరల కంట్రోలు ఖచ్చితంగా అమలు జరపాలని కోరుతూ, అక్రమ నిల్వలకు వ్యతిరేకంగా, అవినీతికి వ్యతిరేకంగా ఆందోళనలు సాగించారు. రాయబారాలు నడిపారు. ప్రదర్శనలు నిర్వహించారు. సభలు జరిపారు. వారు అనేక, వ్యవసాయ కార్మిక పోరాటాలకు, "అధికాహారోత్పత్తి" వుద్యమానికి నాయకత్వం వహించారు. కార్మికవర్గపు డిమాండ్లకు అండగా పట్టణాలలో విస్తృత ప్రాతిపదికపై ప్రజలను సమీకరించారు. కార్మికుల సమ్మెలను కొన్నింటిని పార్టీ జయప్రదంగా నిర్వహించగలిగింది. కమ్యూనిస్టు వాలంటీర్లు అనేక పట్టణాలలో బ్లాక్ మార్కెట్ దార్ల అక్రమనిల్వలను బయటకు తీయగలిగారు. వాటిని ప్రజలకు పంచునట్లుగా ప్రభుత్వంపై వొత్తిడి చేయగలిగారు.

కష్టజీవులలోని ప్రతిసెక్షనుకు జెందిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమస్యలపైన కమ్యూనిస్టులు పోరాడారు. రైతులు పండించిన పంటకు న్యాయమైన ధర చెల్లించాలనీ, వారికి వ్యవసాయ పరికరాలు, ఎరువులు సరఫరా చేయాలని ఆందోళన సాగించారు. జీవితావసరవస్తువులన్నింటినీ కంట్రోలు ధరకు సరఫరా చేయాలని, వేతనాలు పెంచాలని మొదలుగాగల కార్మికుల డిమాండ్ల కోసం ఆందోళన చేశారు. తెల్ల కాగితాలు, కిరోసిన్‌నూనె కంట్రోలు ధరకు సరఫరా చేయాలని, డిటెన్షన్ విధానం రద్దుచేయాలని, విద్యాలయాలలో టిఫిన్‌షెడ్లు, విశ్రాంతి గదులవంటి సౌకర్యాలేర్పాటు జేయాలని కోరే విద్యార్థుల డిమాండ్లపైన, గ్రామాలలో ప్రత్యేక ప్రజారోగ్య వసతులు కల్పించాలని, ప్రసూతి, శిశు సంక్షేమకేంద్రాలు ఏర్పాటు చేయాలని, బాల్యవివాహ నిషేధచట్టాన్ని ఖచ్చితంగా అమలు జరపాలని, విద్యాసౌకర్యాలేర్పాటు జేయాలని, సమాన హక్కులు కావాలని కోరే మహిళల డిమాండ్లపైన, అధికమైన ఇంటి అద్దెరేట్లకు వ్యతిరేకంగా, ఇండ్లకొరతకు వ్యతిరేకంగా మధ్యతరగతుల డిమాండ్లపైన కమ్యూనిస్టులు నిరంతరాందోళన సాగించారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఎప్పుడు, ఎక్కడ ప్రజలు కష్టాలలో వున్నాసరే ఎర్రజెండా భుజానవేసుకున్న కమ్యూనిస్టు అక్కడ ప్రత్యక్షమయ్యేవాడు. ఆ రోజులలో అది సర్వసాధారణ దృశ్యం.

ఈ ఉద్యమాలన్నింటి సందర్భంగానూ, ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడటమనే ప్రధాన రాజకీయ కర్తవ్యాన్నిగూర్చి ప్రజలకు పార్టీ ప్రత్యేకంగా నొక్కిజెప్పటం జరిగింది. సోవియట్ యూనియన్ సాధించిన విజయాలనుగూర్చి విస్తృతంగా ప్రచారం చేసేవారు. కాంగ్రెసు నాయకుల విడుదల కోసం నిర్విరామంగా ఆందోళన సాగించినందుకుగాను ప్రభుత్వం మన ముఖ్య కార్యకర్తలను పెద్దసంఖ్యలో ఈ దశఅంతటా జైళ్ళలో నిర్బంధించింది.

ప్రజాసమస్యలపై నిరంతర, నిర్విరామ కృషిచేయటం, కష్టసుఖాలలో ప్రజలతో సన్నిహిత సంబంధాలు కలిగివుండటం కారణంగానే 1944 లో బెజవాడలో జరిగిన అఖిలభారత కిసాన్‌సభ మహాసభ సందర్భంగా కమ్యూనిస్టులు లక్షమంది ప్రజలను సమీకరించగలిగారు ఆ మరుసటి సంవత్సరం తెనాలిలో రాష్ట్ర రైతు మహాసభకు యాభైవేలమందిని సమీకరించగలిగారు.

కమ్యూనిస్టుల కార్యకలాపాలు అంతకంతకూ అధికమవుతుండటం, కమ్యూనిస్టుల పలుకుబడి పెంపొందుతుండటం – అప్పుడే జైళ్ళనుండి బయటికొచ్చిన కాంగ్రెస్ నాయకులకు, ప్రధానంగా ఉదార భూస్వామ్యవర్గాలకు జెందిన నాయకులకు మింగుడుపడలేదు. కమ్యూనిస్టులను ఈ విధంగానే పెరగనిస్తే వర్గదోపిడితోగూడిన తమ సాంఘిక వ్యవస్థ అంతమవుతుందని వారు

గ్రహించసారంభించారు. అందువల్ల అఖిలభారత కాంగ్రెస్ నాయకులగు డాక్టర్ పట్టాభిసీతారామయ్య, యన్. జి. రంగాల బహిరంగ ప్రోత్సాహ ప్రోద్బలాలతో పార్టీ కార్యకలాపాలపై కాంగ్రెసువారు దాడులు జరిపారు. వ్యక్తిగతంగా పార్టీ సభ్యులపైనా, ముఖ్య నాయకులపైనా దాడులు జరిగాయి. పార్టీ ఏర్పాటుచేసిన సభలను చెదరగొట్టేవారు. ఈ గూండాదాడుల వెనుక గల ప్రమాదాన్ని కమ్యూనిస్టుపార్టీ పసికట్టి, ఆత్మరక్షణకోసం ప్రజావాలంటీర్ బ్రిగేడును ఏర్పాటుజేసింది. "ప్రజలను సంరక్షించండి", "గూండాలను తిప్పి కొట్టండి", "అభివృద్ధినిరోధక కాంగ్రెసును బట్టబయలు జేయండి" అనే నినాదాలతో కృషిచేసింది. కమ్యూనిస్టు వ్యతిరేక విద్వేషియగు రంగా నాయకత్వాన కృష్ణా, గుంటూరు జిల్లాలలో పార్టీ సభలపైన, ప్రజాసభలపైనా దాడులు జరిగాయి. వాళ్లు భగ్నంచేయాలని ప్రయత్నించని సభగాని, వూరేగింపుగాని, సాంస్కృతిక ప్రదర్శనగాని ఒక్కటైనాలేదు. అయితే, ఈ ప్రమాదాన్నిగూర్చి సకాలంలో పసికట్టి, తక్షణ సమీకరణలు, ఆత్మరక్షణచర్యలు గైకొన్న ఫలితంగా ప్రతిచోటా వాళ్ళను తరిమివేయటం జరిగేది. పార్టీ కాపాడబడింది. విప్లవోద్యమం సంరక్షించబడింది. ఇంకా విస్తరించబడింది.

## ఎన్నికలు - ఆ తర్వాత

నాజీ జర్మనీ ఫాసిస్టు జపాన్ల పరాజయంతో రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. భారతదేశంలో కార్మికవర్గం పెంపొందనారంభించింది. బ్రహ్మాండమైన ప్రజావెల్లువ, బృహత్తరమైన సమ్మెలు పరంపరగా సాగాయి. భారత జాతీయ సైన్యం ప్రదర్శనలు జరిగాయి. భారత నావికులు తిరుగుబాటుచేశారు. అఖిల భారత తపాలా కార్మికుల సమ్మె వగైరా జరిగాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, వాటిని తమ వలస పాలనకొక సవాలుగా పరిగణించారు. విప్లవ పంథానుండి ప్రజలదృష్టిని మరల్చడంకోసం, రాష్ట్ర శాసన సభలకు ఎన్నికలు జరుపుతామని ప్రకటించారు.

ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ 35 మంది అభ్యర్థులను నిలబెట్టింది. అంటే మొత్తం నియోజకవర్గాలలో సగం స్థానాలకు పోటీ చేసింది. "*దున్నేవానికే భూమి*" "*భారత ప్రజారాజ్యంలో విశాలాంధ్ర*" అనే రెండు ప్రధాన నినాదాలతో ఆ ఎన్నికలలో పార్టీ పాల్గొన్నది. కమ్యూనిస్టు ఎన్నికల ప్రచారాన్ని భగ్నంచేయటానికి గూండాలు విచ్చలవిడిగా ప్రయోగించబడ్డారు. కాంగ్రెస్ – జస్టిస్‌పార్టీ – జమీందార్ కూటమి వోట్లు కొనటంకోసం సర్వత్రా డబ్బు వెదజల్లింది. వోటర్లను భయపెట్టటంకోసం, వాళ్ళు సిగ్గువిడిచి పోలీ

సుల, గూండాల తోడ్పాటు పొందారు అయితే, కమ్యూనిస్టుపార్టీ ప్రజా వాలంటీర్ బ్రిగేడ్‌కు జెందిన వాలంటీర్లను సమీకరించింది. కాంగ్రెసు వాలంటీర్లను, గూండాలను తట్టుకొని నిలవగలిగింది.

ఆంధ్రలో కాంగ్రెసు తర్వాత అతి పెద్దపార్టీ, అత్యధిక పలుకుబడి గలపార్టీ కమ్యూనిస్టుపార్టీ అని ఎన్నికల ఫలితాలు విదితం జేశాయి. పార్టీకి మొత్తం రెండున్నర లక్షల ఓట్లు లభించాయి కమ్యూనిస్టులు పోటీచేసిన నియోజకవర్గాలలో పోలైన మొత్తం ఓట్లలో నూరింట 22 వోట్లు కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థులకు వచ్చాయి. బలమైన కేంద్రాలైన కృష్ణా, గుంటూరు జిల్లాలలో మొత్తం పోలైనవోట్లలో వరుసగా 35 శాతం, 25 శాతం ఓట్లు కమ్యూనిస్టుపార్టీకి లభించాయి. ఆనాడు, భారతదేశంలో వోటింగుహక్కు మొత్తం ప్రజలలో నూరింట 13 మందికిమాత్రమే పరిమితమైవుంది. కమ్యూనిస్టులకు అండగావుండే అశేష కష్టజీవి జనసామాన్యానికి వోటుహక్కు లేదు. ఈ కారణంగా తమ విజయంతో వున్మత్తులు కావలదని, ఉదాసీనతకు తావు లేదని, కమ్యూనిస్టులకు వచ్చిన ఓట్లకుగల ప్రమాదకరప్రాధాన్యతను గమనించ వలసిందనీ కాంగ్రెసువాదులకు హెచ్చరికజేస్తూ డాక్టర్ పట్టాభిసీతారామయ్య ప్రకటన చేశాడంటే ఆశ్చర్యంలేదు.

మొత్తం పరిస్థితిఅంతా అగ్నిపర్వతంలాగా బ్రద్దలవటానికి సిద్ధంగా వున్న సమయంలో కాంగ్రెసు మంత్రివర్గాలు అధికారం చేపట్టాయి యుద్ధానంతర సంక్షోభం తీవ్రతరమైంది. నిత్యజీవితావసర వస్తువుల ధరలు చుక్కలంటేలా పెరిగాయి. నిరుద్యోగుల సంఖ్య అంతకంతకూ అధికమవుతోంది. యుద్ధకాలంలో, ప్రజలను పీల్చి పిప్పిజేసి అధికలాభాల నార్జించిన బ్లాక్ మార్కెట్ వ్యాపారస్థులు, పెట్టుబడిదారులు, భూస్వాములు – అత్యంత దుర్భర పరిస్థితులకు లోనై, తమ న్యాయమైన కోర్కెల సాధనకై ఆందోళన జేస్తున్న కార్మికుల, వ్యవసాయ కార్మికులపట్ల ఎలాంటి శ్రద్ధ తీసుకోవటానికి యిచ్చగించటంలేదు.

ఆంధ్రలో, గ్రామాలలోను పట్టణాలలోనూ సమ్మెలు వెల్లువగా వ్యాపివేశాయి. వందలాది గ్రామాలలో వ్యవసాయ కార్మికులు, పాలేర్లు తమ రోజువారీ వేతనాలను, వార్షిక వేతనాలను పెంచవలసిందిగా కోరుతూ, ధాన్యంరూపంలో యిచ్చే వేతనాలను సరైన కొలతలతో యివ్వాలని, సెలవులు కావాలని, నిర్ణీత పనిగంట లుండాలని కోరుతూ సమ్మెలు చేశారు. మునగాల, చల్లపల్లి జమీలలో రైతులు జమీందారీ భూములను ఆక్రమించుకున్నారు. నిర్బంధకాండ నెదిరించి పోరాడ నారంభించారు.

కాంగ్రెస్ మంత్రివర్గాలు అధికారంలో కొచ్చిన మరుసటి రోజునే ప్రారంభమైన పదివేలమంది పొగాకు కార్మికుల సమ్మె, పందలపాక జవుళి కార్మికులు వెయ్యిమంది సమ్మె, రాజమండ్రిలో లాగుడు బండ్ల వారి సమ్మె, చుట్టల కార్మికులు, ఇతర రంగాలకు చెందిన అనేకమంది యితర కార్మికుల సమ్మెలు తమ కనీస కోర్కెల సాధనకై జరిగాయి. నెలకు రు 4-72 లు మాత్రమే చెల్లించబడుతున్న 20 వేల మంది మ్యునిసిపల్ కార్మికుల రాష్ట్ర వ్యాపిత సమ్మె వీటన్నింటిలోకీ ప్రాధాన్యత గలది.

పైన పేర్కొన్న అన్ని సమ్మెలు, ప్రత్యేకించి మ్యునిసిపల్ కార్మికుల సమ్మె కాంగ్రెసు "ప్రజా ప్రభుత్వపు" నిజ స్వరూపాన్ని బట్టబయలుజేశాయి. కార్మికులయొక్క అత్యంత ప్రాథమికమైన, కనీస కోర్కెలను అంగీకరించ టానికి మారుగా, కాంగ్రెసు పాలకులు, తమకు ముందు పాలకులగు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల అడుగుజాడల్లో నడుస్తూ తమ పోలీసు బలగాన్ని ప్రయో గించారు. 144 వ సెక్షను క్రింద విధి నిషేధాలు ప్రకటించారు. లాఠీచార్జి జరిపించారు. అనేకమంది సమరశీల కార్మికులను అరెస్టు చేశారు. ఆంధ్రలో కాంగ్రెస్ నాయకులలోకెల్లా పెద్దవారు సమ్మె విచ్ఛిన్నకులుగా ముందుకొచ్చి రోడ్లను వూడ్చారు "మేము అధికారంలోకొచ్చి నాలుగు మాసాలు మాత్రమే అయింది" అని కాంగ్రెస్ ప్రభుత్వం వాదించింది. "మీ స్వంత జీతాలను రు 500 ల నుండి రు 1500 లకు పెంచుకొనటానికి మీకు వ్యవధి, డబ్బూ లభిం చాయి. కాని, మాకు కొలది రూపాయలు పెంచటానికి మాత్రం మీకు వ్యవధి, డబ్బు రెండూ కరువైనాయా?" అని కార్మికులు ఎదురు ప్రశ్నించారు. కొన్ని కొన్ని సందర్భాలలో, మ్యునిసిపల్ కార్మికుల సమ్మెలు ఏ స్థాయికి పోయా యంటే, వారు సమ్మె విచ్ఛిన్నకులైన దొంగ కార్మికులతోను, కాంగ్రెస్ వాలంటీర్లతోను రాజమండ్రి వంటి చోట్ల ఘర్షణ పడవలసి వచ్చింది.

మొట్టమొదటి ఆరు మాసాలలోనే, కాంగ్రెస్ "ప్రజాప్రభుత్వం" యొక్క దుష్టచరిత్ర బయటపడింది! కష్టజీవుల కోర్కెలను అంగీకరించటానికి, కాంగ్రెస్ ప్రభుత్వం ఈ విధంగా మొండిగా నిరాకరించటానికి, పాశవిక నిర్బంధకాండకు పాల్పడటానికి కారణ మేమిటి? తమ వర్గ ప్రయోజనాలు, వర్గ విప్లవాన్నిగూర్చి పెంపొందుతున్న భయంమాత్రమే అందుకు కారణం.

పైన పేర్కొన్న పోరాటాలు, ఆంధ్రరాష్ట్ర ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ పతాకంక్రింద నిర్వహించబడ్డాయి. ఆంధ్ర అంతటా వ్యాపించి వున్న కార్మికసంస్థ అదొక్కటే. కమ్యూనిస్టుపార్టీ దానికి నాయకత్వం

వహించింది. పెంపొందుతున్న విప్లవ శక్తులనుగాంచి కాంగ్రెస్ నాయకులు భయపడసాగారు అయితే, 1946 వ సంవత్సరం చివరినాటికి కమ్యూనిస్టు పార్టీ పరిస్థితి ఏమిటి ?

ప్రజానీకంలో సాగించిన సర్వతోముఖమైన కృషిఫలితంగా, బస్తీల లోని పేదప్రజానీకంలోను, గ్రామీణ కష్టజీవులలోను విస్తారమైన భాగాన్ని పార్టీ తనవైపుకు రాబట్టుకో గలిగింది 1934 లో స్థాపించబడిన నాటినుండీ కమ్యూనిస్టుపార్టీ వారి హక్కుల కోసమే పోరాడుతూవచ్చింది. ఎన్నికలలో కాంగ్రెస్‌తో ముఖాముఖిని తలపడి పోటీజేసి రెండున్నర లక్షల వోట్లు సంపాదించగలిగింది.

కార్మికులు, వ్యవసాయ కార్మికులు, రైతులు, విద్యార్థులు యువ జనులు, మహిళలకోసం, పార్టీ వేర్వేరుగా వర్గసంఘాలను, ప్రజాసంఘాలను నిర్మించింది. వారి హక్కులకోసం ముందు నిలిచింది తమ హక్కులను గట్టిగా కాపాడగలిగేది కమ్యూనిస్టుపార్టీ మాత్రమేనని, అధికారంలోవున్న కాంగ్రెస్ కాదని ప్రజలు గుర్తించేట్లు చేసింది ప్రజలలోగల ఈ భావం "భవిష్యత్తు మాదే!" అనే మాటలలో వ్యక్తమయింది వర్గశత్రువుకూడా, ఈ వాస్తవాన్ని గమనించలేకపోలేదు.

అత్యవసర ఆర్థిక సమస్యలపై రోజువారీ పోరాటాలు నడపటంద్వారా పార్టీ కష్టజీవుల హక్కులను సంరక్షించే మొనగాడుగా ముందుకొచ్చింది. అన్ని అన్యాయాలకు వ్యతిరేకంగా, అసమానత్వానికి వ్యతిరేకంగా, ప్రాథమిక హక్కుల అణచివేతకు వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ నిలిచింది. గ్రామాలలో పార్టీ పలుకుబడి ఎంతఅధికంగా వున్నదంటే ఆర్థికకోర్కెల విషయంలోనే గాక, కిరోసిన్ లేదా బియ్యంరేషన్ కార్డులు, అదనపు మునిసిపల్ పన్నులు, కొన్ని సాంఘిక అన్యాయాలు మొదలుగాగల ప్రతిచిన్న విషయానికి ప్రజలు పార్టీ కార్యాలయానికి పరుగెత్తుకెళ్ళి, తమ సమస్యలను పరిష్కరించుకొనవలెనుకొంటూండేవారు.

సాంఘిక రంగంలో పార్టీ అంటరానితనమనే అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడింది. పార్టీసభ్యులు అస్పృశ్యులతోకలిసి భోజనాలు చేసేవారు. వారిమధ్యనే తమ జీవితాన్ని గడిపేవారు. వారి కష్ట, సుఖాలలో పాలు పంచుకునేవారు. అంతేకాదు, వర్గపోరాటంయొక్క స్వభావమే ఎలాంటిదంటే అది ఒకే జెండానీడన అస్పృశ్యులనూ, స్పృశ్యులనుకూడా ఏకంజేసింది. వివాహ తతంగాలు సరళం చేయబడ్డాయి. పురోహితులకు, మంత్రాలకు స్వస్తిజెప్ప బడింది. వితంతు వివాహాలు, వర్ణాంతర వివాహాలు విస్తారంగా ప్రచారంలో

పెట్టబడినాయి. పార్టీసభ్యులు సర్వదా అలాంటి విషయాలలో ముందుపీటీన నిలచేవారు. స్త్రీ, పురుష సమానత్వం కావాలని పార్టీ సదా ప్రచారం చేస్తూ వుండేది.

నూతన సంస్కృతి ప్రవేశపెట్టబడింది. పట్టణాలకు, గ్రామాలకు జెందిన యువజనులు నూతన కార్యకలాపాలలో పాల్గొనేవారు. ఆంధ్ర యువజన ఫెడరేషన్ పతాకంకింద వారు సమీకరించబడ్డారు. అలాంటి సంస్థ అదొక్కటే. వారు ఆటపాటలలో పాల్గొంటూవుండేవారు. జాతీయపండుగల సందర్భంగా వార్షిక ఆటలపోటీలను నిర్వహించేవారు వాలంటీరు దళాలలో చేరేవారు. లాఠీలుపయోగించటంలో శిక్షణ పొందారు. నాటకం, బుర్రకథ దళాలలోపాల్గొనేవారు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగాపోరాడేచైతన్యాన్ని సంతరించుకున్నారు. కమ్యూనిస్టుపార్టీపేరు, గ్రామాలలోని మంచియువకు లందరికీ మారుపేరుగా తయారైంది ఇండ్లలోని కొందరు వృద్ధులు సయితం, తమ కొడుకులను, మనుమలను యువజనసంఘంలో చేరవలసిందిగా ప్రోత్స హించేవారు. తద్వారా వారు ఉత్తమపౌరులుగా తర్ఫీదుపొంది, క్రమశిక్షణ పొందగలరని వారు విశ్వసించేవారు.

బుర్రకథ, వీధిభాగవతంవంటి అంతరించిపోతున్న కళారూపాలను కమ్యూనిస్టుపార్టీ పునరుద్ధరించింది. వాటిద్వారా జనసామాన్యానికి తనవాణిని వినిపించింది. ఆంధ్రఅంతటా వందలాది దళాలు, నాటకసమాజాలు ఏర్పడి పని జేశాయి. ఈ సాంస్కృతికరూపాలు, కథలూద్వారా రైతుల జీవితాలను, జాతీయవీరుల జీవితగాథలను, ఆంధ్రప్రజల సమరశీల పోరాటాలను, సోవి యట్ గెరిల్లాల వీరగాథలను ప్రచారంచేయటం జరిగింది. సాంస్కృతిక ప్రదర్శనలకు మూడువేలనుండి పదివేలమంది ప్రజలవరకూ హాజరవుతుండే వారు మధ్యతరగతి ప్రజలు, మేధావివర్గానికిజెందినవారు, సినిమాచూడటం కంటే, బుర్రకథవినటానికే మొగ్గుచూపిన సందర్భాలనేకమున్నాయి ఇది ప్రజల అభిరుచుల నెంతగా మార్పుజేసిందంటే నాటకాలాడటమే వృత్తిగా గలవారు, ఈ మార్పును తామూ అనుసరించవలసివచ్చింది. తమ మత సంబంధమైన, "నీతిబోధసంబంధమైన" ప్రదర్శనలను కొంతవరను వదలివేయ వలసివచ్చింది.

అసంఖ్యాకమైన బహిరంగసభలద్వారా, కమ్యూనిస్టుపార్టీ పత్రిక "ప్రజాశక్తి" ద్వారా రైతులలో రాజకీయ చైతన్యం పెంపొందించ బడింది. సోషలిజానికి స్థావరమగు సోవియట్ యూనియన్‌నుగూర్చి, చైనా ప్రజల వీరోచిత పోరాటాలనుగూర్చి వారు బాగా తెలుసుకోగలిగారు. రాజకీయాలు, మార్క్సిస్టు సిద్ధాంతం, వివిధ దేశాల చరిత్రలు, సాహిత్యం,

శాస్త్రవిజ్ఞానం, అర్ధికశాస్త్రం మొదలైన వివిధ విషయాలపైన, చిన్నకథలు, నాటికాలు, బుర్రకథలు మొదలైన దాదాపు మూడువందల గ్రంథాలు "ప్రజాశక్తి ప్రచురణాలయం" తరఫున ప్రచురించబడినాయి అప్పటివరకు అంత కృషిని మరే యితర సంస్థా చేయలేదు. దేశాన్ని, ప్రజలను కలవర పరుస్తున్న ప్రతి సమస్యపైన, అంతర్జాతీయ రంగంలో సంభవించిన ప్రతి ప్రధాన సంఘటనపైనా, ప్రజాశక్తి ప్రచురణాలయం కరపత్రాలు ప్రచు రించింది ప్రజలకునిరంతరంఆయా సంఘటనలవివరాలను 'ప్రజాశక్తి' అందజేస్తూ వుండేది.ఆ విధంగాసామాన్య ప్రజలరాజకీయస్థాయిని బాగా పెంపొందించింది

1945-46 లో కమ్యూనిస్టుపార్టీ, వివిధ ప్రజాసంఘాల సభ్యత్వానికి సంబంధించిన దిగువ సంఖ్యా వివరాలు, అవి ఏ విధంగా పెంపొందింది అర్థం చేసుకోవటానికి దోహదపడతాయి .

| | | |
|---|---|---|
| | కమ్యూనిస్టుపార్టీ | 20,000 (2000గ్రామాల్లో) |
| ఆంధ్రరాష్ట్ర | రైతుసంఘం | 1,75,000 |
| " | వ్యవసాయకార్మిక సంఘం | 60,000 |
| " | విద్యార్థి ఫెడరేషన్ | 12,000 |
| " | యువజన ఫెడరేషన్ | 50,000 |
| " | మహిళాసంఘం | 20,000 |
| " | ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ | 30,000 |

కొన్ని సంస్కరణవాదలోపాలు జరిగినప్పటికీ, సంస్కరణవాద రాజకీయాలనవలంబించినప్పటికీ ఆంధ్రలోకమ్యూనిస్టుపార్టీ విస్తృతమైన ప్రజా పునాదిగల పార్టీగా రూపొందింది. కష్టజీవుల తరఫున నిలిచే పార్టీగా ముందు కొచ్చింది. కార్మికులకు తిరుగులేని నాయకుడుగా రూపొందింది. విప్లవరైతు ఉద్యమ నిర్మాతగా, సాంఘిక న్యాయంకోసం గట్టి పోరాటం జరిపేదిగా, ఆంధ్రలో నూతన సంస్కృతికి ఆశాజ్యోతిగా పార్టీ రూపొందింది.

కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి, ప్రజాపునాది ఈ విధంగా విస్తరించ టమే, అధికారంలోవున్న కాంగ్రెస్ నాయకులకు కంపరమెత్తించింది. పార్టీ పెరుగుదలలో, తమ వర్గ దోపిడీకి ఆసన్నం కానున్న అంత్యకాలాన్ని వారు చూశారు. కమ్యూనిస్టుపార్టీ పతాకంక్రింద అంతకంతకు ఎక్కువగా ప్రజలు సమీకృతులవుతుండటాన్ని, తమ స్వంత పునాది కుంచించుకుపోవటాన్ని వారు గమనించారు. తమ దోపిడీ పాలనను, తమ డబ్బు సంచులను, తమను

గట్టిగా బలపరిచే జమీందార్లను, భూస్వాములను కాపాడుకోగలందులకై కాంగ్రెస్ ప్రభుత్వం పిచ్చికుక్కవలె, ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీమీద విరుచుకుపడింది.

## దుష్టశాసనం జారీ -
## నిర్బంధకాండ ప్రారంభం

అప్పుడు మద్రాసు రాష్ట్రంలో అధికారంలోవున్న ప్రకాశం మంత్రివర్గం జనవరి 26 న స్వాతంత్రదినం జరుపుకోనుండగా, 1947 జనవరి 22 న 'ప్రజాభద్రత ఆర్డినెన్సు'గా పేరుబొందిన "పబ్లిక్ సేఫ్టీ (ప్రకాశం) ఆర్డినెన్సు జారీ జేసింది. దానిక్రింద, ఎలాంటి కారణంలేకుండా, విచారణలేకుండా అనేక వందలమందిని అరెస్టుచేసినిర్బంధించారు. కమ్యూనిస్టుపార్టీ, ట్రేడ్‌యూనియన్, కిసాన్‌సభ కార్యాలయాలపై దాడులుజేసి, రికార్డులను స్వాధీనంచేసుకొన్నారు

కాంగ్రెసు ప్రభుత్వం అభాండాలు వేసినట్లుగా, బలప్రయోగం ద్వారా ప్రభుత్వాన్ని కూలదోయటానికి కమ్యూనిస్టుపార్టీ సన్నాహాలు జేయటంలేదు, ఏవిధమైన హింసాకాండ సాగించడమూలేదు-అనే విషయాన్ని దృష్టిలో వుంచుకొనటం అవసరం. పార్టీ చేస్తూవున్నదల్లా, కార్మికుల, వ్యవసాయ కార్మికుల, పేదరైతుల దైనందిన ప్రయోజనాలకోసం నిలబడటమే. వారి న్యాయమైన కోర్కెల సాధనకై పోరాటాలను పార్టీ నడుపుతోంది. బూర్జువా- పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో సయితం అది ప్రజల ప్రాథమిక హక్కు. ఈ "నేరానికే" కాంగ్రెస్ మంత్రివర్గం ఈ దుష్టశాసనం తెచ్చి దాడి జేసింది. ఆవిధంగా కమ్యూనిస్టులపైన, ప్రజలపైన అకారణంగా దాడి ప్రారంభించింది కాంగ్రెస్ ప్రభుత్వమే. ఆ తర్వాత ప్రభుత్వం సిగ్గువిడిచి ప్రచారం జేసినట్లు, దాడి ప్రారంభించింది కమ్యూనిస్టులు కాదు.

ప్రజల, పార్టీల ప్రాథమిక హక్కులపై ఈ దుర్మార్గపుదాడిని ప్రజాతంత్ర శ్రామిక ప్రజానీకం సహించలేకపోయింది తమ నాయకులను బేషరతుగా విడుదల చేయవలసిందిగా కోరుతూ, రాజమండ్రిలో పదివేల మంది కార్మికులు ఒకరోజు సమ్మెజేశారు. బిట్రగుంట, తదితర కేంద్రాలలో రైల్వే కార్మికులు కూడా పనులు మానివేశారు. బెజవాడ, గుంటూరు, పందలపాక, విశాఖపట్టణం, చిట్టివలసల కార్మికులు, రైతుసంఘం, వ్యవసాయ కార్మిక సంఘం ప్రభుత్వంయొక్క ఈ నిరంకుశచర్యను తీవ్రంగా ఖండించారు దాన్ని ఉపసంహరించుకోవలసిందిగా డిమాండ్ చేశారు.

తమ నాయకత్వం నిర్బంధించబడినందువల్ల ప్రజలేమీ ధైర్యం కోల్పోలేదు. ఆర్థిక సంక్షోభం, కాంగ్రెస్ ప్రభుత్వపు పెట్టుబడిదారీ అనుకూల,

భూస్వామ్య అనుకూల విధానాలు, ప్రశాంతంగావున్న ప్రజలపై నిర్బంధ కాండను వుధృతం జేయటం ఫలితంగా వారు మరింత భీషణ పోరాటాలు సాగించవలసి వచ్చింది.

కృష్ణాజిల్లా, దివి తాలూకా గాజుల్లంకలో రైతులు లంక భూములపై తమ హక్కులను నిలబెట్టుకో నారంభించారు. ఎన్నికల సమయంలో పెద్ద పెద్ద వాగ్దానాలు చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం ఏమి జేసింది? ఎన్నికల అనంతరం అమాంతంగా కాంగ్రెసువాదిగా మారిన, చల్లపల్లి జమీందారు దుర్మార్గానికి వ్యతిరేకంగా అది పేద రైతుల కండగా నిలవలేదు. తన పోలీసు బలగంతో జమీందారుకు అండగా నిలిచింది నిరాయుధులైన రైతులపై కాల్పులు జరిపింది. మహిళానాయకురాలు వియ్యమ్మతోసహా నలుగురిని పొట్టన బెట్టుకుంది. ఇంకా అనేకమందిని గాయపరిచింది. ఈ సందర్భంలోకూడా కాల్పులు ప్రారంభించింది కమ్యూనిస్టు గెరిల్లాలు కాదని, నిరాయుధులైన ప్రజలపై కాల్పులు సాగించింది కాంగ్రెసు ప్రభుత్వమేనని దృష్టిలో వుంచుకోవాలి. సాయుధ దాడిని ప్రారంభించింది కమ్యూనిస్టులు కాదు, కాంగ్రెస్ ప్రభుత్వమే.

పశ్చిమ గోదావరిజిల్లా, బుచ్చంపేటలో గిరిజన రైతులు జమీందారుపై పోరాటం ప్రారంభించారు. పోలీసులొచ్చి, కాల్పులు జరిపి వారిలో నలుగురిని బలిగొన్నారు.

పశ్చిమ గోదావరిజిల్లా, కానూరు, పెండ్యాల తదితర కేంద్రాలలో రైతులు భూస్వాముల, జమీందార్ల పీడన నెదిరించి నిలిచారు రైతులకోర్కెలు ఎంత న్యాయమైనవంటే, తాలూకా కాంగ్రెస్ కమిటీ, జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యులలో కొందరు సయితం వారికి అండగా నిలిచి, ఐక్య కార్యాచరణ సంఘాలు ఏర్పాటు జేశారు. కాంగ్రెస్ ప్రభుత్వం 144 వ సెక్షన్‌క్రింద నిషేధాలు విధించింది రైతులపై లారీలు ప్రయోగించింది భూస్వాములు, ప్రభుత్వమూ జిల్లా అంతటా గూండాలను విచ్చలవిడిగా ప్రయోగించారు. ఈ విధంగా భూస్వామ్య గూండాల స్వైరవిహారం సాగిన ఫలితంగా, జిల్లాలోని మరొక భాగంలోని పెదపాడు గ్రామంలో, పార్టీ సభ్యుడు, సమరశీల రైతుయువకుడునగు రాజారామ్‌మోహన్‌రాయ్ మృతిజెందాడు.

మునగాల, హైదరాబాదు సంస్థానంలో ద్వీపంలాగావున్న ఆంధ్ర ప్రాంతం అది సాంప్రదాయ సిద్ధమైన సమరశీల వ్యావసాయిక వుద్యమానికి స్థావరం. తెలంగాణా రైతుల భూపోరాటంయొక్క ప్రభావంతో అచ్చటి రైతులు నాలుగువేల ఎకరాల జమీందారీ భూములను స్వాధీనం చేసుకున్నారు. పోలీసులొచ్చి కాల్పులు జరిపారు. ఇరువురు మృతిజెందారు ఇతరులనేకమంది గాయపడ్డారు.

కృష్ణాజిల్లా దివి తాలూకా చల్లపల్లి ఎస్టేటులో రైతులు వేలాది ఎకరాల భూమిని ఆక్రమించుకున్నారు. జమీందారుకు అండగా కాంగ్రెస్ పోలీసులు హుటాహుటిని రంగంలోకొచ్చారు. పోరాడుతున్న రైతాంగంపై బీభత్సకాండ సాగించారు. మునగాల, చల్లపల్లి ఎస్టేట్లలో యాభైమందికిపైగా డిటెన్యూలుగా నిర్బంధించబడ్డారు. యింకా అనేక వందలమంది ప్రజలు అరెస్టు చేయబడ్డారు

## స్వాతంత్ర్యం - ఆ తర్వాత

భారతదేశం యిప్పుడు స్వాతంత్ర్యం సాధించుకుంది కాబట్టి ప్రజల పరిస్థితి మెరుగవుతుందని నిరంతరాయంగా ప్రజల చెవులలో మార్మోగేలా ప్రచారం జరిగింది కాని, ఈ స్వాతంత్ర్యంయొక్క నిజమైన వర్గస్వభావ మేమిటో కష్టజీవులు తెలుసుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి పెరుగుతూనేవుంది. మౌంట్ బాటెన్ అవార్డు అనంతరం మూడుమాసాలకే ఆంధ్ర అంతటా మునిసిపల్ ఎన్నికలు జరిగాయి. కమ్యూనిస్టుపార్టీ ఈ ఎన్నికలలో పోటీజేసింది బెజవాడ, రాజమండ్రివంటి ముఖ్యమైన పట్టణాలలో మొత్తం స్థానాలలో మూడోవంతు స్థానాలను కమ్యూనిస్టులు గెలుచుకున్నారు. ఆంధ్ర మొత్తంమీద అరడజను మునిసిపాలిటీలలో కమ్యూనిస్టులు మొత్తం 36 స్థానాలు గెలుచుకున్నారు.

కమ్యూనిస్టులు ఈ విధంగా విజయాలు సాధించటం, స్వాతంత్ర్యం వచ్చిన మూడు మాసాలలోపునే ఆ విజయాలను సాధించటం, బూర్జువా - భూస్వామ్య ప్రభుత్వానికి కంపరమెత్తించింది. రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారంలోవున్న మొట్టమొదటి సంవత్సరంలోనే, వ్యవసాయ కార్మికుల, పాలేర్ల, కార్మికవర్గపు, రైతాంగపు పోరాటాలు ముమ్మరంగా సాగటమే, కాంగ్రెస్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక స్వభావానికి తగినంత నిదర్శనం.

## కాంగ్రెస్ ప్రభుత్వానికి సింహస్వప్నం - వీరతెలంగాణా

కాంగ్రెస్ ప్రభుత్వం భయంతో కంపించటానికి మరొక కారణంకూడా తోడైంది, సరిహద్దునేవున్న తెలంగాణాలో వువ్వెత్తున సాగుతున్న రైతు వుద్యమమే ఆ కారణం.

ఎప్పుడో, 1940 ప్రాంతంలోనే, మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతానికి చెందిన కృష్ణాజిల్లా కమ్యూనిస్టులు హైదరాబాదు సంస్థానానికి చెందిన వామపక్షానుకూల యువకులతో సంబంధాలు పెట్టుకున్నారు. ఆనాటినుండీ

హైదరాబాద్ సంస్థానంలోనివారు నైజాం, దేశముఖుపాలనక్రింద పీడనకు, ఫ్యూడల్ దోపిడీకి గురవుతూవున్న రైతుల శ్రేయస్సుకోసం నిర్విరామంగా కృషిచేయనారంభించారు. వెట్టి, అక్రమ నిర్బంధవసూళ్లు, లంచగొండితనం మొదలుగాగల తక్షణ ప్రజా సమస్యలు తీసుకుని వారు పనిచేశారు. స్థానిక దేశముఖులకు వ్యతిరేకంగా పోరాడారు దేశముఖులు గూండాలను ప్రయోగించినప్పుడు ప్రజలు ప్రతిఘటించి వారిని తరిమికొట్టారు అప్పుడు నైజాం పోలీసులు, సైన్యమూ రంగంలోకొచ్చాయి. ప్రజల ఆస్తులను లూటీజేయటం, గృహదహనాలు, హత్యలు, మహిళల మానభంగాలు పెద్దఎత్తున సాగించారు. ఈ హత్యాదాడులనుండి తమ ఇళ్లు – వాకిళ్ళను, తమ ప్రాణాలనూ కాపాడుకొనటంకోసం ప్రజలు గెరిల్లా బృందాలుగా ఏర్పడ్డారు. కమ్యూనిస్టుపార్టీ రాజకీయ, నిర్మాణ సిద్ధాంత నాయకత్వంక్రింద సమరశీలమైన ప్రతిఘటన ప్రారంభించారు. దోపిడీదారుల పాలనకు అంతం చేరువైంది. వేలాది ఎకరాల భూమి స్వాధీనం చేసుకోబడి, పంపిణీ చేయబడింది ప్రజా కమిటీలు ఏర్పాటు చేయబడ్డాయి. ప్రజలపైకి రజాకార్ సైన్యాలను విచ్చలవిడిగా ప్రయోగించారు. ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుల నాయకత్వాన ప్రజలు నైజాంపాలనను వీరోచితంగా ప్రతిఘటించ నారంభించారు.

ఆంధ్రలోని కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేకించి నల్గొండ, వరంగల్ జిల్లాలకు సరిహద్దునేవున్న నాలుగు కోస్తా జిల్లాలలోని పార్టీ, తెలంగాణా పోరాటానికి అండగా నిలిచే వెనుకతట్టు స్థావరంగా వుపకరించింది. నైజాంకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు సాగిస్తున్న పోరాటానికి సంపూర్ణ సహాయం అందజేయవలసిందిగాను, ఫ్యూడల్ పాలనను కూలదోసి, విశాలాంధ్ర స్థాపనకు దోహదపడవలసిందిగాను ఆంధ్రలోని పార్టీ పిలుపు నిచ్చింది. కాంగ్రెస్ వాగ్దానాలు గాలిలో కలిసిపోగా, కమ్యూనిస్టుపార్టీ 1945-46 నాటి తన ఎన్నికల నినాదాలను అమలుజరపటానికి ఆ విధంగా పూనుకుంది. ఆ పిలుపుకు పెద్ద ఎత్తున ప్రజాదరణ లభించింది.

చిత్రహింసల, మానభంగాల, లూటీలబారినుండి రక్షణ పొందటానికై తెలంగాణానుండి వచ్చిన ప్రజలకు కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రరాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, రైతు సంఘం స్వాగతమిచ్చి ఆదరించాయి. వారికి సహాయ కార్యక్రమాలను నిర్వహించాయి. గెరిల్లాయోధులకు, నాయకులకు ఏవిధమైన సహాయం కావాలంటే ఆవిధమైన సహాయం లభించింది. మొత్తం వుద్యమమంతా, కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ నాయకత్వం క్రిందనే నడిచింది. ఆంధ్ర అంతటా, పోరాడి, నైజాం పాలనను అంతంజేసి ఆంధ్రను సమైక్యం చేయాలనే జాతీయోత్తేజాన్ని ప్రజల్లో కలుగజేశారు.

సరిహద్దు కావల, పోరాటం సాగిస్తున్న తమ సోదరులకు సహాయపడటానికి ప్రజలు ఎంతగా సంసిద్ధులయున్నారంటే, ఒక్క బెజవాడ పట్టణంలోనే కేవలం మూడురోజులలో గెరిల్లాలకు ఆయుధాలు కొనటంకోసం ఇరవైవేల రూపాయలు వసూలయినాయి. కమ్యూనిస్టు వుద్యమమూ, పార్టీ తెలంగాణా ప్రజల సాయుధ పోరాటానికి వెన్నెముకగా రూపొందాయి.

తెలంగాణా రైతుల జీవితాన్ని, దేశముఖుల, నైజాం దోపిడిని, పోలీసుల అత్యాచారాలను, ప్రజల ప్రతిఘటనను, భూమికోసం పోరాటాన్ని కన్నులకుగట్టే 'మా భూమి' నాటకం తెలంగాణా వ్యావసాయిగ తిరుగుబాటును గూర్చి ప్రచారం జేయడంకోసం రచించబడింది. తెలంగాణాకు తోడ్పడటంకోసం ప్రజలను సమీకరించడంలో ఆ నాటకం ప్రత్యేకించి గణనీయమైన పాత్ర వహించింది రెండు వందల నాటక సమాజాలు, ఈ నాటకాన్ని ఆంధ్ర అంతటా గ్రామాలలోనూ, పట్టణాలలోనూ ప్రదర్శించాయి. న్యాయవాదులు, డాక్టర్లు, మేధావులు, శాస్త్రవేత్తలు, కాంగ్రెస్ వాదులు, సినిమా కళాకారులు, రచయితలు మొదలుగాగల లక్షలాది ప్రజలు ఆ నాటక ప్రదర్శనను తిలకించారు ఆ నాటకం అత్యంత శక్తివంతమైనదని ప్రతివారూ ఉగ్గడించారు ఈ నాటక ప్రదర్శనద్వారా లక్షల రూపాయల నిధి వసూలయింది. కాంగ్రెస్ శాసన సభ్యులు కోరినమీదట, మంత్రులు ఈ నాటక దళాన్ని ఆహ్వానించి, మద్రాసులోని రాజాజీహాలులో ప్రదర్శింప జేసుకున్నారు. ప్రజలకు అదెంతటి శక్తివంతమైన సందేశమిస్తున్నదీ స్వయంగా తమ కండ్లారా చూచారు. అప్పుడు దాన్ని ఆకాశానికెత్తుతూ పొగిడారు కాని, ఆ తర్వాత నిషేధించారు.

బొంబాయిలోని తాజ్, మద్రాసులోని వుడ్‌లాండ్సువంటి విలాసవంతమైన హోటళ్ళలో కూర్చొని, స్టేట్ కాంగ్రెస్ నాయకులు పత్రికలలో "భీషణ"పోరాటం సాగిస్తుండగా, రణరంగంలో నిలిచి నైజాంకు వ్యతిరేకంగా నిజమైన పోరాటం సాగిస్తూవుంది కమ్యూనిస్టులేననే వాస్తవాన్ని వచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకులు సయితం అంగీకరించక తప్పలేదు. నైజాముకు వ్యతిరేకంగా నిజమైన పోరాటం సాగిస్తున్న యోధులుగా మొత్తంప్రజాతంత్ర పత్రికలన్నీ కమ్యూనిస్టులను ప్రస్తుతించాయి. గోయెంకా యాజమాన్యం క్రిందగల తెలుగు దినపత్రిక "ఆంధ్రప్రభ", ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కాంగ్రెస్ ప్రభుత్వం నిరాకరించటాన్నిగూర్చి వ్యాఖ్యానిస్తూ, 1950 జనవరిలో సయితం యిలా వ్రాసింది:

"విశాలాంధ్రకోసం పోరాటాన్ని మొట్టమొదట ప్రారంభించింది కమ్యూనిస్టులే. వారి ఆధ్వర్యాన మాత్రమే ఆంధ్ర ప్రజలు తమ చిరకాల వాంఛితమైన విశాలాంధ్రను సాధించుకోగలరనిపిస్తోంది"

ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని గాఢంగా వాంఛిస్తున్న ఒక వ్యక్తి, బెజవాడ పట్టణంలో ఒక సంభాషణ సందర్భంగా కాంగ్రెస్ నాయకులను విమర్శించాడు. 'కమ్యూనిస్టులాగా మాట్లాడుతున్నావంటూ' కాంగ్రెస్ నాయకులాయనను ఎగతాళిజేశారు. "కమ్యూనిస్టులు నీకు విశాలాంధ్ర తెచ్చి పెడతారులే ఎదురుజూస్తూండు" అని ఛలోక్తిగా మాట్లాడారు దానికి ప్రతిగా ఆయన తిరిగి యిలా అన్నాడు :

"విశాలాంధ్ర కావాలన్న కోర్కెను 1946 లో ప్రచారం జేసింది కమ్యూనిస్టులే. వారు ఆయుధాలు చేతబట్టి, గత నాలుగేండ్లుగా అందుకోసం పోరాడుతున్నారు. కాంగ్రెసేమో ఆంధ్రరాష్ట్రం తెస్తానని గత నలభై సంవత్సరాలుగా వాగ్దానంజేస్తూ, ఈ రోజున ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుకు సహితం నిరాకరిస్తోంది"

నైజాంతో ఒక ఒప్పందం చేసుకొని, ఆ ప్రజాహంతకునకు ఆయుధాలు సరఫరా చేయటానికి అంగీకరించి నెహ్రూ–పటేల్ ప్రభుత్వం, పోరాటంలో నిమగ్నమైయున్న తెలంగాణా ప్రజలకు వెన్నుపోటు బొడిచింది. మరోవైపున కమ్యూనిస్టులు రణరంగంలో పోరాడుతున్న ప్రజలకు నాయకత్వం వహిస్తున్నారు ప్రజల ఆశయసాధనకోసం, విశాలాంధ్ర లక్ష్యసాధనకోసం తమ రక్తాన్ని ధారవోస్తున్నారు. ఇందువల్ల ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ కార్మికుల, కర్షకుల నాయకుడుగానేగాక, ఆంధ్ర ప్రజల తరఫున నిలిచే మొనగాడుగా, ఆంధ్రప్రజలను ఐక్యంచేసేపార్టీగా పేరుప్రతిష్ఠలను తెచ్చుకొంది

## ఆంధ్రలో రెండుసంవత్సరాల బీభత్సకాండ

మద్రాసు కాంగ్రెస్ ప్రభుత్వం 1948 జనవరి 31 వ తేదీన ఆంధ్రలో సమరశీల ప్రజాఉద్యమంపైన, దానికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీపైన ఎంతోకాలంగా అందుకు సన్నద్ధమై దాడిని ప్రారంభించింది. గాంధీజీహత్య, దాని పర్యవసానంగా ప్రజలకు, ఆర్. యస్. యస్. మూకకు మధ్య ఏర్పడిన ఘర్షణలు ఈ ఫాసిస్టుదాడి సాగించటానికి ఒకసాకు మాత్రమే. ఆరాత్రి, బెజవాడలో కమ్యూనిస్టు దినపత్రిక "ప్రజాశక్తి" కార్యాలయంపైన, పార్టీ సిటీకమిటీ కార్యాలయంపైన, కృష్ణాజిల్లా కమిటీ, ఆంధ్రరాష్ట్ర కమిటీ

కార్యాలయాలపైన, అనేకమంది ప్రముఖ కమ్యూనిస్టుల, వారి సానుభూతి పరుల యిండ్లపైన పోలీసులు విరుచుకపడ్డారు పెద్దఎత్తున అరెస్టులు చేశారు. రాష్ట్రమహాసభ అనంతరం రాష్ట్రకమిటీ విస్తృత సమావేశం అప్పుడు విజయవాడలోనే జరుగుతోంది. ఆంధ్ర కమ్యూనిస్టు నాయకత్వం మొత్తాన్ని నిర్బంధంలోకి తీసుకోవచ్చునని ప్రభుత్వం ఆశించింది. ఆకస్మికంగా దాడిజరిపి నప్పటికీ ఆ లక్ష్యం నెరవేరలేదు.

మొత్తం భారతదేశంలోనే అలాంటి దాడి జరగటానికిదే మొదలు. ఈ దాడి జరగటానికి కారణం – ఆంధ్రలోని కమ్యూనిస్టుపార్టీ, దాని నాయకత్వానగల సమరశీల ప్రజా వుద్యమం, ప్రత్యేకించి కృష్ణాజిల్లాలోని శక్తివంతమైన ప్రజా వుద్యమం – నైజాంకు, అతని రజాకార మూకలకు వ్యతిరేకంగా విమోచనకోసం తెలంగాణా ప్రజలు సాగిస్తున్న పోరాటానికి అండగా వుండే బలమైన స్థావరంగా వుండటమే. అందువల్ల భారత ప్రభుత్వం నైజాంతో నిర్యుద్ధ సంధి చేసుకున్నప్పుడు, తెలంగాణా కమ్యూనిస్టులు, తెలంగాణా ఆంధ్ర మహాసభ ఆ నిర్యుద్ధ సంధిని త్రోసిపుచ్చి, ఆయుధాలు సయితం చేతుల్లో వుంచుకొని పోరాటం కొనసాగిస్తుండగా కాంగ్రెసుకు భయం వేసింది మిగతా భారత దేశంలోని పీడిత ప్రజానీకానికంతకూ వెలుగుబాటగా తయారవకుండా వుండేందుకుగాను తెలంగాణా ప్రజల పోరాటాన్ని అణచివేసి, నిర్మూలించి వేయాలని కాంగ్రెస్ ప్రభుత్వం నిశ్చయించుకుంది అందువల్ల, ఒక వైపున ఆయుధాలు సరఫరాజేస్తూ నైజాంకు తోడ్పడుతూనే, మరో వైపున తెలంగాణా ప్రజా పోరాటానికి వెనుకతట్టు ప్రాంతంగా అండగావున్న ఆంధ్రలోని వుద్యమాన్ని, ప్రత్యేకించి కృష్ణా, గుంటూరు, గోదావరిజిల్లాల వుద్యమాన్ని తుడిచి పెట్టటానికి కాంగ్రెసు ప్రభుత్వం సిద్ధమయింది.

బెజవాడలో, కమ్యూనిస్టు, ట్రేడ్ యూనియన్ కార్యాలయాలపై మొదటి దాడి అనంతరం, జనవరి 31వ తేదీ ఘర్షణలలో ఆర్. యస్. యస్. వ్యక్తులలో వొకరిని హత్యగావించారన్న తప్పుడు ఆరోపణతో మద్రాసు ప్రభుత్వం 79 మందిని అరెస్టు జేసింది. రెండు సంవత్సరాలపాటు విచారణ తంతుతో జాప్యంచేసింది. ఆ కాలంలో ముద్దాయిలకు బెయిలు నిరాకరించారు. జైళ్లలో నిర్బంధంలోనే వుంచారు. ఆ తర్వాత పై కేసులో 17 మందికిమాత్రం అక్రమ సమావేశం పేరుతో రెండునుండి మూడుమాసాల వరకు శిక్షవిధిస్తూ 1950 జనవరిలో తీర్పు చెప్పారు. దాన్నిబట్టే, ఈ ఆరోపణ ఎంత తప్పుడు ఆరోపణ అయిందీ, సమరశీల నాయకత్వాన్ని నిర్బంధంలో వుంచటానికి చేపట్టిన సాకుదప్ప మరేమీకాదని రుజువైంది.

కృష్ణాజిల్లాలో ప్రజాపోరాటాన్ని నిర్మూలించాలని మద్రాసు ప్రభుత్వం తన ప్రయత్నాలను ఒకవైపున కొనసాగించింది. మరోవైపున నైజాము నుండి, అతని రజాకారుల మూకలనుండి హైదరాబాదు ప్రజలను కాపాడటానికని ప్రకటించుకొని, ఆ ముసుగుక్రింద తెలంగాణా ప్రజల పోరాటానికి వ్యతిరేకంగా జోక్యం కల్పించుకొనటానికి భారత ప్రభుత్వం గూర్ఖా, సిక్కు బెటాలియన్లను దించుతుండగా మద్రాసు ప్రభుత్వం తన సాయుధ పోలీసులను, మలబార్ స్పెషల్ పోలీసులను కృష్ణా జిల్లాలో కేంద్రీకరించింది.

తెలంగాణాకు అండగా, కృష్ణాజిల్లాలో ప్రజావుద్యమం వుధృతమయింది. నాలుగు వందలకుపైగా గ్రామాలలో, వ్యవసాయ కార్మికులు తమ డిమాండ్ల సాధనకోసం సమ్మె పోరాటాలకు సన్నద్ధమవుతున్నారు ముప్పైఫ బస్తాల వడ్లు, రోజుకు ఎనిమిది గంటలపని, జీతంతో ముప్పైరోజుల సెలవు- వారు కోరుతున్న కోర్కెలు. జమీందారీ ప్రాంతాలలో, రైతులు జమీందార్లకు కౌళ్ళు చెల్లించ నిరాకరించారు తమ కౌళ్ళు తగ్గించాలని, జమీందారీ విదానం రద్దుచేయాలనీ డిమాండ్ చేశారు. మూకవుమ్మడి దాడులకు, మూకవుమ్మడిగా ప్రజలను కొట్టటానికి, అరెస్టులకు, ఆస్తులను పాత్ర సామగ్రిని ధ్వంసం చేయటానికి, యిండ్లను తగులబెట్టి నేలమట్టం చేయటానికి, మహిళల మానభంగాలకు, హత్యలకు మద్రాసు ప్రభుత్వం పాల్పడింది ప్రత్యేక సాయుధ పోలీసులకు తోడుగా కాంగ్రెస్ సేవాదళ్ వాలంటీర్లను కూడా రంగంలోకి దించారు.

ఆ దాడులలో సాధారణంగా అనుసరించబడిన పద్ధతి ఇదీ : రెండు, మూడు వందలమంది పోలీసులొచ్చి రాత్రివేళ గ్రామాన్ని చుట్టుముట్టుతారు. కాలకృత్యాలు తీర్చుకోవటానికైనా సరే ఎవ్వరినీ యింట్లోనుండి బయటకు కదలనివ్వరు. గ్రామంలోని స్త్రీ, పురుషులందరిని ఏదో ఒక పశువుల చావడిలోకి చేర్చి, వాళ్ళందరినీ బాదుతారు. మరికొన్ని పోలీసు బృందాలు, అదే సమయంలో యిండ్లలో దూరి లూటీచేయటం, ఇంట్లోవున్న సామగ్రిని, పాత్రలను ధ్వంసం చేయటం, చీరెలు, ధోవతులు, చొక్కాలు, చించివేయటం, పప్పు, బియ్యం, పచ్చళ్ళలో కిరోసిన్‌నూనె, మూత్రం పోయటంవంటిపనులు చేసేవారు. వాళ్ళు నిప్పంటించి అనేక ఇండ్లను నేలమట్టం చేసేవారు. కమ్యూనిస్టు కార్యకర్తల, వారి బంధువుల వ్యవసాయ పనులకు ఆటంకం కల్పించేవారు. వ్యవసాయ కార్మికులపల్లెలపై ఈ దాడులు మరీ కేంద్రీకరించబడేవి. మేనుండి జులైవరకు మూడుమాసాలపాటు ఈ దాడులు కొనసాగాయి. ప్రధాన కేంద్రీ

కరణ కృష్ణాజిల్లాపైనే అయినా గుంటూరు, గోదావరిజిల్లాలలోను, కర్నూలు జిల్లాలో సయితం దాడులు జరిగాయి. ఆ జిల్లాలు తెలంగాణాకు సరిహద్దున వుండటమే అందుకు కారణం.

* వెయ్యికి పైగా గ్రామాలపై దాడులు జరిగాయని;
* పాతికవేలకుపైగా వ్యక్తులు దెబ్బలుతిన్నారని;
* పదివేలమందికిపైగా అరెస్టుచేయబడ్డారని (ఒకటి రెండురోజులు కష్టడిలో వుంచుకొని వదలివేయబడినవారితోసహా);
* 15 మంది స్త్రీలు చెరచబడ్డారని (స్త్రీలు ముందుకొచ్చి, పోలీసుల పాశవిక చర్యలను బట్టబయలుజేయటం జరిగిన మీదటతెలియ వచ్చిన సందర్భాలు);
* పోలీసులు, కాంగ్రెసు సేవాదళ్ "వాలంటీర్ల" చే పదిమంది హత్య గావించబడ్డారని;
* ఐదు లక్షల రూపాయలకుపైగా విలువజేసే ఆస్థులు ధ్వంసం చేయబడినాయని;

అంచనా వేయబడింది.

ఈ దాడుల సందర్భంలో వ్యవసాయ కార్మికపల్లెలలో కార్మికులను చిత్తంవచ్చినట్లుకొట్టి, తమకు సంవత్సరానికి 15 బస్తాల వడ్లుచాలునని, రోజుకు అర్ధరూపాయి కూలి చాలని; సంవత్సరానికి 30 బస్తాల వడ్లు, రోజుకు రూపాయిన్నర కూలి కావాలనే డిమాండును వదులుకొంటామని బిగ్గరగా అరిచి చెప్పవలసింగా నిర్బంధించటం జరిగేది.

కాంగ్రెస్ సేవాదళ్ సాగించిన ఈ పాశవికత్వాన్ని, పథకం ప్రకారం హత్యలు జరపటాన్ని చూపటానికి ఒక్క సంఘటనను పరిశీలిసేచాలు, బెజ వాడలో, బెజవాడ కాంగ్రెస్ నాయకుడు మరుపిళ్ళచిట్టి ఏర్పాటుజేసిన కాంగ్రెస్ గూండాదళం కమ్యూనిస్టుపార్టీ సిటీ కమిటీ కార్యాలయంపైన, ట్రేడ్‌యూనియన్ కార్యాలయంపైన దాడి జరిపి కమ్యూనిస్టు సెల్ కార్య దర్శులైన దుర్గాసి కనకయ్యని, ఇలుపిళ్ల అప్పారావును చంపారు. ఇంకా అనేకమంది యితరులను కొట్టారు. కార్యాలయమంతటినీ ధ్వంసంజేశారు. దాన్ని ప్రత్యక్షంగాచూస్తూ వుండికూడా పోలీసులు జోక్యం కల్పించుకోలేదు. ఆ తర్వాత, గూండాలలో కొందరిపై కేను పెట్టారు. అయితే ఆ నిందితులలో చిట్టిని చేర్చలేదు. నిందితులంతా వదిలివేయబడ్డారు. ఆ తర్వాత, బెజవాడ కార్మికవర్గ నివాసాలపై ప్రత్యేక కేంద్రీకరణతో దాడులు జరిగాయి. ఏదో

ఒకచోట ఎప్పుడూ దాడులు సాగుతూవుండేవి. ప్రజలు అరెస్టు చేయబడ్డారు. అనేకరకాల చిత్రహింసలపాలు జేయబడ్డారు. 15 రోజులు, అంతకుపైగా రిమాండ్‌లో వుంచేవారు. కొంతమంది నిర్బంధించబడటం, ఛార్జిషీటు దాఖలు చేయడం మిగతా వాళ్ళు వదిలివేయబడటం జరుగుతూ వుండేది.

తూర్పు గోదావరిజిల్లా, రాజోలు తాలూకాలోకూడా అదేవిధమైన గూండాయిజం, బీభత్సకాండ విచ్చలవిడిగా సాగించారు ఇక్కడ వ్యవసాయ కార్మికుల భూములను బలవంతంగా వేలంవేసి, ధనిక భూఖామందులు వాటిని కొనివేయటం జరిగింది. రోజుకు అర్ధ రూపాయి కూలికి అంగీకరించవలసిందిగా వ్యవసాయ కార్మికులను కొట్టి, బీభత్సకాండ ప్రయోగించారు. నీటి పారుదల సౌకర్యంగల 1250 ఎకరాల డెల్టా భూమి గలగిన లింగమూర్తిరాజు, ఐదు వేల ఎకరాల భూమి గలిగిన బోళ్ళ బుల్లియ్య వంటి భూస్వాములు, ఈ తాలూకాలో పోలీసు దాడులకు నాయకులుగా, ప్రోత్సాహకులుగా వుండేవారు.

ఇంతటి భయంకరమైన నిర్బంధకాండ సాగుతూ వున్నప్పటికీ, సంపూర్ణ స్వాతంత్ర్యం విషయమై బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడినందుకు కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఖండిస్తూ, తెలంగాణా గ్రామాలలో సైనిక, రజాకార్ అత్యాచారాలను కట్టిపెట్టవలసిందిగా డిమాండ్ జేస్తూ, నైజాంకు వ్యతిరేకంగా సాగిస్తున్న పోరాటంలో తెలంగాణా యోధులకు పూర్తి అండదండలు ప్రకటిస్తూ 1948 ఆగస్టు 15 వ తేదీన ఆంధ్ర ప్రాంతంలో వందలాది గ్రామాలలో ప్రదర్శనలు జరిగాయి.

ఇంతటి బీభత్సకాండ సాగుతున్నప్పటికీ, ప్రజలు తమ కోర్కెల సాధనకై పోరాటాన్ని సాగించారు. కృష్ణాజిల్లాలో సుమారు 90 గ్రామాలలో వ్యవసాయకార్మికులు సమ్మెజేయటమో, సమ్మెకు సన్నద్ధం కావటమో జరిగింది. సంవత్సరానికి 3 నుండి 5 బస్తాలవరకు వేతనాల హెచ్చింపు సాధించుకున్నారు. గుంటూరు జిల్లాలో సుమారు 70 గ్రామాలలో, నెల్లూరు జిల్లాలో సుమారు 20 గ్రామాలలోవారు సమ్మెలుజేసి' తమ కోర్కెలను సాధించుకున్నారు. తూర్పుగోదావరిజిల్లాలో, రాజోలు, రామచంద్రపురం తాలూకాల్లో వ్యవసాయ కార్మికులు సమ్మెలు జరిపి వేతనాల హెచ్చింపును సాధించుకున్నారు తూర్పుగోదావరిజిల్లా, పిఠాపురంతాలూకాలో నాట్లు తరుణంతో, కొలది గ్రామాలలో వ్యవసాయకార్మికులు రోజుకు రెండు రూపాయలనుండి మూడురూపాయలవరకు సాధించుకున్నారు.కూలిహెచ్చింపు కోసం, సెలవులకోసం సాగిన ఈ వుద్యమం రాయలసీమ జిల్లాలైన కడప,

అనంతపురాలకూ వ్యాపించింది. పశ్చిమ గోదావరి, నెల్లూరు, కడప, అనంత పురం జిల్లాలలో వందలాది ఎకరాల బంజరుభూములను వ్యవసాయకార్మికులూ పేదరైతులూ ఆక్రమించుకున్నారు.

తమకోర్కెల సాధనకై ప్రజాపోరాటాలు పెంపొందుతుండటం, వాటితోపాటే పోలీసు, భూస్వామ్య కాంగ్రెసు సేవాదళ్ బీభత్సకాండకు వారి ప్రతిఘటన పెంపొందటం ప్రభుత్వానికి మరింత కంపరం కలుగజేసింది. మరింత దారుణమైన నిర్బంధకాండకది పాల్పడింది.

విస్తారమైన ప్రాంతాలలో సైనిక శాసనంతో సరితూగే పబ్లిక్ సేఫ్టీ ("డిజార్డర్సు") చట్టాన్ని యధేచ్ఛగా అమలుజరుపుతూ, ఫాసిస్టు బీభత్సకాండ కొనసాగించుతూనే జిల్లాబోర్డు ఎన్నికలు జరిపారు. సాధ్యమైన చోటునెల్లా కమ్యూనిస్టుపార్టీ తన అభ్యర్థులనునిలబెట్టి కాంగ్రెస్ అభ్యర్థులతో పోటీజేసింది. 18 నెలలపాటు క్రమపద్ధతి ప్రకారం పోలీసు గూండారాజ్యం సాగినా కాంగ్రెసు ప్రభుత్వం శీఘ్రగతిని ప్రజలలో తనపలుకుబడిని కోల్పోతున్నదని, కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రలో ప్రజాసామాన్యంయొక్క అభిమానాన్ని చూరగొంటున్నదని ఆ ఎన్నికల ఫలితాలు రుజువుజేశాయి.

దీనితో కాంగ్రెస్ బూర్జువా-భూస్వామ్య ప్రభుత్వానికి వెర్రెత్తి పోయింది. మద్రాసు రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. రాష్ట్ర రైతు సంఘాన్ని, ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘాన్ని, ఆంధ్రరాష్ట్ర యువజన ఫెడరేషన్‌ను, రాష్ట్రంలోని బలమైన ట్రేడ్‌యూనియన్లన్నింటినీ నిషేధించింది. కమ్యూనిస్టు భావాలుగల విద్యార్థులందరినీ, సానుభూతిపరులనూ విద్యాసంస్థలనుండి వెళ్ళగొట్టవలసిందిగా రాష్ట్రంలోని హైస్కూళ్ళ, కాలేజీల ప్రధానాధికారులందరికీ ప్రభుత్వం వుత్తర్వులు జారీచేసింది.

సమరశీల ప్రజావుద్యమం వున్న ప్రాంతాలలో పౌరహక్కులు పూర్తిగా మృగ్యం చేశారు ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ ప్రాంతాలు కల్లోల ప్రాంతాలుగా ప్రకటించబడినాయి. కమ్యూనిస్టులని తామనుమానించిన వారినెవరినైనాసరే కనిపించగానే కాల్చివేయటానికి పోలీసులకు వుత్తర్వులు జారీచేయబడ్డాయి. కమ్యూనిస్టు నాయకుల మధ్య రహస్యంగా ఉత్తరాలు చేరవేసే కొరియర్లూ, పైలట్లూ, సంబంధాలను ఏర్పాటుచేసేవారు, గృహ వసతిని కల్పించి రక్షణ ఏర్పాటు చేసేవారు ప్రమాదవశాత్తు పోలీసులచేతుల్లో జిక్కితే, వారి గోళ్ళ వ్రేళ్ళ క్రింద గుండుసూదులు గుచ్చటం, తలక్రిందుగా వ్రేళ్ళాడగట్టటం వంటి నానారకాల పైశాచికమైన అమానుష కృత్యాలతో చిత్రహింసలపాలు జేసేవారు.

అన్నివిధాలైన ఆస్థులు, ఇండ్లు, వంటపాత్రలు తదితర సామగ్రిని ధ్వంసంజేయటం, విలువైనవస్తువులన్నింటినీ బాహాటంగా లూటీజేయటం పెద్దయెత్తున సాగేది. ఆంధ్రలోని అనేక గ్రామాలలో డజన్లకొద్దీ కుటుంబాలు తమ ఇండ్లనుండి, పొలాలనుండి తరిమివేయబడ్డాయి. అజ్ఞాతవాసంలోవున్న కామ్రేడ్స్‌కుజెందిన ఆస్థులు స్వాధీనం జేసుకుని, బహిరంగంగా వేలానికి పెట్టబడేవి. అయితే, ఎవరూ వాటిని కొనటానికి సిద్ధమయ్యేవారుకాదు. అలా చేయటమంటే నిప్పుతో చెలగాటమాడటమేనని కాంగ్రెసుగూండాలకు సయితం తెలిసినందున అందుకు వారు సాహసించేవారుకాదు.

కృష్ణాజిల్లాలో, గుడివాడ, గన్నవరం, దివి తాలూకాలలో గ్రామాలపై అనేక దాడులు జరిగాయి ఎలమర్రు, కాటూరు గ్రామాలలో స్త్రీలను, పురుషులను అందరినీ ఒక చోటికిజేర్చి పురుషులను బాదారు, వొంటిమీది బట్టలూడదీశారు. స్త్రీలను కూడా వివస్త్రలను గావించటానికి ప్రయత్నించారు. అయితే స్త్రీలు ప్రతిఘటించారు ఆ తర్వాత వివస్త్రులైన పురుషులను, వాళ్ళ వెనకనే స్త్రీలను నిలబెట్టి గ్రామవీధులలో వూరేగించారు ఎలమర్రుగ్రామంలో వివస్త్రులైన ప్రజలను మహాత్మాగాంధీ విగ్రహంముందు ప్రణమిల్లజేశారు. కాంగ్రెస్ రాజ్యం తమ "మహాత్మాజీ"కి సమర్పించిన తాజా నివాళియిది. కాంగ్రెస్ పోలీసులు, అదేవిధంగా పెదముత్తేవి, పాములలంక మొదలగు మరి కొన్ని గ్రామాలలో దిగంబరంగా ప్రజలను వూరేగించారు

"కాంగ్రెస్‌కి జై" అనటానికి నిరాకరించినందుకుగాను, ఎలమర్రు గ్రామంలో, వృద్ధ వ్యవసాయి కార్మిక నాయకుడు కామ్రేడ్ దావీదును చావ మోదారు. ఆయన స్పృహ కోల్పోయేంతవరకూ – "కమ్యూనిస్టుపార్టీకి – జై" అని నినదిస్తూనే వున్నాడు లెక్కలేనన్ని లాఠీదెబ్బలతో ఆయనను పడగొట్టారు. ఆయనను అరెస్టుచేసి, ఆ తర్వాత బెయిలుమీద విడుదల జేశారు. మరొకసారి, యింకొక దాడిలో, ఆయనను పట్టుకొనికొట్టి, మరణించాడనుకొని వదిలేశారు. అయితే, ఆయన ప్రాణాలు గోల్పోలేదు. ఎర్రజెండాను తన దగ్గరకు తెప్పించుకొని ఆ వీరుడు దానికి వందనం చేశాడు.

దివి తాలూకాలో అరెస్టు చేయబడిన ప్రతి వొక్కరినీ తీవ్రంగా దెబ్బలు కొట్టారు. దాసరి వెంకటేశ్వరరావును 300 దెబ్బలు, నాగభూషణంను 100 లాఠీ దెబ్బలు కొట్టారు.

అరెస్టు జేసిన ప్రజలను, మేజిస్ట్రేట్లు ఎదుట హాజరుపరచకుండా, రోజుల తరబడి పోలీసు క్యాంపులలో వుంచడం, వాళ్ళచేత క్షమాపణ చెప్పించటంకోసం దెబ్బలు కొట్టటం, చిత్రహింసలకు గురిజేయటం పోలీసులకు సర్వ

సాధారణమై పోయింది. కృష్ణాజిల్లా, దివి తాలూకాకు జెందిన మండవ వెంక టేశ్వరరావును పెదముత్తేవి పోలీసు క్యాంపులోబెట్టి పోలీసులు, కాంగ్రెస్ గూండాలు కొట్టి చంపారు.

కమ్యూనిస్టుపార్టీ, దివితాలూకా కమిటీ కార్యదర్శి కామ్రేడ్ మాలెం పాటి సీతారామయ్యను మచిలీపట్నంలో స్పెషల్ సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు అధేపనిగాకొట్టాడు. అయినప్పటికీ, ఆయననుండి ఒక్కమాటైనారాబట్టుకోలేక పోయాడు కాల్చిచంపుతామని ఆయనను బెదిరించారు. బెజవాడలో విద్యార్థి కార్యకర్తగా పనిజేస్తున్న ఆయన తమ్ముడగు నరసయ్యను డిసెంబరుమధ్యలో అరెస్టుచేశారు. మరో పదిమందితోపాటు ఆయనను డి యస్.పి. పళనియప్పన్ స్పెషల్‌క్యాంపులో ఒక నెలరోజులకుపైగా నిర్బంధించి వుంచారు. ఆయన భార్యకుగాని, దగ్గర బంధువులకుగాని ఆయననుగూర్చిన వార్తలేమీ అందజేయలేదు

వెంకటు నారాయణను చంపారన్న కేసులో ముద్దాయిగా ఇరికించ బడిన అముదాల్లంక వాస్తవ్యుడు మండవ కోటేశ్వరరావును బెయిలుమీద విడుదలచేశారు. ఆయన కోర్టుకు వెళ్తుండుగా కాంగ్రెస్ గూండాలు గ్రామం వెలుపల పొంచివుండి ఆయనపైదుమికి కొట్టి చంపారు.

దివితాలూకాలో కొత్తగా పెండ్లయిన హరిజన దంపతులు ప్రకాశ రావు, సరోజిని కలసియున్న గదిని బలవంతాన తెరిపించి కాల్పులు జరిపి వారిరువురినీ గాయపరిచారు.

స్త్రీలను మానభంగాలకు గురిజేయటం పోలీసుల, కాంగ్రేస్‌సేవా దళ్ సభ్యుల అలవాటయిపోయింది అర్ధరాత్రివేళ స్త్రీలను వారి బిడ్డలతో సహా బయటకు గెంటటం, వారి యిండ్లకు నిప్పుబెట్టటం వాళ్ళు సాగించే వరొక సర్వసాధారణ కృత్యం.

కృష్ణాజిల్లా, నెప్పల్లిలో పదిహేను రోజులక్రితమే ప్రసవించిన కొడాలి చిట్టెమ్మను కొట్టి, రాత్రివేళ బిడ్డలతోసహా ఆమెను బయటకులాగి, యింటికి నిప్పంటించారు. ఇంటిలోని పాత్రసామగ్రి, ఆహార ధాన్యాలతోసహా దగ్ధమైపోయాయి.

పశ్చిమ గోదావరిజిల్లా, భీమవరం తాలూకా వీరవాసరంలో పార్టీ జిల్లా కార్యదర్శి కామ్రేడ్ ఉద్దరాజు రామం సతి మాణిక్యాంబను కొట్టారు. కామ్రేడ్ రామం అరెస్టుచేయడినప్పుడు, ప్రజల సహాయంతో వాళ్ళ చేతుల్లో నుండి తప్పించుకుపోయాడు గాబట్టి, వారిని యింట్లోనుండి బయటకు గెంటు తామని బెదిరించారు.

ఇంకా దారుణమైన పనులు జరిగాయి. కృష్ణాజిల్లా, దివి తాలూకా, విశ్వనాథపల్లి గ్రామంలో కాంగ్రెస్ సేవాదళ్ గూండాలు అరడజను మంది స్త్రీలను చెరిచారు.

తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం తాలూకా ఎడిద గ్రామ మునసబు, తన కండ్ల ఎదుటనే, ఒక స్త్రీని తనగూండాలు ఆరుగురిచేత చెరిపించాడు. ఆ తర్వాత ఆమె మానంలో వెదురుపుల్లతో పొడిపించాడు. అయినా, ఈ ఫాసిస్టును ప్రజలు చంపివేసినప్పుడు, కాంగ్రెస్ ప్రభుత్వం పెద్ద గగ్గోలు పెట్టింది. కేసుపెట్టింది నలుగురికి ఉరిశిక్ష, పదకొండు మందికి యావజ్జీవ శిక్ష విధించారు.

గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా జాపూడిలో, వ్యవసాయ కార్మిక వూరేగింపుపై పోలీసులు కాల్పులు జరిపి ఒకరిని చంపారు. అనేక మందిని గాయపరిచారు. గ్రామ కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ చెన్నారెడ్డిని అరెస్టు చేయకుండా గ్రామ ప్రజలు తమను అవరోధించగా కాల్పులు జరపవలసి వచ్చిందని వారు పత్రికల్లో ప్రకటన జేశారు.

కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకా, పెదపసుపుల గ్రామంలో కూడా, పోలీసులు ప్రజలపై కాల్పులు జరిపి, కొండారెడ్డిని చంపారు ఇక్కడ కూడా, ప్రజలు పోలీసులను చుట్టుముట్టి, జిల్లా కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ ఈశ్వరరెడ్డిని పోలీసుల చేతుల్లోనుండి విడిపించారు.

కడపజిల్లా, యు. రాజుపల్లి గ్రామంలో సమ్మెజేస్తున్నందున వ్యవసాయ కార్మికులపై పోలీసులు కాల్పులు జరిపారు. ముగ్గురు వ్యక్తులు మృతిజెందారు.

ఈ అత్యాచారాలతోనే ప్రభుత్వం ఆగలేదు. ఆంధ్ర డిటెన్యూలు నిర్బంధించబడియున్న కడలూరు జైలులో పోలీసులు డిటెన్యూలపై కాల్పులు జరిపారు కృష్ణాజిల్లా రైతు నాయకుడు కామ్రేడ్ అనుమర్లపూడి సీతారామారావుతోసహా నలుగురు కామ్రేడ్స్ మృతిజెందారు. ఆయన క్రిందపడిపోయిన తరువాత, జైలు కానిస్టేబుళ్లు తుపాకిని సూటిగా ఆయనమీదనే గురిబెట్టి దగ్గరనుండే కాల్చిచంపారు కడలూరు డిటెన్యూలపై పదేపదే కాల్పులు జరపటానికి కారణం ఇతర విషయాలతోపాటు మిగతా డిటెన్యూలనుండి తమను వేరుజేయరాదని, తమ భార్యలతోను, సన్నిహిత బంధువులతోను ఇంటర్వ్యూలు కావాలని, తమ కుటుంబాలకు అలవెన్సులివ్వాలని, రైతు, కార్మిక ఖైదీలందరినీ రాజకీయ ఖైదీలుగా పరిగణించాలని, వారికి ప్రత్యేకక్లాసు ఇవ్వాలని, సాధారణ ఖైదీల పరిస్థితులను మెరుగుపరచాలని, వారి సౌకర్యా

లను అభివృద్ధిపరచాలని తమతమ స్వంతజిల్లా జైళ్ళకు బదిలీచేయాలని వారు డిమాండు చేయటమే తమపై విచారణ జరపాలని, లేదా విడుదల జేయాలని వారుకోరారు. ఆ కాల్పులలో నలుగురు మృతిజెందటమేగాక, దాదాపు వంద మందికి తుపాకితూటా దెబ్బలు, లాఠీదెబ్బలతో తీవ్రమైనగాయాలు తగిలాయి. సేలం జైలులో కాల్పులుజరిపి, కేరళకుజెందిన 22 మంది కమ్యూనిస్టు ఖైదీలను చంపివేశారు. మద్రాసు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకుజెందిన వందమందికి పైగా ఆ సందర్భంగా గాయపడ్డారు.

ప్రజలను బీభత్సపరచటంకోసం, మద్రాసు ప్రభుత్వం కూడా భారత ప్రభుత్వ సాయుధబలగాలు తెలంగాణాలో చేస్తున్నట్లుగానే పట్టుబడిన ప్రజానాయకులను కాల్చిచంపే విధానాన్నే అనుసరించింది.

కోస్తాజిల్లాలలోను, తెలంగాణాలోని నల్గొండ, ఖమ్మం, వరంగల్లు జిల్లాలలోనూ, కమ్యూనిస్టులూ, ప్రజావుద్యమమూ ప్రతిఘటన కొనసాగించుతూ వుండటంచూసి మద్రాసు ప్రభుత్వమూ, భారతప్రభుత్వమూ నివ్వెరపోయాయి. మద్రాసు, హైద్రాబాదు, భారత ప్రభుత్వాల పోలీసు ప్రధానాధికారుల సమావేశాలు పదే పదే జరిగాయి, పథకాలు తయారుజేశారు. అనతికాలంలోనే తమ పథకాలవల్ల కమ్యూనిస్టులను తుడిచిపెట్టగిలమని ప్రకటించారు.

ఆవిధంగా, 1949, 1950 సంవత్సరాలలో మూకవుమ్మడి దాడులతో, ప్రజలను కొట్టటం, లూటీలు జేయటం, స్త్రీలను చెరచటం, ముఖ్యమైన ప్రజా నాయకులను, కమ్యూనిస్టు నాయకులను అరెస్టుజేసిన తర్వాత కాల్చిచంపటం, "పోలీసులతో ఘర్షణకు దిగగా కాల్చి చంపినట్లు" ఈ హత్యలనుగూర్చి పత్రికలలో ప్రకటించడంవంటి చర్యలతో గూడిన బీభత్సకాండ వుధృతంగా సాగింది.

## దాడులను ప్రజలు తిప్పికొట్టారు

పోలీసుదాడులను ధైర్యంగా ఎదుర్కొనవలసిందిగాను, గ్రామాలు వదిలివెళ్ళవలదని, తమ ప్రదర్శనాహక్కును, ఎర్రజెండాలనెగురవేసేహక్కును నిలబెట్టుకోవలసిందిగాను, జేతికిచిక్కిన ఏ ఆయుధంతోనైనాసరే పోలీసుల అత్యాచారాలను తిప్పికొట్టవలసిందిగాను 1948వ సంవత్సరమంతా పార్టీ కార్యకర్తలను, ప్రజలనూ పార్టీ కోరుతూవచ్చింది. అయితే పోలీసులు వందల సంఖ్యలో వచ్చేవారు. ప్రత్యక్షంగా ప్రతిఘటించాలన్న ఈ పిలుపు సమరశీలమైన సత్యాగ్రహంగా మాత్రమే తయారైంది. మన కామ్రేడ్స్ వీపులు, ఎముకలు చిట్లాయి. ముఖ్యకార్యకర్తలనేకమంధి అరెస్టు చేయబడ్డారు.

ప్రజలు పార్టీ కార్యకర్తలూ, ఈ ప్రతిఘటనా రూపంతో విసుగెత్తిపోయారు. గుంటూరుజిల్లా జూపూడి గ్రామంలో ప్రజలు దళాలుగా ఏర్పడ్డారు. పోలీసులు పెద్ద సంఖ్యలో వచ్చినప్పుడు యిరుగు పొరుగు గ్రామాలలోకి తప్పుకునేవారు. పోలీసులు వెళ్ళిపోయిన మరుక్షణమే తిరిగివచ్చి భూస్వాములపైన వాళ్ళ తాబేదార్లపైన దాడులు జేసేవారు. ఈ దాగుడు మూతల పోరాటం ఒక సంవత్సరానికిపైగా కొనసాగింది.

కృష్ణాజిల్లా దావాజీగూడెంలోనూ స్థానిక కార్యకర్తలు అలాంటి ఎత్తుగడలనే అనుసరించారు.

కాంగ్రెసు పోలీసు అత్యాచారాలకు అత్యంత దారుణంగా గురైనది, కృష్ణాజిల్లా దివితాలూకాలోని పెదముక్తేవిగ్రామం. ఆ గ్రామంలో 1948 నవంబరులో కామ్రేడ్స్అంతా సమీకృతులై గ్రామంలో ప్రవేశించారు మొత్తం పరిసరాలన్నింటినీ బీభత్సానికిగురిజేస్తున్న భూస్వాములను,వారి తాబేదార్లను నిద్రమంచాలమీదనుండి లాగి దేహశుద్ధి జేశారు.

"తమను చిత్రహింసలపాలుజేస్తుండగా కమ్యూనిస్టులు ఎంతకాలం పడివుండగలరు: ఎదురు దెబ్బదీయటానికి వారూ నిర్ణయించుకున్నారు" అని, ప్రజలు ప్రతిస్పందించారు. ప్రతివారి మనసులోనూవున్న ఆలోచన అదే

కేంద్ర గూఢచారిశాఖ అధికారుల సహాయంతో, మద్రాసు, హైదరాబాదు పోలీసు అధికారుల సంయుక్త సమావేశ మొకటి జరిగింది. ఒకటి, రెండు మాసాలలోపునే కోస్తాజిల్లాలలో కమ్యూనిస్టనేవాడు లేకుండా చేస్తామని తెలంగాణాలో అనుసరించిన పద్ధతులే యిక్కడా అనుసరించబడుతాయని బహిరంగ ప్రకటన చేశారు. తమకు చేజిక్కిన కమ్యూనిస్టునెల్లా కాల్చి వేయగలమనేది ఆ ప్రకటన అర్ధం. కాంగ్రెస్ సేవాదళ్‌కు, గ్రామాలలోని భూస్వాములకూ ఆయుధాలను సమకూర్చిపెట్టారు. కమ్యూనిస్టులకు తగిన గుణపాఠం నేర్పగలమని కాంగ్రెస్ కార్యాలయాలలో బాహాటంగా చెప్పుకొనసారంభించారు.

ఈ పరిస్థితులలో, 1949 లో పార్టీ "పంటికి పన్ను", "కంటికి కన్ను" అనే నినాదంతో; ఎంతోకాలంగా సాగుతున్న భూస్వామ్య – పోలీసు దౌర్జన్య కాండను ఎదిరించి పోరాడాలని పిలుపిచ్చింది.

తెలంగాణాలోవలె, ఆంధ్ర ప్రజలు భూమికోసం పోరాటం సాగించటానికి పూనుకునే దశకు చేరలేదని, అందువల్ల ఆంధ్ర ప్రాంతంలో ఆయుధాలు చేతబట్టటానికి పార్టీ, ఆంధ్ర రాష్ట్ర కమిటీ, 1948 వ సంవత్సరం అంతా వ్యతిరేకించింది. కాంగ్రెసు పాలనలోగల ఆంధ్రప్రాంతంలోని రాజకీయ –

ఆర్థిక పరిస్థితి, నైజాం పాలనలోగల తెలంగాణా ప్రాంతంలోవున్న దానికి పూర్తిగా "భిన్నంగా" వున్నదనికూడా వాదించింది కాని, ఆయుధాలు చేత బట్టాలని, తెలంగాణా వుద్యమానికి తోడ్పడడంకోసం గెరిల్లా వుద్యమాన్నికూడా పెంపొందించాలని క్రింది కార్యకర్తలనుండి, తెలంగాణా క్యాంపెడ్సు నుండి వచ్చిన వొత్తిడికి అది తలవొగ్గింది. అయితే, తెలంగాణాలోవలె ప్రజా సామాన్యం పాల్గొనే పోరాటం జరపటంలేదని, దళ చర్యలు మాత్రమే జరుగు తున్నాయని, కాంగ్రెస్ ప్రభుత్వం తన పాశవిక హింసాకాండద్వారా వాటిని సులువుగా అణచివేయ గలుగుతున్నదనీ త్వరలోనే గమనించటం జరిగింది. బీభత్సకాండకు వ్యతిరేకంగా ధైర్యంతో తాను సాగించిన పోరాటంవల్ల, అగ ణిత త్యాగాలవల్ల, కష్టజీవుల, మధ్య తరగతి వర్గాల గౌరవాదరణలను చూర గొన్నప్పటికీ, ఈ ఎత్తుగడలు తప్పనీ, వాటివల్ల పార్టీకి గొప్పనష్టం, హాని జరి గాయని పార్టీ ఆ తర్వాత నిర్ణయాని కొచ్చింది.

ఏదో ఒక వృత్తిని ముసుగుగా ధరించి, జీవనోపాధి సాగిస్తూ, వెలు పలవున్న నాయకత్వమూ, కార్యకర్తలూ పని జేయటం సాధ్యమేనని ఆ సమ యంలో కూడా పార్టీ భావిస్తూనేవుంది. అచ్చట ప్రజలు పాల్గొంటూ వుండని స్థితిలో ప్రభుత్వ సాయుధ బలగాల నెదుర్కొని పోరాడటానికి, కార్యకర్తలను సంరక్షించుకొనటానికి అచ్చటి ప్రజలు సిద్ధంగా లేనిస్థితిలో అలాంటి అభి ప్రాయాలు కలిగివుండడం హానికరమైన తప్పిదమే. మనం అడవులలోనూ, కొండ ప్రాంతాలలోనూగల మన తెలంగాణా స్థావరాలకో, లేదా బాగా సుర క్షితమైన ప్రాంతానికో—అందరికీ తెలిసిన కార్యకర్తలలో, దళాలలో అత్యధిక భాగాన్ని పంపివేసి, పాత ప్రాంతాలలో పూర్తిగా ఎవరికీ వెల్లడిగాని కార్య కర్తలద్వారా మన కృషిని సాగించి వుండవలసింది. 1950 మార్చి—జూన్ మాసాల మధ్యకాలంలో పార్టీ కార్యకర్తలను, నాయకులను తీవ్రంగా నష్ట పోయిన తర్వాతనే పార్టీ ఈ విషాదకరమైన గుణపాఠాన్ని నేర్చుకుంది.

కోస్తాజిల్లాలలో పార్టీపైన, ప్రజాఉద్యమంపైన పెద్దదెబ్బగొట్ట టానికి , పథకాలతో ప్రభుత్వం సన్నద్ధమైంది. పోలీసు క్యాంపులను అధికం జేసింది. తమచేతజిక్కిన ఏ కమ్యూనిస్టు నాయకుడినైనా, గెరిల్లానైనా కాల్చి చంపవలసిందిగా ఉత్తర్వు జేసింది. 1950 వ సంవత్సరంలో ఆంధ్రలోని కోస్తా జిల్లాలలో ప్రజలు వీరోచిత పోరాటాలు సాగించారు. ఒక వైపున భూస్వాము లకు, వాళ్ళ తాబేదార్లకు వ్యతిరేకంగా ప్రజల ప్రతిఘటనాచర్యలు, మరో వైపున ప్రజాపోరాటాన్ని రక్తంతో ముంచెత్తటానికి కాంగ్రెసు ప్రభుత్వం సాగించిన మూకవుమ్మడి హత్యకాండ—అప్పటి దృశ్యాలు.

కృష్ణాజిల్లా, దివితాలూకా, వెలివోలుగ్రామంలో గూండానాయకుడు బసవయ్య యాభైవేల రూపాయల విలువగల ఆస్తిని ధ్వంసం జేశాడు. పాతిక వేల రూపాయలు జరిమానా వసూలుజేశాడు. కోడిపెట్టలను, బాతులను కాజేశాడు. సాధారణంగా రోజుకూలి రూపాయిన్నర వున్నప్పుడు అతడు అర్థ రూపాయి కూలి మాత్రమే యిచ్చేవాడు అతని గూండా క్యాంపుపై ప్రజలు దాడిజేశారు. ఆతనిని కొట్టి శాశ్వతంగా అంగవైకల్యం కల్పించారు. అతని కుడిభుజాలైన వాళ్ళ నిద్దరిని చంపివేశారు.

గన్నవరం తాలూకా, కాటూరు గ్రామంలో రామలింగయ్య అనే ఒకడు హోంగార్డుగా, గూండాగా, భూస్వాముల ఏజెంటుగా, వారలంద జేసేవాడుగా వుండేవాడు. 1948-49 సంవత్సరాలలో జరిగిన లూటీలు, గృహ దహనాలు, స్త్రీలను చెరిచే ప్రయత్నాలు, తదితర అత్యాచారా లన్నింటిలోనూ అతని ప్రమేయంవుంది. అతని నాయకత్వాన పదులకొలదీ గ్రామాలపై దాడులు జరిగాయి కాటూరు గ్రామంలో స్పెషల్ పోలీసు క్యాంపొకటి ఏర్పాటు జేయబడింది. ఆదారినేపోయే వాళ్ళనందరినీ పట్టుకుని, కొట్టడం జరుగుతుండేది. స్త్రీలు స్నానాలు చేస్తుండగా, ప్రహారీ గోడలుదూకి పెరటిదొడ్లలోకి వెళ్ళటం ఈ దుష్టునికి అలవాటు ప్రభుత్వం అతనికొక రివాల్వారును బహూకరించింది. అయితే, ప్రక్కనే సాయుధ పోలీసు క్యాంపు వుండగానే, గ్రామంలోనే అతన్ని చంపివేయటం జరిగింది. బస్సులలో, కాఫీ హోటళ్ళలో, రైళ్ళలో అతని చావును గురించి చెప్పుకోవటం జరిగినా, అతనిపట్ల ఒక్క సానుభూతి వాక్య మైనా వినిపించలేదు. శవ పరీక్షకోసం, మచిలీపట్టణం ఆస్పత్రికి తీసుకు పోతుండగా మార్గ మధ్యంలో వుయ్యూరు బస్‌స్టాండులో వుండగా శవాన్ని చూచినవాళ్ళు, "అతడు అంతటి దుర్మార్గపు పనులు జేశాడు. అందుకు తగిన ఫలితం అనుభవించాడు" అనిచెప్పుకోవటం వినిపించింది.

గన్నవరం తాలూకాలో, బెజవాడ – మచిలీపట్టణం రోడ్డుమీదనే వున్న చిన వోగిరాల గ్రామంలో పోలీసుక్యాంపు ఎట్టఎదుటనే యిద్దరు దుష్ట భూస్వాములను చంపివేసి, వాళ్ళ తుపాకులను స్వాధీనం చేసుకున్నారు. అచ్చటికి పదిమైళ్ళ దూరంలోనే వున్న కంకిపాడు పోలీసుస్టేషన్‌లో పోలీసులు లోపల కూర్చుండి తలుపులు బిడాయించుకున్నారు. బయటకొచ్చి తమకు రక్షణ యివ్వవలసిందిగా కోరుతూ స్థానిక భూస్వాములు తలుపులుకొట్టి పిలిచినా వాళ్ళుమాత్రం బయటకు రాలేదు. "మాకూ మాకుటుంబాలున్నాయి. పిల్లలున్నారు. మా ప్రాణాలంటే మాకు తీపే" అని తమ స్టేషనును కాపాడు కోవడమే తమకు సరిపోతుందని వాళ్ళు సమాధానం చెప్పారు.

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలో 1949 డిసెంబరులోను, తిరిగి 1950 మార్చిలోనూ ప్రజలు తెలంగాణా గెరిల్లాల సహాయంతో యిరవై గ్రామాలపై దాడులుచేశారు. భూస్వాములనుండి బంగారమూ, తుపాకులూ స్వాధీనం చేసుకున్నారు. వారిలో కొలదిమందిని చంపివేశారు.

తూర్పుగోదావరిజిల్లా, రాజోలు తాలూకాలో దేవాలయాలకు జెందిన సారవంతమైన డెల్టాభూమి పన్నెండువందల ఎకరాలు స్వాహాజేసిన బడా భూస్వామి లింగమూర్తిరాజు, మరికొలదిమంది బడా భూస్వాములతో కలసి ఒక దళాన్ని ఏర్పాటుజేసి, బీభత్సకాండ సాగించాడు. లంక భూముల లోని పైర్లను తమ అధీనం జేసుకోవటానికి ఈ గూండా భూస్వాములు ప్రయత్నించారు. ఇరవై, ముప్ఫై సంవత్సరాలుగా వ్యవసాయ కార్మికులు సాగు జేసుకొంటున్న ఈ భూములను ప్రభుత్వం బలవంతంగా స్వాధీనం చేసుకొని, వేలంవేసి భూస్వాములకు కట్టబెట్టింది. పార్టీ నాయకత్వాన స్త్రీలు, పురుషులు అనేక మహత్తర పోరాటాలు సాగించారు పొలాలలోని తమ పైర్లను కాపాడు కున్నారు. అధిక వేతనాలకోసం వ్యవసాయ కార్మికులు పదే పదే పోరాటాలు జరిపారు. మహిళలు ముందుపీటీన నిలిచారు. వారుకూడా ఆత్మరక్షణ జేసు కోవటంలో శిక్షణపొందారు కొంతమందిని, వారి భర్తలు ఆపటానికి ప్రయత్నించినప్పుడు, ధైర్యశాలులైన ఆ మహిళలనుండి వచ్చిన జవాబేమిటంటే; "మా మానప్రాణాలను మీరు కాపాడజాలరు. అయినా ఆత్మరక్షణకు మేము శిక్షణ పొందకుండా ఆటంకపరుస్తారు" అనేదే. మహిళలు కొరియర్లుగాకూడా పనిజేసేవారు పోలీసుల రాకపోకలను కనిపెట్టివుండి, ఆ సమాచారాన్ని పార్టీ నాయకులకు ఎప్పటికప్పుడు అందజేసి, వారిని పోలీసుల బారినుండి కాపాడుతుండేవారు.

కొన్ని నెలలపాటు చిత్రహింసలకు గురిజేయబడిన తర్వాత, వ్యవసాయ కార్మికులు, పేదరైతులు ప్రతీకారం తీర్చుకోనారంభించారు. లింగమూర్తి రాజు గూండాలలో యిరవైమందిని నజ్జునజ్జుగాకొట్టారు వారిలో కొందరు జీవితాంతం అంగవైకల్యం పొందారు. పగలంతా గూండాదాడులలో పాల్గొంటూ వుండిన గూండావొకడు రాత్రిపూట యింటికొచ్చి "పగలంతా మనుష్యులను తన్నితన్నీ నాకాళ్లు నొప్పిపెడుతున్నాయి. నాకాళ్ళకు వేడినీళ్లతో కాపుపెట్టు" అని తన భార్యముందు గప్పాలు గొడుతుండేవాడు. ప్రజలే అతనికాళ్లు విరగగొట్టారు.

తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ఏడిదగ్రామ మునసబు పోలీసులను రప్పించి, పరిసర గ్రామాలన్నింటిలోనూగల వ్యవసాయ కార్మిక, పేదరైతు పేటలపై పదేపదే దాడులుజేయించాడు. వారి గుడిసెలను

తగులబెట్టారు. అతని వుత్తర్వుల ప్రకారం, అతని సమక్షంలోనే అతనిగూండాలు పదిమంది కొందరు హరిజనస్త్రీలను చెరిచారు. అతడు చేయించిన అత్యాచారాలకు ప్రతీకారంగా ప్రజలాతనిని చంపివేశారు.

పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురం తాలూకా వేమవరం గ్రామానికి జెందిన సుబ్బారాయుడు పోలీసులను రప్పించి ఒక సంవత్సరకాలంలోనే వ్యవసాయ కార్మికుల యిండ్లపై 27 సార్లు దాడిజేయించాడు. ప్రజలా దుర్మార్గుణ్ణి చంపివేశారు.

పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా కోరుకొల్లు గ్రామంలో గ్రామప్రజలే జిల్లాపార్టీ కార్యదర్శిని పోలీసుల చేతుల్లోనుండి తప్పించారు. పోలీసు అక్కడ మకాంవేసి, యిండ్లను ధ్వంసంజేశారు. అనేకమంది రైతులను యిండ్లనుండి వెళ్ళగొట్టారు. ఈ అత్యాచారాలలో కంచుమర్రు గ్రామమునసబు పోలీసులకు తోడ్పడుతుండేవాడు. ప్రజలాతని యింటిని, ఆస్తిపాస్తులను తగులబెట్టివేశారు. ఇంకెంతమాత్రం ప్రజలపై అత్యాచారాలలో పాల్గొనవలదని, అలా పాల్గొనేట్లయితే పరిణామాలు చాలాతీవ్రంగా వుంటాయని అతనిని, అతని కుటుంబాన్నీ హెచ్చరించారు.

గుంటూరుజిల్లా, నరసరావుపేట తాలూకా, వేలూరు గ్రామంలో, పేద, మధ్యతరగతి రైతుల సహాయంతో, వ్యవసాయ కార్మికులు తమ వేతనాల హెచ్చింపుకోసం పోరాటం ప్రారంభించారు. వారిపై లెక్కలేనన్ని దాడులు జరిగాయి. వారి యిండ్లు ధ్వంసం చేశారు. వ్యవసాయ కార్మికులు అందుకు ప్రతీకారంగా దుష్ట భూస్వాముల పొగతోటలను ధ్వంసం జేశారు భూస్వాములు వెంటనే లొంగివచ్చారు, రాజీకి సంప్రదింపులు ప్రారంభించారు. గ్రామస్థులకు సంభవించిన నష్టాలన్నింటికి పరిహారం చెల్లించటానికి భూస్వాములు అంగీకరించకతప్పలేదు. గ్రామప్రజలపై కేసులన్నింటినీ ఉపసంహరించుకోవాలని, గ్రామంలోని పోలీసుక్యాంపును ఎత్తివేయాలని ప్రజలు కోరారు. భూస్వాములు ఈ కోర్కెలన్నింటికి విధిలేక అంగీకరించారు. అయితే వారు వ్యవధికోసమే కాచుకుకూర్చున్నారు. తమ పంటలు చేతికొచ్చి అమ్ముకోవటం పూర్తికాగానే, వాళ్లు పోలీసులను మరల తీసుకొచ్చారు గుంటూరు జిల్లాలో ఏూకవుమ్మడి కాల్పులు ప్రారంభమయినాయి. ఏప్రిల్, మే నెలలు రెండింటిలోనే కాంగ్రెసు సాయుధపోలీసులు సుమారు 70 మందిని అరెస్టుచేసి కాల్చిచంపారు. వారిలో 15 మంది వేలూరు పరిసరగ్రామాలకుజెందినవారే. ఆ ప్రాంత నాయకుడు కామ్రేడ్ దండా నారాయణస్వామి కూడా ఆ విధంగా కాల్చిచంపబడినవారిలో ఒకరు.

అచ్చంపేట పోలీసు స్టేషన్‌పై దాడిచేయటానికి, తెలంగాణా గెరిల్లా దళాలు ప్రజలకు తోడ్పడ్డాయి. వారు ఇద్దరు పోలీసు కాన్‌స్టేబుళ్ళను కాల్చి చంపారు. 70 తుపాకులు స్వాధీనం చేసుకున్నారు. కోస్తా జిల్లాలలో పోలీసు స్టేషన్‌పై గెరిల్లాలు జరిపిన మొట్టమొదటి పెద్ద దాడి యిదే. ఈదాడి అనంతరం, సుమారు 15 గ్రామాలలోకూడా గెరిల్లాలు దాడులు జరిపి దుష్ట భూస్వాము లను చంపివేశారు. ఈ చర్యలలో అత్యధిక భాగం సరిహద్దునేవున్న గుంటూరు, పల్నాడు, సత్తెనపల్లి తాలూకాలలోనే జరిగాయి. తెలంగాణా గెరిల్లాలు సమీపంలోని అటవీప్రాంతాన్ని తమస్థావరంగాబెట్టుకుని ఈచర్యలుజరిపేవారు.

కృష్ణానదీతీరాన, కర్నూలు, గుంటూరు జిల్లాలలోగల నల్లమల అడవుల ప్రాంతమంతటావుండి పనిజేయటానికి తెలంగాణా గెరిల్లా దళాలు, ఆంధ్రకు జెందిన తమ సహచరులకు తోడ్పడ్డారు.

మొత్తం ఆంధ్రలో సుమారు వందగ్రామాలలో, ప్రజలు భూస్వా ములపైన, వాళ్ళ తాబేదార్లపైన దాడులు జేశారు. వారిలో కొందరిని చంపారు. మరికొందరి ఆస్తులను ధ్వంసం జేశారు. వారివద్దగల తుపాకులను స్వాధీనం చేసుకున్నారు.

ఈ దాడులన్నింటి సందర్భంగానూ, దుష్టభూస్వాములవద్దగల అప్పు పత్రాలను తాకట్టు దస్తావేజులను తగలబెట్టడం జరుగుతుండేది. ఈ విష యాన్ని గూర్చి కరపత్రాలద్వారా ప్రజలకు తెలియజేసేవారు. ఆ అప్పులు చెల్లించనవసరంలేదని, దస్తావేజులు తిరగరాయవలదని ప్రజలను కోరేవారు. పోలీసుల తోడ్పాటుతో అప్పులు వసూలు జేసుకోబూనుకునేట్లయితే మరింత విషమ పరిణామాల నెదుర్కొనవలసి వస్తుందని ఆయా భూస్వాములను హెచ్చరించేవారు.

అనేక గ్రామాలలో వ్యవసాయకార్మికులు, ఇతర పేదలు భూస్వా ముల ధాన్యాగారాలపై దాడులు జరిపి. ధాన్యాన్ని పంచుకున్నారు. అనేక యితర గ్రామాలలో వరిపంట కోసుకొని తలాకాస్త పట్టుకెళ్ళారు.

భూస్వాములను పోలీసు ఏజెంట్లను ప్రజలు ద్వేషించేవారు. శత్రువుల ఆస్తులను ధ్వంసం జేయటానికి వారు తోడ్పడేవారు. గ్రామస్థులు, ప్రత్యేకించి, వ్యవసాయకార్మికులు, పేదరైతులు తమ ప్రాణాలకు, ఆస్థిపాస్థు లకునష్టం కలిగే ప్రమాదమున్నా సరకుజేయక పార్టీనాయకులకు, కార్య కర్తలకు ఆశ్రయమిచ్చేవారు. వారిని తమ స్వంతబిడ్డలవలె కాపాడుకునేవారు. తూర్పుగోదావరిజిల్లా, అంతర్వేదిపాలెంలో ఇరవై గ్రామాలను మూకుమ్మడిగా మూడువేలమంది సాయుధపోలీసులు, కాంగ్రెస్ హోంగార్డులు చుట్టుముట్టినా

పార్టీ కామ్రేడ్ ఒక్కరయినా పట్టుబడలేదు. ఒకవారంరోజులపాటు పోలీసులు అరెస్టులు సాగిస్తున్నప్పటికీ ఆ ప్రాంతమంతటాగల మగవాళ్ళ నందరినీ కొడుతున్నప్పటికీ ప్రజలు వారందరినీకాపాడారు. వ్యవసాయకార్మికస్త్రీలే కొరియర్లుగా పనిజేయటానికి ముందుకొచ్చారు. ఇంత విస్తారంగా బీభత్సకాండ సాగినప్పటికీ, వందలాది పార్టీ సభ్యులు, పదులకొద్దీ ఆర్గనైజర్లు ఆ గ్రామాలలో నివసిస్తూనే వుండేవారు. ప్రజలు బ్రహ్మాండమైన సహకార మిచ్చినందువల్లనే, ప్రత్యేకించి వ్యవసాయకార్మికులు, పేదరైతులు సహకార మిచ్చినందువల్లనే ఇది సాధ్యమైంది.

నిరుపేదవర్గాలన్నీ, కమ్యూనిస్టుపార్టీని తమ పార్టీగా పరిగణించాయి. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ప్రజాప్రభుత్వ మేర్పడినప్పుడే తమ కష్టాలు అంతం కాగలవని వారు విశ్వసించేవారు తెలంగాణాకు సరిహద్దునే వున్న తాలూకాలలో, ప్రజలు కమ్యూనిస్టు గెరిల్లాలు వచ్చి భూమి పంపిణీ చేయటంకోసం ఆదుర్దాతో ఎదురుతెన్నులు జూచేవారు. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన వ్యవసాయ కార్మికులు, పేదరైతులు కొలది గ్రామాలల్లో బంజరు భూముల నాక్రమించుకున్న కడపజిల్లాలో సయితం నల్లగొండ కమ్యూనిస్టులు వచ్చారని, భూములు పంచుతున్నారని అంతా చెప్పుకున్నారు. గుంటూరుజిల్లా, పల్నాడు తాలూకా దళాలు, వుద్యమంలేని కొత్తప్రాంతాల గుండా పోతున్నప్పుడు అచ్చటి పేదరైతులు దళాలను కలుసుకొని, భూస్వాములను, అగ్రహారందార్లనుపారద్రోలి, ఈ ఫ్యూడల్ పీడ వదిలించండని కోరేవారు. గెరిల్లాలు దుష్టభూస్వాముల యిండ్లపైన, పోలీసు స్టేషన్లపైన దాడిజేసి, ఆయుధాలు స్వాధీనం జేసుకోవటం ప్రారంభించగానే, శత్రువుకు గుండె బేజారెత్తింది. దుష్టభూస్వాములు, వడ్డీవ్యాపారస్తులు గ్రామాలు వదిలిపెట్టి, బస్తీలకు పారిపోనారంభించారు. కృష్ణా, గుంటూరు ఉభయ గోదావరిజిల్లాల లోని గ్రామాలలో యిది సర్వసాధారణ దృశ్యం గ్రామాలలో మిగిలివున్న గూండాలు తుపాకులు ప్రక్కన బెట్టుకుని అంతా ఒకచోటనే పండుకుంటూ వుండేవారు. రాత్రంతా కాపలా ఏర్పాటు జేసుకునేవారు. తమ తావులను పదే పదే మార్చుకుంటుండేవారు.

అచ్చంపేట స్టేషనుపై దాడి జరగటంతో, శత్రువుల్లో గందరగోళం, భయ విహ్వాలత అంతకంతకూ అధికమయినాయి. "కమ్యూనిస్టులు 70 తుపాకులు చేజిక్కించుకున్నారు, ఇక మనం బ్రతికే దెట్లా ?" అని శ్రీ యన్. జి. రంగాగారు నివ్వెరపోయాడు ! సైనిక శాసనం ప్రకటించి, కమ్యూనిస్టులను నాశనం చేయాలని డిమాండ్ జేసిన ఈ కాంగ్రెస్ నాయకుడు, గుంటూరుజిల్లాలో తన పర్యటనలో తనను రక్షించటంకోసం పోలీసు లారీ వెంట లేకుండా బయలు

దేరటానికి సాహసించ లేకపోయేవాడు. "కమ్యూనిస్టులను అణచివేయటంలో ఆంధ్ర ప్రజలు తమతో సహకరించడంలేదని" భారతదేశంలో ఫాసిస్టు బీభత్స కాండకు అధ్వర్యం వహించిన కాంగ్రెస్ నాయకుడు వల్లభాయ్‌పటేల్ పార్లమెంటులో అంగీకరించవలసి వచ్చింది.

## ప్రభుత్వంచే మూకవుమ్మడి హత్యాకాండ

కృష్ణాజిల్లా, పార్టీ కమిటీ కార్యవర్గ సభ్యుడగు కా॥ మేడ్ చింతపల్లి పాపారావును 1949 అక్టోబరులో, దీపావళి రోజున, గన్నవరం తాలూకా, సూరంపల్లి గ్రామంలో కృష్ణాజిల్లా స్పెషల్ డి.యస్.పి పళనియప్పన్ అరెస్టు చేశాడు. పాపారావును పార్టీనుండి రాజీనామా చేయవలసిందిగా ఆ ధూరుడు, కోరాడు. పాపారావు ఆతనిమీద వుమ్మివేసి, "కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్" అనే నినాదంతో జవాబిచ్చాడు. తాళ్ళతో కట్టివుంచిన, ఆయన చేతులపై కాల్పులు జరిపి, రాజీనామా చేయవలసిందిగా పళనియప్పన్, మరల కోరాడు. "తుచ్ఛుడా, నీదాడిని గురించి, నాకు ఒక్క అరగంటముందు తెలిసినా, నేను నీ రక్తం కండ్లజూచేవాడిని" అని పాపారావు గర్జించారు. ఆయన తుంటి లోకి కాల్చగా, క్రిందపడిపోయాడు. అయినా పార్టీని వదులుకోవటానికి మూడోసారికూడా నిరాకరించాడు. మూడవ తూటా తన గుండెల్లో దూసుకు పోతుండగా, "కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్" అనే విజయ నినాదం పెదవులపై నుండగా ఆ వీరుడు ప్రాణాలు విడిచాడు ఆ రోజుల్లో పోలీసు బీభత్సకాండ అతి తీవ్రంగా సాగుతున్నప్పటికీ, తమ ప్రియతమ నాయకుని అంతిమ దర్శనం కోసం, గన్నవరం ఆస్పత్రివద్ద వేలాది ప్రజలు వచ్చిచేరారు. తనను పొడిచేయ బోతుండగా, పోలీసు అధికారి ఆయనను కాల్చి చంపాడని కాంగ్రెస్ విడుదల జేసిన ప్రకటనను ఎవ్వరూ నమ్మలేదు.

పశ్చిమగోదావరిజిల్లా కార్యదర్శివర్గ సభ్యుడు కామ్రేడ్ మృత్యుంజయుడుని రాజమండ్రిలోని ఒక యింట్లో అరెస్టు చేశారు. పట్టణం వెలుపల, యిప్పుడు కాగితంమిల్లువున్నచోటు సమీపానికి తీసుకెళ్ళి ఆయనను కాల్చి చంపారు. ఆయన ఒక ఘర్షణలో మృతిజెందాడని, ఆయన మిగతా సహచరులు తప్పించుకుపోయారని పత్రికలకు వార్తయిచ్చారు. (1950 మే 16).

పెండ్యాల-కానూరు రైతు పోరాట నాయకుడు, పశ్చిమ గోదావరి జిల్లా కమిటీ సభ్యుడునగు దేవరకొండ సుబ్బారావును సదదవోలులో అరెస్టు జేసి, కాలవకట్టపైన ఆ వెంటనే కాల్చిచంపారు. పశ్చిమ గోదావరి జిల్లా కార్యదర్శివర్గ సభ్యులగు కామ్రేడ్స్ నర్రా అంజనేయులు, పడాల సుబ్బారావు ఈడ్పుగంటి పూర్ణచంద్రరావులను వారుంటున్న వేర్వేరు అజ్ఞాత కేంద్రాల

నుండి అరెస్టుజేసి తీసుకొనివెళ్ళి నిలువునా కాల్చిచంపారు. తణుకు తాలూకా నాయకుడు కామ్రేడ్ కలిదిండి సూర్యనారాయణరాజును, నర్సాపురం నాయకులు కామ్రేడ్ ఆర్. అయ్యపరాజును, ఎ. రామరాజును అరెస్టుజేసి కాల్చి చంపారు (1950 మే 28)

దివి ప్రాంతీయకమిటీ సభ్యుడగు నాదెళ్ళ వెంకటకృష్ణయ్యను ఏలూరులో అజ్ఞాత స్థావరంలోవుండగా అరెస్టుజేసి, అక్కడి కక్కడే కాల్చి చంపారు. మరొక ప్రాంతీయ కమిటీ సభ్యుడైన యలమంచిలి వెంకటేశ్వర రావును మద్రాసు నగరంలోని అజ్ఞాత స్థావరంనుండి అరెస్టుచేసి, దివి తాలూకాకు తీసుకొచ్చి, దివి తాలూకాకే చెందిన దాసరి నాగభూషణంతోపాటు కాల్చిచంపారు. 1950 జులైలోనో ఆగస్టులోనో ఇది జరిగింది.

దివి ప్రాంతీయ కమిటీ కార్యదర్శి, కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టుపార్టీ స్థాపక సభ్యులలో నొకరునగు కామ్రేడ్ చలసాని జగన్నాధరావును, 1950 నవంబరు 16 న ఒరిస్సా రాష్ట్రంలోని రాయగడలో, బి హెచ్. రామారావు, తొట్టెంపూడి నారాయణరావు, కామ్రేడ్ సీతారామయ్యగార్లతోపాటు అరెస్టు చేశారు. వారిని దివి తాలూకాకు తీసుకుపోయి కాల్చిచంపారు. పోలీసులతో సంఘర్షణలో కాల్చిచంపబడినట్లు ప్రభుత్వం ప్రకటించింది.

దివి తాలూకా, కృష్ణాజిల్లా వ్యవసాయ కార్మికుల ప్రియతమ కమ్యూనిస్టు నాయకుడగు కామ్రేడ్ చల్లపల్లి నారాయణరావును, దివి తాలూకాకు చెందిన మరొక నాయకుడు కామ్రేడ్ గోగినేని తాతయ్యతోపాటు, వి. కొత్త పల్లి వద్ద అరెస్టుచేసి, ఇద్దరినీ కాల్చిచంపారు.

గన్నవరం ప్రాంతీయ కమిటీ సభ్యుడు కామ్రేడ్ సత్యప్రసాద్‌ను, కర్నూలుజిల్లా నంద్యాలవద్ద అరెస్టుజేసి ఆయన స్వగ్రామానికి తీసుకెళ్ళారు. వివిధచోట్ల అరెస్టు చేయబడిన మరోముగ్గురు కమ్యూనిస్టు కార్యకర్తలతోపాటు ఆయననూ కాల్చిచంపారు. శత్రువులపై అనేక ప్రజాచర్యలకు, ప్రత్యేకించి చినవోగిరాలపై మెరుపుదాడికి నాయకత్వం వహించిన యోధుడగు కాట్రగడ్డ చినవెంకటరాయుడు, ఆయన సహచరుడు కామ్రేడ్ కడియాల నారాయణరావు యిరువురూ గన్నవరం ప్రాంతంలో పార్టీని పునర్వ్యవస్థీకరించారు. వారిద్దరినీ బెజవాడలోని అజ్ఞాత నివాసంనుండి అరెస్టుజేసి 1950 డిసెంబరు మొదటి వారంలో కాల్చిచంపారు.

కామ్రేడ్స్ ఈడ్పుగంటి సుబ్బారావు, పాతూరి నరసింహారావు, కోనూరు మల్లికార్జునరావులను భీమవరంలో అరెస్టుజేసి కాల్చిచంపారు. ద్రోహి పొట్లూరు సుందరం నమ్మకద్రోహంవల్ల వారు పట్టుబడ్డారు.

నూజివీడు తాలూకాకుజెందిన కామ్రేడ్ చలసాని రాజగోపాలరావు, కృష్ణాజిల్లా గుడివాడప్రాంత నాయకులగు అట్లూరి వెంకటచలపతిరావు, మల్లిరెడ్డి సత్యనారాయణలను అరెస్టుచేసి కాల్చిచంపారు.

మునగాల పార్టీ నాయకులలో ఎక్కువమందిని, కామ్రేడ్స్ వంగలి పాపయ్య, గట్టు గోపాలకృష్ణయ్య తదితరులను కాల్చిచంపారు.

తూర్పుగోదావరిజిల్లా కార్యదర్శివర్గ సభ్యుడు కామ్రేడ్ కందికట్ల నాగభూషణంను, 1950 సెప్టెంబరుచివరివారంలో, అప్పుడు ఫ్రెంచిప్రాంతంగా వుండిన యానాంలో అరెస్టుచేసి, తీసుకొచ్చి ఆ మరుసటిరోజునే కాల్చి చంపారు. ఉదయంపూట కాలకృత్యాలు తీర్చుకొనే సమయంలో తప్పించుకు పోవటానికి ప్రయత్నించాడని కట్టుకథ నొకదానిని విడుదలజేశారు.

తూర్పుగోదావరిజిల్లా కార్యదర్శివర్గంలోని మిగతా ఇద్దరు సభ్యులు కామ్రేడ్స్ పి. అనంతం, చింతం సత్యనారాయణదాసులనుకూడా సామర్లకోట సమీపంలో ఒక గ్రామంలో అరెస్టుజేసి, అక్కడనేచెట్టుకుగట్టి కాల్చిచంపారు.

ఆంధ్ర విద్యార్థి ఫ్రాక్షన్ కమిటీ సభ్యులగు చలసానిశ్రీనివాసరావును మచిలీపట్నంలోని అజ్ఞాత నివాసంనుండి అరెస్టుచేసి, ఆ తర్వాత కాల్చి చంపారు. బెజవాడలో చదువుకుంటున్న విద్యార్థి కాంచనరావును పరీక్ష హాలులోనుండి బయటికొస్తుండగా అరెస్టుజేసి కాల్చిచంపారు.

గుంటూరు కళాశాలలో చదువుకుంటున్న దివితాలూకాకుజెందిన విద్యార్థి రావి భీమారావును అరెస్టుజేసి, దివితాలూకాకు తీసుకెళ్ళి కాల్చి చంపారు. బెజవాడ కార్మికనాయకుడు కామ్రేడ్ బెల్లం శోభనాద్రిని అరెస్టు జేసి, కాల్చిచంపారు. ఈ పేర్లను, యింకా అనేకమంది యితరుల పేర్లనూ ప్రభుత్వం పత్రికలలో ప్రకటించనైనాలేదు.

ఆంధ్రచేనేతపనివారి సంఘం కార్యదర్శి కామ్రేడ్ కస్తూరి కుటుంబ రావు, బాపట్ల పట్టణపార్టీ నాయకుడు కామ్రేడ్ చివుకుల శేషశాస్త్రి, జిల్లా ఉపాధ్యాయఫెడరేషన్ కార్యదర్శి కామ్రేడ్ యం. లక్ష్మీనారాయణ, నరస రావుపేట తాలూకా పార్టీ నాయకుడు కామ్రేడ్ దండా నారాయణస్వామి, గుంటూరుజిల్లా వ్యవసాయ కార్మిక నాయకుడు కామ్రేడ్ మల్లికార్జునశర్మ ఒంగోలు తాలూకా కామ్రేడ్స్ మాదాల కోటయ్య, నరసయ్య — వీరందరిని అరెస్టుజేసి నిలువునా కాల్చిచంపారు. రేపల్లె తాలూకా నాయకుడుకామ్రేడ్ దాసరి సుబ్బయ్యను భూస్వాముల గూండాలు చంపివేశారు.

మృత్యువును లెక్క జేయకుండా అద్భుతమైన శౌర్యసాహసాలను ప్రదర్శించిన ఘటన వొకటి బాపట్ల పట్టణంలో జరిగింది. ఇక్కడ తెనాలి ప్రాంతీయ కమిటీకి జెందిన అజ్ఞాత కేంద్ర మొకటుంది. ప్రాంతీయ కమిటీ సభ్యుడు కంఠంనేని వెంకటరత్నం, అచ్చట కామ్రేడ్ మోటూరు వెంకటరత్నం కుటుంబంతో కలసి వుంటున్నాడు. కామ్రేడ్ మోటూరు వెంకటరత్నం భార్య, రెండు సంవత్సరాల బిడ్డ ఆ యింట్లోవుంటున్నారు. పోలీసులు ఆ యింటిని చుట్టుముట్టారు. లొంగిపోవటానికి కామ్రేడ్ వెంకటరత్నం నిరాకరించాడు. దాడి జేయవచ్చిన పోలీసులతో పోరాడి, వాళ్ళకు బుద్ధిజెప్పాలని ఆయన అనుకున్నాడు. తాను కాల్పులతో పోలీసులను ఎదుర్కొంటూ మోటూరు కుటుంబాన్ని వెనుక వాకిలిగుండా వెళ్ళిపోవలసిందిగా ఆయన కోరాడు. తమ నాయకుడిని వొంటరిగా వదలి వెళ్ళటానికి వాళ్ళు నిరాకరించారు. తుపాకు లతో పోరాటంసాగింది. పోలీసుఇన్‌స్పెక్టరు నేలగూలాడు (అతడు అతర్వాత మరణించాడు.) పోలీసులు ఈ ప్రతిఘటనను తట్టుకోలేకపోయారు. అందువల్ల పెట్రోలుపోసి యింటికి నిప్పుబెట్టారు. కామ్రేడ్ కంఠంనేని వెంకటరత్నం, ఆయన అజ్ఞాత నివాస నిర్వాహకుడు మోటూరు వెంకటరత్నం, తల్లి చేతుల్లో వున్న ఆయన రెండుసంవత్సరాలబిడ్డ తుపాకి కాల్పుల కెరయై మృతిజెందారు.

తెలంగాణా గెరిల్లాలకు ఆశ్రయ మిస్తున్నందువల్ల, పల్నాడు తాలూకా, రామాపురం గ్రామానికి జెందిన జానికమ్మను మానంభంగంచేసి, హింసలకు గురిజేసి, అనంతరం కాల్చిచంపారు. ఆమెనేగాక, అ ప్రాంతానికి జెందిన కార్యకర్తలందరినీ కాల్చిచంపారు అచ్చంపేట పోలీసుస్టేషనుపై దాడి చేసిన తెలంగాణా గెరిల్లాలకు తోడ్పడ్డారని, రామాపురం కరణంవంటి పేరు మోసిన పోలీసు ఏజెంట్లను చంపారని సాకుజెప్పాడు.

అజ్ఞాతవాసంలోవున్న కామ్రేడ్స్‌ను మోసగించే విధానాన్ని ప్రభుత్వం చేపట్టింది. పొట్లూరు సుందరంను, తెలికెపల్లి కృష్ణమూర్తిని ఒక సంఘర్షణలో కాల్చి చంపినట్లు ప్రభుత్వం ప్రకటించింది. నిజానికి వాళ్లు అరెస్టు చేయబడిన తర్వాత, ప్రభుత్వ ఏజెంట్లుగా తయారయ్యారు. అజ్ఞాత వాసంలోవున్న అనేకమంది కామ్రేడ్స్‌ను పోలీసులు అరెస్టుచేయటానికివారు కారణభూతులయ్యారు. పొట్లూరు సుందరం, కామ్రేడ్ ఈడ్పుగంటి సుబ్బా రావుకు, భీమవరంలోని ఆయన సహచరులకు, తుమ్మలపల్లి గోపయ్యకు, ధవళేశ్వరంలోని ఆయన సహచరులకు నమ్మకద్రోహం చేశాడు. పోలీసులు వారినందరినీ అరెస్టుచేశారు. కాల్చిచంపారు. ఈ సుందరం ఆ తరువాత పోలీ సులద్వారా వివిధచోట్ల పొలాలు సంపాదించుకున్నాడు. తన విద్రోహ కార్య కలాపాలనుసాగిస్తూ కాంగ్రెస్ నాయకుడయ్యాడు. నల్లమల కృష్ణా అడవు

లతోనున్న తెలంగాణా గెరిల్లాలను, వారికి తోడుగావున్న గుంటూరు కామ్రేడ్స్‌కు ఆశలుగొల్పి లొంగదీయటంకోసం పోలీసులు వెంట తెలికేపల్లి కృష్ణమూర్తి పంపబడ్డాడు. అయితే గెరిల్లాలాతనిని కాల్చిచంపారు.

కాంగ్రెస్ పాలనలో ఆంధ్రప్రాంత జిల్లాలలో కాల్చిచంపబడిన కామ్రేడ్సు జాబితాను ప్రత్యేకంగా అనుబంధంగా యిస్తున్నాం. ఆ మృత వీరులు దాదాపు ఏూడువందలమంది వుంటారు.

ఆంధ్రలో నగ్నంగా సాగిన పోలీసు జులుంనుగూర్చి ఆరోజుల్లో పత్రికల్లో ప్రచురించబడిన ప్రకటనలను కొన్నింటిని దిగువన వుదాహరిస్తా:

## ఆంధ్రలో నిర్బంధకాండను గూర్చి కొన్ని ప్రకటనలు

కృష్ణాజిల్లా యలమర్రు గ్రామంలో జరిగిన సిగ్గుమాలిన పోలీసు దురంతాలపై, హరిజనాభివృద్ధి శాఖ మాజీమంత్రి, మద్రాస్ శాసనసభ సభ్యుడునగు శ్రీ వేముల కూర్మయ్య ఒక ప్రకటన జేశాడు. అందులోని కొన్ని భాగాలను దిగువనిస్తునాం:

> "1949 జూలై 14 న తెల్లవారకముందే 200 మంది మలబార్ స్పెషల్ పోలీసులు యలమర్రు గ్రామంపై దాడిజేశారు. వారు గ్రామాన్ని చుట్టుముట్టారు. ఎవరినీ వూళ్ళోనుండి బయటకు వెళ్ళనివ్వ లేదు. తెల్లవారిన తర్వాత, గ్రామ ప్రజలను మూడుమురాటుగా స్థానిక హైస్కూలు ఆవరణలో పోగుజేశారు వాళ్ళందరి బట్టలూడ దీశారు. ఒక్కొక్కరిని పదిదెబ్బలుకొట్టారు. ఆ తర్వాత, దిగంబరంగా వున్న ప్రజలను గ్రామవీధులలో వూరేగించారు! కొందరు తమ చేతులతో సిగ్గు దాచుకోటానికి ప్రయత్నించగా, వాళ్ళను మరల కొట్టారు. వారిలో కొందరిని గాంధీ విగ్రహంముందు సాష్టాంగపడజేసి యింకోసారికొట్టారు. ఇదంతా జరిగిన తర్వాతనైనా వాళ్ళబట్టలు వాళ్ళకు యివ్వలేదు. దిగంబరంగానే యిండ్లకువెళ్ళి, ఆడవాళ్ళకు దిగంబరంగానే కనిపించి, యింటివద్ద బట్టలేసుకొనిరమ్మని పంపారు. దారుణమైన అవమానానికి, దెబ్బలకు గురిజేయబడినవారిలో అస్పృశ్యులు, సృశ్యులు కూడా వున్నారు.

"హరిజనవాడలోని స్త్రీలందరినీ మైదానంలో, నిలబెట్టికొట్టారు. దిగంబరులుగానే మగవాళ్ళందరినీ ఆడవాళ్ళ దగ్గరకెళ్ళి, ఎవరిభార్యను వాళ్ళు తీసుకురమ్మని కోరారు 16 సంవత్సరాల వయస్సుఉళ్ళ తన

భార్య బట్టలూడదీసివేయవలసిందిగా ఒక యువకుని ఆజ్ఞాపించారు. అందుకా యువకుడు నిరాకరించాడు. ఇక వాళ్ళా యువతినే బెదిరించి, బట్టలు విడిచి, దిగంబరంగా తయారు కావలసిందిగా కోరారు. ఆమె అందుకు నిరాకరించింది. "మీరు నన్ను చంపితే చంపవచ్చు. నన్ను నేనుమాత్రం నీచ పరచుకోను" అని ఆమె సమాధానంగా చెప్పింది. అంతట ఒక పోలీసు ఆమె బట్టలూడదీయ బోతున్నాడు. అది చిక్కులకు దారితీస్తుందని హెచ్చరించి, గ్రామమునసబు ఆ పనిని నివారించాడు. ఆ తర్వాత, స్త్రీలను మరలా కొట్టి యిండ్లకు పోనిచ్చారు.

"జిల్లాలోని ప్రతి గ్రామంలోనూ ప్రజలు ఈ గ్రామంలో జరిగిన అత్యాచారాలను గూర్చి అడుగుతున్నారు. 1919 లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పంజాబులో సాగించిన అత్యాచారాలకంటె యివి దారుణంగా వున్నాయని అంటున్నారు.

"జిల్లాలోని పోలీసుదాడులకు గురిజేయబడిన ఈ గ్రామాలలో ప్రధాని, తెలుగుమంత్రులు పర్యటించి శాంతిని, ప్రజలకు రక్షణను వాగ్దానం జేయాలని నేను కోరుతున్నాను. అలా జరగకపోతే నిస్పృహతో ప్రజలు తిరగబడవచ్చు"

— ఆంధ్రప్రభ 1949 జులై 23.

● ● ●

గుడివాడతాలూకా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఐ. లింగయ్య, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యవర్గసభ్యుడు శ్రీ బి. విశ్వేశ్వరరావు పత్రికలకు దిగువ ప్రకటన విడుదలజేశారు.

"14 వ తేదీ వుదయం పోలీసులు గ్రామాన్ని చుట్టుముట్టారు. అప్పుడు వారు కొలదిమంది కమ్యూనిస్టులతో సహా గ్రామప్రజలందరినీ ఒక చోట చేర్చారు. వారిబట్టలూడదీసి దిగంబరులను జేశారు. లాఠీదెబ్బలు గొట్టారు. దిగంబరులుగానే వీధులలో ఊరేగించారు. గాంధీజీవిగ్రహంముందు సాగిలబడజేశారు ... ఈ సిగ్గుమాలిన, అనాగరిక అత్యాచారాలను ప్రజాతంత్ర ప్రభుత్వమేదీ సహించజాలదని మే మభిప్రాయపడుతున్నాం ... గాంధీజీ విగ్రహంముందు, దిగంబరులైన ప్రజలచే ప్రణమిల్లజేయటంద్వారా వారు గాంధీజీ పవిత్ర ఉన్నతాదర్శాలకే కళంకం తెచ్చారు. ఈ అత్యాచారాలను గూర్చిన్యాయమైన విచారణ జరపటం ఎంతైనా అవసరం ..."

● ● ●

యలమర్రు గ్రామ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు శ్రీ యెనిగళ్ళ వెంకట్రామయ్య ఒక ప్రకటనలో యిలా పేర్కొన్నారు:

"ఈ నెల 14 వ తేదీన మా గ్రామంపై దాడిజరిగింది. ఈ విధమైన దాడులు జరపడం, ప్రభుత్వ నిర్మాణ కార్యక్రమంలోని ప్రధానమైన అంశాలలో వొకటి, కమ్యూనిస్టులను అరెస్టుచేస్తే చేయవచ్చు; కొందరు గ్రామ పెద్దలను, కొందరు కాంగ్రెస్ వాదులను సయితం బట్టలూడదీసి కొట్టారు. ఇది కాంగ్రెస్ చరిత్రలో చెరగనిమచ్చ...... ఆ విధంగా చేసినందువల్ల, ప్రజలు కాంగ్రెస్‌పట్ల సానుభూతిని, విశ్వాసాన్ని కోల్పోతారు. దానిపట్ల ద్వేషం పెంపొందుతుంది. ఇందువల్ల, గ్రామాలలో కాంగ్రెస్ కమిటీల వునికియే అసాధ్యమవుతున్నది......"

—(ఆంధ్రప్రభ, 1949 జులై 26)

● ● ●

ఆంధ్ర సోషలిస్టు పార్టీ కార్యదర్శి, శ్రీ ఎ. చక్రధర్, 1949 జులై 22వ తేదీన ఆంధ్రప్రభకు వ్రాసిన సంపాదక లేఖలో యిలా పేర్కొన్నారు :

"కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా, కాటూరు గ్రామంపై, ఈ నెల 16 వ తేదీన 300 మంది పోలీసులు దాడిచేశారు. వారి వారి అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా, గ్రామంలోని పురుషులందరినీ దారుణంగా లాఠీలతో కొట్టారు. స్త్రీలను దుర్భాసలాడారు.

"సుమారు 400 మంది పురుషుల బట్టలూడదీసి,. దిగంబరులుగానే వారిని వీధులలో వూరేగించారు. వాళ్ళలో కొంతమంది స్త్రీలు కూడా వున్నారు. అయితే, వాళ్ళను దిగంబరులను గావించలేదు.

"కాంగ్రెస్ పాలనలో పోలీసులు చేపట్టవలసిన చర్యలివేనా? కాంగ్రెస్ నాయకులు, అధికారులు చూస్తూ వూరకుంటే, దేశంలో క్లిష్టపరిస్థితి ఏర్పడటం సహజం. అలాంటి క్లిష్టపరిస్థితికి కాంగ్రెస్‌వాదులే బాధ్యులవుతారు.

"ఈ సంఘటనపై అనధికార విచారణ జరిపించటానికి వుత్తర్వు చేయవలసిందిగాను, ఇకముందు అలాంటి ఘటనలు జరగకుండునట్లు తగిన జాగ్రత్తలు తీసుకోవలసిందిగాను మద్రాసు ప్రభుత్వానికినేనువిజ్ఞప్తిచేస్తున్నాను."

— ఆంధ్రప్రభ, 1949 జులై 24

● ● ●

ఆంధ్రలోని, ప్రముఖ తెలుగుదినపత్రిక ఆంధ్రప్రభ 1946 జులై 26 వ తేదీ సంపాదకీయంలో యిలా పేర్కొన్నది :

"అనాగరికమైనవి, దారుణమైనవి, నోటితో చెప్పటానికి వీలుగానివి — ఇవి చాలా ఘాటైన పదాలేకావచ్చు; అయితే కృష్ణాజిల్లాలో పోలీసుల పాశవిక దాడులను వర్ణించటానికి ఈ మాటలుసయితం చాలవు.

"ప్రతి గ్రామంనుండి ఒకేవిధమైన విషాదకరమైన, హేయమైన ఉదంతమే— ప్రజలందరినీ ఒక చోటికి పోగుజేయటం, వారిని విచక్షణా రహితంగా కొట్టటం, వారిలో కొందరిని వివస్త్రుల నొనరించటం, దిగంబరులు గానే ఆ ప్రజలను వీధులలో వూరేగించటం.

". . . . . అలాంటి పనులు చేయటం కమ్యూనిస్టులను అణచివేయ టానికి దోహదపడవు; కాంగ్రెస్‌పై విద్వేషాన్ని మాత్రమే సృష్టిస్తుంది కాంగ్రెస్‌పట్ల విశ్వాసం పెంపొందదు, బ్రిటిష్ రాజ్యమే మెరుగని ప్రజలను కునేట్లు చేస్తుంది.

"కృష్ణాజిల్లాలో, కమ్యూనిస్టులను అణచటానికి తాముజేసే ప్రయ త్నాలలో, పౌరహక్కులను ఉల్లంఘించడమేకాదు, భారత ప్రజలుగా జన్మించి నందుకు ప్రజలు సిగ్గుపడవలసిన పరిస్థితి ఏర్పడుతోంది.

". . . . . అలాంటి అత్యాచారాలను నిలుపుజేయటమేగాక, అందుకు బాధ్యులైన అధికారులను శిక్షించాలి".

"శ్రీ మాధవ మీనన్ (న్యాయమంత్రి) ఈ ఘటనలను, కమ్యూనిస్టు ప్రచారమని త్రోసిపుచ్చినట్లు మాకు తెలియవచ్చింది అదిసరిగాదు. మా కార్యాలయానికి లేఖలు వ్రాసినవారంతా కాంగ్రెస్‌వాదులే ఆ గ్రామాలను స్వయంగా సందర్శించి, విచారించి వచ్చిన తర్వాతనే వారు వ్రాశారు"

● ● ●

నిర్బంధకాండ ఎంతటి పాశవికము, దారుణము, వుద్దేశపూర్వకంగా వున్నదంటే, గ్రామాలపైకి పోలీసులను తీసుకొచ్చి దాడులు చేయించిన కాంగ్రెస్ నాయకులే ప్రజల ఆగ్రహాన్నిచూసి, ఆ దాడులను ఖండిస్తూ ప్రకటనలు చేయవలసివచ్చింది.

కృష్ణాజిల్లా కాంగ్రెస్ నాయకుడు మరుపిళ్ళ చిట్టి (బెజవాడలో యిద్దరు కమ్యూనిస్టులను హత్యజేయించినవ్యక్తి) యిలా పేర్కొన్నాడు :

"సేవాదళాలు (కాంగ్రెస్ వాలంటీరుదళాలు) గ్రామాలలో దాడుల సందర్భంగా లూటీ జేయబడిన డబ్బుతో పోషించబడుతున్నాయి. త్రాగు బోతులు, నేరాలుజేసి శిక్షలు పొందటానికలవాటు పడినవారు, గ్రామ కాంగ్రెసు నాయకులయ్యారు ... లూటీలు, గృహదానాలు, హత్యలు జరప బడుతున్నాయి ... "

— ఆంధ్రపత్రిక, ఏప్రిల్ 21

● ● ●

కాంగ్రెస్‌వాది, రేపల్లె పంచాయితీబోర్డు అధ్యక్షుడు (గుంటూరు జిల్లా)నగు యన్. వెంకటరమణ యిలా పేర్కొన్నాడు :

"... 60 మంది యం. యస్. పి. వాళ్ళు రేపల్లెబోర్డు స్కూలులో మకాం పెట్టారు. వాళ్ళు వచ్చినప్పటినుండీ, ఆ దారినపోవటానికే ప్రజలు భయపడుతున్నారు ... ఇటీవలనే ఒక పోలీసువెళ్ళి ఒక వ్యాపారస్థుడిని సబ్బు ఖరీదెంతని అడిగాడు దాని ఖరీదు ఐదున్నర అణాలని చెప్పాడు. "మాకూ అంతేనా ?" అని ఆ పోలీసు ఆగ్రహంతో పలికి వెళ్ళిపోయాడు. వాళ్ళు సాయంత్రం వచ్చారు. ఆ వ్యాపారస్థుడిని యిష్టం వచ్చినట్లుకొట్టి, తమ క్యాంపుకు తీసుకుపోయారు ... ఒకరోజున ఒక గొర్లకాపరి తన గొర్రెలను మేపుకొనటానికి హైస్కూలు ఆవరణలోకొచ్చాడు పోలీసులు నిర్బంధంగా రెండు గొర్రెలను తీసుకొని, కోసుకుతిన్నారు ఇటీవలనే ఒక లంబాడీ స్త్రీ వుప్పుకొనుక్కెళ్ళడంకోసం పూళ్ళోకొచ్చింది. పోలీసులు ఆమెను పట్టుకొని తమ క్యాంపుకు తీసుకెళ్ళారు. వాళ్ళలో చాలామంది ఆమెను క్రూరంగా చెరిచారు. స్పృహదప్పిపోయిన తర్వాత ఆమెను రేపల్లెరైల్వే స్టేషన్ సమీపంలో వదిలేశారు . . అదేవిధంగా సినిమాజూచి తనవూరికి తిరిగి వెళ్తున్న మరొక స్త్రీని పట్టుకుని చెరిచారు ..."

— ఆంధ్రప్రభ, 1950 మే 22

● ● ●

పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకియగు కాంగ్రెస్ నాయకుడు; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు యన్. జి. రంగా సోదరుడైన గోగినేని లక్ష్మీనారాయణ యిలా పేర్కొన్నాడు :

"1950 జులై 26 వ తేదీ రాత్రి, ఫిరంగిపురం పోలీస్ సబ్-యిన్‌స్పెక్టరు, కొందరు కాన్‌స్టేబుళ్ళతో కలసి నుదురుపాడు గ్రామంపై దాడి జేశాడు ... ... ప్రతి యింటిలోనూ, మంచాలు, పచ్చడి జాడీలు, సిమెంటు నీళ్ళతొట్లు, యిత్తడి పాత్రలు మొదలైనవన్నీ ధ్వంసంచేశారు. చిందరవందరగా చిమ్మివేశారు. కొంతమంది వర్తకులకు జెందిన ఆరేడు, ఆముదండబ్బాలు పగలగొట్టి, ఆముదం నేలమీద గుమ్మరించారు.

"పోలీసు అత్యాచారాలకు ఎరయైన కె. లక్ష్మీనారాయణ నాతో యిలా చెప్పాడు .

"సాయంత్రం 4 గంటలకు పోలీసులొచ్చారు. లంజకొడకా, నువ్వు కమ్యూనిస్టు నాయకుడవా ? అని అడిగారు. అలా అడుగుతూ, నన్ను తీవ్రంగా కొట్టారు. నేను స్పృహదప్పి పడిపోయాను నా యింట్లో ఆహార పదార్థాలు, తదితర వస్తువులన్నింటినీ నేలపాలుజేశారు. డబ్బు లూటీజేశారు. తలుపులు, మంచాలు విరగగొట్టారు ... ... పోలీసులు టి. ఓబులరెడ్డి యింటికి వెళ్లారు."

పోలీసుల అత్యాచారాలనుగాంచి ఆయన, ఆయన భార్య వేరొకరింటికివెళ్ళి తలదాచుకొన్నారు. పోలీసులు ఆయన యింట్లో ప్రవేశించారు. యింటిని నష్టపరిచారు. జాడీలు, యిత్తడి పాత్రలు, మంచాలు, అలమరలు మొదలైనవన్నీ బ్రద్దలుకొట్టారు.

యు. పిచ్చిరెడ్డిని, తుపాకి మడిమతోను, లాఠీలతోనూ కొట్టారు. ఆయన ఆస్తి ధ్వంసం జేశారు. ఆయనను అరెస్టుజేసి, సుబ్బారెడ్డి యింటికి తీసుకెళ్ళారు. (సుబ్బారెడ్డి అందరిలోకీ పెద్ద భూస్వామి. ఈ దాడులు చేయించిందాయనే). ఈలోగా, సుబ్బారెడ్డి అటువైపుకొచ్చాడు. ఆయనకు సంతృప్తి కలిగిందో, లేదోనని పోలీసు అధికారి సుబ్బారెడ్డిని అడిగాడు. 'లేదు. యింకా సంతృప్తి గలగలేదు. మరికొంత మందిని వరుసలో కూర్చుండబెట్టి కొట్టాలి !! అని ఆయన సమాధానమిచ్చాడు."

● ● ●

సత్తెనపల్లి కాంగ్రెస్ కమిటీ, నరసరావుపేట మునిసిపాలిటీ తణుకు కాంగ్రెస్ కమిటీ, యింకా అనేకమంది యితరులు, ఈ నిర్బంధకాండను ఖండిస్తూ ప్రకటనలు జేశారు.

● ● ●

పౌరహక్కుల సంఘం, మద్రాస్ కార్యదర్శి శ్రీ సి.వి. రాజగోపాలాచారి ఆ సంఘం సర్వసభ్యసమావేశానికందజేసిన ఒక ప్రత్యేక నివేదికలో యిలా పేర్కొన్నాడు :

"కోడూరు, వెల్వడం, గణపవరం గ్రామాలనుండి సాయుధ స్పెషల్ పోలీసులు ఏడుగురు రైతులను నిర్బంధించి తీసుకెళ్ళారు. మైలవరం సమీపంలోని బుచ్చిరెడ్డిపాలెంలో వారందరినీ కాల్చిచంపారని చెప్పబడుతున్నది.

"కొత్తపాలెం సమీపంలో దాగియున్న చల్లపల్లినారాయణరావును, తాతయ్యను, భూములుగల సంపన్నవర్గానికిజెందినవాళ్ళు పట్టుకుని, అవనిగడ్డ సర్కిల్ యిన్‌స్పెక్టర్ నాయకత్వానగల పోలీసుబృందానికి వొప్పగించారు. వారిని పోలీసులు కాల్చిచంపారు. ఈ సంఘటననుకూడా పోలీసులకు — కమ్యూనిస్టులకు మధ్య సంఘర్షణగానే ప్రకటించారు. అయితే ఆ తర్వాత, వారిద్దరినీ పట్టుకున్నవాళ్ళకు బహుమతు లందజేయబడినట్లు వార్త వెలువడింది.

"మొవ్వ గ్రామానికి జెందిన వెంకటేశ్వరరావును, భూములుగల సంపన్నవర్గ బృందంవాళ్ళు పట్టుకొని, పెదముత్తేవి పోలీస్ స్టేషన్‌లో కొట్టి చంపారు. ఆశలుబెట్టి, భయపెట్టి ఆయన మేనమామ నోరు మూయించారు. వెంకటేశ్వరరావు మృతదేహాన్ని శవపరీక్షనిమిత్తం మచిలీపట్టణం పంపించారు.

అది స్పష్టంగా హత్యయేనని, జిల్లా మెడికల్ ఆఫీసరు శవపరీక్షానంతరం సర్టిఫికెట్ జారీ చేశాడు. ఆహూతయినది కమ్యూనిస్టు గాబట్టి, నేరస్థులను నిర్బంధించటానికి పోలీసులు ఎలాంటి చర్యతీసుకోలేదు.

"పోలీసులు ఈ గ్రామానికి నాలుగు మృతదేహాలను తెచ్చారు. 'సంఘర్షణ' జరిగిందని వాళ్లు మేజస్ట్రేటుకు నివేదించారు. కమ్యూనిస్టులు నిలచి కాల్పులు సాగించారని చెప్పబడిన ప్రాంతం చిత్తడినేల. అయినా, మృతదేహం పైనగాని కనీసంవారి పాదాలపైనగాని బురద ఎక్కడా కనిపెంచలేదు .."

"విజయవాడ స్పెషల్ సెకండ్ క్లాస్ మేజస్ట్రేట్ ఎదుట విచారణలోవున్న జాస్తి రాఘవయ్య, జాస్తి బసవారావు బెయిలుమీద వున్నారు. వారు ప్రతివాయిదాకు క్రమం దప్పకుండా హాజరవుతున్నారు. ఒకరోజురాత్రి స్పెషల్ పోలీసులు వారిద్దరినీ వారి నివాసాలనుండి ఎక్కడికో తీసుకుపోయి, కాల్చిచంపారు. నిందితులను పోలీసులు తీసుకెళ్ళారని, జామీనుదారులు మేజస్ట్రేట్‌కు తెలియజేశారు. ఒకరు వెయ్యిరూపాయలకు, మరొకరు ఎనిమిది వందల రూపాయలకు వ్రాసియిచ్చిన జామీనుబాండులను స్వాధీనం జేసుకుంటూ సబ్ మేజిస్ట్రేటు వుత్తర్వుజేశాడు

"కృష్ణాజిల్లా, మాజీ డిప్యూటీజిల్లా మేజిస్ట్రేట్ మిస్టర్ క్రోంబి, కేవలం విసుగుదలతోనే రాజీనామా చేయవలసివచ్చింది. కమ్యూనిస్టులకు – స్పెషల్ పోలీసు బలగానికీమధ్య సంఘర్షణలు జరిగినట్లు ఫిర్యాదు చెయబడిన సంఘర్షణలనబడేవి ఎంతవరకు సరైనవని ప్రశ్నిస్తూ ఆయనకు అనేక నివేదికలందినట్లున్నది."

— క్రాస్‌రోడ్సు, 1950 సెప్టెంబరు 8

మాజీ పబ్లిక్ ప్రాసిక్యూటర్, శ్రీ యలమంచిలి నాగభూషణం, 1950 జూన్ 25 వ తేదీన మద్రాసు పౌరహక్కులసంఘం మహాసభ అధ్యక్షోపన్యాసంలో యిలా పేర్కొన్నారు :

"పరిస్థితి వూహకందనిమేరకు అధ్వాన్నమయిపోయింది, మన స్వాతంత్ర్యం,మన స్వేచ్ఛ – రాజకీయాధికారం చేతిలోవున్న స్థానిక నాయకుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుంది ...

"మద్రాస్ సప్రెషన్ ఆఫ్ డి జార్డర్ యాక్టు (1948)లో 5 వ సెక్షను, ప్రతివారినీ భయకంపితులను గావిస్తున్నది. పోలీసు అధికారి ఎంతమంది పైనైనా కాల్పులు జరపవచ్చు. ఎవరూ మారు మాట్లాడటానికి వీలులేదు. మరొక సెక్షను ద్వారా పోలీసు అధికారికి రక్షణ కల్పించబడింది ... కాల్పులు జరపాలా, అవసరంలేదాఅని నిర్ణయంచేసే అధికారాలు పోలీసు అధికారులకు

దఖలు పరచబడినాయి ... ఈ చట్టం సామాన్యప్రజల ప్రాణాలను పోలీసు అధికారుల చేతుల్లో పెడుతోంది .. అలాంటి అధికారుల చేతిలోవుండటంవల్ల కొందరు పోలీసు అధికారులు డయ్యర్ అడుగుజాడలలో నడవనారంభించారు. జనరల్ డయ్యర్‌నాటి ఘటనలు ప్రజల స్మృతిపథంలోనుండి యింకా చెరిగి పోలేదు. ఆ రోజులలో నాయకులుగా ముందుకొచ్చినవారు ఈనాడు అధికారంలోవున్నారు. వారే నేడు ఎవరినైనా కాల్చిచంపే అధికారాన్ని పోలీసు అధికారులకు దఖలు పరిచారు. ఇది అతిదారుణం ... కమ్యూనిస్టులకు — పోలీసులకు మధ్య ఘర్షణ జరిగినట్లు, పోలీసులు కొందరు కమ్యూనిస్టు విద్రోహశక్తులను కాల్చిచంపినట్లు మన దినపత్రికలలో వార్తలు ప్రచురించ బడుతున్నాయి అలాంటివార్తలు చదివినకొలదీ, వాటి వెనకగల వాస్తవం మనకే బోధపడుతుంది కొన్ని సందర్భాలలో కమ్యూనిస్టుపార్టీ సానుభూతి పరులు, సానుభూతిపరులని అనుమానించబడిన వారూ ఎక్కడికో తెలియని చోట్లకు పంపించబడి కాల్చి చంపివేయబడినట్లు వదంతులు పత్రికలలో ప్రచురించబడినాయి.

"దీర్ఘకాలంపాటు తామే అధికారానికి అంటిపెట్టుకుని వుండగలందు లకై, అధికారంలో వున్నవారే అలాంటి తీవ్రపరిస్థితిని సృష్టిస్తున్నారని నేను భావించక తప్పటంలేదు"

o o o

అలాంటి దారుణ హత్యాకాండతో గూడిన కాంగ్రెసు పాలన నాడు సాగింది. అయినా, భారత యూనియన్ ఉప ప్రధానమంత్రి సర్దార్ పటేల్ అనాడు కమ్యూనిస్టుపార్టీని అసత్యాలతో దూషించాడు. హత్యలు, గృహదహనాలు, లూటీలు పార్టీకి ఆయన అంటగట్టాడు ప్రజాతంత్ర పత్రిక లన్నింటినీ మూసివేసిన తర్వాతనే, ప్రజల గొంతుకలన్నింటినీ నొక్కివేసిన తర్వాతనే, కమ్యూనిస్టుపార్టీని, ప్రజాసంఘాలన్నింటినీ నిషేధించిన తర్వాతనే, తన ఫాసిస్టు బీభత్సకాండను మధ్యయుగాలనాటి పాశవిక పాలనను ప్రజల నెత్తిన రుద్దిన తర్వాతనే సర్దార్ పటేలు ఆ పనిచేశాడు తప్పుడు ప్రచారం సాగించేపనిని కిరాయి పత్రికల కొప్పగించగలిగాడు

## అధ్యాయం : 1

# భారత సైన్యం ప్రవేశం

# తదనంతర పరిస్థితి

### 1. భారత సైన్యం రంగంలో ప్రవేశించేనాటి స్థితి

భారత యూనియన్‌లో చేరేటట్లు నైజాంను లొంగదీయడానికీ – వ్యాప్తిజెందుతున్న తెలంగాణా రైతు ఉద్యమాన్ని అణచివేసేందుకూ హైదరాబాదు సంస్థానంలో భారత ప్రభుత్వం జోక్యం కల్పించుకునే అవకాశం కలదని, 1948 వ సంవత్సరం మధ్యకల్లా వివిధ పరిణామాలనుబట్టి విదితమయింది. ఆ పరిస్థితిలో మనం ఏమి చేయాలనే ప్రశ్న ఉదయించింది.

భారతసైన్యం ప్రవేశించిన తర్వాత, హైదరాబాద్ సంస్థానం భారత యూనియన్‌లో విలీనంకాక తప్పదని, రజాకార్ బీభత్సకాండ అంతమవుతుందనీ మనకు ఖచ్చితంగా తెలుసు. అయితే అదేసమయంలో మన పార్టీని, సంఘాన్ని, తెలంగాణా ఉద్యమాన్ని తుదముట్టించేందుకు భీకరమైనదాడి సాగటం తథ్యమనే విషయంకూడా మనకు తెలుసు. ఆంధ్రప్రాంతంలో మన పార్టీపై కాంగ్రెస్ ప్రభుత్వం సాగిస్తున్న దాడినిబట్టీ, అమలుపరుస్తున్న నిర్బంధ కాండనుబట్టి మనం ఆ భీకరదాడి ఎలా వుండబోయేదీ ముందుగానే వూహించ గలిగాము అందువల్ల, మనం సాధించుకున్న విజయాలన్నింటినీ వమ్ముచేసి, తెలంగాణా ఉద్యమాన్ని సర్వనాశనం చేసేందుకు తయారైన నెహ్రూ సైన్యా

లకు వ్యతిరేకంగానూ, మనం సాయుధ పోరాటం సాగించటమా? లేక సాయుధ పోరాటాన్ని వుపసంహరించుకుని, పాక్షిక కోర్కెల సాధనకోసం, బేదఖళ్ళను అంతం జేయటం, వెట్టిచాకిరికి, నిర్బంధ వసూళ్ళకు స్వస్తిజెప్పటం, సాగుజేసుకొంటున్న బంజరు భూములకు పట్టాహక్కులు సంపాదించుకోవడం మొదలుగాగల వాటిని పాక్షికంగా నిలబెట్టుకొనటానికిగాను సాధారణమైన చట్టబద్ధ రూపాలలో ఆందోళననూ పోరాటాలనూ సాగించడమా? అలాగే వ్యవసాయక శాసనంకోసం గరిష్ఠ పరిమితులు, కౌళ్ల తగ్గింపులకోసం, పౌర హక్కులకోసం ఎన్నికైన స్థానిక సంస్థలకోసం సంస్థానానికి ఎన్నికైన మంత్రి వర్గం ఏర్పరచాలని మొదలుగాగల కోర్కెలకోసం ఆందోళన సాగించటానికి, ప్రజాసమీకరణకు పరిమితమై వుండటమా?

భారత సైన్యం ప్రవేశించిన వెంటనే మనం పోరాటాన్ని బేషరతుగా ఉపసంహరించుకున్నట్లయితే బడా భూస్వాముల, వారి ఏజెంట్లు, నైజాం పోలీసుల, రజాకార్ల భూములను, ఆస్తులను స్వాధీనంజేసుకునే కార్యక్రమాన్ని నిర్వర్తించిన వేలాది గెరిల్లాదళ సభ్యులను, పార్టీ కార్యకర్తలను సంఘం కార్యకర్తలను భారత ప్రభుత్వం వెంటాడి వేధించకుండా వుంటుందా? క్షమాభిక్ష ప్రకటిస్తుందా? రైతులు స్వాధీనం జేసుకుని సాగుజేసుకుంటున్న భూములను వారి అధీనంలోనే వుండనిస్తుందా? భారత ప్రభుత్వం అలా చేయబోదనటంలో మనకెలాంటి సందేహంలేదు. అలాంటప్పుడు తమ అధీనంలోని భూములను గుంజివేయటానికి జరిగే అలాంటి ప్రయత్నాలను రైతులు ప్రతిఘటించకుండా వూరుకుంటారా? అలా ప్రతిఘటించే వారికి మనం అండగా నిలబడకపోతే, గతంలోవలెనే సాయుధంగానైనాసరే వారిని బలపరచకపోతే, మనం ద్రోహం చేశామని వారు భావించరా?

సాయుధ పోరాటం కొనసాగించాలని మనం నిర్ణయించేట్లయితే వున్నతమైన మనోనిబ్బరం గలిగిన సుశిక్షితమైన, క్రమశిక్షణ గలిగిన భారత సైన్యంముందు మన దళాలు ఏ విధంగానూ సరితూగజాలవు. అంతేకాదు; నైజాం వ్యతిరేక పోరాటంలో మనతోనే నిలచిన దనికరైతులు, చిన్న పెట్టుబడిదారులు, వుదారభూస్వాములు, తదితరులలో ఎక్కువభాగం ఆ దశలో తప్పనిసరిగా భారత ప్రభుత్వంవైపుకుపోయితీరుతారు. నెహ్రూ నాయకత్వాన గల స్వతంత్రభారత ప్రభుత్వం,అర్థికాభివృద్ధికోసం తాము కంటున్నకలలను ఫలింపజేయగలదని ఈ వర్గాలు ఎంతగానో ఆశలుబెట్టుకున్నాయి. సంస్థానంలో కార్మికవర్గ పోరాటాలులేవు. సార్వత్రికసమ్మెగాని, సాయుధ తిరుగుబాటుగాని జరిగే అవకాశంలేదు. అలాంటి పరిస్థితిలో సాయుధపోరాటాన్ని కొనసాగించటం ఎనలేని హాని కలుగజేయదా?

సాయుధ పోరాటాన్ని కొనసాగించవలసివస్తే, విమోచనకోసంగాక, మరొకందుకు సాగించటమెలా సాధ్యం? [విమోచనకోసం సాగించే సాయుధ పోరాటానికి భిన్నమైన, ఆవిధంగా గందరగోళ పరచగూడని-పాక్షిక ఆర్థిక కోర్కెలకోసం సాగించే పాక్షిక సాయుధ పోరాటమనే భావనయే మన అవగాహనలో నాడు లేదు. సాయుధ పోరాటమంటే, విమోచన పోరాటం లేదా విప్లవ సాయుధ విజృంభణ అనేది మనకు ఆనాడున్న అవగాహన.]

ఆనాటి తెలంగాణా పోరాటం భారతదేశ విముక్తి పోరాటానికి ప్రారంభం కాగలదా? భారతదేశపు యెనాన్‌గా దాన్ని పరిగణించనగునా? మన విప్లవాన్ని సాధించేందుకు చైనా పంథాననుసరించాలా? లేక రష్యా పంథాననుసరించాలా? మన విప్లవంలో పాల్గొనే వర్గాలేవేవి? ఏ వర్గాలకు వ్యతిరేకంగా అది వుద్దేశించబడింది? అంటే, 1947 లో అధికారం చేపట్టిన రాజ్యాంగయంత్రం యొక్కవర్గ స్వభావమేమిటి? ఆ విప్లవం ఏ దశలో వుంది? దాని వ్యూహ మేమిటి?

ఈ సమస్యలన్నీ తలెత్తాయి. వాటికి ఆచరణాత్మకమైన తక్షణ పరిష్కారం కనుగొనవలసిన ఆవశ్యకత ఏర్పడింది. వాటిపై తీవ్రమైన చర్చలు సాగాయి

ఆనాడు మనకున్న అవగాహనకు, తీసుకున్న నిర్ణయానికి అనుకూలంగాను, వ్యతిరేకంగాను వచ్చిన వాదనలనుగూర్చి అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వపు సలహాపై ఆ తర్వాత చేసుకున్న దిద్దుబాట్లనుగూర్చి, "సాయుధ పోరాట ఉపసంహారణ" అనే అధ్యాయంలో సవివరంగా పరిశీలించటం జరుగుతుంది

కనుక మరల తెలంగాణా పోరాట కథనంలో కొద్దాం.

శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ ఎల్లారెడ్డి ప్రాంతీయ నాయకులలో అనేకమంది సాయుధ పోరాటాన్ని ఉపసంహరించి, అవకాశమున్న పరిధిలో చట్టబద్ధమైన, తదితర పోరాట రూపాలు చేపట్టటానికి అనులంగా వున్నారు. భూస్వాముల మిగులు భూములను స్వాధీనం చేసుకోవటం, భూపంపిణీకి పూనుకోవటం తప్పనే తన సిద్ధాంతాన్ని శ్రీ రావి నారాయణరెడ్డి ఆ తర్వాత రూపొందించారు. ఆ వాదనను గూర్చి ఇంతకుముందే పరిశీలించాం.

భారత ప్రభుత్వం, బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వం గాబట్టే, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో అది లంకె వేసుకుని వున్నదిగాబట్టీ, హైదరాబాదు సంస్థానంలో భారత సైన్యాల ప్రవేశాన్ని మనం వ్యతిరేకించాలని, 'స్వతంత్ర'

హైదరాబాద్' నినాద మివ్వాలని శ్రీ రాజ బహుదూర్‌గౌర్, మహేంద్ర. తదితరుల నాయకత్వానగల హైదరాబాద్ నగరం కమిటీ తరఫున ఒక పత్రికా ప్రకటన వెలువడింది నైజాం నవాబును గద్దెదించడం కోసం, హైదరాబాదులో జనతా ప్రజాస్వామ్య స్థాపనకోసం, నైజాంనవాబుకు వ్యతిరేకంగా మన పోరాటాన్ని కొనసాగించవలసిందేననీ, అయినా, హైదరాబాదు సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయటానికి భారత ప్రభుత్వం సాగించే ప్రయత్నాలకు వ్యతిరేకంగా మనం పోరాడవలసిందేననికూడా వారు ఆ ప్రకటనలో పేర్కొన్నారు. తెలంగాణా పార్టీ నాయకులగు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావులు కూడా సభ్యులుగా గల ఆంధ్రరాష్ట్ర కమిటీ, ఆ మరుసటి రోజునే ఈ నినాదాన్ని బహిరంగంగానూ ఏకగ్రీవంగానూ ఖండించింది. ఆనినాదం, నైజాంకు, రజాకార్లకు తోడ్పడడమేనని, హైద్రాబాదు సంస్థానాన్ని విచ్ఛిన్నంజేసి, భారత యూనియన్‌లోని ఆయా భాషా ప్రాంతాలలో విలీనంజేసి, విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, సంయుక్త కర్నాటక రాష్ట్రాలను ఏర్పర్చాలని, జనతా ప్రజాస్వామ్య భారత రిపబ్లిక్‌లో వాటిలో ప్రజారాజ్యం స్థాపించాలనికోరే పార్టీ విధానానికి యిది పూర్తిగా విరుద్ధమని ఆంధ్రకమిటీ స్పష్టంజేసింది. పార్టీ' విధానానికి ఈవిధంగా దారుణంగా ద్రోహంజేసినందుకు, వుద్యమానికి హానికలుగజేసే విధంగా ప్రకటించినందుకు హైదరాబాదు నగర కమిటీని పార్టీ నిశితంగా ఖండించింది.

భారతప్రభుత్వం దాని రేడియో, పత్రికలూ నగర కమిటీచేసిన ప్రకటన నాధారంగాజేసుకొని కమ్యూనిస్టులు రజాకార్లతో కలిసిపోయారని నిరంతరాయంగా నిందాప్రచారం సాగించ నారంభించాయి మొత్తం భారత-దేశంలో ప్రజాతంత్ర వుద్యమంనుండి మనలను వేరుజేయటానికి, మనలను అప్రతిష్టపాలుజేయటానికి ఆ విధంగా అవి పూనుకున్నాయి. హైదరాబాదు నగరకమిటీ చేసిన అత్యంత హానికరమైన, మతిమాలిన ప్రకటనను ఖండిస్తూ మనం చేసిన ప్రకటనను పత్రికలుగాని. ప్రభుత్వంగాని, ప్రస్తావించటంగాని ప్రచురించటంగాని జరగలేదు.

ఆ నగర కమిటీయే ఆ వ్యక్తులే, కొన్ని నెలల అనంతరం, సాయుధ పోరాటాన్ని కొన సాగించటాన్నే వ్యతిరేకించారు! తెలంగాణా వుద్యమం వ్యక్తిగత దౌర్జన్యవాదంగా హత్యలూ, లూటీలు చేయటంగా దిగజారిపోయిందని ఖండిస్తూ, 1951 ప్రారంభంలో బాహాటంగా బయటబడి, ఖండించటంలోనూ వారేముందున్నారు! ఆ వుద్యమాన్ని బేషరతుగా వుపసంహరించాలని రాష్ట్రస్థాయి మొదలు జోనల్‌స్థాయి, గ్రామస్థాయివరకు తెలంగాణా

పోరాటానికి నాయకత్వం వహిస్తూవచ్చిన నాయకత్వమంతటినీ బాధ్యతా యుత స్థానాలనుండి తొలగించాలనీ వారు డిమాండ్ చేశారు! వారి విప్లవ ఎత్తుగడల స్థాయి, వారి ధైర్య స్థయిర్యాల సరుకు అలాంటిది!

శ్రీ రావినారాయణరెడ్డి, శ్రీ ఎల్లారెడ్డి సాయుధపోరాట వుపసంహా రణకు అనుకూలురైనప్పటికీ, పోరాటం కొనసాగించాలని పార్టీ నిర్ణయించిన తర్వాత, ఆ నిర్ణయాన్ని శిరసావహించటానికి, ఆచరణలోపెట్టటానికిప్రయత్నిం చిన విషయాన్నికూడా ఈ సందర్భంగా పేర్కొనవలసివుంది. పోలీసుచర్య అనంతరం కొలది మాసాలలోనే శ్రీ ఎల్లారెడ్డి అరెస్టు చేయబడ్డాడు. శ్రీ రావి నారాయణరెడ్డి 1950 అక్టోబరువరకు అజ్ఞాతవాసంలో వున్నాడు. ఆ తర్వాత ఆయన రాష్ట్ర నాయకత్వానికి తెలియపరచకుండానే తన అజ్ఞాత నివాసాన్ని వదిలి, బొంబాయిలోగల పార్టీ కేంద్ర కార్యాలయానికి చేరుకున్నాడు. 1950 డిసెంబరు 13న పార్టీ కేంద్రకమిటీ తెలంగాణా పోరాటంపై ఒక తీర్మానం చేసినప్పటికీ, ఆయనమాత్రం తెలంగాణా సాయుధ పోరాటాన్ని కొనసాగించ టానికి వ్యతిరేకంగా ప్రచారాన్ని కొనసాగించాడు.

కేంద్ర కమిటీ తీర్మానంలో యిలా వుంది:

"తరతరాలుగా తమను దోపిడిజేస్తున్న పీడకులకు వ్యతిరేకంగా, తమ భూమికోసం, స్వేచ్ఛకోసం తెలంగాణా ప్రజలు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఆయుధాలు చేతబట్టి విప్లవ పోరాటం సాగిస్తున్నారు. పోరా టాన్ని ఉపసంహరించాలని కోరుతూ కొందరు చేసిన ప్రకటనలన్నింటినీ కేంద్ర కమిటీ ఖండిస్తున్నది. జనతా ప్రజాస్వామ్య విప్లవానికి నాందియగు తెలంగాణా పోరాటాన్ని తుదముట్టించాలని శత్రువు ప్రయత్నిస్తుండగా, ఆ పోరాటాన్ని వుపసంహరించాలని ప్రకటనలు చేయటమంటే ఈ విప్లవ పోరాటాన్ని విచ్ఛిన్నం జేయటానికి దోహదపడటమేనని పార్టీ సభ్యులందరినీ కేంద్ర కమిటీ హెచ్చరించుతోంది.

"తెలంగాణా పోరాటానికి తోడ్పడటానికి, పటిష్ఠమొనరించటానికీ, పోరాటాన్ని నిలబెట్టటానికీగాను శక్తివంచన లేకుండా పూనుకోవలసిందిగా పార్టీసభ్యులకు, ప్రజలందరికీ కేంద్ర కమిటీ విజ్ఞప్తిచేస్తోంది. మహాతెలంగాణా మన కందరికీ శంఖారావమై మేల్కొల్పుతోంది. కమ్యూనిస్టు పార్టీ నాయ కత్వాన ప్రజలలో శక్తివంతమైన ఐక్యతను సాధించి పురోగమించటానికి అది మనకు మార్గం జూపుతోంది. భవిష్యత్తులో కూడా అది అలాగే మనకు పురోగ మనానికి బాట చూపెడుతుంది."

సాయుధ పోరాట సందర్భంగా తమ సోదరులు చంపివేయబడి నప్పుడు, శ్రీ రావి నారాయణరెడ్డి, ఎల్లారెడ్డి యిరువురూకూడా గెరిల్లాల చర్యను బహిరంగంగా సమర్ధించి, బలపరచిన విషయంకూడా ఈ సంద ర్భంలో గమనార్హం.

## సాయుధపోరాటం కొనసాగింపుకు నిర్ణయం

నైజాం సైన్యాలకు వ్యతిరేకంగా సయితం సాయుధ పోరాటాన్ని కొనసాగించాలని పార్టీ ఆంధ్రరాష్ట్ర కమిటీ నిర్ణయించింది. భారతసైన్యం అండతో తమ గ్రామాలకు తిరిగి రానున్న దేశముఖుల, భూస్వాముల బారి నుండి తెలంగాణా రైతాంగం సాధించుకున్న విజయాలను కాపాడుకోవలసిన తక్షణ అవశ్యకత కలదని కమిటీ భావించింది. దానికితోడు యింకా యితర అంశాలనూ దృష్టిలో వుంచుకుంది సాయుధ పోరాటాన్ని కొనసాగించకుండా వుండటమంటే పోరాడుతున్న రైతాంగానికి ద్రోహం చేయటమే అయ్యేది. తెలంగాణా ప్రజోద్యమానికి ఎనలేనిహాని కలుగజేయడమయ్యేది.

రజాకార్ల పైన, నైజాం సాయుధ బలగాలపైన దాడులుచేస్తున్నంత వరకూ భారత సైన్యంతో తలపడవద్దు, రజాకార్, నైజాం పోలీసుక్యాంపులపై స్వతంత్రంగానే దాడులుజరపండి; వాటిని ధ్వంసంజేయండి; ఆయుధాలు సమకూర్చండి, వాటికి తిరిగి శిక్షణ గరపండి అని "పోలీసుచర్య" ప్రారంభ సమయంలో అన్నిప్రాంతాలకు గెరిల్లా దళాలకు పార్టీ ఆదేశంపంపింది. కొలది వారాలు ఓపికబట్టండి, అప్పటికల్లా భారత సైనిక బలగాలూ భూస్వామ్య దేశముఖు గూండామూకలూ తెలంగాణా రైతాంగంపై దాడులు సాగిస్తారు, జనసామాన్యంలో రేకెత్తిన భ్రమలు, ఆశలు పటాపంచలయిపోతాయి; వారు సన్నద్ధమవుతారు. తమరక్షణకోసం రావలసిందిగాను ఆయుధాలుచేతబట్టికూడా పోరాడవలసిందిగాను దళాలను వారే కోరుతారు; అని పార్టీ స్పష్టంజేసింది.

భారత సైన్యం ప్రవేశించిన తర్వాత సరిగ్గా వారం రోజులలోపునే దాడులు ప్రారంభమైనాయి. గెరిల్లాదళాలన్నింటినీ, పార్టీనీ, సంఘంనిర్మాణాన్ని ధ్వంసం జేయడం కోసం పట్టుదలతో సర్వత్రా దాడిసాగింది. భారత యూనియన్ జోక్యంయొక్క స్వభావంపట్ల భ్రమలు పెంపొందించుకుని వున్నందున, దురదృష్టవశాత్తు దళాలలో పార్టీ, సంఘం అర్గనైజర్లలో అనేక మంది ఆదాడిని ఎదుర్కొనగల స్థితిలోలేరు.

దొడ్డా నరసయ్య నాయకత్వానగల హుజూర్‌నగర్, ఆరుట్ల రామ చంద్రారెడ్డి, కట్కూరి రామచంద్రారెడ్డి నాయకత్వానగల భువనగిరి, నల్లమల గిరిప్రసాద్, వుల్లన్నల నాయకత్వానగల పాల్వంచవంటి కొన్ని ప్రాంతీయ

కమిటీలు వాటి నాయకత్వాలు, రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డివంటి రాష్ట్ర నాయకులూ, సాయుధ పోరాటం వుపసంహరించాలని, చట్టబద్ధమైన యితర ఆందోళనా రూపాలు చేపట్టాలని వాదించారు. సూర్యాపేట — ఖమ్మం — మానుకోట ప్రాంతం మాత్రమే సాయుధపోరాటాన్ని కొన సాగించటానికి, తెలంగాణా పోరాట విజయాలను కాపాడుకొనటానికి అను కూలంగా దృఢంగా నిలచింది సాయుధపోరాటాన్ని కొనసాగించాలని తుది నిర్ణయం తీసుకున్నతర్వాత ఈ కామ్రేడ్స్ అందరూ అలాంటి అభిప్రా యాలే కలిగియున్న యితరులలో అత్యధికులూ సాయుధపోరాటం కొన సాగించారు. కొందరు అరెస్టుచేయబడి నిర్బంధించబడ్డారు. వారిలో దాదాపుగా అందరూ యిప్పుడు మితవాద కమ్యూనిస్టుపార్టీలోనే వున్నారు.

## 2. భారత ప్రభుత్వ "పోలీసు చర్య"

*రజాకార్ల, దేశముఖుల దురంతాలకు*
*ప్రజల ప్రతీకారం*

1948 సెప్టెంబరు 13 వ తేదీన, యూనియన్ ప్రభుత్వం, హైదరా బాదు సంస్థానంపై "పోలీసు చర్య" ప్రారంభించింది. కోదాడ, దురాచిపల్లి వంటి కొలదిచోట్ల తప్ప, నైజాం మూకలు యూనియన్ సైన్యాలను ప్రతి ఘటించనేలేదు. వాటంతటవే లొంగిపోయాయి పోలీసు చర్య ప్రారంభమైన ఐదురోజులలోనే, అంటే 1948 సెప్టెంబరు 18 వ తేదీన, నైజాం నవాజే లొంగిపోయాడు.

ప్రజలూ, సాయుధ దళాలూ 'పోలీసు చర్య'ను అవకాశంగా తీసు కున్నారు. అనేక రజాకార్, పోలీసు క్యాంపులపై దాడులుజేశారు. వాటిని ధ్వంసంజేశారు. ఆయుధాలు, తదితర వస్తువులను స్వాధీనంజేసుకున్నారు. అయినా, ప్రజాదళాలకు–భారత సైనిక బలగాలకూ మధ్య ఈ దశలో ఒక్క సంఘర్షణైనా జరగలేదు.

సరిహద్దులలోని గగనతలంలో భారత వైమానికబల విమానాలరొద, యూనియన్ సైన్యాల తుపాకుల మోతలు ప్రారంభమవటంతోనే, నైజాం సైనిక క్యాంపులన్నింటికీ ఆ వార్త దావానలంలాగా వ్యాపించింది. తమ వాళ్లు కాపాడుకోవటంకోసం, నైజాం సైనికులు తమ ఆయుధాలను నూతుల్లో పారవేసి కాలికి బుద్ధిజెప్పి పారిపోయారు.

## సూర్యాపేట తాలూకాలో

సూర్యాపేట తాలూకాలో పారిపోతున్న నైజాం సైనికులను ప్రజలూ స్థానిక దళాలూ, పారద్రోలారు. వాళ్ళకు తీవ్రంగా నష్టాలు కలిగించారు. పెద్ద సంఖ్యలో ఆయుధాలు స్వాధీనపరుచుకున్నారు దురాచిపల్లి కొండల సమీపంలో భారత విమాన బలగాలను బాంబుదాడి ఫలితంగా మృతి జెందిన నైజాం సైనికులనుండి రైఫిళ్ళు, స్టెన్‌గన్లు, చేతిబాంబులను కూడా ప్రజలు హస్తగితం జేసుకున్నారు, దళాల కొప్పగించారు. రోడ్ల వెంట, పొలాల లోనుండీ పారిపోతున్న సైనికులను పట్టుకుని ప్రజలు తగు విధంగా బుద్ధి జెప్పారు సూర్యాపేట పట్టణంలోగల క్యాంపుపై దాడిజేసి, ఆయుధాలు స్వాధీనం జేసుకోవటం కోసం వేలాది ప్రజలు సూర్యాపేటకు తరలిపోయారు. అయితే, యూనియన్ సైన్యం అప్పటికే అక్కడికి చేరివుంది. వాళ్ళు ప్రజలను తరిమివేశారు.

సూర్యాపేట తాలూకాలోగల జన్నారెడ్డి ప్రతాపరెడ్డి గడీ (పెద్ద భవనం) బలమైన పునాదులు గలిగి, హైదరాబాదులోని సెంట్రల్ జైలంత వుంది. ఈ బ్రహ్మాండమైన భవనాన్ని నేలమట్టం జేయటంలో ఐదువేలమంది ప్రజలు పాల్గొన్నారు. ఎత్తయిన గోడలో ఒక్క అంగుళమైనా వదలలేదు. వాళ్ళా నేలను దున్నారు. మొక్కజొన్నపైరు వేశారు ప్రతాపరెడ్డిని అణచి వేసినందుకు చిహ్నంగా, సమాధిరూపంలో చిన్నమట్టిగుట్ట వదిలారు. రెండు వేల బస్తాలవడ్లు స్వాధీనం జేసుకుని, ప్రజలకు పంపిణీజేశారు.

## మానుకోట తాలూకాలో

మానుకోట తాలూకాలోని నెల్లకుదురు గ్రామంలోగల రజాకార్ క్యాంపుపై మూడువేలమంది ప్రజలూ, దళాలూ దాడిజేశారు. వందమంది రజాకార్లు తమ ఆయుధాలతోసహా లొంగిపోయేట్లు చేశారు. వాళ్ళవద్దగల ఆయుధాలను స్వాధీనం జేసుకున్నారు. వాళ్ళలోని పరమ కిరాతకులను అంతం జేయాలని ప్రజలనుకొంటూవుండగానే యూనియన్ సైన్యాలు గ్రామంలో ప్రవేశించాయి. ప్రజలపై కాల్పులు సాగించాయి. ప్రజలూ, దళాలూ తమతో తీసుకుపోగలిగిన ఆయుధాలతోసహా, వెనకడుగు వేశారు. ఇద్దరూ రజాకార్లను కాల్చివేశారు.

మానుకోట తాలూకా, కుమ్మరకుంట్లలో అదే జన్నారెడ్డి కుటుంబానికి జెందిన మరొక భవనంవుంది. మూడు వేలమంది ప్రజలువెళ్ళి దాన్ని

నేలమట్టం జేయబూనుకున్నారు అయితే ఆ భవనం ఎంతోబలంగా వుండటం వల్ల ప్రజల ప్రయత్నం పూర్తిగా నెరవేరలేదు నాలుగువేల బస్తాలధాన్యాన్ని ప్రజలకు పంపిణీచేయటం జరిగింది.

మానుకోట తాలూకా, మర్రిపెడ దేశముఖ్ రామసహాయం దామోదరరెడ్డి భవనాన్ని పూర్తిగా నేలమట్టంజేశారు ఆ భవనాన్ని పడగొట్టిన స్థలంలోగుండా రోడ్లువేశారు. ప్రజలు రాకపోకలకు దాన్ని వుపయోగించుకోనారంభించారు. తామెల్లకాలమూ దానిమీదుగా నడవాలని, ఈ "సమాధి" నుండి దేశముఖు కుటుంబాన్ని తిరిగి తలెత్తనివ్వరాదనే ప్రజల వాంఛకు అది చిహ్నంకూడా. భవనాన్ని కూల్చివేసిన తర్వాత మరొకభాగంలో మొక్కజొన్నపైరు వేశారు. రెండువేలబస్తాల వడ్లు ప్రజలు పంచుకున్నారు.

పురుషోత్తమగూడెం గడీలో నిల్వజేసి వుంచబడిన వందలాది బస్తాల ధాన్యాన్ని పంచి పెట్టిన తర్వాత, ఆ గడీని మంటల కాహుతి జేశారు. వందలాది ప్రజలు వెళ్ళి చిలుకోడు గడీలో నిల్వచేయబడిన ధాన్యమంతటినీ మూడు రోజులపాటు బయటకు మోసుకెళ్ళారు. ఆ గడీని ఖాళీ చేసిన తర్వాత గడ్డపలుగులతో నేలమట్టం జేశారు. అదేవిధంగా రాయిగూడెం భూస్వామి రాఘవరెడ్డికి జెందిన ధాన్యాన్నికూడా పంచి పెట్టారు. ప్రజలు ధాన్యం తీసుకువెళ్తుండగా దళాలు కాపలా గాచాయి.

మానుకోట తాలూకా కాకరాయి గ్రామంలోగల, సూర్యాపేట దేశముఖు గడీని రెండు వేలమంది ప్రజలు నేలమట్టం జేశారు. ఆ గడీలో వున్న ఐదువందల బస్తాలవడ్లు పంచుకున్నారు.

రాఘవరావు అనే భూస్వామికిజెందిన మూడు లక్షల రూపాయల విలువజేసే బియ్యంమిల్లు భవనాలను పగులగొట్టివేశారు. అందులోవున్న పదిహేనువందలబస్తాలవడ్లు, మరో వెయ్యిబస్తాల నూకలు ప్రజల పరమైనాయి.

ఆ విధంగా ప్రజాశత్రువుల భవనాలను, ఇతర ఆస్తులను క్రమపద్ధతి ప్రకారం నిర్మూలించటం ఒక ఉద్యమంగా సాగింది. ఏ గ్రామంలో గడీవున్నా సరే తమ ప్రబల శత్రువుకు జెందిన ఈ కోటలపైకి ప్రజలు వందలు, వేల సంఖ్యలో దండెత్తిపోయారు. యూనియన్ సైన్యాలు సరిహద్దులుదాటి తెలంగాణాప్రాంతంలో అడుగుబెట్టిన ఒకటి రెండురోజులలోనే యిదంతా సాగింది.

మానుకోట పట్టణంలో పదివేలమంది ప్రజలుకూడి, అప్పటివరకూ తమపై దాడులు జరుపుతూవచ్చిన బడా రజాకార్ల, దేశముఖుల ఆయుధాలను గుంజుకుంటున్నారు ఇంతలోనే యూనియన్ సైన్యాలు పట్టణంలో ప్రవేశించాయి. ప్రజలపై కాల్పులు జరిపి ఈ ప్రజాశత్రువులను కాపాడాయి.

సెప్టెంబరు 15వ తేదీన, పదివేలమంది ప్రజలు డోర్నకల్ రైల్వే స్టేషన్‌పై దాడిజేసి, పదివేల బస్తాల వడ్లు స్వాధీనంజేసుకుని, పంచుకున్నారు. డోర్నకల్ ప్రక్కనేగల పాపటపల్లి రైల్వే స్టేషనునుండి, ప్రజలు మూడు వందల బస్తాల బియ్యం, రెండువందల బస్తాల వడ్లు స్వాధీనంజేసుకొని పంపిణీ జేశారు. నైజాం పోలీసులు, రాజాకార్లు సేకరించి గార్ల గ్రామంలో నిల్వ చేసిన లెవీ ధాన్యమంతటినీ ప్రజలు స్వాధీనంజేసుకుని పంచుకున్నారు.

జన్నారెడ్డి ప్రతాపరెడ్డి, గూడూరు రంగారెడ్డి, పిండిపోలు జగన్నాధ రెడ్డి బంగళాలకు భారత సైనిక బలగాలు తాము ప్రవేశించిన తొలిరోజుల నుండే కాపలాగాచి రక్షణగా నిలిచాయి. నైజాం-రజాకార్ రోజుల్లో తమపై సాగించబడిన దారుణాలన్నింటికీ ప్రతీకారం తీర్చుకోవాలని ప్రజలు పదే పదే చేసిన ప్రయత్నాలను భారత సైనిక బలగాలు నిరోధించాయి.

సూర్యాపేటతాలూకాలో అనేకమంది ప్రజలను చంపించిన హంతకుడగు కాసర్లపాడు దుష్ట భూస్వామిపై ప్రజలు దాడి జేశారు కాంగ్రెసు పోలీసులు ఆ ప్రజలపై లాఠీలు ప్రయోగించి, హంతకుని కాపాడారు.

హుజూర్‌నగర్‌లో బేతవోలు జమీందారు గడీని ప్రజలు పూర్తిగా కూల్చివేశారు. ఆ భవనంలో గుప్తంగా దాచివుంచిన వెండి, బంగారు ఆభరణాలు పెద్ద మొత్తంలో ప్రజల వశమైనాయి.

**జనగామ తాలూకాలో**

జనగామ తాలూకాలో దేశముఖు రామచంద్రారెడ్డికి జెందిన విసునూరు గడీలోగల రజాకార్ క్యాంపుపై దళాలు, ప్రజలూ దాడి జేశారు. అందుకుగాను పదివేలమంది ప్రజలు సమీకరణయ్యారు కొన్నిదళాలు, సమీప గ్రామాలలో ప్రజలను సన్నద్ధంగా నిలిపి వుంచాయి. ఈలోగా మరికొన్ని దళాలు ఈ గడీని స్వాధీనం జేసుకొనటానికి చుట్టుముట్టి నిలిచాయి. ఈలోగా యూనియన్ సైన్యాలకు జెందిన 120 మంది సైనికులు ఆ గ్రామంలో ప్రవేశించి దళాలపై కాల్పులు జరిపారు దేశముఖును, అతని గడీని కాపాడారు.

విసునూరు దేశముఖు కుమారుడు బాబురావు (జగన్మోహన్‌రెడ్డి) స్వయంగా పదులకొలది రైతులను కాల్చిచంపాడు. అనేకవందలమందిని చిత్రహింసలకు గురిజేశాడు విసునూరు పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరూ ప్రజలపై అంతులేని అత్యాచారాలు జరిపాడు. వాళ్ళిద్దరూకూడా యిండ్లకు తాళాలు బెట్టుకుని, విసునూరువద్ద ప్రత్యేకంగా మకాం వేసియున్న నైజాం సైన్యానికీ, పోలీసులకీ సయితం చెప్పకుండా జనగామాకు చేరారు అచ్చటి పోలీసు

స్టేషనులో తాత్కాలికంగా ఆశ్రయంపొందారు. అప్పటికి కొన్ని గెరిల్లా దళాలు వందలాది ప్రజలూ జనగామచేరుకున్నారు. అప్పుడే హైదరాబాదుకు బయలుదేరబోతున్న గూడ్సు రైలులో ఎక్కి, ప్రజల ఆగ్రహంనుండి తప్పించుకు పోవాలని ఈ బాబురావు, సబ్ ఇన్స్పెక్టరూ ప్రయత్నిస్తుండటాన్ని వారు గమనించారు. వారు ఆ గూడ్సురైలును నిలిపివేశారు. తన ప్రాణాలను కాపాడుకోవటానికి తుది ప్రయత్నంగా బాబూరావు రైలుక్రింద దూరాడు. ప్రజలదిగమనించారు ఆతనిని బయటికీడ్చారు. అతడు తన రివాల్వారునుపయోగించకముందే ప్రజలది గుంజుకున్నారు. అతనిని చావగొట్టివేశారు. అతడు చచ్చినా ఆతని చేతుల్లో వర్ణనాతీతమైన అత్యాచారాలకు గురైన ప్రజలకు పగతీరలేదు ఆతని ముఖంపై వారంతా వుమ్మివేశారు. ఒక వృద్ధ లంబాడీవనిత, ఈ బాబూరావు ప్రజలపై సాగించిన అమానుషమైన అత్యాచారాలను పేరుపేరునాజెప్పి ఆతని ముఖంపై వుమ్మివేసింది. ప్రజలు ఆతనిపై ఇటలీలో ముస్సోలినీపై పగదీర్చుకున్న విధంగా పగదీర్చుకున్నారు. ఈ రాక్షసుడు బాబూరావు అంతమైపోయినందుకు ప్రజలు సంబరపడ్డారు.

సబ్ ఇన్స్పెక్టరు తలపగిలింది. అయినా ఆ రైలులో దాక్కొని పారిపోవాలని యింకా ప్రయత్నించుతున్నాడు. ప్రజలు అతనిని వెన్నంటారు. నడుస్తూవున్న రైలులోకి ఎక్కారు. అతని చేతిలోని రైఫిలును గుంజుకున్నారు. అతనిని నజ్జు నజ్జుగా కొట్టారు. తర్వాత స్టేషనగు ఆలేరువద్ద, నడుస్తున్న గూడ్సు రైలునుండి క్రిందికి దిగిపోయారు.

అయితే, జనగామలోగల, నైజాం మిలిటరీ పోలీసు క్యాంపునుండి ఆయుధాలు స్వాధీనం జేసుకొనటం ప్రజలకు సాధ్యపడలేదు. ఈ నైజాం పోలీసులూ, సైనికులూ తమంత తాముగానే లొంగిపోయి ఆయుధాలను వొప్పగించివేస్తారని చెప్పి ఒక కాంగ్రెస్ వాది ప్రజలనునమ్మించటంవల్ల వారు మోసపోయారు ప్రజలు రైల్వేస్టేషనునుండి తిరిగి వచ్చేసరికల్లా, భారత సైన్యానికి జెందిన బీహారీ రెజిమెంటు అప్పటికే రంగంలో కనిపించింది. ప్రజలపై లాఠీలు ప్రయోగించటమేగాక, కాల్పులుకూడా జరిగాయి. దానితో ప్రజలు వెనకడుగు వేయక తప్పలేదు.

జనగామ తాలూకా, లద్దనూర్ఎద్దగల పెద్దరజాకార్ క్యాంపుపై, దళాల నాయకత్వాన మూడువేలమంది ప్రజలు దాడిజేశారు. దళసభ్యులు కాల్పులు జరుపుతూ ముందుకు నడుస్తుండగా, రజాకార్లు గోడలమాటున ఆశ్రయం పొందారు. ఈలోగా గ్రామంలో ప్రవేశించిన ప్రజలు వెనుకనుండి వచ్చారు రజాకార్లు కాల్పులు ప్రారంభించకముందే ప్రజలు విరుచుకుపడ్డారు. అక్కడికక్కడే 23 మంది రజాకార్లను చంపివేశారు. క్యాంపులోవున్న

ఆయుధాలను, మందుగుండు సామగ్రిని, ఇతర ఆస్తులను స్వాధీనం జేసుకున్నారు. ప్రజలను దారుణంగా హత్యగావించటంతో సంబంధంవున్న వాళ్ళయిళ్ళుకూడా తగులబెట్టబడ్డాయి.

ఈ దాడివార్త మిగతా క్యాంపులకు దావానలంలాగా వ్యాపించింది. వాళ్ళంతా గజగజ వణకిపోయారు జనగామ తాలూకా మద్దూరు క్యాంపులోని వాళ్ళు దళాలకు స్వాగతంజెప్పి పూలమాలలు వేశారు. తమవద్దగల ఆయుధాలను, మందుగుండు సామగ్రిని పూర్తిగా వారివశం జేశారు. తమప్రాణాలు తీయవలదని అర్థించారు. ప్రజలకు కలిగించబడిన నష్టాలను పరిహరించగలమని కూడా వాళ్ళు హామీయిచ్చారు. వాళ్ళ లొంగుబాటును దళాలు అంగీకరించాయి. వాళ్ళను క్షమించి, వదిలివేశారు. జనగామ తాలూకాలోని సాలార్ప్వర్, చెరియాల్ క్యాంపులలోను, ముస్త్యాలవద్దగల తాలూకా క్యాంపులోనూ అలాగే జరిగింది. ఒక్క ముస్త్యాల క్యాంపులోనివాళ్ళే యిరవైఐదు రైఫిళ్ళు స్వాధీనంజేసి తమ ప్రాణాలు కాపాడుకున్నారు. అయితే వాళ్ళ ఆస్తులను, జమీందారు ఆస్తులను ప్రజలు స్వాధీనపరచుకున్నారు

## భువనగిరి తాలూకాలో

రామన్నపేట తాలూకాలోని మోత్కూరు క్యాంపును దళాలు చుట్టుముట్టాయి ఆయుధా లొప్పగించి, లొంగిపోవలసిందిగా అందులోని రజాకార్లను కోరారు. వాళ్ళందుకు అంగీకరించక ప్రతిఘటించారు దళాల శక్తిని చవిజూచారు. ఈలోగా రెండువేలమంది ప్రజలు గ్రామంలో ప్రవేశించారు. శతృవులందరి యిండ్లనూ నేలమట్టం జేశారు. నలుగురు శతృవులను చంపివేశారు రజాకార్ల కుటుంబాలలోని స్త్రీలు, పిల్లలూ దళాల కాళ్ళమీద పడి, తమ భర్తల, తమబిడ్డల ప్రాణాలు కాపాడవలసిందిగా అర్థించారు. తమ భర్తలకు నచ్చజెప్పి వాళ్లు లొంగిపోయేందుకు ఒప్పించగలమని చెబుతూ తమను క్యాంపులలోకి వెళ్ళనివ్వవలసిందిగా కోరారు అయితే, వాళ్ళంతా క్యాంపులలోకి వెళ్ళగానే రజాకార్లు, తమస్త్రీల, బిడ్డలమాటున రక్షణ తీసుకుని కాల్పులు ప్రారంభించారు. దీనితో దళాలకు ఇరకాటమైన పరిస్థితి ఏర్పడింది. తామూ కాల్పులు జరపటమంటే స్త్రీలను, బిడ్డలను చంపవలసివస్తుంది. అందువల్ల వెనకకు తగ్గాలని వారు నిర్ణయించుకున్నారు. ఆ తర్వాత వారికి మూడు మృతదేహాలూ, మూడు రైఫిళ్ళు మాత్రమే కనిపించాయి. మిగతావాళ్ళంతా తప్పించుకున్నారు మూడు రైఫిళ్ళనూ స్వాధీనం చేసుకున్నారు. పోలీసు స్టేషన్ను నేలమట్టం జేశారు.

నల్గొండ తాలూకాలోని ఏదులూరు గ్రామంగుండాపోతున్న ముగ్గురు నైజాం సైనికులను, ఆ గ్రామానికి చెందిన మూడువందలమంది ప్రజలు వెన్నంటి తరిమారు. అయితే, ఆ సైనికులు కాల్పులు జరిపి, యిద్దరు యువకులను చంపి పారిపోయారు. ఆ సైనికులే బొల్లారం గ్రామంగుండా వెళ్తూ అదేవిధంగా కాల్పులు జరిపి, మరో యిద్దరు ప్రజలను చంపారు

నల్గొండ తాలూకా నార్కెట్‌పల్లి సమీపంలో యూనియన్ వైమానికబలగం బాంబులు వేయటంవల్ల 30 మంది నైజాం సైనికులు మృతి చెందారు. బాంబులుపడటం ఆగిపోయినవెంటనే ప్రజలు అచ్చటికి హుటా హుటిని వెళ్ళారు ఇరవై ఐదు రైఫిళ్ళను, రెండు స్టెన్‌గన్లను, ఒక గైడరును, యితర ఆయుధాలను, బంగారాన్ని, డబ్బును స్వాధీనం చేసుకొని దళాలకు వొప్పగించారు.

భువనగిరి తాలూకా కుర్రారం గ్రామానికిచెందిన కామ్రేడ్ పాశం రామిరెడ్డి నాయకత్వాన గెరిల్లాదళాలు తాలూకాలోని రజాకార్ల క్యాంపులపై వరుసగా అనేక దాడులు జరిపాయి. వాళ్ళను లొంగిపోయేట్లుచేసి వాళ్ళ ఆయుధాలను స్వాధీనం చేసుకున్నాయి. అలాంటి ఒక దాడి సందర్భంగా, ఆయన రజాకార్ల లొంగుబాటును అజమాయిషి చేస్తున్నాడు. అప్పుడు రజా కార్లలో కొందరు ఆయనపై అకస్మికంగా కాల్పులు జరిపి, చంపివేశారు. దళం తమ నాయకునిమృతికి ప్రతీకారం తీర్చుకుంది. అయినా, ఆయన మృతి, పార్టీకి, ఉద్యమానికి తీరనిలోటు. ఆ కొలదిరోజులలోనే రజాకార్ క్యాంపు లన్నీ తుడిచిపెట్టబడ్డాయి.

## వరంగల్లు తాలూకాలో

వరంగల్ జిల్లాలోని తాటికొండ క్యాంపును ధ్వంసంజేయటానికి దళాలు భీకరమైన పోరాటం సాగించవలసివచ్చింది. క్యాంపులో శత్రుసైనికులు పదిహేనుమంది మాత్రమే వున్నారు. మిగతా వందలాది శత్రుసైనికులూ హనుమ కొండకు పారిపోయారు. దళాలు నిర్ణీత పథకం ప్రకారం, తెల్లవారకముందు గానే ఆ గ్రామాన్ని చుట్టుముట్టారు తెల్లవారేసరికల్లా వారు క్యాంపు బంగళాను ముట్టడించారు. లొంగిపోవలసిందిగా శత్రుసైనికులను హెచ్చరిం చారు. హనుమకొండకుపోయిన తమ మిత్రులు తిరిగి వస్తారని ఆశిస్తూ, వాళ్ళు లొంగిపోలేదు వాళ్ళు క్రింది అంతస్థు తలుపులు మూసివేశారు. పై అంతస్థు మీదికెళ్ళి, కాల్పులు జరపటానికి సన్నద్ధమై నిలిచారు దీనితో దళాలకు కష్టమైన పరిస్థితి ఎదురైంది. అయినా, దళాలు మొత్తం గ్రామంచుట్టూ కాపలా పెట్టి, క్యాంపును ముట్టడిలో వుంచాయి.

హనుమకొండకు వెళ్ళిన బలగాలు వచ్చి తమను ఆదుకోగలరని శత్రువు ఎదురుజూస్తున్నాడు. అయితే, అక్కడ యూనియన్ సైన్యాలచే చిత్తు జేయబడినందున అవి తిరిగి రాలేదు. ఒకటిన్నరరోజుల అనంతరం, వాళ్ళు తమ ఆయుధాలతోసహా ప్రజలకు, గెరిల్లా దళాలకు లొంగిపోయారు. గ్రామం లోని భూస్వాములు, ప్రజాశత్రువులు ఈ సైనికులపైనే ఆధారడి వున్నారు. వాళ్ళు తమ ప్రాణాలను గుప్పిట్లో బెట్టుకుని వణకిపోనారంభించారు. ప్రజా శత్రువైన ఏడుమద్దుల శేషారెడ్డి ఆత్మహత్య జేసుకున్నాడు. అతని కొడుకు ఆగారెడ్డి, అల్లుడు వెంకటరెడ్డి పారిపోతుండగా చంపివేయబడ్డారు. శేషారెడ్డి సోదరుడైన వెంకట్రామరెడ్డి, తనకుగల బంగారాన్ని, ధనాన్నీ తన వొంటికి బిగించి కట్టుకుని, ఒక చెత్తకుండీలో తలదాచుకున్నాడు. ప్రజలది పసికట్టారు. అతనిని బయటికీడ్చి చంపివేశారు ఈ గ్రామ ప్రజలపై, ఈ కుటుంబం చేయని అత్యాచారమంటూ లేదు

హుజూరాబాదు తాలూకాలోని కోయాడు క్యాంపులోని నైజాం పోలీసులను లొంగిపోవలసిందిగా కోరుతూ పోరెడ్డిపల్లి గ్రామానికి చెందిన యిద్దరు రైతులద్వారా దళాలు శ్రీముఖం పంపాయి. పోలీసులు తలవొగ్గలేదు. మూడువేలమంది ప్రజలను వెంటబెట్టుకుని, దళాలు అచ్చటికొచ్చాయి. అయితే అరవై మంది సాయుధ పోలీసులు తమ స్థానాలలో నిలిచి కాల్పులు జరిపారు, ప్రజలు గ్రామంలో ప్రవేశించకుండా అడ్డుకున్నారు ఒక రైతు అక్కడికక్కడే మృతిజెందాడు. తూటా దెబ్బలు తప్పించుకొనటంకోసం మిగతా ప్రజలంతా నేలమీద బోర్లా పండుకున్నారు దళాలుకూడా కాల్పులు సాగించాయి. పోలీసులుకూడా నేలమీద పండుకున్నారు. పోరాటం సాగింది శత్రువును నిర్మూలించటం సాధ్యంకాలేదు. 12 మందిని మాత్రమే చంపగలిగారు. ఆతర్వాత దళం వెనుకకు వెళ్ళిపోయింది.

వరంగల్ తాలూకా, జాపర్ఘడ్ క్యాంపునుండి రజాకార్లు తప్పించుకు పోవటానికి ప్రయత్నిస్తుండగా, వరంగల్, జనగామలనుండి వచ్చిన దళాలు వాళ్లలో ముగ్గురిని చంపివేశాయి. మిగతావాళ్లు పారిపోయారు. మూడు ఆయుధాలను స్వాధీనం చేసుకొన్నారు.

కేంద్రంనుండి ఆదేశాలందటానికి అవకాశంలేని, అనేక తావుల్లో, ప్రజలు తమంతట తామే చొరవ తీసుకొన్నారు రజాకార్లపై దాడిజేసి, వాళ్ల ఆయుధాలను గుంజుకొనటానికి తాము చేయగలిగిందంతా చేశారు

రజాకార్ల క్యాంపు లేర్పాటు చేయబడియున్న భవనాలు, శత్రువుల బవనాలూ నేలమట్టం చేశారు. వందలాది బస్తాలవడ్లు, వ్యవసాయ పరికరాలు,

ఇనుపపనిముట్లు, పశువులు, గొర్రెలు, మేకలు మొదలుగాగల శత్రువుల ఆస్థులు ఏది దొరికితే దాన్ని ప్రజలు స్వాధీనం జేసుకున్నారు.

యూనియన్ సైన్యాలు పట్టణాలలోను, కొన్ని ముఖ్య స్థానాల లోనూ ప్రవేశించి ప్రజాశత్రువులను, రజాకార్లను కాపాడాయి. అయినా, గ్రామీణ ప్రాంతాలలో ప్రజలు మాత్రం, యూనియన్ సైన్యాలు తమ గ్రామాలకు చేరకముందే త్వరపడ్డారు. శత్రు క్యాంపు లున్నందువల్ల, భూపంపిణీ, గ్రామ పంచాయితీల ఏర్పాటు జరగని గ్రామాలలో, వేలాది ఎకరాల భూములను పంపిణీ చేయటంద్వారా, గ్రామరాజ్య కమిటీలను ఏర్పాటు జేయటంద్వారా అలాంటి సంస్కరణలు శీఘ్రగతిన అమలు జరప బడినాయి

## ముస్లిం జనసామాన్యానికి రక్షణ

గ్రామం తర్వాత గ్రామాన్ని తగలబెట్టటానికి, వందిలాది ప్రజలను చంపటానికి బాధ్యులైన దేశముఖులను, రజాకార్ నాయకుడు కాశిం రజ్వీని యూనియన్ సైన్యాలు కాపాడాయనేవిషయం గమనార్హం. అదే సమయంలో నైజాం దురంతాలకు వ్యతిరేకంగా నిలిచిన సామాన్య ముస్లిం ప్రజానీకంపై దాడులుజరిపి, వారిని వర్ణనాతీతమైన బాధలకు గురిజేశాయి గ్రామాలలోగల హిందూప్రజలు అలాంటి సాధారణ ముస్లిములను సాధ్యమైనంత వరకు కాపాడారు తమ యిండ్లలో వారికి ఆశ్రయ మిచ్చారు. యూనియన్ సైన్యాలు సాగిస్తున్న మానభంగాల, హత్యల బారినుండి వేలాది ముస్లిం కుటుంబాలను కాపాడారు.

హిందూ ముస్లిం మతకలహాలను రేగగొట్టి, దావాలనంలాగా వ్యాపింపజేయటానికి అవకాశంవున్న తరుణంలోనే, గ్రామాలలో హిందూ ముస్లిం ఐక్యతను నిలబెట్టటమనే ఈ ప్రధాన విజయం తెలంగాణా వుద్య మానికి గర్వకారణం. ప్రజాతంత్ర వుద్యమం బలహీలంగావున్న హైద్రాబాదు సంస్థానంలోని యితర ప్రాంతంలో ముస్లిం వ్యతిరేక విద్వేషం, వారిపై దాడులు విస్తారంగా సాగాయి.

# 3. ప్రజల వెసులుబాటు ఎంతోకాలం నిలువలేదు

రజాకార్ దురంతాల పీడ విరగడైనందుకు ప్రజలు సంతోషించారు. తమకు నూతన జీవితం ప్రారంభం కాబోతున్నదని వారు ఆశపడ్డారు రజాకార్, నైజాం నాయుధబలగాల క్యాంపులున్న కారణంగా దేశముఖుల

భూములపై చేయివేయటానికిగాని, భూస్వాముల ధాన్యాన్ని స్వాధీనం జేసు కోవటంగాని అంతవరకూ సాధ్యంగాని అనేక తావుల్లో, యిప్పుడు స్థానిక దళాల, సంఘం కమిటీల నాయకత్వాన వారు భూములను ధాన్యాన్ని పంపిణీ చేయనారంభించారు. అయితే అది కొలదిరోజులపాటే సాగింది. నగరాలలోకి, భారతయూనియన్ భూభాగంలోకి పలాయనం చిత్తగించిన దేశముఖులు, భూస్వాములు, భారత సైన్యాలు ప్రవేశించిన రెండు వారాల లోపలే తమ గ్రామాలకు తిరిగివచ్చేశారు ప్రజలపై అధికారుల మూక ఉమ్మడి దాడులలో చేతులు గలిపారు తమ భూములను ధాన్యాన్ని తిరిగి స్వాధీనంజేసుకోనారంభించారు. దళ సభ్యులకు, ఆంధ్రమహాసభ కార్యకర్తలకు, కమ్యూనిస్టు కార్యకర్తలకూ భోజనాలుపెట్టిన రైతులను, వ్యవసాయ కార్మికు లను, ఆంధ్రమహాసభ కార్యకర్తలను, దళ సభ్యులను, వారి కుటుంబాలనూ పోలీసులకూ, సైన్యానికీ చూపించారు మిలటరీ అత్యాచారాలు ప్రత్యేకంగా వారిపైనే సాగించారు. మూకవుమ్మడి అరెస్టులు, మూకవుమ్మడిగా బాదటం, మూకవుమ్మడి చిత్రహింసలూ, వందలాది గ్రామాలలోసర్వసాధారణమైనాయి.

దళసభ్యులలోనూ, పార్టీ, సంఘం స్థానిక కార్యకర్తలలోనూ అత్యధిక సంఖ్యాకులు ఒకవిధమైన భ్రమలతో కొట్టుకుపోయారు. దళాలలో అత్యధికభాగం, తమ ఆయుధాలను దాచిపెట్టి తమ గ్రామాలకు తిరిగివచ్చాయి. ఈ ప్రాంతాలన్నింటికీ, పార్టీ నాయకత్వం పదేపదే ఆదేశాలుపంపి, ప్రత్యేక ప్రతినిధులనుపంపి సాయుధ గెరిల్లాదళాలను నిరాయుధంజేసి, ఆయుధాలను దాచిపెట్టే తమ విధానంలోగల ప్రమాదాన్ని గురించీ, భారత యూనియన్ సైన్యపు, పోలీసుల దాడులకు, స్థానిక భూస్వాముల, దేశముఖుల దాడులకు సులభంగా ఎరయ్యే ప్రమాదాన్ని గురించి వివరించి చెప్పవలసివచ్చింది. ఆయు ధాలు చేతబట్టుకొన వలసిందిగాను; భారత సైన్యాలూ, నూతన సైనిక ప్రభు త్వమూ దాడులు ప్రారంభించినప్పుడు తమనుతాము రక్షించుకొనటానికి, ప్రజ లను రక్షించటానికిసిద్ధంగా వుండవలసిందిగాను వారిని హెచ్చరించటం జరిగింది.

దళ సభ్యులలో, దళనాయకులలో, జోనల్, ఏరియా, ప్రాంతీయ స్థాయిలలో పార్టీ, సంఘం నాయకులలో క్రమశిక్షణ, నిఘా సడలి పోయాయి. భారతసైన్యం జోక్యం ఫలితంగా నైజాం భూస్వామ్యపీడన విరగ డవగలదని, మరింత మెరుగైన, స్వేచ్ఛా, ప్రజాతంత్ర వ్యవస్థ ప్రారంభం కాగలదనీ ఆశించినందుననే ఆ సడలింపు ఏర్పడింది. ప్రజలపైన, దళాలపైన, భారత సైన్యమూ, పోలీసులూ దుర్మార్గమైన దాడులు ప్రారంభించి, నైజాం ప్రభుత్వంనుండి పరిపాలనా నిర్వహణను చేపట్టిన తర్వాత భూస్వాములకు, దేశముఖులకు భూములను తిరిగి కట్టబెట్ట నారంభించినప్పుడు యిందువల్ల

ఎనలేని హానిజరిగింది. వేలాది స్థానిక కార్యకర్తలు, జోనల్, ప్రాంతీయ నాయకులలో ఎక్కువమంది సులభంగా అరెస్టు చేయబడ్డారు మిగిలిన దళాలను, నాయకులను పెద్ద పెద్ద దాడులు జరిపి నిర్దాక్షిణ్యంగా వెంటాడారు. పట్టుబడిన వారందరినీ పాశవికంగా హింసలకు గురిజేసి, కాల్చిచంపారు.

స్వదేశీ సంస్థానాలను, వాటి పాలకులైన రాకుమారులను, నవాబులను, రద్దుచేయాలని పొరుగునేవున్న భాషా ప్రాంతాలలో వాటిని విలీనం జేయాలని, వివిధ జాతులకు నిజమైన ప్రజాతంత్ర వ్యవస్థను ఏర్పరచాలని, స్వతంత్ర ప్రజాతంత్ర భారత సమాఖ్యను రూపొందించాలని భారత యూనియన్ ప్రభుత్వమూ, దాని కాంగ్రెస్ నాయకులూ ఏ దశలోనూ ఆసక్తిని ప్రదర్శించలేదు. వారు కోరుకున్నదల్లా, బ్రిటిష్ సామ్రాజ్యవాదులనుండి అధికారాన్ని వారసత్వంగా పొందాలని, తమ స్వంత పెట్టుబడిదారీ (లాభార్జన లక్ష్యంగాగల పారిశ్రామికీకరణ), భూస్వామ్య దోపిడీని పెంపొందించటం మాత్రమే. వారు ఈ స్వదేశీ సంస్థానాలలో ప్రజాపోరాటాలను పెంపొందించనూలేదు, ప్రోత్సహించనూలేదు వారు సర్వదా సంస్థానాధీశులను బుజ్జగించబూనుకున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా వారు తమతో చేతులు కలపగలరని ఆశించారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ప్రజా వెల్లువను గాంచిన మీదట, ప్రపంచ సోషలిస్టు శిబిరం అవతరించిన అనంతరం, ప్రపంచ వ్యవస్థలో తన స్థానం విపరీతంగా బలహీనపడినందున బ్రిటిష్ సామ్రాజ్యవాదులు 1947 లో బూర్జువా-భూస్వామ్య కాంగ్రెసుపార్టీకి అధికారాన్ని వొప్పగించక తప్పలేదు. బ్రిటిష్‌వాళ్ళు భారతదేశాన్ని విభజించారు. అంతేకాదు. స్వదేశీ సంస్థానాలన్నింటికీ, భారతదేశంలోగాని, పాకిస్తాన్‌లోగాని చేరటానికి, లేదా స్వతంత్రంగా వుండిపోవటానికి అవకాశమిస్తున్నట్లు ప్రకటించారు. ఈ దుస్తంత్రాన్ని అధిగమించటానికి, భారత భూభాగంలోని సంస్థానాల రాకుమారులు, నవాబులు భారత యూనియన్‌లో చేరునట్లు వొత్తిడి జేయటానికి మాత్రమే కాంగ్రెసు నాయకులు ప్రయత్నించారు. భారతయూనియన్‌లో చేరటానికి సంస్థానాధీశులు అంగీకరించిన మరుక్షణంలోనే ప్రజా వుద్యమాలు నిలిపివేయబడ్డాయి. వారి ప్రత్యేక హక్కులకు, రాజభరణాలకు హామీ కల్పించారు. వాళ్ళనే రాజప్రముఖులుగా నియమించారు చిన్న చిన్న సంస్థానాలను కొన్నింటిని కలిపి పాలనాయోగ్యమైన యూనిట్లుగా ఏర్పరచారు. వాటికి భారత యూనియన్‌లో ప్రత్యేక స్థానం కల్పించారు. ప్రజాతంత్ర వుద్యమం మరింత పురోగమించిన తర్వాత, 1956 లో మాత్రమే ఈ సంస్థానాలు రద్దుచేయబడినాయి. ఆయాభాషా

రాష్ట్రాలలో విలీనం చేయబడ్డాయి. అయినా రాజుల, నవాబుల రాజభరణాలు, ప్రత్యేక సౌకర్యాలు 1972 వరకూ కొనసాగాయి.

ఈ విధానానికి అనుగుణంగానే భారత యూనియన్ ప్రభుత్వం, హైదరాబాద్ నవాబును భారత యూనియన్‌లో చేరటానికి ఒప్పించటానికి ప్రయత్నించింది. 1947 ఆగస్టు 15 వ తేదీ గడువులోపుగా అలా విలీనమయ్యేందుకు నిరాకరించినప్పటికీ, నైజాం నవాబుతో నిర్యుద్ధసంధి చేసుకున్నారు. నవాబుకు ఆయుధాలను, మందుగుండు సామాగ్రినీ అందజేయటానికి, యితర ప్రత్యేక సౌకర్యాలను కల్పించటానికి హామీ యిచ్చారు. భారత యూనియన్‌లో చేరాలనీ, ప్రజాతంత్రవ్యవస్థకావాలని కోరుతున్న ఉద్యమాన్ని అణచటంకోసం నవాబు ఆతని రజాకార్లూ ఈ సౌకర్యాలనే ఉపయోగించుకున్నారు. తెలంగాణాప్రజల వ్యావసాయిక, ప్రజాతంత్రఉద్యమం శీఘ్రగతిన పురోగమిస్తోంది "రెండుజిల్లాలకుపైగా కమ్యూనిస్టుల కంట్రోలులో వున్నాయి; వారిపట్టు సంస్థానమంతటికీ వ్యాపించే ప్రమాదంవుంది" – అని భారత యూనియన్ ఉప ప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేల్ పదేపదే ప్రకటించాడు. అందువల్ల నైజాం నవాబును భారతయూనియన్‌లో విలీనమయ్యేందుకు ఒప్పించటానికిగాక, కమ్యూనిస్టులను నిర్మూలించటానికి, అంటే తెలంగాణాలో వ్యవస్థాయిక ప్రజాతంత్ర ప్రజాఉద్యమాన్ని నిర్మూలించటానికి కూడా భారత సైన్యాలను పంపించటం అవసరమని పేర్కొన్నాడు. భారత సైనిక జోక్యం యొక్క లక్ష్యాలలో ఇదీ ఒకటని ఆనాటి గవర్నర్ జనరల్ రాజాజీ తన అధికార ప్రకటనలో బహిరంగంగానే ప్రకటించాడు.

అందువల్ల, నైజాం – భారత ప్రభుత్వానికి లొంగిపోయినప్పుడు, భారత ప్రభుత్వం అతనికి అన్ని ప్రత్యేక సౌకర్యాలను, భరణాలను వాగ్దానం చేసిందంటే ఆశ్చర్యమేమీలేదు జనరల్ జె యన్ చౌధురి సైనిక పాలన, ఆ తర్వాత వెల్లోడి పరిపాలనా అన్నీకూడా, 1950 జనవరి 26 న భారత రాజ్యాంగం అమలులోకొచ్చిన తర్వాత నైజాంను రాజప్రముఖ్‌గా లాంఛనప్రాయంగా ప్రకటించేలోగా అమలులోవున్న తాత్కాలిక దశలు మాత్రమే. హైదరాబాదు సంస్థానంలో ఆయా భాషా ప్రాంతాలలో పరిపాలనా నిర్వహణ సాగించటంకోసం, పొరుగు రాష్ట్రాలనుండి పెద్ద సంఖ్యలో భారత యూనియన్ అధికారులను, పోలీసులను దించారు ప్రజలపై సాగించిన అత్యాచారాలకుగాను, పాత నైజాం అధికారులను దాదాపుగా ఎవ్వరినీ శిక్షించనేలేదు. పరిపాలనా నిర్వహణను అధీనంజేసుకోవటం పూర్తయిన తర్వాత, తన సైన్యమూ, పోలీసు బలగమూ తెలంగాణా ప్రాంతంలోని మారుమూల గ్రామాలకుకూడా చేరుకున్న తర్వాత, జనరల్ చౌధురి ప్రభుత్వం నల్గొండ,

ఖమ్మం, వరంగల్ జిల్లాలలోను, వాటి పరిసర ప్రాంతాలలోనూ సాధించబడిన ప్రజావ్యావసాయిక, ప్రజాతంత్ర విజయాలను అణచివేసి, వమ్ముజేయటం కోసం తెలంగాణా ప్రజలపై పెద్దఎత్తున దాడి ప్రారంభించింది

శ్రీమతి సరోజినీనాయుడు, కుమారుడు హైదరాబాదుకు జెందిన ప్రసిద్ధ ప్రజాతంత్రనాయకుడు అయిన డాక్టర్ జయసూర్య మిలటరీ గవర్నరును కలుసుకొన్నాడు. కమ్యూనిస్టు నాయకులను కలుసుకొని, ఒక పరిష్కారం సాధించటానికి, వారు సాయుధ పోరాటం విరమించేట్లు చేయటానికిగాను తనకు ఆరువారాల వ్యవధినిమ్మని కోరాడు . జనరల్ జె. యన్. చౌధురి మొరటుగా ఆయన కోరికను త్రోసి పుచ్చాడు. ఆరు వారాలలోపునే తాను హైదరాబాదు సంస్థానం మొత్తంలో కమ్యూనిస్టులను రూపుమాపగలనని ప్రగల్భాలు పలికాడు. భారత సైన్యం ప్రవేశించిన రెండు వారాలలోపునే పాశవికమైన బీభత్స సైనిక దాడి ప్రారంభమైంది. 1948 డిసెంబరు చివరికల్లా ఆ దాడి పరాకాష్ఠ నందుకుంది.

భారత యూనియన్ సైన్యంయొక్క దాడిని తట్టుకొనటంకోసం, తెలంగాణా ప్రజలు సాధించుకున్న విజయాలను నిలబెట్టుకొనటంకోసం, వాటిని మరింత విస్తరించటంకోసం పార్టీ నాయకత్వం దిగువకార్యక్రమాన్నియిచ్చింది:

1 పాతపోరాట ప్రాంతాలలో, పాతవిజయాలను నిలబెట్టుకోండి. కొత్తప్రాంతాలకు విస్తరించండి. పాతప్రాంతాలలో శత్రువు స్థిరపడకుండా అరికట్టటంద్వారా, ఉద్యమాన్ని కొత్తకొత్త ప్రాంతాలకు విస్తరించుకుంటూనే, శత్రుబలగాలను చెల్లాచెదురు చేయటమూ, మనోనిబ్బరం కోల్పోయేటట్లు చేయటమూ, చివరకు దెబ్బగాచుకునే స్థితికి నెట్టటమూ, శత్రువును ఓడించటమూ సాధ్యమవుతుంది.

2. శత్రువు ఒక గ్రామాన్ని తిరిగి చేపట్టినంతమాత్రాన్నో, ఒక కేంద్రంలో తన స్థానాన్ని తిరిగి పొందినంతమాత్రాన్నో, ప్రజలనుండి భూమిని తిరిగి స్వాధీనం చేసుకున్నందువల్లనో, నిరంతరదాడులు క్రూరమైన బీభత్స కాండ సాగించి పన్నులు వసూలు చేయగలిగినంతమాత్రానో, పైరులు స్వాధీనం చేసుకోగలిగినందువల్లనో, గ్రామ ప్రజాకమిటీల సభ్యులు అరెస్టుచేయబడినందువల్లనో, భయకంపితులు గావించబడినందువల్లనో శత్రువు విజయం చేపట్టాడనిగాని, ప్రజలు పరాజయం పొందారనిగాని భావించటం తప్పు. దాడి జేసేందుకు శత్రువుకుగల శక్తిని రూపుమాపేంతవరకూ ప్రజలు సాధించుకున్న

విజయాలు పదేపదే చేతులుమారే అవకాశంవుంది. అందువల్ల మన ప్రయత్నాలను నిరంతరం సాగించాలి. శత్రువుపై దెబ్బతర్వాత దెబ్బతీయాలి. అంతకు పూర్వపుస్థితిని తిరిగి నెలకొల్పాలి.

భూమిని శత్రువు చేజిక్కించుకుంటే దాని నతడు వుపయోగించుకొనటానికి వీలులేకుండా చేయాలి. ప్రజలు ఆపంటను స్వాధీనం జేసుకోవాలి. అదిసాధ్యం కానప్పుడు పైరును నాశనంచేయాలి. శత్రువును గ్రామంనుండి పారద్రోలాలి. సాధ్యమైన చోటనల్లా, రైతులు భూములను ఆక్రమించుకోవాలి కొలది నెలలపాటైనా, కనీసం కొలది రోజులపాటైనా ఆ భూములను తమ అధీనంలో నిలుపుకోవాలి ఆ భూమిని తామే స్వయంగా సాగుజేసుకొనటానికి, పంటను అనుభవించటానికి ప్రయత్నించాలి. ఆభూమిలో ఎలాంటి పైరు వేయటానికీ శత్రువుకు అవకాశ మివ్వరాదు శత్రువు పైరు వేసుకోవటం జరిగితే ఆ పైరును కోసుకెళ్ళి అనుభవించటానికి వీలు లేకుండా చేయాలి ఆర్థికంగాగాని, శారీరకంగాగాని ఎంతటి నష్టానికి గురికావలసి వచ్చినప్పటికి భూమికోసం ఈ పోరాటాన్ని కొనగించి తీరాలి. పదిసార్లు గాదు, వందసార్లు భూమి చేతులు మారినాసరే, శత్రువును ఆ ప్రాంతంనుండి పారద్రోలేంతవరకూ పోరాటాన్ని కొనసాగించవలసిందే.

3. పాత ప్రాంతాలలోను, కొత్త ప్రాంతాలలోనూ కూడా పన్నులు వసూలు జేసే అధికారులను, ఆవసూళ్ళపై తనిఖీజేసే అధికారులను పారద్రోలండి.

— జమీందార్లను, దేశముఖులను, భూస్వాములను, గ్రామాధికారులను పారద్రోలండి.

— ప్రజలమధ్య నివసిస్తూనే, శత్రువు ఏజెంట్లుగా వ్యవహరిస్తున్న కులపెద్దలను, తెగల పెద్దలను వేరుజేయండి.

— పోలీసులకు, శత్రువుకూ వార్తలు చేరవేసేవాళ్ళపట్ల కఠినంగాను, నిర్దాక్షిణ్యంగాను వ్యవహరించండి.

— మన సురక్షిత స్థావరాలనుండి శత్రువు క్యాంపులను ఎత్తివేసేట్లు చేయండి. లేదా వాటిని ధ్వంసం చేయండి. వెలుపలి క్యాంపులనుండివచ్చి ఈ స్థావరాలపై శత్రుదాడులు జేయటాన్ని నిరోధించండి. ఈ ప్రాంతాలలో శత్రువు అడుగు బెట్టటం అసాధ్యమయ్యేట్లు చేయండి

4. ఇంక సమస్యల విషయం :

— ప్రజలనుండి భూములను బలవంతాన ఆక్రమించుకునేందుకు

భూస్వాములు, దేశముఖులు చేసే ప్రయత్నాలను వమ్ముజేయండి. సాధ్యమైన చోటనెల్లా, భూస్వాముల భూములను స్వాధీనం జేసుకొని పంపిణీ చేయండి.

— వేతనాల హెచ్చింపుకోసం, పనిగంటల తగ్గింపుకోసం, వ్యవసాయ కార్మికులకు, ' పాలేర్లకు కనీస సెలవు దినాలకోసం సమ్మె పోరాటాలు నడపండి

— కష్టజీవుల రుణభారం సమస్యను తీసుకొని పనిజేయండి. వడ్డీ రేటు పంచాయితీ నిర్ణయించినదానికి, వందశేర్ల ధాన్యానికి ఎనిమిదినుండి పది శేర్లకు మించరాదు. అధిక వడ్డీరేట్లకు వ్యతిరేకంగా, అవసరంలో వున్నవాళ్ళకు అప్పులివ్వకుండావుండే ప్రయత్నాలకు వ్యతిరేకంగా నిరసనసమ్మెలు, సాంఘిక బహిష్కరణలు నిర్వహించండి.

5. ప్రజాసంఘాలను, పార్టీని నిర్మాణం జేయండి :

— వ్యవసాయ కార్మికులను ప్రత్యేకవర్గ సంఘంగా సంఘటిత పరచాలి. ప్రజాతంత్ర విప్లవంలో పాల్గొంటున్న విప్లవశక్తులన్నింటితోగూడిన జనతా ప్రజాస్వామ్య సంఘటనగా ఆంధ్రమహాసభను పనిజేయించాలి. ఆంధ్ర మహాసభ విధానంతో ఏకీభవించే వ్యవసాయ కార్మికులు, పేదరైతులు, మధ్య తరగతి రైతులు అందులో సులభంగా చేరగలరు. వారే తమ కార్యనిర్వాహక వర్గాన్నెన్నుకోవాలి వారే గ్రామ పంచాయితీ కమిటీగా వ్యవహరించాలి. ఈ పంచాయితీ కమిటీలు పోరాటసాధనాలుగా వుంటాయి.అందువల్ల పోరాడే వారు మాత్రమే ఎన్నికవటానికి అర్హులు.

— వ్యవసాయ కార్మికులతో పేదరైతులతో వాలంటీరు దళాలను నిర్మించండి, ఆ దళాలకు సైనిక శిక్షణ, ఆత్మరక్షణ గావించుకొనటంలో శిక్షణ గరపండి.

— (1) పార్టీ లక్ష్యాలను, కార్యక్రమాన్ని అవగాహన జేసుకుని, అంగీకరించేవారిని అనగా, మన గెరిల్లా ప్రాంతాలలో అమలు జరపబడుతున్న ఆదేశాలతో, కార్యక్రమాలతో,కార్యాచరణతో ఏకీభవించేవారిని", (2) కేంద్రీకృత ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా ఉక్కు శిక్షణ పాటించేవారిని, తగినంత రాజకీయ చైతన్యం గలిగినవారిని (3) పార్టీకోసం తమ సర్వస్వాన్నీ, అవసరమైతే తమ ప్రాణాలను సయితం త్యాగం జేయటానికి సిద్ధమైనవారిని (4) ప్రజల నైతిక ప్రమాణాలను ఖచ్చితంగా పాటించేవారిని, అంటే పార్టీప్రతిష్ఠకు భంగకరంకాని అలవాట్లు గలవారిని చేర్చుకుని పార్టీని నిర్మించండి త్రాగుబోతులకు, వ్యభిచారులకు పార్టీలో స్థానం లేదు. (పార్టీ సభ్యత్వానికి సంబంధించిన యితర అర్హత లున్నట్లయితే, పార్టీ ప్రతిష్ఠకూ, కార్యకలాపాలకూ

భంగకరం కాని పరిమితులలో మామూలు (తాగుడు, వ్యభిచార సంబంధమైన లోటుపాట్లను విస్మరించవచ్చు) పార్టీ సభ్యుల విజ్ఞానాన్ని అభివృద్ధి పరచాలి. రహస్యంగా పనిచేసే పద్ధతులను పెంపొందించాలి.

చిన్న గెరిల్లా దళాలను నిర్మించి, నడిపించటానికి, పార్టీ రహస్య నిర్వహణకూ సవివరమైన ఆదేశాలివ్వబడ్డాయి శత్రు సాయుధ బలగాలమధ్య ప్రచారం చేయవలసిన ఆవశ్యకతను, ఇతర రాజకీయపార్టీల స్వరూపాన్ని బట్టబయలు జేయవలసిన ఆవశ్యకతను, వాటి ననుసరించే ప్రజలకు ఓర్మితో వివరించి చెప్పి, వారిని రాబట్టుకోవలసిన అవసరాన్నిగూర్చి నొక్కిచెప్పటం జరిగింది.

# అధ్యాయం : 2

# బీభత్స పాలన :

# ప్రతిఘటన

పక్షంరోజులలోపలనే–సెప్టెంబరు నెలాఖరుకల్లా జనరల్ జె యన్. చౌధురి ఆధ్వర్యానగల సైనిక ప్రభుత్వం తెలంగాణా ప్రజలపై తన దాడులు ప్రారంభించింది. రజాకార్లపై సాగించిన లాంఛనప్రాయమైన పోరాటాన్ని నిలిపివేసింది సంస్థానమంతటా జరిగిన హత్యలకు, లూటీలకు బాధ్యుడయిన కాశిం రజ్వీవంటి పరమకిరాతకులను జైళ్ళలో నిర్బంధించటంమాత్రమే జరిగింది. జైళ్ళలోపల వారికి ప్రథమ తరగతికి చెందిన సౌకర్యాలు కల్పించారు. ఇంకా అనేకమంది రజాకార్లను జైళ్ళలోనైనా పెట్టకుండా వదిలేశారు. మరో వైపున కమ్యూనిస్టులను అణచివేసే ఉద్యమాన్ని ప్రారంభించారు.

సంస్థానంలోని వివిధ ప్రాంతాలలో, వందలాది సైనికులతో పెద్ద పెద్ద మిలటరీ క్యాంపులను ఏర్పాటుజేశారు. గ్రామాలనుండి పారిపోయిన దేశముఖులను, ప్రజాశత్రువులను, కాంగ్రెస్ వాలంటీర్లను గ్రామాలలో తమ పెత్తనాన్ని పునఃస్థాపితం చేయటంకోసం తిరిగి తీసుకొచ్చారు. ప్రతి మిలటరీ క్యాంపు సరసనే ఒక కాంగ్రెస్ కార్యాలయం కూడా వెలిసింది. సైన్యానికి లొంగిపోవలసిందిగాను, దళసభ్యులను పట్టించవలసిందిగాను ప్రజలనుకోరుతూ గ్రామాలవెంట తిరగడమే వారి కార్యక్రమంగా తయారైంది. వారు ప్రతి గ్రామంలో జెప్పినదిదీ :–

"మనకిప్పుడు ప్రజారాజ్యం వచ్చింది. నైజాంపోయాడు. ఆయుధాలతో సహా లొంగిపోవలసిందిగా దళాలకు చెప్పండి మీరు మాతో ఒప్పందానికి కూడారండి దేశముఖులనుండి మీరు తీసుకున్న ఆస్తులను, పశువులను, ధాన్యాన్ని, భూములను అన్నింటినీ తిరిగి మా కిచ్చివేయిండి. కాంగ్రెస్ ప్రభుత్వం, ఆ తర్వాత భూ సంస్కరణలు ప్రవేశపెడుతుంది మీకు భూములిస్తుంది. మనమంతా హిందువులం. కమ్యూనిస్టులు రష్యా ఏజెంట్లు, కమ్యూనిస్టు ప్రభుత్వంక్రింద ప్రతి ఒక్కవ్యక్తి కార్మికుడే. వారు ఏ విధమైన సాంఘిక కట్టుబాట్లనూ పాటించరు. ముసలివాళ్ళందరినీ చంపివేస్తారు. అందువల్ల వాళ్ళను నమ్మవద్దు. భూమిశిస్తు, ధాన్యంలెవీ, ఎక్సైజు పన్నులు చెల్లించండి. మేమెంతచెప్పినా మా మాటవిని మమ్మనుసరించకపోతే, మిమ్ములను శిక్షిస్తాం. మాకున్న బలగాలముందు నైజాం అంతటివాడు సయితం వారంరోజుల లోపలే లొంగిపోవలసి వచ్చింది. ఇకఈకమ్యూనిస్టులనగా ఎంత? రెండుమైళ్ళ దూరానగల లక్ష్యంపైన దెబ్బదీయగల అతిపెద్ద ఆయుధాలు మాకున్నాయి. గ్రామాలపై బాంబులువేసే విమానాలున్నాయి దారిలో అడ్డంవచ్చిన ప్రతిదానినీ పిండి పిండిచేయగల టాంకులున్నాయి మిమ్ములను కాపాడటానికే మేమొచ్చాం. మా మాటవినకపోతే మీ గోతిని మీరు త్రవ్వుకున్నట్లే"

గ్రామాలలో మొట్టమొదట ఒక వరస ఈ విధమైన ప్రచారం సాగించారు. వారంరోజుల లోపల లొంగిపోవలసిందిగా కమ్యూనిస్టులను కోరుతూ, అలా లొంగిపోకపోతే వాళ్ళను నిర్మూలిస్తామని పేర్కొంటూ మిలటరీ గవర్నరు జనరల్ జె. యన్. చౌధురికూడా, హైదరాబాద్‌నుండి ఒక ప్రకటన చేశాడు.

యూనియన్ ప్రభుత్వ స్వభావాన్ని వివరించి చెప్పటంకోసం, పార్టీ కార్యకర్తలు, గెరిల్లా దళాలూ పువ్వెత్తున ప్రచారం సాగించారు. కాంగ్రెసు కమిటీలు, దేశముఖుల కమిటీలు తప్ప వేరేమీకాదని, వారు ప్రజలకు చెప్పారు పోరాటంద్వారా తాము సాధించుకున్న భూమిని, పశువులను, గ్రామ పంచాయతీ కమిటీలను కాపాడుకోవలసిందిగాను, లొంగిపోవలదనీ వారు కోరారు ఈ దశలో సూర్యాపేట తాలూకాలో ఒక పాట బహుళ ప్రచారంలో వుంది. "ఓ రైతా, రాజీపడాలనుకుంటున్నావా ? ఎలుకకూ - పిల్లికీమధ్య రాజీ అసంభవం" అనేదే దాని సారాంశం ఈ పాటను రామన్న గూడెముకు జెందిన పార్టీ సభ్యులొకరు వ్రాశారు.

దళాలపైన, ప్రజలపైన మిలటరీ ప్రత్యక్ష దాడులు ప్రారంభించింది. పార్టీ ఆంధ్రమహాసభ కార్యకర్తలనుగూర్చి ఎవరు ఏ దళంలో చేరారు ? ఏ దళం ముఖ్యమైన దళం ? ఎవరు ఏనూతి సమీపాన లేదా ఏ పొలంలో నివసించారు ? మొదలుగాగల సమాచారాన్ని సంపాదించారు. ఆ సమా

చారం ప్రాతిపదికపై సైన్యం తన దాడులను అలాంటి తావులపై కేంద్రీకరించి సాగించింది. కాంగ్రెస్ వాలంటీర్లు, సైన్యంయొక్క ప్రత్యేక గూఢచారిశాఖగా వ్యవహరించుతూ, సమాచారం సేకరించారు. సైన్యంతోపాటు వాళ్ళూ రజాకార్లు చేసినట్లే అత్యాచారాలు సాగించారు.

సైనికులు లారీలలో బయలుదేరి, ఒక్కొక్కసారి ఐదారు గ్రామాలను చుట్టుముట్టేవారు. ఈ గ్రామాల ప్రజలందరిని ఒక్కచోటికి పోగుజేసి, కమ్యూనిస్టులను, గెరిల్లాలను చూపించవలసిందిగా కోరుతూ వాళ్ళను కొట్టేవారు. చిత్రహింసలకు గురిచేసేవారు. ఉదయం 8–10 గంటలకెల్లా ఈ పని పూర్తిజేసి, ఆ తర్వాత దాగియున్న గెరిల్లాలకోసం కొండల్లో, గుట్టల్లో, వాగుల్లో వంకల్లో, పొదలలో వెదికేవారు. సాయంత్రానికల్లా క్యాంపులకు తిరిగి చేరుకునేవారు. ఆ విధంగా వారు రోజుకొక కేంద్రంమీద కేంద్రీకరించేవారు. ఒక్కొక్కసారి అదేరోజు రెండు, మూడు కేంద్రాలు తీసుకునేవారు. ఈ దాడులసంఖ్య, పునరావృతి, తీవ్రత అధికమైంది. ఒక తాలూకా, తర్వాత మరొక తాలూకాలో ఈ విధంగా సాగించారు. ఒక్కోసారి ఇరవై, ముప్ఫై గ్రామాలను చుట్టుముట్టేవారు.

వీటిని చుట్టుముట్టే దాడులని పిలచేవారు. ఈ ముట్టడిలో చిక్కుకున్న దళమేదైనా తప్పించుకోగలగటం అరుదు. ప్రతిఘటించటం అంతకంటే ప్రమాదకరం. అందువల్ల, దీన్ని దృష్టిలో వుంచుకుని, దళాల నిర్మాణంలో, వాటి సంఖ్య విషయంలో, రక్షణ పద్ధతుల విషయంలో కొన్ని మార్పులు చేయబడ్డాయి.

ఒక్కొక్క దళంలోవుండే సభ్యులసంఖ్య ఐదుకు మించరాదనీ వారు ప్రజలు ధరించేటటువంటి దుస్తులనే ధరించాలనీ, తమ ఆయుధాలను బహిరంగగా ప్రదర్శించుతూ తిరగరాదనీ, సైన్యం ముట్టడి జేయబోతున్నదన్న వార్త ముందుగా తెలిస్తే అలాంటి ప్రాంతాలను వదిలివెళ్ళాలని నిర్ణయించబడింది. స్థానిక ప్రజలతో కలసిపోయి మెలగవలసిందిగా గ్రామ దళాలను పార్టీ కోరింది.

ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ, మనలను కాపాడు కోవటం ఎంతో కష్టమైంది. ఒక పథకం ప్రకారం సాగించబడుతున్న ఈ చిత్రహింసాకాండను మన రక్షణకు ప్రధాన ఆధారమైన ప్రజలు తట్టుకోలేకపోయారు. ప్రజలను హింసలపాలు జేయటంలో మిలిటరీవాళ్ళు, రజాకార్లను తలదన్నారు. "గొర్రెలుదినే వాడుపోయి, బర్రెలు దినే వాడొచ్చాడు" అని ప్రజలు చెప్పుకోనారంభించారు.

ప్రజలను ఒకచోట మందవేయడం, కమ్యూనిస్టుల అచూకీ చెప్పవలసిందిగాను, దేశముఖుల ఆస్తులను తిరిగి యిచ్చివేయవలసిందిగాను కోరుతూ బాదటం రోజువారీ కార్యక్రమమైపోయింది. స్త్రీ, పురుష విచక్షణగాని, వయో వృద్ధ భేదంగాని లేకుండా ప్రజలను లాఠీలతో తుపాకి మడమలతో, చింత బరికెలతో తీవ్రంగా కొట్టేవారు. ప్రజలను చిత్రహింసలు బెట్టటంలో సీతాపతి అనే మిలిటరీ కమాండరు అందరిని తలదన్నాడు. చింత బరికెలను, సుత్తి-కొడవలి ఆకారంలో వంచికట్టి, వీపులమీద సుత్తికొడవలి గుర్తు ముద్రబడేట్లు బాదేవారు.

పార్టీ సభ్యుల కుటుంబాలపైన, గెరిల్లా దళాల సభ్యుల కుటుంబాల పైన ప్రత్యేకంగా కేంద్రీకరించి దాడులు సాగించారు చేతికి జిక్కిన ప్రతి వారినీ, ప్రజల సమక్షంలోనే అమానుషంగా కొట్టి, హింసించేవారు.

**బీభత్స పద్ధతులు**

తెలంగాణా ప్రజల వీరోచిత పోరాటాన్ని అణచాలనే వుద్దేశ్యంతో, హైదరాబాదులోని కాంగ్రెస్ మిలిటరీ ప్రభుత్వమూ, పోలీసులూ, సైన్యమూ, కాంగ్రెస్ రజాకార్లూ, కనీవిని ఎరుగని స్థాయిలో గూండాయిజాన్ని, బీభత్స కాండను, ఫాసిజాన్ని విచ్చలవిడిగా సాగించారు

— తెలంగాణాలోని పోరాట ప్రాంతమంతటా ప్రతి నాలుగైదు మైళ్ళ కొకటిచొప్పున మిలటరీ క్యాంపులు ఏర్పాటు చేయబడ్డాయి. రోజుకు రెండుసార్లు, మూడుసార్లు సైనికులు ఈ క్యాంపుల దరిదాపులలోగల గ్రామాలపై మిలటరీ దాడులు సాగించారు. ప్రజలను నిర్ణీత పద్దతి ప్రకారం హింసలపాలు జేశారు. ప్రతి గ్రామంలోనూ ప్రజలను ఒకచోట మందవేసి, పాశవికంగా కొట్టారు. కమ్యూనిస్టులను వెదకటంకోసం అడవులు, తోపులు, కొండలు మొదలైన వాటిలో తమవెంట రావలసిందిగాను, సమాచారం చెప్పవలసింది గాను ప్రజలను నిర్బంధించేవారు. ఆ విధంగా వెదికినప్పుడు ఎవ్వరూ కని పించకపోతే, మరల ప్రజలను పట్టుకుకొట్టేవారు.

— మానుకోట తాలూకా తొర్రూరు, తదితర గ్రామాలలో, హుజూర్‌నగర్ తాలూకాలో ప్రజలను త్రాళ్ళతోకట్టి గిలకలమీదుగా పైకి లాగి,ఎత్తునుండి క్రిందపడవేశారు. మనుషులను గోనెసంచులలోబెట్టి మూతిగట్టి సైనికులు నూతిమీదుగా అటునుండి ఇటు, ఇటునుండి అటూవిసిరివేసేవారు.

— కొంతమంది సైనికులు ఆయుధాలు చేతబట్టుకునే వారు. మరికొంతమంది ప్రజల కాళ్ళుబట్టుకుని వూపుతుండగా, యింకా కొందరు ఆ వూగుతున్నవాళ్ళను లమ ఇనప నాడాల బూట్లతో ఫుట్-బాల్‌ను తన్ని నట్లు తన్నుతుండేవారు.

— మండే ఎండలో, యిసుకలో ప్రజలను మూకవుమ్మడిగా పరుండబెట్టి కొట్టేవారు. కొంతమందిని తలక్రిందుగా చెట్లకొమ్మలకు వ్రేళ్ళాడ దీసి, ఉయ్యాల వూపేవారు వూపుకు ఆ చివర, ఈ చివరన కొట్టుతూ వుండే వారు. కొంతమందిని బోర్లా పరుండబెట్టి వీపుమీద కొయ్యపలకమీద పడవేసి సైనికులు దాని మీదకెక్కి తొక్కుతూ, నృత్యంచేస్తూ వుండేవారు.

— చేతి వేళ్లగోళ్లక్రింద గుండుసూదులు గుచ్చేవారు. ఎర్రగా కాల్చిన ఇనుముతోనో, కొరివితోనో వొంటిపై వాతలు పెట్టటం సర్వసాధారణం. ప్రజలను హింసలపాలు జేయటానికి విద్యుచ్ఛక్తినికూడా వుపయోగించేవారు.

— మానుకోట - ఖమ్మం తాలూకాలలో, ఒక్కొసారి పదినుండి పాతిక గ్రామాలపైన దాడులు జరిపేవారు. వందలాది ప్రజలను తీవ్రంగా కొట్టేవారు. లారీలముందు పరుగెత్తించేవారు. లారీలకంటె ముందుపరుగెత్తలేక పోయినవాళ్లను, లారీలవెనుక వ్రేళ్ళాడగట్టి ఈడ్చుకు పోయేవారు.

— తెట్టలపాడు గ్రామ నాయకుడగు కామ్రేడ్ వీరాస్వామి కాళ్లు, చేతులు వెనకకు మడిచి కట్టారు ఆయనను, మోకాళ్లు, మోచేతులమీద ప్రాకునట్లు చేశారు రక్తంకారుతుండగా, ప్రాకలేనిస్థితిలో వుండగా, ఆయన తలమీద లారీలతో, రాళ్లతో మోదారు తన జోన్ కమాండరగు సత్యం ఎక్కడున్నదీ బయట పెట్టటానికి ఆయన నిరాకరించటమే అందుకు కారణం. ఈ అమానుష చర్యను గాంచిన స్త్రీలు, బిడ్డలు ఆగ్రహపరవశులై పోలీసులపై దుమ్ము జల్లారు. వాళ్లను తిట్టిపోశారు.

— ఇల్లెందు తాలూకా, బేతలపాడు గ్రామప్రజలందరినీ కొట్టారు. వారందరినీ కింద పరుండబెట్టారు. వాళ్ళపై బరువైన రాళ్ళు పెట్టారు. "కమ్యూనిస్టు లెక్కడున్నారో యిప్పుడు చెప్పండి", "కాంగ్రెసు పాలన మంచిదా? కమ్యూనిస్టు పాలన మంచిదా చెప్పండి" అని అడిగారు సైనికులు, తమ ఇనుపనాడాల బూట్లతో వారి శరీరాలపై నృత్యం చేశారు. ఆ తర్వాత, వారిని ఖమ్మం ముళ్ళ కంచెల బందెల దొడ్డిలో పడవేసేవారు.

— మానుకోట తాలూకా మన్నెగూడెం. వుల్లెపల్లి, జయ్యారం గ్రామాలలో ప్రజలను నేలమీద పరుండబెట్టి వాళ్ళమీదుగా గుర్రాలతో స్వారీ జేశారు

లోయపల్లి, పరిసర గ్రామాలలో ప్రజలను ముండ్ల తుప్పలలో పడవేసి, సైనికులు తమ బూట్లకాళ్ళతో వారిమీద కెక్కారు. మిట్టమధ్యాహ్నం పన్నెండు గంటలవేళ, మండుటెండలో, ప్రజలను ఆ ముండ్లపొదల మీదుగా మోచేతులు, మోకాళ్ళతో ప్రాకునట్లు చేశారు. ఆ స్థలమంతా రక్తసిక్తమయి

పోయించి మూడువందలమంది స్పృహ గోల్పోయారు ఈనాజీ హింసాకాండ అంతా అయిన తర్వాత, మీరు కమ్యూనిస్టులను వదులుకుంటారా లేదా అని సైనికులు ప్రజలనడిగారు. "మాజీవితాలలో ఎన్నడూ మేము వాళ్ళను వదులుకునేదిలేదు!" అని ప్రజలు ముక్తకంఠంతో సమాధాన మిచ్చారు.

నల్గొండ, వరంగల్, ఖమ్మం, కరీంనగర్, హైదరాబాదు జిల్లాలకు చెందిన రెండువేలకుపైగా గ్రామాలలో, పైన పేర్కొన్న విధంగా మూడు లక్షలమంది ప్రజలను చిత్రహింసల పాలుజేశారు. సుమారు యాభై వేలమందిని అరెస్టు జేశారు కొలదిరోజులు మొదలు కొలది మాసాలవరకు క్యాంపులలో నిర్బంధించారు. ఐదు వేలమందికిపైగా, సంవత్సరాల తరబడి జైళ్ళలో నిర్బంధించబడ్డారు.

## మహిళలపై అత్యాచారాలు, మానభంగాలు

మహిళలపై అత్యాచారాలు జరపటంలోనో వారిని మానభంగం చేయటంలోనూ కాంగ్రెసురజాకార్లు, సైనికులు నైజాం రజాకార్లను తలదన్ని పోయారు. ఈ అత్యాచారాల స్వభావ స్వరూపాలను అర్ధంజేసుకొనటానికి ఈ దిగువ ఉదాహరణలే చాలు :

— సూర్యాపేట తాలూకా రాగిపాడులో మూడురోజులక్రితమే ప్రసవించిన స్త్రీని చెరిచారు

— భువనగిరితాలూకా తేనుగుంటలో ఒక గర్భిణీస్త్రీని చెరిచారు. నారిగూడెంలో క్రితంరోజే ప్రసవించినస్త్రీని చెరిచారు.

— ఖమ్మంతాలూకా పుష్పావూరులో భువనగిరితాలూకా యెఱ్ర పాడులో పదిసంవత్సరాల బాలికలను సయితం చెరిచారు.

— ఈ పశువులు, ఇల్లెందుతాలూకా బలపాలలో యిరవైమంది స్త్రీలను, సీమలపాడులో డెబ్భయిమందిని, జనగామతాలూకా నర్మెట, నంగనూరు గ్రామాలలో ఎనభైమందిని చెరిచారు.

— నీలాయగూడెంలో గ్రామస్తులు గెరిల్లాలకు బియ్యం యిచ్చినందుకుగాను, ఆ గ్రామంలో 12 సంవత్సరాలు దాటినవారినందరినీ కొట్టారు. పదిహేనుమంది స్త్రీలను పాశవికంగా చెరిచారు.

— అందిన సమాచారాన్నిబట్టి, మొట్టమొదటి సంవత్సరంకాలంలోనే వెయ్యిమందికిపైగా స్త్రీలను చెరిచారు. మొత్తం ఆ కాలమంతటిలోనూ కొలది వేలమందిని చెరిచారు. అనేకమంది పశువులు ఒకరితర్వాత వొకరు చెరిచినందున వందమందికిపైగా స్త్రీలు మృతిజెందారు.

— ఇనుప పట్కార్లతో స్త్రీల రొమ్ములను పట్టిలాగటం, నొక్కటం జరిగింది. తల్లులఎదుటనే బిడ్డలను చంపివేయటమూ జరిగింది.

— నేరెడలో డెబ్బైమంది స్త్రీలను వివస్త్రలను గావించారు. వారి తొడలకు తొండలనుకట్టి, గాయాలలో కారంకూరారు

## దారుణ హత్యలు సజీవ దహనాలు,
## జీవ సమాధులు, మూకవుమ్మడి వూచకోతలు

— చందుపల్లికి చెందిన కామ్రేడ్ రంగయ్యను ఒక బండికి కట్టి సజీవంగా దహనం చేశారు. "కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్" అని నినదిస్తూ ఆయన ప్రాణాలు విడిచాడు.

— కామ్రేడ్ రాములును సూర్యాపేట తాలూకా, మిర్యాలవద్ద చుట్టుముట్టడి దాడిలో పట్టుకున్నారు ఆయన నుండి ఎలాంటి రహస్యాలూ రాబట్టలేక ఒక లారీకి కట్టి శరీరం ముక్కలు ముక్కలై పోయేంతవరకూ ఈడ్చుకెళ్ళారు.

— నల్గొండ తాలూకా, కొప్పోలుకు చెందిన కామ్రేడ్ వీరయ్యను ఒక లారీకి కట్టి, మరణించేంతవరకూ ఈడ్చు కెళ్ళారు

— సూర్యాపేట తాలూకా, నూతనకల్లు సమీపంలో ఒక దళసభ్యుడిని, ఎడ్లబండి చక్రాలకు కట్టి, ఎడ్లను సాగదోలారు ఆయన బండి చక్రాల క్రిందబడి నలిగి మృతిచెందాడు.

— చీటూకోడూరు కార్యకర్త కామ్రేడ్ వెంకటరామానుజాచారిని తుపాకితో కాల్చి, యింకా ప్రాణముండగానే పూడ్చి పెట్టారు.

— వినునూరుకుచెందిన కామ్రేడ్ ముత్తయ్యను, కల్మలచెరువుకు చెందిన కామ్రేడ్ అప్పిరెడ్డిని గడ్డివాముల్లోపడవేసి నిండు ప్రాణాలతో నిలువునా తగులబెట్టారు.

— భువనగిరి తాలూకా ముగలిపాకకు చెందిన కామ్రేడ్స్ కావలి నారాయణను, సంగయ్యను, పులిగిళ్ళకు చెందిన ముగ్గురు రైతులను సజీవ దహనం చేశారు.

మల్కాపురానికి చెందిన దళ నాయకుడు కామ్రేడ్ గంజి సత్యనారాయణను, కామ్రేడ్ హరిజన్ ముత్తయ్యను కనుగ్రుడ్లు తోడారు

బీర్జాలుకోసి వారినోళ్ళలో కుక్కారు. ఆ తర్వాత వాళ్ళను ముక్కలు ముక్కలు జేశారు.

— నరసంపేట తాలూకా పేరేపల్లి క్యాంపులోని ఎలటరీవాళ్ళు ఇద్దరు కోయరైతులను ముండ్లపొదలలోవేసి తొక్కిచంపారు.

— మానుకోట తాలూకా కుమ్మరికుంట్లకు జెందిన రెడ్డిమళ్ళ బక్కయ్య తలను పెద్ద రాళ్ళుబెట్టి నుజ్జునుజ్జుచేశారు నరసంపేట తాలూకా అయితా పురానికి జెందిన రోశయ్యను వెల్లకిలా పండుకోబెట్టి ఆయన తల మీద రాళ్ళతో కొట్టిచంపారు

— గ్రామ నాయకుడు తోతోరి యేంపల్లిని పట్టుకుని, గంటల తరబడిన మండుటెండలో కాలుతున్న యిసుకలో దొర్లించి కొట్టారు. ఆయన వొంటిమీద తోలు వూడిపోయింది ఆయనను కొత్తగూడెం క్యాంపులో నిర్బంధించారు. ఆయన అక్కడే మృతిజెందాడు.

— నరసంపేట తాలూకా, అశోకనగర్‌కుజెందిన ఒకమిలిటెంట్‌పై మరుగుతున్న నీళ్ళుపోశారు. ఆయన వొంటి చర్మం వూడిపోయింది. అయినా, ఏ రహస్యమూ చెప్పటానికి నిరాకరించాడు. అచ్చటనే మృతిజెందాడు.

— రఘురాములును కొట్టి, ఆయన గాయాలమీద కారంరుద్ది, ఆయన నగ్నదేహంమీద కాగే నీళ్ళుపోశారు. ఆయనను, సత్తి నారాయణ అనే మరొక కామ్రేడ్‌తో కలిపికట్టి, సజీవదహనం చేస్తామని బెదిరించారు. అయినా, రహస్యాలు వెల్లడించటానికి ఆయన నిరాకరించాడు.

— నోముల గ్రామానికి జెందిన, వ్యవసాయ కార్మిక కుటుంబానికి జెందిన కామ్రేడ్ యెల్లాస్వామి నమ్మకమైన కొరియర్ కేంద్ర ఆర్గనైజర్. మానుకోటప్రాంతంతో సంబంధం పెట్టుకొనటానికి ప్రయత్నిస్తుండగా ఆయనను పట్టుకున్నారు. లెక్కలేనంతగా చిత్రహింసలకు గురిచేశారు. ఆయన శరీరంనుండి మాంసం ముక్కలు ముక్కలుగా కోశారు. ఆయన శరీరంలోకి ఇనుప మేకులు దిగగొట్టారు. ఎర్రగా కాల్చిన యినపకడ్డీతో వాతలుబెట్టారు. అయినా రహస్యాలు చెప్పటానికి ఆయన నిరాకరించాడు. చివరకు ఆయనను కాల్చిచంపారు.

— జనగాము తాలూకా, పోలిపురానికి చెందిన జక్కయ్యను పోలీసు స్టేషనులో, బాయినెట్లతో పొడిచారు. ఆ తర్వాత ఒక గోడమీదపెట్టి, ఆయన రెండు చేతులకు, కాళ్ళకూ బరువులు వ్రేళ్ళాడగట్టి వాడగొట్టారు.

— పాల్వంచ తాలూకా అల్లాపల్లి క్యాంపులో, సెప్టెంబర్‌లో ఒక్కరోజునే 45 మందిని కాల్చి చంపారు. అందులో 18 మంది పార్టీ సభ్యులు. హత్యాకాండ కొనసాగింది నాలుగు రోజులలోపునే 119 మందిని చంపారు. ఈ క్యాంపులో 46 మంది పార్టీ సభ్యులతో సహా మూడువందల మందికి పైగా చంపబడినట్లు అంచనా వేయబడింది.

— గడిపాడు, గుండాల క్యాంపులలో, మూడువందల మందికి పైగా కాల్చి చంపబడ్డారు.

— అడవులనుండి ఖాళీ చేయించిన కోయప్రజలకోసం ఏర్పాటు జేయబడిన గడిపాడు, తదితర క్యాంపులలో, రెండుమాసాలలోపునే సుమారు 10 వేల మంది ప్రజలు కలరావల్ల మృతిజెందారు. వాళ్లను తమ గ్రామాల నుండి ఖాళీ చేయించటంకోసం పోలీసులు 120 మందిని కాల్చి చంపారు.

## పెద్దసంఖ్యలో ముఖ్యకార్యకర్తల నష్టం

భారత సైన్యం ప్రవేశించిన తర్వాత కొలది మాసాలలోపునే, మన కార్యకర్తలు పెద్ద సంఖ్యలో ప్రాణాలర్పించారు. తమ స్థానాలకే దృఢంగా అంటిపెట్టుకుని నిలవినందున, ప్రజలను కాపాడుతున్నందునా వారు ఆవిధంగా ప్రాణాలు గోల్పోయారు

ఖమ్మం - మధిరప్రాంతానికి జెందిన కామ్రేడ్స్ మచ్చావీరయ్య, గింగవరపు శ్రీనివాసరావు, పి. శేషయ్య, సోయం సింగులు, కుంజా ముత్యాలు, మిర్యాలగూడెం - హుజూర్‌నగర్ ప్రాంతానికిజెందిన అల్వాల నరసింహా రెడ్డి, వల్లభనేనిసీతారామయ్య, ముత్తవరపు వెంకయ్య, బలిజగాములు, వెదిరి రామిరెడ్డి, మునగాలకు జెందిన సుంకరి వెంకటప్పయ్య, గోళ్ళముత్తయ్య, వెంగళ పాపయ్య, సూర్యాపేట తాలూకాకు జెందిన కొండలరెడ్డి, జాన్, పి సీతారామారావు, అనిరెడ్డి రామిరెడ్డి, వత్సాల, గిబియా, భువనగిరి ప్రాంతానికిజెందిన పాశం రామిరెడ్డి, రామానుజాచారి, కోదండరామిరెడ్డి, గాలి హనుమయ్య, సూర్యనారాయణ, పైలారామచంద్రారెడ్డి, గుట్టా సీతా రామిరెడ్డి, జనగామ - వరంగల్ ప్రాంతానికి జెందిన గజ్జెల తిరుమలరెడ్డి, శామ్యూల్, అయిలయ్య; మానుకోట ప్రాంతానికి జెందిన దొంతేటిపుల్లయ్య గాంద్రచంద్రయ్య, మెదక్‌కు - హైదరాబాదునగరానికి జెందిన రంగా చారి, కొమరయ్య, భారతసైన్య ప్రవేశించిన తర్వాత తమ ప్రాణాలర్పించిన సుమారు ఐదువందలమంది కార్యకర్తలు, పళి నాయకులలోకొందరు మాత్రమే.

ఈ అమరవీరులలో కొందరి జీవితాలనుగూర్చి పదవ అధ్యాయంలో క్లుప్తంగాయిచ్చాం. తెలంగాణా, ఆంధ్రప్రాంతాలు రెండింటిలోనూ అశువు లర్పించిన అమరవీరులపేర్లు లభ్యమైనంతమేరకు ఈ గ్రంథంలో చివరిభాగంలో వేరుగాయిస్తున్నాం ఐదు సంవత్సరాలపాటు సాగిన ఈ మహత్తర పోరాటం సందర్భంగా దాదాపు నాలుగు వేలమంది తమ ప్రాణాలు గోల్పోయారు. అయినా, దురదృష్టవశాత్తు కొన్ని వందలపేర్లు మాత్రమే మాకు లభ్యమైనాయి.

## బీభత్సకాండ వైఫల్యం

సంవత్సరంపాటు ఆ విధంగా బీభత్సకాండ సాగిన తర్వాతకూడా, ప్రజలు తాము సాధించుకున్న విజయాలను కాపాడుకొంటూనే వున్నారు

గర్భిణీస్త్రీలను చెరచటం, నిండుప్రాణాలతో ప్రజలను నిలువునా తగలబెట్టటం, కనిపించగానే కాల్చిచంపటంవంటి నాజీ పాశవిక చర్యలు సాగించబడినప్పటికీ ప్రజలు ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన దృఢనిశ్చయంతో నిలిచారు మిలటరీ సహాయంతో తమ గ్రామాలలో తిరిగి నిలదొక్కుకొన గోరుతున్న దేశముఖులను, జాగీర్దార్లను ప్రజలు పట్టణాలకు తరుముతూనేవున్నారు. సంవత్సరం గడిచిన తర్వాతకూడా గ్రామీణప్రాంతంలో ప్రభుత్వ ఆధిపత్యం స్థిరపడనేలేదు

పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకులైన కొండా వెంకటరంగారెడ్డి (స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు) బూర్గుల రామకృష్ణారావు, డాక్టర్ చెన్నారెడ్డి నల్గొండ, వరంగల్ జిల్లాలలో పర్యటించిన అనంతరం చేసిన ఈ దిగువ ప్రకటన ను బట్టికూడా ఇది విదితం కాగలదు : (1949 జూలై 15 గోల్కొండ దినపత్రిక)

"కమ్యూనిస్టు తేర్పాటుచేసిన గ్రామ పంచాయితీలు గతంలో వలెనే పనిజేస్తున్నాయి. గ్రామాలలో ప్రతి వివాదాన్ని ఈ పంచాయితీలే పరిష్క రిస్తున్నాయి వారు పట్టాదారులను త్రోసిపుచ్చి భూముల నాక్రమించుకుంటు న్నారు కమ్యూనిస్టు కార్యకలాపాల కారణంగా, పటేళ్ళు, పట్వారీలు ఈ గ్రామాలలో అడుగుపెట్టటానికి సాహించలేకపోతున్నారు ప్రదర్శనలు, సభలు, వుత్సావాలు మొదలైనవి నిర్వహించటానికిగాను గ్రామపంచాయితీలు చందాలు వసూలు జేస్తున్నాయి.

"పోలీసు చర్య అనంతరం గ్రామాలకు తిరిగి వచ్చినవారు (ఖచ్చితంగా నిజానికి దేశముఖులే- నిలేకరి) కమ్యూనిస్టుల కారణంగా నగరల పట్టణాలకు పారిపోతున్నారు. ఈ గ్రామాల నుండి పోలీసుస్టేషనుకు వారం వారం క్రమం దప్పకుండా రిపోర్టు లంపడంలేదు.

"కమ్యూనిస్టు కల్లోలాలు, దౌర్జన్యకాండా రోజు రోజుకూ అధిక మవుతున్నాయి కమ్యూనిస్టులు భూములను సక్రమంగా పంపిణీ చేయడంలేదని కొందరువున్నతాధికారులు, కాంగ్రెస్ కార్యకర్తలూ అంటున్నారు! సక్రమమైన పంపిణీ జరిగేట్లయితే శాంతిని తిరిగి నెలకొల్పవచ్చు

"మనం గ్రామాలలో పాఠశాలలను తిరిగి తెరిపించలేకపోవటానికి కారణమేమిటి? ఒకచోట, విద్యార్థులకు బుర్రకథ నేర్పగలమన్న షరతుపై పాఠశాల ప్రారంభించబడింది. గ్రామస్థులు తాడిచెట్లను నరికివేస్తుండటానికి కారణమేమిటి? ప్రభుత్వ అనుమతి లేకుండానే అనేకచోట్ల కల్లు దుకాణాలు ప్రారంభించబడటానికి కారణమేమిటి? ఫారెస్టు అధికారుల అనుమతి లేకుండానే, ప్రజలు అడవులలోని చెట్లను ఎందుకుగాను నరికివేస్తున్నారు? మేము చూచినంతవరకు, పన్నులు వసూళ్లుకూడా జరగటంలేదు కొన్నిచోట్ల, ప్రభుత్వాధికారులు, ప్రజలవద్దనుండి పన్నులు వసూలుజేయటానికి ప్రయత్నాలుకూడా చేయటంలేదు. ఇప్పటివరకు, రెండోపంటతాలూకు అదనపు శిస్తువసూలుజేసిన సూచనయే కనిపించటంలేదు.

### తెలంగాణా పోరాటాన్నిగూర్చి ప్రభుత్వాధికారి బయటపెట్టిన సత్యాలు

హైదరాబాదు ఉన్నత పోలీసు అధికారితో జరిగిన చర్చలపై క్లుప్తమైన నివేదిక వొకటి ఆ రోజుల్లో రహస్య పత్రికల్లో ప్రచురించబడింది.

కొన్ని ప్రశ్నలకు అధికారియిచ్చిన జవాబులను ఇక్కడ పొందుపరుస్తున్నాం:

ప్రశ్న. సంస్థానంలో కమ్యూనిస్టు ఉద్యమం సద్దుమణిగిందా?

జవాబు. లేదు. ఇప్పటికీ అది అలాగే వుంది. వారి గూండాయిజం యిప్పటికీ విస్తృతంగానే వుంది.

ప్రశ్న: వారేమి చేస్తున్నారు?

జవాబు: వారు సాయుధ దళాలుగా ఏర్పడ్డారు. వారు సైన్యంపై ముఖాముఖిని దాడిచేయటంలేదు. వారు గ్రామాలకు పోతారు. గ్రామంలోని భూమి, ధనాలు అన్నింటికీ యజమానులైన ధనికులు గ్రామానికి ముగ్గురో, నలుగురో వుంటారు. మిగతా ప్రజలంతా నిరుపేదలు. ఈ దళాలు గ్రామంలోకి వెళ్తాయి. వారిని చంపవలసిందిగాను, వారి ఆస్తులను ధ్వంసంచేయవలసిందిగాను ఈ పేద ప్రజలను రెచ్చగొడతారు

ప్రశ్న : కమ్యూనిస్టులు స్త్రీలను చెరుస్తున్నారని, ఆస్తులను లూటీచేస్తున్నారని, దారినబోయే ప్రయాణీకులను పొడిచేస్తున్నారని అంటారు అది నిజం కాదా ?

జవాబు : కాదు. కమ్యూనిస్టులలాంటి పనులు చేయరు. పత్రికలలో చదువుతున్న దానినిబట్టి మీరలా అనుకుంటారు కాని, వారలా చేయరు. వారి అత్యాచారాలన్నీ దేశముఖులపైన, జాగీర్దార్లమీద మాత్రమే వా రేనాడూ ప్రజలజోలికి పోరు

ప్రశ్న : ప్రభుత్వం వాళ్ళనెందుకు అణచివేయలేదు ?

జవాబు. ప్రభుత్వం అన్నివిధాలా ప్రయత్నిస్తోంది అయినా అది కష్టమవుతోంది. పదినుండి ముప్పై గ్రామాల కొకటి చొప్పున పోలీసు క్యాంపు లేర్పాటు చేయబడ్డాయి ప్రతి పోలీసుక్యాంపూ సర్కిల్ ఇన్‌స్పెక్టరు హోదాగల పోలీసు అధికారి అజమాయిషీ క్రింద వుంది కమ్యూనిస్టులను అణచివేయటం వాళ్ళకు అసాధ్యంగావుంది. గ్రామాలలో ప్రజలు ప్రభుత్వానికి తోడ్పడలేదు పైగా, రహస్యంగా కమ్యూనిస్టులకే సహాయపడుతున్నారు. కమ్యూనిస్టులవద్ద ఆయుధా లున్నాయి. అందువల్ల పోలీసులు వాళ్ళ దగ్గరకు పోవటానికే భయపడుతున్నారు. పోలీసులు దాడులకు బయలుదేరి పోయేటప్పుడు, క్యాంపులోని తమ తమ మిత్రులను, తాము తిరిగి రాని పక్షంలో తమ భార్యలకు తమ తుదిమాటలను చెప్పవలసిందిగా కోరుతున్నారంటే ఆ భయం ఎంతగా వున్నదీ విదితమవుతుంది. దాడిచేసి తిరిగిరాగలమన్న విశ్వాసం ఎవ్వరికీ లేదు. పోలీసులలో ఆ విధమైన నైరాశ్యానికి అనేక కారణా లున్నాయి. ఈ పోలీసులంతా మలబారుకు, మైసూరుకు చెందినవారు. వారీ ప్రాంతానికి క్రొత్తవారు. తమ కుటుంబాలను వందల మైళ్ళ దూరంలో వదిలేసి వచ్చినవారు. వారి వేతనాలలో ఎదుగు బొదుగు లేదు. డబ్బు తీసుకోనైనాసరే వాళ్ళకు ప్రజలు పాలు, పెరుగు సరఫరా చేయటం లేదు. బలప్రయోగంద్వారా మాత్రమే వారికవి లభ్యమవుతాయి. ఇప్పుడు పాలసలే దొరకటంలేదు. దాడి జరగబోతున్నదని తెలియగానే, ప్రజలు పాలు, పెరుగు పారబోసేవారు. ఈ కారణాలన్నింటి వల్లనూ, పోలీసుల అత్యాచారాలూ కొన్ని జరిగాయి. ప్రజలు, ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తున్నారు పోలీసు దాడుల ఫలితంగా ప్రత్యేకించి పోలీసు క్యాంపుల సమీపంలో చుట్టూగల గ్రామాల ప్రజలు నానా అవస్థలు పడుతున్నారు.

ప్రశ్న : ప్రభుత్వం, పోలీసుల వేతనాలను ఎందుకుగాను పెంచలేదు ?

జవాబు : తమ వేతనాలు పెంచనందుకుగాను పోలీసులలో తీవ్రమైన అసంతృప్తి వుంది. తమ వేతనాలు పెంచవలసిందిగా కోరుతూ తమపై అధికారులద్వారా మిలటరీ గవర్నరుకు విజ్ఞాపన చేసుకున్నారు. అయినా నిష్ప్రయోజనమే అయింది. వాళ్ళు కమ్యూనిస్టుల పలుకుబడికి లోనవుతున్నారంటూ మిలటరీ గవర్నరు వాళ్ళను తీవ్రంగా హెచ్చరించాడు ... నాలుగుజిల్లాలలో కమ్యూనిస్టు ప్రమాదం వుంది. ఇతర జిల్లాలలో వుద్యమంలేకపోయినప్పటికీ, పరిస్థితి సంతృప్తికరంగాలేదు. పోలీసులు ప్రజలపై కాల్పులు జరిపినట్లయితే, ఖాళీ తూటాలను పై అధికారులకు చూపాలి. అలాచూపకపోతే తీవ్రమైన శిక్షకు గురవుతారు. వారుతూటాలను, కమ్యూనిస్టులకు, ప్రజలకూ అమ్ముకుంటున్నారని ప్రభుత్వం అనుమానిస్తోంది ."

గెరిల్లా దళాల నిరంతర ప్రయత్నాలు, ప్రతిఘటనకారణంగా, భారతసైన్యం ప్రవేశించిన తర్వాత పదినెలలకుకూడా, దేశముఖులు, వాళ్ళ ఏజెంట్లు తమ గ్రామాలలో స్థిరపడలేకపోయారు.

## అధ్యాయం : 3

# కృష్ణానదీ తీరానగల

# నల్లమల అరణ్యప్రాంతం

పాత నైజాం – రజాకార్‌పాలనస్థానే నూతన ప్రజాతంత్ర వ్యవస్థ నెలకొనగలదనీ, ప్రజలు సాధించుకున్న విజయాలనది సంరక్షించగలదనీ, వారికి మెరుగైన జీవితాన్ని ప్రసాదించగలదనీ, భారతసైన్యం "పోలీసు చర్య" జరిపిన వెనువెంటనే తెలంగాణా ఉద్యమంసాగిన వివిధ ప్రాంతాలలో ఆశలు జనించాయి. అనేకమంది దళసభ్యులు, కార్యకర్తలు తమ ఆయుధాలను క్రింద పెట్టారు. భ్రమలతో కొట్టుకుపోయారు. కానిభూస్వాములు తిరిగిరావటంతో కేంద్ర ప్రభుత్వం అన్ని ప్రాంతాలలో తన సైనిక, పోలీసు నిర్బంధకాండను ఉధృతంజేయటంతో దళాలు తిరిగి సంఘటితపరచబడ్డాయి. భూస్వాములకు, పోలీసులకు, వాళ్ళకు రహస్యాలు చేరవేసేవాళ్ళకు వ్యతిరేకంగా ఆయుధాలు చేతబట్టి, ఆత్మరక్షణచర్యలు గైకొనటం ప్రారంభమయింది.

అయితే, ఈ ప్రాంతంలో ప్రాంతీయ నాయకత్వం మొత్తం 1949 వ సంవత్సరమంతా సాయుధ పోరాటంవద్దు అనే తన విధానానికే అంటిపెట్టుకుని వుంది : (1) గెరిల్లా దళాలను రద్దుజేయాలి, ఆయుధాలను దాచిపెట్టాలి. (2) శక్తివంతమైన రహస్యపార్టీ కణాల సముదాయాన్ని నిర్మించేంతవరకూ, అవి తమంతతామే చర్యతీసుకునేంతవరకూ, భూస్వాములపైన, వాళ్ళ ఏజంట్లు పైన ఎలాంటిచర్య తీసుకోరాదు. (3) పోలీసులపైన, మిలటరీపైన ఎలాంటి

చర్య తీసుకున్నా అది దారుణ నిర్బంధకాండకు దారితీస్తుంది మనం ఏర్పరచుకో గలిగిన నిర్మాణంకాస్తా ధ్వంసమైపోతుంది. అందువల్ల పోలీసులపైన. మిలటరీ పైన ఎలాంటిచర్యకూ పూనుకోరాదు (4) గతంలో పంచబడిన భూమిని, పశువులను ప్రజలు తమంతతామే కాపాడుకోవాలి. గెరిల్లాదళాలొచ్చి శత్రువు నెదుర్కొంటాయని ఆశించరాదు. (5) గ్రామ ప్రజాసమితులను రద్దుచేయాలి – అనేదే వారి విధానం.

భారతదేశంలోని విస్తృత ప్రాంతాలలో, నూతన పరిస్థితు లేర్పడేంత వరకూ, పాక్షిక ఆర్థిక పోరాటాలు, రహస్య పార్టీ నిర్మాణం కొనసాగించాలనే తన పంథాయే, సవ్యమైన పంథాయని ఈ కమిటీ వాదించింది పాశవిక నిర్బంధకాండను తట్టుకుని పార్టీని, ప్రజాసంస్థలను కాపాడుకోవటమెలాగా, ఇప్పటికే సాధించుకున్న విజయాలను కాపాడటమెలాగా అనే సమస్య వారి దృష్టిలో ప్రధాన సమస్యగాలేదు. వారి విధానం, గాభరాతో పలాయనం జెందటమూ, శత్రువుముందు లొంగుబాటు జూపటమూ మాత్రమే.

ఈ ప్రాంతంలోని ఘటనలను, పరిణామాలనూ పరిశీలిద్దాం స్థానిక ఆర్గనైజర్లు, రాష్ట్ర కేంద్రానికి పంపిన నివేదికలలోని దిగువ భాగాలు, పరిస్థితిని గూర్చి అవగాహన చేసుకొనటానికి దోహదపడతాయి.

"భూస్వామి, రామచంద్రారెడ్డి, భారత సైన్యాన్ని, పోలీసులను తోడుజేసుకుని మిర్యాలగూడెముకు తిరిగి వస్తున్నాడని, ఏ క్షణంలోనైనా గ్రామంలో ప్రవేశించవచ్చుననీ తెలిసినంతనే, పెద్దగూడెం, గానుగుంటపాలెం గ్రామాలలో ప్రజలు వర్షాలలోనే ఎర్రజెండాను తిరిగి ఎగురవేశారు. ఎర్ర జెండా నెగురవేయక పోవటమంటే, నైజాం–రజాకార్ కాలంలో, గ్రామంపై అనేక దాడులు జరిపించిన దుష్టుడు తిరిగి రావడానికి గ్రామస్థులు వ్యతిరేకంగా లేరనే అర్థం వచ్చేది. భూస్వామి బంగళాను ధ్వంసం చేసిందెవరని సైనికులు ప్రజల నడిగారు. అతనికి బుద్ధి గరపటంకోసం కమ్యూనిస్టులే ఆ పని జేశారని ప్రజలు సమాధానం జెప్పారు. ప్రజల మనోభావం ఆవిధంగా వుంది

"తడకమళ్ళ జోన్‌లో, 1948 నవంబరు మధ్యభాగంనుండి, పోలీసులు సైన్యమూ దాడులను ముమ్మరం చేశారు. డిసెంబరు 8వ తేదీన, వాడపల్లి నుండి తడకమళ్ళ వరకుగల యూనియను ప్రాంతపు నాగార్జునసాగర్–ఫీమునరం క్యాంపుల నుండి రెండువేలమందిపైగా సైనికులను దించారు. రాత్రింబవళ్ళు దాడులు సాగించారు. దళ సభ్యులను, కార్యకర్తలను అనేక మందిని అరెస్టు చేశారు. కొందరు లొంగిపోయారు. భీకరమైన చిత్రహింసలకు గురిచేయబడినమీదట, అరెస్టుచేయబడిన వ్యక్తులలో కొందరు కొంత సమాచారం వెల్లడించారు. అయినా మనోనిబ్బరం ఉన్నత స్థాయిలోనేవుంది. ఈ దాడుల సమయం

లోను, ఆ తర్వాత కొలది కాలానికి గెరిల్లా దళాలు ప్రతీకారదాడులు జరిపాయి పాతేకూరు క్యాంపుమీద కాల్పులు జరిపి ఇద్దరు పోలీసులను చంపాయి. ఆ క్యాంపు ఎత్తివేయబడింది. కాని, తర్వాత మరింత అదనపు బలగాలతో క్యాంపును తిరిగి ఏర్పాటు జేసుకున్నారు. భీమవరం, కోమటిపురం భూస్వాముల పొగతోటలను దళాలు ధ్వంసంజేశాయి. ఈ రెండు గ్రామాలకే గాక, తోపుచెర్ల, మేడగలపల్లి, చీమవారిపల్లి, పసలవాడు, కమస్సాగరం గ్రామాల భూస్వాములకు, బాబాసాహెబ్ పేట దేశముఖుకు జెందిన వడ్లను దాదాపు వెయ్యి క్వింటాళ్ళమేరకు పంపిణీ జేశారు. వేతనాల పెంపుదలకోసం వ్యవసాయ కార్మికుల సమ్మెలు జయప్రదంగా నిర్వహించారు. యాభైనుండి-డెబ్బయిఐదు గ్రామాలుగల ఈ ప్రాంతంలో, ప్రజలు అంతకుముందు తమకు పంచిపెట్టబడిన వెయ్యిఎకరాల మాగాణి భూమితోసహా మొత్తం ఐదువేల ఎకరాలలో పంటను నూర్చుకున్నారు

"శతృవులు ఒక జోన్ తర్వాత మరొక జోన్పై దాడిజేశారు. గతంలో ఏదైనా కార్యకలాపాలలో పాల్గొన్న మిలిటెంట్లను మూకవుమ్మడిగా అరెస్టుజేశారు జనసామాన్యాన్ని భీతావహులనుగావించి, ఏ విధమైన ఆశ్రయంగాని, సహాయంగాని యివ్వకుండా అరికట్టటంకోసంవారు కనీవిని ఎరుగని అత్యాచారాలకు పూనుకున్నారు. సూర్యాపేటతాలూకా పెనుబాడు కేంద్రం పైన నల్గొండతాలూకా చెరుకపల్లి, నక్రేకల్లు కేంద్రాలపైన వాళ్ళ దాడుల ఫలితంగా, దళాలు, కార్యకర్తలూ అచ్చటినుండి వెనకడుగు వేయవలసి వచ్చింది. తడకమళ్ళ కేంద్రంలో, పుధృతదాడులలో, పార్టీ సభ్యులకోసం, దళసభ్యులకోసం పొలాలలో వెదకటంకోసం సైనికులు నిర్బంధంగా ప్రజలను తమవెంటబెట్టుకెళ్ళారు అయితే ప్రజలు మనలను సైనికులకు పట్టించలేదు. ప్రస్తుతానికి అచ్చటినుండి వెళ్ళిపోయి, ఎక్కడైనా తలదాచుకుని, తర్వాత తిరిగి రావలసిందిగా మనలను వారు కోరారు.

"దాడి సందర్భంగా ప్రతి యింటినీ వెదకటం జరుగుతుంది. స్థానిక భూస్వాముల సహాయంతో కొత్తవాళ్ళెవరో కనిపెట్టేవారు అందువల్ల ఏ గ్రామంలోనూ, మనం యిండ్లలో వుండలేదు. ఇద్దరు, ముగ్గురుగల బృందాలుగా చీలి, పొలాలలో పనిజేసుకునే ప్రజలతో కలిసిపోయేవాళ్ళం మొట్టమొదట్లో శతృవు మనలను గుర్తించలేకపోయాడు మనమంతా ఆ ప్రాంతం నుండి పారిపోయామనుకునేవాళ్ళు గ్రామ పట్వారీలు పన్నులు వసూలు చేయనారంభించారు. అయితే చలమర్తి పట్వారీని గెరిల్లాలు కాల్చిచంపారు. దానితో, పటేళ్ళు, పట్వారీలు గ్రామాలకు తిరిగివచ్చి పన్నులు వసూలు జేయటానికి నిరాకరించారు.

"మరింత దగ్గర దగ్గరగా, అంతకంతకూ ఎక్కువగా పోలీసు క్యాంపులు ఏర్పాటు జేయబడ్డాయి దాడులు అధికమయినాయి మనం ఆ ప్రాంతంనుండి తప్పుకోవలసివచ్చింది. మనం అచ్చటినుండి తప్పుకున్న తర్వాత, భూస్వాములు, వాళ్ళ ఏజెంట్లూ తిరిగి తలెత్తారు. మన గ్రామ కార్యకర్తలను పోలీసులకు పట్టించనారంభించారు. ఇందువల్ల, మొత్తమంతటూ వెనకడుగు వేయటం అవసరమైంది

"సరిగ్గా ఆ సమయంలోనే, ప్రాంతీయ నాయకత్వం మమ్మేలను ఆయుధాలు దాచివేయవలసిందిగా బలవంతంజేసింది మా తెట్టగుంట కేంద్రం లోని పది గ్రామాలలో, అందరికీ తెలిసిన కార్యకర్తలు ముప్ఫైమంది వున్నారు వాళ్ళకు ఆయుధా లివ్వకపోయేట్లయితే, భూస్వాముల విద్రోహంనుండి, వాళ్ళను పట్టుకుని పోలీసులకు, సైన్యానికి ఒప్పగించె ప్రయత్నాల బారినుండి తమ్మేతాము కాపాడుకునేందుకుగాను వారివద్ద ఏమీ వుండదు గాబట్టి, వారిలో అధిక సంఖ్యాకులను శత్రు దాడులలో నష్టపోవలసివస్తుంది అని మేము వాదించాం అయినా, నాయకత్వం చెవియొగ్గలేదు అంతలోనే తడకమళ్ళ, చెరుకపల్లి, నెక్రేకల్ గ్రామాల కార్యకర్తలు కొలదిమంది మినహా మిగితా వాళ్ళంతా అరెస్టు చేయబడ్డారు".

— 1950 ప్రారంభంలో, తడకమళ్ళ జోన్ కాంగ్రెస్ పంపిన నివేదిక నుండి

ఆ ప్రాంతంలోని మరొక నివేదిక నుండి, కొన్ని భాగాలను దిగువ నుదహరిస్తున్నాం —

"శత్రువు, రజాకార్ కాలంలో సయితం కనివినిఎరుగని అత్యాచారాలకు పూనుకున్నాడు. ప్రజలను ముండ్ల పొదలలో, నాగజెముడు పొదలలో పడవేసి, బరువైన మిలిటరీ బూట్లతో వాళ్ళపైకెక్కి తొక్కటం మండు టెండలో ప్రజలను ఫర్లాంగుల దూరం ప్రాకునట్లు నిర్బంధించడం, చెట్టుకొమ్మల నుండి తలక్రిందుగా వ్రేళ్ళాడగట్టి, మూటుకాళ్ళతో బంతిని తన్నినట్లు తన్నటం, చెట్టు కొమ్మలపైనుండి తాడు వదిలి రాళ్ళు రప్పలతోగూడిన నేలమీద పడ వేయడం, స్త్రీల తలలు గొరిగించుటం, వాళ్ళను చెరిచడం - శత్రువు సాగించిన అత్యాచారాల పద్ధతులలో యివి కొన్ని. మా ప్రాంతానికి ఆనుకొనియున్న సూర్యాపేట ప్రాంతానికి చెందిన రెండు, మూడు పల్లెలను వాళ్ళు కాల్చివేయగలిగారు మునగాల పరగణాకు చెందిన ముఖ్యకార్యకర్తను కిరోసినుతోదా కాల్చిచంపారు.

"పంపిణీ చేయబడిన, భూస్వాముల, దేశముఖుల భూములను, పశువులను తిరిగి యిచ్చివేయవలసిందిగా శత్రువు ప్రజలను డిమాండ్ చేశాడు. కమ్యూనిస్టులను పట్టించవలసిందిగాకూడా వాళ్ళు ప్రజలను కోరారు. పడ్డీ

వ్యాపారస్తులకు, భూస్వాములకూ పాతబాకీలన్నింటినీ తీర్చవలసిందిగానూ ప్రజలను డిమాండ్ చేశారు అయితే. మొత్తంమీద ప్రజలు తమభూమిన్నీ, పశువులనూ వదులుకో నిరాకరించారు.

"ఈ నిరంకుశ దాడుల ఫలితంగా, భూస్వాములు, వాళ్ళఏజంట్లూ తిరిగి తలలెత్తుకున్నారు. శతృప్రచారం సాగించారు. కమ్యూనిస్టులను పట్టించ వలసిందిగా ప్రజలపై వొత్తిడి దెచ్చేందుకు శాయశక్తులా ప్రయత్నించారు. 'మనం కమ్యూనిస్టులను ప్రభుత్వానికి పట్టిస్తే కమ్యూనిస్టులొచ్చి, ఆ నేరస్తులపై చర్యతీసుకుంటారు. నేరస్తులను కాల్చి చంపివేస్తారు. మనం వాళ్ళను ప్రభుత్వానికొప్పగించకపోతే, పోలీసులు, సైనికులూవచ్చి మనందరినీ విచక్షణా రహితంగా నానావిధాల చిత్రహింసల పాలుజేస్తారు. ఈ చిత్రహింసలకు గురి గావటంకంటె, కమ్యూనిస్టులను పట్టించటమే మేలు' అని చెబుతూ ప్రజలను వొప్పించటానికి తడకమళ్ళప్రాంత భూస్వాములు ప్రయత్నించారు. అయినా ప్రజలు ఈ మాటలేవీ వినిపించుకోలేదు

"ఒకసారి తడకమళ్ళ భూస్వాములు, వాళ్ళ ఏజెంట్లూ స్థానిక కార్య కర్తను రెండుమైళ్ళదూరంవెంటాడి పట్టుకున్నారు. ఆయనవద్ద ఏ ఆయుధమూ లేదు గ్రామంలోకి తీసుకొచ్చారు. ఆ తర్వాత పోలీసులకు ఒప్పగించాలను కున్నారు. కాని గ్రామంలోని పేదలంతా స్త్రీలు, పురుషులు యావన్మంది అక్కడికి చేరారు. ఆయనను విడుదల చేయవలసిందిగా కోరారు మా ప్రాణా లైనా అర్పిస్తాంగాని, ఆయనను పోలీసులకు ఒప్పగించనివ్వబోమని నిలవేశారు. భూస్వాములు భయవిహ్వాలులైనారు. ప్రజలాయనను తీసుకుపోయి వేడి నీళ్ళతో స్నానంచేయించి,భోజనంపెట్టి, సురక్షితమైనఆశ్రయానికిపంపించారు.

"మరొక గ్రామంలో భూస్వాములు, మరొక కామ్రేడ్ను పట్టు కున్నప్పుడు, ప్రజలు పోరాడి, ఆయనను విడిపించారు.

"నేరేడుచెర్ల, విజయనగరం గ్రామాల ప్రజలు భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడారు. తమ భూములను వదులుకోలేదు దాచవరం జమీందారు కొడుకూ ఫతేపురం జమీందారు కోటగిరిరావుతోను, కొందరు కాంగ్రెసు వాలంటీర్లతోను కలిసి బాచవరం గ్రామానికి వెళ్ళినప్పుడు మొత్తం గ్రామమంతా వచ్చి వాళ్లను చుట్టుముట్టారు. నోటికి వచ్చినట్లల్లా తిట్టారు. వాళ్లను చంపివేయటానికి సిద్ధమయ్యారు. అంతలో వాళ్లు పారిపోయారు. ఈ జమీందార్లు, నైజాం పోలీసులను, రజాకార్లను తీసుకొచ్చి, గ్రామ రైతు లను ఎనిమిది మందిని కాల్చి చంపించారు

"సైనికులు, తమ భర్తలను నిర్బంధించి జైలుకు తీసుకొనిపోతుండగా విజయనగరం మహిళలు మిలటరీ లారీలను చుట్టుముట్టారు. సైనికులా మహిళ

లను ముండ్ల బరికెలతో బాదారు అయినా వారు జంకలేదు తమ భర్తలను విడుదల చేయవలసిందిగా వారు డిమాండ్‌చేశారు సైనికులు చివరకు వారిని విడుదలచేయక తప్పలేదు.

“మునగాల పరగణా, రామసముద్రం ప్రజలు తమ గ్రామనాయకుని విడుదల చేయాలని కోరుతూ గ్రామంలోని మిలటరీ క్యాంపుముందు రెండు రోజులు ఘెరాయించారు. సైనికులాయనను కాల్చి చంపారు ఆయన మృత దేహాన్ని తమ కొప్పగించవలసిందిగా ప్రజలు కోరారు. తమ ప్రియతమ నాయ కుడు సుంకర వెంకటప్పయ్య మృతదేహాన్ని వారు పుచ్చుకున్నారు. పెద్ద ఊరేగింపు జరిపి, అమరవీరుడైన తమ నాయకునికి అంత్యక్రియలు జరిపారు

“శత్రువు సాగిస్తున్న అత్యాచారాలనుగాంచి ప్రజలు తాత్కాలికంగా భయపడటాన్నే ప్రాంతీయ కమిటీ గమనించిందిగాని, ప్రజలకు మనపైగల ప్రేమాదరాలనుగాని, విశ్వాసాన్నిగాని గుర్తించ లేదు. శత్రువుపై ప్రజలకు గల ద్వేషాన్ని నాయకత్వం గమనించలేదు. దేవరకొండ, మిర్యాలగూడెం జోన్లలో శత్రువుపై మనదళాలు చర్యదీసుకున్న వార్తలువిని ప్రజలలో కలిగిన వుత్సాహాన్ని వారు గమనించలేదు. ప్రాంతీయ కమిటీ నాయకత్వానికి మన నష్టాలు, శత్రు కేంద్రీకరణ మాత్రమే కనిపించాయి దానితో సాయుధ పోరా టాన్ని నిలిపి వేయటానికి నిర్ణయించారు. పాక్షిక పోరాటాలు జరుపుతూ, భూస్వాములకు, పోలీసులకు వ్యతిరేకంగా చర్యలకు పూనుకోకుండా పార్టీ నిర్మాణం జేసే కార్యక్రమాన్నిచ్చారు. ఆయుధాలను దాచివేయవల సిందిగా కోరారు.”

## ఈ విధానాలవల్ల కలిగిన వినాశకర ఫలితాలు

“దళాలను రద్దు చేయటంతో, గ్రామాలలోగల భూస్వాములు, శత్రువులు, సి ఐ డి వాళ్ళు తిరిగి తలలు పైకెత్తారు. వాళ్ళు ధైర్యం పుంజు కున్నారు మన అనుపానులనుగూర్చి శత్రువుకు తెలియజేసి, మన గ్రామాలపై దాడులు చేయించారు. మన కార్యకర్తలను అరెస్టు చేయించారు.

మనం దళాలను రద్దుచేశామని, ఆయుధాలు లేకుండా ముగ్గురేసి సభ్యులుగల సెల్సుగా వున్నామని పోలీసులకు తెలిసింది. ఈ విషయం తెలిసి ధైర్యం పుంజుకొని పోలీసులు సాధారణ పౌరదుస్తులు ధరించి, తమ ఆధునిక ఆయుధాలను తమ దుస్తులక్రింద దాచుకొని, మనిషలను వెదుకుతూ ఇద్దరు, ముగ్గురుగల చిన్న బృందాలుగా సయితం తిరగనారంభించారు. మనవద్ద

ఆయుధాలు లేనందువల్ల, మనం వారిపై దాడిజేయలేకపోయాం. వాళ్ళ ఆయుధాలను స్వాధీనం చేసుకోలేకపోయాం.

"కొండ్రపోలులో మన ప్రజల శత్రువులైన పేరారెడ్డి, రామిరెడ్డి గ్రామంలో బహిరంగంగా తిరుగుతూ, అమ అత్యాచారాలు సాగించారు. వాళ్ళే కామ్రేడ్ సైదులును పట్టుకుని, చిత్రహింసల పాలుజేసి, పోలీసుల కొప్పగించారు వాళ్ళా కామ్రేడ్‌ను కాల్చి చంపారు. ఇరుకుగూడెం గ్రామ భూస్వాములు కామ్రేడ్ లచ్చులను, జిల్లాపురం భూస్వాములు అమృతంను పట్టుకుని, పోలీసుల కొప్పగించారు పోలీసులు వాళ్ళను కాల్చి చంపారు. పోతిరెడ్డిగూడెం భూస్వాములు, సెల్ కార్యదర్శితోసహా యిద్దరు కామ్రేడ్స్‌ను, తోపుచర్ల భూస్వాములు మరొక కామ్రేడ్‌ను పట్టుకుని, వాళ్ళ నందరినీ పోలీసులకొప్పగించారు నెరేడుచెర్లలో, అంతకుముందే అనేకఅత్యాచారాలు, మానభంగాలు జరిపిన పేరుమోసిన రౌడీలు అనంతం, తాళ్ళ చంద్రయ్య, రాములు మనకామ్రేడ్స్‌లో యిద్దరిని పట్టించారు మన ముఖ్యమైన కామ్రేడ్స్ అందరినీ పట్టుకోవాలని పథకంవేశారు. అయితే అదృష్టవశాత్తు ఆ సమయానికి మనవాళ్ళక్కడ లేరు.

"స్థానిక కామ్రేడ్స్ పరిస్థితినిగూర్చి చర్చించారు. మన కామ్రేడ్స్‌ను కాల్చిచంపటానికి కారకులైన ఈ భూస్వాములను చంపివేయటానికి అనుమతి కోరారు. కాని, అనుమతించటానికి ప్రాంతీయకమిటీ నిరాకరించింది. సాయుధ చర్య ఏదీవద్దనే తన వైఖరికే అంటిపెట్టుకుంది తన జోన్‌లోని రహస్యాలు చేరవేసేవాళ్ళను శిక్షించవలసిందిగా పెనుబాడు ఆర్గనైజరు పదేపదే కోరారు. అయినా ప్రాంతీయకమిటీ ఖచ్చితమైన ఆదేశం యిచ్చినందువల్ల మేము అనుమతి నివ్వలేకపోయాం

"భూస్వాముల, వాళ్ల ఏజెంట్ల నాయకత్వాన, పోలీసులు, సైన్యమూ వుధృతంగా దాడులు సాగిస్తున్నందువల్ల రహస్యాలు చేరవేసేవాళ్ల చర్యలవల్ల ప్రజలతో సంబంధాలు పెట్టుకోవటం సయితం కష్టమయిపోయింది. మనం ఆయుధాలు చేతబట్టి, ఈ శత్రువులను చంపివేయాలని వారు పదే పదే డిమాండ్ చేశారు. మనదళాలేమైపోయాయని, శత్రువును చంపకుండా ఎంతకాలమీ విధంగా మిన్నకుండాలని వారు ప్రశ్నించ నారంభించారు.

"మాకు కూడా, ఈ పరిస్థితివల్ల విసుగెత్తి పోయింది. మేము, అలగా పురం, నేరేడచెర్ల గూండాలపై దాడిచేశాం. దీనితో, గూండాలూ, దుష్ట భూస్వాములూ, మరోమారు గ్రామాలనుండి, పోలీసు క్యాంపులకు, పట్టణాలకు పారిపోనారంభించారు. గత్యంతరం లేని పరిస్థితిలోనే, తప్పనిసరై మేమీ చర్యలకు దిగవలసివచ్చింది. శత్రువుపట్ల మనం నిర్దాక్షిణ్యంగా వ్యవహరించాలి.

అయితే, మనం శత్రువుపై ఏదైనా చర్యకు పూనుకునే సమయంలో, కనీసం తాత్కాలికంగానైనా, అందరికీ వెల్లడైన కార్యకర్తలను, పార్టీ సభ్యులను, మిలిటెంట్లను అందరినీ గ్రామంనుండి ఉపసంహరించాలి. అలా చేయకపోతే, శత్రువు వారిని కాల్చిచంపటం జరుగుతుంది.

"రాష్ట్రకమిటీ ఆదేశానుసారం, ఎట్టకేలకు 1949 డిసెంబరులో మేము, మా గెరిల్లా దళాన్ని తిరిగి సంఘటితపరిచాం తిడకమళ్ళ, మునగాల, విజయనగరం జోన్లలోని శత్రువు లనేకమందిని చంపివేశాం వాళ్ళ ఆస్తిని ధ్వంసంజేశాం. ప్రజ లత్యంత వుత్సాహంతో దళంతో సహకరించారు వారు దళానికి ఆశ్రయం కల్పించారు. శత్రువుపై దాడి సాగించటంలో అనేకవిధాలుగా తోడ్పడ్డారు. సమీప అడవులలో, దళాలు ఆశ్రయం పొందివుండగా, దాడులు జరుగుతున్నప్పుడు, ప్రజలు మైదాన ప్రాంతాలలోని కల్మలచెర్వు, విజయ నగరం కేంద్రాలలో ఆశ్రయం కల్పించారు. పట్వారీలు, దుష్టభూస్వాములు గ్రామాలనుండి పారిపోయారు. ప్రజలలో సమధికోత్సాహం కనిపించింది.

"హుజూర్‌నగర్ జోన్‌లోని, మోళ్ళ చెరువులో భూస్వామి సాంబి రెడ్డి, అతని గూండాలూ, కేంద్ర ఆర్గనైజర్లగు దేవులపల్లి రాఘవరావు, సైదులు రెడ్డితోసహా, మన స్థానిక కార్యకర్తలందరినీ అరెస్టు చేయించారు. సైదులు రెడ్డిని పోలీసులు కాల్చిచంపారు అల్లాపురంలో, పకీరయ్య మన స్థానిక కార్య కర్తలను అరెస్టు చేయించాడు. అదేవిధంగా, మట్టంపల్లి, కాపుగల్లు, బేతవోలు మన శత్రువుల కార్యకలాపాలకు కేంద్రాలైనాయి. దళ నాయకుడు వీరభద్రయ్య అరెస్టు చేయబడ్డారు మిగతావాళ్ళు, ఆ ప్రాంతం వదిలి దూరస్థలాలకు వెళ్ళిపోవలసివచ్చింది.

"మిర్యాలగూడెం జోన్‌లో 1949 జనవరిలో శత్రుదాడులు వుధృతమైనాయి. పుల్లరి, భూమిపన్నుల వసూలు ప్రారంభమైంది పన్నుల బకాయీలను చెల్లించవలసిందిగాను, భూములు వదులుకోవలసిందిగాను రైతులపై వత్తిడి తీసుకురావటం ప్రారంభమైంది. అయితే ఆ సమయంలో అత్వాల, రమణగూడెంలలో మన దళాలు పోలీసుక్యాంపుపై దాడిజేసి, కొందరు ద్రోహులను చంపివేశాయి. పన్నులు వసూళ్ళు నిలచిపోయాయి. కాని, ఏప్రిల్‌నాటికల్లా శత్రువు తన క్యాంపుల సంఖ్యను దాడుల సంఖ్యను అధికంజేశాడు. అయినా ప్రాంతీయ కమిటీమాత్రం ఆయుధాలను దాచివేయ వలసిందిగా దళాలపై వొత్తిడి జేసింది.

యూనియన్ భూభాగంలోని ఆశ్రయాలనుండి జూన్‌లో తిరిగివచ్చిన తర్వాత, మేమెక్కడికి వెళ్ళినా "చెలకుర్తి రెడ్డీలపై చర్య" తీసుకొనవలసిందిగా ప్రజలు డిమాండ్ చేశారు. "అది లేకుండా మీరు మాదగ్గరకు రావద్దు. మీరు

వాళ్ళపై చర్య తీసుకోనటానికి సిద్ధపడితే, అందులో "మేము పాల్గొంటాం" అని వారు చెప్పారు అయితే అందుకు అనుమతి నివ్వటానికి ప్రాంతియ కమిటీ నిరాకరించింది. అందువల్ల నందికొండకు జెందిన ప్రధానమైన గూండా నాయకులు వెంకటరెడ్డి, చీకటి లక్ష్మయ్య తప్పత్రాగి పట్టుబడినప్పుడుకూడా, మేము వాళ్ళను వదిలివేశాం. కామ్రేడ్ వల్లభనేని సీతారామయ్య మరణానికి కారకుడు, దాదాపు 15 గ్రామాలలో ద్వేషించబడే దుష్ట భూస్వామియగు చిర్రా వెంకటరెడ్డిని చంపాలన్న మా నిర్ణయాన్ని ప్రాంతీయ కమిటీ త్రోసిపుచ్చింది.

"వెంగన్నగూడెంలో, దుష్ట భూస్వామి రామానుజరెడ్డి బంటుగు కొండారం బాలకోటి సైనికుల వెంటవుంటూ, ప్రజలపై దాడులు చేయిస్తూ వుండేవాడు మేము ఆ గ్రామాలలో తిరుగుతుండగా, మమ్మల్ని పట్టుకోనటానికి సోమిశెట్టిపాలెం భూస్వాములు ప్రయత్నించారు, ప్రజలు ఎర్రజెండాలు ప్రతిష్టించినప్పుడు, శత్రువు వాళ్ళను, రాజారం సమీపంలో మిలటరీపై మనం దాడిచేసినప్పుడు కొట్టినంత నిర్దాక్షిణ్యంగా కొట్టారు. శ్రీనివాసపురం, తిరుమలగిరి, రంగుండ్ల, గారగుంటపాలెములలో మన కరపత్రాలు పంచిన కారణంగా, ఈ గ్రామాలన్నింటిలోని ప్రజలనూ మోకాళ్ళు, మోచేతులమీద ప్రాకునట్లు చేసి, ప్రాకుతుండగా కొట్టారు

"అందువల్ల మనం పోలీసులపై దాడిజేస్తేనో, ప్రజాకంటకుడైన దుష్టభూస్వామిని చంపినందుననో శత్రువు నిర్బంధకాండకు దిగుతున్నట్లు భావించటం తప్పు శత్రువు హింసాకాండకు పూనుకున్నప్పుడు, శత్రువును చంపకుండా ఆత్మరక్షణకు సయితం హామీలేదు

"1949 డిసెంబరునాటికల్లా, మేము మా దళాలను రాష్ట్ర కమిటీ నిర్ణయానుసారం తిరిగి ఏర్పాటుజేశాం. ప్రాంతీయ నాయకత్వంయొక్క పంథాను, ఆదేశాలను త్రోసిపుచ్చాం."

## వ్యవసాయ కార్మిక పోరాటాలు

" 'ఆయుధాలు దాయండి – సాయుధ చర్యలొద్దు' అనే విధానం చేపట్టిన వెనువెంటనే 1947 జూన్‌లో హుజూర్‌నగర్ జోన్‌లో కల్మలచెరువు, మేళ్ళచెరువు ప్రాంతంలో వ్యవసాయ కార్మిక సమ్మెలు నిర్వహించాం మొదట్లో, కొన్ని పాక్షిక విజయాలనుకూడా సాధించగలిగాం. కాని, వాటిని తీవ్రతర మొనరించకముందే, శత్రువు పోలీసులనుదించాడు. స్థానిక భూస్వాములు మన కార్యకర్తలను పట్టుకొని, పోలీసుల కొప్పగించసారంభించారు.

అలా వొప్పగించబడిన వారిలో డి. రాఘవరావు, సైదులు రెడ్డి మొదలగువారు న్నారు. అయినా వాళ్ళపై మనం ఎలాంటిచర్య తీసుకోలేదు. దానితో వాళ్ళకు అడ్డూ, అదుపూ లేకుండాపోయింది విచ్చలవిడిగా విద్రోహకాండ సాగించారు.

"మిర్యాలగూడెం జోన్‌లో, తిరుమలగిరిలోను, మరో అరడజను గ్రామాలలోనూ వ్యవసాయ కార్మిక సమ్మెలు నడపటానికి ప్రయత్నించాం. కాని, శత్రుదాడులు ప్రారంభమైనాయి సమ్మె కమిటీల సభ్యులు, నాయకులు ప్రాణాలు దక్కించుకొనటానికి అచ్చటినుండితప్పుకోవలసి వచ్చింది. వెల్లికల్లు, చింతపాలెం, సుంకేసుల గ్రామాలలో మాత్రమే పాక్షిక విజయాలు సాధించ గలిగాం. అంతకుపూర్వమే అక్కడ గ్రామాలనుండి గూండాలను, పోలీసు ఏజెంట్లను పారద్రోలి యుండటమే అందుకు కారణం. తిరిగి డిసెంబరులో మానూళ్ళ తరుణంలో దాదాపు ఎనిమిది గ్రామాలలో వ్యవసాయ కార్మిక సమ్మెలునడిపాం. కొన్ని గ్రామాలలో పదిశేర్ల ధాన్యం రోజుకూలిసాధించటం కూడాజరిగింది. అయితే, శత్రువు గ్రామాలను ముట్టడించి కార్యకర్తలను, మిలిటెంట్లను అరెస్టుచేయడం ప్రారంభమైంది ఆ పరిస్థితుల్లో వారు తమను తాము కాపాడుకోవటమే ఎంతో కష్టమైపోయింది.

"విజయనగరం కేంద్రంలో వ్యవసాయకార్మికులు సమ్మెచేసి, రోజుకు ఒకటి, రెండు శేర్ల ధాన్యాన్ని అదనంగా సాధించుకున్నారు. కాని ఉధృతంగా దాడులు సాగుతున్నందువల్ల ఆ విజయాలను ఎంతోకాలం నిల బెట్టుకొనలేక పోయారు. చిడకమళ్ళ కేంద్రంలో వ్యవసాయ కార్మికులు వేతనాల హెచ్చింపునుగూర్చి మాట్లాడ నారంభించారు. అచ్చటి గెరిల్లాదళాల రక్షణపొందుతూ అడవుల సమీపంలోని గ్రామాలు సాధించుకున్నదాన్ని చూచి, యిక్కడ తామూ అలాగే చేయాలని వారలా చేయ[illegible]

"వాడపల్లి జోన్‌లో వ్యవసాయ కార్మికుల డిమాండ్ల కోసం ఆందోళన ప్రారంభించాం. కాని భూస్వాములపై సాయుధచర్య [illegible] అనే పంథా కారణంగా వాళ్ళు ధైర్యం పుంజుకున్నారు. పోలీసుల[illegible]తీసుకొచ్చి, గూడూరు, జప్తివీరప్పగూడెం గ్రామాలలో వ్యవసాయకార్మికులను కొట్టించారు. ఈ వ్యవసాయకార్మికులను తిరిగి పోరాటంలో దింపడం ఎంతో కష్టమైంది. అందుకు నాలుగు నెలల కాలం పట్టింది. ఇతర గ్రామాల [illegible] కూడా ఈ రెండు గ్రామాలవాళ్ళనే ఆదర్శంగా పెట్టుకుని వ్యవసాయ[illegible] నారు. ములుకల కాలువలో భూస్వాములు, వాళ్ళ ఏజంట్లూ, [illegible] సెల్‌ను నాలుగుమైళ్ళదూరం వెంటబడి తరిమారు. అడవులలోకి పరిగెత్తినందు వల్లనే వారు తప్పించుకోగలిగారు. జోనల నాయకులమైన మేము యిర

కాటంలో పడ్డాం భూస్వాములపై చర్యలు తీసుకోకపోతే వ్యవసాయకార్మిక సమ్మెలూ వుండవు, పార్టీసెల్సూ వుండవు మొత్తం జోన్ అంతటినుండి మనం ఖాళీచేసి పోవలసిందే – అని మేము నిర్ణయించాం

"అందువల్ల, కొండ్రపోలు, బెత్తలపాలెం, ములుకల కాల్వ గ్రామాలకు చెందిన శత్రు భూస్వాములకు, వాళ్ళ ఏజెంట్లకూ దేహశుద్ధిజేశాం. గూడూరు తదితర గ్రామాల భూస్వాములు నీళ్ళు తోడుకునే మోటలను ధ్వంసంచేశాం నిజానికి మేము, ములకల కాల్వకుచెందిన గూండా మురాను చంపివేసేవాళ్ళమే కాని, ఎలాంటి శత్రువునైనా చంపరాదనేది మన పంథా కావటంవల్ల చంపక వదిలేశాం. తత్ఫలితంగా వాళ్ళు, పోలీసు క్యాంపులో దూరారు. పెద్ద ప్రమాదంగా తయారయ్యారు.

"భూస్వాములపైన, వాళ్ళ ఏజెంట్లపైన ఈ పరిమిత చర్యలు గైకొన్న అనంతరం, భూస్వాములు తమ తలపైకెత్తటానికి సాహసించలేదు వ్యవసాయ కార్మికులను రంగంలో దించగలిగాం మనం పోరాటాలు నడిపిన అనేక గ్రామాలలో పోలీసులు ప్రవేశించారు అయినా వాళ్ళకెవరూ ఎలాంటి సమాచారం చెప్పలేదు మేము 14 గ్రామాలలో వ్యవసాయ కార్మికుల సమ్మెలు నడిపాం మరో 11 గ్రామాలలో వ్యవసాయ కార్మికులు తమంత తాముగానే కదిలారు. ఈ సమ్మెలన్నీ విజయవంతమైనాయి. కాని, మన కార్యకలాపాలు తగ్గిపోయిన వెనువెంటనే,భూస్వామ్యవర్గాలవాళ్ళు ఒప్పందాలనుభంగపరిచారు. పోలీసులచేత, మిలిటరీచేత గ్రామాలపై దాడులు చేయించారు. భూస్వాములపై గట్టిచర్య తీసుకొనివున్నట్లయితే ఆ విజయాలను నిలబెట్టుకోగలిగేవాళ్ళం.

"మరల 1949 నవంబరులో వ్యవసాయ కార్మికుల సమ్మెలువెల్లువగా సాగాయి రోజు కూలీలు, పాలేర్లు, చేతివృత్తులవారు సయితం అందులో పాల్గొన్నారు మాసూళ్ళ తరుణంలో, వారు రోజుకు ఆరుశేర్ల ధాన్యం కూలి సాధించుకున్నారు సారవంతమైన భూములుగల, రాయునపాలెం (రామాపురం) వంటి కొన్ని గ్రామాలలో రోజుకు పదిశేర్ల ధాన్యంకూడా సాధించుకున్నారు. పంటలో పాలు పద్ధతిన సాగుచేసే కౌలుదార్లు, గతంలో పంటలో మూడో వంతు తమ వాటాగా పొందేవారు ఇప్పుడు రెండు పంతుల పాలు సాధించుకున్నారు. ఈ సమ్మెలు చాలా గ్రామాలలో జరిగాయి. పెద్దసంఖ్యలో పాల్గొన్నారు సమ్మెలలో కొత్తరూపు కనిపించింది. భూస్వాములపై పోరాడటానికి, భూస్వాముల యిండ్లలోని ధాన్యాన్ని స్వాధీనం చేసుకొని పంచుకొనటానికి స్త్రీలుకూడా ముందుకొచ్చారు. కత్తులుగాని, చేతికందిన మరే ఆయుధాన్నయినాగాని చేతబట్టి ప్రదర్శనలలో పాల్గొన్నారు.

"అక్టోబరులో వేరుశనగ పీకే తరుణంలోను, 1959 జనవరి-ఫిబ్రవరి నెలల్లో వరిగ మాసూళ్ళ తరుణంలోనూ సమ్మెలు జరిగాయి ఈ సమ్మెలన్నిం టినీ పోరాట సందర్భంగా ఏర్పాటు జేయబడినసమ్మె కమిటీలే నిర్వహించాయి.

"ఈ సమ్మెల వెల్లువతో భూస్వాములకు కంపరమెత్తింది. సమ్మెదార్ల మనోనిబ్బరం అంతకంటెకూ వున్నతస్థాయికి జేరింది. పట్టణంలోని, రజకులపైన కూడా దాని ప్రభావం పడింది వారితో మనకు సంబంధాలు లేనందువల్ల, వారి సమ్మెకు మనం నాయకత్వం వహించలేకపోయాం. అయితే వెంకటాద్రి పాలెంనుండి సమ్మె విచ్ఛిన్నకులు, పట్టణానికిపోకుండా అరికట్టగలిగాం. పట్టణంలోని రజకులు తమ డిమాండ్లు సాధించుకున్నారు.

"రజకుల సమ్మె విజయంపొందటం, వ్యవసాయ కార్మికుల సమ్మెల వెల్లువ చూచినమీదట ప్రభుత్వం పిచ్చికుక్కవలె దాడులను ఉధృతం జేసింది వేలాది సాయుధ సిబ్బందితో అడవులపై దాడి జేసింది. ఈ దాడులతో భూస్వామ్యవర్గం మరోమారు తలపైకెత్తింది కుట్రలు జేసింది మన ఆనుపాను లనుగూర్చిన సమాచారాన్ని శత్రువుకందజేశారు. లచ్చులను, అమృతంను, వెదిరి రాజిరెడ్డిని వాళ్ళు పట్టించారు. వివిధ గ్రామాలలో సమ్మె పోరాటాల నాయకులను అరెస్టు చేయించారు. ఎప్పటికప్పుడే మనం శత్రువుపై చర్య తీసుకుంటూవుంటే, ఆ మూకలో మరింత దుష్టులైన కొందరిపై చర్య తీసుకుని వుంటే వాళ్లుతలపైకెత్తటానికి సాహసించేవారుకాదు అందరికీ తెలిసిపోయిన కార్యకర్తలందరినీ దళాలలో చేర్చుకొని, అడవులలోకి పంపియుండవలసింది కాని, మనం ఆ సమయంలో "సాయుధ గెరిల్లా పోరాటంవద్దు, గెరిల్లా దళాల లోకి కొత్తసభ్యులను చేర్చుకోవటంవద్దు"అనే విధానాన్ని అనుసరిస్తూవున్నాం. ఉద్యమాన్ని నూతనప్రాంతాలకు విస్తరించాలనే ఆలోచనే మనకులేదు."

భూ సమస్య

"ముకుందాపురంలో, కున్నూరి ముత్తయ్య అనే రైతు తన భూమిని వదులుకోలేదు. ఆయనను చిత్రహింసలకు గురిచేసి చంపారు. "ఈభూమి నాది నేను దాన్ని వదులుకోను"అని అంటూనే ఆయన ప్రాణాలు వదిలాడు. ఆయని మరణించిన తరువాతకూడా, ఆయన సోదరులు, ఆయన భార్య, భూమికి అంటిపెట్టుకునే వున్నారు. మా ప్రాణాలనైనా వదులుతాముగాని, ఆ భూమిని మాత్రం వదులుకునేది లేదని వారు స్పష్టంచేశారు.

మొద్దులకుంటలో భూమిని తన స్వాధీనంలో వుంచుకొని సాగు చేసుకుంటున్నందుకు గాను ఒక లంబాడి రైతును భూస్వామి రామలక్ష్మి

పోలీసులను తీసుకొనివచ్చి నుజ్జు నుజ్జుగా కొట్టించాడు. ఆ తర్వాత, భూమిని సాగుచేసుకుంటూ వుండటానికి ఆరైతు భయపడ్డాడు. అయితే తన భార్య ప్రోత్సహించగా యిద్దరూ కలిసి తిరిగి ఆ భూమిని దున్నారు. ఆ తర్వాత, గెరిల్లాలు, ఆ భూస్వామికి దేహశుద్ధి జేశారు.

"ఈ భూమినీది, నువ్వే దాన్ని సాగుజేసుకుంటూవుండు" అని ప్రచారం చేసినంతమాత్రాన ప్రయోజనమేమీలేదు 'సాయుధ పోరాటం వద్దు' అనే మనపంథాను ఆసరాగా తీసుకుని, భూస్వాములు పోలీసులను మిల టరీని తీసుకొచ్చి రైతులను బీభత్సానికి గురిజేయసాగారు పోలీసులను తీసుకొచ్చి కుమ్మరి ముత్తయ్యను చిత్రహింసలకు గురిజేసి చంపించిన భూస్వామిని గెరిల్లాలు చంపివేశారు, ఈ ఘటనతో రైతుల్లో నూతనోత్సాహం వెల్లివిరిసింది.

"150 మంది సైనికులతోగూడిన మిలటరీ క్యాంపున్న కొండ్రపోలు సమీపంలో ఒక పేదరైతు, భూస్వాములు స్వాధీనం జేసుకున్న తన భూమిని ఆక్రమించుకొని సాగుజేసుకున్నాడు. ఆ భూమిలో పైరును దక్కించుకున్నాడు

"భూస్వాములు స్వాధీనం జేసుకున్న భూములను తిరిగి తమ అధీ నంలోకి తెచ్చుకోవాలని రైతులు డిమాండ్ చేశారు బంజరు భూములను పంపిణీ చేయాలని వారు కోరారు. చిన్న అడవులలోని చెట్లన్నింటినీ పడగొట్ట నిచ్చేట్టయితే, దళాలకు రక్షణ లేకుండా పోతుందనే వుద్దేశ్యంతో మేము అడవులలోని పరిమితమైన భాగాన్ని మాత్రమే చెట్లుగొట్టి సాగుజేసుకోనిచ్చాం.

"మనం సంబంధాలు పెట్టుకొనలేక పోయిన, దూరప్రాంతపు మైదానాలలో మాత్రమే అతి పెద్ద భూస్వాములు రైతులనుండి భూములను తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు. అదీ పోలీసు క్యాంపులున్న గ్రామాలలోనే జరిగింది. రాగడప గ్రామంలో, తుమ్మడం దేశముఖుభూములలో సూరాయ పాలెం దేవాలయ భూములలో భూస్వాములకు పనిజేయటానికి ఎవ్వరూ ముందుకు రాకుండా చూడగలిగాం. ఆ భూములన్నీ మిలటరీ క్యాంపులున్న గ్రామాలలోనే వున్నాయి.

"వాడపల్లి జోన్‌లోని ఈ దిగువ 20 గ్రామాలలో భూస్వాములచే స్వాధీనం చేసుకోబడిన భూములను, రైతులు ఆక్రమించుకున్నారు. ఈ దశలో సయితం సాగుజేసుకున్నారు.

ఆ గ్రామాల పేర్లివి :

1) అన్నారం (2) బొత్తలపాలెం (3) బెజ్జికల్లు (4) చెన్నాయ పాలెం (5) దామరంచెర్ల (6) గూడూరు (7) జప్తివీరప్పగూడెం (8) జిల్లా

ల్యూర్ (9) కల్లపల్లి (10) కొండ్రపోలు (11) కొత్తగూడెం (12) మెట్టగూడెం (13) మొద్దులకుంట (14) ముకుందాపురం (15) ములుకలకాలువ (16) నీలాయగూడెం (17) రాయనపాలెం (18) తెట్టగుంట (19) వీరప్పగూడెం (20) పిర్లపాలెం

"వాచవరం, పేతవరం, కోటగిరి గ్రామాలలో ప్రజలు భూమిని వదులుకోలేదు గొట్టపల్లి, ముకుందాపురం, వైకుంఠపురం గ్రామాల పేదరైతులు మన వద్దకొచ్చి, భూస్వాములు తమనుకొట్టి, అబద్ధపు కేసులను అరెస్టు చేయించిన తరువాత తమ భూములనెలా హస్తగతం జేసుకున్నదీ వివరించి చెప్పారు ఆభూమిని తిరిగి తమ అధీనంలోకి తెచ్చుకునేందుకుగాను, తమకు తోడ్పడటానికి రావలసిందిగా వారు కోరారు. "మీరు, ముందు ఒకసారి రండి, భూస్వాములను హెచ్చరించండి మేము భూమిని దున్నుకుని, సాగుచేసుకుంటాం" అని వారు చెప్పారు. "సాయుధ చర్యలేవీ వద్దు" అనే మన నూతన పంథా కారణంగా మేము వారికి సహాయపడటానికి వెళ్ళలేదు. వారికి మనం నాయకత్వం వహించకుండానే, తమ చేతులలో ఆయుధాలైనా లేకుండానే, భూస్వాములపైన, పోలీసులపైన, మిలటరీపైన తమంతట తాముగానే పోరాడవలసిందిగా పేదరైతులకు మేము సలహా యిచ్చాం

"తడకమళ్ళ కేంద్రంలో, మనం ఆయుధాలు క్రిందపెట్టిన మరుక్షణం లోనే, గ్రామాలతో మనసంబంధాలు తెగిపోయాయి. అచ్చటి ప్రజలు చాలా కాలంపాటు మనకోసం ఎదురుచూశారు ఆ తర్వాతనే, వారు భూస్వాములను తమ భూములాక్రమించుకోనిచ్చారు. మన కామ్రేడ్స్ ఎవరైనా కనిపించినప్పుడు వారు, పంపిణీచేయబడిన భూమిని ఏ భూస్వామి ఏ విధంగా హస్తగతం చేసుకున్నదీ, తామెంత కడగండ్లపాలైందీ చెప్పి, ఒకసారి రావలసిందిగా కోరుతున్నారు 'వాళ్ళను ప్రతిఘటించండి, మీ భూమిని ఆక్రమించుకుని సాగుజేసుకోండి. మన రోజులు త్వరలోనే వస్తాయి. మేము నష్టాలను నాశనం జేస్తాం. మీరు, మీ పార్టీని కాపాడుకోండి, మాకు ఆశ్రయమివ్వండి' అని ప్రబోధించుతున్నాం వాగ్దానం చేయబడిన ఆ మంచిరోజులు త్వరలోనే వస్తాయని ఆశతో ఎదురుచూస్తూ, నిస్పృహతో, నిట్టూర్చుతూ వున్నారు.

"పెనుబాడు కేంద్రంలోకూడా, మనం సంబంధాలు పెట్టుకోలేక పోయినందున, భూస్వాములు భూములను ఆక్రమించుకున్నారు అయినా, 'సాయుధ పోరాటం వద్దు' అనే పంథా పెట్టిన తర్వాత రెండు నెలలుగూడా శత్రు దాడులనుండి విరామం లేదు. అయినా మే ప్రజలు కదిలారు తమ భూములనాక్రమించుకొనజూచ్చారు. భూస్వాములు సాగు చేసుకున్న భూములలోని పంటను కోసుకెళ్ళారు. దానితో భూస్వాములకు కంపరమెత్తిపోయింది. రాజీకి

సిద్ధమయ్యారు. ఈ వెల్లువకు మన స్థానిక కార్యకర్తలు నాయకత్వంవహించారు. బత్తోనికుంట, చింతకుంట్ల, నేరేడచర్ల, తక్కొళ్ళపాడు, ఉట్లపల్లి, వైకుంఠా పురం, విజయనగరం గ్రామాలలో అలా జరిగింది

"అదేవిధంగా కల్లూరు, మేడవరం, విజయనగరములలో వ్యవసాయ కార్మికులు, పేదరైతులు పార్టీ నిర్ణయించిన రేట్లకు ధాన్యం అమ్మవలసిందిగా భూస్వాములను డిమాండ్ చేశారు. అలా చేయకపోతే, తామే ఆ ధాన్యాన్ని స్వాధీనం చెసుకొని పంపిణీ చేస్తామని చెప్పారు. ధాన్యాన్ని చౌకరేట్లకు అమ్మవలసింపని భూస్వాములకు మేము హెచ్చరించాం

"శత్రువు దాడులను ఉధృతం జేశాడు భూస్వాములు మరొకసారి తమ తలలు పైకెత్తారు మన కార్యకర్తలను పోలీసుల కొప్పగించనారంభించారు చింతకుంట్ల, చిల్లపల్లి, నేరేడుచెర్ల, రావులపెంట గ్రామాలలో ఈ భూస్వాములను చంపివేయాలని మా అంతట మేమే తక్షణమే నిర్ణయించాం. అయితే, వాళ్ళప్పటికే పారిపోయారు. అయినా మేము వాళ్ళ ఆస్తిని ధ్వంసం చేశాం. కొంతభాగాన్ని స్వాధీనం చేసుకున్నాం చందుపట్లలో మేము శత్రువును చంపాం. శత్రువు మనోనిబ్బరం కోల్పోయాడు పోలీసుల, సైనికుల రక్షణ యెడ విశ్వాసం కోల్పోయాడు. వ్యవసాయకార్మికుల పేదరైతుల మనస్థయిర్యం పెంపొందింది మనకు ఆశ్రయమివ్వటానికి, తమ భూములను తిరిగి ఆక్రమించుకొనటానికి పెద్దసంఖ్యలో ముందుకొచ్చారు విజయనగరంలో ఒక భూస్వామి పేదరైతునుండి స్వాధీనం చేసుకున్న భూమిని అమ్మాలనుకున్నాడు. అది తన భూమి అని, దానిని అమ్మటానికి వీలులేదని ఆ పేదరైతు హెచ్చరించాడు. ఆ భూమిని తానేఆక్రమించుకున్నాడు ఆ భూస్వామిని చంపివేయాలని ప్రజలు పదేపదే పట్టుబట్టినమీదటనే అతనిపై మేము చర్య తీసుకున్నాం. చింతకుంట్లలో అన్నను జైలులోపెడితే, తమ్ముడు అస్థానాన్ని ఆక్రమించుకున్నాడు. భూమినిమాత్రం వదులుకోలేదు. ఈ చర్యల అనంతరం పెనుబాడు కేంద్రంలో సయితం భూస్వాములు రైతులనుపిలిచి పంటలో మూడోవంతు వారికిచ్చారు. భూముల నాక్రమించుకున్నందుకుగాను మేము దాడిజేస్తామేమోనన్న భయంతోనే వాటలాచేశారు

'హుజూర్‌నగర్ మండలంలో, శత్రుదాడులు వుధృతమయినప్పుడు, 'సాయుధ పోరాటంవద్దు' అనే పంథా చేపట్టివున్న మనం భూసమస్యను తమకు చేతనైన విధంగా పరిష్కరించుకోవలసిందిగా ప్రజలకే వదలివేశాం. అనేక గ్రామాలవారు మా దగ్గరకొచ్చి, రైతులనుండి భూములను స్వాధీనం చేసుకో

కుండగలందులకై, ఫలానా ఫలానా భూస్వాములను హెచ్చరించవలసిందిగా కోరారు. మనం వారికి నాయకత్వం వహించలేదు. తమంత తాముగానే పోరాడేందుకుగాను మనం ప్రజలను సన్నద్ధం చేయనూలేదు

"యూనియన్ సైన్యాలు ప్రవేశించిన వెంటనే, అనంతగిరి దేశముఖు రైతులనుండి భూములను తిరిగి ఆక్రమించుకున్నాడు చిలుకూరు, ఎర్రవరం, గణపవరం, కాపుగల్లు గ్రామాల భూస్వాములు, గతంలో పంపిణీచేయబడిన భూములను ఆక్రమించుకున్నారు. అయినా, కొందరు రైతులు, నైజాంపాలనా కాలంలో తమకు వొప్పగించబడిన భూములను వదులుకోలేదు.

"అనేక గ్రామాలలో, ప్రజలు భూమి ఆక్రమణ సమస్యను మన ముందుకు దెచ్చారు. 'ఇది అదనుగాదు, మరికొన్నిరోజులు ఆగండి పోలీసులు కొట్టినా,చంపినాసరే మీభూములు వదులుకోవద్దు'అని చెప్పిపంపుతుండేవాళ్లం.

"మేము కలుగజేసుకొన జాలకపోయాం రేపూరు, రామాపురం భూస్వాములు తమ భూములలో కొంతభాగాన్ని అమ్ముకోనిచ్చాం.

"బేతవోలు కేంద్రంలో, ప్రజలు భూములు వదులుకోలేదు. పోలీసు దురంతాలను ప్రతిఘటించారు. మన సలహా, తోడ్పాటూ కోరారు. అయినా మేము వారికి సహాయం చేయలేదు, చిట్టచివరకు, వారు భూములను వదులుకోవలసి వచ్చింది మంచిరోజులు వస్తాయని, తమ భూములను తాము తిరిగి ఆక్రమించుకోగలమని ఆశమాత్రమే వారిలో మిగిలింది.

"వెలిదండలో, రామచంద్రారెడ్డి అనేభూస్వామి భూములూ, పాతారం దేశముఖు భూములూ పంపిణీ చేయబడ్డాయి ఆ భూములను తిరిగి హస్తగతం జేసుకోవాలని ఈ భూస్వాములు ప్రయత్నించారు రైతులు దీర్ఘకాలంపాటు ఆ ప్రయత్నాలను ప్రతిఘటించారు. మన సహాయం కోరారు భూములు వదులుకోవద్దని, కౌలు చెల్లించవద్దని వారిని ప్రబోధించటం మాత్రమే మేము చేయగలిగాం. కాని, దాడు లధికమవటంతో, తుదకు వారు భూములు వదులుకోవలసి వచ్చింది.

"బేతవోలులో, భూస్వామి సైన్యం సహాయంతో రైతులచేత పంటలో తనవాటాను వేరే పెట్టించాడు రైతులు ఆ పంటకుప్పను పగులుతున్న ద్వేషంతో చూచారు "బంగారంలాంటి ఈ వడ్లను మనం ఎలా స్వాధీనం చేయగం? ఆ ధాన్యం మనకు దక్కకపోయినా ఫర్వాలేదు. భూస్వామికి మాత్రం దక్కటానికి వీలులేదు. అందుచేత పంటకుప్పను తగులబెట్టివేద్దాం"అని తలపోశారు. శత్రు దాడులు తీవ్రంగా సాగుతున్న పరిస్థితిలో మేము, రైతాంగంయొక్క అభీష్టాన్ని నిర్వర్తించలేకపోయాం.

"బూర్గుగడ్డలో ప్రజలు పోరంబోకు భూములు సాగుజేసుకుంటు న్నారు. భారత యూనియన్ సైన్యాలు ప్రవేశించిన తర్వాత భూస్వాములు- రైతుల పచ్చిక బయళ్ళను ఆక్రమించుకున్నారు. ప్రతి ఎకరం పోరంబోకకు యాభైరూపాయలుచొప్పున రైతులనుండి వసూలు జేయనారంభించారు. రైతులు వ్యవసాయ కార్మికులు మా దగ్గరకొచ్చారు. ఈ భూస్వాములను అంతం జేయ వలసిందిగా కోరారు. ఇది సమయంగాదని, భూస్వాములు వసూలుచేసిన ప్రతి పైసాను కక్కిస్తామనీ మేము సమాధానం చెప్పాం. "సాయుధ పోరాటంవద్దు" అనే పంథా ఫలితంగా జరిగింది

"మిర్యాలగూడెం మండలంలో ముసుంపల్లి కేంద్రంలో, శత్రువు భూముల నాక్రమించుకో గలిగారు. గ్రామాలలో నివసించి వుండగలిగాడు కూడా. మనం అక్కడకు పోలేకపోవటం కనీసం సంబంధాలైనా పెట్టుకోలేక పోవడం అందుకు కారణం.

"రామడుగు కేంద్రంలో, గారగుంటపాలెం, పెద్దగూడెం, కోసల మర్రి, మారేపల్లి, యాచారం గ్రామాల రైతుల భూములను భూస్వాములాక్ర మించుకొన్నారు అయితే, మేము గారగుంటపాలెం, తెప్పలమడుగు,కొప్పోలు, చేపూరు గ్రామాలలో భూస్వాములపై చర్యతీసుకొన్నాం. దానితో ఈ గ్రామాల భూస్వాములంతా పారిపోయారు పోలీసు క్యాంపులో తలదాచుకొన్నారు. మానూళ్ళతరుణంలో మిలటరీని తీసుకొచ్చి, రైతాంగంనుండి పంటనుకాజేశారు.

"రాజారం కేంద్రంలో, ప్రజలు, మిలిటరీ దాడినికూడా సరకుజేయక భూములనుండి పంటను తీసుకోగలిగారు. ఎకరానికి వందరూపాయల చొప్పున వసూలు జేయటానికి, రైతుల యిండ్లనుండి ధాన్యం స్వాధీనం చేసుకోవటానికి భూస్వాములు ప్రయత్నించారు కాని అదేమీ సాగలేదు ప్రజలు తమ ధాన్యాన్ని వదులుకోలేదు డబ్బూ చెల్లించలేదు రామానుజరెడ్డికి, ఎల్లభరెడ్డికి తుమ్మడం దేశముఖుకు జెందిన భూములు, 1949 వ సంవత్సరం అంతా సాగు చేయకుండానే వదలివేయబడ్డాయి. సైనిక కేంద్రాలను ఏర్పాటుజేసిన తర్వా తనే వారు, పాలేర్లచేత ఆ భూములను సాగుచేయించుకోగలిగారు.

"కొక్కాయగూడెం, సూరేపల్లి, తిరుమలగిరి, వెంగన్నగూడెం గ్రామాల రైతులు భూములు సాగుచేసుకున్నారు. భూస్వాములకు కౌలేమీ చెల్లించవలదని మేము వారిని కోరాం. నెల్లకల్లు, చీటాపాలెం, నిడిగడ్డ, మలకచర్లలలో రైతులు తమ పంటలు నిలబెట్టుకొనటానికి మేము సహాయ పడ్డాం. తూముకుంట్ల, భేతివెంకన్నతండా, కొంపల్లె గ్రామరైతులు, భూస్వా ములు అక్రమంగా స్వాహాజేసిన భూములను ఆక్రమించుకొనటానికి

తోడ్పడ్డాం. మేము సన్నిహిత సంబంధాలు పెట్టుకోగలిగిన ఈ గ్రామాలలో పోలీసుల, సైనికుల సహాయంతోనైనా పంటలను స్వాధీనంజేసుకోవటం శత్రువుకు సాధ్యంకాలేదు

## మన దళాలకు లంబాడీప్రజల అండదండలు

"నడిగడ్డ తండాలో పదిమంది స్త్రీలను వారి భర్తల ఎదుటనే చెరిచారు కొయ్యగూడెం తండాలో, స్త్రీలను మానభంగం జేశారు పాశవికంగా హింసించారు స్త్రీల తలలు గొరిగించారు. అయినా వారు దళాలను బలపరుస్తూనే వచ్చారు. మనకు రక్షణ కల్పిస్తూనే వున్నారు టుంగిపాటి తండాలో బిమ్లానాయక్‌ను కాల్చిచంపారు. నవంబరులో గెరిల్లాలు బస్సులపై జయప్రదంగా దాడి ఎలా జరపగలిగారనే రహస్యాన్ని వెల్లడించటానికి ఆయన నిరాకరించటమే అందుకు కారణం. మేళ్ళచెరువులో గూండాలను పట్టుకోవటానికి, మన కామ్రేడ్ సైదులు రెడ్డిని కాల్చిచంపటానికి రాఘవరావు అరెస్టుకు కారకుడయిన ద్రోహి "శంబుడు"ను పట్టుకోవటానికి మన దళాలకు తోడ్పడింది లంబాడీప్రజలే. వారనేకసార్లు పోలీసు దాడులనుగూర్చి సైనికదాడులను గూర్చి ముందుగా ఆచూకీ తెలిపి మన దళాలను కాపాడారు సక్రమమైన సలహాయిచ్చి నడిపించినప్పుడు అనేకసార్లు వారు మేళ్ళచెరువు తండాలో వలె తమ కుల పెద్దలకు వ్యతిరేకంగా, భూస్వాములకు వ్యతిరేకంగా మంచె కుటుంబానికి చెందిన భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడారు యాతవాకిళ్ళ కాళ్ళపల్లి తండాలు తమభూమికోసం, వ్యవసాయకార్మికులకు న్యాయమైన వేతనాలకోసం తమ స్వంత భూస్వాములపైనే పోరాడారు అధికవడ్డీరేట్ల కారణంగానో, అధిక కౌలురేట్ల కారణంగానో కోల్పోయిన భూములను తిరిగి సంపాదించుకున్నారు. తమ తండాలలోని [illegible] అధిక పన్నులు పేదవర్గాలపై తక్కువ పన్నులు విధించునట్లు చేశారు. మేళ్ళచెర్వులో లంబాడీతండా ప్రజలు, [illegible] అడవికొట్టుకుని ఏనాటినుండో సాగుచేసుకొంటున్న భూములను నిలబెట్టుకోగలిగారు. కాళ్ళపల్లి, నడిగడ్డ, చింతలపాలెం, మొద్దుల కుంటలలో యితర తండాలలో వారు పోరాడి తమ వేతనాల పెంపుదల సాధించుకున్నారు. అక్కడ ఈ వర్గ పోరాటాలు జరిగినప్పుడు అనేక పురాతన సాంప్రదాయాలు సడలిపోవటం అభ్యుదయకరమైన అలవాట్లను ఆచరణను చేపట్టుటంగూడా కనిపించింది.

"మన గ్రామ కమిటీలను రద్దుజేసి, పటేళ్ళ, పట్వారీల పాలనను పునఃస్థాపితం జేయటానికి శత్రువు శాయశక్తులా ప్రయత్నించాడు. విద్రోహాలు, అరెస్టులు సాగిన తర్వాత యింకా బయట మిగిలివున్న గ్రామ కమిటీలలోని నిజాయితీపరులవద్దకు వెళ్ళి ప్రజలు తమ వివాదాలను పరిష్కరించుకొంటూ వుండటంతో శత్రువు ఆశలు పటాపంచలైనాయి. ఎంత పెద్ద సమస్య తలెత్తినా సరే ప్రజలు ప్రభుత్వపు కోర్టుల కెళ్ళటంలేదు విజయనగరం, మేడవరం, వైకుంఠపురం, సైదబ్బాన్‌గూడెం, పత్తేపురం, జొన్నలదిన్నె గ్రామాల పరిస్థితి యిదే. తడకమళ్ళ కేంద్రానికి సంబంధించిన వార్తలు మాకు చేరలేదు. పటేళ్ళు, పట్వారీలతో పని జరగదని తేలిన తర్వాత, కాంగ్రెస్ ప్రభుత్వం సయితం, ప్రజలెన్నుకున్న వారితో కొన్ని గ్రామ సమితులను ఏర్పాటు జేయవలసి వచ్చింది. బీజప్రాయమైన ఈ జనతా ప్రజాస్వామ్య రాజ్యంపట్ల ప్రజలకెంతటి ఆదరణ వున్నదీ దీన్నిబట్టే విదితమవుతుంది

"ప్రభుత్వం సయితం రద్దుజేయ సాహసించలేని గ్రామ కమిటీలను రద్దుజేయాలని పార్టీ ప్రాంతీయ కమిటీ నిర్ణయించటం అత్యంత హానికరం ఈ క్లిష్ట సమయంలో, అవి సమర్ధవంతంగా పనిజేసేట్లు చేయటంకోసం, వ్యవసాయ కార్మిక, పేదరైతు కార్యకర్తలను ఈ కమిటీలలో నియమించాలి.

"మిర్యాలగూడెం మండలంలో నెల్లికల్లు, నడిగడ్డ కేంద్రాలలో మనం గ్రామ ప్రజాకమిటీలద్వారా ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోగలిగాం. వారి సమస్యలను పరిష్కరించగలిగాం. తత్ఫలితంగా ప్రజలు మనకు అనేక విధాలుగా తోడ్పడ్డారు శత్రువుపై దాడులలోనూ, వారురాకుండా రోడ్లను ధ్వంసంచేయడంలోనూ సయితం వారు పాల్గొన్నారు. మనం గ్రామ కమిటీలను రద్దుజేసిన ఇతర కేంద్రాలలో మనం ప్రజలతో సంబంధాలు పెట్టుకోలేకపోయాం. అందువలన భూమికోసంగాని శత్రువుకు వ్యతిరేకంగా గాని వారిని కార్యాచరణకు కదిలించలేకపోయాం.

"గ్రామ కమిటీలను రద్దుచేసిన తర్వాత శత్రువుపై గెరిల్లా దాడులు జరగటం లేని పరిస్థితిలో, హుజూర్‌నగర్ పట్టణంలో బయట వదలివుంచబడిన గ్రామకమిటీలలోని నిజాయితీపరులు సయితం ప్రజల వివాదాలను పరిష్కరించటానికి ముందుకు రాలేకపోయారు తత్ఫలితంగా, ప్రజలు తమను వెదుక్కొనివచ్చి కలుసుకున్నప్పుడు పార్టీ ఆర్గనైజర్లే ఈ వ్యవహారాలను పరిష్కరించడం తప్పనిసరైంది. ఓర్మి వహించవలసిందిగా ప్రజలను కోరుతూ, పార్టీ ఆర్గనైజర్లు ఈ సమస్యలను తరచు వాయిదా వేస్తూండేవారు"

"నైజాం రజాకార్ రోజులలో ఉత్సాహంగా ముందుకొచ్చిన మిలిటెంట్లను పెద్దసంఖ్యలో పార్టీసభ్యులుగా తీసుకున్నాం. అయితే, వారిని రాజకీయంగా విజ్ఞానవంతులను జేయలేకపోయాం. తగినంతగా వారిని అభివృద్ధి జేయలేకపోయాం. తత్ఫలితంగా, భారతసైన్యం ప్రవేశించిన అనంతరం బీభత్సకాండ అధికమవటంతో, వారిలో చాలామంది పార్టీ కార్యకలాపాలనుండి దూరమయ్యారు సాయుధ గెరిల్లా దళాలను రద్దుజేయటం, వారే గ్రామాలనుండి వచ్చారో ఆ గ్రామాలనే అంటిపెట్టుకుని స్థానిక పోరాటంపై కేంద్రీకరించటం అనే ప్రాంతీయ కమిటీ పంథాతో వారిని నిలబెట్టటం కష్టమైపోయింది.

"శత్రుబీభత్సకాండ సాగుతున్న సమయంలో, స్థానిక కార్యకర్తలలో అనేకమంది తమతమ గ్రామాలు వదిలివెళ్ళారు వారు గ్రామాలలో అందరికీ వెల్లడికాలేదని, వారికి ప్రమేయమేదీలేదని పైగా వారందరికీ తాము రక్షణ కల్పించజాలమనీ వివరించిచెప్పి వారిని ఆ గ్రామాలకు తిరిగి వెళ్ళవలసిందిగా కోరాం ఆయుధాలు లేకుండా, రక్షణ స్థావరాలు లేకుండా తిరిగి వెళ్ళటానికి వారంగీకరించలేదు. అయినా వారిని బలవంతాన పంపించివేశాం వారిలో అత్యధిక సంఖ్యాకులు అరెస్టు చేయబడ్డారు.

'సూర్యాపేట పట్టణానికి జెందిన మహిళా కామ్రేడ్సు అందరిలోనూ వెల్లడయిపోయినందున, గెరిల్లా దళాలలోనో, రాజకీయ దళాలలోనో వచ్చి చేరాలనుకున్నారు కాని వారిని తీసుకోవటానికి నిరాకరించి, వెనకకు పంపివేశాం. ఒక వారంరోజుల తర్వాత వారు అరెస్టు చేయబడ్డారు.

కలమలచెరువుకు చెందిన స్థానిక కార్యకర్తలిద్దరు ఆ గ్రామం నుండి వచ్చేసి, మా దళాలలో చేరాలనుకున్నారు వారిని మా దళాలలో చేర్చుకోనటానికి మేము నిరాకరించాం అదే విధంగా, ఇబ్బాకారు, నారాయణపురం, యెల్లాపురం, బూర్గుగడ్డ, మాచారం గ్రామాలకు చెందిన వెల్లడయిన కార్యకర్తలను చేర్చుకోవటానికి మేము నిరాకరించాం. వారిలో అధిక సంఖ్యాకులు అరెస్టు చేయబడ్డారు.

"అడివిదేవులపల్లికిచెందిన యిద్దరుచేరాలనుకున్నా, మేము చేర్చుకో నిరాకరించాం. అరెస్టుకాకుండా తప్పించుకోవటంకోసం వారు గ్రామం వదిలి పెట్టి, యూనియన్ గ్రామాలకు వెళ్ళవలసివచ్చింది రాములమ్మ, మలకచెర్ల నుండి మిలిటెంట్లను రిక్రూట్ చేసింది. వారికి ఆశ్రయం కల్పించజాలమన్న కారణంతో వారిని చేర్చుకోవటానికి మేము నిరాకరించాం. దళంలోవున్న

వారిని రక్షించుకోగలిగితే అక్కడికదే పెద్ద విజయం. కొత్తవాళ్ళను చేర్చు కొని ఈ క్లిష్ట సమయంలో ఒరువునెత్తిన వేసుకోవటమెందుకుఅనేబావం మన దృక్పధమంతటిలోనూ నిండివుంది.

"వాడపల్లి జోన్‌లో వ్యవసాయ కార్మికసమ్మెలుజరిగిన కారణంగా పెద్దసంఖ్యలో అనేకమంది మిలిటెంట్లు వెల్లువగా ముందుకొచ్చారు. వారిలో కొందరిని సెల్సుగా నిర్మాణంజేశాం. ఈ పోరాటాలలో రెండువందలమందికి పైగా కార్యకర్తలు తయారయ్యారు. వారిలో చాలామంది మన దళాలలో చేర టానికి సంసిద్ధమయ్యారు. దళాలలో చేర్చుకోవలసిందిగా వొత్తిడిచేశారుకూడా. అయినా మేము చేర్చుకో నిరాకరించాం. అందువల్ల, శతృదాడులు వుధృత మైన తర్వాత వారిలో చాలామంది అరెస్టు చేయబడ్డారు అరెస్టు తప్పించు కోవటంకోసం మిగతావాళ్ళు గ్రామం వదలి, కోస్తా జిల్లాలకు వెళ్ళి పోవలసి వచ్చింది

## గెరిల్లా దళాలను తిరిగి ఏర్పాటుజేసిన అనంతర పరిస్థితి

"గెరిల్లా దళాలను తిరిగి ఏర్పాటుజేసి, ఆ ప్రాంతంలోని పార్టీని తిరిగి సాయుధ గెరిల్లా పోరాటపు పట్టాలపై ఎక్కించేసరికల్లా చెలకుర్తి, మట్టంపల్లి, నేరేడుచర్ల, కొండ్రపోలు, అడివిదేవులపల్లి, కాపుగల్లు కాంగ్రెస్ రౌడీ కేంద్రాలుగా తయారయ్యాయి రౌడీ మూకలను, భూస్వాముల బిడ్డ లను చేర్చి హోంగార్డు దళాలను ఏర్పాటు చేశారు

గెరిల్లా దళాలు ఈ కేంద్రాలపై దాడులు జరిపాయి పరమ కిరాతకు లయిన గూండాలలో కొందరిని చంపివేశారు చెలకుర్తిలో పోలీసు క్యాంపు కూడా వుంది. అయినా, దళాలు హోంగార్డులపై దాడి జరిపాయి. వారిలో ఏడుగురిని చంపివేశాయి. ఇప్పుడు ఈ బీభత్స కేంద్రం సర్దుమణిగింది. మిగతా హోంగార్డులు, భూస్వాములు, తాము యితర గ్రామాలకు వెళ్ళబోమని చెప్పారు. ఈ గ్రామంలో కమ్యూనిస్టులు తమ కార్యకలాపాలు కొనసాగించ కుండా అరికట్టగలిగితే చాలుననుకున్నారు

"మట్టంపల్లిలో, ముప్పైమంది పోలీసులతో, యాభైమంది హోం గార్డులతో ఒక క్యాంపు ఏర్పాటుజేశారు అయినా, దళాలు ఈ గ్రామంపై దాడిజేసి ప్రజాకంటకుడైన దుష్టభూస్వామిని, అతని భార్యనూ చంపివేశాయి. వారిద్దరూ గతంలో ప్రజలపై వర్ణనాతీతమైన అత్యాచారాలు జరిపించారు.

ఈ రౌడీ కేంద్రానికి వారే ఆయువుపట్టు ఈ దాడితో హుజూర్‌నగర్ మండలంలోని మొత్తం వంద గ్రామాలకు పూపిరిసలుపుకునే అవకాశమేర్పడింది.

"నేరేడుచెర్లలో, మేము హోంగార్డు కేంద్రంపై దాడిచేసి. అందులోని మురా నాయకులను నలుగురిని చంపివేశాం. మిగతా హోంగార్డులు క్యాంపునుండి పారిపోయారు. ఇప్పుడు ప్రజలకు కనిపించటానికి కూడా సాహసించటంలేదు

"కొండ్రపోలు యాభైమంది హోంగార్డులతోగూడిన కేంద్రం. ఎక్కువ సంఖ్యలో పోలీసులుండే కేంద్రంకూడా. దళాలు ఆ క్యాంపుపై సూటిగా దాడిచేయలేకపోయాయి. కాని భూస్వాముల పశువుల చావిళ్ళను, నూతులనుండి నీరుదోడే మోటపరికరాలను తగులబెట్టివేశారు. అంతకుముందు శతృపక్షంలోవున్న, చిన్న భూస్వాములు, ధనికరైతులు రాజీకొచ్చారు "మమ్మల్ని బ్రతకనివ్వండి. మీకు వ్యతిరేకంగా మేము ఏమీ చేయం వంద ఎకరాలకుపైగావున్న మిగులు భూమినంతా మీకిచ్చివేస్తాం. మీరు కోరినవిధంగా వ్యవసాయ కార్మికులకు వేతనాలు చెల్లిస్తాం. చైనాలో మీ కామ్రేడ్స్ అనుమతించినవిధంగా, యిక్కడా మమ్మల్ని బ్రతకనివ్వండి" అని అన్నారు.

"అడవి దేవులపల్లిలో, పెద్ద సంఖ్యలో పోలీసులుగల క్యాంపు వున్నప్పటికీ, దళాలు ప్రజాపీడకులైన యిద్దరు దుర్మార్గులను చంపివేశాయి. పరిసర గ్రామాలన్నింటిపైనా పదే పదే దాడులు జరిపించి పేరు మోసిన, ములకచెర్ల భూస్వామి అనంతరాములు ఆ క్యాంపులో తలదాచుకున్నాడు. దళాలు ఆ క్యాంపును ముట్టడించి, అతనిని చంపివేశాయి.

"రాగడపకు చెందిన కామ్రేడ్ రంగయ్యను చంపివేసింది గ్రామంలోనే 'వర్షాకాలం వచ్చిందాకా మీరెందుకు ఆగలేదు? వేసవికాలంలో ఎందుకొచ్చారు?' అని ఆయన మరణానంతరం ప్రజలు ప్రశ్నించారు. 'ఆయనెక్కడ పుట్టాడో నాకుతెలియదు మాకోసం ఆయన తన ప్రాణాన్నే త్యాగం చేశాడు. మేము ఆయనకు సకాలంలో సరైనదానిని అందించి వున్నట్లయితే సకాలంలో సహాయాన్ని అందించివుంటే ఆయనకా మరణం సంభవించివుండేది కాదు' అని ఒక స్త్రీ విలపించింది. "వారు కొండల్లో [illegible] పోతులుగా వుండటంలేదు. ఎప్పుడవసరమయినా పోరాడుతూ వారు తమ జీవితాలను త్యాగంచేస్తున్నారు" అని మరొకరన్నారు.

"మిర్యాలగూడెం మండలంలోని కొత్తపాలెంలో దుష్ట భూస్వామి కొండయ్యను, అతని ఏజెంటుగు గురవయ్యను గెరిల్లా దళం చంపివేసింది.

ఈ దుర్మార్గులపీడ విరగడయినందుకు ప్రజలెంతో సంతోషించారు సెల్ కార్యదర్శి కామ్రేడ్ లచ్చులును పోలీసులకు పట్టించింది వాళ్ళే. ఆ తర్వాత పోలీసులు ఆ కామ్రేడ్‌ను కాల్చిచంపారు. అంతేగాదు, పోలీసులు గ్రామస్తు లందరినీ యిష్టంవచ్చినట్లుబాది జైలునుండివిడుదలై బయటకొచ్చిన సైదులును కాల్చిచంపారు. దళంలో నైనాచేరు, లేదా మరెక్కడికయినా వెళ్ళిపో, లేకపోతే శత్రువుచేత కాల్చిచంపబడతావు అని ఆయనకు మేము చెప్పాం. కాని ఏదో ఒకటిచేసే లోపునే, ఆయనను పట్టుకు కాల్చిచంపారు. ప్రతిరోజూ తమపై చిత్రహింసలు జరిపించటానికి, తమను పీడించటానికీ ఆ దుష్ట భూస్వామి మరి లేనందువల్ల ప్రజలు ఆ దెబ్బలను లెక్కజేయలేదు.

" 'గెరిల్లాలు వర్షాకాలంలో తమ దాడులు సాగిస్తారు. వేసవి కాలంలో వెళ్ళిపోతారు అప్పుడు పోలీసులు తమ దాడులు వుధృతంజేస్తారు. అయినా మీరు దాడులు చేయటమే మంచిది. అందువల్ల పోలీసుల దాడులు అంతకంతకు తక్కువవుతాయి. దాడికి దాడికిమధ్య వ్యవధి అధికమవుతుంది' అని ప్రజలు అంటున్నారు.

"కామ్రేడ్ యస్. బి. పున్నయ్యను పట్టుకుని చంపివేయటానికి కారకుడయిన అనియాలి పురానికిజెందిన హనుమానులు, కందిబండకు జెందిన దుష్టభూస్వామి కందిబండ జానకిరామారావు గూండా ఏజెంట్లగు పటేల్ నరసయ్యను, గిద్దం వీరయ్యను గెరిల్లాలు చంపివేశారు. కాపుగల్లులో దుష్ట భూస్వామ్య పీడకుడు ముత్తవరపు నరసయ్య, మన కేంద్ర ఆర్గనైజరగు ముత్త వరపు వెంకయ్యను కాల్చిచంపించాడు. గెరిల్లాదళం అతనికోసం వెళ్ళింది. కాని అతడు కనిపెంచలేదు. అతని పశువుల చావళ్ళను తగులబెట్టి వచ్చారు.

"దేవరకొండ తాలూకా నిడిగల్లులో చిర్రా వెంకటరెడ్డి అనే భూస్వా మికి జెందన మూడుపందల పశువులను గెరిల్లాలు అడవులలోకి తోలివేశారు. పోలీసుల సహాయంతో అతడు అడవి ప్రాంతమంతా గాలించాడు. రెండువేల రూపాయలు విలువచేసే పది ఆవులు మినహా మిగతా పశువులన్నీ దొరికాయి. తన పశువులపై యింకా అలాగే దాడులు జరుగుతాయని భయపడి, ఆతడు తన పశువులలో చాలావాటిని చౌకధరలకు అమ్మివేశాడు కామ్రేడ్ వల్లభనేని సీతారామయ్యను, ఆయనదళాన్ని పోలీసులు ముట్టడించటానికి, సీతారామయ్య మరణానికి, ఆ దాడిలో మరొక దళ సభ్యుని మరణానికి కారకుడయిన వాడే.

"అదేవిధంగా, యితర భూస్వాముల ఆస్తులను, తోటలు మొదలైన వాటిని గెరిల్లాలు ధ్వంసంజేశారు. భూస్వాములు రాజీకి సిద్ధమయ్యారు.

పేరుకొనియున్న అప్పులను రద్దుజేయాలని, అన్యాక్రాంతాలను రైతులకు తిరిగి యిచ్చివేయాలని, పాలేర్లకు న్యాయమైన వేతనాలు చెల్లించాలని, గెరిల్లాల ఖర్చులకోసం తమఆస్తులపై లెవీలు చెల్లించాలని పరతులను గెరిల్లాలువిధించారు

"భూస్వాములపైన, పోలీసులకు సమాచార మందజేసేవారిపైన ఈ విధమైన అనేక దాడుల ఫలితంగా మనకు గ్రామాలతో సంబంధాలు ఏర్పడ్డాయి పోలీసు మిలటరీ క్యాంపులకు ఎలాంటి సమాచారం అందకుండా నిలిచిపోయింది. అందువల్ల ఈ ప్రాంతాల్లో 1950 వేసవిలో పెద్దఎత్తున కేంద్రీ కరణ జరిగినప్పటికీ, అదనంగా ఆరువందలమంది గూర్ఖాలను దించినప్పటికీ పోలీసులు మన కేంద్రాన్ని పట్టుకోలేకపోయారు. ఈ చర్యలే గనుక తీసుకుని వుండకపోతే, మాలాంగార్డులు, భూస్వాములు మన కార్యకర్తలనుగూర్చిన సమాచారం అందజేసి వుండేవాళ్లే మనం తీరని నష్టాలకు గురయ్యేవాళ్ళమే

"హుజూర్‌నగర్ మండలం మొత్తంలోగల, దాదాపు అన్ని గ్రామాలలోని ప్రజలూ, రజాకార్‌దశలో ఆక్రమించుకున్న భూమిలను తిరిగి తమ అధీనంలోకి తెచ్చుకోవడమే, ఈ దాడుల అనంతరం సాధించుకున్న విజయాలలోకెల్ల పెద్దది. కాపుగల్లు, యెర్రవరం, దిర్శనచెర్ల, మట్టంపల్లి గ్రామాలలో మాత్రమే భూస్వాములు, క్యాంపులలోని పోలీసుల సహాయంతో ప్రజలనుండి ఈ భూములను హస్తగతం చేసుకోగలిగారు"

[మన పాతపోరాట ప్రాంతాలన్నింటా సర్వసాధారణంగావున్న పరిస్థితి ఇదే పంపిణీ చేయబడిన భూమికి రైతులు అంటిపెట్టుకునే వున్నారు బలవంతంజేస్తే పంటలో కొంతభాగాన్ని కౌలుగానైనా చెల్లిస్తాడుగాని, భూమినిమాత్రం వదులుకొనబోడు. పోలీసు క్యాంపులు పెద్దఎత్తున సిబ్బందిని కలిగివున్నచోట్ల, అతిపెద్ద భూస్వాములు నివసిస్తున్నచోట్లమాత్రమే రైతుల భూములను తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు పాలేర్లను నియమించి సాగు చేసుకోగలిగారు. కొందరు భూస్వాములు, రైతుల భూములను గుంజుకోవటానికే సాహసించలేదు. తమకు కౌలు చెల్లించాలని మాత్రమే వాళ్లుకోరారు. భూములు రైతుల అధీనంలో వుండనివ్వటాని కంగీకరించారు.]

"మిర్యాలగూడెం జోన్‌లో 1950 ప్రారంభంలో వాడపల్లి జోన్ కూడా కలిపివేయబడింది. ఆ మండలంలోని చీదెళ్ళ గ్రామంలో 160 ఎకరాల భూమి 32 కుటుంబాలకు పంపిణీ చేశారు. ఆ కుటుంబాలవారు ఆ భూమిని సాగుజేసుకున్నారు. తాము పండించిన పంట శత్రువు చేతుల్లోకి పోకుండా కాపాడుకోవాలని ప్రజలు నిశ్చయించుకున్నారు. నందిగాం గ్రామంలో

భూస్వాములకు, ప్రభుత్వానికి జెందిన 330 ఎకరాల భూమినిగ్రామ ప్రజలాక్ర మించుకుని, సాగుజేసుకుంటున్నారు. వర్షాభావం కారణంగా ఈ ప్రాంతంలో భూమి పంపిణీ విస్తృతంగా సాగించటం సాధ్యపడలేదు.

"చెలమారెడ్డిగూడెం, సూరేపల్లి, వెంగన్నగూడెంలలో భూములను రామానుజరెడ్డి, దామోదరరెడ్డి అనే పెద్ద భూస్వాములిద్దరినీ సాగుజేసుకో కుండా ఆరికట్టారు. అదేవిధంగా నీలాయగూడెంలో జి. కిష్టయ్య భూములను, రాగడలో వల్లభరెడ్డి భూములను, అప్పలమ్మగూడెంలో సైదయ్య భూములను బీడు బెట్టటం జరిగింది. రైతాంగం నుండి బడా భూస్వాములు స్వాధీనం జేసు కుని, తమ స్వంత పాలేర్ల ద్వారా సాగుచేసుకోవటానికి ప్రయత్నించిన భూముల లాంటి స్థితిలో పడ్డాయి

"హుజూర్‌నగర్ మండలంలోని గణేష్‌పాడు, రావిపాడు, శూన్య పాడు, బూరుగడ్డ, కీతవారిగూడెం, చెర్ల, చిలుకూరు, నారాయణపురం గ్రామా లలో రైతులు పోరంబోకులలోని తుప్పలుగొట్టి సాగుజేసుకొంటున్నారు. మాధనేనిగూడెంలో, వ్యవసాయ కార్మికులు, ఒక భూస్వామికి జెందిన పది ఎకరాల భూమిని సాగుజేసుకుంటున్నారు.

"మన దాడులవల్ల కలిగిన మరొక పెద్ద ప్రయోజనం, ప్రజల మన స్థయిర్యం పెంపొందటం, శతృశిబిరం మనోనిబ్బరం గోల్పోవటమూను

"సోమిశెట్టిపాలెంలో, నిర్బంధంవల్ల కాపలాగాస్తున్న ప్రజలు ఆ కాపలాను తనిఖీ జేయటంకోసం మారువేషంలో అచ్చటికి వెళ్ళిన రాజారం క్యాంపు సుబేదారును గుర్తుబట్టారు. కొత్తవాడు ఎవరో వచ్చారన్నట్లుగా అతని మీదకి దూకి, 'కమ్యూనిస్టు వచ్చాడంటూ' అతనికి దేహశుద్ధి జేశారు. పోలీ సులు హుటాహుటిని పరుగెత్తుకెళ్ళి ఆతనిని కాపాడారు యెల్లాపురం గ్రామంలో రాత్రి కాపలాగాస్తున్న ప్రజలు ఆల్వాలకు జెందిన పోలీసు ఇన్‌స్పెక్టరును పట్టుకున్నారు "ఆదిరెడ్డి (ప్రఖ్యాత దళ నాయకుడు) వచ్చాడంటూ అతనికి దేహశుద్ధి జేశారు. అప్పలమ్మగూడెం శతృవైన సైదయ్య, కాపలాను తనిఖీ జేయటంకోసం పోలీసు బృందాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు. ప్రజలా తనిపైన దూకి, చితకదన్నటానికి సిద్ధమయ్యారు. అంతలో పోలీసులు అడ్డం వచ్చారు. కమ్యూనిస్టులొచ్చినప్పుడు మీరు వాళ్ళను ఆహ్వానిస్తారు వాళ్ళకు భోజనాలు పెడతారు. జాగ్రత్తగా సాగనంపుతారు. మేము వచ్చినప్పుడు తనివితీరా తిట్టిపోస్తారు. ఈరాత్రి కాపలా నిరుపయోగం" అని పోలీసులు ప్రజలను ఆడిపోసుకునేవారు.

"అంతకుముందే అచ్చటి ప్రజలను నిర్బంధంగా ఖాళీచేయించి, భట్టు వెంగన్న బావితండాను తగలబెట్టటానికి పోలీసులు వెళ్ళారు. తమ గుడిసెలను ఆఖరిసారిగా చూచుకోవటానికి ఇరవైమంది లంబాడీ స్త్రీలు మాత్రమే అచ్చట వున్నారు. పోలీసులు వాళ్ళను చెరచటానికి ప్రయత్నించారు. సరిగ్గా ఆ సమయానికే దళ సభ్యులిరువురు తండాను చేరుకున్నారు. అచ్చటి స్త్రీలు వాళ్ళకు ప్రమాద హెచ్చరిక నిచ్చారు. పోలీసులు వాళ్ళనుకూడా చూచారు. కాల్పులు ప్రారంభించారు. దళ సభ్యులు తప్పించుకు పోయారు. ఆ తర్వాత ఏ క్షణంలోనైనా దళం తమపై దాడిచేస్తుందన్న భయంతో, నిరంతర నిఘాతో వుండవలసివచ్చినందున పోలీసులు ఆ స్త్రీలను ముట్టుకొనటానికి సాహసించలేదు.

"ఆ తర్వాత ఆ కేంద్ర ఆర్గనైజరు వెళ్ళి ఆ స్త్రీలను కలుసుకున్నాడు. తమను చెరచటానికి పోలీసులు ఎలా ప్రయత్నించిందీ, అనుకోకుండా యిద్దరు దళ సభ్యులు కనిపించటంతో తామెలా రక్షించబడిందీ ఆ స్త్రీలు వారికి వివరంగా చెప్పారు. అయితే దళ సభ్యులు అప్పటికప్పుడే పోలీసులతో తలపడి చంపివేయనందుకు వారికి కోపం వచ్చింది. ఒక వృద్ధ స్త్రీ తాను మరణించే లోపున దళాన్ని చూడాలనుకొంటున్నందున, ఆ రోజుకు అక్కడనే వుండిపోవలసిందిగా మన కామ్రేడ్స్‌ను వారు కోరారు.

"మరుసటి రోజునే ఆమె వచ్చింది. 'నేనొక ప్రశ్న అడగ దలచాను, కోపం తెచ్చుకోకు నాయనా, మీరు పోలీసులనెందుకు చంపలేదు? మేము మా యిండ్లను, గుడిసెలను కోల్పోయాం. అవన్నీ తగలబడిపోయినాయి మాకు తిండిలేదు. మేము పోరాడాలని, శత్రువును నాశనంచేయాలని కోరుకుంటున్నాం. మీరు పోలీసులపై దాడిచేయకపోతే ప్రయోజనంలేదు మీరు పోలీసులను చంపబోతున్నారా? లేదా అనే నాప్రశ్నకు మీరిచ్చే జవాబువిని చనిపోవాలని వుంది' అని ఆమె అడిగింది. స్త్రీలంతా ఆమె కోర్కెను బలపరిచారు. 'మేము పోలీసులను తప్పక చంపితీరుతాం ఇందుకోసమే మేము మనబలగాలను కూడగట్టుతున్నాం. ఈప్రాంతం పంతాటినుంచి పోలీసులు లేకుండా తుడిచిపెట్టేట్టు చూస్తాం, మీరుకూడా మాతో కలవండి' అని మన ఆర్గనైజరు వివరించి చెప్పాడు.

"మరొక సందర్భంలో కొందరుస్త్రీలు మిలిటెంట్లను కలుసుకున్నారు. 'మీరు పూసలపాడు క్యాంపుపై దాడిచేయండి. లేకుంటే మా గ్రామానికి రావద్దు. కనీసం యిద్దరు హోంగార్డులనైనా చంపండి. పోలీసులు నలుగురైదుగురుగల బృందాలుగా తిరుగుతున్నప్పుడైనా మీరెందుకు దాడిచేయరు?' అని ఆ స్త్రీలు అడిగారు.

" 'ఒక ఆయుధం తీసుకుని పొండి. ఆ రామిరెడ్డిని చంపండి మీరు మరణించవలసివచ్చినా ఫర్వాలేదు సంఘం వర్ధిల్లుతూనే వుంటుంది. ప్రతి ఏటా మేము మీ ఉర్సు (ఉత్సవం) జరుపుకుంటూవుంటాం' అని మరొకసందర్భంలో మరొక లంబాడీ స్త్రీ అంది.

" 'పోలీసులను, క్యాంపులలో తలదాచుకుంటున్న పెద్ద పెద్ద భూస్వాములనూ చంపండి వాళ్ళను తుడిచిపెట్టకపోతే మా కడగండ్లకుఅంతం వుండదు' అని ప్రజలు పదేపదే డిమాండ్ చేస్తున్నారు "

## ఎట్టకేలకు మన పార్టీ రంగంలోకొచ్చింది

"మొత్తం తాలూకా అంతటినీ క్రొత్త వెల్లువ వూపివేస్తోంది ప్రజలు తమ దృఢ నిశ్చయాన్ని ప్రదర్శిస్తున్నారు తమ పంటలను కాపాడుకొనటానికి, శత్రువుల పంటలను స్వాధీనం జేసుకోటానికి, అలాంటి యితర సమరశీల చర్యలకు సన్నద్ధమవుతున్నారు. గెరిల్లా దాడులు ఉధృతమవటాన్నిగూర్చి తెలుసుకున్న తర్వాత 'ఇక మనకు భయంలేదు. మరల మన రాజ్యం వస్తోంది. శత్రువు అంతమయ్యేరోజు ఎంతో దూరానలేదు. అని ప్రజలు చెప్పుకోనారంభించారు. రామడుగు ప్రాంతంలో, శత్రువుపై గెరిల్లా దాడుల అనంతరం, 'ఎట్టకేలకు మనపార్టీ రంగంలో కొచ్చింది' అని ప్రజలు తరచు చెప్పుకొనజొచ్చారు. 'రండి, శత్రువును తుదముట్టించండి. అలా చేయకపోతే మా ఆడవాళ్ళ మంగళ సూత్రాలను త్రెంచివేస్తారు. మేము దుర్భర జీవితాలు గడపవలసివస్తుంది. మాకు కార్యక్రమం యివ్వండి, మా అంతట మేమే అమలు జరుపుతాం. మీరు మాకు మార్గదర్శకత్వం వహిస్తూ సహాయపడితే చాలు' అని ప్రజలు మాకు పదే పదే కబురంపుతుండేవారు. మనపార్టీ కార్యక్రమాన్ని స్వీకరించటానికి, పోరాటంలో తమవంతు పాత్రను నిర్వర్తించటానికి ప్రజలు సన్నద్ధంగా వున్నారనటానికి, వారు పార్టీ పిలుపుకోసం ఎదురు జూస్తున్నారనటానికి యిది స్పష్టమైన నిదర్శనం.

"దేవరకొండ ప్రాంతంలో, చెంచుప్రజలు మన కామ్రేడ్సును కొందరిని కలుసుకున్నారు. 'ఇదివరలో మీరు రెండుసార్లు మమ్మాదుకున్నారు. మా కోసం పనిచేసి మృతిజెందిన కామ్రేడ్ సీతారామయ్యను గోల్పోయారు ... ఇన్ని రోజులుగా మీరు కనిపించటం లేదు. ఎట్టకేలకు యిప్పుడు మరలా వచ్చారు" అని అన్నారు.

"పోలీసు దాడితో విసిగి వేసారిపోయి, గెరిల్లా దళాల రాక కోసం ఎదురుజూస్తున్న ప్రజలు, లంబాడీ రైతులు మన చర్యలనుగూర్చి గొప్ప కథలుగా చెబుతున్నారు మనపట్ల వారికిగల విశ్వాసాన్ని, వారికిగల అసంతృప్తినీ అవి వెల్లడిజేస్తున్నాయి. ఉదాహరణకు, అలాంటి కథలలో వొకటి చూడండి : "కమ్యూనిస్టు రాజు, దళాలన్నింటిని పిలిచి యిలా అన్నాడు "నెహ్రూ సైన్యాలొచ్చి ప్రజలపై అన్ని అత్యాచారాలు సాగిస్తుండగా మీరంతా కూర్చుని తింటున్నారు. మీరిప్పుడు వెళ్ళి, వాళ్ళ పనిపట్టండి. అంతకంటే మార్గాంతరం లేదు" అందువల్ల దళాలు యిప్పుడు మరల రంగంలో కొచ్చాయి" శత్రువు నంతంజేయాలని, వారెంతగా తహతహలాడుతున్నదీ దిగువ పేర్కొన్న అమాయకపు సూచనవల్ల విదితమవుతుంది. "పోలీసు క్యాంపులనుగూర్చి మేము మీకు సమాచారం అందిజేయడం – మీరు రావటం – ఈ చిన్న చిన్న క్యాంపులపై దాడులు చేయడం – ఇదంతా చాల కాలయాపనతోగూడిన పని. మీరు వెళ్ళి, హుజూర్‌నగర్ పట్టణంలోని క్యాంపుపైనే దాడిచేస్తే, ఈ చిన్న చిన్న క్యాంపులన్నీ, ఎలాంటి దాడులు చేయనవసరం లేకుండానే వాటంతటవే ఎగిరిపోతాయి".

"మరొక సంభాషణ యిలా సాగింది 'దళాలెక్కడికో చాలా దూరం వెళ్ళిపోయాయి. అందువల్ల యిప్పుడు దళచర్యలులేవు. పోలీసులను చంపేవారులేరు ; మన ప్రజలు మాత్రమే చస్తున్నారు' అని ఒకరన్నారు 'వర్షాలొచ్చి, పైర్లుబాగా పెరిగిన తర్వాత దళాలు తిరిగివస్తాయి' అని అతనికి ధైర్యం జెప్పటానికి మరొకరు ప్రయత్నిస్తున్నాడు.

" 'లెవీ సమస్యపై మేము పోరాడుతాం' అనేది సార్వత్రిక నినాదంగా రూపొందింది. 'మీరు పండించిన పంటను కాపాడుకోండి, తూటాలను ఎదుర్కోండి' ఇదీ మన కరపత్రంలో యివ్వబడిన నినాదం. ఈ నినాదం జనసామాన్యాన్ని బాగా ఆకర్షించింది. ఆ కరపత్రంలో సూచించబడిన పద్ధతుల్లో ప్రతిఘటించటానికి, ప్రజలు సన్నద్ధమవుతున్నారు. వారు ధాన్యాన్ని సురక్షిత ప్రాంతాలకు చేర్చుకుంటున్నారు. 'రోజుకు తలకు శేరుధాన్యం చొప్పునరైతుకు మిగిల్చి,మిగతాదంతా తీసుకపోతాం' అనేప్రభుత్వప్రకటనప్రజలందరితీవ్రవిద్వేషానికి గురైంది. 'మీరు ఆ నైజాం లంజాకొడుకు పద్ధతులన్నీ తిరిగి చేపట్టారు. మా ధాన్యాన్ని వదులుకోవటంకంటే చావనైనా చస్తాం' — అని చిల్కూరు ప్రజలు సమాధానమిచ్చారు. 'మేమేమి చేసినా, చేయకపోయినా, భూస్వాములు, సైన్యమూ రాత్రింబవళ్లు మమ్ములను కొడుతూనేవుంటారు. ఈవిధంగా, బాధలను మేమెంతకాలం సహించాలి ? ఏది ఏమైనాసరే, మేము శత్రువుఅంతు తేల్చవలసిందే ! వాళ్ళెంతమంది ప్రజలను చంపుతారో చూస్తాం.' అని కాపు

గల్లు ప్రజలన్నారు. ఆ విధంగా, మే మెక్కడి కెళ్లినా, అసంతృప్తి, ఆగ్రహం, ప్రతీకారం తీర్చుకోవాలన్న కాంక్ష ప్రస్ఫుటమవుతున్నాయి ప్రజలు, మన కార్యక్రమాన్ని అందుకొనటానికి సంసిద్ధంగా వున్నారని—ఇవన్నీ విదితం జేస్తు న్నాయి గెరిల్లా దళాల చర్యల అనంతరం, పోసులు నిర్బంధకాండ వెన్నాడు తుంది. ప్రజలు పాశవికమైన దాడులకు గురవుతున్నప్పటికీ, తమ శత్రువుల వినాశంపట్ల హర్షాన్ని వ్యక్తపరుస్తున్నారు "

నవంబరుదినోత్సవం

శాంతిదినోత్సవం

"మొత్తం ప్రాంతమంతటా, నవంబరు దినోత్సవమూ శాంతిదినోత్స వమూ సంయుక్తంగా నిర్వహించ బడినాయి. ఎర్రజెండాల ప్రతిష్ఠాపన, గ్రూపు సమావేశాలు, బహిరంగ సభలు, ప్రదర్శనలు సాధ్యమైనచోటనెల్లా జరప బడినాయి సోవియట్ యూనియన్ సాధించిన విజయాలనుగూర్చి ఈ సందర్భంగా ప్రచారం చేయటం జరిగింది. ప్రజలు ఆ ప్రచారాన్ని ఆసక్తితో స్వీకరించారు

"మిర్యాలగూడెం పట్టణంలోని అన్ని ముఖ్య కేంద్రాలలోను ఎర్రజెండాలు ప్రతిష్ఠించబడ్డాయి. పట్టణ పొలిమేరలలో, ఎత్తైన ఫ్యాక్టరీపైన ఎర్రజెండా ప్రతిష్ఠించబడింది. ఆ ఫ్యాక్టరీగేటు ధ్వంసం చేయబడింది. తెల్లవారు జామునే ఈ వార్తవిని, ప్రజలంతా అచ్చెరువొందారు. ఆ పట్టణం నడిబొడ్డునే నాలుగు వందలమంది గూర్ఖా సైనికులు మకాంబెట్టివుండగానే, ఈ కార్యక్రమం అమలు జరపబడినందున దానికి ప్రత్యేక ప్రాధాన్యతవుంది. గోడలమీద హెచ్చరిక పోస్టర్లుకూడా అంటించబడినాయి. శత్రువులు భయంతో కంపించి పోయారు. పట్టణం మధ్యభాగంలో అయితే మరింత సురక్షితంగా వుంటుందనే వుద్దేశ్యంతో పట్టణం పొలిమేరలనుండి మధ్యభాగంలోకి తరలిపో నారంభిం చారు. కొంతమంది జిల్లా కేంద్రమైన నల్లగొండపట్టణానికికూడా పారిపో యారు అక్కడేదో సురక్షితంగా వుంటుందన్నట్లు!

"హుజూర్ నగర్ పట్టణంలోకూడా, వాల్‌పోస్టర్లు అంటించబడి నాయి. సబ్‌యిన్‌స్పెక్టరు యింటిగోడలపైనే ఒక హెచ్చరిక పోస్టరు అంటించబడింది. అతడు జ్వరంతో మంచంబట్టి, యింటిలోనే వున్నాడని అంతా చెప్పుకున్నారు.

"ఈ వుత్సవాల సందర్భంగా, ప్రజలు ప్రదర్శించిన సమరశీల స్వభావం, ఆసక్తి ఎన్నదగినది.

## 1950 సంవత్సరాంతానికి, నల్గొండజిల్లా మైదాన ప్రాంతాలలో మిలటరీ కేంద్రం చుట్టూ నెలకొనివున్నపరిస్థితి

"వ్యవసాయ కార్మికులు, పేదరైతులు కార్యరంగానికి కదులుతున్నారనటానికి పల్లెలలో సూచనలు కనిపిస్తున్నాయి. పాలేర్లు పాత వేతనాల స్కేళ్ళను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు

"ఒక గ్రామంలో, ఇప్పర్తి నర్సిరెడ్డి అనే జమీందారువద్ద పనిజేసే పాలేర్లు, ఆ జమీందారు యింటి ఆవరణలో నోటీసు అంటించారు. 'ఇకమీదట పాలేర్లచేత రోజుకు 8 గంటలకంటె ఎక్కువ పని జేయించవద్దు. వేతనాలు సవ్యంగా చెల్లించు. లేకపోతే, కమ్యూనిస్టులే నీకు తగిన శాస్తి జేస్తారు. జాగ్రత్త' అని అందులో పేర్కొనబడింది. ఆ నోటీసు పనిజేసింది

"అదేవిధంగా, యితర గ్రామాల పాలేర్లుకూడా ఆదుర్దాతో కమ్యూనిస్టులకోసం ఎదురుజూస్తున్నారు. మొత్తంమీద, వారు గతంలోకంటే హెచ్చు వేతనాలు సాధించుకున్నారు. అయితే, అవి ఆనాటి జీవనవ్యయానికి తగినట్లుగా మాత్రం లేవు.

"కౌలుదార్లు, భూమిమీద తమ కౌలు హక్కును వదులుకొనటానికి నిరాకరిస్తున్నారు. కౌలుదార్లను తొలగించి, భూము లమ్మివేయటానికి జమీందార్లు ప్రయత్నిస్తున్నారు. అయితే, కౌలుదార్లు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. జమీందారుకు వ్యతిరేకంగా ధనికులు, మధ్యతరగతివారు, పేదలు అంతా ఏకమవుతున్నారు. దళాలలో చేరటానికి యువకులు ముందుకొస్తున్నారు. భూస్వాములను అంతంజేయాలన్న కాంక్షను వ్యక్తంజేస్తున్నారు.

"ఇదివరలో భూస్వాములు, కౌలుదార్లు పండించిన పంటలో సగభాగాన్ని స్వాహాజేసేవారు ఇప్పుడు, కాంగ్రెసు రాజ్యం వచ్చిన తర్వాత, వాళ్ళాపంటలో సగభాగాన్ని తీసుకుపోవడమేగాక, గతంలో పూర్తిగా కౌలుదారుకే దక్కుతూవుండిన గడ్డిలోకూడా సగభాగాన్ని తీసుకోనారంభించారు ఈవిధంగా దోపిడి అధికమయినందువల్ల యావన్మంది ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. దోపిడీ వ్యవస్థ భయంకర దారిద్ర్యం కాంగ్రెస్‌రాజ్యంలో అధికమవుతున్నాయి. ప్రజలు నిత్యజీవితంలో వాటిని చవిజూచారు. ఈ విషయంలో ధనికరైతు కూడా మినహాయింపుకాదు, ధనికరైతులు కూడా బాధలకు గురయ్యారు. దానితో ధనికరైతులుకూడా బాహాటంగా కాంగ్రెస్ రాజ్యంపట్ల అసంతృప్తి వెలిబుచ్చ నారంభించారు కాంగ్రెసు కౌలుదారీ చట్టం

యొక్క బూటక స్వభావాన్ని ప్రజలు గ్రహించారు. దానిపట్ల తమ ద్వేషాన్ని వెల్లడిస్తున్నారు. "ఇదిగో, రెలుదినేవాళ్ళు, బరెలుదినేవాళ్ళు కలసిచేస్తున్నపని" అనజొచ్చారు అంతిమ విజయం తమదేననేది ప్రజల దృఢవిశ్వాసం. ధనిక రైతులుకూడా, మనకు ఆశ్రయమివ్వ నారంభించారు. మొత్తంమీద పరిస్థితిని బట్టిజూస్తే, వ్యవసాయ కార్మిక పోరాటాల సందర్భంగా, ధనిక రైతులు తటస్థంగా వుంటారేగాని, పోరాటానికి వ్యతిరేకంగా నిలవబోరనేది స్పష్టమవుతోంది.

"ప్రజలపై అత్యంత క్రూరమైన నిర్బంధకాండ ప్రయోగించబడింది. ఆ ప్రాంతం యావత్తూ మిలటరీ, పోలీసు క్యాంపుల మయమైపోయింది. ఉద్యమమూ, నిర్మాణమూ తీవ్రంగా దెబ్బతిన్నాయి ప్రజలతో సంబంధాలు తెగిపోయాయి. అలాంటి సమయంలో మైదానప్రాంతాలలో మరల కార్య కలాపాలు ప్రారంభమయినాయి.

"చాలాకాలం గడిచినతర్వాత, ప్రజలు మరింత రాటుదేరి, మరింత దృఢనిశ్చయంతో, మరింత పరిపక్వతతో నిలదొక్కుకొంటున్నారు. గెరిల్లా కార్యకలాపాలు నిబ్బరంగా, నమ్మకంగా మరల సాగుతున్నాయి మిలటరీపైన, పోలీసులపైన చురకలు తగిలిస్తూనేవున్నారు. దాడులు చేస్తూనేవున్నారు. వాళ్ళను ముప్పతిప్పలు బెడుతూనేవున్నారు దానితో వాళ్ళకు కంపరమెత్తి పోతోంది ఇచ్చటి భూస్వాములు ఆందోళన చెందుతున్నారు. వాళ్ళకు రాత్రిళ్ళు నిద్రలు లేవు

"చిత్తలూరు గ్రామంతో సంబంధాలు పునరుద్ధరించబడిన వెంటనే ప్రజలు జమీందారు భూములలో ప్రవేశించారు. మూడుపుట్ల సజ్జలు స్వాధీనం జేసుకున్నారు. భూస్వాముల భూములను, ప్రభుత్వ భూములను తిరిగి స్వాధీనం జేసుకున్నారు.

"నక్రేకల్లు పరిసరాలలోగల ఇరవై గ్రామాలతో సంబంధాలు తిరిగి నెలకొన్నాయి చిత్తలూరు, నక్రేకల్లు మొదలైనవి బలమైన స్థావరాలు. వెనకడుగు వేయటానికిముందు అచ్చట వుద్యమం అత్యున్నతస్థాయికి చేరుకుంది.

"కామ్రేడ్స్; దళాలు ఎప్పుడు తిరిగివస్తారా అని ప్రజలు ఆదుర్దాతో ఎదురుజూస్తున్నారు. ముందుగా భూస్వాముల నంతంజేయాలని, పార ద్రోలాలని సూచించింది, కాంక్షించింది ప్రజలే. భూస్వామి బ్రతికున్నంత వరకు పరిస్థితులు బాగుపడవని వారు భయపడ్డారు. అందుకే వారలాకోరారు. మిలటరీ అంటే తమకు భయంలేదని వారు చెప్పారు. మిలటరీతో ఏలాగో వేగవచ్చునని, వాళ్ళతో, దాగుడుమూత లాడవచ్చుననీ వారు విశ్వాసంతో

వున్నారు. భూస్వామివిమాత్రం అంతంజేయాలని, తమకు నాయకత్వం వహించ టానికి, మార్గదర్శకులుగా వుండటానికి పార్టీ కార్యకర్తలు తమతో వుందాలని మాత్రమే వారు కోరుతున్నారు మేము పార్టీ కామ్రేడ్స్‌ను కాపాడుకోగలం. ఒక్కరంటే ఒక్కరుచాలు. మాతో ఒక్క కామ్రేడ్ తోడుగా వుంటేచాలు, మిగతా వ్యవహారం మేము చూసుకుంటాం రాత్రి వేళల్లో మేమే దాడులు సాగిస్తాం' అని వారు పరిపూర్ణమైన విశ్వాసంతో వాగ్దానం జేశారు. ఎత్తుగడల విషయంలో కూడా, వుపయోగకరమైన సూచనలు చేస్తున్నారు.

"ఆ విధంగా మైదాన ప్రాంతాల పరిస్థితి మారుతూవుంది. ఏకాకులంగా వున్న దుర్దినాలంతరిస్తున్నాయి ప్రజలు, మరల నిలదొక్కుకుంటున్నారు."

## అమరాబాద్ ప్రాంతం - కృష్ణానదీ సరిహద్దు ప్రాంతంలో వుద్యమ విస్తరణ

1950 జనవరి నెల చివరినాటికి, ఉద్యమ విస్తరణ గావించటంకోసం, అమరాబాదు అడవి ప్రాంతానికి ఒక గెరిల్లా దళాన్ని, రెండు రాజకీయ దళాలనూ పంపటం జరిగింది జూన్ నెలాఖరుకల్లా, ఈ దళాలు వుద్యమాన్ని వ్యాప్తి గావించాయి. మొత్తం అమరాబాదు ప్రాంతాన్ని, మహబూబ్‌నగర్‌జిల్లా, కొల్లాపురం తాలూకాలోని మన పాత వుద్యమంతో కలిపారు అంటే వందమైళ్ల దూరంవరకూ వుద్యమాన్ని విస్తరించారు

మహబూబ్‌నగర్ జిల్లాలోని అమరాబాద్, నల్లగొండ జిల్లాలోని దేవరకొండకు అనుకునియున్న తాలూకా. రజాకార్-నైజాం పాలనాకాలంలో గెరిల్లా దళాలు, దేవరకొండ అడవులలోకి చొచ్చుకు పోవటానికి ప్రయత్నించాయి. అమరాబాద్ గ్రామాలకు వెళ్ళాయికూడా. కాని, భారతసైన్యం ప్రవేశించిన,వెంటనేపార్టీ తనఉత్తమ కార్యకర్తలు, దళ నాయకులునగు కామ్రేడ్సు సీతారామయ్యను, అల్వాల నరసింహారెడ్డిని కోల్పోయింది "సాయుధపోరాటం వద్దు" అనే పంథా చేపట్టిన మీదట ఈ వుద్యమాన్ని, ఈ ప్రధానమైన అడవి ప్రాంతానికి విస్తరించటానికి ప్రయత్నాలు జరగలేదు అయినా తెలంగాణా పోరాటంయొక్క ప్రభావం వల్లను, పార్టీ అంతకుముందు చేసిన ప్రయత్నాల కారణంగానూ, ప్రజలు మన రాకకోసం, దోపిడీదార్లకు వ్యతిరేకంగా విజృంభించటంకోసం ఆదుర్దాతో ఎదురుచూస్తున్నారు. కామ్రేడ్ అల్వాల నరసింహారెడ్డి తమకోసం ప్రాణాలర్పించిన వీరుడుగా వారి హృదయాలలో చోటుజేసుకున్నాడు. ప్రతి గ్రామంలోనూ, ప్రజలు ఆయనను గురించి ముందు చెప్పుకున్న తర్వాతగాని, తమ కడగండ్లనుగూర్చి పేర్కొనే వారుకాదు.

1950 జనవరి ప్రారంభంలో, మిర్యాలగూడెం మండలానికి జెందిన దళాలు, దేవరకొండ గ్రామాలలోకి చొచ్చుకుపోయాయి నేరెడగొమ్మ భూస్వాముల ధాన్యాన్ని పంపిణీజేశాయి. చితిరాల, ఏకారం గ్రామాలలో ప్రజా పీడకుల నిరువురను చంపివేశారు. ఇప్పలపల్లి, ఉడిమిళ్ళ గ్రామాలలో వ్యవసాయ కార్మిక సమ్మెలను జయప్రదంగా నడిపారు. ఆ తర్వాత, ఈ దళాలు వెనకకు వెళ్ళిపోయాయి దళాలు, ఆర్గనైజర్లు లేకపోవటాన్ని ఆసరాగా దీసుకుని, భూస్వాములు ఈ గ్రామాలలో 65 మందిని అరెస్టుచేయించారు.

1950 జనవరి చివరలో మన దళాలు ప్రవేశించాయి. మారేడు, మెద్దిమడుగు, లక్ష్మాపురం, తపలాపురం, మాదినేని పల్లి, లింగదోనిపల్లి ఉప్పునూతల గ్రామాలలో వూరేగింపులు, సభలుజరిపాం. ఈ గ్రామాల భూస్వాములకుజెందిన ఆహార ధాన్యాలను పంపిణీ జేశాం. ప్రజలను పీడిస్తున్న ఇద్దరు గార్డులను చంపివేశాం. ఇప్పలపల్లి, ఉడిమళ్ళ గ్రామాలలో వ్యవసాయ కార్మికులు తమంతతామే చొరవతో నిలదొక్కుకుని, రోజుకు అంతకుముందు యిచ్చే రెండు శేర్ల వేతనానికి బదులు, రోజుకు ఎనిమిదిశేర్ల ధాన్యాన్ని వేతనంగా సాధించుకున్నారు.

దళాలు తమ కార్యకలాపాలు ప్రారంభించిన చోటికి, యాభైమైళ్ళ దూరంలోవున్న గ్రామాలనుండి సయితం భూస్వాములు ఖాళీజేసిపోయి, పట్టణాలలో పోలీసు, మిలటరీ క్యాంపులవద్ద ఆశ్రయం పొందారు.

శత్రువు భయకంపితుడైనాడు. అరణ్య ప్రాంతంలో పార్టీ వేరూను కొని పాతుకుపోకుండా అరికట్టాలనుకున్నాడు. అడవిలోగల ప్రధాన గ్రామాలు దాదాపు అన్నింటిలోనూ తన క్యాంపు లేర్పాటు జేసుకున్నాడు. మిలటరీ దాడులు వుధృతంగా సాగించ నారంభించాడు. బీభత్సానికి గురి జేయటంకోసం ప్రజలు దళాలలో చేరకుండాను, దళాలకు తోడ్పడకుండాను చేయటంకోసం ప్రజలపై విచక్షణా రహితంగా కాల్పులు జరపనారంభించారు. పోలీసులు, సైన్యమూ విల్లాపురంలో ఒకరిని, అయినోలులో యిద్దరిని, బొమ్మన పల్లిలో యిద్దరిని, చింతకుంటలో ముగ్గురిని, మన్ననూరులో యిద్దరిని, గంగిరెడ్డి పల్లిలో ఇద్దరిని, బొగ్గులదోనెలో ఒకరిని, రంగాపురంలో యిద్దరిని, మద్ది పల్లిలో ఎనిమిది మందిని మొత్తం 23 మందిని కాల్చిచంపారు. వెనుక ఎప్పుడో ఒకసారి గెరిల్లాలకు భోజనం తీసుకెళ్ళాడని, ఉప్పుపల్లిలో ఒక రజకుడిని కాల్చి చంపారు. రేగులపురంలో, పోలీసులు చెంచులను తమ క్యాంపుకు రావలసిందిగా కబురంపారు. ఏదో దుర్మార్గం జరుగుతుందని పసికట్టి, వారు తమ ప్రతినిధులుగా ఇద్దరిని మాత్రమే పంపారు. దళాలజాడ చెప్పవలసిందిగా కోరుతూ వాళ్ళిద్దరిలో ఒకరిని చిత్రహింసలకు గురిజేశారు. అయినా లొంగ

లేదు. దానితో కాల్చిచంపారు రెండవవ్యక్తిని చెట్టుకానించినిలబెట్టి, తుపాకిని ఎక్కుబెట్టారు నెళ్ళిపోయి కమ్యూనిస్టుల జాడతెలుసుకొని చెప్పవలసిందిగా హెచ్చరించి వదిలివేశారు ఆయన సరాసరివచ్చి, దళంలో చేరాడు.

ఈ పాశవిక హత్యలతో, ప్రజలు గయవిహ్వాలులైనారు. కాని అదే సమయంలో పోలీసులపట్ల, మిలటరీపట్ల వారి ద్వేషం అధిక మయింది. వారి భయంకంటె, ద్వేషానిదే పైచేయి అయింది. పోలీసులపై దాడిజేసి, కాల్చిచంపవలసిందిగా వారు దళాలను వదే పదే కోరారు పోలీసుల కోసం మాటుగాయటానికి అత్యంత అనువైన స్థలాలను కనుగొనటంలో వారుతోడ్పడ్డారు.

శత్రు నిర్బంధంవల్ల, రాత్రి కాపలాగాస్తున్న ప్రజలు గెరిల్లాలు వాళ్ళను సమీపించినంతనే సహాయం చేసేవారు చింతకుంట్ల పోలీసు క్యాంపు మీద దాడిచేయటానికి గెరిల్లా దళాలను తీసుకుపోయింది, రాత్రి గస్తీ తిరుగు తున్న వాళ్లే. నాలుగువేల ఎకరాల భూమిగల మేడేపల్లి భూస్వామి రాజిరెడ్డి ఏజెంటగు మేడేపల్లి పటేల్ రాత్రి కాపలాదారులమధ్య నిద్రిస్తుండగా ప్రజలే చూపించారు అతనిని అక్కడికక్కడే కాల్చిచంపవలసిందిగా ప్రజలు కోరారు. దళం వారి కోర్కెను అంగీకరించి అతనిని కాల్చివేసింది.

అతి మంచివైన భూములు వందలాది ఎకరాలను కొన్ని సందర్భాలలో వేలాది ఎకరాలను కలిగివుంటూ, భూస్వాములు భూములపై గుత్తాధిపత్యం వహిస్తున్నారు. వారు వ్యవసాయ కార్మికులకు చెల్లించే వేతనాలు రోజుకు శేరున్నర–రెండుశేర్ల జొన్నలకు మించిలేవు. పాలేర్లకు, భూస్వాముల యిండ్లవద్దనే తిండిబెట్టి, సంవత్సరానికి కేవలం యాభైరూపాయలు మాత్రం యిస్తుండేవారు. ఆ యాభైరూపాయలతోనే వారు తమ భార్యా, బిడ్డలను తమపై ఆధారపడియున్న యితరులను పోషించుకోవలసి వుంటుంది వడ్డీ వ్యాపారం విచ్చలవిడిగా సాగుతోంది. దానితో వ్యవసాయ కార్మికులు, భూస్వాములకు శాశ్వతంగా బానిసలుగా వుండిపోవలసి వస్తున్నది ఈ ఫారెస్టు ప్రాంతాలలో–భూస్వాములకు ఆవులు, ఎద్దులు మందలు మందలుగా వుండేవి అరవైనుండి, వందవరకు పశువులుగల మందను కాసినందుకుగాను, పశుల కాపరులకు ఏడాదికి మూడువందలశేర్ల జొన్నలుగాని, యాభైరూపాయలు గాని చెల్లించేవారు. 60 నుండి వందవరకుగల ఈ మందలనుండి, భూస్వామి ఏటేటా పదిహేనువందల రూపాయల పశువులను అమ్ముకుంటుగావుం డేవాడు. ఈ ప్రాంతాలలో ప్రజలు ఈ విధమైన దుర్భర పరిస్థితి ననుభవిస్తున్నారు.

1951 మార్చి 10 వ తేదీన కొన్నాగులలో ధాన్యం పంపిణీ చేయ బడింది. ఆహార పరిస్థితి అధ్వాన్నంగావుంది. రూపాయికి శేరున్నర సజ్జలు లేదా జొన్నలిస్తున్నారు. చెంచుజాతిప్రజలు తమ ఆకలి తీర్చుకొనటంకోసం చింతపండు, బూడిద కలుపుకొని త్రాగుతుండేవారు. గ్రామంలోని భూస్వాములకుజెందిన నూటఏనభైబస్తాల ధాన్యాన్ని స్వాధీనం జేసుకొని వెయ్యిమంది చెంచులకు పంచారు. అప్పు పత్రాలన్నింటిని తగులబెట్టివేశారు. మరుసటి రోజునే 80 మంది పోలీసులు లారీలలోవచ్చి గ్రామంపై దాడిజేశారు రైతుల ధాన్యాన్ని బలవంతాన గుంజుకోవటానికి ప్రయత్నించారు. అయితే స్త్రీలు, పురుషులు ఆ ప్రయత్నాన్ని ప్రతిఘటించారు. పోలీసులు లారీలతో వారిని తీవ్రంగా కొట్టారు పోలీసుపశువులు, పురుషుల తలలపైన, స్త్రీల రొమ్ములపైన గురిజూచికొట్టారు అయినా ప్రజలు జంకలేదు అతి కష్టంమీద పోలీసులు పాతికబస్తాలధాన్యంమాత్రం స్వాధీనంచేసుకోగలిగారు. ఈ ప్రతిఘటనను గూర్చి ఆ ప్రాంతమంతటా ఘనంగా చెప్పుకున్నారు.

కొలదిరోజుల అనంతరం గెరిల్లాలు కొన్నాగుల పోలీసుక్యాంపుపై ప్రతీకారం తీర్చుకున్నారు పోలీసులను క్యాంపునుండి కదలటానికి వీలులేకుండా చేశారు. ఈలోగా ఆదాడిలో పోలీసులకు తోడ్పడిన భూస్వాముల ఆస్తులను ధ్వంసం జేశారు.

— మాదినేనిపల్లి, వంపరోనిపల్లి : ఏడు బర్మార్లు, రెండు షాట్ గను స్వాధీనం చేసుకొన్నారు హోంగార్డులు చెదిరిపోయేట్లు చేశారు. ఇది 1950 సెప్టెంబరు – అక్టోబరు మాసాలలో జరిగింది

— నవంబరు, డిసెంబరునెలల్లో బొమ్మనపల్లి, లక్ష్మీపురములపై దాడిజరిగింది. హోంగార్డులసంస్థ రద్దుజేయబడింది. ఏడు బర్మార్లు స్వాధీనం జేసుకోబడినాయి.

— ఇది జరిగిన తర్వాత, హోంగార్డుల దగ్గరగల ఆయుధాలన్నింటినీ పోలీసులు తీసుకుపోయారు.

— నాలుగువందల ఎకరాలకుపైగా భూమిగలిగిన భూస్వాముల ఆధిక్యతగల బలుమూరు గ్రామంపై దళం దాడిజేసింది. ఒక షాట్‌గన్, మూడు బర్మార్లు స్వాధీనమయినాయి. షాట్‌గన్లు, భర్మార్లుగల మరో ఆరుగురు భూస్వాములు తప్పించుకుపోయారు. వాళ్ళ యిళ్ళను దళం ధ్వంసంజేసింది. రాత్రి కాపలా కాయవలసిందిగా ప్రజలను నిర్బంధించవలదని, రోజుకూలి

కనీసం నాలుగుశేర్ల జొన్నలుగాని, సజ్జలుగాని చెల్లించవలసిందిగాను దళం భూస్వాములను హెచ్చరించింది. 1951 మార్చి 21 న మూడువందలమంది చెంచుజాతి ప్రజలుమూడువందల బస్తాలధాన్యం స్వాధీనం జేసుకున్నారు

— అచ్చంపేట లేక అమరాబాద్ తాలూకాకు జెందిన తిరుమలాపురం: 1951 మార్చి 9 వ తేదీన హెూంగార్డు, పోలీసు క్యాంపుపై గెరిల్లాలు దాడిజేశారు. సెంట్రీపైకాల్పులు జరిపి గాయపరిచారు హెూంగార్డు నాయకులకు జెందిన గడ్డివాములను, ఆస్థులను తగులబెట్టారు గెరిల్లాలనెదుర్కొనటానికి పోలీసులు సాహసించలేదు. గెరిల్లాలు పునసంహరించుకున్న తర్వాత అరగంటకే, కాల్పులు ప్రారంభించారు. కాల్పులు చాలాసేపు సాగించారు.

ఈ ప్రాంతంలోనే గెరిల్లా దళాలు, కొత్తపల్లి పోలీసుస్టేషన్‌పై జయప్రదంగా దాడిజేసి రైఫిళ్ళు, మందుగుండు సామాగ్రి స్వాధీనం జేసుకుని, తెలంగాణా గెరిల్లా దళాలు, కృష్ణానదికి దక్షిణాన గుంటూరు, కర్నూలు జిల్లాలలోని ప్రజలతోనూ, పార్టీతోనూ సంబంధాలేర్పరచుకొన్నారు. నల్లమల అడవిప్రాంతమంతటినీ తమ స్థావరంగా జేసుకున్నారు

ఈ ప్రాంతాలన్నింటిలోనూ, తెలంగాణా ప్రజల సాయుధపోరాటం ప్రభావం ఎంతగానో వుంది. 1950 వరకూ, గెరిల్లా దళాలూ, అర్గనైజర్లూ ఈ ప్రాంతాలకు చేరకపోయినప్పటికీ, భూస్వాములు, పటేళ్ళు, పట్వారీలు ప్రజల విజృంభణనుగాంచి భయకంపితులైనారు. తమ పీడనను తగ్గించారు. నల్గొండ, వరంగల్లులలోవలె వెట్టిచాకిరి చేయించుకోవటానికి స్వస్తి చెప్పార్హు.

సంఘం తమదని, అది తమకోసం పోరాడుతున్నదని ప్రజలు గుర్తించారు. దళాల రాకకోసం వారు ఆదుర్దాతో ఎదురు జూస్తున్నారు. అందువల్ల, దళాలొచ్చినప్పుడు వారికి ఆప్యాయతతో సమధికోత్సాహంతో ఆనందంతో స్వాగతం చేప్పేవారు.

గెరిల్లాల కెదురైన సమస్యలలోకెల్లా పెద్దవి, 'తగినంత మందుగుండు సామగ్రి లేకపోవటం' మిలిటెంట్ల విజ్ఞానం పెంపొందించటం, ఈ ప్రజావెల్లువ కంతటికీ నాయకత్వం వహించటానికిగాను బలమైన పార్టీ నిర్మాణాన్ని పెంపొందించటమూను.

ప్రజలు కదిలారు, రంగంలోకొచ్చారు. ప్రభుత్వానికి, పోలీసు అధికారులకు ఈ విషయం తెలుసు "పోలీసులు తిరిగి వెళ్లిపోయిన మరుక్షణం లోనే ఈ గ్రామాన్ని సంఘమే పాలిస్తుంది" అనజొచ్చారు.

కర్నూలుజిల్లా

ఉద్యమాన్ని విస్తరించటంకోసం 1950 డిసెంబరులో దళాలు కర్నూలుజిల్లాకు పంపబడినాయి. వారు ఆ ప్రాంతంలోని ఫారెస్టు గార్డులపైన, హోంగార్డులపైన దాడులు జేశారు. సిద్దేశ్వరం గ్రామంలో హోంగార్డుల నుండి, భూస్వాములనుండి ఏడు షాట్‌గన్లను, నాలుగు బర్మార్లను స్వాధీనం చేసుకున్నారు శివపురం, కొత్తపల్లి, ఇంద్రేశ్వరం, గువ్వలకుంటవద్ద ఫారెస్టు గార్డులపై దాడులలో మరో ఐదు షాట్‌గన్లు హస్తగతమైనాయి ప్రజా పీడకుడుగా పేరుమోసిన ఫారెస్టుగార్డు నొకరిని చంపివేశారు. ఇతరులను అడవి నుండి తరిమివేశారు లంచాలివ్వవలసిన అవసరంలేకుండా, ఫారెస్టు అధికారుల బీభత్సకాండకు గురిగాకుండా అటవీ సంపదలను అనుభవించే స్వేచ్ఛ ప్రజలకు లభించింది. ప్రజలు తమంతతామే రుద్రకోడు, అప్పిరాజుకుంటలలో ఫారెస్టు ఆఫీసులపై దాడిచేసి తగులబెట్టారు తమకు దళాలు తటస్థపడినప్పుడెల్లా వారికి తమ కడగండ్లనుగూర్చి చెప్పుకోవటం, వారిసలహాను వినటం, నూతనోత్సాహంతో, దీక్షతో తిరిగి వెళ్ళడం జరుగుతూవుండేది.

ఆహార పరిస్థితి అతి అధ్వాన్నంగావుంది. గెరిల్లా ఉద్యమం వ్యాప్తి గాంచుతుందన్న భయంతో ప్రభుత్వం ఆ ప్రాంతాన్ని ధాన్యం లెవీనుండి మినహాయించింది. అయితే భూమిమీద, ధాన్యంమీద గుత్తాధిపత్యంగల భూస్వాములు బియ్యంధర శేరు రూపాయికి పెంచారు "మీరు పొయ్యిక్రిందికి యేర్పాటుజేశారు పొయ్యిమీదికికూడా యేర్పాటు చెయ్యండి" అని ప్రజలు పార్టీని అడుగజొచ్చారు.

ప్రజల దుర్భరస్థితినీ, ఆకాంక్షనుగాంచి దళాలు ధాన్యం పంపిణీని చేపట్టాయి కొత్తపల్లిగ్రామంలో, పడిగల సుబ్బయ్య అనే భూస్వామికి జెందిన రెండువందల బస్తాలు, మరొక వ్యాపారస్తునికి జెందిన యాభైబస్తాలు వడ్లు పంచబడినాయి. ప్రజలపై పోలీసుదాడులు, ప్రజలను కొట్టటం కొనసాగాయి. అయినా ప్రజలు వాటిని లెక్కజేయలేదు. "వాళ్ళు కొలదిమందిని కొట్టారు. కొలది దినాలపాటు జైలులో పెట్టారు. అయితేనేం మాకు తిండి లభించింది. అందువల్ల, భూస్వాముల ధాన్యాన్ని పంపిణీ చేయండి" అనేదే సర్వత్రా వినిపించసాగింది

ప్రభుత్వం, ముగ్గురు వ్యక్తులను అరెస్టుజేసి తీసుకొచ్చి, కమ్యూనిస్టులని చెప్పి ఇంద్రేశ్వరంలో కాల్చిచంపింది. వాళ్ళు ఘర్షణలో మరణించారని ప్రకటించింది. మృతదేహాలతోపాటు మూడు బర్మార్లుకూడా పెట్టారు. కమ్యూనిస్టులను బలపరచేట్లయితే, తమ పని అంతే అవుతుందని భయపెట్టటంకోసం,

ఆ మృతదేహాలను చూడటంకోసం పరిసర గ్రామాలనుండి అసంఖ్యాకంగా ప్రజలను తీసుకొచ్చారు. వారిలో యిరువురు సామాన్యులైన చెంచువారు. మరొకరు మరేదో జిల్లాకు జెందిన రాజకీయ ఖైదీ ప్రజలు దీనితో కంపించి పోలేదు. వారు ప్రభుత్వాన్ని మరింత ద్వేషించనారంభించారు.

## వికారాబాద్ ప్రాంతం

ఈ ప్రాంతం ప్రస్తుత హైదరాబాదుజిల్లాలోని పశ్చిమ తాలూకాలగు వికారాబాదు, తాండూరు తదితర తాలూకాలలోగూడినట్టిది అది కర్ణాటక ప్రాంతానికి ఆనుకొనివుంది. ఉద్యమమూ, సంబంధాలూ దాదాపు మూడు వందల చదరపుమైళ్ళ ప్రాంతానికి విస్తరించాయి అది హైదరాబాదు నగరానికి పశ్చిమాన 50 మైళ్ళ దూరానవుంది. 1950 సంవత్సరాంతానికి మాత్రమే ఉద్యమం ఈ ప్రాంతానికి విస్తరించింది.

కొత్తప్రాంతాలన్నింటివలెనే ఇచ్చటికి పంపబడిన గెరిల్లా దళాలు కూడా లెవీ ధాన్యం సేకరణకు వ్యతిరేకంగా, ప్రభుత్వానికి పన్నులు చెల్లించ టానికి వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభించాయి. ప్రభుత్వ పన్ను లేవీ వసూలు చేయవలదని దళాలు గ్రామపటేళ్ళను, పట్వారీలనూ హెచ్చరించాయి. రైతుల పొలాలలోని చెట్లనుండి, తోపులనుండి వివిధరకాల ఫలసాయాన్ని ప్రభుత్వా నికిగాని, భూస్వాములకుగాని ఏమీ చెల్లించనవసరంలేకుండానే రైతులే ఉచి తంగా అనుభవించాలి. వ్యవసాయ కార్మికులకు రోజు కూలిరేటు నాలుగు శేర్లుండాలి. పాలేర్లకు నెలకు నలభైశేర్లకు బదులుగా ఎనభైశేర్లు చెల్లించాలి అని స్పష్టం జేశాయి. నిజంగా పనిజేసింది, పంట పండించింది రైతులేగనుక భూమి, భూమిమీద పంట రైతులకే చెందుతుందనీ, అందువల్ల కౌలుదారైన రైతులు బడాభూస్వాములకు, జమీందార్లకు ఏ విధమైన కౌలు చెల్లించనవ సరంలేదనీ ప్రచారం చేశాయి. భూస్వాముల అన్యాక్రాంతాలను స్వాధీనం జేసుకోవాలని, వడ్డీమీద వడ్డీపెంచి నిలవదేల్చిన అప్పులను చెల్లించనవసరం లేదనీ ఆందోళన సాగించాయి. "మీరు చెప్పేదంతా బాగానేవుంది. మేము మీరు చెప్పినట్లుచేస్తే భూస్వాములు, పోలీసులు మమ్ములను చంపుతారు" అని రైతులు, వ్యవసాయ కార్మికులు చెప్పారు. వారందరినీ కలసికట్టుగా నిలిచి పోరాడవలసిందిగా, అలా చేసేట్లయితే వాళ్ళదాడిని తిప్పికొట్టటం సాధ్యమవు తుందని దళాలు వారికి చెప్పాయి.

దళాలక్కడ వుండటంవల్లను, ఆందోళన ఫలితంగాను, కొన్ని సాయుధ చర్యల కారణంగానూ పటేళ్ళు, పట్వారీలు పన్నులు, లెవీ వసూలు జేయటం నిలిపివేశారు. కౌళ్ళుగాని, అప్పులుగాని, వసూలు జేయటంకోసం

భూస్వాములు, వాళ్ళ గుమస్తాలు, సేవకులూ గ్రామాలకు రావటం మాని వేశారు. వెట్టిచాకిరి, అక్రమ నిర్బంధ వసూళ్ళుకూడా ఆగిపోయాయి. పోలీసు క్యాంపులు ఏర్పాటు జేయబడివున్న గ్రామాలలోను, వాటికి సమీపానగల గ్రామాలలో మాత్రమే ఈ పాత అలవాట్లు కొనసాగాయి. అచ్చటకూడా మరింత తగ్గుదలయిలోనే జరిగాయి. వ్యవసాయ కార్మికుల వేతనాలు, నెలకు రు 20 నుండి, రు 25 వరకు పెరిగాయి. పేదరైతులు, తమ పశువులకు ప్రభుత్వ పచ్చిక బయళ్ళలో వుచితంగా మేపుకోజొచ్చారు "పశువుల కడుపునిండింది. మామాటేమిటి ? "అని ప్రజలు అడగనారంభించారు.

భూస్వాములు పోలీసులను తీసుకొచ్చి గ్రామాలపై బీభత్సకాండ ప్రారంభించారు. అయ్యవారిగూడెం సమీపంలో చింతపల్లి రామచంద్రారెడ్డి, పోలీసులు ఒక కుమ్మరిని కాల్చి చంపారు. చింతపల్లికి జెందిన హరిజన ఎల్లయ్యను, చిల్లాపురానికి జెందిన హరిజన లాలయ్యను, ఎల్లోరితండాలో యిద్దరు రైతులను, తాటిపర్తిలో ఒక పశుల కాపరిని, వికారాబాద్‌లో యిద్దరు యువకులను పోలీసులు కాల్చి చంపారు. వికారాబాద్ ప్రాంతంలోని తిరుమలపేట, మల్లాపురం, తూమపర్తిపల్లె గ్రామాలపై పోలీసులు పెద్ద ఎత్తున దాడి చేశారు. రెండువందల మందికి పైగా ప్రజలను కొట్టారు ఇరవైమందికి పైగా స్త్రీలను చెరిచారు క్రూరంగా చెరచబడినందున ఆరుగురు స్త్రీలుమృతిజెందారు.

ఈ దాడులకు కారకులైన భూస్వాములలో, వారి ఏజెంట్లలో కొందరికి దళం సహాయంతో ప్రజలు దేహశుద్ధిజేశారు. కొన్ని గ్రామాలలో వారు గ్రామాధికార్ల రికార్డులను ధ్వంసం జేశారు. చించోలి తాలూకాలో దళాలు పోలీసు వార్తాహరులను దారిగాచి వాళ్ళ టపాను స్వాధీనం చేసుకున్నాయి. బీదర్ తాలూకా సరిహద్దు గ్రామాలలో వారు హెూంగార్డులనుండి తుపాకులను స్వాధీనం చేసుకున్నారుకూడా. లక్ష్మణ్‌సాగరం, వొంటూరం సామనకుర్తి, నాస్కల్లు గ్రామాలలో అవుట్ పోస్టులపైన చిట్టంపల్లి, మినార్‌పల్లి మల్కాపురం గ్రామాలలో భూస్వాముల యిండ్లపైన; రుక్మాపురంలో రైల్వే స్టేషనుపైన దాడిజేశారు. రికార్డులు ధ్వంసం జేశారు.

కోస్తా ఆంధ్ర ప్రాంతంలోని తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా తొర్రూరు గ్రామానికి జెందిన విద్యావంతుడైన యువ కార్యకర్త కామ్రేడ్ టి. లక్ష్మణమూర్తిని పోలీసులు పట్టుకుని, చిత్రహింసలు పాలు జేసి, సరిగ్గా వుద్యమాన్ని వుపసంహరించిన రోజునే కాల్చిచంపారు. అచ్చట పనిచేస్తూ, వుద్యమానికి తోడ్పడంకోసం ఆ కామ్రేడ్‌ను పార్టీ పంపించింది.

## 1951 అక్టోబరులో తెలంగాణా పోరాటాన్ని ఉపసంహరించిన నాటిపరిస్థితి

సాయుధ పోరాటాన్ని వుపసంహరించే సమయంలో, 1951 నవంబరు ఆఖరులో జరిగిన అమరాబాద్ ప్రాంత పార్టీ కార్యకర్తల సభలో, ఆ దశ అంతటిలోనూ వుద్యమ పరిస్థితిని పర్యాలోకిస్తూ, ఆనాటి పరిస్థితిని వివరిస్తూ దిగువ విధంగా చెప్పబడింది :

హుజూర్‌నగర్, మిర్యాలగూడెం, దేవరకొండ తాలూకాలతోగూడిన ఈ ప్రాంతంలో, దళాలలో రెండువందలమంది పూర్తికాలం పనిజేసే కార్యకర్తలు, 540 మంది మిలిటెంట్లూ వున్నారు మూడువందల గ్రామాలతో నిత్య సంబంధాలు సాగుతున్నాయి. మరో మూడువందల గ్రామాలకు దళాలు వస్తూ పోతూ వుండేవి. ఆ దశలో వంద అయుధాలు స్వాధీనం చేసుకోబడ్డాయి. ఆ తర్వాత వుద్యమం, అమరాబాదు అడవినుండి మహబూబ్‌నగర్‌వరకూ కృష్ణానదీతీరం పొడవునా వ్యాప్తిగాంచింది. దళాలు, ఫారెస్టు గార్డులను తరిమివేశాయి చెంచు జాతివాళ్ళు అటవీ సంపదను స్వేచ్ఛగా వుపయోగించుకోగలుగుతున్నారు పీడన, నిర్బంధచాకిరి అంతరించాయి పరిసర గ్రామాలలోగల భూస్వాముల ధాన్యాన్ని వారు స్వాధీనం చేసుకున్నారు. పోరాట ప్రాంతాలలో గల తెలుగు రైతాంగంముందు వినోబాభావే భూదానోద్యమం పనిచేయలేదు.

ఫ్యూడల్ పీడనకు, దోపిడీకి వెన్నెముక విరిగిపోయింది. నిర్బంధ చాకిరి రద్దుచేయబడింది. గ్రామ కమిటీలే గ్రామ వ్యవహారాలు నిర్వహించాయి పాతవ్యవస్థను తిరిగి అమలులోకి తేవాలని యూనియన్ సైన్యాలు ప్రయత్నించాయి. అయితే ఆ ప్రయత్నాలన్నింటినీ ప్రజలు ప్రతిఘటించారు. భూస్వాములు భూములను తిరిగి ఆక్రమించుకున్న ప్రతిచోటా, పోలీసు క్యాంపుల సహాయంతో మాత్రమే వాటిని సాగుజేసుకోగలిగారు. ఇతర ప్రాంతాలలో వారు మరల భూమినివదిలి పోవలసివచ్చింది. తాము స్వాధీనం చేసుకున్న అన్యాక్రాంతాలను రైతులు తమ అధీనంలో నిలబెట్టుకున్నారు. అందుకుగాను, కుమ్మరి ముత్తయ్యవలె భీషణ పోరాటం సాగించారు. వ్యవసాయ కార్మిక సమ్మెలవల్ల అనేక గ్రామాలలో వేతనాల హెచ్చింపు సాధించుకోవటం జరిగింది. ఫారెస్టులను, బంజరు భూములను ఆక్రమించుకోకుండా ప్రభుత్వం ప్రజలను అరికట్టలేదు.

గ్రామపంచాయితీ కమిటీలు 'పోలీసు చర్య'కుముందు రోజులలో వలె పనిజేయటంలేదుగాని, ఈ పాత పంచాయితీ కమిటీలకు జెందిన వ్యక్తుల మధ్యవర్తిత్వంద్వారానే ప్రజలు తమ వివాదాలను పరిష్కరించుకొంటున్నారు.

వారి తీర్పులకు కట్టుబడుతున్నారు. తాము ఏ సమస్యనూ పరిష్కరించజాలక పోయిన సందర్భంలో వారు, వాటిని ఆ ప్రాంతపు పార్టీ ఆర్గనైజర్ వచ్చేంత వరకో, పార్టీ ఆర్గనైజర్‌తో సంప్రదించేంతవరకో అపరిష్కృతంగా నిలిపివుంచే వారు. ధనిక రైతులు సయితం తమ సమస్యలను, తమ వివాదాల పరిష్కారం కోసం, తీర్పుకోసం పార్టీముందుకు తెచ్చేవారు ప్రజలు కోర్టులకుగాని, కాంగ్రెస్ వద్దకుగాని వెళ్ళటంలేదు.

పార్టీ వారిదగ్గరకు పోయినప్పుడల్లా, పోయినచోటునెల్లా వ్యవసాయ కార్మికులు తమ డిమాండ్ల కోసం పోరాటం సాగించవలసిందిగా ఇచ్చిన పిలుపుకు వెంటనే కదిలివచ్చేవారు.

హుజూర్‌నగర్ తాలూకానుండి అప్పటికందిన వివరాలనుబట్టి, అచ్చటి 4167 ఎకరాల భూమిలో 2770 ఎకరాల భూమి ప్రజల చేతుల్లో వుంది భూస్వాములు 140 ఎకరాలు మాత్రమే తిరిగి ఆక్రమించుకోగలిగారు.

పదకొండువందల ఎకరాల మేరకు, స్వంత సాగులోని సేరీ భూములను, అన్యాక్రాంతాలను స్వాధీనం చేసుకొనటానికి దాచారం భూస్వామి ప్రయత్నించాడు అయినా ఆ ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు. అతడు, ఆ భూములను వదలిపెట్టక తప్పలేదు ఎకరానికి ఐదు నుండి పది రూపాయల కౌలుతో సంతృప్తిపడవలసివచ్చింది ఈదశలో రైతులు రెండు వేలఎకరాలమేరకు కొత్త ఫారెస్టును, బంజరు భూములను ఆక్రమించుకొని సాగుజేసుకున్నారు

తమకు పంపిణీ చేయబడిన పెద్ద భూస్వాముల సేరీ భూములను (మిగులు భూములను) ప్రజలు నిలబెట్టుకోలేకపోయారు. అయితే, అన్యాక్రాంతాలను, బంజరు భూములను, కవులు భూములను చాలవరకు నిలబెట్టుకోగలిగారు. తాము పోగొట్టుకున్న భూములు మధ్యతరగతి రైతుల, ధనిక రైతుల అధీనంలో వున్నట్లయితె, అలాంటి వాటిని తిరిగి ఆక్రమించుకొనబూనుకోకుండా రైతాంగాన్ని పార్టీ నిలవరించగలిగింది భూస్వాముల చేతుల్లోవున్న భూములను తిరిగి స్వాధీనం చేసుకొనటానికి వారికి తోడ్పడుతూనే మధ్యతరగతి, ధనిక రైతులతో ఒప్పందానికి వచ్చునట్లు వారిని వొప్పించటం జరిగింది

మిర్యాలగూడెం తాలూకా అడివి దేవులపల్లిలోగల 12 వందల ఎకరాల బంజరుభూములలో నూరింట నలభైవంతుల భూములకు ప్రభుత్వం పట్టాలిచ్చింది. మిర్యాలగూడెం తాలూకాలోని 67 గ్రామాలతో పార్టీకి సంబంధాలున్నాయి. మరోవంద గ్రామాలతో పార్టీ, గెరిల్లాలు సంబంధాలుపెట్టుకోలేక పోయారు అందులోని 33 గ్రామాలనుండి అందిన సమాచారాన్నిబట్టి,

పంపిణీ చేయబడిన బంజరు భూములన్నింటినీ కౌలు భూములను; అన్యాక్రాం తాలలో యాభైశాతాన్ని పంపణీ చేయబడిన బిసలు భూములలో 20 నుండి 30 శాతాన్ని ప్రజలు తమ ఆధీనంలో నిలుపుకొని సాగు జేసుకుంటున్నారు.

భువనగిరి తాలూకా. ఈ తాలూకాలోని 320 గ్రామాలలోనూ, 180 జాగీరు గ్రామాలు 140 ఖల్సా(ప్రభుత్వ) గ్రామాలు జాగీరుగ్రామాలలో ఎవరి పెరటిలోనైనా చింతచెట్టువున్నా, అదీ జాగీర్దారు ఆస్థియే. ఆ యింటి యజమాని ఆ చెట్టు ఫలసాయాన్ని వేలంపాటలో కొనుక్కోవలసి యుంటుంది. చేతి వృత్తులవారు నగరాలలోవుండే జాగీర్దారుకు వెట్టి చెయ్యాల్సివుంది. అనేక రకాలయిన పన్నులు, వసూళ్ళు అమలులో వుండేవి మన వుద్యమం వీటన్నింటినీ పూర్తిగా నిలుపుచేసింది. జాగీర్దార్లు గ్రామాలలో అడుగుబెట్టటానికి సాహసించలేకపోయారు. పులిగిళ్ళ జాగీర్దారుకు జెందిన ఆరువేల ఎకరాల భూమి యిప్పటికీ రైతుల చేతుల్లోనేవుంది. వారు నజరానాలుగాని కౌళ్ళుగాని చెల్లించటంలేదు. సున్నాల, వెలువర్తి, కీసరపల్లి, సిద్దాపురం గ్రామాలలో పంపిణీ జేయబడిన 12 వందల ఎకరాలభూమి, మల్కాపురంలో వర కాంతం గోపాలరెడ్డికి జెందిన నాలుగువందల ఎకరాలభూమి యిప్పటికీ రైతుల ఆధీనంలోనేవుంది. ప్రభుత్వం దాడులుజేసి, చిత్రహింసలపాలు చేసినప్పటికీ ఆ పరిస్థితిలో మార్పులేదు. పచ్చిక బీళ్ళను వేలంవేయటం నిలుపుజేశాం. ప్రజలు తమ పశువులను వుచితంగానే మేపుకుంటున్నారు. అన్యాక్రాంతాలను కౌలు భూములనూ ఐదులుకోలేదు వాటిని ప్రజలే సాగుజేసుకుంటున్నారు.

భారత సైన్యం ప్రవేశించటానికి ముందు, ఈ తాలూకాలో 45 మంది ఆర్గనైజర్లు, 450 మంది పిళ సభ్యులూ వుండేవారు. భారత సైన్యం మొట్ట మొదటి దాడుల అనంతరం, జైళ్ళలో నిర్బంధించబడిన వారుగాక మిగతా వారిలో పదిమంది ఆర్గనైజర్లు మాత్రమే సజీవంగా మిగిలారు. తెలంగాణా పోరాటాన్ని వుపసంహరించే నాటికి, పార్టీ ఆర్గనైజర్ల, చురుకుగా పనిజేసే సభ్యుల సంఖ్య 70 కి, మిలిటెంట్ల సంఖ్య మూడువందలకు పెరిగింది. వారంతా 140 గ్రామాలకు జెందినవారు.

బగటు ప్రాంతం (పర్కి, పల్వేల, ఇబ్రహింపట్నం ప్రాంతం) : అన్యాక్రాంతాలలో, బంజరు భూములలో అధికభాగం యిప్పటికీ రైతుల చేతుల్లోనే వుంది కొత్త ఫారెస్టు, తదితర బంజరు భూములు రెండువేల

ఎకరాల మేరకుపైగా ఆక్రమించుకోబడ్డాయి. ఈ ప్రాంతంలో 47 మంది పార్టీ సభ్యులున్నారు. గ్రామస్థాయి దళాలలో 423 మంది మిలిటెంట్లూ వున్నారు. పార్టీకి 265 గ్రామాలతో సంబంధాలున్నాయి.

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన, వుద్యమం క్రొత్తగా విస్తరించిన కల్వకుర్తి – నాగర్‌కర్నూల్ – కొల్లాపూర్ తాలూకాల ప్రాంతంలో బినామీ ములు గతంలో పంటలో సగభాగాన్ని కౌలుగాతీసుకుంటున్న దానికిమారుగా, పంటలో మూడోవంతుమాత్రమే కౌలుగా తీసుకునేట్లు రైతులు సాధించుకో గలిగారు. అనేక గ్రామాలలో వెట్టిచాకిరీని అరికట్టారు. దాదాపు నలభై గ్రామాలలో వ్యవసాయ కార్మికులు తమ వేతనాలను రు 150 ల నుండి రు 250 లకు పెంచుకోగలిగారు. పార్టీకి తొంభై గ్రామాలతో నిరంతరసంబంధం వుంది. 196 మంది మిలిటెంట్లు, పార్టీ సభ్యులూ వున్నారు.

# అధ్యాయం : 4

# గోదావరినదీ తీరానగల అరణ్యా ప్రాంతం

## "పోలీసు చర్య" అనంతరం ఖమ్మం - కొత్తగూడెం (పాల్వంచ) ప్రాంత పరిస్థితి

మొట్టమొదట్లో ఈ ప్రాంతంలోని నాయకత్వం సాయుధ పోరాటాన్ని వుపసంహరించటానికి అనుకూలంగా వుంది. కాని ఆ తర్వాత సాయుధ పోరాటం కొనసాగించాలని పార్టీ నిర్ణయించటంవల్లను, భారత సైనిక అధికారులు, గ్రామాలకు తిరిగి వచ్చిన భూస్వాములూ హత్యాకాండ సాగిస్తున్నందువల్లనూ వారు పోరాటం సాగించవలసివచ్చింది కామ్రేడ్సు మచ్చా వీరయ్య, గంగవరపు శ్రీనివాసరావు వంటి ముఖ్యమైన కామ్రేడ్సు హత్యచేయబడడంతో మంచికంటి రామకృష్ణరావు తదితరులు అరెస్టు చేయబడటంతోను, దళాలూ, మిగిలిన కార్యకర్తలూ ఫారెస్టు ప్రాంతాలకు వెళ్లిపోవలసివచ్చింది.

ఒక్క గ్రామంపైనే మూడుమాసాల కాలంలోపలనే 160 దాడులు జరిగాయంటే, దాడులు ఎంతవుధృతంగా సాగిందీ విదితంకాగలదు. ఒక మిలిటెంట్ ను 18 సార్లు బాదటంవల్ల ఆయన శరీరం కొన్ని నెలలపాటు పచ్చి పుండులా తయారైంది. ఒకదళంపై పోలీసులు, మిలటరీ ఒక్కరోజునే పన్నెండు సార్లు దాడిజేశారు ఉదయం మొదలు రాత్రి ఎనిమిది గంటలవరకూ నిలవకుండా 120 కిలోమీటర్లకుపైగా పరుగెత్తుతూనే వుండవలసివచ్చింది వెయ్యి

నుండి – పదిహేను వందలమంది వరకుగల సాయుధ బలగాలు ఒకేసారి ముప్పైనుండి నలభై గ్రామాలవరకు చుట్టుముట్టి గాలింపు పేరుతో దాడులు చేయటం జరిగింది.

ఆ తర్వాత, 1951 చివరివరకు ఈ దాడులలో నలుగురు జోనల్ కమిటీ సభ్యులు, ఐదుగురు సెంటర్ ఆర్గనైజర్లతోసహా, ముప్పైఒక్కమంది పూర్తికాలం పార్టీ పనిచేసే కార్యకర్తలను పట్టుకుని కాల్చి చంపారు. మరో 46 మంది పార్టీ సభ్యులను అరెస్టుచేసి, చంపివేశారు. ఇంతటి బీభత్సకాండ సాగినప్పటికీ పార్టీ సభ్యులలో నూరింట ఐదుగురయినా శత్రువుకు లొంగలేదు. కొరియర్లను తదితరులను భయంకర హింసలపాలుజేసినా, శత్రువు కేవలం నలుగురినుండి మాత్రమే కొలదిగా రహస్యాలు రాబట్టుకోగలిగాడు.

1948 లోను, 1949 ప్రారంభంలోనూ జరిగిన ఈ దాడుల అనంతరం. పాతిక, ముప్పై మంది సభ్యులుగల రెండు చిన్నదళాలు మాత్రమే మైదాన ప్రాంతాలలో మిగిలాయి. మొత్తం ఆ ప్రాంతమంటిలోనూ నలుగురు ఆర్గనైజర్లు మాత్రమే మిగిలివున్నారు

పార్టీ తన నిర్మాణాన్నంతటినీ పునర్వ్యవస్థీకరించుకోవలసివచ్చింది. మైదాన ప్రాంతాలలో ముగ్గురేసి సభ్యులుగల బృందాలను అడవి ప్రాంతంలో ఐదుగురు చొప్పునగల దళాలను ఏర్పాటుజేసింది. ఓర్మితోను, నిబ్బరంగాను కృషిచేసి, అత్యధిక గ్రామాలతో సంబంధాలను పునరుద్ధరించుకోగలిగింది. పాల్వంచ. తూర్పు ఎల్లెందు ఫారెస్టు ప్రాంతమంతటికీ మొత్తం మధిర తాలూకా అంతటికీ పోలీసుచర్య ముందుకంటె రెండు వందలకొత్త గ్రామాలకు విస్తరించగలిగింది.

1949 జూన్ – డిసెంబరు మధ్యకాలంలో ఈ ప్రాంతమంతటా దాదాపు నూటయాభై గ్రామాలలో తమ వేతనాలను పెంచుకొనటంకోసం వ్యవసాయ కార్మికులు పెద్దయెత్తున కదిలారు ఇరవై వేలమంది వ్యవసాయ కార్మికులు ఈ పోరాటంలో పాల్గొన్నారు. తమ వేతనాలను రెట్టింపు జేసుకున్నారు. కొన్ని సందర్భాలలో మూడురెట్లుకు కూడా పెంచుకున్నారు. కొన్నిచోట్ల రజకులు సమ్మెలుజరిపి తమ జీతాలను పెంచుకోగలిగారు. ఎనిమిది వేల బస్తాలవడ్లు, తదితర ధాన్యం స్వాధీనం చేసుకోబడింది ఆ ధాన్యంలో అత్యధిక భాగం ప్రజలకు పంపిణీ చేయబడింది.

ఈ విధంగా ఉద్యమం పునరుజ్జీవంపొందటం, వ్యాప్తి గావించటంతో పార్టీ నిర్మాణాన్ని పునర్వ్యవస్థీకరించటంతో, ప్రజాసంబంధాలు తిరిగి ఏర్పడటంతో పార్టీ నాలుగువందలమంది క్రొత్త సభ్యులను చేర్చుకోగలిగింది. అందులో నూరింట తొంభైమంది దాదాపు వంద గ్రామాలకు జెందిన వ్యవ

సాయకార్మిక, పేదరైతు కుటుంబాల నుండివచ్చినవారే. వారిలోనే ఆరు పార్టీ మహిళా బృందాలు కూడా ఏర్పాటు చేయబడ్డాయి. ప్రాంతీయ నాయకత్వానికి గ్రామానికి మధ్యస్థాయిలో వాల్యంచ, పైరా, వేంసూర్, ప్రొద్దుటూరు, పాలేరు, మధిర, ఇల్లెందు జోనల్ కమిటీలేర్పాటు చేయబడ్డాయి.

మిలటరీని, పోలీసులను భయకంపితుల నొనరించి, వాళ్ళ దాడులను అదుపులో బెట్టటంకోసం, మిలటరీ, పోలీసు గస్తీ దళాలపై దాదాపు నలభై మంది పాల్గొన్న ముట్టడుల రూపంలోను, మెరుపుదాడుల రూపంలోను, పెద్ద సంఖ్యలో దాడులు జరపబడినాయి. సుమారు నలభైమంది మిలటరీవాళ్ళు, పోలీసులు చంపివేయబడ్డారు. మరో యాభై – అరవై మంది గాయపరచబడ్డారు. క్యాంపులపై దాడులు తక్కువగానే జరిగాయి ఈ చర్యల ఫలితంగా ఆప్రాంతంలోని అత్యధిక భాగాలలో శత్రువు హెూంగార్డు దళాల నేర్పాటు జేయలేక పోయాడు. ముప్పై గ్రామాలలో మాత్రమే వాటి నేర్పరచగలిగాడు. తమ గ్రామంపైన మిలటరీ దాడి సాగుతున్నప్పుడు సయితం ప్రజలు తమ యిండ్లలో గెరిల్లాలను, కార్యకర్తలను దాచిపెడుతూ, భోజనాలుపెడుతూ వుండేవారు.

మొట్టమొదట కామ్రేడ్ పర్సా సత్యనారాయణను అరెస్టు చేయటంతోను ఆ తర్వాత కామ్రేడ్ ఆనందరావును కాల్చివేయటంతోను, నలభై మంది మిలిటెంట్లను అరెస్టు చేయటంతోను కొత్తగూడెం బొగ్గుగని ప్రాంతాలతో సంబంధాలు తెగిపోయాయి

తమను రక్షించుకొనటం కోసం, గెరిల్లాలు తక్షణమే, గ్రామాల నుండి పోలీసులకు సమాచారం అందజేసేవాళ్ళను, పోలీసు ఏజెంట్లను, ప్రత్యేకించి రంగంలో ముందునిలిచిన భూస్వాములను ఏరివేయవలసిన అవసరం ఏర్పడింది. పెద్ద సంఖ్యలో పోలీసు, మిలటరీక్యాంపు లున్నప్పటికీ దళ సభ్యులు గ్రామంలో రహస్యంగా ఆశ్రయం పొందగలిగేవారు. అతి దుర్మార్గులుగా పేరుమోసిన, రావల్లి అనంత రామయ్య, కొమ్మినేని ప్రకాశరావు. ఉమ్మనేని రామయ్యలతో సహా అరవైమంది భూస్వాములను, వాళ్ళ ఏజెంట్లను అంతం జేశారు దళాలు, పార్టీ సభ్యులూ భూస్వాములపై చందాలు విధించారు కార్యకర్తలను, గెరిల్లాలను పోషించటం కోసం పోరాటాన్ని సాగించడంకోసం పెద్ద మొత్తాలు వసూలు జేశారు.

మొదట్లో శత్రువు క్రూరస్వభావాన్ని పూర్తిగా గుర్తించటం జరగలేదు. అందువల్ల పూర్తికాలం పనిచేసే కార్యకర్తలలో అత్యధిక సంఖ్యాకులు, భూస్వాముల విద్రోహానికి బలియయ్యారు. వూగిసలాడే శక్తులను సకాలంలో

బయటకు త్రోసివేయకపోవడం ఎంతో నష్టానికి దారితీసింది.. ఆ ప్రాంతం చిన్నది కూడా అయినందున శత్రువు కేంద్రీకరించి, తీవ్రనష్టాలు కలుగ జేయగలిగాడు.

## పాల్వంచ (కొత్తగూడెం) అడవి ప్రాంతం

రజాకార్ రోజులలో సయితం గోదావరి అడవి ప్రాంతమే మన కార్యకలాపాలకు పునాదిగా వుండేది భారత యూనియన్ సైన్యం ప్రవేశించిన తర్వాత యిది ప్రధాన స్తావరంగా రూపొందింది. ఆ తర్వాత పార్టీ, దళాలూ గోదావరి నదినిదాటి పూర్వపు సీతారామరాజు కోయతిరుగుబాటు ప్రాంతంలో ఒక భాగమగు భద్రాచలం ప్రాంతానికి విస్తరించింది.

అడవి ప్రాంతాలనుండి మనలను ఏరివేసే ప్రయిత్నాలపైనే ప్రభుత్వం కేంద్రీకరించింది. కోయ ప్రజలను, అడవుల వెలుపలి ప్రాంతాలకు తరలించాలనే బ్రిగ్స్ పథకాన్నది అనుసరించింది. ఇందుకుగాను ప్రభుత్వం కోయ గూడెములను తగులబెట్టివేసింది మూకవుమ్మడిగా దెబ్బలుగొట్టటానికి, మూకవుమ్మడిగా హత్యలు గావించటానికీ పూనుకుంది. సోయం గంగులు స్వగ్రామమైన బంజారా గ్రామం పది, పదిహేను గుడిసెలున్న చిన్న కుగ్రామం. అందులోనే పదిహేను–యిరవై మందిని కాల్చిచంపారు.

ఒక్క గడేపాడు క్యాంపులోనే, రెండుమాసాల లోపునే, 15 వందల మంది కోయ ప్రజలు కలరాతో మరణించారు ఆ ప్రాంతం మొత్తంమీద పదివేలమందితో కోయప్రజలు కలరావల్ల మృతిజెందారు పోలీసులు, మిలటరీ, భూస్వాములగూండాలూ మరో మూడువందలమందిని కాల్చిచంపటమో, హత్యజేయటమో జరిగింది. ఆ క్యాంపులో 18 మంది పార్టీ సభ్యులు కలరావల్ల మృతిజెందారు.

పాల్వంచలోని, అల్లాపల్లి క్యాంపులో ఒక్కరోజునే 45 మందిని కాల్చిచంపారు వారిలో 18 మంది పార్టీ సభ్యులున్నారు. వారిని రెండు, మూడు రోజులపాటు చిత్రహింసల పాలుజేసిన అనంతరం కాల్చిచంపారు. ఈ క్యాంపులో, నాలుగు రోజులలో 119 మంది హత్యజేయిబడ్డారు కొందరిని కాల్చిచంపారు. మరికొందరిని సజీవంగా దహనం చేశారు.

రెండు మూడుసార్లు విమానదాడులు జరిపి, బాంబులు కురిపించారుకూడా.

పోలీసులు, సైనికులు స్త్రీలను చెరచటం సర్వసాధారణమైపోయింది. పోలీసు, మిలటరీ క్యాంపులున్నచోట ఇది మరీ ఎక్కువగాసాగింది తల్లులకండ్ల

ఎదుటనే పసిబిడ్డలను పాశవికంగా హత్యచేశారు. అనేక గ్రామాలలో, ప్రజలు ఈ అత్యాచారానికి గురికాకుండా తమ స్త్రీలను కాపాడుకున్నారు. గెరిల్లా దళాలు, గ్రామపార్టీ సభ్యులు, ప్రత్యేకించి కోయ ప్రజలనుండి వచ్చిన వారు శత్రువుచే పెద్ద ఎత్తున హత్యచేయబడ్డారు.

వుద్యమానికి బలీయమైన గ్రామాలలో వాకటుగు నేరేడలో, డి. యస్. పి. శ్రీనివాస్, స్పెషల్ అడ్మినిస్ట్రేటర్ (ప్రత్యేక పరిపాలనా నిర్వాహకుడు) వెళ్లోడి గ్రామమంతటినీ తగులబెట్టిస్తామని బెదిరించారు. ఒకసారి డెభ్భైమంది స్త్రీలను చింతబరికెలతో బాదారు. వాళ్ళచేత బలవంతాన పైజమాలు తొడిగించారు. ఆ పైజమాలలో తొండలను వదిలి, అడుగున బిగించి కట్టారు. ఆ తొండలు కొరకడం మొదలుపెట్టిన తర్వాత ఆస్త్రీలబాధ వర్ణనాతీతం. పైగా ఆ గాయాలపైనే ఎర్రకారం చల్లారు ఆ విధంగా హింసించబడిన వారు ఐదు మాసాలవరకు కోలుకోనేలేదు. మరొకరోజున తల్లులను తమ బిడ్డలకు పాలివ్వనీయలేదు. బిడ్డలంతా పాలకోసం ఏడుస్తున్నారు.

అయినా ఆ ప్రజలు లొంగలేదు !

ఒకసారి ఈ గ్రామంలోనే ఒక దళనాయకుడిని శత్రువు చుట్టుముట్టాడు. స్త్రీలు సమయస్ఫూర్తితో వ్యవహరించారు. ఆయనకు అప్పుడే రజస్వల అయిన యువతిలాగా దుస్తులువేశారు. ఒకగదిలో మూలనకూర్చుండబెట్టారు. పోలీసులు, మిలటరీ వెళ్ళిపోయిన తర్వాత, ఆయనను మరింత సురక్షిత స్థలానికి చేర్చారు

అదేవిధంగా, బెండలపాడు గ్రామంలో రాజమ్మ అనే రైతాంగ స్త్రీని పట్టుకున్నారు. ఆమెను, ఆమె భర్తనూ చిత్రహింసలపాలు జేశారు. ఎర్రగా కాల్చిన యినుప కడ్డీలతో, ఆమె నడుముచుట్టూ వాతలు బెట్టారు. అయినా, దళాలనుగూర్చి ఆమె నోరువిప్పి ఒక్క మాటయినా చెప్పలేదు. అడవులలో వుంటున్న దళాలకు భోజనం తీసుకు వెళ్ళిపోతుందనేది ఆమెపై ఆరోపణ. ఆమె పార్టీపట్ల అచంచల విశ్వాసాన్ని కలిగివుంటూ, అన్ని ఎన్నికలలోను పార్టీ తరఫున కృషి చేసింది. అనేక సంవత్సరాల తర్వాత ఆమెను కలుసుకునే అవకాశం నాకు కలిగింది 1960 లో ఈ ఆదర్శ దంపతులను నేను కలుసుకొనటం జరిగింది వారి నమ్రత, పార్టీపట్ల వారి అచంచల విశ్వాసం అలాగే వుండటం గమనించాను.

ఇంతటి భీభత్సకాండ సాగినా, ప్రజలతో మన సంబంధాలు కొనసాగుతూనే వున్నాయి. 1949,1950 సంవత్సరాలలో వ్యవసాయకార్మికుల వెల్లువను మనమప్పటికే గమనించాం ఈ సమ్మెలద్వారా వ్యవసాయ

కార్మికులు విజయాలు సాధించుకున్నారు. ఎకరంలో పైరును మాసూలుజేసినందుకు అంతకుముందు అరవైశేర్లు యిచ్చేదానికి బదులు, 160 శేర్ల ధాన్యం సాధించుకున్నారు. ఇల్లెందు, బూర్గుంపాడు తాలూకాలలో, పాలేర్లకుఏడాదికి గతంలో ఆరుబస్తాలిస్తుండగా, పన్నెండు బస్తాలు సాధించుకున్నారు. నాలుగువేల మంది కార్మికులు, కట్టెలు కొట్టినందుకుగాను రోజుకు మూడురూపాయల వేతనం సాధించుకున్నారు. కొత్తగూడెం గని కార్మికులతో క్రమబద్ధమైన సంబంధాలేర్పరచుకోనటం, నిరంతరాయంగా కరపత్రాలు ప్రచురించటం జరిగింది వివిధ రకాలయిన రహస్య పార్టీ కార్యకలాపాలకొరకు వారెంతగానో దోహద పడ్డారు.

చిట్టచివరకు, సాయుధ పోరాటం వుపసంహరణ నాటికి మైదాన ప్రాంతంలో 150 మంది పార్టీ సభ్యులు, అనేకమంది సానుభూతిపరులు అడవి ప్రాంతంలో యాభైమంది కోయ పార్టీ సభ్యులు, ఐదువందల మంది కోయ మిలిటెంట్లు మిగిలారు. అయితే, సాయుధ పోరాటాన్ని వుపసంహరించటం జరిగేంతవరకూ, దాదాపు రెండు సంవత్సరాలపాటు రాష్ట్ర కేంద్రంతో సంబంధాలులేని కేంద్రంతో యిది ఒకటి గ్రామాలతో, నిత్యసంబంధాలు బలహీనపడ్డాయి. అడవుల్లో నిరంతగం తిండిలేక మాడటంవల్ల, దళ సభ్యులు, నాయకులు అందరూ విపరీతంగా బలహీనపడిపోయారు. చిగుళ్ళనుండి నెత్తురు కారిడంవంటి అనారోగ్య పరిస్థితులకు లోనయ్యారు. వారు మలేరియా, తదితర జ్వరాలకు తరచు గురవుతూవుండేవారు. సాయుధ పోరాటం నిర్వహించటం ఎంతవరకు సరైనదన్న ప్రశ్నలు మరింత ఎక్కువగా ఎదురయ్యాయి. సరిగ్గా ఆ సమయంలోనే ఒక ఆకస్మిక దాడిలో, మొత్తం ప్రాంతీయ నాయకత్వమంతటినీ మిలటరీ చుట్టు ముట్టింది. ఆ సందర్భంగా కామ్రేడ్ గిరిప్రసాద్ తీవ్రంగా గాయపడ్డాడు. మిగతా నాయకత్వం వాళ్ళ నెదిరించి పోరాడింది. ఆ కామ్రేడ్‌ను మైళ్ళ తరబడి, రోజుల తరబడి మోసుకెళ్ళారు. గాయాలను నయంజేశారు ఆరోగ్యం కోలుకునేట్లు జేశారు. చావును లెక్కజేయకుండా, ప్రజాపోరాటంలో పాల్గొంటున్న వారిలో అలాంటి సౌభ్రాతృత్వ సంబంధాలు మెండుగా వుండేవి.

1951 అక్టోబరు 21 వ తేదీన సాయుధ పోరాటం ఉపసంహరణ నిర్ణయాన్ని రేడియోలో ప్రకటించగా నాయకత్వం విన్నది.

## గోదావరినదీతీర ప్రాంతంలో
## కోయప్రజలమధ్య ఉద్యమ పరిస్థితి

గ్రామదళాల, గ్రామపంచాయితీ కమిటీల సభ్యులు వేలాదిమంది పట్టుబడ్డారు. రాజీనామాలిచ్చినవారు, లొంగిపోయినవారితోసహా వారందరినీ మిలటరీ ప్రభుత్వం నిర్బంధించి జైళ్ళలో పెట్టింది. ఆ తర్వాత 1949 ఫిబ్రవరి నెలాఖరుకల్లా మిగిలిన వాళ్ళంతా అడవుల్లోకి వెళ్ళిపోయారు. మరికొందరు పట్టణాలకు చేరుకున్నారు కొలదిమంది మాత్రమే తమ తమ ప్రాంతాలలో వుండిపోయారు.

సూర్యాపేట, మానుకోటతాలూకాలలోని పార్టీ, ఖమ్మం, ఇల్లెందు తాలూకాలలోని కొన్నిభాగాలలోని పార్టీతోపాటు, వరంగల్ జిల్లాలోని నర్సంపేట ములుగు తాలూకాలకు, కరీంనగర్జిల్లా మంథెన తాలూకాకు, ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూర్కు వ్యాపించింది గోదావరి అడవి ప్రాంతం వరకూ విస్తరించింది. ఖమ్మం మధిర తాలూకాలలోని పాల్వంచ, ఇల్లెందు అడవులలోకి వ్యాపించింది. హుజూర్నగర్. మిర్యాలగూడెం తాలూకాలనుండి, సూర్యాపేటతాలూకా దక్షిణ ప్రాంతాలనుండి పార్టీ నిర్మాణం నల్లమల అరణ్య ప్రాంతాలలోకి విస్తరించింది. నల్లగొండ, భువనగిరి తాలూకాలలోని పార్టీ యంత్రాంగం, హైదరాబాదు నగరం సమీపంలోగల రాచకొండగుట్టవరకూ విస్తరించింది. కరీంనగర్ ఆదిలాబాద్ ఫారెస్టులకు, జనగామ తదితరతాలూకాల నుండి పార్టీ ఆర్గనైజర్లు వచ్చారు.

ఈ తాలూకాల అడవి ప్రాంతాల ప్రజలు పట్టణాలకు దూరంగా వున్నారు. వారికి రాకపోకల సౌకర్యాలుగాని, వార్తా సౌకర్యాలు గానిలేవు. వాళ్లు పేదరికంలో కొట్టుమిట్టాడుతూ జీవిస్తున్నారు. పురుషులు, స్త్రీలుకూడా నామమాత్రంగా మాత్రమే బట్టలు ధరించ గలిగేవారు. పశు పోషణ వారి ప్రధాన వృత్తి. అయినా, వ్యవసాయంమీద, అటవీ సంపదమీదకూడా వారు అంతగానూ ఆధారపడియున్నారు. వారి వ్యవసాయం పోడువ్యవసాయం వ్యవసాయంనుండి లభించిన ఫలసాయం చాలక, వారు అడవిలో దొరికే నానా రకాలైన పండ్లు, కాయలు, ఆకులుప్రోగుజేసుకొని వాటినితిని జీవిస్తూవుంటారు.

ఈ అమాయక ప్రజలపై సాగుతున్న దోపిడి దారుణంగా వుండేది. మైదాన ప్రాంతాలకు జెందిన భూస్వాములే, గ్రామ పటేళ్ళు, పట్వారీలుగా ఈ గిరిజనులపై పెత్తనం చెలాయించేవారు ప్రభుత్వానికి చెల్లించవలసిన భూమిశిస్తుకు పదిరెట్లనుండి వందరెట్లవరకూ వసూలు జేసేవారు గిరిజనులను తాత్కాలిక ఆక్రమణదారులుగానే వుంచుతూ, ఆ భూములపై పట్టా హక్కులను

వాచే పొందేవారు. గిరిజనుల పేర, పట్టా భూమిగా నమోదు చేయబడింది ఆ భూమిలో చాలా స్వల్పభాగం మాత్రమె నిర్బంధచాకిరి అమలులో వుంది. ఎంతో కష్టంచేసి వారు సంపాదించుకున్న కాస్తంతయినా వారికి దక్కటంలేదు.

ఫారెస్టు అధికారులు, ఈ గిరిజనుల పాలిట సాక్షాత్తూ రాక్షసులే. వాళ్ళు, ఈ ప్రజల శ్రమను వే విధాలుగా దోచుకునేవారు. అయినా, వంటచెరకుగా వుపయోగించటానికి కాసిని కట్టెలుగాని, చిన్న గుడిసె వేసు కొనటానికి అవసరమైన కలపనుగాని, లంచాలు గుంజనిదే తీసుకుపోనిచ్చే వాళ్లు కాదు చేతిలో గొడ్డలి పట్టుకుని కనిపించిన వాళ్ళెవరినైనా పట్టుకుకొట్టే వాళ్ళు ఫారెస్టు అధికారులకు ఎంతో కొంత లంచం ముట్టజెప్పటమే వాళ్ళ మనుగడకు ఏకైక మార్గం. కోయలు సాగుచేసుకుంటున్న భూమి "రిజర్వు ఫారెస్టు ప్రాంతాల"కు జెందినట్టిదిగా సాకుజెప్పుతూ, వారా భూమిని సాగు జేసుకొనటానికి వీలులేదని వెంటాడుతుంటారు క్రొత్త ప్రాంతాలను దున్నుకో నిచ్చేవారు గాదు. అలాంటి గిరిజన ప్రజల దుస్థితి ఎలా వుండేదో వూహించు కోవచ్చు. అడవులలో లభ్యమయ్యే వాటి నన్నింటినీ ప్రభుత్వం వేలం వేసేది. ఈ అడవులలో పుట్టి పెరిగిన గిరిజనులు కాంట్రాక్టరుకో, ఫారెస్టు గార్డుకో, అధికారికో మూల్యం చెల్లించకుండా ఒక్క ఆకైనా అనుభవించేందుకు వీలులేదు.

గిరిజన కార్మికులకు అతి స్వల్ప వేతనాలు చెల్లించి, కాంట్రాక్టర్లు, షావుకార్లు విపరీతంగా సంపాదించుకునేవారు. ఫారెస్టు కాంట్రాక్టర్లు ఆ విధంగా సంపాదించుకోవటం కనిపిస్తూనేవుంది. అంతేకాదు. ఈ గిరిజన ప్రజలకు—చింతపండుకు, తేనెకు, తదితర వ్యవసాయోత్పత్తులకు అతి స్వల్ప మైనరేటు లభించేది. పైగా షావుకార్లు వాళ్ళకు ఉప్పు, మిరపకాయలు, నూనె, బట్టలు, పొగాకు తమ చిత్తంవచ్చినంత హెచ్చుధరలకు అమ్మేవారు

వాళ్ళ సాంఘిక వ్యవస్థకూడా అదేవిధంగా దుర్భరంగావుండేది. సాంప్రదాయసిద్ధంగా వుండే వారితెగనాయకుడు పచ్చినియంత, అవినీతి పరు డూను. అతనిని వ్యతిరేకించే అధికార మెవరికీలేదు. అతడు కాంట్రాక్టర్లనుండి లంచాలు తీసుకుని, తన అధీనంలోగల కార్మికులను తక్కువ వేతనాలకు పంపుతుంటాడు. ప్రజలను దోపిడి చేయటంలో ఆయనా షావుకార్లకు తోడు దొంగే. ప్రతి పండుగ సందర్భంలోనూ, ఏదైనా తప్పుచేసినప్పుడూ ఈ తెగ పెద్దకు ప్రజలు మామూళ్లుచెల్లించాలి. స్త్రీల జీవిత పరిస్థితి మరింత అధ్వాన్నం గాను, దుర్భరంగానూ వుండేది.

ఒక యువతిని పెండ్లాడ దలచిన వాడెవరైనాసరే, తనను బలపరచే మురాను వెంటబెట్టుకునివచ్చి, ఆమె వొంటరిగా వున్నప్పుడు, ఆమె వ్యతిరే కిస్తున్నా లెక్క జేయకుండా పట్టుకుపోయి పెళ్ళిజేసుకుంటాడు. ఈ విషయంలో

ఆయువతిగాని,ఆమె తలిదండ్రులుగాని చేయగలిగిందేమీవుండదు. వారి యిష్టా యిష్టాలతో నిమిత్తమే లేదు. తెగ పెద్ద, ఈ సందర్భంగా పెండ్లి కుమారునివద్ద లంచం తీసుకుని, అతనికి తొత్తుగా తయారైతే, అసలా వివాహాన్ని లేవనెత్తేందు కైనా వీలులేదు. కుక్కనోట గరచుకుపోయిన బొమికను, కుక్క దగ్గరనే వుండ నివ్వండి అని మాత్రమే అంటాడు. ఇక ఆ మాటకు తిరుగులేదు. తెగలలో వుండే సాంప్రదాయ మిది.

తొలిరోజులలో దళాలు కనిపించగానే గిరిజనులు పారిపోయేవారు. ప్రతి గ్రామంలో నివసించేవాళ్ళనందరినీ అతికష్టంమీద ఒకచోట సమావేశ పరచి పార్టీనిగూర్చి పార్టీ ఆదర్శాలనుగూర్చి వారికి చెప్పిన తర్వాతనే వారు "వారు మనవాళ్ళే" అని గుర్తించారు అప్పుడు మాత్రమే జమీందార్లు, పటేళ్లు, పట్వారీలు, ఫారెస్టు అధికారులవంటి దోపిడీదార్లపైన, ప్రభుత్వంపైన పోరాడాలన్న దృఢనిశ్చయాని కొచ్చారు దళాలమీద విశ్వాసం ఏర్పడిన తర్వాత వారే స్వయంగా పార్టీ ఆర్గనైజర్లను యితర గ్రామాలకు తీసుకువెళ్ళి వారికి పరిచయం జేశారు కొత్త ప్రాంతాలకు పార్టీని విస్తరింపజేయటానికి తోడ్పడ్డారు వారు కొత్తగ్రామానికి పార్టీ ఆర్గనైజర్లను తీసుకెళ్ళేముందు మరుసటిరోజున బంధువులను తీసుకవస్తున్నామంటూ, గ్రామ ప్రజలంతా ఎక్క డికీ వెళ్ళకుండా గ్రామంలోనే వుండవలసిందిగాకోరుతూ ముందుగా కబురంపే వారు పార్టీ నాయకులను 'బంధువుల'ని, 'మనవాళ్ళే' అని పిలిచేవారు. తమ కున్న ఏ రకమైన ఆహారాన్నైనా దళ సభ్యులకూపెట్టేవారు వాళ్ళకేమిచ్చినా సంతోషంగా తినేవారు. పార్టీ ఆర్గనైజర్లు వారి విశ్వాసాన్ని చూరగొని, ఆ ప్రాంతంలో పార్టీని సంస్థాపించారు.

దళాలు అడవి ప్రాంతాలలో ప్రవేశించిన తర్వాత, పటేళ్లు, పట్వా రీలు, ఫారెస్టు అధికారులు ప్రాణాలు గుప్పెట్లో బెట్టుకుని పారిపోయారు. గిరిజన ప్రజలు వూపిరి సలుపుకున్నారు. క్రొత్తభూములు సాగుజేసుకున్నారు. పార్టీ నిర్ణయించిన విధంగా, ఫారెస్టు కంట్రాక్టర్లు కార్మికులకు వేతనాలు చెల్లించారు. ఆ విధంగా చెల్లించటానికి వాళ్ళంగీకరించేంతవరకూ ఆ కార్మికులు పనులకు పోయేవారుగాదు. అందువల్ల వారి వేతనాలు మూడు, నాలుగురెట్లు పెరిగాయి అదే విధంగా పార్టీ నిర్ణయించిన రేట్లప్రకారమే షావుకార్లు అడవిలో లభ్యమయ్యే సరుకులను కొనేవారు.

సాంప్రదాయ సిద్ధమైన తెగల పెద్దలలో అత్యధిక సంఖ్యాకులు తమ పాత అలవాట్లను మార్చుకున్నారు. వారుకూడా హృదయ పూర్వకంగా ప్రజావుద్యమంలో పాల్గొన్నారు. పాతవివాహ పద్ధతులకు స్వస్తిజెప్పారు.

వాళ్ళుకూడా తమ ప్రాంతంలోని భూస్వాములను, పశువులను స్వాధీనం జేసుకుని ప్రజలకు పంచారు. వాళ్ళు ఈ చర్యలనుమైదాన ప్రాంతాలకుకూడా విస్తరించారు.

శరీర దారుఢ్యంగల స్త్రీ, పురుషులందరితో గ్రామదళాలు ఏర్పాటు చేయబడినాయి వారిలో కొందరు గెరిల్లాదళాలలో చేరారు. పార్టీ అర్ధ నైజర్లుగా కూడా రూపొందారు. రెండువందల మంది కోయయువకులు పార్టీలోకొచ్చారు. దళ సభ్యులుగాగాని, అర్ధనైజర్లుగాగాని, కొరియర్లుగా గాని చేరారు. ఇరవైమంది స్త్రీలు, తమ భర్తలతోపాటు పార్టీలోకొచ్చి, దళాలలోచేరి ఆయుధాలుచేత బట్టిన విషయం ప్రత్యేకంగా పేర్కొనదగి వున్నది. వెయ్యిమందికి తక్కువగాకుండా, కోయప్రజలు గ్రామదళాలలో గ్రామ కమిటీలలో చేరారు. ఈ ప్రజలలో పార్టీ పలుకుబడి ఏమేరకు వ్యాప్తి గాంచిందీ ఈ సంఖ్యా వివరాలనుబట్టి విదితం కాగలదు

పాల్వంచ, ఇల్లెందు తాలూకాలలో ఒకే విధమైన ఆర్ధిక, సాంఘిక జీవిత పరిస్థితులలోవున్న ప్రజలు, పాల్వంచ ప్రాంతీయ కమిటీ క్రింద సంఘటిత మయ్యారు వారు పెద్ద ఎత్తున కార్యరంగంలోకి దిగారు. అనేక విజయాలు సాధించుకున్నారు. పెద్ద సంఖ్యలో గెరిల్లా దళాలలో చేరారు.

కృష్ణానదీ ప్రాంతంలోని నల్లమల అడవులలోగల చెంచు ప్రజలను, ఆదిలాబాద్ జిల్లాలోని గోండుజాతి వారిలోనూ వుద్యమం పెంపొందింది. తెలంగాణా ప్రాంతంలోని మొత్తం గిరిజన ప్రాంతమంతటా కమ్యూనిస్టు పార్టీ విస్తరించింది.

ఈ అడవుల నానుకునివున్న మైదాన ప్రాంతాలుకూడా వుద్యమం ప్రభావంక్రింది కొచ్చాయి. భూస్వాముల భూములను, పశువులను, ధాన్యాన్ని పంపిణీజేసే కార్యక్రమాన్ని ప్రజలు పెద్ద ఎత్తున చెపట్టారు. అయినా, ఈ మైదాన ప్రాంతంలో విస్తరించటానికి కారణం దళాలపై పోలీసు దాడుల వుధృతి అధికమవటం కాదు.

కోయప్రజల పరిస్థితులు తక్షణమే మెరుగుపడటానికిగాను, పార్టీ దిగువ పేర్కొన్న ఆర్ధిక డిమాండ్లను రూపొందించింది:

1 నాగలికి పది రూపాయల చొప్పున విధించబడే నాగలి పన్ను, యింటి పన్ను, పశువులను మందవేసుకున్నందుకుగాను రూపాయిన్నర పన్ను, అర్ధరూపాయి చొప్పున విధించే నెగడి పన్ను, పశువులు మేపుకున్నందుకు గాను తలకు ముప్పావలా పన్ను, కొత్తగా గుడిసె వేసుకున్నా, యిల్లు గట్టు కున్నా పన్ను రూపంగానో, అక్రమంగానో వసూలుజేసే యాభై రూపాయలు

మొదలుగాగల పన్నులు వేటినీ చెల్లించవద్దు. నెయ్యి, తేనె, కోళ్ళు, మేకలు మొదలైన వాటిని అధికారులకు వుచితంగా సరఫరా చేయుటువంటి అక్రమ నిర్బంధ వసూళ్ళన్నింటికీ స్వస్తి జెప్పాలి.

2. అడవి ప్రాంతాలలోని భూములపై పన్నులు వసూలు జేయటానికి ప్రభుత్వంచే అధికార మివ్వబడిన బడా భూస్వాములగు బంజారాదార్లకు పన్నులుగాని, కౌళ్ళుగాని చెల్లించవద్దు.

3. దున్నేవానికే భూమిపై హక్కు వుండాలి. భూస్వామికి ఎలాంటి కౌలు చెల్లించనవసరంలేదు.

4 బలప్రయోగంద్వారాగాని, మోసపూరితమైన పద్ధతులద్వారాగాని భూస్వాములు, కంట్రాక్టర్లు స్వాధీనంజేసుకున్న భూములన్నింటినీ తిరిగి స్వాధీనం చేసుకోవాలి.

5. వడ్డీమీద వడ్డీ పెరిగి పేరుకుపోయిన అప్పులను తీర్చవద్దు. వడ్డీ లేకుండా అప్పు లివ్వాలని డిమాండ్ చేయండి

6. వెట్టిచాకిరి చేయవద్దు. ఎవరికయినా, ఏ పనిచేసినా వేతనాలు డిమాండ్ చేయండి.

7. తాము కొనుక్కోవలసిన వస్తువులకు, తాము అమ్ముకునే వస్తువులకు మైదానాలలోని పట్టణాలలో అమలులోవున్న ధరలనుగూర్చి ప్రజలకు తెలియజేయాలి. అందువల్ల, ప్రజలు మోసానికి గురిగాకుండా నివారించవచ్చు

8. గిరిజన ప్రజలు అడవులలో సేకరించే తేనె, చింతపండు, చర్మాలు, యిప్పపువ్వు, తడికలువంటి వాటికి కంట్రాక్టర్లుగాని, వెలుపలి వ్యాపారస్తులుగాని సరైన ధరలు చెల్లించునట్లు చూడండి. వాటిని తమ యిష్టం వచ్చిన వారికెవరికయినా, అమ్ముకునే స్వేచ్ఛ వారికుండాలి. కొందరు కాంట్రాక్టర్లకో, ప్రభుత్వ ఏజెంట్లకో మాత్రమే అమ్మి తీరాలనే నిర్బంధాన్ని అంతంజేయాలి.

9. బీడీ ఆకులు ; ఆకులుకోసి, కట్టగట్టినందుకుగాను వంద ఆకుల కట్టకు కనీసం అణా ప్రతిఫలంగాయివ్వాలి. అర్ధణాయిస్తే చాలదు. [1971 లో కాంగ్రెస్ ప్రభుత్వం దీన్ని జాతీయంచేసింది, 1968–70 మధ్యకాలంలో అనేక సమ్మె పోరాటాలు జరిపి సాధించుకున్న 8 నుండి 10 పైసలవరకుగల రేటును ప్రభుత్వం 3 నుండి 4 పైసల వరకు వుండేట్లు తగ్గించింది.]

10. కట్టెలు గొట్టినందుకు వేతనాలరేటును హెచ్చించాలి.

11. కొన్ని కొన్ని రకాల కలపకు అడవుల్లో లభ్యమయ్యే యితర సరుకులకు రేటు పెంచాలి.

తక్షణ పాక్షిక ఆర్థిక కోర్కెలతోపాటు, "స్వయంపాలనాధికారం గల కోయప్రాంతం స్థానిక స్వపరిపాలన" అనే సాధారణ రాజకీయ నినాదం కూడా యివ్వబడింది.

ఆరోగ్యసమస్యనుకూడా ప్రభుత్వం చేపట్టింది. కోయ ప్రజలు బాధ పడుతున్న అనేక దీర్ఘవ్యాధుల నివారణ, పారిశుద్ధ్య పరిస్థితులు, సాంఘిక సమానత్వం, స్త్రీల సమస్య, ప్రజల విద్య మొదలగు విషయాలపై కృషి సాగించబడింది.

## గ్రామాల దహనం
## నిర్బంధ శిబిరాల ఏర్పాటు

పోలీసులు, ఒక గ్రామం తర్వాత మరొక గ్రామానికి నిప్పంటించి తగులబెట్ట నారంభించారు ప్రత్యేకించి, అడవి ప్రాంతాలలో, చిన్నగుడిసెనైనా అగ్నికి ఆహుతి జేయకుండా మిగల్చలేదు. ఆహార ధాన్యాలు, దుస్తులుతోసహా ప్రజలకుగల సర్వస్వాన్నీ గుడిసెలతోపాటే తగులబెట్టారు. మైదాన ప్రాంతాలలో కూడా, పొలాలలోగాని, నూతులవద్దగాని వున్న చిన్నగుడిసెలను, ఎలాంటి చిన్న ఆశ్రయాన్నైనా సరే తగులబెట్టి వేయటం జరిగింది. చిన్న గ్రామాల ప్రజలను, బలవంతంగా పంపి, పెద్ద గ్రామాల ప్రక్కనే నివసించే టట్లు చేసేవారు. అలాంటి కేంద్రాలలో పెద్ద మిలిటరీ క్యాంపులు ఏర్పాటు చేయబడినాయి. గిరిజన గ్రామాల వారిని నలభైయాభై మైళ్ల దూరం తరలించి, అడవుల నానుకొనివున్న మిలటరీ క్యాంపులచుట్టూ నివాసాలేర్పరచుకునేట్లు నిర్బంధించారు ఒక తాలూకా మొత్తంలోగల గిరిజన ప్రజలందరినీ కేవలం మూడు, నాలుగు నిర్బంధ శిబిరాలలో నివసించేటట్లు జేశారంటే, ఈ నిర్బంధ శిబిరాలను ఎంతదారుణమైన పద్ధతుల్లో ఏర్పాటు జేసిందీ విదితమవుతుంది. ఇదంతా "బ్రిగ్స్ పథకం" ప్రకారం జరిగింది. కాంగ్రెస్ నాయకులు వాటిని పునరావాస కేంద్రాలని పిలిచారు. కాని నిజానికవి నిర్బంధ శిబిరాలు. గెరిల్లా దళాలకు అడవి ప్రాంతాలలో పాదం మోపే స్థానం లేకుండా చేయటంకోసం వుద్దేశించబడినవే వందలాది గ్రామాలు ఆ విధంగా తగులబెట్టబడ్డాయి.

వాళ్ళను నిర్బంధశిబిరాలలోకి తీసుకొచ్చిన తర్వాత, దేశముఖులు, వాళ్ళ ఏజెంట్లు ఎవరినిచూపితేవారిని సైనికులు పట్టుకుని వాళ్ళ చర్మం చిట్లి రక్తం కారేంతవరకూ కొట్టేవారు. ఉదాహరణకు, నర్సంపేట తాలూకాలోని

గూడూరు మిలటరీక్యాంపునుండి వాళ్ళు ఎనిమిదిమంది గిరిజనులను బయటకు లాగారు వాళ్ళను చర్మం చిట్లేంతవరకూ బాదారు. ఆ గాయాలపై కారం చల్లారు. ఆ తర్వాత వాళ్ళకాళ్ళుచేతులుకట్టి ఎర్రని ఎండలో, కాలేయిసుకలో పచ్చిచేపలను ఎండవేసినట్లు ఎండవేశారు. తిండిలేక, నీరులేక వాళ్ళంతా మరణించారు.

నర్సంపేట తాలూకాలోని అశోక్‌నగర్ మిలటరీ క్యాంపులో ఒక కోయరైతును అదేవిదంగా కొట్టారు. చర్మం వూడిపోయి వ్రేళ్ళాడుతుండగా మరిగేనీళ్ళు మీదపోశారు. ఆ రైతు ప్రాణాలు విడిచాడు.

ఈ పోలీసు, మిలటరీ పశువులు భర్తలఎదుటనే భార్యలను చెరచటమనేది సర్వసాధారణమైపోయింది.

ప్రజలను కాల్చి చంపటమనేది మరొక సరదా అయిపోయింది! ఒకగ్రామం ప్రజలను మరొక గ్రామానికి, ఒక క్యాంపువారిని మరొకక్యాంపుకు, ఒక తాలూకా వారిని మరొక తాలూకాకు ఒసుకుపోయి అక్కడ కాల్చి చంపడం జరిగింది జైళ్ళలో వున్నవాళ్ళను సయితం ఒయటకు తీసుకెళ్ళి కాల్చి చంపారు ప్రజలను, పార్టీ సభ్యులను, దళసభ్యులను లారీలలో ఎక్కించుకుని నరసంపేట, ములుగు, ఇల్లెందు, పాల్వంచ అడవులలోకి తీసుకొచ్చి, మూకవుమ్మడిగా పిట్టలను కాల్చినట్లు కాల్చిచంపారు. చంపటానికి వాళ్ళనుసరించిన పద్ధతులనేకం. ప్రజల మనస్సులలో భీతాహం కల్పించటంకోసమే అవన్నీ అనుసరించబడ్డాయి.

నిర్బంధ శిబిరాలలో మందవేయబడిన వేలాది ప్రజలకు సరైన తిండి పెట్టక ఆకలిమంటల కెరజేశారు. మొట్టమొదట వాళ్ళను కొట్టటం, ఆ తర్వాత వాళ్ళచేతనే పొడుగాంటి గోతులు త్రవ్వించటం, అలాంటి గోతుల అంచునే వాళ్ళను నిలబెట్టటం, వాళ్ళు ఆ గోతులలోనే పడునట్లుగా కాల్చటం, వాళ్లు ఆ గోతిలో పడగానే మట్టిగప్పటం జరిగేది కొంతమందిని క్యాంపుకు దగ్గరనే వున్న పెద్ద చెట్లువద్దకు తీసుకుపోయి, ఆచెట్ల కొమ్మలనుండి వురిదీసిచంపారు. మానుకోట తాలూకాలోని నాగారం సమీపంలోగల ఈ క్యాంపులో అలాంటి పద్ధతులనేకం అనుసరించబడ్డాయి.

వరుసగా పస్తులుండటంతో అనేక కుటుంబాలవారు మృతిజెందారు. ఈ క్యాంపులలో, కలరా, మసూచి తదితర అంటువ్యాధులు సర్వసాదారణమై పోయాయి. వాటివల్ల మొత్తం క్యాంపులకు క్యాంపులే బలైపోయాయి. నర్సంపేట, ములుగు, ఇల్లెందు, పాల్వంచ తాలూకాలల్లో నివసిస్తున్న పదివేలమంది

గిరిజనులు ఈ విధంగా మరణించినట్లు అంచనా వేయబడింది తినటానికి మేత లేక, ఈ నిర్బంధ శిబిరాలలో సరైన ఆలనాపాలన లేకపశువులు,గొర్రెలుకూడా పెద్ద సంఖ్యలో చచ్చిపోయాయి.

ప్రజలపై ఆ విధమైన అమానుషమైన అత్యాచారాలు సాగించటాని కేర్పరచిన నిర్బంధ శిబిరాలకు కాంగ్రెసు నాయకులు గాంధీనగర్, అశోక్ నగర్, జవహర్‌నగర్, కాకతీయనగర్, బాపూనగర్ మొదలైన పేర్లుబెట్టారు.

తరతమ భేదాలలో, అన్ని ప్రాంతాలలోనూ ప్రజలను ఆవిధంగానే నానారకాల హింసలకు గురిజేయటం జరిగింది. దళాలను, పార్టీని ప్రజలనుండి వేరుజేయటం. దెబ్బగొట్టటం, పార్టీ రహస్యాలు వెల్లడించునట్లుగా ప్రజలపై వొత్తిడి చేయటంఅనే ఏకైక దుర్బుద్ధితోనే ఈహింసాకాండనంతా సాగించారు.

ప్రజలు బంధువులను చూడటానికి ఒక గ్రామంనుండి మరొక గ్రామానికి వెళ్ళాలంటే, మిలటరీ అధికారులనుండి అనుమతిపత్రాలు తీసుకో వలసివుండేది. అలాంటి అనుమతి పత్రం లేకుండా కనిపించినవాళ్ళను మిలటరీ వాళ్ళు పట్టుకుని, కమ్యూనిస్టులని ముద్రవేసి, జైళ్ళలోబెట్టేవారు. అలాంటి అనుమతి పత్రాలు పొందినవారు, ఆ పత్రంలో పేర్కొనబడిన మార్గం ద్వారా మాత్రమే ప్రయాణం చేయాలి. అందులో పేర్కొనబడినన్ని రోజులే అచ్చట వుండవచ్చు.

గిరిజన ప్రజలలో చాలామంది ఈ నిర్బంధ శిబిరాలలోకి రాకుండా తప్పించుకొని, అడవులలోని లోతట్టు ప్రాంతాలకు వెళ్ళిపోయారనే విష యాన్నికూడా ఈ సందర్భంగా దృష్టిలో వుంచుకోవలసివుంది వారు, వారి కుటుంబాలూ ఏ క్షణంలోనైనా తమ నివాసాన్ని యిట్టే మార్చివేయటాని కనువుగా కనీస అవసరాలతోనే జీవితాలు గడిపారు. వారు తమ ధాన్యాన్ని పాతరవేసి దాచుకునేవారు చుట్టుముట్టడి దాడులు జరిగినప్పటికీ యువకులు, వృద్ధులు, స్త్రీలు, పిల్లలు మొదలుగాగల యావన్మంది ప్రజలూ, దళాలతో పాటే ఈ ప్రాంతాలలోకి తప్పుకున్నారు. సాయుధ పోరాటం వుపసంహరించ బడేంతవరకూ వారు అచ్చటనే నివసించారు.

## అడవిప్రాంతాలలో, గెరిల్లాల, కార్యకర్తల దుర్భరజీవితం

గిరిజన ప్రాంతాలలో ఆహారధాన్యాలు అతి స్వల్పంగా మాత్రమే పండుతాయి. గిరిజన ప్రజలు సంవత్సరంలో అత్యధికభాగం గడ్డి గింజలు, అడవుల్లో లభ్యమయ్యే కాయలు, పండ్లు, అడవిదుంపలు, యిప్పపువ్వు తింటూ

కాలం గడుపుతారు వారు అడవికోళ్ళను, దొనుము అనబడే అడవి దున్నలను వేటాడుతారు. సోమలు, ఆరికెలువంటి సన్న ధాన్యంగాని, జొన్నలుగాని లభ్యమయినప్పుడు వాటితో రొట్టెలు చెసుకుతిని, గంజి కాచుకుత్రాగి, కాలం వెళ్ళబుచ్చుతారు. మన దళాలూ, ఆర్గనైజర్లూ, గిరిజనులవలెనే ఇలాంటి నామమాత్రపు తిండితోనే జీవించెవారు. వారితో కలిసిమెలిసిపోయి, వాళ్ళ విశ్వాసాన్ని, గౌరవాన్ని చూరగొన్నారు.

పోలీసు, మిలటరీ బందోబస్తు మరింత అధికమవటంతో, పదే పదే దాడులు జరుగుతుండటంతో, ప్రత్యేకించి గెరిల్లాలను తిండిలేకుండా మాడ్చటం కోసమని అడవి ప్రాంతంనుండి కోయప్రజల నందరినీ నిర్బంధంగా ఖాళీ చేయించటంతో దళాలను పోషించటమూ, వాటిని నిలబెట్టటమూ అంతకంతకూ కష్టమయింది.

కోయప్రజలను బలవంతంగా ఖాళీచేయించటం ప్రభుత్వానికి ఎంతో కష్టమైంది పదే పదే చేసిన దాడులు, పాశవికంగా కొట్టిన దెబ్బలు, మహిళల మానభంగాలు, మూకవుమ్మడి హత్యాకాండ సయితం పనిచేయలేదు. దానితో ప్రభుత్వం, వారు నివసించే పల్లెలను తగులబెట్టివేయటానికి పూనుకుంది. సుమారు వెయ్యి పల్లెలు అ విధంగా తగులబెట్టివేయబడినట్లు అంచనా వేయబడింది అయినా కోయప్రజలు మాత్రం లొంగలేదు చివరకు, ప్రభుత్వాధికారులు, కోయల పశువులన్నింటినీ తోలుకుపోయి అడవుల బయట నిర్బంధించటంపైనే తమ ప్రయత్నాలను కేంద్రీకరించారు బీభత్సకాండ పల్లెలను తగులబెట్టటానికి తోడు ఈ విధంగా పసువులను తోలుకుపోవటంవల్ల, కోయ ప్రజలు తప్పనిసరై ఈ క్యాంపులలో నివసించారు. అయినా, తమ పొలాలను దున్నుకోవాలనో, అటవీ సంపదను సేకరించాలనో, ఏదో కారణంతో అడవులలోకి వెళ్ళటానికి పదే పదే ప్రయత్నించారు. ఆ విధంగా అడవులలోవున్న స్వల్ప వ్యవధిలో సయితం, వారు దళాలకు అత్యావసర వస్తువులను, ఆహార పదార్థాలను అందజేసేవారు.

ఈ అడవి ప్రాంతంలో ఒకసారి తినటానికేమీ తిండిలేని పరిస్థితి యేర్పడింది కొందరు దుష్టభూస్వాముల పశువులను అడవులలోకి తరుముకెళ్ళి వాటినిచంపి తిని, జీవించాలని నిర్ణయించారు వారా గొడ్డు మాంసాన్ని ఉప్పు రాసి ఎండబెట్టేవారు. ప్రతి గెరిల్లాకూ ఈ ఎండబెట్టిన ఉప్పుమాంసం, అత్యావసర పరిస్థితులలో వాడుకునేందుకు వారివద్ద వుంచుకొనడకోసం యివ్వబడేది.

అయితే, కృష్ణా అరణ్య ప్రాంతంలోని చెంచులు ఆవులను, ఎద్దులను పవిత్రంగా పరిగణించేవారు. వారు వాటిని తినకపోవటమే కాదు. వాటిని తినేవారిని పాపాత్ములుగా పరిగణించేవారు, ద్వేషించేవారు. అందువల్ల మన

గెరిల్లాలు వాటిని చంపి తినటాన్ని నివారించవలసివచ్చింది. ఒకసారి క్రొత్తగా రిక్రూట్ చేసుకోబడిన గెరిల్లా దళానికి తిండిలేక మాడిపోతున్న గడ్డు పరిస్థితిలో ఒక అవుదూడను చంపి తినవలసివచ్చింది అయితే చెంచు ప్రజలకు నచ్చజెప్పి, వారిని సంతృప్తిపరచటానికి నాయకత్వం ఎంతో తంటాలు పడవలసివచ్చింది అందువల్ల వారు తినటానికి వీలైన ఆకు అలములుతిని, దుంపలు తిని, వలవేసి పట్టుకోగలిగిన చిన్న జంతువులను తిని జీవించవలసి వచ్చింది. తుపాకులతో వేటాడడం నిషేధించబడింది అమూల్యమైన మందుగుండు సామగ్రి కొరతగా వుండటమేగాక, ఈ అడవులు చిన్నవైనందున మిలటరీ క్యాంపులు గెరిల్లా స్థావరాలకు సమీపంలోనే వున్నందున, తుపాకి కాల్పులు జరిపితే గెరిల్లాల రహస్య స్థావరాల ఆచూకీ మిలటరీవాళ్ళకు తెలుస్తుంది. అందువల్లనే తుపాకులతో వేటాడటం నిషేధించబడింది మరొక ప్రాంతంలో గెరిల్లాలు రెండు నెలలపాటు, ఉప్పు కూడా లేకుండా పావులీటరు సజ్జగంజితో ఎలా కాలం గడపవలసివచ్చింది యిప్పటికే గమనించాం.

అయితే, ఇంతటి దుర్భరపరిస్థితులలోనూ గెరిల్లాలు, కార్యకర్తలు, నాయకులు, స్త్రీలు,పురుషులు ఎంతోసౌభ్రాతృత్వంతోకలసిమెలసిజీవించేవారు

ఆహారం విషయంలోనేగాక, ఎండవానలబారి నుండి తలదాచుకోవటంకూడా వారికి సమస్యే అయింది. పెద్ద అరణ్యాల లోతట్టుభాగాలలో వారు గుడిసెలు వేసుకునేవారు అయినా భారీవర్షాల సమయంలో దళసభ్యులు ఎంతో బాధలకు గురికావలసివచ్చేది. వ్రేళ్ళాడుతున్న కొమ్మలపైన తమ కంబళ్ళను గుడారంలాగావేసి, దానిపైనొక గుడ్డకప్పి దానిక్రింద తలదాచుకొనేవారు కుంభవృష్టిలో సయితం దానిక్రింద రక్షణ లభించేది డిసెంబరు, జనవరినెలల్లో ఈ కొండలలో ఉష్ణోగ్రత 45 ఫారన్‌హీట్ డిగ్రీలకు పడిపోతుంది. అందువల్ల గెరిల్లాలకు శీతాకాలం దుర్భరంగా-వుండేది. శత్రువుకు ఆచూకీ యివ్వడమవుతుందన్నభయంతో అనేకచోట్ల మంటలు వేసుకొనేవారుకాదు. అందువల్ల చల్లనినేలమీదనో, రాతిమీదనో గడ్డినో, ఆకులనో ఏది దొరికితే దానిని పరిచి, ఆపైన ఒక కంబళిపరచి యిద్దరు, ముగ్గురు ఆనుకుని పండుకొని వారందరూకలిసి మరొక కంబళిని మీద కప్పుకునేవారు.

శీఘ్రగతిన కదలి పోవటానికి అనువుగా వుండటంకోసం, వారు తేలికపాటి సరంజామానే భుజాన వేసుకుపోవలసియుంది. తేలికగా వుండే, పరిమితమైన వ్యక్తిగతమైన సామానులు, తమ రేపన్లు, తుపాకి, మందుగుండు సామగ్రి అత్యవసరమైన మందులతోగూడిన ఫస్ట్ ఎయిడ్‌బాక్సు మోసుకుపోయేవారు.

ప్రతి దళానికి ఒక మందుల పెట్టె వెంట వుండేది ఆ పెట్టె ప్రమాణీక రించబడింది, రాజకీయ ఆర్గనైజరుకో మరొకరికో ప్రథమ చికిత్స చేయటంలో శిక్షణ యివ్వబడేది. అయితే, ఫారెస్టు ప్రాంతాలలో సమీపంలోగాని, తగి నంత స్వల్ప వ్యవధిలోగాని డాక్టర్లు అందుబాటులో లేనందువల్ల, ప్రథమ చికిత్సలో శిక్షణ పొందిన వీరే తీవ్రమైన గాయాలకు చికిత్స చేయటానికి ప్రయత్నించేవారు. తీవ్రంగా గాయపడిన, ఎముకలు విరిగిన గెరిల్లాలకు సయితం ధైర్యంగా కట్టుగట్టి, సిబిజాల్ పొడితో, పెన్సిలిన్ ఆయింట్ మెంట్ తో సాధారణమైన ఇంజెక్షన్లతో చికిత్స చేయటం నేను స్వయంగా చూచాను. డబ్బాపాలుగాని, ఫారెస్టులలోని పశువుల కాపరులవద్దనుండి కొన్నపాలుగాని జబ్బుపడిన, అవసరంలోవున్న అలాంటి కామ్రేడ్స్ కు ముందుగా యిచ్చేవారు.

ఆ రోజుల్లో మన దళాలను దారుణంగా వేధించిన జబ్బులలో మలేరియా జ్వరం వొకటి. పాల్ డ్రయిన్, క్వినైన్, క్వినైన్ యింజెక్షన్లు పెద్ద మొత్తాలలో మనవద్ద వున్నప్పటికీ, వారు పెద్దగా కోలుకొనలేకపోయారు. బలవర్ధకమైన పోషకాహారం లేకుండా, కేవలం మందులే వారు కోలు కొనేందుకు తోడ్పడలేదు తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్న కామ్రేడ్సు పండ్లు బిగబట్టుకుని, తోటి కామ్రేడ్స్ ను ఆనుకుని మైళ్ళ కొలది దూరం నడవటం నేను చూచాను! వారు ఆవిధంగా కష్టభూయిష్టమైన ఆత్మత్యాగంతో గూడిన జీవితం గడిపారు. అదంతా, కష్టజీవుల మహోన్నతమైన ఆశయ సాధనకోసం సాగిపోవటానికే! మహోన్నతమైన ఈ సౌభ్రాతృత్వాన్నిగూర్చి నమ్మాలంటే, ఎవరయినా తన కండ్లతో స్వయంగా చూడవలసిందే! దాన్ని కండ్లారా చూచే మహద్భాగ్యం, కొలది వారాలపాటు అందులో పాలుపంచు కునే మహదవకాశం నాకు లభించింది.

## మానుకోట - ములుగు - వరంగల్ ప్రాంతం

1949 మొదలు, 1951 అక్టోబరులో తెలంగాణా సాయుధ పోరాటాన్ని వుపసంహరించేంత వరకూగల మూడు సంవత్సరాల కాలంలో మానుకోట - ములుగు - వరంగల్ ప్రాంతం కమ్యూనిస్టు గెరిల్లాలకు - ప్రభుత్వ బలగాలకూ మధ్య ప్రధానమైన రణరంగమయింది. సూర్యాపేటనుండి దళాలు, ఆర్గనైజర్లు నాయకులలో అధిక సంఖ్యాకులు ఈ ప్రాంతంలోకే ప్రవేశించి వుద్యమాన్ని కొనసాగించారు

1948 సెప్టెంబరు - డిసెంబరు మధ్యకాలంలో, సూర్యాపేట తాలూకాలోని కోటపాడు, కుమ్మరికుంట్ల, చందుపట్ల, బీరవోలు కేంద్రాల లోను, మానుకోట తాలూకాలోని తెట్టలపాడు, గార్ల కేంద్రాలలోనూ

ప్రజలు వందల సంఖ్యలో కదిలారు. ఒక గ్రామం తర్వాత మరొక గ్రామంలో పాత భూస్వాములనుండి, ప్రజలకు వ్యతిరేకంగా కాంగ్రెస్ పోలీసులతో కలిసి పోయిన కొత్తభూస్వాములనుండీ ధాన్యం స్వాధీనం జేసుకున్నారు. స్వాధీనం చేసుకున్న ధాన్యమూ, పైరూ, 8 నుండి 10 వేల బస్తాలవరకూ వుంటుందని అంచనా వేయబడింది

అదేవిధంగా, నల్గొండతాలూకా చిత్తలూర్, నక్రేకల్లు కేంద్రాలలో, సూర్యాపేట తాలూకాలో, వర్ధమానుకోట, కేసనపల్లి, బొప్పారం, కందిగట్ల, ఎల్కపల్లి, కోడూరు, చిల్పకుంట, కోటపాడు, తుమ్మలపెనుబాడు కేంద్రాలలో వ్యవసాయ కార్మికులు రోజులతరబడి సమ్మెలుచేసి, తమ వేతనాల రేట్లను నిలబెట్టుకున్నారు. నెలకు తొంభై శేర్ల ధాన్యం నిలుపుకు న్నారు. మాసూళ్ళ తరుణంలో రోజుకు ఆరుశేర్ల ధాన్యం వేతనం సాధించు కున్నారు. రూపాయికి ఏడుశేర్ల చొప్పున భూస్వాములచేత ధాన్యం అమ్మిం చారు. ఈ పోరాటాలను అణచటానికి పంపబడిన సైనికుల, పోలీసుల రాకపోక లను అరికట్టేందుకుగాను కోటపాడు, రాగిపాడు ప్రాంతాలలో రోడ్లమీద గోతులు సయితం త్రవ్వారు.

అయితే, ఆరేడువేల మంది బలగంగలిగిన భారతసైన్యం పోలీసులు వుధృతంగా దాడులు సాగించారు. ఒకేసారి పదినుండి ముప్ఫైవరకు గ్రామాలపై బడి గాలింపు చర్యలపేర దాడులుజేశారు. స్థానిక అజ్ఞాతపార్టీ, గెరిల్లా కార్యాలయానికి అందిన అసమగ్ర సమాచారాన్నిబట్టి, ఈ దాడులలో 6500 మందివరకూ పాశవికమైన హింసలకు గురిజేయబడ్డారు. వీరుగాక పదులవేల సంఖ్యలలో ప్రజలను మందలువేసి లారీలతోకొట్టి బీభత్సానికి గురిజేశారు. ఆ సందర్భంగా అరవైమంది మృతిజెందారు మూడువందలమంది స్త్రీలను చెరిచారు. అందులో నలభైమంది మృతిజెందారు. 42 మంది పార్టీ, దళ సభ్యు లను, 15 మంది సామాన్య రైతులను కాల్చిచంపారు.

బీభత్సకరమైన ఈ దాడుల ఫలితంగానే, మన పార్టీ సభ్యులలో నూరింట నలభైమంది పట్టుబడ్డారు. మరో నలభైశాతం కార్యకలాపాలకు దూర మయ్యారు. నూరింట యిరవైమంది మాత్రమే కార్యకలాపాలు కొనసాగించారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు చెల్లాచెదరైపోయారు. వారితో సంబంధాలు పెట్టుకోవటం సాధ్యపడలేదు వారు తమంత తాముగానే పని చేశారు. 7 గురు జోనల్ ఆర్గనైజర్లు, 13 మంది సెంటర్ ఆర్గనైజర్లు, మొత్తం 70 మంది సభ్యులుగల పది దళాలుమాత్రమే కొంతవరకు నిర్మాణయుతమైన స్వరూపంలో గార్ల ఫారెస్టు ప్రాంతాలకు చేరారు. రైతాంగంలోని ధనిక సెక్షన్లు ఉదార స్వభావంగల చిన్న భూస్వాములు నైజాం – రజాకార్ రోజులలో పార్టీకి,

ఉద్యమానికి అనుకూలంగావున్నా, "పోలీసు చర్య" అనంతరం వ్యతిరేకంగా తయారయ్యారు. మధ్యతరగతివర్గాలు భ్రమలకులోనై ఊగిసలాడారు వారు తమ భ్రమలు కోల్పోవటానికి ఈ కొలదివారాల అనుభవమే చాలు.

మానుకోట – వరంగల్ ప్రాంతంలో విచ్చలవిడిగా సాగించబడిన దారుణ నిర్బంధపద్ధతులనుగూర్చి ఒక అవగాహనకు రావటానికిగాను, రాష్ట్ర కేంద్రానికందిన ఒక నివేదిక సారాంశాన్ని దిగువనిస్తున్నాం.

ఎల్లారుగూడెం · రామడుగు జగన్నాథరావు, బంజారాదారు. భూములన్నీ ఆయనవే. ఆయన తుపాకీచేతబట్టి నైజాం – రజాకార్‌పాలన కాలంలో మనపోరాటపు తొలిరోజులలో సయితం పిండిప్రోలు కేంద్రంలో దాడులలో పాల్గొన్నాడు. ఆ రోజులలో తన యింటిపై జరిగిన గెరిల్లా దాడి నుండి ఆయన తప్పించుకున్నాడు. పాలెంపల్లిలోని కాంగ్రెసు ఆఫీసులో మకాం పెట్టాడు. ఆ కాంగ్రెసు ఆఫీసులో వుండికూడా, కమ్యూనిస్టు గ్రామాలపైన, దళాలపైన దాడిజేయటానికి అతడు రజాకార్లకు సహాయపడుతుండేవాడు భారత సైన్యాలతో ఆయన తిరిగి వచ్చాడు ఒక క్యాంపు పెట్టించాడు. అతని స్వగ్రామమైన ఎల్లారుగూడెంలో ఒక కాల్బల దళం, ఆశ్వీక దళం, మకాం బెట్టింది. ఇది పిండిప్రోలు జగన్నాథరెడ్డి, జన్నారెడ్డి దేశముఖు, మద్రిపెడ దామోదరరెడ్డి, జగన్నాథరావులకు కేంద్ర స్థానం. ఇదొక మృత్యు గహ్వారం. కాంగ్రెస్ నాయకుడు రుద్రదేవ్‌కూడా ఈ కేంద్రంలో చేరాడు ఈ కేంద్రం నుండి వాళ్ళు తాలూకాలోని ఏ కేంద్రం మీదనైనా దాడిచేస్తూ వుండేవారు.

స్త్రీలను చెరచడం, ప్రజలను చిత్రహింసలపాలు జేయటం, వారి యిండ్లను లూటీ జేయటం నిత్య కార్యక్రమమైంది

ప్రతి గ్రామంలోనూ స్త్రీలు అవమానాలకు, మానభంగాలకు గురి జేయబడ్డారు. చెరచబడ్డారు. గర్భవతులైనా, అప్పుడే ప్రసవించిన వాళ్ళైనా, వృద్ధ స్త్రీలైనా విచక్షణారాహితంగా ఒక్కొక్క స్త్రీని నలుగురైదుగురు ఒకే సమయంలో పాశవికంగా చెరిచారు. అనేక సందర్భాలలో అనేకమంది దుర్మార్గులచే స్త్రీలు చెరచబడ్డారు.

కమ్యూనిస్టులనో, కమ్యూనిస్టులకు తిండిబెట్టారనో అనుమానించిన వారిని పెద్దఎత్తున అరెస్టుజేసి, క్యాంపులలో పెట్టి కొట్టేవారు.

చేతివ్రేళ్ళ గోళ్ళక్రింద గుండుసూదులు గుచ్చటం, పాదాలలో ఇనపసీలలు దిగగొట్టటం, శరీరంలోని మర్మావయవాలలోను, యితర సున్నిత మైన భాగాలలోనూ కారం కూరటం, నోటిలో మూత్రం పోయటం, బూటు కాళ్ళతో మీదికెక్కి త్రొక్కటం, తుపాకి మడమలతో పొడవటం జరిగేది.

తుపాకి కాల్పులుజరిపి చంపడం మామూలే. పిండిప్రోలు జగన్నాథ రెడ్డికి వ్యతిరేకంగా పోరాడిన, పిండిప్రోలు గ్రామ నాయకుడు రాయల జగ్గయ్యతోసహా 33 మందిని, మూడురోజులపాటు చిత్రహింసలకు గురిజేసిన అనంతరం కాల్చిచంపారు.

చెట్లకొమ్మలకు తలక్రిందుగా వ్రేళ్ళాడదీశారు వాళ్ళను గంటల తరబడి అలాగే వ్రేళ్ళాడనిస్తూ, క్రింద మంటలు వేశారు. ఆ విధంగా రెండు మూడు రోజులు జరిగింది

ఒకరి ప్రక్కనొకరిని బోర్లా పరుండిబెట్టి బూటుకాళ్ళతో, వాళ్ళ మీదకెక్కి త్రొక్కటం, గంతులువేయుటం జరిగింది.

చెట్టుక్రింద బారులుదీర్చి నిలబెట్టి వారిని ఒక తాడుతోకట్టి చెట్టు కొమ్మమీదుగా పైకిలాగి, ఒక్కసారిగా క్రిందికి పడవేసేవారు. అలా పడిన వాళ్ళపై మసలే నీరు పోసేవారు.

కాళ్ళు చేతులు కట్టి, గోనె సంచులను పడవేసినట్లు ఆరుబయట పడవేసి ఎండయినా, వానయినా, చలైనా రెండు రోజులపాటు అక్కడే వుంచారు. వారికి ఎలాంటి తిండిపెట్టలేదు. మంచినీళ్ళయినా యివ్వలేదు.

ముండ్లపొదలలో పడవేసి, పైనకూడా యింకా ముండ్లకంప పడవేసి బడితెలతో బాదారు. ఆ విధంగా బాదుతుండగా యిద్దరు మృతి జెందారు. కోయప్రజలను లొంగదీసుకోవడం కోసం, ఈరకమైన హింసా పద్దతిని ప్రత్యేకంగా వుపయోగించారు.

[1960లో, అనగా ఈ ఘటనలు జరిగిన పదిసంవత్సరాల అనంతరం, బూర్గంపాడు తాలూకాలో ఒక కోయ రైతు ఈ ఘటనలనుగూర్చి నాకు స్వయంగా వివరించాడు ఈ దురంతాలు సాగించినవారిపట్ల, ఆయన అంత రాంతరాలలో ఎక్కడో అణగిమణిగి దాగియున్న ఆగ్రహాన్ని, విద్వేషాన్ని అర్థంజేసుకోవాలంటే ఆయన ముఖ కవళికలను చూడవలసిందే, ఆయనచెప్పిన తీరును చెవులారా వినవలసిందే—సుందరయ్య]

తప్పనిసరి పరిస్థితులలో, దళాలు కమ్యూనిస్టు ఆర్గనైజర్లూ అడవుల లోకి వెళ్ళిపోవడం జూచి తమ భూములను. పంటలను కబళించటానికి భూస్వాములు చేసిన ప్రయత్నాలను 1949 ఫిబ్రవరి – మార్చి నెలల్లో, సూర్యాపేట, పిండిప్రోలు మైదాన ప్రాంతాలలోని ప్రజలు ప్రతిఘటించారు. అన్నం మూటలు, యితర సరుకులూ వీపున వేసుకుని, ప్రజలు దళాలకోసం వెదక నారంభించారు. దళాలు తిరిగి రావాలని వారు ఆదుర్దాతో ఎదురు జూస్తు న్నారు. దళాలు తిరిగి సంఘటిత పరచబడ్డాయని, సమీప గ్రామాలలో కొన్ని

చర్యలు తీసుకున్నాయనీ వారు తెలుసుకున్నారు. దానితో సెప్టెంబరు–డిసెంబరుమధ్య వుధృతంగా దాడులు సాగించినప్పుడు తమ అధీనంలోనుండి కోల్పోయిన భూములను ప్రజలు తిరిగి ఆక్రమించుకో నారంభించారు. పిండిప్రోలు, మేటురాజిపల్లి, రాంపురం, కుమ్మరికుంట్ల కేంద్రాలలో రైతులు భూస్వాముల మనుషులను పారద్రోలారు. తమ భూములను దున్ని సాగుజేసుకొనటానికి వారుచేసిన ప్రయత్నాలను వమ్ముజేశారు. ప్రజలే స్వయంగా సాగుజేసుకో నారంభించారు. దుష్ట భూస్వాములు తిరిగి పట్టణాలకు వెళ్ళిపోవడం ప్రారంభమైంది.

ఇదిగాక పిండిప్రోలు, ఇల్లెందు కేంద్రాలలోని సుమారు 90 గ్రామాలలో వ్యవసాయ కార్మికులు సమ్మెలు జరిపి వేతనాల పెంపుదల సాధించుకున్నారు సుమారు యిరవై గ్రామాలలో స్త్రీ కార్మికులు ముందుపీటీన నిలిచారు. స్వతంత్రంగా వారే సమ్మె జేశారు. పోలీసులను తీసుకొస్తామని భూస్వాములు బెదిరించారు. "మీరు మీ మిలటరీని తీసుకొస్తే, మాకు సహాయపడటానికి మేము మాగెరిల్లా దళాలను తీసుకొచ్చుకుంటాం" అని సమ్మెజేస్తున్న స్త్రీలు సమాధానమిచ్చారు. ఈ సమ్మెల ప్రభావం రామాపురం, బోడ్లాడ కేంద్రాలలోని పదహారు గ్రామాలకు వ్యాప్తిగాంచింది.

గెరిల్లాలకోసం వెదుకుతూ తమ గ్రామాలపై దాడిజేసి, తమను దారుణమైన అత్యాచారాలకు గురిజేసిన పోలీసులకు, మిలటరీకి వ్యతిరేకంగా కూడా నామాలపాడు, పందిపంపుల ప్రాంతాలలో కోయప్రజలు తిరుగుబాటు జేశారు మిర్యాలపెంట, లక్ష్మీపురం, ఖంబాలపల్లి గ్రామాలలో మొత్తం పదిచోట్ల శాశ్వతక్యాంపులేర్పాటుజేయటానికి శత్రువు పూనుకున్నాడు

*గార్ల, పాఖాల ప్రాంతాలు :* వందమైళ్ళమేరకు బాటలను, రోడ్లను ధ్వంసంజేయటంలో దాదాపు యాభై గ్రామాలకుజెందిన 1025 మంది ప్రజలు పాల్గొన్నారు. ఫారెస్టుప్రాంతంలో ఒక సంవత్సరకాలంలో ఐదు నుండి ఏడు వందలమందిదాకా ప్రజలు సంవత్సరకాలంలో మరో 150 మైళ్ళ బాటలను ధ్వంసం జేశారు. వారు పెద్ద చెట్లునరికి బాటలకడ్డంగా పడవేశారు. బాటలపై లోతైన గోతులు త్రవ్వారు గుట్టలమధ్య, దట్టమైన అడవులలోగుండాగల యిరుకుబాటలపై బండలు దొర్లించి, చెట్లుకొట్టిపడవేసి వాటిని మూసివేశారు. అలాంటి రెండు యిరుకుబాటలపైన సుమారు యిరవై రోజులపాటు ప్రజలకు, మిలటరీకిమధ్య నిరంతరపోరాటం సాగింది. ప్రజలు, దళాలూ బాటలు మూసివేయటం, పోలీసులూ, మిలిటరీ వాటిని తొలగించటం మూడుసార్లు జరిగింది.

కోయయువకులు సైనికశిక్షణ పొందటానికి ముందుకొచ్చారు. గెరిల్లాలు వారికి శిక్షణ గరపారు. అరవైమంది స్థానిక గ్రామదళాలలోను, నలభైమంది రెగ్యులర్ దళాలలోనూ చేరారు. తమబిడ్డలు సైనికశిక్షణ పొందటం చూచి, తలిదండ్రులు గర్వపడ్డారు, సంతోషించారు.

ఈ సమయంలో ఒకరోజున ఒక కోయగూడెంలో కొలదిమంది మిలటరీవాళ్ళు ఒకస్త్రీని చెరచటానికి ప్రయత్నించారు స్త్రీలు, పురుషులు అంతా ప్రతిఘటించారు. వారిని చుట్టుముట్టారు. స్త్రీలు రోకళ్ళు చేతబట్టారు మిలటరీ వాళ్ళను తరిమివేశారు.

ఈ సంవత్సరం, ప్రజలు తాము సాగుజేసుకుంటున్న భూమిలో 80 శాతం భాగాన్ని ఫారెస్టుప్రాంతంలోగల భూమిని దాదాపు మొత్తంగానూ నిలబెట్టుకున్నారు. అయితే సూర్యాపేట మైదానప్రాంతంలో మాత్రం తక్కువ శాతం భూమిని మాత్రమే నిలబెట్టుకోగలిగారు. సుమారు ముప్ఫై గ్రామాలలో, 1948 దాడుల సమయంలో తాము కోల్పోయిన భూములను భూస్వాముల నుండి రైతులు తిరిగి ఆక్రమించుకోగలిగారు పారెస్టు ప్రాంతాలలో సుమారు 150 గిరిజన పల్లెలలో ఫారెస్టు భూములను సాగుకుయోగ్యంజేసి కొత్తపోడు సాగును విస్తరించారు. ఈ తొంభై గ్రామాలలోనూ వ్యవసాయ కార్మికులు సమ్మెజేసి, అంతకుముందు అమలులోవున్న మూడుశేర్లకు బదులు, రోజుకు ఆరుశేర్ల ధాన్యాన్ని వేతనంగా సాధించుకున్నారు. కొలది గ్రామాలలో ఎనిమిదిశేర్లుకూడా సాధించుకున్నారు. అరవై గ్రామాలలో బీడీ ఆకుల కోతకు, అంతకుముందు కట్టకు మూడు పైసలనుండి ఆరుపైసల రేటును సాధించుకున్నారు.

పోలీసు, మిలటరీ క్యాంపులపైనా, వాళ్ళ గస్తీ కేంద్రాలపైన గెరిల్లాలు 31 దాడులు జరిపారు. 34 మందిని చంపివేశారు. మరో 20 మందిని గాయపరిచారు. గ్రామాలలో, శత్రు ఏజెంట్లను, పోలీసులకు వార్త లందజేసే వారిని, ప్రజలను క్రూరంగా హింసించే వారిని, దుష్ట భూస్వాములను మొత్తం సుమారు అరవై మందిని ప్రజలు, దళాలూ చంపివేశారు.

అయితే ఈ సంవత్సరకాలంలో, ఈ ప్రాంతంలో పార్టీకికూడా తీవ్ర మైన నష్టాలే జరిగాయి. 8 మంది జోనల్, సెంటర్ ఆర్గనైజర్లు, ఇద్దరు దళ కమాండర్లు, పదిమంది అనుభవజ్ఞులైన దళ సభ్యులూ చంపివేయబడ్డారు

కాని పార్టీ తన నిర్మాణాన్ని విస్తరించుకోగలిగింది. ఇరవై గ్రామాలలో 38 గ్రూపులలో 176 మంది పార్టీ సభ్యులు, సహాయ సభ్యులూవున్నారు. మరోఅరవై గ్రామాలలో మరో 250 మంది మిలిటెంట్లున్నారు. మూడు వందల గ్రామాలతో క్రమబద్ధమైన సంబంధాలున్నాయి.

1950 సంవత్సరంలో

ఉద్యమం అడవి ప్రాంతాల లోతట్టు భాగాలకు వ్యాపించింది. తూర్పున, ఉత్తరాన గోదావరి నదివరకూ చేరింది ములుగు, పరఖాలవరకూ విస్తరించింది. ఆ తర్వాత కరీంనగరం జిల్లాలోని మంథెనకూ, మరో 450 గ్రామాలకూ వ్యాపించింది.

గుండాల జోన్‌లో కోయప్రజలు పెద్దఎత్తున కదిలారు. గుండాల గ్రామ పటేలునుండి, అనంతారం మక్తేదారునుండి 1060 బస్తాల ధాన్యం, 560 పశువులనూ స్వాధీనం జేసుకున్నారు. సుమారు మూడున్నరవేల ఎకరాల ఫారెస్టు బంజరును సాగులోకి దెచ్చారు గుండాల గ్రామ పటేలు, పట్వారీలకు జెందిన వంద ఎకరాల భూమిని, గార్లలో 264 ఎకరాలు, నర్సంపేట తాలూకా (పాఖాల)లో వెయ్యి ఎకరాలు బంజరు భూమిని, భూస్వాముల మిగులు భూమిని (150 ఎకరాలు) స్వాధీనం జేసుకుని పంచారు.

గుండాల ప్రాంతంలో, కోయప్రజలలో వుద్యమం లోతుగా వేరూనుంది బాగా విస్తరించింది. అక్కడ సోవియట్ జీవితాన్నిగూర్చి తెలిపే చిత్రపటాల ప్రదర్శనను పార్టీ ఏర్పాటు చేయగలిగింది. "ఇక్కడ మనంకూడా, అలాంటి జీవిత పరిస్థితులను ఎప్పటికి సాధించుకోగలుగుతాం?" అనే ఆవేదనను, వ్యక్తపరిచారు.

పోలీసు లొకసారి, ఒక కోయగూడెంపై దాడి జేశారు మగవాళ్ళనందరినీ అరెస్టుజేసి క్యాంపుకు తీసుకుపోయారు చుట్టుప్రక్కలగలపదిగూడెములలోని స్త్రీలు పోలీసులను చుట్టుముట్టారు. పోలీసులు కదలటానికి వీలులేకుండా చేశారు. పోలీసులు కాల్పులు జరిపారు. అయినా స్త్రీలు అచ్చటినుండి వెళ్ళిపోవటానికి నిరాకరించారు తమ మగవాళ్లను వదిలిపెడితే తప్ప అచ్చటినుండి కదిలేదిలేదన్నారు. పోలీసులపై రాళ్లు విసిరారు.

"బ్రిగ్స్‌పథకం" ప్రకారం, ఈకోయ గూడెములన్నింటినీ ఖాళీజేయించి, వాళ్లను ఫారెస్టులనుండి బయటకుపింపి, వెలుపలనున్న నిర్బంధ శిబిరాలలోకి తరలించాలని ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నిస్తోంది. ఈ ప్రాంతంలో చాలా పోలీసుక్యాంపు లున్నప్పటికీ, పదే పదే దాడులు జరిగినప్పటికీ, గ్రామాలను, యిండ్లనూ తగులబెట్టినప్పటికీ, 1951 సంవత్సరానికి యింకా ముప్పైగూడెములు ఈ వలయాన్నుండి తప్పించుకున్నాయి ఒకచోట నివసించటం అసాధ్యమయ్యేట్లు పోలీసులు చేసినప్పుడు, మరొక చోటకు మారుతూ ఫారెస్టు ప్రాంతాలలోనే వారు నివసిస్తూ వచ్చారు.

ప్రజలపైన ఈ దాడులు ఎంతటి దుర్మార్గంగా సాగిందీ వివరించటం కోసం, గుండాల గ్రామంపై పోలీసు దాడికి సంబంధించిన వివరాలను దిగువనిస్తున్నాం

## గుండాల గ్రామంపై దాడి

1950 సెప్టెంబరు 6 వ తేదీన అల్లాపల్లి, సింగరేణి గనులు, కోమటి గూడెం మొదలైన క్యాంపులనుండి సుమారు 15 వందల బలగంతో మిలటరీ, పోలీసులు గుండాల ప్రాంతంపై ముట్టడిజేశారు.

జొన్నపంట కోతకు సిద్ధంగావున్న సమయంలో ఈదాడి జరిగింది. వాళ్ళు తాము తీసుకుపోగలినంత పైరును కోసుకుపోయారు మిగతా పైరుపై పశువులను తోలారు.

పంట చేతికొస్తే కొలది వారాలపాటు, రోజూ వొకపూట తిండయినా లభిస్తుందని ఎదురుజూస్తూ పస్తులుంటున్న కోయ, తదితర ప్రజలకు జెందిన వందలాది బస్తాల పంటను వాళ్ళు ధ్వంసంజేశారు. వారి నోటిదగ్గర కొచ్చిన కూడు తీశారు.

పంటలను ధ్వంసం జేయటంతోనే ఈ పశువులు ఆగలేదు కోయ ప్రజలను భయపెట్టి, ప్రభుత్వం ఏర్పాటుజేసిన సెటిల్మెంటు క్యాంపులలోకి పంపటంకోసం వాళ్ళు కోయ గ్రామాలను తగులబెట్టటం ప్రారంభించారు. ఒడ్డుగూడెం, కొడిశల, సాంపల్లి, రాళ్ళగడ్డ, దేవరగూడెం, తింగూడెం, చింత గూడెం మొదలైనచోట్ల ఒక్కరినైనా వదలలేదు. ఆహారధాన్యాలు, బట్టలు, గృహోపకరణాలతోసహా యిండ్లలోగల సర్వస్వాన్నీ తగులబెట్టి వేశారు. వేటినీ కాపాడుకొనటానికి ప్రజలను పోనివ్వలేదు. సాంపల్లిలో ఒక వృద్ధస్త్రీని, ఒడ్డుగూడెంలో మరొకరినీ మంటల్లో పడవేసి సజీవదహనం చేశారు. మరోవైపున పశుప్రాయులై ఏరు ప్రజలపై చలోక్తులు విసురుతూ కూర్చున్నారు.

ఈ పాశవిక చర్యలన్నీ జరిపిన తర్వాత, వాళ్ళు కాంగ్రెస్ ప్రభుత్వాన్ని బలపరచటంకోసం ప్రజలను బుజ్జగించదలపెట్టారు. వివిధ చర్మ వ్యాధులతోను, బొబ్బలతోనూ బాధపడుతున్న వాళ్ళకు మందులిచ్చారు. కట్లుగట్టారు. అక్కడక్కడా కాంగ్రెస్ జెండా లెత్తారు. తమది నైజాం పాలన కాదని, కాంగ్రెస్ ప్రభుత్వమనీ, ప్రజల పరిస్థితులను మెరుగుపరచబూనుకున్న ప్రభుత్వమనీ, ప్రజల కెలాంటి భయమూ అవసరం లేదని పేర్కొంటూ, "కమ్యూనిస్టు హింసాకాండ"ను ఎదిరించి పోరాడవలపిందిగా ప్రజలకు విజ్ఞప్తి జేస్తూన్న పోస్టర్లను అంటించారు తాము ప్రజలకు తిండి, బట్టా కల్పిస్తామని,

వారశాలలు, ఆస్పత్రులూ తెరుస్తామని, తామచ్చటికివచ్చింది, ప్రజల గొంతులు గోసే కమ్యూనిస్టులకోసమేనని ఆ పోస్టరులో పేర్కొన్నారు. తమ బలాన్ని గూర్చి, తమ ఆయుధ సంపత్తినిగూర్చి గొప్పలు చెప్పుకున్నారు. స్వల్పకాలం లోనే తాము కమ్యూనిస్టులను తుడిచిపెట్టగలమని డంబాలు పలికారు. సెటిల్మెంట్లనుండి పారిపోవటానికి ప్రయత్నించినవారినీ, అచ్చట నివసించ టానికి వెళ్లనివారిని వేటాడి పట్టుకుని, వాళ్ళపట్ల కఠినంగా వ్యవహరించగల మని బెదిరించారు

గుండాల గ్రామానికిజెందిన కోమలి రామచంద్రుడువంటి కులపెద్దలు, బ్లాక్‌మార్కెట్ వ్యాపారస్తులు కొందరు గిరిజనులను కమ్యూనిస్టులకు వ్యతిరే కంగా తిప్పటంకోసం ఫారెస్టు ప్రాంతాలను వదలి వెళ్ళి సెటిల్మెంట్లలో నివ సించేట్లు చేయటానికి ప్రయత్నాలను పుధృతంజేశారు. యెల్లాపురంలో ఒక తెగపెద్ద గుత్తయ్య అనే ఒక దళ సభ్యుడిని పోలీసులకు వొప్పగించేంతవరకూ పోయాడు. అయినా వాళ్ళ ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. సెటిల్మెంట్లకు పోవటానికి అనేకమంది గిరిజనులు నిరాకరించారు. బలవంతాన అక్కడికి పంపబడినవారుకూడా ఏదో వొకవిధంగా ఈ సెటిల్మెంట్లనుండి బయటపడా లని తమ పాత ఫారెస్టు ప్రాంతాలకు చేరాలని ఎంతగానో ప్రయత్నించారు. నిర్బంధంవల్లనే తాము క్యాంపులలోకి వెళ్ళవలసి వచ్చిందనీ త్వరలోనే తిరిగివచ్చి, వారితో చేరుతామనీ గెరిల్లాలకు వారు కబురంపారు. "సోదరు లారా, మమ్మల్ని అపార్థం చేసుకోవద్దు మీరు మాతోనే వుండండి. మాకు మీరు చెబుతూవుండే విషయాలు చెబుతూనే వుండండి మేము మీ తరఫునే వుంటాం మిమ్మలను కాపాడుతాం. పోలీసులపైన, పీడకులపైనపోరాడుతాం" అని వారు స్పష్టం జేశారు

గార్లజాగీరు ప్రాంతంలోని, కట్టుగూడెంలో, 1950 సెప్టెంబరు 23న 18 మంది మిలటరీవాళ్ళు, కొందరు హోంగార్డులతో కలసివచ్చి, స్త్రీ, పురుష విచక్షణలేకుండా, ప్రజలపై తమ మామూలుదాడి ప్రారంభించారు. స్థానికదళం ఆర్గనైజర్ నాయకత్వాన ప్రజలు సైనిక బలగాన్నెదుర్కొన్నారు. ఆ ఘర్షణలో, ఒక సుబేదారు, అతని మనుషులు ముగ్గురూ మృతిజెందారు. మరో ఐదుగురు గాయపడ్డారు. ప్రజలు వాళ్లదగ్గరనుండి రెండు సబ్ మెషీన్ గన్‌లు స్వాధీనం చేసుకున్నారు సమీపంలోనేవున్న బుగ్గ క్యాంపునుండి గస్తీదళం వాళ్లకు తోడ్పడటానికి వచ్చేసరికల్లా దళం ఆ ఆయుధాలనే వుప యోగించే వాళ్ళను పారద్రోలింది.

అయితే ఒక కంపెనీ మేరకు పెద్ద సైనికబలగంవచ్చి దాడిజేసింది. ప్రజలు ప్రతిఘటించారు. కాని, ఇందులో దొగ్గల పండయ్య, మూసి

పుల్లయ్య, మరో యిరువురూ తమ ప్రాణాల నర్పించవలసివచ్చింది. మిగతా వాళ్ళు ఫారెస్టులోకి తప్పుకున్నారు. సైనికులు దారుణంగా ప్రతీకార చర్యలకు పూనుకున్నారు తమకు చిక్కిన వారందరినీ కాల్చిచంపారు. అయితే, గ్రామ ప్రజలందరూ, రోజుల తరబడి ఫారెస్టులలో నివసించి ఆత్మరక్షణ గావించు కున్నారు శత్రువుకు తాము దాగియున్న తావునుగూర్చి జాడ తెలియకుండా జాగ్రత్తపడటంకోసం, తమ బిడ్డలు ఏడవకుండా అరికట్టటానికిగాను, వాళ్ళ నోళ్ళను గుడ్డతో మూసేవారు. తమ కుక్కలను చంపివేశారు కోళ్ళు నిశ్శబ్దంగా వుండటంకోసం వాటి మెడలకు రాళ్ళు కట్టేవారు.

ఈ సంవత్సర కాలంలో శత్రువు రెండువందల గ్రామాలను పూర్తిగా తగులబెట్టి వేశాడు పదివేల యిండ్లు దగ్ధమై పోయాయి 16280 మంది ప్రజలపై వివిధ రకాలయిన అత్యాచారాలు జరిగాయి. అందులో 73 మంది కాల్పుల వల్లనో, చిత్రహింసలకు గురిచేయబడినందువల్లనో మరణించారు. తొంభై మంది స్త్రీలు చెరచబడ్డారు. 212 మంది స్థానిక మిలిటెంట్లు అరెస్టుచేయబడి, జైలులో నిర్బంధించబడ్డారు.

ఫారెస్టు ప్రాంతాలలో ప్రతిఘటన సాగుతుండగానే సుమారు నలభై గ్రామాలలో ప్రజలు తొమ్మిదివందల బస్తాల ధాన్యం స్వాధీనం చేసుకొని పంచుకున్నారు. మరో 13 వందల బస్తాలధాన్యాన్ని ధ్వంసంచేశారు. బాటలను రోడ్లను ధ్వంసం చేశారు పోలీసులకు సమాచారంఅందజేసేవాళ్ళపై వరుసగా దాడులు సాగించి, అలాంటి ఏజెంట్లను 11 మందిని చంపివేశారు.

1950 వ సంవత్సరంలో సాగించబడిన కార్యకలాపాలను సంగ్రహంగా పేర్కొనాలంటే .

260 గ్రామాలలో 13 వేల ఎకరాల బంజరు, ఫారెస్టు భూములు కొత్తగా ఆక్రమించుకోబడి సాగుజేసుకోబడినాయి. రెండు వందల ఎకరాల మేరకు భూస్వాముల మిగులుభూమి పేదలకు పంచబడింది. సుమారు 150 గ్రామాలలో 1824 మంది ప్రజలు రంగంలోకొచ్చి 2890 బస్తాల ధాన్యం స్వాధీనం జేసుకున్నారు. 30 గ్రామాలలో వ్యవసాయ కార్మికులు అధిక వేతనాలకోసం సమ్మెలుజేశారు. బీడీఆకులకోతకు గతసంవత్సరమే సాధించుకున్న కట్టకు ఆరుపైసలరేటును నిలబెట్టుకోవటంకోసం సమ్మె జేశారు. ఆ రేటును క్రొత్తనా యితర గ్రామాలకు విస్తరింపజేశారు మద్ది, టేకుచెట్లు కొట్టినందుకు గతంలో బండికి రూపాయి వేతనం వుండేది. ఇప్పుడు రెండు రూపాయలు సాధించుకున్నారు, రంపకోతకూలి గతంలో రెండురూపాయలుండేది, ఇప్పుడు

ఆరు రూపాయలు అయింది. వెదురు నరికినందుకు గతంలో రూపాయి, రూపాయిన్నరవుండేది. ఇప్పుడు ఆరురూపాయలైంది.

పార్టీ 170 గ్రామ కమిటీలను ఏర్పాటు జేయగలిగింది. 85 గ్రామాలలో మూడువందలమందిని స్థానిక వాలంటీర్లుగా చేర్చుకోగలిగింది. పార్టీ సభ్యత్వం 34 గ్రామాలలో, 52 సెల్సులో, 280 కి పెరిగింది. 19 మంది ఆర్గనైజర్లుగాను, నలుగురు దళ కమాండర్లుగాను ప్రమోట్ చేయబడ్డారు.

పోలీసులపైన, మిలటరీపైన గెరిల్లాలు అరవై దాడులు జేశారు. వందమందిని చంపివేశారు. 24 మందిని గాయపరిచారు. గెరిల్లాలు, ముగ్గురు జోనల్ ఆర్గనైజర్లను, ముగ్గురు సెంటర్ ఆర్గనైజర్లను, ఒక దళ కమాండర్‌ను, 33 మంది దళసభ్యులను కొరియర్లను కోల్పోయారు. అలాకోల్పోయిన వారిలో జోనల్ ఆర్గనైజర్ బాలరాజు, సెంటర్ ఆర్గనైజర్లు రాజయ్య, వంగయ్యవున్నారు.

## 1951 వ సంవత్సరంలో - ఆదిలాబాద్ జిల్లాలో చెన్నూర్ - సిరిపూర్ ప్రాంతానికి విస్తరణ

మార్చి - ఏప్రిల్ మాసాలలో, వసంతకాలం, వేసవికాలం తిరిగి వచ్చింది. ఫారెస్టు ప్రాంతంలోని గెరిల్లాలపై దాడులుచేసి, నిర్మూలించటం కోసం దాడులు జరపటానికి శత్రువు తన బలగాలను కేంద్రీకరించ నారంభించాడు. మొత్తం ప్రాంతమంతటినీ చుట్టుముట్టటంకోసం మానుకోట, బొగ్గు గనుల ప్రాంతం, డోర్నకల్, నరసంపేట మిలిటరీ క్యాంపులలో యింకా అదనంగా సైన్యం దిగుతోంది

గాలింపు, దాడులు పెద్ద ఎత్తున ప్రారంభమైనాయి. ఫారెస్టులోని ఏడు నుండి పది గ్రామాలను ఏక కాలంలో చుట్టుముట్టటం జరిగింది గెరిల్లాల కోసం మూలమూలనా ప్రతిచెరువులో, ప్రతి వూటవద్ద వెదకనారంభించారు. ప్రతి నీటి వనరు వద్దనూ సైనికులు వరుసగా రెండు రోజులు నిఘా వేసి వుంచారు నీళ్ళకోసం గెరిల్లాలు అచ్చటికి రాక తప్పదని, అప్పుడు తాము సులువుగా వారిని నిర్మూలించవచ్చునని ఆశించారు మార్చి రెండవ వారంలో ఏకకాలంలో తొంభై నీటి వూటలవద్ద 12 వందల మందికిపైగా సైనికులు కాపలా గాశారు.

ప్రతి రోజూ ఎక్కడో ఒకచోట దాడి జరిగేది. కాల్పులు జరిగేవి. వర్షాలులేని కాలంలో 250 దాడులు జరిగాయి. వందలాది ప్రజలను పాశవికంగా హింసలకు గురిజేశారు. 16 మందిని నిలువునా కాల్చిచంపారు. శత్రువు

13 మంది గెరిల్లాలను మాత్రం పట్టుకోగలిగాడు. అయితే ఫారెస్టులనుండి మరికొన్ని గ్రామాలను ఖాళీచేయించగలిగాడు. దానితో ఆ ప్రాంతంలో మిగిలివున్న గ్రామాలసంఖ్య ముప్పైకి తగ్గిపోయింది.

అయితే ప్రజలు, దళాలు ఈ బీభత్సకరదాడులను ధైర్యంతో ఎదుర్కొన్నారు. ఆ దాడులను వోడించటానికి కృతనిశ్చయులయ్యారు ఫారెస్టుల వెలుపలగల క్యాంపు గ్రామాలలోకి ఈడ్చుకుపోబడిన కోయ ప్రజలు, అటవీ సరుకులను సేకరించటానికి బీడీ ఆకులకోసం, ఇప్పపువ్వు కోసం,గడ్డిగింజలకోసం ప్రతిరోజూ అడవులలోకివస్తూవుండేవారు ఆర్గనైజర్లను దళ నాయకులను కలుసుకుని, శత్రువు అనుపానులనుగూర్చి చెప్పటం వారికి అవసరమైన ఆహారపదార్థాలను యితర అవసర వస్తువులను అందజేయటం తమ విధిగా పెట్టుకున్నారు. అడవిలో మిగిలివున్న ముప్పై గ్రామాలలోని కోయ ప్రజలు అత్యంత జాగరూకతగల గెరిల్లాదళాలవలె ఎప్పటికప్పుడు తమ స్థానాన్ని మార్చుకుంటూ గెరిల్లా జీవితం గడుపుతుండేవారు. గెరిల్లాలకు తోడ్పడుతుండేవారు. రెగ్యులర్ గెరిల్లా దళాలలోకి తొమ్మిదిమంది స్త్రీలతో సహా 43 మంది క్రొత్తగా చేర్చుకోబడ్డారు.

ఈ మహిళా గెరిల్లాలు, కొరియర్లుగా ప్రత్యేక నైపుణ్యంతో వ్యవహరించారు. మరికొంతమంది మంచిదళసభ్యులు తుపాకులు ప్రయోగించటంలో, శత్రువుపై నిబ్బరంగా కాల్పులు జరపటంలో వారు దిట్టలు. వారిలో యిద్దరు దళాలకు ఉపనాయకు లయ్యారు.

భూస్వాములకు వ్యతిరేకంగా ప్రజలు తమ పోరాటాన్ని కొనసాగించారు. గార్ల, పాఖాల (నర్సంపేట) కేంద్రాలలో వారు రెండువందల పశువులను, నాలుగువందల బస్తాల ఆహారధాన్యాలను స్వాధీనం చేసుకున్నారు, గుండాల జోన్‌లో వంద పశువులను, వరంగల్ జోన్‌లో మూడువందల పశువులను, యాభైబస్తాల ధాన్యాన్ని స్వాధీనం చేసుకున్నారు

దళాలు గోదావరి నదినిదాటి, అదిలాబాద్ జిల్లాలోని చెన్నూర్ తాలూకాలో ప్రవేశించాయి ఆ తర్వాత వుత్తరపు కొసనగల తాలూకా యగు సిర్‌పూర్‌వరకూ విస్తరించారు ఆ ప్రాంతంలోని సుమారు రెండువందల గ్రామాలకు వుద్యమాన్ని వ్యాప్తిగావించారు. ఈ ప్రాంతంలో ప్రజలు కమ్యూనిస్టు గెరిల్లాల కార్యకలాపాలను గూర్చి తెలుసుకున్నారు. వారి రాక కోసం ఆదుర్దాతో ఎదురుజూస్తున్నారు. క్రొత్త ప్రాంతాలన్నింటిలో వలెనే యిక్కడ కూడా, భూస్వాముల ధాన్యాన్ని స్వాధీనం చేసుకుని పంచిపెట్టటానికి గ్రామ రికార్డులను అప్పు పత్రాలనూ తగులబెట్టివేయటానికి దళమూ, ప్రజలూ కలసే

పనిచేశారు. ఈచర్యల వెల్లువకు, బలం చేకూరుతుండటంతో, బంజర్లను ఫారెస్టు భూములను ఆక్రమించుకోనటం, అన్యాక్రాంతాలను స్వాధీనం చేసుకోవటం, వేతనాలు పెంచవలసిందిగా డిమాండ్ చేయటం జరుగుతూ వుండేవి.

1951 ప్రారంభంలో, ఆ క్లిష్టపరిస్థితుల్లో, స్వయంగా రంగంలో వుండి వుద్యమానికి తోడ్పడటంకోసం రాష్ట్ర కమిటీ నాయకుడు కామ్రేడ్ భీమిరెడ్డి నరసింహారెడ్డి ఆ ప్రాంతానికి చెరుకున్నాడు దేశంలోని మిగతా ప్రాంతంలోని పరిస్థితిని గూర్చి, కరీంనగర్ జిల్లాలో ప్రజల విజృంభణను గూర్చి, అమరాబాద్, వికారాబాద్ ప్రాంతాలకు వుద్యమం విస్తరించటాన్ని గూర్చి వారికి వివరించాడు తెలంగాణా ఉద్యమం దౌర్జన్యం, హత్యలు సాగించే వుద్యమమని చిత్రిస్తూ, బొంబాయిలోని 'బహిరంగ పార్టీ కేంద్ర స్థానం" మద్దతుతో శ్రీ రావి నారాయణరెడ్డి సాగిస్తున్న ప్రచారాన్ని గూర్చి, అజయ్‌కుమార్‌ఘోష్, డాంగే సాగిస్తున్న ప్రచారాన్ని గూర్చి వారికి వివరించాడు. అజయ్‌కుమార్‌ఘోష్, భేదాభిప్రాయాలున్న యితర పార్టీ నాయకులూ పాల్గొన్న 1950 డిసెంబర్ కేంద్రకమిటీ తీర్మానం (ఆ తీర్మానాన్నిగూర్చి యింతకుముందే ప్రస్తావించటం జరిగింది) చేసినప్పటికీ పై ప్రచారాలు సాగాయి ముఖ్యులైన ఆర్గనైజర్లందరూ పదిహేను రోజుల సమావేశంలో మొత్తం కార్యకలాపాలన్నింటినీ సమీక్షించి, నూతన కర్తవ్యాలను రూపొందించుకున్నారు 1951మే నెలలో కేంద్ర కమిటీ సమావేశం జరిగింది బి. యన్ రెడ్డి అంతకుముందే 1951 ప్రారంభంలోనే ఈప్రాంతానికివెళ్ళాడు అందువల్ల ఆయన కేంద్ర కమిటీ నిర్ణయాలనుగూర్చి వివరించి, పార్టీనిర్మాణాన్ని నూతన అవగాహన ప్రాతిపదికపై బెట్టగలస్థితిలోలేడు. 1951 మేలో జరిగిన కేంద్ర కమిటీ సమావేశానంతరం, నూతన అవగాహనతో కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వరరావు ఆ ప్రాంతానికి వెళ్ళాడు. అయితే, వుపసంహరణ నిర్ణయాన్ని వివరించటానికి, శ్రీ చండ్ర రాజేశ్వరరావు ఆ ప్రాంతానికి నవంబర్ – డిసెంబర్ మాసాలలో వెళ్లాడు.

1951 వ సంవత్సరంలో జులై నెలాఖరువరకు 48 గ్రామాలలో ఐదు వందలమంది ప్రజలు 44 సందర్భాలలో దాడులలో పాల్గొన్నారు. 520 బస్తాల ధాన్యం, 9 పుట్లు ఎండుమిర్చి, పదివేల రూపాయల ఖరీదుజేసే యితర సరుకులను, పనిముట్లను స్వాధీనం జేసుకుని, పంపిణీజేశారు తాము స్వాధీనం చేసుకొనటానికి, పంచిపెట్టటానికి సాధ్యపడని శత్రుఆస్తులను వారు ధ్వంసంజేశారు నాలుగు వందల కుటుంబాలకు, ఆరువందల పశువులను పంచిపెట్టారు. బీడీ ఆకులు, యిప్పపువ్వు కోతల తరుణంలో పార్టీ తన కార్యక్రమాన్ని ప్రజలకు వివరిస్తూ రెండు వందల గ్రామాలలో ముమ్మరంగా ప్రచారం సాగించగలిగింది.

మరో యిరవై గ్రామాలవారు నిర్బంధ శిబిరాలను వదలివేసి ఫారెస్టులకు తిరిగి వచ్చారు. ఆదిలాబాద్ జిల్లాకుజెందిన చెన్నూర్ – సిరిపూర్ ప్రాంతంలోని సుమారు రెండు వందల గ్రామాలకు వుద్యమం విస్తరించింది.

తొమ్మిదిమంది మహిళలతోసహా, 65 మంది నూతన సభ్యులను పార్టీ లోకి చేర్చుకొని 13 సెల్సును ఏర్పాటుచేయటం జరిగింది. అందులో రెండు మహిళల సెల్సు. 12 మంది దళ కమాండర్లుగాను, ఐదుగురు జోనల్ కమాండర్లుగాను, ఏడుగురు జోనల్ ఆర్గనైజర్లుగాను, ముగ్గురు ఏరియా కమాండర్లుగాను ప్రమోట్ చేయబడ్డారు.

పోలీసులపైన, మిలటరీపైన గెరిల్లాలు 64 దాడులు సాగించారు. 71 మంది పోలీసులను, సైనికులను చంపివేశారు. పోలీసులకు సమాచారం చేరవేసేవారిని, దుష్టభూస్వాములను, వాళ్ళ తొత్తులను 42 మందిని అంతంజేశారు.

పార్టీకూడా ఐదుగురు జోనల్, సెంటర్ ఆర్గనైజర్లను, ఏడుగురు దళ సభ్యులనూ కోల్పోయింది. వారంతా ఆ అర్ధసంవత్సరకాలంలో ఆహుతైపోయారు.

ఉద్యమాన్ని బస్తరు ప్రాంతానికి విస్తరింపజేయటానికి ప్రయత్నం జరిగింది. గోదావరి నదినిదాటి, తూర్పువైపుకు ఒక దళాన్ని పంపాం అయితే, వారు అక్కడకు వెళ్ళిన తర్వాత, అచ్చటి భాష వేరుగా వుండటాన్ని, ప్రాథమిక రాజకీయ చర్యలకు సయితం ప్రాథమిక పరిస్థితులు అనుకూలంగా లేక పోవటాన్ని గమనించారు. పైగా రాష్ట్ర ప్రభుత్వాలు నిఘాతోవుండి, ఆ ప్రాంతంలో విపరీతంగా సాయుధ బలగాలను దించాయి. కొన్ని ఘర్షణల సందర్భంగా, దళానికి స్వల్పంగా నష్టం జరిగింది. అయితే, ఒక్క కామ్రేడ్‌నూ కూడా కోల్పోకుండా తెలంగాణా ప్రాంతానికి తిరిగి దళం వచ్చివేయగలిగింది.

ఆ విధంగా, ఈ ప్రాంతంలో గెరిల్లాలు, అత్యంత క్లిష్టపరిస్థితిలో, తిరిగి సంఘటితమవుతూ, తమ ముందున్నకర్తవ్యాలను నిర్వర్తించటానికి కదులుతుండగా, మూడు నెలలలోనే, తెలంగాణా వుద్యమం వుపసంహరించుకోబడిం

దన్న వార్తను వారు రేడియోద్వారా విన్నారు కామ్రేడ్ దేవులపల్లికి దారిలో ఆలస్యమైంది. అందువలన దళాలకు, నూతన అవహాననుగూర్చి వివరించటానికి, మనం కనీస రక్షణలు, డిమాండ్లు సాధించుకునేంతవరకూ సాయుధ పోరాటాన్ని కొనసాగించగలమా లేదా అనె విషయంపై వారి అభిప్రాయాన్ని తెలుసుకొనటానికి వీలుపడలేదు ఈ ప్రాంతంయొక్క అభిప్రాయాన్నికూడా తెలుసుకోకముందే, వుద్యమాన్ని వుపసంహరించాలన్న అలాంటి శీఘ్ర నిర్ణయం చేయవలసిన అవసరమెలా కలిగిందీ, వుపసంహరణను గురించిన అధ్యాయంలో వివరించబడింది. ఆ తర్వాత 1952 లో జరిగిన తెలంగాణా ముఖ్య కామ్రేడ్సు సమావేశంలో, ఈ ప్రాంతంలోని ముఖ్య కామ్రేడ్సు అందరూ, ఎలాంటి అరమరికలు లేకుండా ఆ నిర్ణయానికి ఆమోదం తెలిపారు.

## అధ్యాయం : 5

# గెరిల్లా దళాల

# సాయుధ చర్యలు

(అ) పోలీసు, మిలటరీ గస్తీకేంద్రాలపైన, క్యాంపులపైన

(ఆ) దుష్టభూస్వాములపైన, వాళ్ళ ఏంజెంట్లపైన దాడులు

**1.** *ఎల్లంపేట వద్ద పార్టీ నాయకులపై దాడి*

నల్గొండజిల్లాకుజెందిన ముఖ్యనాయకులందరూ, ముఖ్యులైన రాష్ట్ర కమిటీ నాయకులొకరితోసహా మానుకోట తాలూకా ఎల్లంపేట గ్రామ పొలిమేరలలో సమావేశమయ్యారు. పార్టీరికార్డు, బ్రెన్‌గన్‌లు తదితర ఆయుధాలతో సహా మూడు నాలుగుబండ్ల సామాను వారివద్దవుంది. స్త్రీలు, పిల్లలు కూడా వారివద్ద వున్నారు. వారంతా సమావేశంలో పాల్గొనేందుకు అక్కడ చేరారు.

అప్పటివరకూ పార్టీకి అనుకూలుడుగా నటిస్తూవున్న స్థానిక భూస్వామి వొకరు నాయకుల భోజనాలకు ఏర్పాట్లు చేస్తూనే మరో వైపున సమీపంలోనే అబ్బాయిపాలెంవద్దగల మిలటరీ క్యాంపుకు కబురంపాడు.

అనుకోకుండా జరిగిన ఈ ముట్టడితో నాయకులేమీ బెంబేలెత్తిపోలేదు. వారు ఒక పథకం ప్రకారం నడుచుకున్నారు. ఆయుధాలలో కొన్నింటిని, రికార్డులను యితర వస్తువులనూ పొదలలో దాచారు. మూడు దళాలుగా ఏర్పడ్డారు స్త్రీలను, బిడ్డలను రక్షించుకుంటూనే కాల్పులు

జరిపారు. శత్రు బలగం నేలకు కరుచుకుపండుకొనేట్లు చేశారు. వాళ్ళను తమ వైపుకు రానివ్వలేదు తప్పించుకు పోవటానికి నాలుగోవైపునగల ఏకైక మార్గంగుండా దళాలు తప్పుకున్నాయి అనుపమ ధైర్య సాహసాలతో, ధృఢ నిశ్చయంతో వారు కాల్పులు జరిపారు. శత్రువును దూరంగానే నిలిపి పంట పొలాలను దాటిపోయారు.

అయితే సరిగ్గా వాళ్ళముందు చిన్న మట్టిదిబ్బ వొకటుంది. ఆ మట్టిదిబ్బనుదాటి ఆవలివైపుకు చేరేంతవరకూ వారికి భద్రతలేదు. కాని ఆ మట్టిదిబ్బ బాగా నిటారుగావుంది. అలాంటి దిబ్బపైకెక్కటం ఏమంత సులభంకాదు. ఈలోగా శత్రువుపాకి తూటాలు దాదాపుగా ఆ కామ్రేడ్స్‌కు తగులుతూనే దూసుకుపోతున్నాయి రైఫిళ్ళు, బ్రెన్లు, తదితర ఆయుధాలు పూర్తిగా వాడబడ్డాయి. ఆ ప్రాంతమంతా చెవులు చిల్లులుబడే మోతలతో ప్రతిధ్వనించింది. కామ్రేడ్స్ దాదాపుగా ఒక మూలకు నెట్టబడ్డారు. అయినా వారు చెట్లను మాటుజేసుకొని, కొన్ని పెద్ద రాళ్ళను మాటుజేసుకుని కాల్పులు జరిపి, శత్రువు నేలపైనే అంటిపెట్టుకుని పడుకునేట్లు చేశారు ఎలాంటి ప్రాణ నష్టం లేకుండానే బయటబడగలిగారు.

మిగతా వారితోపాటు నడక సాగించలేకపోయిన యిద్దరు మహిళా కామ్రేడ్స్ ఆ రాత్రంతా పొదలలో తలదాచుకుని, తెల్లవారిన తరువాత మిగతా వాళ్ళతో కలిశారు. ఈ సందర్భంగా ప్రత్యేకంగా పేర్కొన దగిన విషయమేమంటే, ఆ యిద్దరూ బిడ్డ తల్లులు, వారి పసిబిడ్డలను యితర కామ్రేడ్స్ కాపాడారు. ఒక ముఖ్య కామ్రేడ్ ఒక చేతిలో బిడ్డను పట్టుకుని, మరొక చేతిలో రైఫిల్ పట్టుకుని కాల్పులు జరుపుతూ ఆ పసిబిడ్డనేగాక, తన రక్షణ క్రిందగల ఇతర కామ్రేడ్స్‌నుకూడా కాపాడాడు అది వారందరికీ గర్వకారణం.

2. కామ్రేడ్ కొండల్‌రెడ్డి, (సూర్యాపేట), నసింపేట గ్రామంపై దాడిజేసిన సైనిక గస్తీదళంపై మాటుగాచి దెబ్బగొట్టాడు. దానితో ముగ్గురు సైనికులు మృతిజెందారు మరికొందరు గాయపడ్డారు. ఆ సైనిక గస్తీదళం, ధాన్యం లెవీ, భూమిశిస్తు చెల్లించవలసిందిగాను. దేశముఖుల భూములను, పశువులను, గొర్రెలను వొప్పగించవలసిందిగాను వొత్తిడి చేయటానికి ప్రజలను సదాబాదుతూ వేధిస్తూ వుండేది

3. సూర్యాపేట తాలూకా గెరిల్లా దళాలు, వల్లభాపురం, ఉంద్రకొండ, ధర్మాపురం, మహమ్మదాపురం గ్రామాలపై దాడులు జేశాయి. తన స్వంత అల్లుడినే పోలీసులకు పట్టించిన సకిలేరు వెంకటేశ్వరరావును, నలుగురు పోలీసు ఏజెంట్లనూ చంపివేశారు

"పార్టీసభ్యుడగు తన కుమారుడినే పోలీసులకు వొప్పగించి పది హేడువేల రూపాయలు పార్టీ ధనంతో వడ్డీ వ్యాపారం ప్రారంభించిన రేగులగడ్డ గ్రామ పటేల్ 1950 ఏప్రిల్ 9 వ తేదీన చంపివేయబడ్డాడు.

పోలీసు, మిలటరీ గస్తీ దళాలు గ్రామాలపై దాడులుజేసి తిరిగి పోతుండగా ఉర్లకొండ, నరసింహాలుగూడెం, బొప్పారం, ఆత్మకూర్, ఎల్క పల్లి, మిర్యాల, అర్వపల్లి గ్రామాల వద్దనూ, మరికొన్ని గ్రామాలలోనూ పోలీసులపైన, మిలటరీపైన అలాంటి దాడులే జరిగాయి. అత్యధిక సందర్భా లలో గెరిల్లాలు వాళ్ళను ఒక్కొక్కసారి ఇద్దరు ముగ్గురు చొప్పున చంపి వేయడం జరిగింది.

— మానుకోట తాలూకా బొమ్మనపల్లి గ్రామంపై దాడిచేసి,కాకర వాయి వద్దగల తమ క్యాంపుకు తిరిగి వెళ్తున్న పోలీసు బృందంపై సూర్యాపేట ప్రాంత గెరిల్లా దళం దాడి జేసింది, నలుగురు మిలిటరీ వాళ్ళను చంపివేసింది. మరికొంతమందిని గాయపరచింది వాళ్ళవెంటవున్న 25 మంది కాంగ్రెసు హోం గార్డులు చిందరవందరగా పలాయనం చిత్తగించారు. వారిలో ఒకరు గాయపడ్డారు.

— పాత సూర్యాపేటలో, ఒక ఇంటిలో ఆశ్రయం పొందివుండగా, 1949 జనవరి మొదటి తేదీన ఒక గెరిల్లా దళాన్ని శత్రువు చుట్టుముట్టాడు. గెరిల్లాదళం కాల్పులు జరిపి, ఆత్మరక్షణ గావించుకుంటూ తమ రైఫిళ్ళతో, బాంబులతో ముగ్గురు సైనికులను చంపి, మరో ఐదుగురిని గాయపరిచింది. కాని చివరికి యింకా అదనంగా సైనిక బలగాలొచ్చి, కాల్పులు జరిపి గెరిల్లా దళాన్ని చంపివేశాయి

— 1948 డిసెంబరు 18న, పెనుబాడు, ధర్మాపురం గ్రామాలమధ్య పోలీసు గస్తీదళంపై గెరిల్లాదళం దాడిజరిపి పోలీసులను చంపివేసింది. మరో ముగ్గురిని గాయపరిచింది.

— మిలటరీ, పోలీసు బలగాలు కోటపాదు, రాగిపాడు మరోఐదు గ్రామాలపైన దాడిజేశాయి. గెరిల్లాదళం వివిధ ప్రాంతాలలో ఆ మిలటరీ పోలీసు బలగాలపై కాల్పులు జరిపింది. ఏడుగురు మిలటరీవాళ్ళు చంపివేయ బడ్డారు. వారు దాడులకు స్వస్తిజెప్పక తప్పలేదు.

గోదావరి ఫారెస్టుప్రాంతం -

మానుకోట - ములుగుప్రాంతం

— గుండాల మిలటరీక్యాంపు పాల్వంచ తాలూకాలోవుంది. గూడెములనుండి కోయప్రజలను ఖాళీచేయించి ఇక్కడ నిర్బంధంగా వుండేలా చేశారు. పట్టుబడిన కామ్రేడ్స్‌ను, దళ సభ్యులనూ జైళ్ళనుండి తీసుకొచ్చిన వారిని యిచ్చటకు తీసుకొచ్చి చిత్రహింసలపాలుజేసి కాల్చిచంపేవారు. మూడు నాలుగు వందలమంది గిరిజనులను, పట్టుబడిన సభ్యులనూ నిర్దాక్షిణ్యంగా హత్యగావించిందక్కడనే. ఆ క్యాంపుపై దళం ఒకసారి దాడిజేసి వారిని ఉక్కిరిబిక్కిరి చేసింది చివరికి దళం సురక్షితంగా వెనుకకు తప్పుకున్నప్పటికీ, ఒక సభ్యుణ్ణి కోల్పోయింది ఒకనాడు ముప్పైమంది శత్రుఏజెంట్లు, సమీపంలోనేవున్న సంపెళ్ళ గ్రామంపై దాడిజేశారు కాని గెరిల్లాలు ఒక్కరిని చంపివేసి, మిగతావాళ్ళను పారద్రోలారు. తమవాడి మృతదేహాన్ని తీసుకుపోవటానికి మిలటరీ రెండు రోజులవరకూ ప్రయత్నించనేలేదు.

— నర్సంపేట తాలూకా జెండాగట్టు వద్ద ఒకసారి 15 మంది సభ్యులుగల గెరిల్లాదళం గ్రామంలో ఆహారధాన్యాలు కొనుక్కురావటానికి ఒక కొరియరును పంపింది. ఆయన పట్టుబడ్డాడు చిత్రహింసలకు గురిజేయబడినమీాదట, దళం ఎక్కడున్నదీ ఆయన మిలటరీవాళ్ళకుచెప్పాడు. ఆదళాన్ని మిలిటరీ ముట్టడించింది. దళం పోరాడింది. అతి కష్టంమీాద అది ఒక గుట్ట వెనుకకు తప్పుకుంది. దళ సభ్యులు ఐదుగురు మృతిజెందారు. గాయపడిన వారిద్దరిని దళ సభ్యులు మోసుకుపోయారు. ఆ దళం కోయప్రజలతోగూడిన దళం, సరైన సెంట్రీని ఏర్పాటుజేసుకొనివుంటే ఈ నష్టాన్ని నివారించటం సాధ్యమయ్యేది.

పర్కాల తాలూకా జంగేడు క్యాంపునుండి పరిసర గ్రామాలపై ప్రతిరోజూ, రాత్రివేళల్లో సయితం దాడులు జరుగుతుండేవి మిలటరీవాళ్ళు మామూలుగానే రాత్రి ఏడున్నరగంటల సమయంలో బాతాఖానీ గొడుతుండగా గెరిల్లాదళం ఆ క్యాంపుపై దాడిచేసింది. వాళ్ళలో నలుగురిని చంపి అదృశ్యమైపోయింది అప్పటి నుండి సైనిక బలగం మరెన్నడూ ఆరుబయట కూర్చుండి ఎరుగరు.

మరొక సందర్భంలో, పేరుమోసిన క్యాంపు కమాండర్ సీతాపతి నాయకత్వానగల సైనిక గస్తీ దళంపై చినగానాపురంవద్ద దళం దాడిజేసింది.

దళ నాయకులు కామ్రేడ్ ముకుందం సూటిగా గురిజూచి కాల్చి సీతాపతిని చంపివేశాడు. చింతబరికలను సుతి-కొడవలి ఆకారంలో వంచికట్టి, వీపులమీద వాతలుతేలునట్లు కొట్టించి పేరుమోసిన దుర్మార్గుడు ఈ సీతాపతే.

— పదిమందిగల మిలటరీ గస్తీదళం, ఒక వాగును దాటుతుండగా, గూడూరు (నర్సంపేట తాలూకా) జగన్నాధగూడెం (మానుకోట తాలూకా) రోడ్డుమీద, గెరిల్లా దళం కాల్పులు జరిపింది నలుగురు సైనికులు, మృతిజెందారు వాళ్ళ వెంటవున్న భూస్వామి ఒకరు గాయపడ్డాడు. మిగతా వాళ్ళు పారిపోయారు. మరణించిన వాళ్ళ దగ్గరనుండి గెరిల్లాలు నాలుగు రైఫిళ్ళు స్వాధీనం చేసుకున్నారు

— నర్సంపేట తాలూకాలోని నేలంచ - కర్వాయిల మధ్య రోడ్డుమీద ఒక గ్రామంమీద దాడి జేయటానికి పోతున్న ఒక సైనిక గస్తీ దళాన్ని గెరిల్లాలు మాటుగాచి, కాల్పులు జరిపి యిద్దరిని చంపారు. మిలటరీ కూడా తిరిగి కాల్పులు జరిపింది. అయినా ఎలాంటి నష్టాలు లేకుండా ఒక పథకం ప్రకారం వెనకకు తగ్గారు.

— నాగారం - ములుగురోడ్డుమీద లవ్వలగ్రామం సమీపంలో దాడిజేయటానికి వెళ్తున్న ఒక సైనిక బృందాన్ని మాటుగాచి కొట్టారు. ముగ్గురు సైనికులను చంపారు కొందరిని గాయపరిచారు దీని తర్వాత, ఆ సైనిక బృందం గ్రామంపైదాడి చేయటానికి వెళ్ళదని, తమ క్యాంపుకు తిరిగి వెళ్తుందని భావించి గెరిల్లాలు దగ్గరదారిగుండా, తగిన స్దలంలో సైనికుల రాకకోసం వేచిచూస్తూ కూర్చున్నారు. వారు అనుకున్నట్లుగానే, మృత దేహాలు తీసుకొని సైనికులు తిరిగిపోతున్నారు. మరల గెరిల్లాలు వారిపై కాల్పులు జరిపి మరొక యిద్దరు సైనికులను చంపారు. అదనపు సైనికబలగాలు వచ్చాయి గెరిల్లాలు ఎలాంటి నష్టాలు లేకుండానే వెనుకకు తప్పుకున్నారు. ఈ రోడ్డుమీద, తరచు పోతూవుండే మిలటరీ, పోలీసు ట్రక్కులపై గెరిల్లాలు కాపు కాచి మెరుపు దాడులు చేస్తూవుండేవారు.

— కామారం క్యాంపు (నర్సంపేట తాలూకా) అడవుల మధ్యలో ఏర్పాటుచేయబడివుంది ఆ క్యాంపు చుట్టూ రక్షణగా గోతులు, ఇసుకబస్తాలు సిద్ధం చేయబడినాయి. రాత్రంతా మిలటరీ క్యాంపులోనే వుంటున్నది పగటి వేళ మాత్రమే కదిలేవారు. గెరిల్లాలు రాత్రి వేళల్లో తరచుగా ఆ క్యాంపు మీద కాల్పులు జరిపి, వాళ్ళను భయభ్రాంతులనుజేస్తూ, వారిలో అరక్షిత స్థితిలో వున్నామన్న భావం కల్పిస్తూ వుండేవారు. క్యాంపులోనుండి సైనికులు ఎక్కువకాలం కాల్పులు సాగించుతూ, తమ మందుగుండు సామగ్రిని వృథా

చేసుకునేవారు. ఒకసారి, తెలతెల్లవారబోతుండగా యిక ఈ రోజుకు గెరిల్లాల దాడి ప్రమాదంలేదని, సెంట్రీ వూపిరి సలుపుకుంటూ కూర్చున్నాడు అంత లోనే గెరిల్లాదళంవచ్చి అతనిని కాల్చిచంపింది. ఆ క్యాంపు చాలాసేపు తన మందుగుండు సామగ్రిని వృథాజేసుకుంది.

— నర్సంపేట తాలూకాలోని మిర్యాలపెంట మిలటరీక్యాంపు అడవులలో ఏర్పాటు జేయబడివుంది క్యాంపు సమీపంలోనే పెద్ద చెట్లున్నాయి గెరిల్లా దళాలూ, స్థానికదళాలూ కలసి దాన్ని ముట్టడించటానికి పథకం వేసుకొన్నాయి. తెల్లవారగానే దాడి ప్రారంభమైంది. ఏడుగురు సైనికులను, ఇద్దరు సెంట్రీలను చంపివేశారు మిగతావాళ్ళు గోతులలోకిపోయి దాగుకున్నారు కాని. దళం బ్రెన్ గన్‌తో అన్నివైపులనుండి కాల్పులు సాగించింది మరో ఎనిమిదిమంది సైనికులు మరణించినట్లు మరికొంతమంది గాయపడినట్లు అంచనావేయబడింది. గెరిల్లాలు తమ మందుగుండు సామగ్రిని జాగ్రత్తగా వాడుకున్నారు కాగా శత్రువులు కోపంతో విచ్చలవిడిగా కాల్పులు జరిపేవారు. అదనపు బలగాలు వస్తున్నట్లు కొంతసేపటికి వార్తవచ్చింది గెరిల్లాలు వుపసంహరించుకున్నారు సాహసంతో గూడిన, ఈ సుదీర్ఘమైనదాడి సైనికులలో ఎంతటి కలవరం కలిగించిందంటే వాళ్ళు తమ చిన్నక్యాంపులకు అదనపు బలగాలను రప్పించుకోవలసివచ్చింది.

— గంగారంరోడ్డు : ఇల్లెందు - నర్సంపేటల మధ్యగల వంద కిలోమీటర్ల రోడ్డు దట్టమైన అడవులగుండా పోతుంది. ఆ రోడ్డుమీద గెరిల్లాలు అనేక మెరుపు దాడులు, మాటుగాచి చేసిన దాడులు జరుపుతూవుండేవారు ఒకసారి, గంగారానికి మూడుమైళ్ళ దూరంలోగల, ప్రత్యేకంగా అనుకూలమైన ఒకచోట గెరిల్లాలు తెల్లవారుజాము 4 గంటలనుండి, ఉదయం 9 గంటలవరకు మాటువేశారు. అంతలో మిలటరీ లారీఒకటి వచ్చింది దారికడ్డంగా పెద్దదుంగలు పడవేసివుండటంతోసరిగ్గా అక్కడనే ఆగిపోయింది సైనికసిబ్బంది లారీలోనుండి క్రిందికి దూకనారంభించగానే గెరిల్లాలు కాల్పులు జరిపి, శత్రువును తీవ్రంగా నష్టపరిచారు. పదిమంది మరణించారని, మరికొందరు గాయపడ్డారని అంచనా వేయబడింది. మరో లారీ సమీపించడం చూచి, గెరిల్లా దళాలు వెనకకు తప్పుకున్నాయి.

రెండవసారి, చెంచువానిగూడెం సమీపంలో చెట్టుపల్లి కొండలవద్ద రోడ్లకు గండిగొట్టి, వెదుళ్ళతో కప్పి, దానిపైన పలచగా మట్టిగప్పారు. మిలటరీలారీ ఒకటొచ్చి, కప్పి వుంచబడిన గోతిలో పడింది. డ్రయివరూ, మరి కొలదిమంది మృతిజెందారు: కాల్పులు జరుగుతూవుండగా మరి మూడు లారీల

నిండా మిలటరీ అక్కడకి వచ్చింది కాని, గెరిల్లాలు ఎలాంటి నష్టంలేకుండా తప్పుకున్నారు సైనికులు తమ కోసం పట్టలేక, తాము తిరిగిపోతుండగా కనిపించిన అమాయకులైన గిరిజనుల నిద్దరిని చంపివేశారు.

ఇల్లెందు బొగ్గుగనుల నుండి సంపాదించిన ప్రేలుడు పదార్థాల నుపయోగించి, మూడోమారు 1950 ఏప్రిల్ 22 న రోడ్డుమీద శక్తివంతమైన మందుపాతర నాటారు ఈ లారీలు ఒక దళంగా పోతున్నాయి మొదటి లారీ మందుపాతరను దాటింది మందుపాతర ప్రేలి ఆలారీ తునాతునకలైపోయింది యాభైమంది సైనికులు మృతిజెందారు గెరిల్లాలు వారి తుపాకులను స్వాధీనం చేసుకునేలోపుగానే రెండవ లారీ అక్కడికి చేరింది.

— కారేపల్లి క్యాంపు (ఇల్లెందు)పై, కామ్రేడ్ సీతారామారావు దళం మెరుపుదాడి జేసింది. సెంట్రీని చంపివేసింది ఆ దళం కొలది తూటాలు మాత్రమే వాడింది కాని క్యాంపులోని వాళ్ళు ఆ రాత్రంతా నిరంతరాయంగా కాల్పులు సాగిస్తూనే వున్నారు

— బయ్యారంనుండి సైనికులు ఎప్పుడూ కల్లు దుకాణానికి పోతుండేవారు దళం ఒక్కసారి వాళ్ళపై దాడిజేసి, యిద్దరిని చంపి, వాళ్ళ రైఫిళ్ళను, వాళ్ళ దుస్తులను స్వాధీనం చేసుకుంది

— పాల్వంచ తాలూకాలోని అల్లాపల్లిలో గిరిజనులకోసం ఏర్పాటు జేయబడిన మరొక పెద్ద నిర్బంధ శిబిరం వుంది. అచ్చటినుండి, పరిసర గ్రామాలపై నిరంతరం దాడులు చేస్తుండేవారు. గెరిల్లా దళాలు, ఒక రాత్రి దానిపై దాడిజేశాయి. వారు దాడి జేసినప్పుడు, క్యాంపులో 15 మంది సైనికులు మాత్రమే వున్నారు. మిగతా వాళ్ళంతా గ్రామాలపై దాడులకు వెళ్ళారు కూర్చుండి, కబుర్లు చెప్పుకుంటున్న సైనికులపై దళం కాల్పులు జరిపింది. ఒక సైనికుడు మృతిజెందాడు. సైనికులు సన్నద్ధమై నిలిచి, తిరిగి కాల్పులు జరిపారు సరిగ్గా అప్పుడే, క్యాంపుకు తిరిగివస్తున్న ముగ్గురు సైనికులపై దళం ఆకస్మికంగా దాడి జరిపి చంపివేసింది వాళ్ళ ఆయుధాలను స్వాధీనం జేసుకుంది. అయినా, వారు తమ దాడిని కొనసాగించకుండా తప్పుకుని వెళ్ళిపోయింది.

— స్థానిక గిరిజనుల, గనికార్మికుల తోడ్పాటుతో ఐదు గెరిల్లా దళాలు ఇల్లెందు బొగ్గుగనుల ప్రేలుడు పదార్థాల గిడ్డంగిపై దాడిచేశాయి. దాడిని ప్రతిఘటించటానికి కాపలాదారులు ప్రయత్నించారు. కాని, కార్మికుల మనోభావాన్ని పెద్దసంఖ్యలోవున్న గెరిల్లాలను, వారి చుట్టూవున్న వారిని చూచి ఆ ప్రయత్నం విరమించారు. పదిహేను బస్తాల ప్రేలుడు పదార్థాలు,

ఫ్యూజులు, డిటోనేటర్లు గెరిల్లాల వశమైనాయి. వారు వాటిని సురక్షితంగా తీసుకుపోయారు. పోలీసులు, మిలటరీ వాటిని తిరిగి స్వాధీనం చేసుకోకుండా నివారించగలందులకై వాటిని 70 నుండి 100 కిలోమీటర్ల దూరంలోనయినా అనేక తావుల్లో భద్రపరిచారు. ఒక వారం రోజులపాటు అధికారులు రహస్య బృందాలను పంపారు. అయినా ప్రయోజనం లేకపోయింది ఒక డజను గిరిజన గ్రామాలను తగులబెట్టారు. అనేకమందిని చిత్రహింసలపాలు జేశారు. అయినా వారికి ఎలాంటిజాడ దొరకలేదు.

1949 ఆగస్టు 2 వ తేదీన గెరిల్లాలు మానుకోట-గుండ్రాతిమడుగు మధ్య రైలుమార్గానికి యిరువైపులా అనువైనస్థానం చూచుకుని, సన్నద్ధంగా నిలిచారు. రాత్రి 8 గంటల సమయంలో సాయుధ గస్తీదళమొకటి వారికంట బడింది. స్టెన్‌గన్లతో, రైఫిళ్ళతో ఉధృతంగా కాల్పులు జరిపారు ముగ్గురు సైనికులు మృతిజెందారు. మరోముగ్గురు గాయపడ్డారు అయితే, ఆ గస్తీదళం ఎదురుకాల్పులు సాగించింది. మరణించిన వాళ్ళవద్దకువచ్చి, ఆయుధాలు స్వాధీనం చేసుకోకుండా గెరిల్లాలను నిరోధించింది సైనికరైలు వస్తుండటంతో, గెరిల్లాలు తప్పుకున్నారు. అప్పటినుండి శత్రువు కాలినడకన గస్తీతిరగటం దాదాపుగా మానివేశాడు. రైలుమార్గాని కిరువైపులా, కొన్నివందల గజాల వరకుగల చెట్లన్నింటిని నరికివేశారు.

అయితే గెరిల్లాలు పదేపదే రహదార్లపైన, టెలిగ్రాఫ్‌లైన్లపైన దెబ్బతీస్తూనేవున్నారు. రైలుమార్గం పలుమార్లు తెగిపోయింది గంటల తరబడి, కొన్ని సందర్భాలలో రోజుల తరబడి రైళ్ళ రాకపోకలు నిలిచిపోయాయి.

— శ్రీరామగిరి క్యాంపు నుండి చెట్లముప్పారానికి బయలుదేరి వెళ్ళుతున్న ఒక సాయుధగస్తీదళంపై దాడి జరిపారు కాని, ఆ గస్తీ దళం చాలాసేపు కాల్పులు జరుపుతూనేవుంది. మరొకసారి మునగవాడకువెళ్తున్న గస్తీదళాన్ని దారిగాచికొట్టి ఒకరిని చంపారు. ఇంకొకసారి అవనగల్లుకు ముడుపుగల్లుకు మధ్యన యిద్దరు సైనికులు చంపివేయబడ్డారు. ఆవిధంగా నిరంతరాయంగా సైనికులను వేధించటం, మాటుగాచి దెబ్బగొట్టడం, మెరుపు దాడులు జేయటం సాగుతూనేవుంది.

భారత సైన్యపు దాడులకు వ్యతిరేకంగా, మూడు సంవత్సరాలపాటు సాగిన పోరాట సమయంలో, సాయుధ బలగాలకు – గెరిల్లా దళాలకూమధ్య సుమారు నాలుగు వందల సాయుధ చర్యలు, సంఘర్షణలు జరిగాయి.

— 1949 జూన్ 13: అప్పరాజుపల్లె క్యాంపునుండి బయలుదేరి అర్పినపల్లిపై దాడిజేయటానికి వెళ్తున్న పోలీసు బృందంలోని యిద్దరు పోలీసులు చంపివేయబడారు.

— 1949 జులై 2 : చెట్లముప్పారం క్యాంపు సమీపంలో పచార్లు గొడుతున్న ఒక సుబేదారుపై గెరిల్లాలు కాల్పులు జరిపారు. అతనిని శాశ్వతంగా అంగవికలుడిని గావించారు.

— 1949 నవంబరు 14 : అల్లిగూడెంలో ఒక కోయ కామ్రేడ్‌ను మిలటరీవాళ్ళు చంపినందుకు ప్రతీకారంగా గెరిల్లాలు మిలటరీ క్యాంపుపైదాడి జేసి, ముగ్గురిని చంపారు. మరో ముగ్గురిని గాయపరిచారు. ఆ క్యాంపు ఖాళీ చేయబడింది.

— 1949 డిసెంబరు 3 : పరఖాలతాలూకా నాగారం క్యాంపుపై దాడిచేసి ఒకరిని చంపారు. మరొకరిని గాయపరిచారు.

— 1950 జనవరి 18 : గ్రామాలపై దాడులుజేసి తిరిగి వెళుండగా మట్వాడ – గూడూరులమధ్య స్టెన్‌గన్లతో, రైఫిళ్ళతో కాల్పులు జరిపి తొమ్మిది మంది సైనికులను చంపివేశారు. ఎనిమిదిమందిని గాయపరిచారు.

— 1950 జనవరి 30 . "శాంతి"ని కాపాడాలనే పేరిట ఒకసైనిక గస్తీదళం మాదారం – ములుగు మధ్య గస్తీ తిరుగుతోంది గెరిల్లాలు కాల్పులు జరిపారు. నలుగురు సైనికులు మృతిజెందారు. ముగ్గురు గాయపడ్డారు. గస్తీ తిరగటం తక్షణమే నిలుపుజేయబడింది.

— 1950 మార్చి 1 . దనియాల్పాడుపై దాడిజేసి తిరిగి వస్తున్న సాయుధ సైనిక దళంపై గెరిల్లాలు కాల్పులుజరపగా, ఒక సైనికుడు మృతిజెందాడు.

— 1950 మార్చి 3 . దాడిచేసి తిరిగివస్తున్న ఒక గస్తీ దళంపై గెరిల్లాలు మాటుగాచి దెబ్బగొట్టగా యిద్దరు మరణించారు, ఒకడి కాలు విరిగింది.

— 1950 మార్చి 11 : గెరిల్లాలు కొత్తపేట క్యాంపుపై దాడిచేసి సెంట్రీని కాల్చిచంపారు.

— 1950 మార్చి 12 . బయ్యారం – రామగుండ్ల మధ్య కొత్తగూడెమును తగులబెడుతున్న పోలీసు లారీలపై దాడి చేశారు యిద్దరు పోలీసులు మరణించారు 1950 మార్చి 16 న పోలీసులతోను, పోలీసు కుక్కలదళంతోను సంఘర్షణ జరిగింది. ఉభయ పక్షాలకూ నష్టాలు లేవు.

— 1950 మార్చి 23 : నర్సంపేట తాలూకా పోలారం క్యాంపు నుండి వెడుతున్న మిలటరీవాళ్ళపై గెరిల్లాలు కాల్పులుజరిపి యిద్దరిని చంపారు. ఎదురు కాల్పులు చాలాసేపు సాగాయి. గెరిల్లాలు సురక్షితంగా తప్పుకున్నారు.

— 1950 మార్చి 28. గడ్డిగుట్ట కొండలపై గెరిల్లాలుండటాన్ని ఒక విమానం పసిగట్టింది. సైనికులు ఆ ప్రాంతమంతటినీ గంటల తరబడి గాలించారు. అయినా, వాళ్ళకు గెరిల్లాలజాడ కనిపించలేదు. చివరకు మిలటరీవాళ్ళు తిరిగి పోతుండగా మామిడిగుండాలవద్ద గెరిల్లాలు మాటుగాసి దాడిజేసి ఒక బృందంలోని ముగ్గురిని చంపారు. నాగారంవద్ద మరొక బృందంపై దాడిజేశారు.

— 1950 మార్చి 31 కొత్తపేట క్యాంపునుండి మిలటరీవెళ్ళి తక్కెళ్ళపాడుపై దాడిజేసి ఆ గ్రామాన్ని తగులబెట్టింది. వాళ్ళు వెళ్ళిపోతుండగా గెరిల్లాలు మాటుగాచి దాడిచేశారు. ముగ్గురు సైనికులు మరణించారు.

— 1950 ఏప్రిల్ 9 : రామాపురం క్యాంపునుండి–ముషిమ గ్రామానికి వెళ్తున్న గస్తీదళంపై గెరిల్లాలుఆకస్మికంగాదాడిజరిపి, వాళ్ళనుచెల్లాచెదరు చేశారు. తాళ్లు పేనవలసిందిగా నిర్బంధించబడిన ప్రజలను విడుదలచేశారు.

— 1950, ఏప్రిల్ 11. మిలటరీ, హోంగార్డులూ అప్రాజిపల్లి మీద దాడి జరిపి తిరిగి వెళ్తున్నారు. గెరిల్లాలు వాళ్ళను దారికాచి దాడిజేసి, 12 మందిని చంపివేశారు. పేరుమోసిన ప్రజాహంతకుడు శేషిరెడ్డి ఈ దాడిలోనే మరణించాడు.

— 1950 ఏప్రిల్ 12. గూడూరు క్యాంపునుండి మిలటరీ బయలుదేరి వెళ్ళి మత్తెవాడ గ్రామంపై దాడి జేస్తోంది. వెలుపలనున్న వాళ్ళ సెంట్రీని గెరిల్లాలు కాల్చి చంపారు. తుపాకి కాల్పుల మోతవిని, గ్రామాలపై దాడి జేస్తున్న సైనిక బృందం హడావుడిగా పరుగెత్తు కెళ్లింది

— 1950 ఏప్రిల్ 17. కొత్తగూడెం నుండి ఒక గస్తీదళం నిర్మాణంలో వున్న ఒక రోడ్డుకు కాపలా గాస్తోంది. ఆదళంపై గెరిల్లాలు కాల్పులు జరిపారు. ఇద్దరు మృతిజెందారు. ఒకడు గాయపడ్డాడు.

— 1950 ఏప్రిల్ 18. తిరుమలగెడి సమీపంలో మూడులారీల సైనికులపై మాటుగాచి దాడిజేయగా ముగ్గురు సిపాయిలు మృతిజెందారు.

— 1950 ఏప్రిల్ 22 : సుద్దరేవు, ఖంబాలపల్లి గ్రామాలపై దాడి జరిపి, లూటీజేసిన ఆస్తులను యిరవై బండ్లమీద వేసుకొని సైనికులు తిరిగి వెళ్ళుతున్నారు. గెరిల్లాలు వారిపై కాల్పులు జరిపి, ముగ్గురిని చంపివేశారు

— 1950 మే 7 : చంద్రగూడెం సమీపంలో ఐదు కిలోమీటర్ల పొడవునా టెలిగ్రాఫ్ తీగెలు తెంచివేయబడ్డాయి. కొన్నిగంటలసేపు రాకపోకలకు అంతరాయం కలిగింది.

ఖమ్మం - పాల్వంచ ప్రాంతంలో

— 1949 జనవరి 1 : తల్లాడ-కొత్తగూడెములమధ్యలో గెరిల్లాలతో సంఘర్షణలో యిద్దరు సాయుధ పోలీసులు, వాళ్ల కమాండరూ మృతిజెందారు.

— 1949 జనవరి 29 : రోళ్ళపాడు వద్ద గెరిల్లాలు పోలీసు జీపు మీద కాల్పులు జరిపారు. ఒక పోలీసు అధికారి ఒక కానిస్టేబులూ గాయపడ్డారు వాళ్ళను కాపాడటానికి ఒక మిలటరీవ్యాను అక్కడకొచ్చి ఆగింది. అప్పుడు గెరిల్లాలు దానిపైనా కాల్పులు జరిపి, ఒకడిని చంపి, అక్కడి నుండి తప్పుకున్నారు

— 1949 మార్చి 20 : మొద్దులపల్లి వద్ద గెరిల్లాలు దారినేపోతున్న మిలటరీ లారీపై కాల్పులు జరిపి, ముగ్గురిని చంపివేశారు.

— 1949 మార్చి 26 . దారినేపోతున్న మరొకలారీపైకొత్తగూడెం సమీపంలో కాల్పులు జరిపి, నలుగురిని చంపివేశారు. మరొక నలుగురిని గాయపరిచారు.

— 1949 ఏప్రిల్ 27 : తల్లాడ - కొత్తగూడెం రోడ్డుపై ఒక జీపుమీద గెరిల్లాలు కాల్పులు జరిపి, యిద్దరు అధికారులను చంపివేశారు.

— 1949 జూన్ 22 . సుద్దరేవు క్యాంపుపై దాడిజేశారు. ఒక పోలీసును కాల్చిచంపారు. ఆ క్యాంపుకు జెందిన పోలీసు ఏజెంటుగు జాన్‌ను కూడా చంపివేశారు. గాయపడిన కామ్రేడ్ వీరాచారిని పోలీసులుపట్టుకున్నారు.

— పిండిప్రోలులో జగన్నాధరెడ్డి చేతిక్రింద ఆశ్విక దళం వుంది. గెరిల్లాలు వాళ్ళపై దాడి జరిపి రెండు గుర్రాలను చంపారు. మరో రెండింటిని గాయపరచారు. ఈ దాడి ఫలితంగా ఆ క్యాంపు ఎత్తివేయబడింది.

నర్సంపేట : ఒక దళంకోసం వెదుకుతూ మిలటరీ నేలంచ గ్రామానికి వెళ్ళింది. ఆ గ్రామంపై వందలాది తూటాలు కురిపించింది. అయినా మిలటరీకి దళం దొరకలేదు. దళం ఒక సిపాయిని చంపింది.

— మల్లేపల్లి ఫారెస్టు ప్రాంతం : పన్నులు వసూలు జేయటానికి ప్రయత్నించిన యిద్దరు చౌకీదార్లు చంపివేయబడ్డారు.

— రాయమాదారం (ఇల్లెందు తాలూకా) : బలవంతానస్వాధీనం జేసుకొన్న ధాన్యం తీసుకుని మిలటరీ కాపలాతో తిరిగి వస్తుండగా పట్వారీ

భీమేశ్వరరావును దారిగాచి గెరిల్లా దళం దాడి చేసింది పట్వారీతోసహా నలుగురిని చంపారు. మిగతావాళ్ళు పారిపోయారు 303 – రైఫిల్ ఒకటి, స్టెన్‌గన్ ఒకటి గెరిల్లాలు వశమైనాయి (1947 మే 7)

— నరసింహసాగరం (ఇల్లెందు). తులశయ్య, లక్ష్మయ్యడు అనే యిద్దరు హోంగార్డులను 1950 జులై 12 న చంపివేశారు.

ఇబ్రహీంపట్నం ( బగటు ప్రాంతం ) -
దేవరకొండ - అమరాబాద్ ప్రాంతం
*ఇబ్రహీంపట్నం జోన్*

— ఒక తోపులో ఏర్పాటు చేయబడివున్న ఆరుట్ల క్యాంపు మీదఒకదళం మూడువైపులనుండి దాడిజేసి,ముగ్గురిని చంపివేసింది ఆ తర్వాత దళం సురక్షితంగా తప్పుకుంది. మరుసటిరోజు ఉదయాన్నే ఆ క్యాంపు ఖాళీ చేయబడింది. ఆ మిలటరీ నుపయోగించుకుని, ఆ ప్రాంతానికంతా పీడగా తయారైన దేశముఖ్ చెలమారెడ్డిని ప్రజలు, గెరిల్లాలూ చంపివేశారు

— చిట్టాపురం సమీపంలో ఒక తోపులో ఎర్పాటు చేయబడిన మరొక క్యాంపుపైనా అదేవిధంగా దాడిజేసి, యిద్దరు సైనికులను చంపివేశారు. ఆ క్యాంపుకూడా ఎత్తివేయబడింది

— ఆ రెండింటికి బదులు ఆరుట్ల గ్రామంలోనే రాతిబంగళాలో ఒక క్యాంపు ఏర్పాటు చేయబడింది

— గొరెల్లి క్యాంపులో ఒక అశ్వికదళంపై గెరిల్లా దళాలు దాడి జేసి, రెండు గుర్రాలను చంపివేశాయి

— లోయపల్లి క్యాంపు : ఎల్లమ్మతండానుండి మల్లయ్య, సోమయ్య అనే యిద్దరు సానుభూతిపరులను సైనికులు పట్టుకుని క్యాంపుకు తీసుకుపోతున్నారు అయితే దారిలో వాళ్ళపై దళం దాడిజేసింది. ఆ గందరగోళంలో వాళ్ళిద్దరూ తప్పించుకున్నారు ఒక సంవత్సరం తర్వాత, వారు తమ గ్రామానికి తిరిగి వెళ్ళి తమ భూములను దున్నుకోనారంభించారు. ఆ విషయాన్ని కొందరు ఏజెంట్లు తెలియజేయగా లోయపల్లి క్యాంపునుండి సైనికులు అచ్చటికి హుటాహుటిని వెళ్ళి ఆ రైతులిద్దరినీ కాల్చిచంపారు. కాని, ఆవెను వెంటనేపోలీసులకు వార్తచేరవేసిన వాళ్ళను చంపివేసి దళం వాళ్ళపై ప్రతీకారం తీర్చుకుంది

ఆ తర్వాత, 1949 డిసెంబరు మొదటి తేదీన గెరిల్లాలు ఆ క్యాంపుపై మరొకసారిదాడిచేసి కమాండరునుచంపివేశారు. నాలుగు ఆధునిక ఆయుధాలను స్వాధీనపరచుకున్నారు ఈ దాడి యావత్తూ, ఒక సారాయి దుకాణదారుని

ద్వారా పథకం వేయబడింది. ఆ క్యాంపు, జమీందారు క్రిష్ణారావు బంగళాలో ఏర్పాటు చేయబడింది. గెరిల్లా దళాలు, మిలటరీ క్యాంపులపై దాడిచేయ గలిగాయని, ఆయుధాలు స్వాధీనంచేసుకోగలిగాయనీ ప్రజలు ఉత్తేజం పొందారు. లొంగిపోయి ఆయుధాలను వొప్పగించిన సిపాయిలకు ఎలాంటి హాని చేయకుండా వెళ్లిపోనిచ్చారు. ఆ క్యాంపు ఎత్తివేయబడింది.

— అంతకుముందు మన దళంపై పోలీసులచేత దాడి జేయించిన ఒక ఏజెంటును, కొద్దిరోజుల తర్వాత 1949 డిసెంబరు 17వ తేదీన పొలాలలో మన దళం కాల్చి చంపింది. మిగతా ఏజెంట్లంతా పట్టణాలకు పారిపోయారు.

— పిలువలపాడు గ్రామంలో మామూళ్ల వసూలు కోసం వెళ్ళిన సైనిక సిబ్బందిపై గెరిల్లాలు కాల్పులు జరిపారు. వాళ్ళ లారీ టైర్లను బద్దలు గొట్టారు. ఒక స్త్రీ కి మానభంగ మొనరించే ప్రయత్నంలో నిమగ్నమైయున్న సైనికులు బ్రతుకుజీవుడా అని పలాయనం చిత్తగించారు.

*ఇబ్రహీంపట్నం* : పోలీసు అవుట్‌పోస్టుపై దాడి జేశారు. సెంట్రీని చంపివేశారు. మిగతా పోలీసులుపారిపోయారు నాలుగు తుపాకులు గెరిల్లాల వశమైనాయి

*సరూర్‌నగర్ - శిఖర్‌గ్రాం* : హైదరాబాద్ నగరానికి నాలుగుమైళ్ళ దూరంలోగల ఈ పోలీసుక్యాంపుమీద గెరిల్లాలు దాడిజేశారు. ముగ్గురు పోలీసులను చంపివేశారు.

*జూలూర్ భువనగిరి* : ఒక కల్లు లారీని ఆపారు. అందులోని సాయుధ పోలీసులవద్దగల రెండు రైఫిళ్ళను గెరిల్లాలు స్వాధీనంజేసుకున్నారు.

— కొత్తపల్లి : మహబూబ్‌నగర్‌జిల్లా కొల్లాపూర్ తాలూకాలోని ఈ పోలీసుస్టేషన్‌పై దాడిజేసి, ఆరు రైఫిళ్ళను స్వాధీనం జేసుకున్నారు.

— తిప్పాన కృష్ణారెడ్డి నాయకత్వానగల సుబ్బారెడ్డిగూడెం హోంగార్డు కేంద్రంపై 1951 అక్టోబరులో గెరిల్లాలు దాడిజేశారు పదిహేడు తుపాకులను స్వాధీనం జేసుకున్నారు. కృష్ణారెడ్డి పేరుమోసిన ప్రజాపీడకు డైన భూస్వామి అతడు మన గెరిల్లాలను వెంటాడి వేధించాడు. కాలవపల్లి వద్ద కామ్రేడ్ మంగయ్యతోసహా ఆరుగురిని చంపివేయటానికి అతడే కారకుడు.

— హుజూర్‌నగర్ తాలూకాలోని లక్ష్మాపురం, మేదిరంపల్లి హోంగార్డు కేంద్రాలపై గెరిల్లాలు దాడిజేశారు. ఏడు బర్మార్లను 13 మణుగుల తుపాకిమందును, రెండు పాట్ గన్లను స్వాధీనం చేసుకున్నారు.

— మిర్యాలగూడెం తాలూకాలోని వాడపల్లి కేంద్రం : ఒకపోలీసు గస్తీదళంపై దాడిజేసి యిద్దరు పోలీసులను చంపివేశారు. వారి తుపాకులను స్వాధీనం జేసుకున్నారు.

— మేళ్ళచెరువు సమీపంలో ఒక పోలీసు గస్తీ దళంపై గెరిల్లాలు దాడి జరిపి, యిద్దరు పోలీసులను చంపి, రెండు తుపాకులను హస్తగతంచేసుకున్నారు.

*వికారాబాద్ ప్రాంతం :*

— తట్టిపల్లి గ్రామంలో, 1950 జూన్ 2 వ తేదీన, ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టరును, ఒక గుడిసెలో వుండగా చుట్టుముట్టి కొట్టి, అతని పిస్టల్‌ను స్వాధీనం చేసుకున్నారు.

— నిరాయుధులైన యిద్దరు పోలీసులు కుంచారం పోలీసు స్టేషనుకు వెళుండగా. గెరిల్లాలు వాళ్ళను పట్టుకుని, వాళ్ళవద్దగల రికార్డులను గుంజుకుని వదిలేశారు. వికారాబాద్ ప్రాంతాన్ని ఆనుకునివున్న బీదర్ తాలూకాలో, గెరిల్లాలపై పోరాడటానికి సాయుధులైవున్న హోంగార్డులనుండి, గెరిల్లాలు 14 తుపాకులు స్వాధీనం జేసుకున్నారు.

కరీంనగర్ - జనగామ ప్రాంతం

*జనగామ ప్రాంతం ,*

— బుచ్చనపేట క్యాంపు గ్రామానికి వెలుపల వుంది. గెరిల్లా దళం దానిపై దాడిజేసి, కొంతసేపు కాల్పులు జరిపింది. ఆ తరువాత ఆ క్యాంపును ఎత్తివేసి, గ్రామంలోనే గట్టి భవనంలో ఏర్పాటుజేశారు.

— తరిగొప్పుల క్యాంపుకు జెందిన యిద్దరు సాయుధ సైనికులు, కొందరు ప్రజలకు వారంట్లందజేసి గండపల్లి గ్రామంనుండి క్యాంపుకు తిరిగి వస్తున్నారు. గెరిల్లా దళానికి ఈ వార్త తెలిసింది మార్గ మధ్యంలో, పట్టపగలే, క్యాంపుకు రెండు మైళ్ళ లోపునే గెరిల్లా దళం, వాళ్ళను ముట్టడించింది. వాళ్ళ ఆయుధాలను గుంజుకొన్నది

— ఆలేరు క్యాంపునుండి ఒక గస్తీ దళం గ్రామాలపై దాడికి బయలుదేరి వెళ్తుండగా తాలింపువాగు సమీపంలో గెరిల్లాలు మాటుగాచి దాడి చేశారు. వారిలో నలుగురుని చంపి గెరిల్లాలు సురక్షితంగా తప్పుకున్నారు.

— అక్కనపేట క్యాంపులో పనివాళ్ళు భోజనం చేస్తుండగా, ఆ క్యాంపుపై దాడి జేశారు. గెరిల్లాల కాల్పులవల్ల, ముగ్గురు సైనికులు మృతి జెందారు మరొక సందర్భంలో గ్రామ భూస్వాములు ఐదుగురు సాయుధ సిబ్బందిని వెంటబెట్టుకుని, తమ పశువులను తోలుకొచ్చుకొనటానికిగాను, కొండాపురం గ్రామానికి వెళ్లారు. అయితే, దళంవారిపై దాడి జేసింది ఒక భూస్వామిని చంపింది మరొకరిని గాయపరిచింది. సైనికులు పారిపోయారు. ప్రజలు, పశువులను తమ యిండ్లకు తోలుకుపోయారు.

— నిమ్మపల్లి క్యాంపు (మెదక్)కు జెందిన ఒక పోలీసు బృందం దాడులు జరిపి క్యాంపుకు తిరిగి వెళ్లుతుండగా, దళం మాటుగాచి దాడిజరిపింది. ఒక పోలీసు మరణించాడు. ఒకడు గాయపడ్డాడు, గెరిల్లాలు మరొకసారి, గ్రామ మధ్యంలోగల ఆ క్యాంపుపైనే దాడిజేసి ఒక బాంబు విసిరారు. అయితే దాని రవ్వలవల్ల ఎవరికీ హాని జరుగలేదు. దళం వుపసంహరించుకుంది. కాని, మరుసటిరోజే ఆ క్యాంపు ఎత్తివేయబడింది. క్యాంపు అధికారులకు తోడ్పడు తున్న ప్రజా శతృవులుకూడా గ్రామంనుండి పారిపోయారు ప్రజలకు ఎంత గానో వూపిరి సలుపుకునే అవకాశం కలిగింది.

అకునూరు క్యాంపు (సుల్తానాబాద్ తాలూకా) పై గెరిల్లాదళం దాడి జేసింది. ఆదళం అకస్మికంగా కాల్పులు జరపటంతో, ఆ క్యాంపులోని 18 మంది భయకంపితులై పారిపోయారు. వాళ్లు వదిలిపెట్టి పోయిన ఒక రైఫిల్‌ను తీసుకుని, దళం వెళ్లిపోయింది

— ఇరవై మందిగల పోలీసుదళం గ్రామాలపై దాడి అనంతరం మంథెన తాలూకా చింతకాని వద్దగల తమ క్యాంపుకు తిరిగి వస్తుండగా, ఐదుగురు సభ్యులుగల గెరిల్లాదళం, వాళ్లపై కాల్పులు జరిపింది శతృ బలగం. నలుగురిని నష్టపోయింది. దళం వెనుకకు వెళ్లిపోయింది అయినా, కొంత సేపటివరకూ శతృవు తన మందుగుండు సామాగ్రిని వృధా జేసుకున్నారు ఆ తర్వాత వాళ్లు తమ సంచారం విషయంలో జాగ్రత్తగా వుండేవారు. పెద్ద పెద్ద బృందాలుగా మాత్రమే తిరుగుతుండేవాళ్ళు

— కొండపల్లి క్యాంపు (సిద్దిపేట తాలూకా)పై దాడిజేసి, నలుగురు సైనికులను గాయపరిచారు

సిర్సిల్ల (కరీంనగర్ జిల్లా) పోలీసు స్టేషనుపై 1950 జూన్ 10 న దాడిజేశారు. నాలుగు రైఫిళ్ళు, ఐదువందల తూటాలు స్వాధీనం చేసుకున్నారు.

— మంథెన ప్రాంతంలోని భీరంగపూర్‌లో 1950 మే 24 న పోలిసు జమేదారు నొకరిని చంపివేశారు.

— 1950 ఆగస్టు 17 న నిమ్మపల్లి పోలీసు క్యాంపుపై దళాలు దాడి జేశాయి. ఒక ఇన్‌స్పెక్టర్‌తోసహా పదిమంది పోలీసులు గాయపడ్డారు.

— అడవిలోవున్న ఎన్నపల్లి సమీపంలో ఒక సైనిక గస్తీదళంపై గెరిల్లాదళం రెండు వైపులనుండి కాల్పులు జరిపింది. ఒక సైనికుడు మృతిజెందాడు.

— సముద్రాలలో పోలీసు గస్తీదళంపై దాడిజేయగా ఆరుగురు మరణించారు.

— హన్మానిపల్లిలో జరిగిన దాడిలో ముగ్గురు మృతిజెందారు.

— కరీంనగర్ జిల్లాలో గర్జనపల్లి క్యాంపు సమీపంలోను, శివ లింగాల వద్దనూ జరిగిన దాడులలో ఒకడు మరణించాడు.

మొత్తంమీద కరీంనగర్ ప్రాంతమంతటా గెరిల్లాదాడుల ఫలితంగా 23 మంది పోలీసులు మృతిజెందారు.

అదిలాబాద్ :

— మాసియాపేటదేశముఖ్ (ఆదిలాబాద్) బంగళాపైదాడిజరిపారు. అతడు మంచివేటగాడుగా పరిగణించబడేవాడు. తాను 25 పులులను చంపానని గొప్పలు చెప్పుకునేవాడు. అతనిని దెబ్బతీసి లొంగదీసుకొని అతని రైఫిల్‌ను, మరో మూడు తుపాకులను మందుగుండుసామగ్రిని దళంవశపరచుకొన్నది. అత గాడికిచెందిన రెండువందల బస్తాల ధాన్యాన్ని ప్రజలకు పంచారు.

— కడంప్రాజెక్టు కార్మికుల సమావేశంనుండి తిరిగి వస్తుండగా దళానికి, మిలటరీ లారీవొకటి కనిపించింది. దళం ఆ లారీపై కాల్పులు జరిపి, ముగ్గురినిచంపి, ఫారెస్టులోకి తప్పుకుంది. ఆవిధంగా వెనకకు వెళ్తుతుండగా, అదేరోడ్డుమీద మరొకచోట కనిపించిన మరొక సాయుధ గస్తీబృందంపైన కూడా కాల్పులు జరిపి, మరొకరిని చంపి, సురక్షితంగా వెళ్లిపోయింది.

— సోమారం గ్రామంపై దాడిజేసి అచ్చట ఎర్రజెండాను లాగి వేసి తిరిగివెళ్ళుతున్న ఒక సాయుధ గస్తీదళంపై ఒక వాగులో మాటుగాచి దాడిజేశారు. వారిలో నలుగురిని చంపివేశారు.

— గాడిలపల్లివద్దగల తమ క్యాంపుకు తిరిగివస్తున్న సాయుధగస్తీ దళంపై మాటుగాచి దాడిజేసి, వాళ్ళలో ముగ్గురిని చంపివేశారు. అదనపు బలగాలు హుటాహుటిని పంపబడ్డాయి. కాని అవి అక్కడికిచేరేలోపుగానే దళం సురక్షితంగా తప్పుకొంది.

— ప్రయాణీకుల బస్సులలో ప్రతిదానికోనూ యిద్దరేసి సాయుధ పోలీసులు కాపలా వుంటుంన్నందువల్ల చెన్నూరురోడ్డుమీద గెరిల్లాలు ఒక బస్సును అటకాయించారు. దాని టైర్లను బ్రద్దలు గొట్టారు. ఆ బస్సులోవున్న పోలీసుల వద్దగల ఆయుధాలను గుంజుకున్నారు.

## యూనియన్ భూభాగంలోని పోలీసు స్టేషన్లపై దాడులు

— కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పెనుగంచిప్రోలులో పోలీసు క్యాంపుపై గెరిల్లాలుదాడిచేసి 15 తుపాకులను స్వాధీనం చేసుకున్నారు. అయితే దారిలో వారు విద్రోహానికి గురైనారు. ఆ తుపాకులను, దళసభ్యుడగు కామ్రేడ్ నాసరయ్యనూ కోల్పోయారు. మిగతావారు సురక్షితంగా వెళ్ళిపోగలిగారు.

— కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా సిద్దేశ్వరంలో హోంగార్డు క్యాంపుపై గెరిల్లా దళాలు దాడిజేశాయి. ఏడు షాట్ గన్లు, 14 బర్మార్లు, మూడు రైఫిళ్ళు స్వాధీనం చేసుకున్నారు.

— కర్నూలు జిల్లాలోని గడివేముల పోలీసుస్టేషన్పై, 1951 జూన్ 2 వ తేదీన గెరిల్లా దళాలు జయప్రదంగా దాడిజేశాయి. 8 మస్కెట్లు, 250 తూటాలు, 9 బాయొనెట్లూ, 8 ఎర్రటోపీలు, వాటర్‌బాటిల్స్ స్వాధీనం చేసుకున్నారు. పోలీసు రికార్డులను ధ్వంసం జేశారు. రెండువేల రెండువందల రూపాయల రొక్కం, అరవై తులాల బంగారం, అర్దమణుగు వెండి పోలీసు స్టేషనులో నుండి స్వాధీనం చేసుకున్నారు.

— గుంటూరుజిల్లా: సత్తెనపల్లి తాలూకా అచ్చంపేట పోలీసు స్టేషనుపై 1950 ఏప్రిల్ 16 న గెరిల్లా దళాలు దాడిజేశాయి. 74 షాట్‌గన్లు రైఫిళ్ళు, వెయ్యి తూటాలు హస్తగతమైనాయి. ఇద్దరు పోలీసు సెంట్రీలను చంపివేశారు

— 1950 సెప్టెంబరు 25 న ఎల్లంపేట పోలీసు స్టేషనుపై పట్టుదలతో దీర్ఘకాలం దాడిజేసిన అనంతరం ఐదు రైఫిళ్ళు ఒక రివాల్వారు స్వాధీనం చేసుకొన్నారు. గెరిల్లాలలో వొకరగు కామ్రేడ్ కనకయ్య ఆ సందర్భంలో మృతిజెందాడు.

— కర్నూలుజిల్లా, మార్కాపురం తాలూకా పుల్లలచెరువు పోలీసు స్టేషనుపై 12 మంది సభ్యులుగల గెరిల్లాదళం దాడిజేసింది. 12 రైఫిళ్ళు, ఐదు బర్మార్లు, ఒకరివాల్వరు స్వాధీనం చేసుకొన్నారు.

శత్రుఏజెంట్లూ, దుష్టభూస్వాములు
చంపివేయబడిన ఉదంతాలు

ప్రజాపీడకులైన ఈ క్రిందివారిని గెరిల్లాలు హతమార్చారు :

మానుకోట ప్రాంతం

1. సంకీశ . రజాకార్ల హయాంలో తాను కోల్పోయిన ఆస్తిని తిరిగి స్వాదినం జేసుకోవడం పేరుతో, దేశముఖు రంగారెడ్డి గ్రామాలపై దాడులు, లూటీలు, గృహదహనాలు సాగిస్తున్నాడు. అతడు నెలల తరబడి వరుసగా దాడులు జరిపాడు 150 మందిని జైలులో పెట్టించాడు. ప్రజల దగ్గర నుండి 225 బర్మార్లు, 350 తూటాలు, ఒక టన్ను సీసం, ఒక క్వింటాల్ తుపాకి మందు, 105 యూనిఫారాలు స్వాధీనం జేసుకున్నాడు గెరిల్లాలు, అతనిపై ప్రతీకారం తీర్చుకోవాలని ప్రతినబూనారు

2. 1950 మార్చి 3 వ తేదీన, 24 గ్రామాలకు పోలీసు పటేలగు అహమ్మద్‌ఖాన్‌ను

3. మానుకోట తాలూకా, గూడూరు దేశముఖును, 1950జూన్ 14న,

4. వామనూర్ గ్రామంలో, మోరే వీరయ్య అనునాతడు జన్నారెడ్డి ప్రతాపరెడ్డి, ఏజెంటున్నాడు. వెట్టిచాకిరి చేయించటం, బేదఖళ్ళు చేయించటం, ప్రజలపై అత్యాచారాలు జరిపించటం, గ్రామంపై పలుమార్లు మిలటరీ దాడులు జరిపించటంద్వారా పేరుమోశాడు.

5. అక్రమ నిర్బంధ వసూళ్ళు జరపటానికి, మిలటరీవాళ్ళు చెరచటం కోసం యువతులను వొప్పగించటానికి, పోలీసులకు, మిలటరీ వాళ్ళకు వార్తలందజేయటానికి పేరుమోసిన లింగాల బుచ్చయ్యను దాట్ల గ్రామంలో.

6. పోలీసుల సహాయంతో ప్రజలను చిత్రహింసలకు గురిజేస్తూ వుండిన కాంగ్రెసు రజాకార్లగు భూస్వామి దాళ్ళకంటి వెంకటరెడ్డిని, అతని కొడుకు బుచ్చిరెడ్డిని 1949 న జులై 28 న,

7. మన్నెగూడెంలో యిండ్లను లూటీచేసి, స్త్రీలను చెరచి, లూటీలు జేయటంలో పోలీసులకు సహాయపడిన కాంగ్రెసు రజాకార్ చెన్నయ్యను,

8. నర్సంపేట తాలూకా, అలంఖానిపేటలో దుష్ట భూస్వామి రామయ్య, అతడు ప్రజలను ఉరిదీస్తుండేవాడు. గతంలో రజాకార్‌ఏజెంటుగా వ్యవహరించాడు.

9. జంగాలపల్లి భూస్వామి మూసిపల్లి నరసయ్యను 1949 నవంబరు 5 న; అతడు వెయ్యి ఎకరాల భూమికి, మిల్లుకు యజమాని. 40 గ్రామాలపై పోలీసులచేత దాడి జేయించాడు.

10. "రైఫిల్ రాములు" దళాన్ని నిర్మూలించటానికి కారకులయిన ముగ్గురు పోలీసు ఇన్‌ఫార్మర్లను కట్టుకూరు (బూర్గుంపహాడు) లో 1949 అక్టోబరు 14 వ తేదీన.

11. 1949 నవంబరు 14 న వడ్లకొండ గ్రామంలో చల్లకొండ వెంకటరెడ్డిని, మిలటరీ క్యాంపులో తలదాచుకొని వుండగానే.

12 మంథెన తాలూకా సురవరం గ్రామం. చల్లా రాజయ్య (భూస్వామి), కానుకుంట్ల జోగయ్య (పోలీసుపటేల్), బి. లింగయ్య (పేరు మోసిన ప్రజాకంటకుడు) వీళ్ళంతాకూడా సెంటర్ ఆర్గనైజర్ కామ్రేడ్ లక్ష్మీనర్సు తల్లిని మానభంగం జేయటానికి పోలీసులకు సహాయపడ్డారు.

## ఖమ్మం - మధిర ప్రాంతం

13. గోవిందాపురం. ఉమ్మినేని రామయ్య. పోలీసులు దాడిజేసి ప్రజలను కొట్టారు. అయినా ఎవ్వరూ రహస్యం బయటపెట్ట లేదు. 4-12 సంవత్సరాల మధ్యమయస్సుగల 25 మంది పిల్లలను క్యాంపుకు తీసుకుపోయారు. వాళ్ళకు మిఠాయిలు పెడతామని ఆశబెట్టారు. బెదిరించారు. అయినా, ఎవరూ ఒక్క మాటయినా చెప్పలేదు

14. ప్రొద్దుటూరు· 1949 ఆగస్టు మొదటి తేదీన భూస్వామి వెంకటరంగారావును, అతని కొడుకు చంద్రమౌళేశ్వరరావును. వారు గతంలో నైజాం రజాకార్లకు సహాయం జేశారు. యిప్పుడు యూనియన్ పోలీసులకు తోడ్పడుతున్నారు పార్టీ ఆర్గనైజర్ కామ్రేడ్ చెలమయ్యను చిత్రహింసలకు గురిజేయటానికి చంపివేయటానికి' గ్రామాలపై పదే పదే పోలీసు దాడులు జరపటానికి వాళ్లే కారకులు.

15. కుర్నవెల్లి గ్రామం (ఖమ్మంతాలూకా). కొమ్మినేని ప్రకాశరావును, 1949 నవంబరు 3 వ తేదీన అతడు ప్రజలను పీడించి, ద్వేషానికి గురైన భూస్వామి. అతడు సర్వదా మిలటరీ క్యాంపులోనే తలదాచుకునేవాడు.

## హుజూరునగర్ - మిర్యాలగూడెం ప్రాంతం

16 కల్మలచెరువు: అనేకమంది మిలిటెంట్లను పోలీసులచే చంపించటానికి కారకులైన లచ్చిరెడ్డి పంపిణీ చేయబడిన భూములను స్వాధీనం జేసుకున్న హుజూర్‌నగర్ పోలీసు ఇన్‌స్పెక్టరు వుంపుడుగత్తెయగు ఒక స్త్రీని. ఆమె పోలీసులకు రహస్యా లందజేస్తూ, అనేకమంది మిలిటెంట్లను అరెస్టు చేయించి, కాల్చి చంపడానికి కారకురాలు.

17. కాపుగల్లు, ముత్తవరపు కోటయ్య, సీతారామయ్య వాళ్ల ఇండ్లు పదివేల రూపాయల ఖరీదుచేసే వేరుశనగకాయ నిల్వలు కూడా ధ్వంసం చేయబడినాయి. చింతా కోటిరెడ్డి అదే గ్రామానికిజెందిన భూస్వామి, పేరుమోసిన ప్రజా శతృవు. అతడు కూడా మిలటరీ క్యాంపులోనే తల దాచుకుంటున్నాడు.

18. 1949, నవంబరు 29న హుజూర్‌నగర్‌లో పేరుమోసిన దుష్ట భూస్వామి కందిబండ జానకి రామారావును, అతని తొత్తును

19 కుమ్మరి ముత్తయ్యను హత్యచేయించిన కామారెడ్డి షావుకారు. అతని రక్షణకై నిరంతరం మిలటరీ కాపలా ఏర్పాటుచేయబడివుంది.

20. తిరుపతయ్య, ఊదర వీరయ్య అనే యిద్దరు హోంగార్డులను 1948 డిసెంబరు 14న. వాళ్లిద్దరూ, కామ్రేడ్ ఆరె పాపయ్యను పట్టించారు. అయనను చిత్రహింసలకు గురిచేశారు. స్త్రీలను చెరిపించారు ప్రజల ఆస్తులను లూటీచేయించారు.

21. నేలమర్రి (మునగాల పరగణా) : వెంకటనరసింహారెడ్డి, భూస్వామి, 1946 నుండి ప్రజాశత్రువు, కామ్రేడ్ వెంగల పాపయ్యను కాల్చి చంపటానికి ఆతడే కారకుడు.

22. గారగుంటపాలెం (మిర్యాలగూడెం) : కామ్రేడ్ అల్వాల నరసింహారెడ్డి మరణానికి కారకుడయిన రంగారెడ్డి రైతులకు పంచబడిన భూము లను స్వాధీనం జేసుకోబూనుకున్నాడు

23. బొత్తలపాలెం . కొండయ్య వ్యవసాయ కార్మికులను చిత్ర హింసలకు గురిజేస్తూ, పంపిణీ చేయబడిన భూములను స్వాధీనం చేసుకుంటూ వుండేవాడు. వ్యవసాయ కార్మిక నాయకుడు ఆకారపు సైదులును అరెస్టు చేయించి కాల్చిచంపించాడు.

24. మలకచెర్ల . పెద్ద భూస్వామియగు పటేల్ అనంత రాములు. అతడు అడివి దేవులపల్లి క్యాంపులో తలదాచుకొంటుండేవాడు. గ్రామాలపై దాడులు చేయించాడు.

25. నెల్లికల్లు : రమణయ్య – ఒకప్పుడు దళాలలో వున్నాడు. త్రాగుబోతు అయినందున బహిష్కరించబడ్డాడు. ఆ తర్వాత చెలకుర్తి

భూస్వాముల క్యాంపులో చేరాడు. ప్రజలను బీభత్సానికి గురిచేయటంలో చురుకుగా పాల్గొంటున్నాడు. లంచాలు గుంజుతున్నాడు.

26. రంగాపురం. పోటు వెంకట నరసయ్య. గ్రామ ప్రజలను పీడించేవాడు. అతడు ఆదినుండీ ఉద్యమానికి, ప్రత్యేకించి వ్యవసాయకార్మిక పోరాటాలకు వ్యతిరేకి. "పోలీసు చర్య" అనంతరం అతడు ప్రజలను కొట్టించాడు పార్టీసభ్యుల, గెరిల్లాదళ సభ్యుల కుటుంబాలలోని స్త్రీల తలలను, మగవాళ్ల మీసాలను గొరిగించాడు. మిలిటెంట్లను అరెస్టు చేయించాడు.

27. చిట్లకుంట (అచ్చంపేట లేక అమరాబాద్ తాలూకా : లచ్చిరెడ్డి. ముగ్గురు లంబాడీ మిలిటెంట్లను కాల్చి చంపటానికి కారకుడు. వెంకటేశ్వరం క్యాంపుపై గెరిల్లా దాడి సందర్భంగా అతడు చంపబడ్డాడు.

*భువనగిరి - ఇబ్రహీంపట్నం ప్రాంతం :*

28. మాడాపురంలో - జలాల్‌పురం పటేల్ పాముల కిష్టయ్య. చుట్టుప్రక్కల ముప్పై గ్రామాలపై దాడులు జేయటానికి మిలటరీ క్యాంపుకు అతడు సహాయపడ్డాడు. అక్రమ నిర్బంధ వసూళ్ళకు, నిర్బంధలెవీ వసూళ్ళకు, పేరుమోశాడు. పార్టీ నాయకుడగు కామ్రేడ్ గుండా కేశవులును అరెస్టు చేయించాడు.

29. బ్రాహ్మణపల్లి : కోదండ రామిరెడ్డిని చంపించటానికి సమాచార మందజేసిన గూండా భూస్వామి హనుమంతు. అతడు చేయించని అత్యాచారమంటూ లేదు.

30. భట్టుగూడెం : ఇందిరాలమిలటరీక్యాంపు సహాయంతో దాడులు చేయించి, దాదాపు యిరవై గ్రామాలకు పీడగా తయారయిన రామచంద్రారెడ్డి. ఒక గెరిల్లా తల్లినికూడా చిత్రహింసలకు గురిజేసిన ఈ దుష్ట భూస్వామిని, గెరిల్లా కాల్పులతో మిలటరీని ప్రక్కకు తప్పించినమీదట చంపివేశారు.

31. మైలారం గ్రామం : తలారి పిచ్చయ్య. సైనికులను తప్పత్రాగించి స్త్రీలను చెరచేట్లు చేసేవాడు తానే స్వయంగా ఒక స్త్రీని చెరచటానికి ప్రయత్నించాడు.

32. అరుట్లగ్రామం (ఇబ్రహీంపట్నం తాలూకా) : మిలటరీదాడులు చేయించుతూ, ఆ ప్రాంతమంతటికీ పీడగా తయారైన దేశముఖ్ చలమారెడ్డి.

పోరాటం సందర్భంగా చంపివేయబడిన దుష్టభూస్వాములు, శత్రు ఏజెంట్లలో పైన పేర్కొన్న వాళ్ళు కొలదిమంది మాత్రమే.

1949 జూలై నాటికి అక్కన్నపేట జమీందార్లు, జనగామ తాలూకాకు చెందిన పుసుకూరి నరసింహారావుతోసహా ఐదువందలమంది భూస్వాములు, వాళ్ళ ఏజంట్లూ చంపివేయబడ్డారు. తమ తమ గ్రామాలకు తిరిగి వెళ్ళటానికి, భూములను స్వాధీనం చేసుకోవటానికి భూస్వాములు భయపడుతున్నారని మిలటరీ గవర్నరు పేర్కొన్నారు.

957 మంది భూస్వాములను, వారి ఏజెంట్లను కమ్యూనిస్టు గెరిల్లాలు చంపివేశారని మిర్యాలగూడెం తాలూకా చెలకుర్తికి చెందిన పేరుమోసిన కాంగ్రెస్ నాయకుడు నిమ్మల రాములు పేర్కొన్నాడు.

# అధ్యాయం : 6

# కరీంనగర్, తదితర ప్రాంతాలలో పెల్లుబికిన ప్రజావెల్లువ

నైజాం రజాకార్ పాలనకు వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభమవటానికి చాలాముందే కరీంనగర్‌జిల్లాలో ఆంధ్రమహాసభ బహుళంగా ప్రజల ఆదరాభిమానాలనుపొందివుంది.1947–49 మధ్యకాలంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, ఆంధ్రమహాసభ కార్యకర్తలు గెరిల్లా దళాలుగా ఏర్పడి బీభత్స పాలనకు వ్యతిరేకంగా పోరాడారు. ఆ సందర్భంగా కామ్రేడ్స్ ప్రభాకరరావు, దామోదరరెడ్డి, భూపతిరెడ్డి మరికొంతమంది దళనాయకులు శత్రువు చేతుల్లో మృతిజెందారు. ఆ జిల్లాలో సాయుధ పోరాటం తీవ్రంగా దెబ్బతిన్నది. అయితే, నైజాం – రజాకార్ పాలనపై ప్రజలద్వేషం అధికమయింది. గెరిల్లా దళాల, కమ్యూనిస్టు నాయకుల రాకకోసం వారు ఆదుర్దాతో ఎదురు జూస్తున్నారు. ఇరుగుపొరుగు జిల్లాలలో యూనియన్ సైన్యాలకు వ్యతిరేకంగా కష్టజీవులైన సామాన్య ప్రజానీకాన్ని కాపాడిన వీరగాథలు వారిని వుత్తేజపరచాయి.

కరీంనగర్ – ఆదిలాబాద్ ప్రాంతంలో వుద్యమాన్ని విస్తరించటం కోసం, పార్టీ కొలదిమంది ఆర్గనైజర్లను, మూడు గెరిల్లా దళాలను పంపింది. రైతులు, వ్యవసాయ కార్మికులు వారిని సమధికోత్సాహంతో ఆహ్వానించారు. దుష్ట భూస్వాముల ధాన్యాన్ని, ఆస్తులను స్వాధీనం చేసుకోవటం, కోటులవంటి

వారి బంగళాలను ధ్వంసం చేయటం ప్రారంభించారు. 1950 మే, జూలై మధ్య మూడు మాసాల కాలంలో, ప్రజలు వెయ్యిబస్తాల ధాన్యాన్ని రెండు లక్షల రూపాయల ఖరీదుజేసే గృహోపకరణాలను, వ్యవసాయ పరికరాలను, స్వాధీనం చేసుకుని పంచుకున్నారు. భూస్వాముల బంగళాలను పన్నెండింటిని నేలమట్టం జేశారు 16 మంది పోలీసు సిబ్బందిని, పోలీసులకు వార్తలు చేర వేసే వాళ్లను గూండాలను భూస్వాములను 16 మందిని రూపుమాపారు

పోలీసులు, ప్రభుత్వాధికారులు గెరిల్లా దాడులెప్పుడు జరుగుతాయో నని భయంతో కంపించిపోతున్నారు. ఒకరోజు రాత్రి, ఎవరో ఒకరు, పోలీసు స్టేషన్‌పై టార్చిలైటు వెలుగును ప్రసరింపజేశారు. గెరిల్లా లొచ్చారనుకుని, సెంట్రీ, తదితరులూ కంపరంతో దాదాపుగా పరుగెత్తుకుపోయారు. మరొక రోజున, ఒక తాలూకా ఆఫీసులో పిల్లిపైనుండి దూకి పెద్ద శబ్దమైంది. అక్కడ పనిజేస్తున్న వాళ్ళందరూ చెల్లాచెదురయిపోయారు. ఇంకొకరోజున, విచారణలో వున్న దొంగలు కొందరు తప్పించుకుపారిపోగా, మునసబు కోర్టులో హెచ్చరిక గంట మ్రోగించారు అయినా, సమీపంలోని పోలీసు స్టేషనులోగల పోలీసులు తమ స్టేషన్‌లోనుంచి కదలలేదు. పై అధికారులు వాళ్ళను మంద లించారు. తాము కోర్టువద్దకు పరుగెత్తుకెళితే, గెరిల్లాల బారినుండి స్టేషన్‌ను ఎవరు రక్షించేవారని పోలీసులు ఎదురు ప్రశ్న వేశారు.

## సిర్సిల్ల పోలీసు స్టేషనుపై దాడి
## ప్రజల విజృంభణ

ఈ వాతావరణంలోనే గెరిల్లాలు సిర్సిల్ల పోలీసు స్టేషనుపైన 1950 జూన్ 10 న దాడిజేశారు. ఒక దళం నెమ్మదిగా, సెంట్రీల దగరకు మెల్లగా ప్రాకిపోయి, కాల్పులు జరిపింది. సెంట్రీలు తమ తుపాకుల నక్కడే వదిలేసి, ప్రాణాలు గుప్పిట్లో బెట్టుకుని పారిపోయారు. దళం పోలీసు స్టేషనులో ప్రవే శించింది నాలుగు రైఫిళ్లను, తూటాలను స్వాధీనం జేసుకున్నారు. కమ్యూనిస్టు లన్న అనుమానంతో, లాకప్‌లో నిర్బంధించిన వ్యక్తులను ఏడుగురిని విడుదల జేశారు. తాలూకా ఆఫీసులో కాపలావున్న పోలీసులుకూడా, తాము నిరాయుధులుగావుంటే, గెరిల్లాలు తమను చంపబోరన్న నమ్మకంతో, తుపా కుల నక్కడే వదిలేసి పారిపోయారు.

రక్షణ కోసమని, తమ గ్రామాలు వదిలివచ్చి అక్కడ వుంటున్న భూస్వాములు, దోపిడీదారులు యావన్మందికీ ఆ రాత్రంతా నిద్రలేదు. భయంతో వణికిపోతూ, వేయి దేవుళ్లకు మ్రొక్కుతూకూర్చున్నారు! పేద

ప్రజలు వీధుల్లోకొచ్చారు. తమ ఆనందోత్సాహాలను వెల్లడించారు. పట్టణ మంతా విముక్తి పొందినట్లు కనిపించింది.

సిర్సిల్ల స్టేషనుపై దాడివార్త, జిల్లా అంతటా దావానలంలా వ్యాపించింది పర్యటనలోవున్న అధికారులందరూ, తమ కేంద్ర స్థానానికి తిరిగి వచ్చారు లోతట్టు గ్రామాలలో ఏర్పాటు చేయబడిన చిన్న పోలీసుక్యాంపులు ఖాళీచేయబడినాయి. తెలంగాణా ఉద్యమాన్ని అణచివేయటానికి నియమించ బడిన ప్రత్యేకాధికారి కెప్టెన్ నంజప్ప, ప్రత్యేక చర్యలు ప్రకటించాడు. ఆ జిల్లాకు హుటాహుటిన వెళ్ళాడు.

భూస్వాములూ, ప్రజల విద్వేషానికి గురైన దోపిడిదారులు గ్రామాలు వదిలి పట్టణాలకు చేరుకున్నారు. గ్రామాలలోని స్థానిక నిరంకుశ పెత్తందార్లకు వ్యతిరేకంగా ప్రజలు విజృంభించారు.

నిరుపేదలతో సహా రైతులందరినుండి ఆహారధాన్యాలు లెవీ వసూలు జేసే పద్ధతి అమలులోవుంది. అధికారుల అవినీతి, లంచగొండితనం కారణంగా బడా భూస్వాములు తమవంతు చెల్లించకుండా తప్పించుకొంటున్నారు. దానితో మొత్తం భారమంతా సామాన్య రైతాంగంమీదనే పడుతోంది. ఆ సంవత్సరం, ఆ జిల్లాలో కరువు పరిస్థితి ఏర్పడివున్నందున ప్రజల ఆగ్రహం, ద్వేషం తారాస్థాయికి చేరాయి. సిర్సిల్లపై జయప్రదంగా దాడిజరగటంతో మంటలు ప్రజ్వరిల్లాయి. ధాన్యసేకరణ ఉద్యోగులు గ్రామాలనుండి పారి పోవలసివచ్చింది.

సుల్తానాబాద్ తాలూకాలో ఒక రైతు, ధాన్యం సేకరించే ఇన్స్పెక్టరునుచూచి, ఆయనపైదూకి, అయన చెవిపట్టుకుని, రెండు రాళ్ళమధ్యపెట్టి నొక్కుతూ "ధాన్యం సేకరించటానికి మరల వస్తావా?" అని కోపంతో అడిగాడు ఆ ఇన్స్పెక్టర్ భయభ్రాంతుడై "నా జీవితంలో ఎన్నడూరాను, నాకు ప్రాణభిక్ష పెట్టండి, అని అర్థించాడు. ఆయనను వదిలిపెట్టిచేశారు. ఆనాడు రైతాంగంయొక్క ధోరణి ఆ విధంగావుంది లెవీ సేకరణకు స్వస్తి జరిగింది.

ప్రజలు, దుష్టభూస్వాములపై దాడిజేయటం, వారి ధాన్యాన్ని, ఆస్థిని స్వాధీనం చేసుకోవటం, బలమైన పోలీసు అవుట్పోస్టులుగా మార్చ బడే అవకాశమున్న భూస్వాముల ఇండ్లను ధ్వంసంజేయటం ప్రారంభించారు. వారిలో మరీ దుర్మార్గులైనవారిని కొందరిని చంపివేయటంకూడాజరుగుతోంది.

నిమ్మపల్లి[1], బంటపల్లి, గాలిపల్లి కమ్యూనిస్టులకు బలమైన స్థావరాలుగా పోలీసులు పరిగణించారు. ఆ గ్రామాలపై పెద్ద ఎత్తున దాడి జేశారు. సిర్సిల్లదాడి జరిగిన వెనువెంటనే మూకవుమ్మడిగా ప్రజలను కొట్టటం

ప్రారంభమైంది. కాని, పోలీసులు వెళ్ళిపోయిన వెంటనే ప్రజలు భూస్వామి రాఘవరావుపైన షావుకార్ లక్ష్మీరాజ్యంపైన దాడిజేశారు వారి ధాన్యం, వుప్పు, నూనె డబ్బాలు, దుస్తులు అన్నింటినీ స్వాధీనంజేసుకున్నారు. వాటిని పేదలకు పంచి పెట్టారు. వాళ్ళ యిండ్లను నేలమట్టంజేశారు. కొలది రోజుల లోనే, ఒక పోలీసు క్యాంపు ఏర్పాటు చేయబడింది. పోలీసులు మూకవుమ్మడిగా ప్రజలను బాదటం, హింసలకు గురిజేయటం, లూటీలుజేయటం ప్రారంభమైంది. అయితే ఒకనాడు ప్రజల సంపూర్ణ సహకారంతో గెరిల్లాదళం ఆ క్యాంపుపై దాడిజేసింది. ఒక చేతి బాంబు విసిరింది ఇక ఆతర్వాత, పోలీసులు ప్రజలను వేధించి మామూలు వసూళ్ళకోసం తిరగటానికి సాహసించలేక పోయారు. ఒకరోజున వాళ్ళు పొలంలో పనిజేసుకుంటున్న రైతునొకరినికాల్చి చంపారు. కమ్యూనిస్టులే కాల్చి చంపారనిచెప్పి ప్రజలను నమ్మించ జూచారు. కాని అదిపోలీసు హంతకులపనేనని ప్రజలు ధైర్యంగా తేల్చిచెప్పారు

సిర్సిల్ల తాలూకా ఎర్నపల్లికి జెందిన నర్సింగరావు, తిమ్మాపురానికి జెందిన చిన నర్సింగరావు, జగిత్యాల్ తాలూకా రుద్రంగికి జెందిన ఈతాకుల నర్సింగరావు, గోవిందారానికి జెందిన వెంకటరావు, కేశవరావు, పోతారం మక్తేదారు, నూకలమర్రికి జెందిన రామచంద్రరావువంటి బడా భూస్వాముల యిండ్లనుండి ప్రజలు ధాన్యం, బంగారం, వెండి తదితర వస్తువులను స్వాధీనం చేసుకున్నారు. ఈ అన్నిచోట్లనూ, ఈ భూస్వాముల రాతి గడీలను నేలమట్టంజేయటం, తద్వారా వాటిని పోలీసు క్యాంపులుగా వుపయోగించే అవకాశం లేకుండా చేయడం ప్రజలకు, దళాలకు మామూలైంది.

జగిత్యాల్‌లోని జమీందార్లందరిలోకీ దుష్టుడుగా పేరుమోసిన వాడు ధర్మారం చొక్కారావు. భీమవరంచుట్టూ నలభైకి పైగా గ్రామాలలో, పల్లెలలో దారుణమైన దోపిడీ సాగించాడు. అతనిపై దాడి, ప్రజలు సాగించిన దాడులలోకెల్లా ఎంతో గమనార్హమైనది ఈ రక్తపిపాసి, రజాకార్ రోజులలో తన కుటుంబంతో సహా పట్టణానికి పారిపోయాడు. మరి తిరిగిరాలేదు అతడు తన వ్యవహారాలన్నీ ఒక సూపర్వైజర్ ద్వారా చక్క దిద్దుకున్నాడు. గెరిల్లా దళాలు, యిరవైకిపైగా గ్రామాలనుండి ప్రజల సమీకరించి అతిపెద్దదైన గడీపై దాడి జేశారు. మూడువందల బస్తాల ధాన్యం, నలభై మణుగుల వెండి వస్తువులు, నాలుగుబండ్ల ఇత్తడి తదితర సామాగ్రి, మొత్తం ఒక లక్షరూపాయల విలువగల వాటిని స్వాధీనం జేసుకుని ప్రజలకు పంపిణీ జేశారు ఆగడీని నేల మట్టం జేశారు ఆ తర్వాత, పోలీసులొచ్చి, యింటింటిపైనా దాడి జేశారు. అయినా రైతుల యిండ్లనుండి వంద బస్తాల ధాన్యం మాత్రం స్వాధీనం చేసుకో గలిగారు. అంతకంటె యింకేమీ దొరకలేదు.

## ప్రక్క జిల్లాలకు ఉద్యమ వ్యాప్తి

పొరుగునేవున్న మెదక్ జిల్లా తాలూకాలకు, నిజామాబాదు జిల్లాకు వుద్యమం వ్యాప్తి గాంచింది. రెడ్డిపేట గ్రామ రికార్డులను గెరిల్లాలు తగులబెట్టారన్న వార్త విని, మెదక్ జిల్లా, కామారెడ్డి తాలూకాలోని అన్నవరం గ్రామ ప్రజలు దళాలను తమ గ్రామానికి ఆహ్వానించారు. తరతరాలుగా సాగుతున్న పీడనను విరగడ జేసుకొనేందుకు తమకు సహాయపడవలసిందిగా కోరారు. వారు తమ కష్టగాధల నీలా చెప్పుకున్నారు : "జాగీర్దారు మా రక్తం పీల్చివేశాడు 'జైహింద్' ప్రభుత్వం ఏర్పడిన తర్వాత మా కష్టాలు తొలగిపోతాయని మేమాశించాం. అందుకు భిన్నంగా కష్టాలింకా అధికమయినాయి. మాకు దారి జూపండి. మా శత్రువులపై పోరాడేందుకు పోరాట పద్ధతులను మాకు నేర్పండి పోలీసు దాడులనుగూర్చి భయపడవద్దు మేమంతా సమైక్యంగా వున్నాం పోలీసులకు, ఎవ్వరూ ఎలాంటి సమాచారమూ అందనివ్వం. మేము నిఘాతోవుండి, మిమ్ములను కాపాడుతాం" దళాలు గ్రామానికి చేరాయి కొన్ని బంగళాలను తగులబెట్టివేశాయి. దళాలను సురక్షితమైన చోటుకు చేర్చారు మరుసటిరోజునే పోలీసు లొచ్చారు. ప్రజలను బాదటం ప్రారంభించారు వాళ్ళనుండి ఎలాంటి సమాచారమూ రాబట్టలేకపోయారు. గెరిల్లా దళాలు మెరుపుదాడులుజేస్తూ, పోలీసులను వేధించాయి. ఒకసారి, పోలీసులు ఒక రైతును అరెస్టుజేసి, కామారెడ్డి పోలీసు స్టేషనుకు తీసుకుపోయారు. మూడు వందలమంది ప్రజలు వాళ్ళ వెంటబడిపోయి, ఆయనను విడుదల జేయించారు. పరిసర గ్రామాలన్నింటిలోని ప్రజలూ భూస్వాములకు కౌళ్ళు, ప్రభుత్వానికి పన్నులు, పశువులు మేపుకొన్నందుకు పుల్లరి చెల్లించటం మానివేశారు.

గతంలో ప్రజల భూములను తాను కబళించినందువల్ల, ప్రజలు ప్రతీకారం తీర్చుకుంటారని భయపడి, నిజామాబాద్ జిల్లాలో వన్నాజీపేట జాగీర్దార్ హైదరాబాదు నగరానికి వెళ్లిపోయాడు అప్పుడాతనికి, ఐదువందల ఎకరాల భూమివుంది. రైతులను, తమ పొలాలకు నీళ్లుపెట్టుకోనిచ్చేవాడుకాదు. నీటినంతటినీ అతడొక్కడే వాడుకొనేవాడు. హరిజనులు, తదితర ప్రజలు దళంతో పూర్తిగా సహకరించారు. ధాన్యం, వ్యవసాయ పరికరాలు స్వాధీనం జేసుకుని పంచుకున్నారు గడీని ధ్వంసంజేశారు మూడురోజుల తర్వాత, పోలీసులు గ్రామాలపై దాడిజేశారు. ప్రజలను యిష్టంవచ్చినట్లు బాదారు. 22 మందిని అరెస్టు చేశారు. అయినా ప్రయోజనం లేకపోయింది

అదే విధంగా, చీమలపల్లి జాగీరు ప్రజలూ దళాన్ని ఆహ్వానించారు జాగీర్దారు ధాన్యాన్ని, పదివేల రూపాయల ఖరీదుజేసే యితర వస్తువులనూ

స్వాధీనం జేసుకున్నారు. గడీని నేలమట్టం జేశారు. మరుసటిరోజునే పోలీసులు వచ్చారు. ప్రజలను కొట్టారు. 18 మందిని అరెస్టు చేశారు. పోలీసుక్యాంపు ఏర్పాటు జేయబడింది. అయినా తమ ప్రాణాలకు భయంలేదన్న భావం భూస్వాములకు కలుగలేదు. వారంతా పట్టణాలకు చేరుకున్నారు. గ్రామాలకు తిరిగి రావటానికి సాహసించలేదు.

జమీందార్ గోపాలరావుకు గర్జనపల్లిలో విస్తారంగా భూములున్నాయి. ఆయన బావమరది హనుమంతరావు సిర్సిల్ల తాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు. కమ్యూనిస్టు గెరిల్లాలను అరెస్టు చేయటానికి, వెంటాడటానికి పోలీసులకు సహాయపడవలసిందిగా కోరుతూ, ఆయన కాంగ్రెసు కార్యకర్తలకు ఒక సర్క్యులర్‌జారీజేశాడు గూండాలనుచేర్చి మేపటంకోసం, లంబాడీలనుండి కూడా అతడు డబ్బు వసూలుచేశాడు. పోలీసులు లంబాడీ తండాలపై పదేపదే దాడిజేశారు. అయినా అతడు చేర్చుకున్న యిద్దరు, ముగ్గురుకూడా ప్రజలకు లొంగిపోయి ప్రజాప్రయోజనాలకు వ్యతిరేకంగా వ్యవహరించినందుకుగాను ప్రజలకు జరిమానాలు చెల్లించవలసి వచ్చింది.

బందిపోటు దొంగలకు పోలీసులు రక్షణ యిచ్చారు. వాళ్ళు చేసిన లూటీలను, కమ్యూనిస్టులు చేసిన బందిపోటుచర్యలుగా దుష్ప్రచారం చేశారు. ఖాసింపేటకుచెందిన వెంకటరెడ్డి పేరుమోసిన బందిపోటు దొంగ. ప్రజలాతనినిపట్టుకుని ఒప్పగించారు. కాని పోలీసులు అతనిని వదిలేశారు. ఒక వర్తకునిచంపి, దారిగాచి దొంగతనం చేసిన మరో యిద్దరు పేరుమోసిన బందిపోటుదొంగలను కమ్యూనిస్టు గెరిల్లా దళాలు పట్టుకున్నాయి. వాళ్ళను ప్రజలముందునిలిపి, విచారణజరిపి కాల్చిచంపారు. ఆ తర్వాత, బందిపోటు దొంగతనాలు, సంఘ వ్యతిరేక గూండాచర్యలూ వెంటనే బాగా తగ్గిపోయాయి.

మూడుమాసాలకాలంలోనే ఈ ప్రజావెల్లువ దాదాపు నాలుగు వందల గ్రామాలకు వ్యాపించింది. గెరిల్లాదళాలు, ఆర్గనైజర్లు సుమారు మూడు వందల గ్రామాలతో సన్నిహితసంబంధాలు పెట్టుకొన్నారు. మొదట్లో కొంత మంది చిన్నవ్యాపారస్థులు, ధనికరైతులు భయపడ్డారు. వారిలో చాలామంది పట్టణాలకు వెళ్ళిపోయారు కూడా. కాని, దళాలు వివరించిచెప్పే ఉద్యమాలను నిర్వహించిన అనంతరం, దళాలు అతిగా ద్వేషించబడే పీడకులపైన, వారి ఏజెంట్లపైనమాత్రమే చర్యలు తీసుకొనటం, ఇతరవర్గాల ప్రయోజనాలను కాపాడటం చూచిన తర్వాత, వాళ్ళ భయాలు తొలగిపోయాయి. గ్రామాలకు తిరిగివచ్చారు.

## పోలీసు దాడులు - ప్రజల ప్రతిఘటన

ప్రజలు ఈ విజయాలు సాధించుకొనటానికి, అంతులేని కష్టా లనుభ వించవలసి వచ్చింది. లెక్కలేనన్ని త్యాగాలు చేయవలసి వచ్చింది.

కొండ్రావుపేటలో 40 మందిని, బొమ్మనదేవిపల్లిలో 47 మందిని, తిరుమలాపురంలో 40 మందిని, తిమ్మయ్యపల్లిలో 46 మందిని, తంసాగర్‌లో 20 మందిని, నాచేపల్లిలో 46 మందిని పోలీసులు దారుణంగా కొట్టారు. పోలీ సుల దురంతాలకు యివికొన్ని వుదాహరణలు మాత్రమే. బాలరాజుపల్లిలో నర్సింహారెడ్డిని అరెస్టుజేసి ఎనిమిది రోజులపాటు చిత్రహింసలకు గురిజేశారు. చివరకు ఆయన ఓర్షాలలో ఒక కదురు గుచ్చారు.

పశ్చిమ జనగామలోని, అనంతారంలో ఒక కామ్రేడ్ తల్లియగు రామక్కను వివస్త్రను జేశారు తన కొడుకు ఎక్కడున్నదీ చెప్పవలసిందిగా కోరుతూబూటుకాళ్ళతో ఆమెపైకెక్కి తొక్కారు. "మేము అనేక అత్యాచారా లకు గురయితే కావచ్చు అయినా మేము పోలీసు కుక్కలకు ఏ రహస్యాన్ని వెల్లడించం. కామ్రేడ్స్ మీరు జాగ్రత్తగా వుండండి. అన్ని జాగ్రత్తలూ తీసు కొండి" అని ఆ వీరవనిత కబురంపింది.

ఆర్మూర్ తాలూకా, మానాలగ్రామంపై పోలీసులు దాడిజేశారు. ఐదువందలమందిని హింసలకు గురిచేశారు. 12 మంది స్త్రీలను చెరిచారు. నీలం క్రిష్టయ్య, కిషన్, చలయెల్లయ్య, ముదం మల్లయ్య, మరొకరు - మొత్తం ఐదుగురిని చంపారు. జగత్యాల్ తాలూకా, కోనాపురంలో లంబాడీ ప్రజల నాయకుడు లచ్చానాయక్‌ను కాల్చి చంపారు. జాన్‌ను, చక్కి వెంకయ్యను హింసించారు. ఎర్రగా కాల్చిన యినుప కడ్డీలతో మెడలచుట్టూ వాతలు బెట్టారు, అయినా, వారు దళం జాడను గూర్చి చెప్పకపోవడంతో, వారిని కాల్చిచంపారు చింతకుంట్లలో యిద్దరు రైతులను స్పృహతప్పిపోయేంత వరకూ కొట్టి, ఆ తర్వాత కాల్చిచంపారు.

తెలంగాణాలో ప్రతిచోటా చేసినట్లుగానే, ప్రభుత్వం యిక్కడ కూడా, గిరిజన ప్రజలను గ్రామాలనుండి ఖాళీచేయించి, గెరిల్లాలకు సహాయం అందించే అవకాశం లేకుండా చేయటంకోసమని, ఫారెస్టులనుండి, పెద్ద జనా వాస ప్రాంతాలకు దూరంగా చెదురుమదురు కేంద్రాలనుండి లంబాడీలవంటి వెనకబడిన ప్రజలను ఖాళీ చేయించి సెటిల్‌మెంట్లను ఏర్పాటు జేయటమనే "బ్రిగ్స్ పథకాన్ని" అమలు జరపటానికి ప్రభుత్వం ప్రయత్నించింది. మానాల, తాళ్ళపల్లి, బంజాపల్లి, సర్దార్‌పురం, సామవారిపేట గ్రామలలో మిలటరీ ప్రజలను క్రూరంగా కొట్టింది. తిండిలేకుండా మాడ్చింది. పోలీసు,

మిలటరీ క్యాంపుల సమీపంలో గుడిసెలలో నివసించేట్లుగా నిర్బంధించింది. అయినా, ప్రజలు ప్రతిఘటించారు. మానాలతండా ప్రజలను మిలటరీ బీభత్సం జరిపి ఖాళీ చేయించింది. కాని, గెరిల్లాదళం, వారికి కబురంపిన వెంటనే ఒక్క రోజులోనే వారు తిరిగి వచ్చారు. తాళ్ళపల్లితండా ప్రజలు, పోలీసు క్యాంపు సమీపంలో కొత్త గుడిసెలలో ఒక నెలరోజులు గడిపిన తర్వాత తమ పాత చోటుకే తిరిగి వచ్చారు.

బంజానపల్లిలోనూ ప్రజలు అదే విధంగా పాతచోటుకే తిరిగి వచ్చారు. ఈ గ్రామాలలో పోలీసులపై గెరిల్లా దాడి జరిగిన అనంతరం, "మాపై దాడి జేయటానికి గెరిల్లాలను తీసుకు వచ్చినందుకు ఫలితం అనుభవించండి" అంటూ పోలీసులు ఘూకవుమ్మడిగా ప్రజలందరినీ కొట్టారు. "ఇంతవరకు మేమాపని చేయలేదు. మీమీద పగతీర్చుకొనటానికి యిక ముందు తప్పక వాళ్ళను తీసుకొస్తాం!" అని దారుణంగా దెబ్బలుతిన్న ఒక లంబాడి స్త్రీ ఎదురు చెప్పింది.

జనగామ తాలూకా, నర్మెటలో పోలీసులు రాజ్యాను అరెస్టు చేశారు. గెరిల్లా దళాలజాడ తెలుపవలసిందిగా కోరుతూ, కొట్టుకుంటూ, పోలీసుస్టేషనుకు తీసుకుపోయారు గ్రామ ప్రజలంతా పోగై, స్టేషన్‌ను చుట్టుముట్టి, ఆ యువకుని విడిపించుకున్నారు. కేసిరెడ్డిపల్లె, వెలిదండ గ్రామాలలో, నిర్బంధంవల్ల రాత్రి కాపలా కాస్తున్న ప్రజలు, రాత్రివేళ పోలీసు లారీలను గ్రామంలో ప్రవేశించనివ్వలేదు రాఘవాపురం, బహిరాంపల్లి గ్రామాలలో మగవాళ్ళు రాత్రి కాపలా కాస్తుండగా, వారి స్త్రీలలో కొందరిని పోలీసులు చెరిచారు. దానితో గ్రామస్థులంతా రాత్రి కాపలాకు వెళ్ళటానికి నిరాకరించారు. తమ యిళ్ళు వాకిళ్ళను కాపాడుకోనారంభించారు

క్యాంపులలోవున్న పోలీసులమీద, వాళ్ల గస్తీలమీద, ప్రజలు ద్వేషించే పీడకులపైన, పోలీసులకు సమాచారం అందజేసేవారిపైన లెక్కలేనన్ని దాడులు జేయటంద్వారా, గెరిల్లా దళాలు ప్రజలకు, ప్రతిఘటనలో క్రియాత్మకమైన తోడ్పాటు నిస్తున్నాయి.

నిజామాబాద్ జిల్లాలో, గ్రామాలపై పెద్ద ఎత్తున దాడులు చేయటం కోసం అధికారులు రోడ్లను, బాటలను మరమ్మత్తు చేస్తున్నారు గెరిల్లాలు, ప్రజలు ఆరోడ్ల కడ్డంగా చెట్లను నరికి పడవేసి, 6 "పోలీసు అధికారులు ఖతం చేయబడతారు" అని బోర్డు రాసిపెట్టారు. గెరిల్లాలు అక్కడ మందుపాతర నాటారని గొర్లకాపరులు పోలీసులకు చెప్పారు దానితో వాళ్లు తమ జీపులను రోడ్డునుంచి క్రిందకి తిప్పి, దానిని తప్పుకుపోదలచారు. కాని, వారు, గెరిల్లాల వలలో పడ్డారు. ముగ్గురు పోలీసులు, ఒక యిన్‌స్పెక్టరూ చంపబడ్డారు. 1950 ఆగస్టు 7 వ తేదీన యిది జరిగింది

నిమ్మపల్లి పోలీసు క్యాంపుమీద దళాలు ఆగస్టు 17 వ తేదీన దాడి జేశాయి. ఇన్‌స్పెక్టరుతోసహా పదిమంది పోలీసువాళ్లు క్షతగాత్రులయ్యారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు మృతిజెందారని ప్రజలు చెప్పారు తప్పించు కొన్న మరొక ఇన్‌స్పెక్టరు తన వుద్యోగానికి రాజీనామా యిచ్చాడు.

1950 సెప్టెంబరు 5 వ తేదీన, పోలీసు గస్తీదళానికి, గెరిల్లా దళానికి మధ్య అకస్మాత్తుగా సంఘర్షణ జరిగింది. దళ కమాండరు కాల్పులు ప్రారంభిం చాడు. పోలీసులు ఎంతగా భయకంపితులయిపోయారంటే, కొంతసేపటిదాకా వాళ్లు తిరిగి కాల్పులు జరపలేకపోయారు. దళం తప్పుకున్నది. ఆ తర్వాతనే పోలీసులు చాలా తూటాలు పేల్చి, దగ్గరలోవున్న తాటితోపులో కెళ్లి తనివి దీరా కల్లు త్రాగారు.

1950 అక్టోబరు 5 వ తేదిన, ఎర్నపల్లి సమీపంలో, ఫారెస్టులో ఒక మిలటరీగస్తీదళంపై గెరిల్లా దళం రెండు దిశలనుండి కాల్పులు జరిపింది. ఒక సైనికుడు మరణించాడు. ఆ గస్తీ దళంతో వున్న ఇన్‌స్పెక్టరు భయంతో కంపించిపోయి ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, బట్టలు ఖరాబు చేసుకుంటూ పరుగెత్తాడు. గెరిల్లాలు, పోలీసు గస్తీ దళాలపై దాడులు జరిపి, సముద్రాల గ్రామంలో ఆరుగురిని, హన్మానిపల్లి సమీపంలోముగ్గురిని, గర్జనాపల్లి క్యాంపు సమీపంలో శివలింగాల సమీపంలో ఒక్కొక్కరిని చంపారు.

వివిధచోట్ల పోలీసు గస్తీదళాలపై ఆకస్మిక దాడులనేకం జరిగాయి దీనితో పోలీసులు మనోనిబ్బరం కోల్పోయారు ఒక ఫారెస్టు ప్రాంతంలో అనేక గ్రామాలలో గాలింపుచర్యలు జరపటంకోసం ఒకసారి ఐదువందలమంది పోలీసులు, సైనికులు సమీకరించబడ్డారు. వాళ్ళు మకాంపెట్టినచోట్ల రాత్రంతాకూడా యిండ్లలోనుండి కదలటానికి వాళ్ళు సాహసించలేదు. హోంగార్డు దళాన్ని ఏర్పాటు జేయటానికి పోలీసులు శక్తికొద్దీ ప్రయత్నిం చారు అనేకమంది పేదలను నిర్బంధించి రాత్రి కాపలాకాయించారు. పేద ప్రజలు గెరిల్లాల పక్షానేవున్నారు రాత్రికాపలా కాస్తున్నట్లు నటించే సమయంలోకూడా వారు గెరిల్లాలకు సహాయపడేవారు పోలీసులపై పదేపదే గెరిల్లా దాడులు జరగటంతో హోంగార్డు సంస్థకూడా కుప్పగూలిపోయింది.

పేరుమోసిన భూస్వాములను, వాళ్ళకు సమాచారం అందచేసే వారిని గెరిల్లాలు చంపివేయటంతో ఈ పరిణామం వేగిరపడింది అలా చంపి వేయబడిన వారిలో గోవిందాపురానికి జెందిన కేశవరావు ఎస్టేటు మేనేజరు, పోతారం మక్తేదారు మేనేజరు, వన్నాజీపేట దేశముఖు ఏజెంట్లిరువురు, పోలీసు దాడులు చేయించిన బండారుకుంటకు జెందిన బుచ్చిరెడ్డి, కొండపాక, వెంకటు

రామపల్లి, బాలరాజుపల్లి, అక్కపల్లి గ్రామాలలో ఏజెంట్లు, భరిషంపేటకు జెందిన నర్సింహారెడ్డి, నర్సింగపురానికి జెందిన చంద్రారెడ్డి, రంగారాం మొదలైన వారున్నారు.

పార్టీ ఆర్గనైజర్లు కనిపించినప్పుడెల్లా ప్రజలు "మాకు ఆహారధాన్యాలివ్వండి, మాకు పశువులివ్వండి, మేము మీతోపాటు ఎంతదూరమైనా రావటానికి సిద్ధంగా వున్నాం" అని చెప్పేవారు. యువకులు దళాల్లో చేరుతున్నారు. ఇరవైమంది అప్పటికే చేర్చుకోబడ్డారు. మరో యిరవైమంది కొలది రోజులలోనే చేర్చుకోబడనున్నారు.

## ప్రజలచే ధాన్యం - భూమి స్వాధీనం

శత్రుదాడులు ఉధృతమైనాయి. అయినా, తిండికోసం దేవుళ్ళాడుతున్న ప్రజలు భూస్వాముల ధాన్యం స్వాధీనం జేసుకున్నారు. తెల్లవారే సరికల్లా, భూస్వాముల పొలాల్లోని పంట నూర్చుకున్నారు. పగలంతా పోలీసులు పాశవికంగా కొడుతూ, నానాహింసలకు గురిజేస్తున్నా, వారు రాత్రి వేళల్లో ధాన్యం స్వాధీనం చేసుకొనటంకోసం పది-పదిహేనుమైళ్ళదూరం పోతుండేవారు. ఒక నెలరోజులలో సనుగుల, నాచుపల్లి, రామన్నపేట, మద్రిమెడ గ్రామాలకు జెందిన భూస్వాముల ధాన్యం, వేరుశనగకాయలు, పప్పుధాన్యాలు, పొగాకు, వూరగాయి పచ్చళ్ళు సయితం స్వాధీనం చేసుకున్నారు.

ప్రజలు అడవులుకొట్టి, తుప్పలునరికి బంజరు భూములు సాగుజేసుకోనారంభించారు. వారు మానాల గ్రామంలో ఐదువందల ఎకరాలు, కొండాపురం, తూముపల్లి గ్రామాలలో రెండువందల ఎకరాలు, తోటపల్లిలో వందఎకరాలు, జనగామలో నూటయాభై ఎకరాలు, వానపల్లి, తాటిపల్లి, రత్నగిరిపల్లి, గంగరావి, బొడ్లపల్లి, కోనాపురం గ్రామాలలో ఒక్కొక్క గ్రామానికి ఇరవై నుండి ముప్పై ఎకరాలవరకు అలాంటి భూమిని సాగుజేసుకున్నారు. భూస్వాముల పశువులనుకూడా పంపిణీ చేయవలసిందిగా వారు పార్టీపై వొత్తిడి జేస్తున్నారు.

ఎర్నపల్లి, నాచుపల్లి, గోవిందారం, సూరంపేట, కొడిమలల్లో కార్మికులు చెట్లు నరికినందుకు, కట్టెలు కొట్టినందుకు తమకిచ్చే వేతనాలను రోజుకు పదణాలనుండి (62 పైసలు), రెండున్నర రూపాయలకు హెచ్చించుకున్నారు. ఫారెస్టులను ఆనుకునివున్న గ్రామాలలో, పేదప్రజలు వుచితంగానే కట్టెలుకొట్టి అమ్ముకొని జీవనం సాగిస్తుండేవారు.

ఈ ప్రజావెల్లువలో, గ్రూపుసమావేశాలు, గ్రామసభలు లెక్కలేనన్ని జరిగాయి. ప్రజాతంత్రకర్తవ్యాలనుగూర్చి, పార్టీ విధానాలనుగూర్చి ఆ సభలలో

వివరించటం జరిగింది 1950 సంవత్సరం దసరాపండుగ రోజులలో సాధ్యమైనన్ని ఎక్కువగ్రామాలలో ఎర్రజెండాల నెగురవేయాలని నిర్ణయించబడింది. ఈ కార్యక్రమం వందగ్రామాలలో నిర్వహించబడింది. కొన్నిచోట్ల పోలీసుల ఎట్టఎదుటనే, ఇదంతా స్థానిక, గ్రామదళాలు నిర్వహించాయి.

రుద్రంగిలో మలబార్ స్పెషల్ పోలీసుక్యాంపు ఏర్పాటు చేయబడి వుంది. అయినా తెల్లవారేసరికల్లా అచ్చటిజెండా స్థంభంపై ఎర్రజెండా రెపరెపలాడుతోంది పోలీసులు నిద్రలేచేసరికే అది ప్రత్యక్షమయింది. ఎర్రజెండా ప్రతిష్ఠాపనకు అనుమతించేదిలేదని, నిమ్మపల్లి లో పోలీసులు టాంటాం వేయించారు. అయినా అరడజనుచోట్ల, ఇండ్లమీద, చెట్లమీద ఎర్రజెండా ఎగురవేయబడ్డాయి. కమ్యూనిస్టులను బలపరుస్తున్నందున, ఎర్రజెండా లెగురవేసినందుకు ప్రజలను పోలీసులు బెదిరించారు. రాత్రికాపలాగాసే ప్రతిదళంతోనూ, నలుగురు పోలీసులు రైఫిళ్ళు చేతబట్టుకొని వెంట తిరుగుతుండగా, దీనికి తామెలా బాధ్యతవహించగలమని ప్రజలడిగారు. అదేవిధంగా గొల్లపల్లి పాదునగర్, నిజామాబాద్, చీమలపల్లి గ్రామాలలోనూ, పోలీసు క్యాంపులున్నప్పటికీ, ఆ రోజున ఎర్రజెండాలు సగర్వంగా ఎగిరాయి. సిర్సిల్ల, వేములవాడలలో మరికొన్ని ముఖ్యమైన పట్టణాలలో ఎర్రజెండాలు ప్రతిష్టించబడ్డాయి. మొదటి ప్రపంచ యుద్ధానంతరం మల్యాల గ్రామంలో ఫిరంగిజండా కొండ అనే ఎత్తయిన కొండమీద బ్రిటిష్‌వాళ్ళు తమ యూనియన్‌జాక్‌ను ఎగురవేశారు. ఈ రోజున, అదేచోట ఎర్రజెండా ఎగురుతోంది! అంతటి పెద్ద ఎత్తున, ఈ జెండా ప్రతిష్ఠాపనలు జరగటాన్నిబట్టి, ప్రజావెల్లువయొక్కవిస్తృతి, నిర్మాణబలం ఎంతగా వున్నదీ విదితం కాగలదు. అధికారులకు పోలీసులకు భూస్వాములకు విపరీతంగా గుండెలు జారిపోయాయి!

రాష్ట్ర కేంద్రానికి పంపిన నివేదికలో, ప్రజలలోని వివిధ వర్గాల వ్యాఖ్యలను ప్రజావెల్లువయొక్క ఫలితాలనుగూర్చిప్రాంతీయ కమిటీ, దిగువ విధంగా పేర్కొన్నది :

"భూస్వాములు : తాము కమ్యూనిస్టు 'అత్యాచారాలను' అంతం జేయగలమని పోలీసులిచ్చిన హామీలు, వారిలో విశ్వాసాన్ని కల్పించలేకపోయాయి. వారిలో అత్యధిక సంఖ్యాకులు ప్రస్తుతం నిరుత్సాహంతో నీరసించే వున్నారు. వ్యవసాయ కార్మికులు డిమాండ్‌జేసిన వేతనాల రేట్లను వారు అంగీకరిస్తున్నారు. భూమి పంపిణీ కార్యక్రమాన్ని తాము వ్యతిరేకించబోమని వారు హామీ యిస్తున్నారు.

"ధనిక రైతులు : తమ ప్రచారంద్వారా, కార్యకలాపాలద్వారా దళాలు సంబంధాలు పెట్టుకున్న గ్రామాలలో భూములు కొనుక్కోవాలన్న

ఆలోచననే వారు విరమించుకున్నారు. దళాల కార్యకలాపాలపట్లవారు తటస్థంగా వుంటున్నారు. పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించటం తప్ప తమకు మార్గాంతరం లేదనికూడా వారనుకుంటున్నారు. దళాలు యిప్పటికీ చేరని ఈ సందేశాన్నందజేయనిచోట్ల ధనిక రైతులు, చౌకధరలకు భూమిని స్వాహా చేయగలమన్న ఆశలనింకా వదులుకోలేదు. అలాంటిచోట్ల, దళాలు ధనిక రైతులనుండి తొలిదశలో వ్యతిరేకతను ఎదుర్కొన వలసివస్తున్నది. ఈచోట్లలో సయితం వారి బలంమాత్రం గణనీయంగా లేదు.

"మధ్యతరగతి రైతులు గతంలో తాము గురవుతున్న పీడన నుండి విముక్తి లభించిందని, తమ భూములను, ఇతర ఆస్తులను పీడకులు బలవంతాన గుంజుకుపోతారనే భయం తమకికలేదని మధ్యతరగతి రైతులు భావిస్తున్నారు. అందువల్ల వారు పార్టీపట్ల ప్రగాఢమైనసానుభూతిని ప్రదర్శిస్తున్నారు.

"పేద రైతులు పోరాట ప్రాంతాలలో, భూస్వాములు, గతంలో తామనుసరిస్తూ వచ్చిన నిరంకుశ దృక్పధాన్ని మార్చుకున్నారు. గనుక, కౌలు భూముల విషయంలో వారికి స్వేచ్ఛ లభించింది. భూస్వాములకు, అణగారిపోయే కౌళ్ళు చెల్లించటానికి వారు నిరాకరిస్తున్నారు. భూస్వాములు, తమనుండి అక్రమంగా గుంజుకున్న భూములను తిరిగి ఆక్రమించుకొనటానికి వారు ముందుకొస్తున్నారు. పోరాట ప్రాంతాలలో వారు కౌలు భూములకు అంటిపెట్టుకొని వుండటమేగాక పోరంబోక, బంజరు భూములను కూడా సాగుజేసుకుంటున్నారు పార్టీతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవాలని వారు కోరుతున్నారు. పార్టీనాయకత్వాన పోరాడటానికి సంసిద్ధంగావున్నారు.

"వ్యవసాయ కార్మికులు పెద్ద భూస్వాములు, తదితర పీడకులు గ్రామాలనుండి పారిపోయినందున, భూస్వాముల భూముల్లో పనిచేస్తూ వుండే వ్యవసాయ కార్మికులకు పూర్తి స్వేచ్ఛ లభించింది అలాంటి భూస్వాములకు జెందిన పొలాలు, పశువులు మొదలైనవన్నీ వ్యవసాయ కార్మికుల అధీనంలోనే వున్నాయి. చాలామంది భూస్వాములు, పట్టణాలకు పారిపోయేముందు, తమ వస్తువులను, తమకు ఎంతో విశ్వాసపాత్రులనుకొన్న పాలేర్ల యిండ్లలో దాచిపెట్టారు. ఇప్పుడు ఆ వస్తువులన్నీ ఆ పాలేర్ల అధీనంలో వున్నాయి. గతంలో వ్యవసాయ కార్మికులకు వేతనాలను ఏనాడూ సకాలంలో పూర్తిగా చెల్లించని భూస్వాములు, యిప్పుడు మూడు నాలుగు మాసాలు ముందుగా కూడా చెల్లిస్తున్నారు. భూస్వాముల భూముల్లో పండించబడుతున్న పెసర మొదలగు రెండవ పంటను వ్యవసాయ కార్మికులు స్వేచ్ఛగా అనుభవిస్తున్నారు.

పార్టీ యిప్పటికే వ్యవసాయ కార్మికులకు ప్రత్యేక కమిటీలను ఏర్పాటుజేయ లేకపోయింది. ఇప్పుడు పార్టీ వ్యవసాయ కార్మికులను సంఘటితపరచటంపై ప్రత్యేక శ్రద్ధ వహించబోతున్నది

"ఆ విధంగా ప్రజావెల్లువ, కొలదిమంది మినహా రైతులందరినీ ఆవరించింది. భూస్వాములు, తదితర పీడకుల భూములు, పంటలు, ఈ చర్యల అనంతరం ఈనాడు ప్రజల అధీనంలో వున్నాయి

"పోలీసు దాడులు జరిగినప్పుడు ప్రజలు తాత్కాలికంగా భయోత్పాతానికి లోనైనప్పటికీ, కొలదిచోట్ల మినహా పోరాట ప్రాంతాలలో ప్రభుత్వ పన్నులు సయితం వసూలవటంలేదు. వుద్యమం విస్తరించని ఇతరచోట్ల, పోలీసుల సహాయంతో పన్నులు వసూలు చేయబడుతున్నాయి.

"భూస్వాముల భూములను పంపిణీ జేయించాలని ప్రజలుప్రగాఢంగా వాంఛిస్తున్నారు. అయితే, వారు అన్ని కష్టనష్టాలకు సంసిద్ధంగా వున్నారని గాని, వారిలో ఎలాంటి వూగిసలాటలు లేవనిగాని కాదు

"పేదరైతులు, వ్యవసాయ కార్మికులు చేసిన పాత అప్పులన్నీ రద్దు చేయబడినాయి. తాకట్టు పెట్టబడిన వస్తువులు, వాటి వాటి స్వంతదారులకు తిరిగి యిచ్చివేయబడ్డాయి. తాకట్టు పెట్టబడిన భూములుకూడా తాకట్టునుండి విడుదలజేసి, వాటి వాటి స్వంతదారులకు వొప్పగించబడ్డాయి.

"ఫారెస్టు ప్రాంతాలలో, కట్టెలుకొట్టడంలో ప్రభుత్వం కొత్తగా ప్రవేశపెట్టిన సహకార పద్ధతి పనిజేయటంలేదు. ప్రజలను బీభత్సపరచి లంచాలు గుంజుతుండే చౌకీదార్లు, ఫారెస్టు గార్డులు, ఫారెస్టులనుండి తరిమివేయబడ్డారు దళాలు హెచ్చరిక జేసిన తర్వాతగూడా, యింకా తమ పాత దురంతాలను సాగిస్తున్న సందర్భంలో, వారిపట్ల కఠినంగా వ్యవహరించడం జరిగింది. అలాంటి నర్సింగపురం చౌకీదారును కాల్చి చంపారు ఎన్నాజీపేట చౌకీదారును తీవ్రంగా కొట్టారు దానితో, కొలదిమంది మినహా, ప్రతిచోటా చౌకీదార్లు భయకంపితులైపోయారు. పోలీసులతో తమ సంబంధాలను తెగదెంపులు జేసుకున్నారు. తమ ప్రజా వ్యతిరేక చర్యలను కొనసాగించటానికి సాహసించటంలేదు.

ఫారెస్టులలో పశుగ్రాసాన్ని వేలంవేసే పద్ధతికూడా నిలిపివేయబడింది. ఇప్పుడు ప్రజలు తమ పశువులను ఫారెస్టులలో వుచితంగా మేపుకుంటున్నారు. ఇప్పపువ్వు, తేనె, తునికి ఆకు మొదలైన అటవీ సంపదను, అడవులలో వుండే ప్రజలు స్వేచ్ఛగా అనుభవిస్తున్నారు.

'ఇటీవలిమాసాలలో, కరీంనగర్‌జిల్లాలో, గెరిల్లాదళాలనాయకత్వాన ప్రజలుసాగించిన సమరశీలచర్యలకు, వ్యవసాయిక వెల్లువకూలభించినఫలితాలివి."

## అదిలాబాద్ జిల్లాలోకి ఉద్యమ విస్తరణ

అదిలాబాద్‌జిల్లా తెలంగాణా ఉత్తరపుకొసన గోదావరినదికి ఉత్తరాన వుంది అది కొండలతో, దట్టమైన అడవులతో నిండివుంది. దక్షిణాన గోదావరి నదీతీరాన, ఉత్తరాన గోదావరి ఉపనదియగు పెన్‌గంగతీరాన మైదానాలున్నాయి. ఈజిల్లా గోదావరి, పెన్‌గంగనదుల మధ్యలోవుంది. కొండలు, అడవులతోగూడిన ప్రాంతంలో గోండుప్రజలు, కొలములు, నాయక్‌పోడు ప్రజలు నివస్తున్నారు మైదానప్రాంతాలలో పెద్ద భూస్వాములు ఆధిక్యతలో వున్నారు. అందుకు వుదాహరణ: నర్సపూర్ సంస్థానం రాజాకు యాభైవేల నుండి లక్ష ఎకరాలవరకు, ఇరవై గ్రామాలకు వతన్‌దారగు మందమర్రి మాధవరావుకు పదివేల ఎకరాలు, పుసులూరి కుటుంబానికి పదినుండి ఇరవైవేల ఎకరాలు భూమివుంది. ఇంకా యితర వెలమ, రెడ్డి భూస్వాములూ వున్నారు వారే ఆ తర్వాత కాంగ్రెస్ నాయకులుగాకూడా పెత్తనం చేపట్టారు.

తెలంగాణా ఉద్యమం ఈ జిల్లాలోకి వ్యాపించకుండాను, మెదక్, నిజామాబాద్, కరీంనగర్‌జిల్లాలతోగూడిన తెలంగాణా ఉత్తరప్రాంతమంతటికీ అభేద్యమైన పర్వత, అటవీస్థావరంగా తయారవకుండా అరికట్టేందుకు యూనియన్ ప్రభుత్వం అన్ని జాగ్రత్తలూ తీసుకుంది. గోదావరితీరానగల ఈ జిల్లా తూర్పుభాగం వరంగల్, నల్గొండ జిల్లాలలోని పాత పోరాట ప్రాంతాలలో అవిచ్ఛిన్నమైన, దట్టమైన అడవిద్వారా సంబంధం కలుపుతుంది. గోదావరినది పొడవునా ఫెర్రీబోట్లన్నింటిపైనా యూనియన్ ప్రభుత్వం కట్టుదిట్టమైన నిఘా ఏర్పాటుజేసింది. కీలకమైన గ్రామాలన్నింటిలోనూ హోంగార్డు దళాల నేర్పరచటానికి శాయశక్తులా ప్రయత్నించింది. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా విస్తారమైన దుష్ప్రచారం సాగించింది.

అయినా వరంగల్‌జిల్లాలో పనిజేస్తున్న గెరిల్లాదళాలు, కరీంనగర్ జిల్లా తూర్పుకొసనున్న మంథెన తాలూకాకు వ్యాపించాయి. గోదావరినదిని దాటి అదిలాబాద్‌జిల్లాలో ప్రవేశించాయి. ఉద్యమాన్ని చెన్నూరు తాలూకాకు వ్యాప్తిజేశాయి. బెల్లంపల్లి బొగ్గుగనులప్రాంతంలోనూ, సిరిపూర్‌కు యింకా ఉత్తరంగానూ ఉద్యమాన్ని కలిపాయి. పాతఉద్యమప్రాంతాలపై అంతకంతకూ

ధికమవుతున్న పోలీసు, మిలటరీ దాడులనుండి రక్షణ పొందటానికి, మరింత విస్తారమైన ప్రాంతంలో సంచారసౌలభ్యంకోసమూ వారావిధంగా ఉద్యమాన్ని విస్తరించారు. అదేవిధంగా కరీంనగర్ గెరిల్లా దళాలు, పశ్చిమాన నిజామాబాద్‌కు వ్యాపించి ఆదిలాబాద్ జిల్లాలో దట్టమైన ఫారెస్టు స్థావరాన్నేర్పరచుకొనటంకోసం గోదావరినదిని దాటాయి.

ఈ పరిస్థితులలో, బెల్లంపల్లి కార్యకర్తల తోడ్పాటుతో 1950 అక్టోబరులో, దళం, రాంపురం గ్రామంపై దాడిజేసింది. ప్రజల విద్వేషానికి గురైన పట్వారీని అంతంజేసింది గ్రామ రికార్డును ధ్వంసం చేసింది. ఎర్రజెండా నెగురవేసింది. ప్రజలకు ఆహార ధాన్యంపంపిణీజేసింది అయితే, అనుభవం కొరవడినందున, తగిన జాగ్రత్తలు తీసుకోనందువల్లనూ ఆ తర్వాత పన్నెండు మంది మిలిటెంట్లు అరెస్టు చేయబడ్డారు.

1951 జనవరి ప్రారంభంలో కరీంనగర్ పశ్చిమ భాగాలనుండి వెళ్ళిన దళాలు, ఆదిలాబాద్ జిల్లాలోని నాలుగు దక్షిణ ప్రాంత తాలూకాలలోని 55 గ్రామాలలో జైత్రయాత్రలు, విజయయాత్రలు, ప్రచార యాత్రలు నిర్వహించాయి వారు ఎర్రజెండాలు ప్రతిష్ఠించారు. గ్రామాధికారుల రికార్డులను ధ్వంసం జేశారు పై అధికారులకు ఎలాంటి సమాచారమూ పంపరాదని హెచ్చరించారు.

దస్తూరాబాద్, ఎల్లాపురం గ్రామాలలో ప్రభుత్వ గిడ్డంగులనుండీ, భూస్వాముల ఇండ్లనుండీ వందబస్తాల మేరకు ధాన్యం స్వాధీనం జేసుకున్నారు. ఆ గ్రామాలకు పొరుగునేవున్న కుగ్రామాలకు జెందిన ఐదువందలమంది ప్రజలకు వాటిని పంచిపెట్టారు.

మసాయిపేటలో పెద్ద భూస్వామి నరసింహారెడ్డి గ్రామంనుండి పారిపోయాడు. అతని గిడ్డంగినుండి యాభై బస్తాల ధాన్యం తీసి ప్రజలకు పంచారు. అతని కుమారుడు దళం విధించిన షరతుల కంగీకరించాడు. ప్రజలతో విరోధం లేకుండా జీవించదలచాడు దళం అతని కెలాంటి హాని చేయలేదు. ప్రజలను పీడించుతూ, ప్రజల ద్వేషానికి గురియయిన తండ్రికి, ప్రజలతో స్నేహంగా వుండదలచిన కొడుకుకూ మధ్య గెరిల్లాలు చూపిన విచక్షణను ప్రజలు హర్షించారు. ఆ తర్వాత నరసింహారెడ్డి పోలీసులను తీసుకొచ్చాడు ప్రజలను కొట్టించాడు. పదిమందిని అరెస్టు చేయించాడు. తన ధాన్యాన్ని తిరిగి స్వాధీనం చేసుకొనటానికి చాలా యిండ్లపై దాడులు చేయించాడు. అయినా అందులో కొంత భాగమైనా తిరిగి అతని చేతికి రాలేదు. తన తండ్రి చేయించిన ఈ చర్యలన్నింటినీ అతని కొడుకువ్యతిరేకించాడు. తనకు చేతనయినంతమేరకు ప్రజలుసహాయ

పడ్డాడు. మరో రెండు గ్రామాలలోకూడా పోలీసులు పెద్ద ఎత్తున ప్రజలపై దాడి చేశారు. 35 మందిని అరెస్టు చేశారు. అయినా పంపిణీ చేయబడిన ధాన్యంలో స్వల్పభాగాన్ని మాత్రమే తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు.

అంతకుపూర్వం, కొలది సంవత్సరాలక్రితం గోండులు తిరుగుబాటు జేశారు ప్రభుత్వం, వారిని పాశవికంగా అణచివేసింది. వాళ్ళను బుజ్జగించటం కోసం, వారిలో కొంతమందికి బంజరుభూములిచ్చింది గిరిజనులలోనే కొందరిని వశేళ్ళుగా, పట్వారీలుగా నియమించింది అందువల్ల దళాలు మొదట్లో గ్రామ రికార్డులనుతగులబెట్టనూలేదు. తమఉద్యోగాలకు రాజీనామా యివ్వవలసిందిగా గ్రామాధికారులపైఒత్తిడి చేయనూలేదు కనీసంఎర్రజెండానైనాప్రతిష్ఠించలేదు. రాజకీయప్రబోధంపైనే తమ కృషినంతా కేంద్రీకరించాయి ప్రభుత్వ తప్పుడు ప్రచారంవల్ల, కమ్యూనిస్టులంటే ఏర్పడిన భయాలను తొలగించటానికి ప్రయత్నించాయి. దళాలు క్రమక్రమంగా గిరిజన ప్రజల విశ్వాసాన్ని చూర గొన్నాయి ఫారెస్టులోని కొన్ని ప్రాంతాలలో చెట్లుకొట్టివేసి వాటిని సాగు లోకి తీసుకు రావటానికి, భూస్వాముల అక్రమ ఆక్రమణల గల భూములను స్వాధీనం చేసుకొనటానికి, అక్రమ నిర్బంధవసూళ్ళకు వ్యతిరేకంగా అధిక కౌళ్ళకు, విపరీతమైన వడ్డీరేట్లకు వ్యతిరేకంగా అటవీసంపద విషయంలో అనేక యిబ్బందులకు వ్యతిరేకంగా సమీకృతమవవలసిన ఆవశ్యకతనుగూర్చి అర్థనైజర్లూ, గెరిల్లాలూ నొక్కిచెబుతున్నారు.

కమ్యూనిస్టులు ప్రజల గొంతులుకోస్తారని ఈ జిల్లాలో భూస్వాములు ప్రచారం సాగించారు. కొలదిమాసాలక్రితం కరీంనగర్‌జిల్లా, జగిత్యాల తాలూకాలో పొరపాటున జరిగిన ఒక చర్యను ఈ సందర్భంగా వుదహరించారు. అందులో చంపబడిన ఏడుగురిలో ముగ్గురు భూస్వాములు, నలుగురుసామాన్య ప్రజలు ఈ జిల్లాలో దళాలు ఈ దుష్ప్రచారాన్నెదుర్కొనవలసి వచ్చింది తప్పుడు రిపోర్టులనాధారం చేసుకుని అందులోని నిజానిజాలు తెలుసుకో కుండానే, ప్రజల డిమాండ్లపై ప్రచారం సాగించకుండానే, గ్రామప్రజలతో తగిన సంబంధాలేర్పరచుకోకుండానే, ప్రజలను సమీకరించకుండానే, దళం చర్యగైకొన్నది. అందువల్ల దళం తాలూకానుండి దూరంగా వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ సంఘటనయొక్క విషమపరిణామాలు ఆ జిల్లాలోనేగాక, కొన్ని నెలల కాలం గడిచిపోయిన తర్వాత కూడా, ఆదిలాబాద్ జిల్లాలోకూడా కని పించాయి. తాము పెద్ద భూస్వాములకు మాత్రమే వ్యతిరేకమనే విషయాన్ని నచ్చజెప్పటానికి దళాలు అదేపనిగా కృషిచేయవలసి వచ్చింది. ధనికరైతులను, వ్యాపారస్థులను యితర వర్గాలను, ప్రజలపై క్రూర చర్యలకు పాల్పడని భూస్వామ్య కుటుంబాలకు చెందిన వ్యక్తులకు సయితం గెరిల్లాలు ఎలాంటి హాని

కలుగజేయరని స్పష్టం జేయవలసివచ్చింది. ఈ విధంగా ఓర్మితో వివరించి చెప్పటంవల్లను, మాసాయిపేట భూస్వామి కొడుకు తన తండ్రిచేస్తున్న ప్రజా వ్యతిరేక చర్యలకు వ్యతిరేకంగా వున్నందున ఆయనతో దళం ఒక ఒప్పందానికి రావటం కారణంగాను, తుదకు ఈ వర్గాల ప్రజలలో మార్పువచ్చింది. వారి భయ, సందేహాలు తొలగి పోవటానికి ఆస్కారం ఏర్పడింది. ప్రజలతో కలసి మెలసి జీవించటానికి, దళాలతో సహకరించటాని వారు ముందుకొచ్చారు.

ఫారెస్టు ప్రాంతాలలో. రెండు తాలూకాల సరిహద్దునవున్న కీలక గ్రామమైన బుర్సాయిపేటలో మూడు బంగళాలను గెరిల్లా దళాలు ధ్వంసం చేశాయి. అవి పోలీసులు మకాం వేయటానికి మంచి కేంద్రంగా వుపయోగ పడుతుండేవి. మరొక సందర్భంలో, కడంకాలువ ప్రాజెక్టు ప్రాంతంలో, లక్కిసెట్టిపేటలో, తాళ్ళపేట సమీపంలో తమపై ముట్టడి జేయవచ్చిన పోలీసుబృందంపై దళం కాల్పులు జరిపి, ఇద్దరు పోలీసులను తీవ్రంగా గాయ పరచింది.

ఈ చర్యలు సయితం, ఒకటి రెండు నెలల లోపునే ఆ ప్రాంత మంతటినీ కదిలించాయి. పోలీసు జులుంపట్ల ప్రజలు ఆగ్రహంజెందారు. వారిని తిట్టిపోశారు. ఆ జులుముకు భయపడలేదు. "ఇప్పటికి జరిగిందేమీ ఎక్కువ కాదు జరగవలసింది ముందే వుంది. ఈ బద్మాష్ భూస్వాములను శిక్షించాలి. రామాజపేట ప్రజలు, తమను పీడించేవారిని చంపినట్లుగానే, మమ్ములను పీడించేవాళ్ళను అంతం చేయాలని మేమూ కోరుతున్నాం. మాకు మార్గం చూపటానికి, ఒక్క దళ సభ్యుడు మాప్రక్కనవుంటేచాలు, మిగతా పనంతా మేమే చేస్తాం. మన దళాలు మరల రావాలి ఈ భూస్వాముల బంగళాలను ధ్వంసం చేయాలి కొలది రోజులక్రితం, ఒక్కసారి మాత్రమే వారొచ్చారు" అని వారు అన్నారు. రాత్రి కాపలాకాయించటానికి పోలీసులు ప్రయత్నించగా, ప్రజలు వారిని తిట్టారు. అనేకచోట్ల అందుకు నిరాకరించారు "మేము ఈబంది పోట్ల యిండ్లను కాపాడాలా? మేము చచ్చినాసరే, ఆ పనిచేయం". పెంబి, మందపల్లి దొంగగూడెం నాయికపొడు గ్రామాల ప్రజలను చిత్తంవచ్చినట్లు కొట్టారు. అయినా, వారు, దళాల జాడనుగూర్చి ఎలాంటి సమాచారమూ తెలుపలేదు

గెరిల్లాలచే ప్రచార కార్యక్రమం, ధాన్యం పంపిణీ, గ్రామ రికార్డులు తగులబెట్టటం ప్రారంభమవటంతో భూస్వాములు మూటాముల్లె సర్దుకుని పట్ట ణాలకు చేరుకున్నారు. ఇది చూచి, ప్రజలు వుత్తేజం పొందారు. ఒక హరిజన కార్మికుడు, ఏదో వూరికివెళ్తూ, మార్గమధ్యంలో ఎర్రజెండా రెపరెపలాడు తుండటం చూచాడు. "మా పార్టీ వచ్చింది మా కష్టాలన్నీ తీరైక్కే

రోజొచ్చింది. నా కన్నీటి గాథలన్నింటినీ పార్టీకి వివరంగా చెప్పుకుంటాను. పార్టీ, నా గ్రామాని కెప్పుడొస్తుంది ?" అని సంతోషంతో అన్నాడు. "ఈ ప్రాంతాలలోకి, పార్టీ ప్రవేశంతో దొరలు గతంలో సాగిస్తూవుండిన నిర్బంధ వసూళ్లు, పీడనలు అంతమయినాయి. వాళ్ళంతా మీరంటే చచ్చేట్లుగా భయపడుతున్నారు. నా గ్రామానికి రండి. మీకు కొండలలో సురక్షితమైన మంచి ఆశ్రయాలను, నీటి వూటలను చూపిస్తా" అని ఒక గొడ్లకాపరి, మన కామ్రేడ్సుతో చెప్పాడు.

ఎవరు గెలుస్తారు ? రాత్రి వచ్చిందెవరు ? పగలు వచ్చిందెవరు ? అనే విషయాలపై వుద్రిక్తమైన చర్చలు సాగుతుండేవి. రాత్రి వచ్చిన, కమ్యూనిస్టులే అంతిమ విజయం సాధిస్తారని ప్రజలు నిర్ధారణ కొచ్చారు. వారు ఈసరికే పెద్ద రాజ్యం సాదించారు. అంటుండేవారు. పోలీసు అధికారులు ఎలా భయంతో వణికిపోతున్నదీ, కమ్యూనిస్టు లొచ్చారు" అనే మాట విన గానే వాళ్ళ చేతుల్లో తుపాకులెలా వణకిపోనారంభించిందీ, పేర్కొంటూ, వాళ్ళ పిరికితనాన్ని గేలిజేస్తూ ప్రజలు కథలు చెప్పుకుంటూ వుండేవారు

మన దళాలు వెళ్ళి గ్రామాలలో కొంతమేరకు క్రమబద్ధమైన సంబంధా లేర్పరచుకొనగానే ప్రజలు తమ సాంఘిక కుటుంబ సమస్యలతోసహా తమ సమస్యలన్నింటి పరిష్కారానికి దళాలవద్దకు రాజొచ్చారు. ప్రచారోద్యమ సందర్భంగా మనదళాలు కొత్తగ్రామాలకు వెళ్ళినప్పుడు, తిండికోసం ప్రజలను కలుసుకున్నప్పుడు "వారు రొట్టెగాని, పులిసిన జొన్నగంజిగాని మేము తినేదే మీకూ సంతోషంగా పెడతాం మీరు మాకోసం పోరాడుతున్నారు. మాకు వున్నదేదో పెట్టి పోషిస్తాం" అని వారనేవారు.

ఆ విధంగా తరతరాల పీడననుండి మేల్కొంచిన ప్రజల విజృంభణ ఈ జిల్లాలోనూ, ఆ సంవత్సరాలలో వుద్యమం విస్తరించిన నూతన ప్రాంతా లన్నింటిలోనూ వ్యక్తమయింది.

అయితే ప్రభుత్వం కొత్తపోలీసు, మిలటరీ క్యాంపులనేర్పాటుజేసి, మరింత ఎక్కువ బలగాలను కేంద్రీకరించ నారంభించింది. మరింత పెద్దఎత్తున గాలింపు చర్యలకు, దాడులకు వూనుకుంది.

కొలది మాసాలలోపునే 1951 అక్టోబరులో తెలంగాణా ఉద్యమం వుపసంహరించ బడింది.

# అధ్యాయం 7

# నగరాల్లో, కార్మికుల్లో

## ఉద్యమ పరిస్థితి

పట్టణాలలో కార్మిక వర్గంలోను, మధ్యతరగతి వర్గాలలోనూ మన ఉధ్యమం బలహీనంగా వున్నదనే విషయం మనం యీవరకే చూచాం. అయినా వాటిపై, తెలంగాణా వుద్యమంయొక్క ప్రభావం ఎంత గొప్పగా వుందంటే ఉద్యమంపట్ల మొత్తంమీద అభిమానం సంపూర్ణంగా వుండేది. నగరాలలో ప్రత్యేకించి హైదరాబాదు, వరంగల్లులలో గనుల ప్రాంతాలలో మనకున్న కార్యకర్తలకు, మనకున్న సంబంధాలకు ఎనలేని ప్రాధాన్యతవుంది. వారు వివిధ రూపాలలో తెలంగాణా గెరిల్లావుద్యమానికి తోడ్పడ్డారు. పట్టణాల్లోగల ఈ సంబంధాలమూలంగానే, కార్యకర్తలద్వారాపార్టీ కొంత మేరకయినా వ్రాసుకునే కాగితాలను డూప్లికేటింగ్ పేపరును, మందులు తదితర అవసర వస్తువులనూ కొనుగోలుజేసి గెరిల్లాదళాలకు సరఫరా చేయగలిగింది. చాలా పరిమితమైనమేరకు గుప్తమైన ఆయుధాలను, మందుగుండు సామగ్రిని కొనుగోలుజేసి గెరిల్లాలకు సరఫరాజేయడంకూడా ఈ విధంగానే సాధ్యమైంది. అయితే అనేకసార్లు మనం మోసగించబడ్డాం. అందువల్ల ఎంతగానో నష్టపోవలసివచ్చింది

పోరాట ప్రాంతాలలో దళాలతో సంబంధాలు పెట్టుకొనటానికిగాను, నగరంలో పరిమిత సంఖ్యలో రహస్యంగా తలదాచుకునే స్థలాలు,

యతరులతో, సంబంధాలు పెట్టుకునే కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. అయితే పదే పదే వరుసగా దాడులు జరగడంతో, దుర్భరమైన హింసలకు గురిజేసిన మీదట, అనేక కేంద్రాలు బయటపడిపోయినాయి రహస్య కేంద్రాలను నిర్వహించే కార్యకర్త లనేకమంది అరెస్టు చేయబడ్డారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు హింసలకు గురిజేయబడ్డారు. కాల్చిచంపివేయబడ్డారు అంతటి చిత్రహింసలకు గురిజేయబడినప్పటికీ తొణకకుండా నిలిచిన వారందరికీ జేజేలు చెప్పవలసి వుంది. చాలామంది రోజుల తరబడి ప్రతిఘటించారు అందువల్ల అరెస్టు చేయబడిన వ్యక్తులకు తెలిసివున్న సంబంధాలన్నింటిని నిలుపుజేసి, సురక్షితమైన కొత్త చోట్లకు మారటానికి పార్టీ యంత్రాంగానికి అవకాశ మేర్పడింది. ఒకసారి ఒక కామ్రేడ్ అరెస్టు చేయబడ్డాడంటే, ఆతడు ఎన్నో కొన్ని రహస్యాలు బయటపెడతాడనే అనుకోవాలనేది సాధారణ సూత్రంగా పరిగణించ బడింది. అరెస్టు చేయబడిన ప్రతి వ్యక్తికి తెలిసియున్న ప్రతి సంబంధాన్నీ తెగదెంపులు జేయటం, అలాంటి ప్రతిచోటునూ వదిలేయటం అనే పద్ధతిని అనుసరించటంద్వారా ప్రమాదాలకు గురిగాకుండా నివారించబూనుకున్నాం. ఆ విధంగా పార్టీ యంత్రాంగం పెద్ద వినాశకర ప్రమాదాన్నుండి తన్ను తాను కాపాడుకొంది.

ఆంధ్రప్రాంతంలో పట్టణాలు చిన్నవి అందువల్ల, గత మూడునుండి ఆరు మాసాలకాలంలో అద్దెకివ్వబడిన ప్రతి యింటిపైనా పోలీసులు ఒక కన్ను వేసి వుంచగలిగారు. రహస్య కేంద్రాలను, అజ్ఞాత కార్యకర్తలుండే స్థలాలను పట్టుకొనగలిగారు వారిని అరెస్టుచేసి, కాల్చి చంపారు. అందువల్ల 1950 వ సంవత్సరం మధ్యభాగానికల్లా పాత కార్యకర్తలందరూ, దాదాపుగా జిల్లా ముఖ్యపట్టణాలన్నింటినీ వదిలేసి, యితర రాష్ట్రాలలో ఎక్కడోవున్న నగరాలలోనో, ఫారెస్టు ప్రాంతాలలోనో మాత్రమే రక్షణ పొందవలసివచ్చింది!

ఇక కార్మికవర్గం, మధ్యతరగతి వర్గాల వుద్యమానికి, పోరాటానికి సంబంధించి, ఆనాటి రికార్డులలో కనిపించిన స్వల్పమైన వివరాలను దిగువ పేర్కొంటాం :

## రాజప్రముఖ్‌గా నైజాం నియామకానికి వ్యతిరేకంగా విద్యార్థుల ప్రదర్శన

ప్రజలంతా ద్వేషించే నైజాం నవాబుకు నెహ్రూ ప్రభుత్వం, 1950 జనవరి 26వ తేదీన రాజప్రముఖ్ పదవిని కట్టబెట్టింది నైజాం పాలనను, అంతంజేయటంకోసం పట్టువిడుపులు లేకుండా పోరాటం సాగించిన

ప్రజలు, ఆతని హెూదాను అవిధంగా పెంచటాన్ని సహించలేకపోయారు. అనేకచోట్ల విద్యార్థులు సమ్మెజేశారు. నల్లజెండాలతో నిరసన ప్రదర్శనలు జరిపారు. ఒకటి రెండుచోట్ల, విద్యార్థి ప్రదర్శకులకూ, కాంగ్రెసు పోలీసులకూ మధ్య ఘర్షణలు కూడా జరిగాయి. ఇతర వర్గాలప్రజలు పోలీసు అత్యాచారాలను చాలా తీవ్రంగా ఖండించారు తమ నిరసనను ప్రదర్శించారు. అలాంటి కొలది ప్రదర్శనల వివరాలను దిగువనిస్తున్నాం,

వరంగల్‌లో రెండు వేలమంది విద్యార్థులు వీధుల్లోకొచ్చి నల్లజెండాలతో ప్రదర్శనజరిపారు వాళ్ళనుఆపటానికి పోలీసులు ప్రయత్నించారు. కాని, విద్యార్థులు ధైర్యంగా పోలీసు వలయాన్ని ఛేధించారు. కాంగ్రెసు పోలీసుల చేతుల్లో లాఠీదెబ్బలు తిన్నారు. ప్రజలందుకు నిరసన తెలుపగా, ప్రజలపైన కూడా లాఠీలు ప్రయోగించబడ్డాయి విద్యార్థి నాయకులను అరెస్టుజేసి, దూరానవున్న అడవిప్రాంతాల్లో వదిలేసివచ్చారు.

## కాంగ్రెస్ పోలీసులతో
## కరీంనగర్ విద్యార్థుల పోరాటం

జనవరి 26 వ తేదీన కరీంనగర్‌లో మూడు వందలమంది విద్యార్థులు సమ్మెజేశారు ప్రదర్శన జరిపారు విద్యార్థి ప్రదర్శకులపై పోలీసులు లాఠీచార్జి చేశారు.

లాంఛనప్రాయంగా తమ నిరసనను వ్యక్తజేయటంకోసం సోషలిస్టులు ఒక సభజరిపారు అనేకమంది విద్యార్థులు ఆ సభకు హాజరయ్యారు. సభ జరుగుతుండగా మలబార్ స్పెషల్‌పోలీసు కాన్‌స్టేబుల్ వొకడు విద్యార్థులను రెచ్చగొట్టాడు విద్యార్థులాతనికి తగువిధంగా బుద్ధిజెప్పారు. దీనితో ఆగ్రహంజెందిన పోలీసులు గాలిలోకి కాల్పులు జరిపారు. లాఠీచార్జిజేశారు. విద్యార్థులు రాళ్లు రప్పలతో పోలీసులను ధైర్యంగా ఎదుర్కొన్నారు. ఐదుగురు విద్యార్థి నాయకులను అరెస్టుజేసి, ఎక్కడికో తీసుకుపోయారు పోలీసులు, విద్యార్థుల కార్యాలయంపై దాడిచేశారు. పుస్తకాలను, ఫైళ్ళను తీసుకెళ్ళిపోయారు.

పట్టణ జనాభా యావత్తూ విద్యార్థులపై పోలీసుల లాఠీఛార్జిని, వారి కార్యాలయంపై దాడిజేయటాన్ని ఖండించారు. జనవరి 31 వరకూ విద్యార్థులు సమ్మెజేశారు. పట్టణ జనాభాయావత్తూ-వారిని బలపరిచారు

వరంగల్ విద్యార్థులపై పోలీసు లాఠీఛార్జికి వ్యతిరేకంగా హైదరాబాద్ నగర విద్యార్థులు జనవరి 31 వ తేదీన పోస్టర్ల ద్వారా, కరపత్రాల ద్వారా తమ నిరసనను వ్యక్తంజేశారు కాచిగూడా హైస్కూలు విద్యార్థులు

సమ్మెజేసి, ఊరేగింపు జరిపారు. ఆ ఊరేగింపు సుల్తాన్‌బజారుకు చేరగానే పోలీసులు అటకాయించారు. ఐదుగురు విద్యార్థి నాయకులను అరెస్టు చేశారు. కాని విద్యార్థులంతా సమైక్యంగా ప్రతిఘటించి తమ నాయకులను విడుదల చేయించుకున్నారు

వరంగల్ విద్యార్థులపై పోలీసులదాడికి నిరసనగా ఖమ్మం, భువన గిరి, నల్గొండ, సూర్యాపేట, జగిత్యాల, సుల్తానాబాద్, పెద్దపల్లి, పర్గాల విద్యార్థులు సమ్మెజేశారు, ప్రదర్శనలు జరిపారు.

**పోలీసు జులుమును అంతంజేయటానికి**

**హైదరాబాదు విద్యార్థుల ప్రతిన**

కుమరయ్య అనే విద్యార్థి కార్యకర్తను పోలీసులు నానా హింసలకు గురిజేశారు. కాల్చిచంపుతామని బెదిరించారు అయినా, తన తండ్రి పేరు, హోదా చెప్పటం మినహా ఒక్కమాటయినా చెప్ప నిరాకరించాడు. ఆయన లొంగిపో నిరాకరించాడు. ఆయనెందుకు కాల్చిచంపింది, ఆయన తలిదండ్రు లకు యిప్పటికీ తెలియదు. ఆయనను కమ్యూనిస్టని అనుమానించారని మాత్రమే వారు చెప్పగలరు మన విద్యార్థి కార్యకర్తల పేర్లు బహిరంగపరచే అలవాటు లేదు. వారు తమ పాఠశాలలకు, కళాశాలలకు హాజరవుతూనే వున్నారు ఈ కామ్రేడ్ అంతటి దృఢనిశ్చయం ప్రదర్శించి వుండకపోతే, మొత్తం విద్యార్థి రంగమంతా దెబ్బతినిపోయేది

ఫిబ్రవరి 28 వ తేదీన, హైదరాబాదులో విద్యార్థులు, కార్మికులు, తదితర పౌరులతో ఒక బహిరంగసభ జరిగింది. కమ్యూనిస్టు, సోషలిస్టు, యితర అభ్యుదయ భావాలుగల వారంతా ఆ సభలో ప్రసంగించి, కాంగ్రెస్ పోలిసు జులుమును నిశితంగా ఖండించారు కార్మికులను, కర్షకులను, విద్యార్థులను, యువజన కార్యకర్తలను, యితర రాజకీయ ఖైదీలందరినీ తక్షణమే విడుదల చేయవలసిందిగా వారు డిమాండ్ చేశారు.

హాస్టలు రుసుము, బస్‌ఛార్జీలు తగ్గించాలని కోరుతూ, స్త్రీల కళాశాల విద్యార్థుల డిమాండ్లను బలపరుస్తూ తీర్మానాలు చేయబడ్డాయి. సెలెక్షన్ పరీ క్షలలో డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా స్త్రీల కళాశాల విద్యార్థులు ఐదు వందలమంది అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్ నాయకత్వాన, మార్చి 7 నుండి 10 వరకు మూడురోజులు సమ్మెజేశారు. సమ్మెజేస్తున్న విద్యార్థి నులు, ప్రతిరోజూ కళాశాల ఆవరణలో సమావేశమయ్యేవారు. తమసమస్య

లను పరిష్కరించ వలసిందిగా కోరుతూను, కాలంతీరిపోయిన జమీందారీ – జాగీర్దారీ పాలనకు ,వ్యతిరేకంగాను, నిర్బంధాలకు వ్యతిరేకంగాను, ప్రసంగాలు చేయబడ్డాయి.

## కార్మికవర్గ పోరాటాలు

బెల్లంపల్లి 'పోలీసుచర్య' జరిగిన వెనువెంటనే, గని కార్మికులు, తదితర ప్రజలూ హిందూ, ముస్లిం బడావ్యాపారస్తుల యితర ప్రజాపీడకుల గడీలపై దాడిజేశారు. భారత సైన్యం కర్ఫ్యూ విధించింది ఎర్రజెండాలెగర వేయటాన్ని నిషేధించింది. కార్మికవర్గం నివసించేవాడలో, మిలటరీవాళ్ళు యిండ్లలో జొరబడ్డారు. హిందూ స్త్రీలనూ, ముస్లిం స్త్రీలనూ మానభంగాలు జేశారు. సెప్టెంబరు 25వ తేదీన తొమ్మిదివేలమంది కార్మికులు సమ్మె జేశారు. మేనేజిమెంటువద్దకు వూరేగింపుగా వెళ్ళారు సైన్యాన్ని వుపసంహరించాలని స్త్రీల మానభంగంజేసిన సైనిక పోలీసుసిబ్బందిని శిక్షించాలని డిమాండ్ చేశారు సైన్యాన్ని వుపసంహరించక తప్పలేదు. కానిపోలీసులు, హోంగార్డులు ఆమె అత్యాచారాలు సాగిస్తూనే వున్నారు అజ్ఞాతవాసంలోవున్న కమ్యూనిస్టు కార్యకర్తలు కొందరు అరెస్టు చేయబడ్డారు.

కొత్తగూడెం గని కార్మికులు నవంబరు చివరలో బోనసుకోసం సమ్మె చేశారు అదే మేనేజిమెంటు క్రిందగల బెల్లంపల్లి కార్మికులుకూడా వారి ననుసరించారు కొన్ని సౌకర్యాలు కల్పిస్తూ ప్రకటన వెలువడింది. అయినా, కార్మికులు సంతృప్తి జెందలేదు బోనసును సక్రమంగా అమలు జరపాలని, బియ్యం రేషను సరిపడేంత సరఫరా చేయాలని, పౌరహక్కులను పునరుద్ధరించాలని కోరుతూ 1949 మే నెలలో మరల సమ్మె జేశారు. ఈ సమ్మె సందర్భంగాకూడా మరికొందరు మిలిటెంట్లు అరెస్టు చేయబడ్డారు.

వరంగల్లు, నల్గొండ జిల్లాలలో గెరిల్లా చర్యల ప్రభావం పడినప్పటికీ వారి విజయాలనుగూర్చి విని వుత్సాహం పొందుతున్నప్పటికీ, పార్టీ పలుకుబడి, నిర్మాణమూ, కార్మికులను సంఘటితపరచి నాయకత్వం వహించటానికి తగినంతగా లేవు ఆర్థిక కోర్కెల సాధనకై కార్మికులు అనేక పోరాటాలు జరిపారు. వాటిలో ఎక్కువభాగం వాటంతటవే తలెత్తినవే.

ఈ పోరాటాలలోనూ, యితర పోరాటాలలోనూ కనిపించిన ప్రత్యేక లక్షణమేమిటంటే, ఒక ఫ్యాక్టరీ కార్మికులు, మరొక ఫ్యాక్టరీ కార్మికులకు అండగా నిలుస్తున్నారు. తెలంగాణా కామ్రేడ్సుకు వురిశిక్షలు విధించటానికి వ్యతిరేకంగాను, తెలంగాణా పోరాటాన్ని బలపస్తూనూ రాజకీయ సమ్మెలు

జరిపారు. పురిశిక్షలు రద్దుజేయాలని కోరుతూ, డిటెన్యూలపట్ల ప్రభుత్వ విధానాన్ని ఖండిస్తూ, కామ్రేడ్ గణపతి(మల్లయ్య)హత్యకు నిరసన తెలుపుతూ హైదరాబాదు నగరంలో రోడ్డు రవాణా కార్మికులు పెద్దసభ జరిపారు మే23న, ఒక గంటపాటు నిరసన సమ్మెచేశారు. మ్యునిసిపల్, పబ్లిక్‌వర్క్స్, ఆయిల్ మిల్ కార్మికులు కూడా ఆ రోజున సమ్మె జేశారు.

వివిధ పరిశ్రమలలో పెద్ద ఎత్తున రిట్రెంచిమెంటు జరుగుతోంది కోహినూర్ గ్లాస్ ఫ్యాక్టరీనుండి అప్పుడే అరువందలమంది కార్మికులు తొల గించి వేయబడ్డారు. పారిశ్రామిక ప్రాంతమంతటా అది సర్వసాధారణ దృశ్యమైపోయింది

కనీస వేతనాలు, బోనసు, కరువుభత్యం మొదలగు తమ డిమాండ్ల కోసం, వరంగల్లు అజాం జాహిమిల్లు కార్మికులు డిసెంబరు ఆఖరువారంనుండి, ప్రతిరోజూ పదినిముషాలపాటు పని నిలుపుదల సమ్మెచేస్తున్నారు.

వరంగల్లులోని అజాం జాహికార్మికుల నాయకుడు భూమయ్య అజ్ఞాతవాసంలో వున్నాడు 1950 ఫిబ్రవరి 25 వ తేదీరాత్రి ఆయన యింటిపై పోలీసులు దాడిజేశారు. ఆయన తలిదండ్రులను, సోదరుని, ఆయన భార్యనూ తీవ్రంగా కొట్టారు. ఈ విధంగా అనేకసార్లు జరిగింది.

సోషలిస్టుల నాయకత్వాన 22 మిల్లులలో సమ్మె జరుగుతోంది సోషలిస్టులు సయితం సమ్మెకు పిలుపివ్వక తప్పలేదంటే, కార్మికులలో అసంతృప్తి ఎంత తీవ్రంగా వున్నదీ విదితమవుతోంది.

పార్టీ పలుకుబడి క్రిందగల మునిసిపల్ కార్మికులు, పాత కొత్త జవుళిమిల్లుల కార్మికులుకూడా సమ్మెలో చేరారు.

## ప్రభుత్వోద్యోగులలో అసంతృప్తి

ముఖ్యమైన వున్నతాధికారులను, భారత యూనియన్‌నుండి తీసుకు రావటంతో, సాధారణంగా తమకు రావలసిన ప్రమోషన్లు రావటానికవకాశం లేకుండా పోవటంతో సంస్థానంలోని హిందూ అధికారి వర్గంలో అసంతృప్తి అలముకుంది ద్వంద్వపరిపాలనవద్దు – అనేదే వారి నినాదం దక్కన్‌క్రానికల్ వంటి దినపత్రికలూ, స్టేట్‌కాంగ్రెసూ ఈ నినాదాన్ని బలపరుస్తున్నాయి. అసమర్థులనే పేరుతో ముస్లిం అధికారులను రిట్రెంచిచేయటం, అదేసాకుతో హిందూ అధికారులకు ప్రమోషన్లు యివ్వకపోటం, కొన్ని సందర్భాలలో క్రింది వుద్యోగాలలోకి పంపటం, కొత్తఉద్యోగాలలో యూనియన్ అధికారు లను నియమించటం – ఇవన్నీ అగ్నికి ఆజ్యం పోస్తున్నాయి. పరిపాలనా

నిర్వహణను పటిష్ఠమొనరించటానికే యూనియన్ అధికారులను నియమించటం జరిగిందని లెక్కలేనన్ని ప్రకటనలు చేసినప్పటికీ, వారి నియామకం మరింత అసంతృప్తికి ఆస్కారమిచ్చింది యూనియన్ అధికారులు ఉన్నత పదవులలో తిష్ఠవేసి వేలాదిరూపాయలు జీతంతీసుకుంటూ సంస్థానంలోని అధికారివర్గంలో అసంతృప్తి కలుగజేశారు. ఈ వైరుధ్యం సంస్థాన పరిపాలనా యంత్రాంగాన్ని పట్టిపీడిస్తోంది. వారు ఒకరినొకరు తిట్టుకోవటం, తెలంగాణా వుద్యమాన్ని అణచివేయటంలో వైఫల్యానికి మీరు కారణమంటే, మీరు కారణమను కుంటూ వుండటమే ఇందుకు నిదర్శనం

## ఆహార సమస్య

లెవీ సేకరణ విషయంలో భూస్వాముల నుండి కూడా విమర్శ వచ్చింది. తత్ఫలితంగా ఆ వర్గంకూడా సహాయనిరాకరణ జరిపింది. [గోల్కొండ పత్రిక నిండా అలాంటి వార్తలే ప్రచురించబడ్డాయి] పేదవర్గాలనుండి నిర్బంధంగా, బలప్రయోగంతో లెవీ సేకరణ జరుపబడుతోంది ఇవన్నీ లెవీ సేకరణ విఫలమవటానికి దారితీశాయి తత్ఫలితంగా నగరంలోను, ఇతర పట్టణాల లోనూ ఆహారధాన్యాల ధరలు పెరిగిపోయాయి. రూపాయికి మూడున్నరశేర్ల నుండి, రూపాయికి రెండున్నర శేర్లకు ధర పెరిగింది కొన్నివారాలవరకు జొన్నలు రేషన్ లభ్యమేకాలేదు ఆహార సమస్య మరాఠ్వాడాలో మరింత అధ్వాన్నంగా తయారైంది.

సైనికపాలన, నిర్బంధకాండను ఉధృతంజేసింది. ఫాసిస్టు దురంతాలకు పాల్పడింది. అయినా, ఎలాంటి ఫలితాలు సాధించలేకపోయింది. అందువల్ల కొత్త కుతంత్రాలు ప్రారంభమైనాయి. మేజర్ జనరల్ చౌధురి మిలటరీ ప్రభుత్వంస్థానే, కేంద్రప్రభుత్వంలో స్టేట్స్ డిపార్టుమెంటు కార్యదర్శి యం. కె. వెల్లోడి అధిపతిగా పౌరపాలన ఏర్పాటుజేయబడింది.

"వ్యక్తులు మారారేగాని, ప్రభుత్వం మారలేదు" అని జనరల్ చౌధురియే స్వయంగా పేర్కొన్నాడు. "సంస్థానంలో ప్రభుత్వాన్ని ఎవరు నిర్వహిస్తున్నప్పటికీ, వారికెదురయ్యే సమస్య"లొక్కటే అవే కమ్యూనిస్టుల సమస్య, ఆహార సమస్య అని కూడా ఆయన బాహాటంగా ప్రకటించాడు ప్రభుత్వంతో గతంలోకంటే ఎక్కువసహకారానికై పత్రికలు పిలుపిచ్చాయి నాయకులు 'వాగ్దానం జేశారు.' అయినా, నాలుగు వారాలలోనో, ఆరువారాలలోనో "కమ్యూనిస్టులను" నిర్మూలించివేస్తామని ప్రగల్భాలు పలకటానికి మాత్రం ఎవ్వరూ సాహసించలేకపోయారు.

## కాంగ్రెస్ మిలటరీ ప్రభుత్వ ఉన్మత్త స్థితి - పోలీసు చర్య అనంతరం పోలీసు రాజ్యం - నగరంలో నిర్బంధకాండ తీవ్రత

హైదరాబాదులో 'కాంగ్రెస్ నిరంకుశ పాలన' పదకొండు మాసాలు సాగటంతోనే, అది తగిలించుకొన్న "విమోచన ముసుగు" కాస్తా పటా పంచలైపోయింది. తుపాకి బలంతో సాగుతున్న, పెట్టుబడిదారీ వర్గపు దుష్ట నియంతృత్వంగా దాని నిజస్వరూపం బట్టబయలైంది.

పౌరహక్కులు పూర్తిగా అణచివేయబడ్డాయి. నిజమైన ప్రజాతంత్ర వుద్యమాన్ని దేనినీ సాగనివ్వలేదు. ప్రభుత్వం ఎంతగా వణకిపోతున్నదంటే, దాని పోలీసులు, ఏ ప్రాంతంమీదనైనా, ఏ సంస్థమీదనైనా, ఫ్యాక్టరీపైనైనా విరుచుకుపడి, విచక్షణారహితంగా అరెస్టులు చేయటానికి, బీభత్సకాండ సాగించటానికి పూనుకున్నారు. విద్యాసంస్థల పవిత్రత, మహిళల గౌరవం - అన్నీ మంటగలిపారు. వారంట్లు లేకుండా అరెస్టులు, విచారణ లేకుండా నిర్బంధించటం, విచక్షణారహితమైన దాడులు, సోదాలు, గాలింపులు సర్వ సాధారణమైపోయాయి అజ్ఞాతవాసంలోవున్న నాయకుల జాడ తెలుసు కొనటంకోసం ప్రజలను అరెస్టు చేయుటం, నుగ్గునుగ్గుగా కొట్టటం సాగుతోంది. కమ్యూనిస్టుపార్టీ, ట్రేడ్‌యూనియన్లు, విద్యార్థి, యువజన సంఘాలకు జెందిన అచ్చు యంత్ర సామగ్రిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఈ క్రూరులు పురుషులపైన సాగించినట్లే స్త్రీలపైనకూడా, అత్యాచారాలు సాగించారు.

1949 ఫిబ్రవరి మధ్య భాగంనుండి-ఆగస్టు మధ్యభాగంవరకూ గల ఆరు మాసాల కాలంలో, హైదరాబాదు నగరంలోనే ప్రజాతంత్ర వుద్యమంపై ఎంతటి నిర్బంధకాండ సాగించంటే, 52 మంది వివిధ జైళ్ళలో మ్రగ్గుతున్నారు. పాతికమందిపై అరెస్టు వారంట్లు జారీ అయివున్నాయి అరెస్టు చేయబడిన వారిలో, కమ్యూనిస్టుపార్టీ నాయకులు, ఆర్గనైజర్లు. కార్యకర్తలు, ట్రేడ్‌యూని యన్ కార్యకర్తలు, సమరశీల స్వభావంగల కార్మికులు, విద్యార్థులు, యువ జనులు, అభ్యుదయ రచయితలు, పత్రికా సంపాదకులు, ప్రభుత్వోద్యోగులు ప్రజాతంత్ర యువజనసంఘం, అఖిల హైదరాబాదువిద్యార్థి యూనియన్ల నాయకులు, ఆర్గనైజర్లు కార్యకర్తలు వున్నారు.

ఇరవైమంది ట్రేడ్ యూనియన్ నాయకులు, కార్యకర్తలు జైలు కటకటాలవెనుక నిర్బంధించబడ్డారు. వారిలో పి. ఆర్. కోకిల్, భూషణం, కాశీకాంత్, కులకర్ణివంటి రైల్వే ఉద్యోగుల నాయకులు, రాఘువేంద్రరావు, జాన్, ఆలం, అఖ్తార్ ఆలీ, చార్లెస్, రాములు వంటి రోడ్డు రవాణాశాఖ

ఉద్యోగుల సంఘ కార్యవర్గ సభ్యులందరూ (సయ్యద్ ఖాసిం మాత్రమే అజ్ఞాత వాసానికెళ్ళాడు), మ్యునిసిపల్ ట్రెయినేజ ఉద్యోగుల యూనియన్ నాయకుడు, అఖిల హైదరాబాదు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సహాయ కార్యదర్శిఅయిన లింగారెడ్డి, సిటీ జఫ్రశి కార్మికనాయకులగు ఆగయ్య, కేశవరెడ్డి నగరంలోని ప్రసిద్ధ కార్మికనాయకుడగు రాజయ్య, ఆల్విన్ మెటల్ కార్మికుల ప్రముఖ నాయకుడగు భూషణం వున్నారు. వారంతా డిటెన్యూలు.

ఉస్మానియా యూనివర్శిటీకి జెందిన విరల్, కులకర్ణి, గంగాధర్ చిట్నిస్, సిటీకాలేజీకిజెందిన సి. హెచ్ హనుమంతరావు, తదితరులు, నిజామ్స్ కాలేజీకి జెందిన పి. నరసింగరావు, మెడికల్ కాలేజీకి జెందిన డి.యం. శంకర రావు, వంటి ప్రముఖ విద్యార్థి నాయకులంతా అరెస్టు చేయబడ్డారు. అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్‌కు అనుబంధించబడిన సిటీ విద్యార్థి యూనియన్ కార్యవర్గం యావత్తూ, అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్ నాయకులందరూ జైళ్ళలోనైనా వున్నారు. తతిమ్మావారు అజ్ఞాతవాసానికి వెళ్ళిపోయారు

ప్రజాతంత్ర యువజన సంఘం సహాయ కార్యదర్శులగు మహమ్మద్ ఆలీ రజ్వీ, శ్రీనివాస్, మజ్‌హర్ హుస్సేన్, భూషణం, దొరైస్వామి, మల్లేశం, ఖాశిం అజీజ్‌వంటి ప్రముఖ కార్యకర్తలందరూ అరెస్టు చేయబడ్డారు సంఘ కార్యవర్గం యావత్తూ జైలు కటకటాల వెనుకనో, అజ్ఞాతవాసంలోనో వున్నారు.

హైదరాబాదుకు జెందిన ప్రముఖ అభ్యుదయ రచయిత సులేమాన్ ఆరబ్, అభ్యుదయ వారపత్రిక 'సవేరా' సంపాదకుడు హైదరాబాదు అభ్యుదయ రచయితల సంఘం కోశాధికారియునగు గౌస్ మొహియుద్దీన్, అభ్యుదయ రచయితల సంఘ కార్యవర్గ సభ్యుడగు రఫీ అహమ్మద్ జైలు కటకటాల వెనుక నిర్బంధించబడ్డారు. సంస్కృతీ 'పరిరక్షకుడ'నని చెప్పుకునే నెహ్రూగారి ప్రభుత్వం ఈ విధంగా సంస్కృతికే ప్రమాదకరంగా తయారైంది.

ప్రసిద్ధ దినపత్రిక 'పాయం' సంపాదకుడు అఖ్తార్ హుస్సేన్, ఉస్మానియా యూనివర్శిటీ స్త్రీల కళాశాల లెక్చరర్ రజయాబేగం, విచారణలేకుండా నిర్బంధించబడ్డారు.

సికిందరాబాద్ యువకులు శంకరనారాయణన్, వెంకటేశ్వరరావు అరెస్టు చేయబడ్డారు. వారిలో శంకర నారాయణన్ హైదరాబాద్ సబార్డినేట్ యింజనీర్ల సంఘంలో చురుకుగా పనిజేసే సభ్యుడు వెంకటేశ్వరరావు రైల్వే వుద్యోగి.

అజ్ఞాత వాసంలో వున్న కమ్యూనిస్టులకు ఆశ్రయం కల్పించాడన్న ఆరోపణపై ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడొకరిని, విచారణ లేకుండానే నిర్బంధించారు.

"కమ్యూనిస్టులకు ఆయుధాలు సరఫరా జేస్తున్నారన్న" తప్పుడు ఆరోపణపై, ప్రభుత్వ తూకాలు, కొలతల శాఖలో ఇన్‌స్పెక్టరగు షంసుజ్జమాన్, షహాబ్, ఘనీ అనే మరో యిరువురు యువకులూ అరెస్టు చేయబడ్డారు.

ప్రభుత్వం వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఎంతగా గౌరవిస్తున్నదంటే, వారిపై ప్రభుత్వ కోర్టులలో విచారణైనా జరిపించలేదు!

● ● ●

1948 సెప్టెంబరు మధ్యలో ప్రజలు వీధుల్లోకొచ్చి రజాకార్ బీభత్సంనుండి విముక్తి పొందినందుకుగాను ఆనందోత్సవం జరుపుకున్నారు. రజాకార్ల తుపాకుల బలంతో హిందూ ముస్లింలమధ్య తెచ్చిపెట్టిన విద్వేషం అదృశ్యమైపోయింది. కష్టజీవులు ఇంతలోనే ఆర్థిక సంక్షోభంయొక్క తాకిడికి గురిగాజొచ్చారు పేరుకొనియున్న వారి సమస్యలన్నీ పైకొస్తున్నాయి. పోరాటాలద్వారా వాటిని పరిష్కరించుకోవాలన్న ఆకాంక్ష వ్యక్తమవుతోంది.

1948 డిసెంబరు మధ్య బాగానికల్లా, 16 వందల మంది మునిసిపల్ కార్మికులు, జీవనానికి సరిపడే వేతనంకోసం, కరువుభత్యంకోసం, తమ సర్వీసును పర్మనెంటు చేయాలని కోరుతూ వీధుల్లోకొచ్చి ప్రదర్శనలు జరిపారు. ఎర్రజెండా నాయకత్వాన, వారు నగరంలోని వివిధ వీధుల్లో వూరేగింపు జరిపారు. కష్టజీవులందరినీ వుత్తేజ పరిచారు. లాఠీచార్జీలను లెక్కజేయకుండా సాగిపోయారు. పోలీసు కార్యాలయంపై ముట్టడి జరిపి అరెస్టు చేయబడిన తమ నాయకులను విడుదల జేయించుకున్నారు.

కొత్త పాలకులు ప్రకటించిన బూటకపు రాయితీలను నిరాకరిస్తూ, మునిసిపల్ కార్మికులు తిరిగి లెనిన్ దినోత్సవంనాడు సమ్మె జేశారు. హైదరాబాదు నగర వీధులగుండా ప్రదర్శన జరిపి, కార్మికవర్గ మంతటినీ వుత్తేజ పరిచారు. పాశవికమైన లాఠీచార్జీల నెదుర్కొన్నారు, పోలీసుల చేతుల్లోని లాఠీలను గుంజుకున్నారు అత్మరక్షణార్థం తిరిగి దెబ్బగొట్టారు. ఎర్రజెండా నాయకత్వాన మునిసిపల్ కార్మికులు, రేకెత్తించిన వెల్లువ ఫలితంగా, జనవరిలోను, ఫిబ్రవరి ప్రారంభంలోను సిటీటెక్స్‌టైయిల్సు, తాజ్‌గ్లాస్ వర్క్సు, కోహినూర్‌గ్లాస్ వర్క్సు, యాజ్‌బెస్టాన్ సిమెంట్ వర్క్సులకు జెందిన ఇరవైవేలమంది కార్మికులు సమ్మెజేశారు. ఎనభైవేల పనిరోజులు నష్టమయినాయి. నిరాహారదీక్షలో వున్న తమనాయకుని చుట్టూచేరియున్న మహిళలపైలాఠీచార్జి

జరిపినందుకు నిరసనగా, రైల్వే, ఆర్. టి డి. కార్మికులు సమ్మె జేయటంతో ఒక సందర్భంలో నగరమంతా రెండు రోజులపాటు స్తంభించిపోయింది.

ఈ పరిస్థితులలో అఖిలభారత రైల్వే జనరల్ సమ్మెకు ఆలోచనలు సాగుతున్నాయి. దక్షిణభారతదేశ రైల్వే కార్మికులలో అత్యధిక సంఖ్యాకులు సమ్మెకు అనుకూలంగా ఓటుజేశారు సయ్యద్ బాశిం, రామచంద్రరావు, తదితరుల నాయకత్వాన ఆర్. టి డి. ఉద్యోగులు – ఆర్ టి డి ఉద్యోగులపై మిలటరీ అత్యాచారాలకు నిరసనగా ఒకసారి, మునిసిపల్ కార్మికులపట్ల సానుభూతిగా రెండవసారి పనులు మానివేయటం ద్వారా పోరాటానికి తమ సంసిద్ధతను వ్యక్తంజేశారు

రైల్వే సమ్మె జరిగేట్లయితే, అది యావన్మంది కష్టజీవులనూ కదిలించగలదనీ, వారి శక్తి ఎదిరించశక్యంగానిదిగా తయారవుతుందనీ బూర్జువా వర్గానికి తెలుసు. అందుకే నిర్బంధకాండకు పూనుకుంది. ఆనాటి సోషలిస్టు పార్టీ నాయకత్వంయొక్క, తదతరులయొక్క సహాయ, సహకారాలతో దాడి ప్రారంభించింది ఒక్క హైదరాబాదు నగరంలోనే రైల్వే, ఆర్ టి డి. ఉద్యోగుల నాయకులు, కార్యకర్తలు యాభైమందికిపైగా అరెస్టు చేయబడ్డారు. సిటీ టెక్స్టైల్సు కార్మికనాయకులను నిర్బంధించారు యువజన, విద్యార్థి నాయకులను అరెస్టుజేసి నిర్బంధించారు. రైల్వే కార్యాలయాలలో, ఆర్ టి డి. వర్కుషాపులో, డిపోలో పోలీసులను దించారు. రైల్వే వర్కుషాపు ప్రాంతమైన లాలాగూడాలో బీభత్సకాండ ఎంతగా సాగిందంటే, పంపులవద్ద నీళ్లు పట్టుకొనే స్త్రీలనుసయితం అరెస్టు చేయబడిన తమ బంధువులనుగూర్చి నోరువిప్పి మాట్లాడనివ్వలేదు. లాఠీఛార్జీలుజేసి వారిని చెదరగొట్టారు. ఆర్ టి డి లో సాధారణ ఉద్యోగి ఒకరు అధికారిగదిలోకెళ్ళి అరెస్టులకు కారణమేమిటని అడగగానే ఆయనను పోలీసులకు ఒప్పగించటంజరిగింది. "విమోచన ప్రభుత్వం" పాలనను, నగరంలోని కార్మికవర్గం బాగా రుచిచూడటానికిదే మొదలు.

అయితే, నిర్బంధకాండవల్ల కార్మిక వర్గంలో ఆగ్రహం రేకెత్తింది. 1949 మార్చిలో ప్రాగాటూల్సు కార్పొరేషన్ కార్మికులు, ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ కార్మికులు సమ్మెచేశారు వారి నాయకులైన సోషలిస్టు నాయకులు సమ్మెకు వ్యతిరేకమైన వైఖరి తీసుకున్నప్పటికీ ఈ సమ్మెలు జరిగాయి. రెండు మాసాలపాటు సాగిన ఈ రెండు సమ్మెలలోనే, ముప్ఫైవేల పనిరోజులు నష్టమైనాయి కార్మికులు పాశవికమైన లాఠీఛార్జీలకు, అరెస్టులకు గురయ్యారు. కష్టజీవులలో వారిపట్ల సంఘీభావం వ్యక్తమయింది.

మిలటరీ ప్రభుత్వం పోవాలని, దానిస్థానంలో కార్మికులు, కర్షకులు, పీడిత మధ్యతరగతి వర్గాలతోగూడిన జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడాలని కోరుతున్న పోస్టర్లు, మే దినోత్సవం రోజున తెల్లవారేసరికల్లా, నగరమంతటా కనిపించాయి. సాయంత్రం బహిరంగసభ పూరేగింపు జరిగాయి. "తెలంగాణాను విడిచిపెట్టి వెళ్ళండి" వంటి నినాదాలు ప్రతిధ్వనించాయి కార్మికవర్గ నాయకత్వాన విద్యార్థుల, అభ్యుదయ కాముకులైన మేధావుల, కష్టజీవులైన యువజనుల అండదండలతో భారతదేశవ్యాపితంగా, ప్రపంచ వ్యాపితంగా ఆ విధమైన నిరసనోద్యమం సాగటంతో నెహ్రూగారి మిలటరీ ప్రభుత్వం వెనకడుగు వేయవలసి వచ్చింది. మరణ శిక్షలను సస్పెండ్ చేయవలసివచ్చింది.

కార్మికవర్గ నాయకత్వాన సాగిన ఈ ప్రజాతంత్ర వుద్యమం తాకిడి వల్ల కరపత్రాల, పోస్టర్ల, సభల, ప్రదర్శనల పరంపరవల్ల ప్రభుత్వం కంపించిపోయింది. దానితో జూన్ నెల ప్రారంభంలో రెండవసారి దాడి ప్రారంభించింది. ఈ పోరాటాల సమయంలో నగరంలోని కష్టజీవులందరి నాయకుడుగా, ప్రతినిధిగా రూపొందిన ఆల్విన్ మెటల్‌వర్క్సు కార్మికుల నాయకుడగు రాజయ్యను అరెస్టు జేశారు. చురుకైన, ట్రేడ్‌యూనియన్, యువజన, విద్యార్థి కార్యకర్తలను నిర్బంధించారు అంతకుముందు విడుదలచేయబడిన ఆర్. టి. డి. నాయకులలో కొందరిని మరల అరెస్టుచేశారు. "పాయం"పత్రికను మూడునెలలపాటు నిషేధించారు. 'సవేరా' పత్రిక సంపాదకుడు గౌస్‌మొహియుద్దీన్‌ను అరెస్టుజేశారు. విచక్షణారహితంగా అరెస్టులకు, బీభత్సకాండకు పూనుకోవటం ద్వారా, "కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా సాగించుతున్న ముద్రణ, ప్రచార, యంత్రాంగాలను కుంటుబరచటానికి ప్రభుత్వం ప్రయత్నించినదని పోలీసుశాఖాప్రతినిధి ఒకరు ప్రగల్భాలు పలికాడు. నగరంపై బీభత్స పాలన సాగింది. ఇండ్లను సోదాజేశారు పఠనమందిరాలను ధ్వంసంజేశారు. విచక్షణాహితంగా అరెస్టులకు పూనుకున్నారు

సరిగ్గా ఈ దశలోనే, ప్రభుత్వోద్యోగులు దీర్ఘకాలంగా అపరిష్కృతంగా వుండిపోయిన తమ సమస్యల పరిష్కారంకోసం కదులుతున్నారు. 1949 మే 10 వ తేదీన, వెయ్యిమంది సబార్డినేట్ యింజనీర్లు రెండుగంటలపాటు కలంబందు సమ్మెజేశారు. పి డబ్ల్యు డి. సిబ్బంది సమ్మెజేసి చౌకగా ప్రయాణ సౌకర్యాలు సాధించుకున్నారు. ఈ పోరాటలద్వారా, హైదరాబాదు ప్రభుత్వ ఉద్యోగుల సంఘాల సమాఖ్య పునరుజ్జీవం పొందింది. దానికి వారి ప్రసిద్ధ నాయకుడు రతీలాల్ నాయకత్వం వహించాడు. దానితో ప్రభుత్వం,

మన పీడిత ప్రజలలోని ఈ వర్గంపై తీవ్ర నిర్బంధకాండను ప్రయోగించింది. నిర్బంధంతో, నిషేధాలతోగూడిన నియమ నిబంధనలను ప్రవేశపెట్టింది. రతీలాల్ అరెస్టుకు వారంటు జారీజేసింది.

ఈ నిర్బంధకాండకు వ్యతిరేకంగా, నిరసన వుద్యమం పురోగమిస్తోంది. నిర్బంధకాండను ఖండిస్తూ, మున్సిపల్, ట్రెయినేజి, జవుళి కార్మికులు తీర్మానాలు చేశారు ప్రజాతంత్ర యువజన సంఘంలో సంఘటితమైన యువజనులు, వివిధ ప్రాంతాలలో ఈ నిరసనోద్యమంలో పాల్గొన్నారు. కరపత్రాలు, పోస్టర్లు, సంతకాల సేకరణ రూపంలో విద్యార్థులుకూడా, ఈ నిరసనలో తమవంతు పాత్రను నిర్వహించారు. ఇంతటి నిర్బంధకాండ సాగుతుండగానే, 1949 జులై 7వ తేదీన నిరసన ప్రదర్శనొకటి జరిగింది. ప్రభుత్వ వున్మత్త స్థితి ఎంతవరకు చేరిందంటే, ప్రదర్శననుండి యింటికి తిరిగిపోతుండగా ఖాశిం అజీజ్‌ను, అత్మాతుల్లాను అరెస్టు చేశారు అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్ నాయకుడగు చిట్నిస్‌ను, సీతాఫల్మండీలోని ఆయన నివాసం నుండి అరెస్టు చేశారు

రైల్వే వుద్యోగి దావూద్ షరీఫ్, తన సోదరుడగు ఖాశిం అజీజ్ ఎక్కడున్నదీ తెసుకొనటంకోసం – పోలీసు కార్యాలయానికి వెళ్ళినప్పుడు ఆయనను అరెస్టు చేశారు ప్రభుత్వం ఎంతటి వున్మత్త స్థితిలో వున్నదీ దీనిని బట్టి విదితమవుతుంది. నిర్బంధకాండ జోరుగా సాగింది. ఒక రోజు వుదయం "నగరంలో పెద్దఎత్తున మేధావుల నిర్బంధంజరిగింది" అని బూర్జువావర్గపు స్వంత ఓరియంట్ ప్రెస్ పేర్కొన్నది 'పాయం' పత్రిక సంపాదకుడు అఖ్తార్ హుస్సేన్, ఆయన సోదరులు ముగ్గురు, ఆయన బావ మరది, స్త్రీల కళాశాల లెక్చరర్ అగు ఆయన సోదరి రజియాబేగం, నిజామ్‌కాలేజి లెక్చరర్ వొకరూ అరెస్టు చేయబడ్డారు

అఖ్తార్ హుస్సేన్ బావమరది అజీజ్–అహమ్మద్ మరణశయ్యమీద వుండగా ఆయనను అరెస్టు చేయటానికికూడా వెళ్ళారంటే పోలీసుల పాశవికత్వం ఏ స్థాయిలో వున్నదో వూహించవచ్చు ఇది జరిగిన తర్వాత వారం రోజుల లోపునే ఆయన మృతి జెందాడు. తాము వెదకవలసిన ప్రజాతంత్ర యువజనసంఘం కార్యకర్తల "జాబితా"లో ఆయన పేరు వుండటమే పోలీసుల చర్యకు కారణం.

సిటీ కాలేజీ, చాదర్‌ఘాట్ కాలేజీల విద్యార్థులు ఈ అరెస్టులపట్ల నిరసన ప్రదర్శించారు. అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్ విద్యార్థులతో నిరసనసభ జరిపింది. దానితో ఒకరోజు వుదయం పోలీసులు సిటీ కాలేజీలో జొరబడ్డారు. విద్యార్థి నాయకులను కొందరిని అరెస్టు జేశారు.

చాదర్‌ఘాట్ కాలేజి విద్యార్థులు, నిరంకుశుడయిన ప్రిన్సిపాల్ అక్రమాలకు వ్యతిరేకంగా రెండుసార్లు కార్యాచరణకు దిగారు ఒక 'సోషలిస్టు' విద్యార్థి నుండి సమాచారం అందినమీదట పోలీసులు మొహజ్జం హుస్సేన్‌ను అరెస్టు జేశారు. ఆగ్రహ పరవశులైన విద్యార్థులు పోలీసు స్టేషన్‌పై విరుచుకుపడ్డారు. తమ నాయకుడిని విడిపించుకున్నారు ; తమకు ఈ సమాచారం అందజేసిందెవ రయినదీ పోలీసులనుండే తెలుసుకున్న విద్యార్థులు విచ్ఛిన్నకుడు, పోలీసు ఏజెంటునగు ఆ 'సోషలిస్టు'కు జీవితంలో ఎన్నటికీ మరచిపోలేని విధంగా బుద్ధిజెప్పారు

నగరంలోగల రెండు స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్లుల కార్మికులు అనేకసార్లు సమ్మెలు జేశారు. అందులో చిన్నవి, పెద్దవి శాఖలవారీగా జరిగినవి, మిల్లుమొత్తంగా జరిగినవి, ఆర్థిక సంబంధమైనవి, రాజకీయమైనవీ వున్నాయి. వాటన్నింటివల్ల, మొత్తం ఎనిమిదివేలకుపైగా పనిరోజులు నష్టమైనాయి.

1949 ఆగస్టు వచ్చింది అఖిల హైదరాబాద్ విద్యార్థి యూనియన్ కార్యకర్తలను అరెస్టు చెయటంకోసం పోలీసులు సిటీకాలేజీ లో ప్రవేశించారు

అడివమ్మ అనే మహిళతోసహా, రెండు జవుళి మిల్లులలోని కార్మికుల నాయకులను ఐదుగురిని 'స్వాతంత్ర్యదినం'నాడే అరెస్టుజేశారు హైదరాబాద్ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెనీ వర్కర్సు యూనియన్ కార్యదర్శి వెంకటేశంను, కార్యవర్గ సభ్యురాలు అడివమ్మను పోలీసులు తీవ్రంగాకొట్టారు అజ్ఞాతవాసంలోవున్న నాయకుల రాకపోకలనుగూర్చి, పార్టీ ప్రింటింగ్, ప్రచార యంత్రాంగాన్నిగూర్చి సమాచారం రాబట్టటంకోసమే వారిని హింసించారు ఆ దెబ్బలుతిన్న తర్వాత మూడురోజులవరకూ, వెంకటేశం నిలబడి నడవలేక పోయాడు. అదే ఫ్యాక్టరీకి జెందిన మరొక నాయకుడగు నారాయణ్‌ను రెండు రోజులపాటు కస్టడీలో వుంచుకొని, స్పృహదప్పిపోయేట్లు కొట్టారు. అప్పటి నుండి ఆయన వీపుకిందిభాగంలో తీవ్రమైన నొప్పితో బాధపడేవాడు. హైదరాబాద్ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ వర్కర్సు యూనియన్ తాత్కాలికాధ్యక్షుడినీ అదేవిధంగా పోలీసు కస్టడీలో పన్నెండు గంటలపాటు హింసలకు గురిజేశారు.

అజ్ఞాతవాసంలోవున్న కమ్యూనిస్టుపార్టీ నాయకుల బంధువులను బీభత్సానికి గురిజేయటానికి పోలీసులు పూనుకున్నారు. సమాచారం రాబట్టటంకోసం ఎవరినిబడితే వారిని అరెస్టుజేశారు హైదరాబాద్ ప్రభుత్వఉద్యోగుల సంఘాల సమాఖ్య సహాయకార్యదర్శిగా పనిజేస్తున్న ప్రభుత్వ ఆడిట్ శాఖ వుద్యోగియగు జాఫర్ హస్సాన్‌ను కస్టడిలోకి తీసుకున్నారు. రతీలాల్‌తోనూ,

కమ్యూనిస్టుపార్టీతోనూ సంబంధాలున్నాయా? అని ప్రశ్నలతో ఆయనను వేధించారు. అజ్ఞాతవాసంలోవున్న కమ్యూనిస్టుపార్టీ నాయకులనుగూర్చి ప్రత్యేకించి అఖిలహైదరాబాద్ విద్యార్థి యూనియన్ కార్యదర్శియగు సి. హెచ్. రాజేశ్వరరావునుగూర్చి యూనియన్ హైదరాబాద్ విభాగపు కార్యదర్శి బసీతుల్లాబేగ్‌నుగూర్చి సమాచారం రాబట్టటంకోసమని నిజాంకాలేజి విద్యార్థి విళ్ళేను పన్నెండు గంటలపాటు కస్టడిలో వుంచారు. ప్రజాతంత్ర యువజన సంఘు కార్యదర్శియగు అములక్‌రామ్ అన్న అయిన కారణంగానే, సిటీసివిల్ మేజిస్ట్రేట్ నారతన్‌లాల్‌ను పన్నెండు గంటలపాటు కస్టడిలో వుంచారు. ఆయుధాలు సంపాదించటంలో కమ్యూనిస్టులకు సహాయపడ్డాడని ఆయనపై ఆరోపించారు. కస్టడిలో ఆయనను ప్రశ్నలతో వేధించారు

సమాచారం రాబట్టటంకోసం, హిట్లరు తరహా జైళ్లలో బెట్టి యువకులను హింసలకు గురిజేయటం, కనీవినీ ఎరుగని స్థాయికి చేరుకుంది. షంసుజ్జమాన్‌ను, గుల్బర్గాజైలులో పాశవికంగా కొరడాలతో బాదారు. నగరానికి జెందిన కమ్యూనిస్టు, ప్రసిద్ధ కళాకారుడునగు రంగాచారిని, నల్గొండ కమ్యూనిస్టు, రైతు నాయకుడు రాజిరెడ్డితోపాటు చిల్కల గూడెంలో అరెస్టు జేశారు. రాజిరెడ్డి బంధువగు ఒక మహిళనుకూడా వారితోపాటే అరెస్టు చేశారు. అరెస్టు చేయబడిన కమ్యూనిస్టుల అసలుపేర్లు చెప్పవలసిందిగాను, యితర సమాచారం తెలుపవలసిందిగాను కోరుతూ ఆమెను పాశవికమైన హింసలకు గురిజేశారు. కమ్యూనిస్టులు ఆయుధాలెలా సంపాదించారో చెప్పవలసిందిగా కోరుతూ, రంగాచారిని ఒక నిచ్చెనకు కట్టి, మూడురోజులపాటు, నిరంతరాయంగా పాశవికంగా బాదారు. ఆ మూడురోజులూ ఆయనకు తిండిపెట్టనే లేదు ఆ తర్వాత మరల, ఒక వారంరోజులపాటు, ఆయనను కొట్టారు. చిత్రహింసలకు గురి జేశారు అయినా, వృధాప్రయాసేఅయింది. పోలీసులపశుత్వం ఏ స్థాయికి చేరిందంటే, నగరంలో వుంటున్నారని తాము భావించిన కొందరు తెలంగాణా నాయకుల రాకపోకలను గూర్చి తెలుసుకోవటం కోసమని, వాళ్ళు ఆ ప్రాంతంలోని ఎడ్లబండివారిని, గుర్రపుబండ్లవారిని అందరినీ పోగుజేసి చిత్తం వచ్చినట్లు కొట్టారు.

'పోలీసుచర్య' అనంతరం ఏర్పాటు జేయబడిన పోలీసురాజ్యం ఆ విధమైన బీభత్సకాండ సాగించింది.

## అధ్యాయం : 8

# జైళ్లలోపల సహితం

# తెలంగాణా యోధుల పోరాటం

తెలంగాణా పోరాట కాలంలో జైళ్ళలోపల జరపబడిన పోరాటం నిజంగా చరిత్రాత్మకమైనది వెలుపలి పోరాటంలో అది అంతర్భాగమే. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో పన్నెండువేలమందే అరెస్టు చేయబడగా, యూనియన్ ప్రభుత్వపు సైనికపాలన కాలంలో యాభైవేలమంది అరెస్టు చేయబడ్డారు.

జైళ్ళలో, అవి వుద్దేశించబడిన సంఖ్యకు ఆరు రెట్లుమందిని కుక్కినప్పటికీ. సబ్‌జైళ్ళలో, జిల్లా జైళ్ళలో, సెంట్రల్ జైళ్ళలో చోటుచాలలేదు. ఉదాహరణకు, నల్గొండ జైలులో తొమ్మిది వందలమంది ఖైదీలున్నారు నిజానికాజైలు వందమందిలోపు ఖైదీల కోసం ఉద్దేశించబడిందే. అందువల్ల, ఖమ్మం వంటి చోట్ల ముళ్ళతీగ కంచెలు ఏర్పాటుజేసి, ఆ తీగలలోకి విద్యుచ్ఛక్తి ప్రసరింపజేసి, బహిరంగ స్థలాలలోనే వేలాది కమ్యూనిస్టులను, యితర తెలంగాణా యోధులను నిర్బంధించారు అజైలు నిర్వహణకోసం ప్రత్యేక దళాలను నియమించారు. ప్రభుత్వాధికారులే దానికి. "ఖమ్మంబోను" ( ఖమ్మంకేజి ) అని మారుపేరు బెట్టుకున్నారు.

అవి మామూలు జైళ్ళుకావు. ప్రజలను వాటిలో పశువులవలే, గొర్రెలవలె మందవేసేవారు. పశువులకు వాటి యజమానులనుండిలభించేపాటి సౌకర్యాలైనా ఈ జైళ్ళలో మనుషులకందటంలేదు. అవి కేవలం జైళ్లేకావు, నిర్బంధశిబిరాలు, చిత్రహింసా కేంద్రాలు కూడా.

ఫ్యూడల్ ప్రభుత్వ జైలు నిబంధనలలో రాజకీయఖైదీలకు స్థానం లేదు. ఆ విషయంలో మిలటరీ ప్రభుత్వం మరింత అధ్వాన్నం. జైలులో పెట్టబడినవారిలో, యింకా శిక్ష విధించబడనివారికి, శిక్ష విధించబడినవారికిమధ్య ఎలాంటి తేడాలేదు. అందువల్ల ఖైదీలు రాజకీయవాదులుగా తమ గౌరవ, ప్రతిష్ఠలకోసం పోరాడవలసివచ్చింది.

## ఖమ్మం నిర్బంధ శిబిరం

మామూలు జైళ్ళన్నింటిలోనూ, వాటి వాటి పరిమితికిమించి కుక్కిన తర్వాత, "ఖమ్మం బోను"లో రెండువేలమందిని ఖైదీలుగా నిర్బంధించారు. ఈ గుడారాల్లో నిర్బంధించబడిన వారికి ఎండనుండిగాని, వాననుండిగాని ఎలాంటి రక్షణా వుండేదికాదు. ఖైదీలు ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూనే అందులో గడిపేవారు. వేసవికాలంలో, పడమటిగాడ్పుల మూలంగా, ఆ గుడారాలు కూలిపోయాయి వాటి స్తంభాలు పైనబడి ఖైదీలు కొందరు తీవ్రంగా గాయపడ్డారు ఈ ఖైదీలందరినీ, ప్రతిరోజూ తీవ్రమైన సైనిక కాపలాతో, దారిపొడవునా దెబ్బలు కొట్టుకుంటూ తీసుకెళ్ళి ఖమ్మం విమానాశ్రయం మరమ్మత్తుపనో, మరో పనో చేయించి, క్యాంపుకు తిరిగి తీసుకొస్తుండేవారు.

వారి కివ్వబడిన తిండినిగూర్చి వర్ణించటం శక్యంగాదు. వుడకబెట్టిన జొన్నగింజలు గుప్పెడు పెట్టేవాళ్ళు. అన్నంలేదు. చపాతీలూలేవు మట్టివైనాసరే పళ్లేలుగాని, పాత్రలుగానిలేవు ఆహారాన్ని చేతుల్లోనే వడ్డించేవారు. దానిమీద రసంపేరుతో చింతపండు కలిపిన నీళ్ళుకాసిని పోసేవారు. ఒక్కొక్క ఖైదీకి ఒక్కొక్క శేరుచొప్పున నీళ్ళు రేషన్ ఏర్పాటుచేశారు. ఆనీరే రోజంతా త్రాగటానికి, యితర అవసరాలన్నింటికీ సరిపుచ్చుకోవాలి. ఇక స్నానం సమస్యే లేదు

ఇందువల్ల బంక విరేచనాలజబ్బు పట్టుకుని, ఈ ఒక్కజైలులోనే దానితో పదహారుమంది మృతిజెందారు.

తగినంతగా మరుగుదొడ్ల వసతిలేదు. వారు నివసిస్తున్న చోటుకు ప్రక్కనే పలచని తడికలతో కొద్దిగా మరుగుదొడ్లు ఏర్పాటు చేశారు. అంత తక్కువ సంఖ్యలోవున్న మరుగుదొడ్లతో రెండు వేలమంది ఖైదీలు ఎంతఅవస్థ పడాలో వూహించుకోవచ్చు. మరుగుదొడ్లను శుభ్రంచేయటానికి తగినంత మంది పనివారిని ఏర్పాటు జేయలేదు. రోజుకొకసారో, రెండుసార్లో పరిశుభ్రం చేసేవారు వారు నివసిస్తూ, నిద్రిస్తూవుండేచోటుకు ప్రక్కనే దుర్భరమైన కంపుగొట్టుతుండేది. ఆ దొడ్లు శుభ్రంచేసి ఆ మలమంతా ఆ క్యాంపులోపలే త్రవ్వబడిన గోతుల్లో పడవేసేవారు.

ఇదంతా అనేకమంది ఆరోగ్యం చెడిపోవటానికి కారణమైంది. కొంత మంది మరణించారుకూడా. మృతదేహాల అంత్యక్రియలు సయితం క్యాంపు ప్రక్కనే జరిపేవారు.

కనీసం 'సి' తరగతి ఖైదీలకిచ్చే సౌకర్యాలనయినా తమకు కల్పించ వలసిందిగా ఖైదీలంతా జైలు అధికారులను కోరారు. తినటానికి, త్రాగటానికి అల్యూమినం పాత్ర లివ్వవలసిందిగాను, మంచినీళ్ళకు నూతులు తవ్వు కొన టానికిగాను పలుగులు పారలవంటి సాధనాలు యిచ్చే ఏర్పాటు చేయవలసింది గాను, తమ నివాసానికిగాను ఎండకు వానకు రక్షణనిచ్చే గుడారాలు వేయ వలసిందిగాను వారు కోరారు.

ఇదంతా అడగటంకూడా నేరమే అయింది. వారిలో ముఖ్యులని తాము భావించిన వారిని కొందరిని ప్రక్కకు తీసుకువెళ్ళి తీవ్రంగా కొట్టారు. భువనగిరికి చెందిన ప్రముఖ కమ్యూనిస్టు, సంఘ నాయకులలో నొకరగు కామ్రేడ్ ఆరుట్ల రామచంద్రారెడ్డిని, తుపాకి మడమలతో తీవ్రంగా కొట్టారు. నాడాలున్న బూట్లతో తన్నారు. మరికొందరిని సమీపంలోని రైల్వేస్టేషన్‌లో గల ఖాళీ గూడ్సు వ్యాగన్లవద్దకు తీసుకెళ్ళి స్పృహదప్పిపడిపోయేంతవరకూ కొట్టారు తిరిగి అక్కడనుండి తీసుకెళ్ళి మరల కొట్టారు. ఈ చిత్రహింసలవల్ల కొందరు మరణించారు. అయినా, ఖైదీలు తమ డిమాండ్లను వదులుకోలేదు. అనేకసార్లు నిరాహారదీక్షలు జరిపారు. పెద్ద గగ్గోలుజేశారు. "కమ్యూనిస్టు పార్టీకి జై" అంటూ నినాదాలు చేసేవారు దానికి బదులుగా, కాల్పులు జరుపుదామని, మంటల బాంబులు ప్రయోగిస్తామనీ అధికారులు బెదిరించారు. లాఠీదెబ్బలు సర్వసాధారణమైపోయాయి. అయినా, ఖైదీలు తమ పోరా టాన్ని మానలేదు.

కొన్ని నెలలపాటు ఆందోళనచేసిన తర్వాత నూతులు త్రవ్వుకొన టానికి, తమ ఆహారంలో కలుపుకునేందుకు పచ్చడి తయారుజేసుకొనటానికి వారికి కొన్ని పరికరాలిచ్చారు.

నాలుగు మాసాలపాటు ఈ విధంగా ఆందోళన చేయటంతో, జైలు లోపలివారు గగ్గోలు లేవనెత్తటంతో ఈ ఖైదీలనందరినీ తెలంగాణాకు వెలుపలనున్న గుల్బర్గా, జాల్నా తదితర జైళ్ళకు పంపివేశారు. తమను తరలించుకొని తీసుకొని వెడుతున్నప్పుడు సైన్యం బెదిరింపులను లెక్కజేయ కుకడా ఖైదీలు దారిపొడవునా సమరశీలస్వభావంగల నినాదాలు చేశారు.

ఇంటర్వ్యూలులేవు. ఏ స్నేహితుడూ వారిని చూడటానికిగాని, వారికి ఏవైనా తినుబండారాలివ్వటానికిగాని వీలులేదు. వారిని గుల్బర్గా జైలుకు బదిలీచేసినరోజున, ఖమ్మం, తదితర తాలూకాలనుండి వేలాదిప్రజలు

ఆహార ప్యాకెట్లు తీసుకొచ్చారు. కాని సైనికులు వారిని ఆ ప్యాకెట్లు నివ్వటం మాటలావుంచి, కనీసం ఆ ఖైదీల దరిదాపులకైనా రానివ్వలేదు. ప్రజలు ఆగ్రహ పరవశులైనారు. వారంతా కాంగ్రెస్ ఆఫీసుకెళ్ళారు. ఆ ప్యాకెట్లన్నింటినీ, అక్కడున్న కాంగ్రెస్‌వాళ్ళ ముఖాలమీద విసిరేశారు. వాళ్ళను నోటికొచ్చినట్లల్లా తిట్టారు.

## గుల్బర్గా జైలులోపల

గుల్బర్గాజైలులో వారికి రోజుకు రెండు సజ్జ లేదా జొన్న రొట్టెలుమాత్రం యిచ్చేవారు. వాటినిండా యిసుక, రాళ్ళు వుండేవి. అవి సరిగా కాలివవిగావు. పురుగులు లుకలుకలాడుతున్న పుచ్చిపోయిన జొన్నలతో చేసిన రొట్టెలిచ్చేవారు. ఈ రొట్టెలతోపాటిచ్చే ఆకుకూరలు ముట్టుకొనటానికే శక్యముయ్యేదిగాదు అందులో సగం గడ్డివుండేది. అదీ సరిగా ఉడికింది కాదు పప్పు విషయంలోనూఅంతే.

ఆ క్యాంపును నిర్వహించటానికిగాను, క్రూరత్వంగా వ్యవహరించటంలో ప్రత్యేకంగా శిక్షణగరపబడిన సిబ్బందిని తీసుకొచ్చారు. జైలు సూపరింటెంటు జోషీ నిరంకుశత్వానికి మూర్తీభవించిన ప్రతినిధి. జైలరు ఆంగ్లో-యిండియన్ అతడొక త్రాగుబోతు. పాశవికత్వంలో సూపరింటెంటును తలదన్నాడు జమేదార్ నారాయణరెడ్డి సికింద్రాబాద్ జైలులో సాధారణ సిపాయి ఖైదీలపట్ల వ్యవహరించటంలో పలువిధాలైన పాశవిక పద్ధతులనుసరించటమనే ప్రత్యేక లక్షణాలువున్న కారణంగా ఈ ఉద్యోగంలోకి ప్రమోట్ చేయబడ్డాడు.

కనీసం 'సి' క్లాసుగానైనా పరిగణించాలనీ, ఖైదీలు .తమవంట తామే చేసుకునేందుకు అవకాశం కల్పించాలని అందుకవసరమైన పాత్రలు యివ్వాలని డిమాండ్‌జేస్తూ ఖైదీలు రోజుల తరబడి నిరసన వ్రతం సాగించారు. వారందరినీ మూకుమ్మడిగా లాఠీలతో కొట్టారు ఆ తర్వాత వాళ్ళను చిన్న చిన్న బృందాలుగా విడదీశారు. ప్రత్యేకంగా వాళ్ళను మెడలమీద కొట్టారు కొంత నెలల తరబడిని డబుల్ గంజ్‌లో వుంచారు. (అంటే కాళ్ళను చేతులను కలిపి గొలుసులతో కట్టివేసి వుంచారు)

చివరకు వారు విజయం సాధించారు పావుశేరు బియ్యం, అంతే జొన్న పిండి, కూరగాయలు, పప్పు దినుసులు యివ్వబడినాయి ఖైదీలు తమ వంట తామే చేసుకొనటానికి అనుమతించారు.

జాల్నా వాటర్‌వర్క్స్ వద్దగల ముప్పైఐదు మిలటరీ బారకాసులను నిర్బంధ శిబిరంగా మార్చారు. వాటిలో నాలుగింటిని మిలటరీ కాపలాదార్ల మకాం కొరకు కేటాయించారు. ఆ నిర్బంధ శిబిరంచుట్టూ ముళ్ళ తీగె కంచె వేశారు. మూడు వరుసల్లో ముళ్ళకంపనాటారు. దానికి వెలుపల ప్రత్యేక సాయుధ పోలీసు కాపలా పెట్టారు.

ఖైదీల బారకాసుల పై కప్పులు పూర్తిగాపాడైపోయాయి అయినా, దీన్ని గురించి పట్టించుకోలేదు. ఒక్కొక్క బారకాసులో నలభైమందైనా పట్టటం కష్టం అయినా, ఒక్కొక్క దానిలో అంతకురెట్టింపు మందినికుక్కారు. అచ్చట మరుగుదొడ్లు రెండు మాత్రమే వున్నాయి. వాటినైనా పరిశుభ్రంగా వుంచలేదు. మరుగుదొడ్ల లోని కల్మషంవల్ల, గాలంతా పాడైపోయి దుర్భర మైన కంపుగొడుతుంది.

ఆ బారకాసులలో వున్న నీటికుళాయిలే తక్కువ. అందులో సగం పనిజేసే స్థితిలోలేవు. సరైన స్థితిలోనున్న వాటినైనా, ఉదయం కొలదిగంటలు, సాయంత్రం కొన్నిగంటలపాటు మాత్రమే తెరిచి వుంచేవారు. తత్ఫలితంగా, దారుణమైన నీటికొరత ఏర్పడింది. స్నానం చేయటానికి, బట్టలుతుక్కొన టానికి నానా అవస్థలు పడవలసివచ్చింది.

ఇతర జైళ్ళలోవలెనే ఆహార పరిస్థితి దారుణంగావుంది. పుచ్చిపోయి, పురుగులుబట్టి తినటానికి వీలుపడని జొన్నపిండి, ఇసుక, సన్నటిరాళ్లు, వడ్లు, పురుగులతోనిండిన బియ్యం యిచ్చేవారు. దీనిలోనుంచికూడా, సగభాగాన్ని జైలర్లు, జైలు గార్డులు కాజేసేవారు. తుప్పుబట్టిపోయిన యినుప పాత్రలు, జింకు పాత్రలను సరఫరా జేశారు. రోగులకు సయితం, కాస్త మంచి ఆహారం, పాలు యిచ్చేవాళ్ళు గాదు.

నివసించటానికి సరిపడని గృహవసతి, పనికిమాలిన తిండి, దౌర్జన్యం ప్రయోగించి విపరీతమైన పని చేయించుకొనటం కారణంగా ఖైదీల ఆరోగ్య పరిస్థితి ప్రమాదకరంగా క్షీణించిపోయింది. ఖైదీలలో నూరింట ఎనభైమంది ఏదో ఒక జబ్బుతో బాధపడుతూవుండేవారు. కొంతమంది, క్షయవంటి తీవ్ర మైన వ్యాధులకు లోనయ్యారు.

ఇద్దరు డాక్టర్లు, ఒక కాంపౌండరు, ఇద్దరు వార్డుబాయ్‌లతో పేరుకు మాత్రం జైలు "ఆస్పత్రి" అంటూ ఒకటుంది. జైలు పోలీసులు కొట్టే దెబ్బలకు, తిట్టే తిట్లకు, ఈ డాక్టర్ల నిరంకుశ ప్రవర్తన తోడైంది వాళ్ళు సరైన వైద్య సహాయం చేయకపోగా, నోటికి వచ్చినట్లల్లా తిట్టెవాళ్ళు. ఆస్పత్రిలో

చేర్చుకోవలసిన స్థితిలోవున్న రోగులు అరవైమంది వుండగా, అందులో ఆరు పడకలు మాత్రమే వున్నాయి ఆ రోగులంతా నేలమీదనే పండుకోవలసి వచ్చేది జైలు అధికారులు సరఫరా జేసిన కాస్తంత పాలు, పండ్లను సయితం, ఆస్పత్రి సిబ్బంది స్వాహాజేసేది.

14 సంవత్సరాల బాలురు మొదలు, 80 సంవత్సరాల వృద్ధులవరకు, కమ్యూనిస్టు, కిసాన్, ట్రేడ్‌యూనియన్, విద్యార్థి, యువజన నాయకులు, సాధారణ రైతులు, కార్మికులు, యువజనులు – మొత్తం రెండువేల మంది రాజకీయ ఖైదీలున్న క్యాంపు పరిస్థితి ఆ విధంగా వుంది.

అయితే వీరయోధులైన ఖైదీలు అవమానకరమైన వుత్తర్వులకు వ్యతిరేకంగా, అమానుష పరిస్థితులకు వ్యతిరేకంగా, పాశవికమైన అత్యాచారాలకు వ్యతిరేకంగా, పట్టువిడుపులు లేకుండా మహత్తర పోరాటం సాగించారు.

అంతర్జాతీయ గీతం పాడటాన్ని నిషేధిస్తూ నిరంకుశమైన వుత్తర్వు జారీజేయబడింది. రెండువేల గొంతుకలు ఉద్వేగంతో లేచాయి. ఆ వుత్తర్వును ధిక్కరించి అంతర్జాతీయ గీతాన్ని ఆలాపించారు. పాశవికమైన లాఠీచార్జి జరిగింది. అయినా అంతర్జాతీయ గీతాన్ని ఆలాపించకుండా నిలుపుజేయలేక పోయారు. ఆ తర్వాత, ఆ గీతాన్ని జైలులో ప్రతిరోజూ పాడుతూవచ్చారు.

అన్ని నిషేధాలనూ వుల్లంఘించి ఖైదీలు మే దినోత్సవం జరుపుకున్నారు. కార్మికులు, కష్టజీవులైన రైతులు, యువజనులు చేసిన నినాదాలతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది. ఏడవ నెంబరు బారకాసులో మే దినోత్సవ సభ జరిగింది.

నాజీనిజాంతో తమ నూతన భాగస్వామ్యాన్ని సమర్థించుకోవటానికో, ఏమో నిజాం జన్మదినోత్సవం జరపాలని అధికారులు కోరారు. "తమ నూతన భాగస్వామ్యానికి చిహ్నంగా పాలకులు జరుపుకొంటే జరుపుకోనివ్వండి. మేము మాత్రం ఈ హంతకుని జన్మదినోత్సవం జరిపేదిలేదు" అని ఖైదీలు ఆగ్రహంతో జవాబిచ్చారు.

సరైన వైద్యసహాయం లభించనందువల్లనే కామ్రేడ్ వెంకటనరసయ్య మృతిజెందాడు. మే 6వ తేదీన నిరసన దినం పాటించారు. నినాదాలు చేశారు. సభలు జరిపారు.

ఖైదీలు, వీరోచిత పోరాటాలద్వారా, వార్తాపత్రికలను, పాత ఇనుప, జింకుపాత్రలకు బదులుగా అల్యూమినం పాత్రలను సాధించుకున్నారు.

ఎనిమిదిమంది నల్గొండ వీరులకు మరణశిక్ష విధించిన వార్తను,

ఆ ఖైదీలు మే 19న వార్తాపత్రికలలో చూచారు. వారి ఆగ్రహానికి అవధులు లేవు దానితో ఖైదీలు మహా తీవ్రమైన వీరోచితపోరాటం సాగించారు "కమ్యూనిస్టులను అంతంజేసి", తన నూతన భాగస్వామియగు నిజాంను కాపాడటం కోసం పంపబడిన నెహ్రూ ప్రభుత్వ అధికారుల దుష్ట చర్యలు అలాసాగాయి.

నెహ్రూకు, మిలిటరీ గవర్నరుకూ నిరసన టెలిగ్రాం పంపవలసిందిగా రెండు వేల మంది ఖైదీలూ సూపరింటెండెంటును కోరారు. ఆ కోరిక నంగీకరించటానికి ఆ అధికారి మొరటుగా నిరాకరించాడు దానితో ఖైదీలు నినాదాలు చేశారు. నిరసన ప్రదర్శన జరిపారు.

ప్రత్యేక సాయుధ పోలీసులను, సైన్యాన్ని రప్పించారు ఆక్రూరులు ఖైదీలపై విరుచుకు పడ్డారు. వారందరినీ బారకాసులలోకినెట్టారు. పాశవికమైన లాఠీచార్జి జరిపారు. లింగారెడ్డి, రాఘవేంద్రరావు, పి. ఆర్. కోకిల్ వంటి నాయకులతోసహా అనేకమంది తీవ్రంగా గాయపడ్డారు. లింగారెడ్డి, రాఘవేంద్రరావు ఆ రాత్రంతా స్పృహ లేకుండానే పడివున్నారు. గాయపడిన వారెవరికీ ప్రథమ చికిత్సయినా చేయలేదు.

ఈ సంఘటన జరిగిన తర్వాత అధికారులు జైలుకు వార్తా పత్రికలను నిలిపివేశారు. ఇతర సౌకర్యాలనుకూడా వుపసంహరించుకున్నారు. ఆ క్యాంపును చిత్రహింసలకు నిలయంగా మార్చారు సాయుధ పోలీసు బలగాన్ని క్యాంపులో శాశ్వతంగా మకాం పెట్టించారు. ముఖ్యమైన కామ్రేడ్సుకు చేతులకు బేడీలు వేశారు. ఖైదీలచేత బరువైన పనులు చేయించారు.

గడ్డి కోయవలసిందిగాను, గోతులు త్రవ్వవలసిందిగాను డిటెన్యూలను జూలై 12వ తేదీన కోరారు ఆ పని చేయటానికి ఖైదీలు నిరాకరించారు. ఖైదీలుగా తమపట్ల మరింత మెరుగైన రీతినివ్యవహరించవలసిందిగా కోరారు. అధికారులు ప్రత్యేక సాయుధపోలీసు బలగాన్ని రప్పించారు. లాఠీ చార్జికి పూనుకున్నారు. నాందేడ్ టెక్స్టైల్స్‌కుజెందిన కామ్రేడ్ జనార్ధన్, సిటీ టెక్స్టైల్స్‌కు చెందిన కామ్రేడ్ ఆగయ్య తలలపై తీవ్రంగా గాయపడి మంచం పట్టారు ఆర్. టి. డి కి జెందిన రాఘవేంద్రరావు, అక్తార్అలీ, రాములు తదితరులు, సిటీ టెక్స్టైల్సుకుజెందిన కేశవరెడ్డి మొదలగు అనేకమందికి చేతుల, కాళ్ళఎముకలు చిట్లాయి. మొత్తం డెభ్భైమంది గాయపడ్డారు. నాయకుల చేతులకు సంకెళ్ళువేసి, మిగతావాళ్ళనుండి దూరంగా వుంచారు. మరుసటిరోజున ఖైదీలందరూ భోజనంచేయ నిరాకరించారు. నాయకులను బారకాసుల్లోకి తీసుకు రావలసిందిగా డిమాండ్ చేశారు.

సాయుధ పోలీసులచే, అలాంటి మృగప్రాయమైన అత్యాచారాలు జరిపించటమేగాక, అధికారులు జైలులోని గూండాలతో ప్రత్యేక దళాన్ని ఏర్పరచటానికికూడా ప్రయత్నించారు. అలాంటి దుర్మార్గులు 32 మంది వున్నారు.

ఈ చిత్రహింసలు, క్రూరమైన ఈ దెబ్బలూ జాగ్రత్తగా పన్నిన ఒక పథకం ప్రకారమే సాగాయి విడుదలయిన తర్వాత, ఎలాంటి కార్యకలాపాలలో పాల్గొనేందుకు శక్తిలేకుండా చేయగలందులకై, కమ్యూనిస్టుల ఎముకలను, ప్రక్కటెముకలను విరగగొట్టవలసిందిగా ప్రభుత్వంనుండి తమకుఉత్తర్వులందినట్లు, జైలు సూపరింటెండెంటు ఖైదీలతో స్వయంగా చెప్పాడు.

"విమోచన ప్రభుత్వం" ఏర్పాటు జేసిన నిర్బంధశిబిరంలో అలాంటి పథకం ప్రకారం, ఆ విధమైన చిత్రహింసలు సాగాయి. మన కష్టజీవుల నాయకులు ఆ విధంగా వీరోచిత పోరాటం సాగించారు.

## బిద్ జైలు టిక్, టిక్

మరాట్వాడా ప్రాంతంలోని భిద్ జైలులోకూడా పరిస్థితులలాగే వున్నాయి. అందువల్ల, అలాంటి పోరాటమే సాగింది. అదేవిధమైన బీభత్సకాండ ఎదురైంది. చివరకు అలాంటి సౌకర్యాలనే సాధించుకున్నారు. ఈ జైలులో హింసించే పద్ధతిలో ఒక ప్రత్యేకత వుంది త్రాసువంటి టిక్–టిక్ అనబడే ఒక సాధనం వ్రేళ్ళాడగట్టబడి వుండేది ఖైదీలను ఆ త్రాసులోకెక్కి కూర్చుండమనేవారు. ఖైదిల బట్టలూడదీసి, నూనెలో వూరవేసిన సింగపూర్ బెత్తాలతో బాదేవారు. వాళ్ళాబెత్తంతో బాదునప్పుడు, ఆ బెత్తాన్ని ఒక్కసారిగా తీసివేసేవారు కాదు నెమ్మదిగా తీసేవారు దానితో, కత్తితో కోసినట్లుగా చర్మంపై నెత్తురు కారేట్లుగా గాయమయ్యేది. అప్పుడు, వాళ్ళొక కత్తెర తీసుకుని, వూడిన చర్మాన్ని కత్తిరించి, కారం చల్లేవారు ఆ గాయంపైనే మరలా కొట్టేవారు. ఈ పాశవిక చర్యల ఫలితంగా కొందరు ఖైదీలు మృతిజెందారు. ఈ పాశవికమైన హింసాకాండకు వ్యతిరేకంగానూ, ఖైదీలు పోరాడారు. ఈ పోరాటం ఫలితంగా చివరకు అధికారులు, దానికి స్వస్తి చెప్పవలసివచ్చింది

## హైదరాబాద్, సికిందరాబాద్ జైళ్ళు

రాజధాని నగరంలోని జైళ్ళలో సయితం పరిస్థితులు అంతకంటే మెరుగుగాలేవు, తమను 'ఏ', 'బి' తరగతుల ఖైదీలుగా పరిగణించాలని,

తమకు యినుపపాత్రలుగాక, అల్యూమినియం పాత్రలివ్వాలనికోరుతూ ఖైదీలు ప్రభుత్వానికొక మెమొరాండం పంపారు. నిరాహారదీక్షలు, లాఠీఛార్జీలు, తలుపగలగొట్టటాలు, డబుల్‌గంజ్ అన్నీసాగాయి. వారిలో కొందరిని రెండు చదరపు గజాలుమాత్రమేవున్న చిన్నకొట్లలోనిర్బంధించారు ఆ కొట్లలో నిర్బంధించబడినవారు కదలటానికి సయితం అవకాశంలేదు. వారు కాలకృత్యాలను కూడా అందులోనే తీర్చుకోవాలి. ఈ కొట్లను రోజుకొక్కసారి మాత్రమే శుభ్రపరిచేవారు ఎల్లారెడ్డివంటి కమ్యూనిస్టు నాయకులు, "పాయం" సంపాదకుడగు అక్తార్‌హుస్సేన్, సులేమాన్‌లవంటి అభ్యుదయ రచయితలు, కాలేజీ లెక్చరరుగా పనిజేస్తుండిన రజియావంటివారు అలాంటి కొట్లలో నిర్బంధించబడ్డారు. లాఠీఛార్జీలుజరిగాయి. అసందర్భంలో నాయకులపై ప్రత్యేకంగా కేంద్రీకరించి దెబ్బలుకొట్టటం జరిగింది

ఈ పోరాటం ఫలితంగా, చివరకు కొన్ని సౌకర్యాలు సాధించుకోగలిగారు. కొందరిని 'బి' తరగతి ఖైదీలుగాను, మిగతావారిని 'సి' తరగతి ఖైదీలుగాను పరిగణించారు.

## వరంగల్ జైలులో మిలటరీ కాల్పులు

వరంగల్ జైలులోని రెండువేలమంది ఖైదీలుకూడా అలాంటి పోరాటాలనే సాగించారు. ఒక రోజున, ఒక ఖైదీని, స్పృహతప్పిపోయేంతవరకు కొట్టారు. దానితో ఖైదీల ఆగ్రహావేశులయ్యారు ఇనపవూచలను లాగివేసి చిన్నగేట్లను పగులగొట్టివేశారు. అందరూ ప్రధాన ద్వారంవద్దకు వెళ్ళారు. అధికారులు, జైలువార్డర్లూ అంతా ప్రాణాలు గుప్పెట్లో బెట్టుకుని పరుగెత్తారు. పోలీసులకోసం, మిలటరీకోసం ఫోనుద్వారా కబురువెళ్ళింది. ప్రధానద్వారం తలుపులు బ్రద్దలుగొట్టేలోపునే సైన్యం వచ్చింది. కాల్పులుకూడా సాగించింది. అనేకమంది ఆ కాల్పులకెరయై మరణించారు. ఒక పోలీసు కాన్‌స్టేబుల్ అనేకమంది శిక్షలుబడిన ఖైదీలు ఇతర జైలు సిబ్బందికూడా గాయపడ్డారు కాల్పులు ఎంత విచక్షణారహితంగా సాగింద్ దీనివల్ల విదితమవుతోంది ఆ తర్వాత ఖైదీలంతా తమ బారకాసులకు తిరిగివెళ్ళారు.

ఆ తర్వాతకూడా లాఠీచార్జీలు కొనసాగాయి ఒక్కరుండవలసిన కొట్టులో నలుగురు ఖైదీలనుకుక్కారు. దీర్ఘకాలం సాగిన పోరాటాల అనంతరం, అధికారులు ఈ జైలులోకూడా ఖైదీల కోర్కెలకు అంగీకరించవలసివచ్చింది. అనేక యితర పాతఅలవాట్లకు సహితం స్వస్తి జరిగిందికూడా.

## వరంగల్ సెంట్రల్ జైలులో మహిళా డిటెన్యూలపై లాఠీచార్జి

వరంగల్ జైలుకు కొత్తగావచ్చిన సూపరింటెండెంటు, మహిళా డిటెన్యూలకు మామూలుగా యిసుండే రేషన్లు యివ్వటం నిలిపివేశాడు. ఈ చర్యను నిరసిస్తూ యాభైమంది మహిళా డిటెన్యూలు మార్చి 15 నుండి నిరాహారదీక్ష ప్రారంభించారు. 17 వ తేదిన ఈ మహిళా డిటెన్యూలపై లాఠీ చార్జి చేయవలసిందిగా సూపరింటెండెంటు వుత్తర్వుజేశాడు అందువల్ల ఎనిమిదిమంది మహిళా డిటెన్యూలు తీవ్రంగా గాయపడ్డారు. ఆ విధంగా గాయపడినవారిలో గోవిందాపురానికిజెందిన అన్నపూర్ణమ్మ, సంకేశకుజెందిన తుమ్మా నరసమ్మ మునగాలకుజెందిన బి. నరసమ్మ, వెలిదండ్ల గ్రామానికి జెందిన కాంతమ్మ వున్నారు తమ సోదరీమణులపై జరిగిన పాశవికమైన లాఠీ చార్జీని నిరసిస్తూ 18 వ తేదీన రాజకీయ ఖైదీలంతా నిరాహారదీక్షబూనారు ఈ దుర్మార్గపు చర్యను ఖండించవలసిందిగా వరంగల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ప్రజాతంత్ర వాదులందరికీ విజ్ఞప్తిజేసింది బహిరంగ విచారణజరిపి, నేరస్థులను శిక్షించవలసిందిగా డిమాండ్ చేసింది.

పిండిప్రోలు గ్రామానికి జెందిన కామ్రేడ్ రాంబాయమ్మ ఈ లాఠీ చార్జీలో పాశవికమైన దెబ్బలకుగురై, ఆ తర్వాత కొలది రోజులకే మరణించింది.

అలాంటి పరిస్థితులకు వ్యతిరేకంగా అనేక యితర జైళ్ళలోకూడా అదే విధమైన పోరాటాలు జరిగాయి.

## ఖైదీల యితర సమస్యలు

వైద్య సౌకర్యాలు లేకపోవటంవంటి యితర సమస్యలవల్లకూడా ఖైదీలు బాధపడుతున్నారు మందులు కావాలని అడిగితే, "మీరు కమ్యూనిస్టు రాక్షసులు, మీకు మందులెందుకు" అనేవాళ్ళు అధికారులు వుత్తరాలు రాసు కొనటానికిగాని, ఇంటర్వ్యూలకుగాని సౌకర్యాలులేవు. ఒకవేళవున్నా అవి నామమాత్రం. శిక్షించబడిన ఖైదీలవలెనే కాయకష్టం చేయవలసిందిగా ఈ ఖైదీలనూ కోరేవారు వార్డర్ల దుర్మార్గాలకు అంతులేకుండావుంది. జైలులోపల వార్తాపత్రికలుగాని, పుస్తకాలుగాని లేవు.

ఈ అసౌకర్యాలన్నింటికి వ్యతిరేకంగా జైళ్ళలోపల పోరాటాలు జరిగాయి. అత్యాచారాలు జరిపిన పోలీసులు, వార్డర్లు జైలులోపలికి వొంటరిగా వచ్చినప్పుడు ఎవరు కొట్టిందీ తెలియకుండా వుండటంకోసం వెనుకనుండి

దుప్పటి ముసుగువేసి మెత్తగా తన్ని పంపేవారు. దానితో మరింత నిర్బంధ కాండ వచ్చి పడేది. ఇంకా లాఠీ చార్జీలు, డబుల్ గంజ్, సింగిల్ గంజ్ కాళ్ళకు చేతులకు సంకెళ్ళు వేయటంవంటివి సాగుతూనే వున్నాయి. వాటికి వ్యతిరేకంగా మరల పోరాటాలు సాగాయి. ఆ విధంగా ఖైదీలకు, జైలు అధి కారులకూమధ్య పోరాటాలు పరంపరగా సాగాయి

ఈ పోరాటాలవల్లకూడా, ఖైదీలుకొన్ని సౌకర్యాలు సాధించు కున్నారు. అధికారులు ఖైదీల వుత్తరాలను సెన్సారు జేసేవారు. రాజకీయ సంబంధమైనవిగా తాము పరిగణించిన భాగాలపై తారుపూసి, వుత్తరాలలోని మిగతా భాగాలనే యిచ్చేవారు.

## ప్రత్యేక ట్రిబ్యునళ్లు - బూటకపు విచారణలు

ఎలాంటి ఆరోపణలుగాని, విచారణలుగాని లేకుండానే వేలాది మంది పార్టీ కార్యకర్తలు, ప్రజలు జైళ్ళలో నిర్బంధించబడ్డారు. ఇంకా అనేక వేలమందిపై బందిపోటు దొంగతనం, లూటీ, గృహదహనాలు, హత్యలు తది తర ఆరోపణలు చేయబడ్డాయి. వివిధ నేరాలు చేసినట్లు ఆరోపించబడిన వారి పైన సయితం సాధారణ కోర్టులలోగాక, మిలటరీ ఆధ్వర్యాన ఏర్పరచబడిన స్పెషల్ ట్రిబ్యునళ్ళలోనే విచారణ జరిపారు. నిందితులకు, తమ తరఫున వాదించేందుకు లాయర్లను నియమించుకునేహక్కు కాగితంమీదమాత్రం వుంది. అయినా, ఆభ్యుదయ కాముకులైన లాయర్లను కటకటాల వెనుక నిర్బంధించటంద్వారా, ఆచరణలోమాత్రం ఆ సౌకర్యం నిరాకరించబడింది. వారి తరఫున వాదించటానికి మరే లాయరైనా ముందుకొస్తే అలాంటివారిని ప్రభుత్వం బెదిరించింది.

హైకోర్టులోను, సుప్రీంకోర్టులోనూ ఈ కేసులలో వాదించిన మనోహర్లాల్ సక్సేనా, హైదరాబాదులోని న్యాయవాదుల బృందం, శ్రీ డేనియల్ లతీఫ్, శ్రీ ఎ. యస్. ఆర్ చారి తదితరులనుగూర్చి ఈ సందర్భంగా ప్రత్యేకంగా పేర్కొనవలసివుంది.

దర్యాప్తులు, విచారణలూ అన్నీ ఒక ఫార్సుగానే జరిగాయి పోలీసు అధికారులు కాకమ్మ కథలు అల్లుకొచ్చేవారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్లు ఆంగ్ల భాషలో, సుదీర్ఘమైన, విసుగుబుట్టే వాదనలతో ఆ కథలకు లీగల్ ముసుగు తొడిగేవారు. వాటిలో ఒక్క మాటయినా ముద్దాయిలకు అర్థం అయ్యేదికాదు.

ఇదే ఒక ఫార్సయితే, సాక్షులు చెప్పే కథలు అంతకంటే పెద్ద ఫార్సుగా వుండేవి. సాక్షులు మరెవ్వరో కాదు. భూస్వాములు, వాళ్ళ తొత్తులు, గూండాలే సాక్షులుగా నిలిచేవారు నిజానికి, వాళ్ళంతా ఏనాడో గ్రామాలు వదిలిపెట్టి పోయారు. వారికి ఈ గ్రామాలలో ఏమి జరిగిందో చూడటం మాటలా వుంచి, కనీసం తెలియనైనా తెలియదు. అయినా వాళ్ళు తమంత తామే సాక్ష్యం జెప్పటానికి సిద్ధమయ్యారంటే, తమ ఆస్తులను తిరిగి పొందాలనే వుద్దేశ్యంతోనూ, ప్రజలపై పగతీర్చుకోవాలన్న కోర్కెతోనూ తప్ప మరెందుకూ కాదు ప్రాసిక్యూషన్ చెప్పే కథలు, ట్రిబ్యునళ్ళచే నియమించబడిన న్యాయవాదుల డిఫెన్సు వాదనలూ సర్వదా ఒకే గాడిలో నడిచేవి. తమకు రక్షణగా గట్టి బందోబస్తు ఏర్పాటు చేయబడినప్పటికీ, సాక్ష్యం జెప్పటానికి వచ్చిన ఈ భూస్వాములు, తమ ప్రాంతపు కమ్యూనిస్టు కార్యకర్తలు కనిపించీ కనిపించటంతోనే గజ గజ వణికిపోయేవారు. వాళ్ళ ముఖాల వంక చూడకుండా, తమకు చెప్పి పంపిన దంతా వొప్పగించేవారు

లాయర్లు. పోలీసు, మిలటరీ అధికారుల మాటలా వుంచినా, జడ్జీలు సయితం, ఈ సాక్షులను నిందితులు క్రాస్ పరీక్ష చేయటానికి సాధారణంగా అనుమతించేవారుగాదు.

ఒక్కొక్క వ్యక్తిపైనే డజన్లకొద్దీ కేసులుబనాయించేవారు, భూస్వాముల, గూండాల సాక్ష్యంతోనే కేసులు బలంగా నిలబెట్టటం సాధ్యంగాక, గ్రామాలలోని అమాయక ప్రజలనుకొట్టి, హింసలకు గురిజేసి, సాక్షులుగా బోనులో నిలబెట్టి అబద్ధాలు చెప్పించేవారు అయినా, వారు అమాయకులు, నిరక్షరాస్యులునగు గ్రామీణులు కావడంతో, నిందితుల పేర్లయినా పలకలేక పోయేవారు. పోలీసులు చెప్పినవిధంగా, నిందితులను గుర్తించనూలేకపోయేవారు. అలాంటి సాక్షులు తటస్థపడిన సందర్భాలలో, "ఈ సాక్షికి దాహం వేస్తున్నట్లున్నది. అతనిని బయటుకు తీసికెళ్ళి, కాసిని మంచినీళ్ళిచ్చి, తిరిగి తీసుకురండి" అని జడ్జియే స్వయంగా పోలీసు అధికారులతో అనేవాడు. అలా అనడం అతనిని బయటుకు తీసుకెళ్ళి, బాగాకొట్టి, తిరిగి బోనెక్కించవలసిందిగా పోలీసు అధికారికి సూచించటమే. సాక్షి ఏమిచెప్పినాసరే, ప్రాసిక్యూషన్ కథనానికి అనుకూలంగావున్న భాగాలు మాత్రమే రికార్డులో నమోదుచేయబడుతుండేది.

అలాంటి బూటకపు విచారణలు జరిపి, పదులకొలది కామ్రేడ్సుకు యావజ్జీవశిక్షలు, కొందరికి నలభై – యాభై సంవత్సరాల జైలు శిక్షలు విధించబడ్డాయి.

15 లేక 16 సంవత్సరాల వయస్సుగల బాలురకు సయితం మరణ శిక్షలు, దశాబ్దాల కాలం జైలుశిక్షలు విధించబడ్డాయి. 14 సంవత్సరాల బాలుడగు దినా లింగయ్యకు 46 సంవత్సరాల జైలుశిక్ష విధించారు. 16 సంవత్సరాల బాలుడగు యెర్రబోతు రామిరెడ్డికి. 1950 వ సంవత్సరంలో కోర్టు వురిశిక్ష విధించింది. ఆయన నల్గొండ తాలూకా అప్పాజీపేట గ్రామానికి జెందినవాడు సాధారణ రైతుకుటుంబానికి జెందినవాడు. ఈ బాలునిపై హత్యానేరాలు బనాయించి, మరణశిక్ష విధించారు. ఆ తీర్పుకుముందు ఈ బాలుడు చేసిన ప్రసంగం మొత్తం కోర్టు అంతటిలోనూ అమరసందేశంగా ప్రతిధ్వనించింది. అయినా, ఆ శిక్ష విధించారు ఈ కేసు విచారణ జరుగుతుండగా, పత్రికా విలేకరిగా వచ్చిన అమెరికన్ మహిళ వొకరు, మిలటరీ అధికారుల అనుమతితో జైలులోనే ఆ బాలుని యింటర్వ్యూ చేసింది. అప్పుడు అతనివయస్సు 15 సంవత్సరాలు మాత్రమే. ఆ అమెరికన్ మహిళా విలేకరి ఆ బాలుని జీవితచరిత్రను, ఫొటోనూ తీసుకువెళ్ళి అమెరికన్ పత్రికలలో ప్రముఖంగా ప్రచురించింది.

## డిఫెన్సుకు ప్రజాతంత్రవాదుల తోడ్పాటు

నాజీ పద్ధతుల్లో విచారణలు జరిపి, మరణశిక్షలు విధించుతుండటం పట్ల ప్రపంచమంతటాగల ప్రజాతంత్రవాదులు తమ తీవ్ర నిరసనను నిశితంగా వ్యక్తపరిచారు

భారతదేశపు నూతన రాజ్యాంగం అమలులోకి రాకముందే ఈ మరణ శిక్షలను అమలుపరచాలని భారత ప్రభుత్వంనిశ్చయించింది. అందువల్ల నిర్ణయాన్ని రహస్యంగా వుంచింది.

తెలంగాణా వీరులలో పన్నెండుమందిపై మరణశిక్షలు అమలు జరపాలని వారు నిర్ణయించారు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన బ్రిటిష్ ప్రజాతంత్ర బారిస్టరు స్వర్గీయ డి. యన్. ప్రిట్ స్వయంగా వాదించింది, ఆ పన్నెండు మంది తెలంగాణాయోధులతరఫునే.

వారిలో ఐదుగురిని జనవరి 22 న, మిగతా ఏడుగురిని 23 వ తేదీన ఉరిదీయాలని నిర్ణయించారు. అందులో మైసయ్య 65 సంవత్సరాల వృద్ధుడు. జైలు అధికారులు హైదరాబాదు సెంట్రల్జైలులో జనవరి 9 వ తేదీన, ఉరి శిక్ష విధించబడిన ఆ పన్నెండుమంది సంతకాలు తీసుకున్నారు. మరణశిక్ష అమలుజరపబడవలసియున్న సికిందరాబాద్జైలుకు వారిని బదిలీజేశారు.

ఇక 12 రోజులు మాత్రమే వ్యవధివుంది. ఈ వార్త దావానలంలా వ్యాపించి రెండుజైళ్ళలోని ఖైదీలందరికీ చేరింది. ఆ పరిస్థితిలో వారంతా

ఆగ్రహావేశంతో ఊగిపోతున్నారు. ప్రతీకారవాంఛతో రక్తం సలసల కాగి పోతోంది. తమతోపాటు పోరాటంలోపాల్గొన్న సన్నిహితులైన, ప్రియమైన కామ్రేడ్స్ పన్నెండుమందికి ఉరిశిక్ష విధించబడిందన్నవార్తతో వారు నిర్ఘాంత పోయారు అయినా వారు నిస్సహాయస్థితిలోవున్నారు.

లండన్‌లో డి. యన్. ప్రిట్ కార్యక్రమం ప్రారంభించాడు. ఈ నిర్ణయాన్నిగూర్చి డేనియల్ లతీఫ్, మనోహర్లాల్ సక్సేనా, గణేశ్‌వంటి బారిష్టరకు తెలియజేశారు. బొంబాయి న్యాయవాదులు, 17 వ తేదీన హైదరాబాదు చేరుకున్నారు. తక్షణమే డిఫెన్సు ఏర్పాట్లను ప్రారంభించారు మరణశిక్షలు అమలుజరపటం నిలుపుజేయవలసిందిగా వారు వెల్లోడీని, హైకోర్టును కోరారు. ఈలోగా ఈవార్త ప్రపంచ పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించ బడింది. దేశమంతటినుండి, ప్రపంచంలోని యితర దేశాలనుండి, ప్రజాతంత్ర సంస్థలనుండి, వ్యక్తులనుండి హైదరాబాద్ ప్రభుత్వానికి టెలిగ్రాములు కుప్పలు తెప్పలుగావచ్చి పడుతున్నాయి. తెలంగాణా వీరుల డిఫెన్సుకమిటీ ఏర్పాటు చేయబడింది. "12మంది తెలంగాణా వీరుల మరణశిక్షను నిలుపుజేయండి" అనే నినాదం ఆ రోజుల్లో సర్వత్రా వినిపించింది. జెకోస్లోవేకియన్ యువజనసంఘం, హంగేరియన్ స్వాతంత్ర్యయోధులసమాఖ్య, హంగేరియన్ యువజనసంఘం, జనతా ప్రజాస్వామ్యరాజ్యాలలోని యితర ప్రజాతంత్ర సంస్థలు, ఆరుకోట్ల సభ్యత్వంగల ప్రపంచ ప్రజాతంత్ర యువజనసమాఖ్య, ఎనిమిదికోట్ల సభ్యత్వం గల ప్రపంచ ట్రేడ్‌యూనియన్ల సమాఖ్య, ప్రజాతంత్ర న్యాయవాదుల ప్రపంచ సమాఖ్య, ఈ వురిశిక్షలకు నిరసన తెలియజేశాయి జెకొస్లోవేకియాలోని ప్రాగ్‌నగరంలో ప్రత్యేకంగా ఏర్పాటుజేయబడిన ఒక సభలో, ప్రపంచప్రసిద్ధ అమెరికన్ గాయకుడు పాల్‌రాబ్సన్ ఈ వురిశిక్షలనునిరసిస్తూ ప్రసంగించాడు.

దేశం లోపలనుండేగాక, ప్రపంచమంతటినుండి వెల్లువగా వచ్చిపడ్డ ఈ నిరసనల, విజ్ఞప్తుల, ఖండనల వెల్లువతో భారత ప్రభుత్వం యిరకాటంలో పడింది. దానివల్ల పరిమితంగా ఫలితం కలిగింది. మరణశిక్షలు అమలు జరప టాన్ని వాయిదా వేసినట్లు ప్రభుత్వం – న్యాయవాదులకు తెలియజేసింది. 21వ తేదీ వుదయం యిది జరిగింది. వురికంబాలెక్కబోతున్న కామ్రేడ్సుకు ఈ విషయం 22వ తేదీన తెలిసింది. వారి ప్రాణాలు కాపాడబడ్డాయి మరణ శిక్షలన్నీ, యావజ్జీవ శిక్షలుగా మార్చబడ్డాయి.

బూటకపు విచారణలు సాగుతూనే వున్నాయి. దీర్ఘకాల శిక్షలు, స్వల్పకాల శిక్షలు, మరణ శిక్షలు విధించబడుతూనే వున్నాయి. అనేకమంది కామ్రేడ్స్‌ను జైలునుండి బయటకు తీసుకెళ్ళి అడవులలోనో, కొండలలోనో

ల్చి చంపారు. కోర్టులకు తీసుకుపోతున్నామన్న సాకుతో వారిని బయటకు తీసుకెళ్ళేవారు. కాని, నిజానికి వాళ్ళను అడవులకు తీసుకెళ్ళి కాల్చిచంపారు. అన్ని జైళ్ళలోనూ అలాజరిగింది.

హుజూరునగరుకు జెందిన కామ్రేడ్ వెదిరె రాజిరెడ్డి, హైదరాబాదుకు జెందిన కామ్రేడ్ రంగాచారి ఈ విధంగా కాల్చిచంపడిన వారిలో అతి ముఖ్యులు. రాజిరెడ్డి భూస్వామ్య కుటుంబానికి జెందినవాడు. ఆయన 1944 లోనే, ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలలో ఉత్సాహపూర్వకంగా దుమికాడు. వెలుపలనున్న ప్రజాసామాన్యంయొక్క ఆగ్రహానికి గురిగాకుండా, అలాంటి ప్రజానాయకులకు శిక్షవిధించటం కష్టమని ప్రభుత్వం భావించి వుండవచ్చు. 1950 లో యిది జరిగింది.

ప్రభుత్వ నిర్బంధ విధానం ఒకవైపున కొనసాగుతుండగానే, దానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర వుద్యమమూ, పోరాడేందుకు ప్రజాతంత్రవాదుల ప్రయత్నాలూ అధికమవుతున్నాయి మరణశిక్షలన్నింటిపైన, న్యాయవాదులు సుప్రీంకోర్టుకు అప్పీలుజేశారు. విధించబడిన యితర శిక్షలను కొట్టివేయవలసిందిగా యితర కోర్టులలో అప్పీళ్ళు దాఖలుజేశారు. అపరిష్కృతంగావున్న యితర కేసులలో డిఫెన్సుకుకూడా ఏర్పాట్లుచేశారు. డి. యన్ ప్రిట్ ఇంగ్లండునుండి వచ్చి, కొన్ని ముఖ్యమైన కేసులలో హైదరాబాదు హైకోర్టుకు హాజరై వాదించాడు సాక్షులపై దౌర్జన్యం జరపటానికి ప్రాసెక్యూషన్ వైపు నుండి ఎలాంటి ప్రయత్నం జరిగినా, దాన్ని నిరసించటం, ఖండించటం జరిగింది.

దేశవ్యాపితంగా జరిగిన ఈ ఆందోళన ఫలించి, మరణశిక్షలన్నీ యావజ్జీవశిక్షలుగా మార్చబడ్డాయి. అయినా తెలంగాణా కామ్రేడ్స్ అందరినీ విడుదల చేయించటంకోసం, వెలుపల ప్రజాతంత్రవాదులను సమీకరించే ప్రయత్నాలను పార్టీ విరమించలేదు.

తెలంగాణా ఖైదీల విడుదలకోరుతూ, సాయుధ పోరాటం వుపసంహరించిన తర్వాత పట్టువిడుపులులేని ఆందోళన సాగించబడింది. ఈ విచారణల బూటకపు స్వభావాన్ని ప్రజలర్థం జేసుకున్నారు. తప్పుడు సాక్ష్యాలు ఎంతో కాలం నిలిచేవిగాదు ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీని ప్రజలు వోడించారు. కమ్యూనిస్టుపార్టీకి అఖండవిజయం లభించింది. దీనంతటి ఫలితంగా కాంగ్రెస్ ప్రభుత్వం ఏకాకి అయిపోయింది. ఈ పరిస్థితిని అవకాశంగా దీసుకొని పార్టీ శాసనసభ పార్లమెంటు వేదికలను వుపయోగించుకొంది. ఈ సమస్యపై వెలుపల బ్రహ్మాండమైన వుద్యమమూ, ఆందోళనా నిర్వహించింది శిక్షలన్నీ రద్దుజేసి, ఖైదీలందరినీ విడుదల జేయవలసిందిగా పార్టీ నాయకత్వం ప్రభుత్వానికి

పదేపదే విజ్ఞాపన లందజేసింది. చివరకు, శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1958 – 59 లో యావజ్జీవశిక్ష ననుభవిస్తూ యింకా మిగిలివున్న యాభైమంది ఖైదీలనూ విడుదల జేసింది

బూటకపు పరిశీలనా సంఘం

ప్రభుత్వం ఒకవైపున, జైళ్ల నాలుగుగోడలమధ్య మగ్గుతున్న ఖైదీల పైన కూడా అత్యాచారాలు సాగిస్తూనే, ఖైదీల కేసులను పరిశీలించటంకోసం, తక్కువ ప్రమాదకారులైన వాళ్లను విడుదల జేయటం కోసమని 1950 లో బూటకపు కమిషన్ నొకదాన్ని నియమించింది. ఒక కమిటీ ఏర్పాటు చేయ బడిన మాట నిజమే. అయితే, అది కరుడుగట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకులతో, భూస్వాములతో, కాంగ్రెస్ వాదులతో, ప్రభుత్వాధికారులతో కూడివుంది ఈ కమిటీ ఏర్పాటు జేయబడింది అమాయకులైన వారిని విడుదల జేయటానికి మాత్రం కాదు

విచారణలు జరపటంలో, వారనుసరించిన పద్ధతులు ఎంతటి పాక్షిక మైన వైనప్పటికీ, వారి ఆరోపణలు నిలిచేవికావని తేలిపోయింది. కేసులు కొట్టి వేయబడినాయి. వేలకు వేలమంది ప్రజలపై కేసులు నడపడం సులభమైనపని కాదుకూడా. ఖైదీలను విడుదలచేయాలని కోరుతూ వెలుపల వుద్యమంకూడా బలపడుతోంది. గాలి ఏ వాలున వీస్తున్నదీ ప్రభుత్వంగమనించింది. ప్రజల దృష్టిని మరల్చడంకోసం ఈ కమిటీని నియమించింది.

ఖైదీలను విడుదలచేసేముందు తాము కమ్యూనిస్టులము కామని ప్రకటించునట్లుగా ఆ ఖైదీలపైవొత్తిడిజేయటంకోసం ఈకమిటీవిశ్వప్రయత్నాలు జేసింది "కమ్యూనిస్టు ఎలాగుంటాడు ?" అని అడుగుతూ కమ్యూనిస్టులను గేలి చేయాలని వారు ప్రయత్నించారు. అయితే ఖైదీలు వారికి చెంపపెట్టుబెట్టారు. "మేము కమ్యూనిస్టులమే. మేము ఏ నేరమూచేయలేదు" అనివారు ఘంటా పథంగా చెప్పారు. ఏ నేరం చేయని వారిని విడుదల జేయటంకోసమని ఏర్పాటుచేయబడిన ఆ కమిటీ, అలాంటి ఖైదీలను కొట్టించనారంభించడం విడ్డూరం. అయినా, ఖైదీలు తమ ప్రతిఘటనను విడనాడలేదు జైలులోపలున్నా, వెలుపలవున్నా, ప్రతిఘటన వారి రక్తంలో జీర్ణించుకుపోయింది.

శ్రీ అనంతాచారి అనే ఆయన అధ్యక్షతనగల విడుదల కమిటీ, కలెక్టరూ, మిలటరీ కంమాడర్ నంజప్ప, తదితరులు వెంటరాగా, 1951 లో గుల్బర్గా జైలుకెళ్ళింది. తలలు వంచుకుని, అందరినీ ఒక వరుసలో నిలబడ

వలసిందిగా కోరారు. శ్రీ అనంతాచారి, వాళ్ళ జుట్టుబట్టుకుని, "కమ్యూనిస్టంటే ఎలా వుంటాడు ?" అని గేలిజేస్తూ అడిగాడు. ఒక ఖైదీ తన తల పైకెత్తి, ఒక పద్యరూపంలో సమాధాన మిచ్చాడు. ఆ పద్యం సారాంశం యిలా వుంది :

కష్టజీవులమధ్య కమ్యూనిస్టున్నాడు
కార్మికుల్లో వున్నాడు
కర్షకుల్లో వున్నాడు
నిరుపేద ప్రజలలో మా
కమ్యూనిస్టు కనిపిస్తాడు
కరువుబాధితులమధ్య
కమ్యూనిస్టుంటాడు
ధనికులమధ్యనా
దేశభక్తులలోనూ వున్నాడు.
కాంగ్రెసువాదులమధ్య
లీగర్లమధ్యనా వున్నాడు.
నీ నీడలో వున్నాడు, నా నీడలో వున్నాడు
కమ్యూనిస్టులను అంతం జేయగలననుకునే
నీ కలను వదులుకో
వారు భరతమాత బిడ్డలు
ఓ ముసలివాడా, అనంతచారీ
ఈ విషయం తెలుసుకో

కమిటీ సభ్యులు దీనితో పూర్తిగా కలవరపోయారు. ఈ సమాధానం తమకు అవమానంగా భావించారు. ఆ సమాధానం జెప్పిన ఖైదీని పట్టుకుని బాదారు. ఆయన విడుదలసమస్యేలేదనిచెప్పి బారకాసులకు తిరిగి పంపివేశారు.

అలాంటి ఉదాహరణ లెన్నయినా పేర్కొనవచ్చు. విప్లవదీక్షతో వారు చివరికంటా పోరాడారు ఎవరైనా భయపడి రాజీనామా దాఖలుచేసినా, ఖైదీలకు వ్యతిరేకంగా అధికారుల ఏజెంటుగా వ్యవహరించినా అలాంటివారిని బాగా చితకదన్ని బారకాసులనుండి బయటికి త్రోసేవారు. బయటశత్రువుకు లొంగిపోయినవారి నిసయితం జైలుకు తీసుకొనివచ్చేవారు. వారిలో అధిక సంఖ్యాకులు ఖైదీలలో కనిపిస్తున్న అజేయమైన విప్లవాత్మకమైన ధైర్యాన్ని

గాంచి తమ లొంగుబాటుకు పశ్చాత్తాపం వెల్లడించేవారు. తమ కామ్రేడ్స్‌ను క్షమాపణకోరుకునేవారు. ఆతర్వాత ఎదురైన పరీక్షలకు తట్టుకొని నిలిచేవారు.

జైళ్ళ లోపల అలాంటి పోరాటాల మధ్యనే, పరిమితులున్నప్పటికీ, రాజకీయ తరగతులు నిర్వహించబడ్డాయి. అక్షరాస్యత కల్పించటానికి తరగతులుకూడా నడపబడ్డాయి ఇతర భాషలలో వారి పరిజ్ఞానాన్నికూడా పెంపొందించారు.

## విప్లవ ప్రచారం

సైన్యంచే పట్టుకోబడినవారు, వాళ్ళు కొట్టిన దెబ్బలకు, చిత్రహింసలకూ తట్టుకొని నిలిచారు. ఏ రహస్యాన్నీ వెల్లడించటానికి నిరాకరించేవారు. పైగా వున్నతాధికారులు క్యాంపులో లేనప్పుడు, సాధారణ సిపాయిలతో రాజకీయాలనుగూర్చి మాట్లాడేవారు. తెలంగాణా వుద్యమం ఆవిర్భావాన్నిగూర్చి అది పెంపొందటాన్నిగూర్చి, దానిలక్ష్యాలనుగూర్చి వారికి వివరించి చెప్పేవారు. దానికితోడు, ప్రతిఖైదీ తన స్వంతగాధను తనవర్గ పునాదినిగూర్చి తెలిపేవాడు. పార్టీలోకి తానేవిధంగా ఆకర్షించబడిందీ, తానెందుకు పోరాడుతున్నదీ మొదలగు విషయాలు చెప్పేవారు. సైనికుల పైన ఈ ప్రచార ప్రభావం కొంత వుండేది. జైళ్ళ లోపల సయితం, వారు ఈ విప్లవ కార్యక్రమాన్ని వదిలి పెట్టలేదు జైలు వార్డన్లను, యితర అధికారులను వ్యతిరేకిస్తూనే, వాళ్ళను తన్నుతూనే, వాళ్ళతోను, యితర నేరస్థ ఖైదీలతోనూ రాజకీయాలనుగూర్చి మాట్లాడుతుండేవారు వారిలో అనేకమందిని కమ్యూనిస్టు సానుభూతి పరులుగా తయారుజేశారు.

## జైళ్ళనుండి తప్పించుకుపోయిన ఘటనలు

నాలుగుగోడలమధ్య నిర్బంధించబడి వున్నప్పటికీ, ఖైదీలు సర్వదా వెలుపల జరుగుతున్న దాన్నిగురించే ఆలోచిస్తూ వుండేవారు. అవకాశం లభిస్తే చాలు, వెలుపలి విప్లవవాతావరణంలో అడుగుబెట్టాలనే ఎల్లప్పుడూ తహతహలాడుతూవుండేవారు అలాంటిఅవకాశాలకోసమే సర్వదా ప్రయత్నిస్తుండేవారు.

జైలు గోడలు చాలాఎత్తు. 24 గంటలూ వార్డర్లు, యితర సిపాయిలూ కాపలా గాస్తుంటారు బారకాసులన్నింటికీ రాత్రంతా తాళాలువేస్తారు. వీటన్నింటినీ అధిగమించి బయటపడటం సులభమైన పనికాదు ఎవరయినా, ఎలాగో జైలునుండి బయటికి చేరగలిగినా, జైలుగోడల వెలుపల సాయుధ

పోలీసు లుంటారు. ఎలాగో ఈ ప్రమాదాన్ని తప్పించుకున్నా, ఎక్కడబట్టినా మిలటరీ క్యాంపు లున్నాయి. శత్రు బలగం వాళ్ళు చురుకుగా పనిజేస్తున్నారు. వాళ్ళలో ఎవరిచేత జిక్కినా తక్షణమే చచ్చిపోవలసిందే. అయినా, అలాంటి ప్రయత్నాలు చేయకుండా మానలేదు. విప్లవ చర్యలలో పాల్గొనాలన్న వారి తపనయే ఆ విధమైన ప్రయత్నాలకు కారణం. జైళ్ళలోనుండి అలా తప్పించుకు పోయిన ఘటనలలోకెల్లా అత్యంత ప్రసిద్ధమైనది కా|మేడ్ నల్లా నరసింహులు (సీనియర్), నంద్యాల శ్రీనివాసరెడ్డి తప్పించుకొనటమే. వారిద్దరూ నల్గొండ జిల్లాకు జెందిన కమ్యూనిస్టు నాయకులు.



మిలటరీ శిక్షణ పొందుతున్న తెలంగాణా స్త్రీలు

## అధ్యాయం : 9

# తెలంగాణా పోరాటంలో స్త్రీల వీరోచిత పాత్ర

తెలంగాణా పోరాటంలో స్త్రీలు చాలా ప్రముఖపాత్రవహించారు. భూమికోసం, అధికవేతనాలకోసం, భూస్వాముల ధాన్యాన్ని-పశువులను పంపిణీ చేసుకోవటం మొదలైనవాటికోసం జరిగిన పోరాటాల్లో వారూ పురుషులకు తీసిపోలేదు. అడవులలోనుండి చిన్నచిన్న గూడేలనుండి కోయ, చెంచు, మొదలైన వారందరినీ తరిమివేసే 'బ్రిగ్స్ పథకాన్ని' పురుషులతో సమానంగా స్త్రీలూ ఎదిరించారు.

నైజాం-రజాకార్ వ్యతిరేకపోరాటంలోనూ, తర్వాత నెహ్రూ సైన్యాలకు కాంగ్రెస్ రజాకార్లకు వ్యతిరేకంగా పోరాటంలోనూ, తమ అన్న దమ్ములతో, భర్తలతోపాటు స్త్రీలూ పాల్గొన్నారు. వారూ దళాలలో చేరారు. మిగతా అన్ని దళాలతోపాటే, చీమలుదూరని చిట్టడవులలో, దూరానికి నునుపుగావుండే కొండల్లో, గుట్టల్లో, ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ కష్టసుఖాలు పంచుకున్నారు. స్త్రీలుకూడా కొరియర్‌లుగానూ, రాజకీయ ఆందో ళనకారులుగానుకూడా బాధ్యతలు స్వీకరించారు. వుద్యమం కొత్తగా విస్త రిస్తున్న ప్రాంతాలలో ప్రజావుద్యమాలలోనూ, ప్రజాసంఘాలలోనూ ప్రముఖ పాత్ర నిర్వహించారు. రజాకార్-నైజాం పోలీసులు, ఆ తర్వాత నెహ్రూ సైన్యాలు జరిపిన అమానుష, చిత్రహింసలకు ఎక్కువగా గురైంది, బలైందీ

స్త్రీలే! స్త్రీలనే విచక్షణలేకుండా చాలమందిని శతృవులు చింతబరికలతో వాళ్ళు
చెట్లిపోయేట్లు బాదారు వారిని అవమానించారు. చివరికి పశుత్వంతో, స్త్రీల
శీలంతోనే చెరలాటలాడారు తమ కండ్లముందే తమ ప్రాణంలో ప్రాణం
అయిన కన్నబిడ్డలను హింసిస్తుంటే, తమ అన్నదమ్ములను, భర్తలను అరెస్టుచేసి
కాల్చిచంపుతుంటే భరించవలసివచ్చింది శత్రువు దుర్మార్గంనుండి తప్పించు
కునేందుకో, గెరిల్లా దళాలలో జేరేందుకో, రహస్యజీవితం గడిపేందుకనో,
తమ యిళ్ళలో మగవారు వెళ్ళిపోతే పోలీసు లూటీల తర్వాత మిగిలివున్న
కొంప గోడు కాపాడుకోవలసిన బాధ్యత స్త్రీలపైనేబడింది

తమ ఆత్మగౌరవం కాపాడుకునేందుకు ఆ కిరాతక సైనికుల దౌర్జ
న్యానికి తమ ధన మాన ప్రాణాలు బలిగాకుండా రక్షించుకునేందుకు స్త్రీలు
చూపిన దీక్ష, ప్రతిఘటన, పోరాట పటిమ మనలను ఉత్తేజపరుస్తాయి. నాడు,
వారిలో కలిగిన వినూత్న చైతన్య నైతిక, సాంస్కృతిక జీవనంలో స్త్రీలలో
కలిగిన సరికొత్తమార్పు — ఇవన్నీ తలచుకుంటే ఆర్థికంగా, సాంఘికంగా
అణగారిన మన స్త్రీ జాతిలో ఎంతటి విప్లవదీక్ష, శక్తి యిమిడి వున్నాయోనని
ఆశ్చర్యానందాలు కలుగుతాయి వారిని సాంప్రదాయాల సంకెళ్ళనుండి విడి
పించి, నిద్రాణమైన ఆశక్తిని రగుల్కొల్పేందుకు కొంచెం శ్రమ తీసుకోవాలేగాని,
ఎంతటి శక్తివంతమైన తిరుగుబాటునైనా తీసుకురాగలం!

## భూమినిలుపుకోవటంలో స్త్రీల పాత్ర

విసునూరు దేశముఖు దురాక్రమణకు గురికాకుండా తన భూమిని
నిలబెట్టుకునేందుకై ఆంధ్రమహాసభ-కమ్యూనిస్టు పార్టీల సహకారంతో మొట్ట
మొదట తీవ్రంగా పోరాడింది జనగాం తాలూకా పాలకుర్తి గ్రామానికి
జెందిన చాకలి అయిలమ్మ తనకొడుకులను కూతుళ్ళను కూడా పార్టీకి
అండగా యెన్ని కష్టాలొచ్చినాసరే నిలబడమని ప్రోత్సహించిందామె. ఆంధ్ర
మహాసభ, కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలాకు భూస్వామ్య వ్యతిరేక పోరాటా
లకు ఆ వూళ్ళో వారిల్లే కేంద్రం అది ఆమె స్వార్థంకోసం జరిగిన పోరాటం
కాదు. తెలంగా రైతు తన 'గడ్డ'కోసం జరిపిన పోరాటపు తొలిదశ
కామె చిహ్నం.

మిర్యాలగూడెం తాలూకా ముకుందాపురంలో ఒక షావుకారు,
కుమ్మరి మట్టయ్యను భూమిస్వాధీనం చేయమని బలవంతపెట్టాడు మట్టయ్య
అంగీకరించక పోవటంతో, నైజాం సైన్యాల సహకారంతో మట్టయ్యను చిత్ర
హింసలుపెట్టి చివరికి చంపేయించాడు. కాని మట్టయ్య భార్య రంగంలో
దూకింది. ఈ భూమిని ససేమిరా వదిలేదిలేదంది. ఆమెనుపోలీసులు పశుత్వంతో

చెరిచారు. అయినా ఆమె దిగజారిపోలేదు. ఆ గ్రామప్రజలందరినీ తమ భూమికోసం జరిగే పోరాటంలో సహకరించమని వారిని కదిలించి తమభూమిని నిలుపుకొంది "అవును! ఆ భూమినాది!!" ఇదే ఆమె మాట

వాడపల్లిలో ఒక లంబాడీరైతును, భూమిని తనకు వొప్పగించనందుకు భూస్వామి హత్యచేయించాడు ఆతని భార్యకూడా పోరాటంలోకి దిగి, కాంగ్రెస్ పోలీస్ బీభత్సాన్ని యెదిరించి భూమి నిలుపుకుంది.

కొండ్రపోలులోనూ యింతే. 2 ఎకరాల మాగాణిభూమి సాగుచేసుకుంటున్న లంబాడీ రైతును ఆ భూమి తిరిగి తనకే దక్కాలని దత్తుడు అనే భూస్వామి చంపేయించాడు కాని రైతుభార్య ముందుకువచ్చి ఆ భూమి తానే నిలుపుకొంది. సిలారుమియాగూడెంలో భూమిని భూస్వామికి స్వాధీనం చేయనందుకు గొల్లముత్తయ్యను చంపేశారు. ఆయనభార్య మాత్రం, ఆ భూమిని తిరిగి భూస్వాములవశం కాకుండా పోరాడి సాధించింది.

మొద్దులకుంటలో ఒక లంబాడీ రైతు, రామకృష్ణమ్మ అనే భూస్వామికి జెందిన భూమిని కొద్దిగా ఆక్రమించుకున్నాడు నెహ్రూసైన్యాల ప్రవేశం అనంతరం ఆ భూమిని పోలీసుల సహాయంతో తిరిగి స్వాధీనం జేసుకొనటానికి అ భూస్వామి ప్రయత్నించాడు ఆ లంబాడి రైతును చితకబాది, యింట్లోంచి, పొలంలోనుంచి వెళ్ళగొట్టారు అయినా ఆయన భార్యమాత్రం తలవొగ్గలేదు. ఆ భూమిని దున్నుకుని పంటను యింటికి చేర్చుకోగలిగింది.

వీరారం గ్రామంలో తమ భూమిని భూస్వామి తిరిగి ఆక్రమించుకుంటుంటే, ఒకలంబాడీ రైతు, ఆతని భార్యకలిసి భూస్వాముల గూండాలను, పోలీసులను ఎదిరించారు – పోలీసులు గర్భవతిగానున్న ఆమె పొట్టపై కాలేసి తొక్కి చంపారు.

తెలంగాణా పోరాటానికి సంబంధించిన పాతఫైళ్ళలో కనిపించిన కొన్నిఘటనలివి. ఇలాటి ఘటనలు వందలాదిగా జరిగాయి నాడు ఆ పోరాటం మొత్తం కాలంలో ఎన్ని జరిగినయ్యన్నది అలా వుంచండి! వేలాది స్త్రీలు తమ పురుషులతోపాటు రంగంలో నిలబడి భూమికోసం, దక్కిన భూమిని నిలుపుకోటంకోసం పోరాడారు.

## కూలి పెంపుదలకోసం స్త్రీల పోరాటం

వ్యవసాయ కార్మికులలో చాలామంది స్త్రీలు. తాముకూడా కూలికి వెళ్ళి సంపాదించనిదే తమకు, తమ బిడ్డలకు ఒక్క పూటన్నా కడుపు నిండటం అసాధ్యం. ఒక్క పురుషుని సంపాదనతోనే సంసారం జరగదు. అందువలననే

వ్యవసాయ కార్మిక సమ్మెలలోనూ, భూస్వాముల, దొరల గడీలలోని గిడ్డం గులలోని ధాన్యం స్వాధీనం జేసుకు పంచుకొనటంలోను స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.

కొండ్రపల్లి ప్రాంతంలోనూ ఆ పరిసర ప్రాంతాలలోనూ కూలి రోజుకు రెండు లేక మూడు శేర్లుండేది. దాన్ని 4 శేర్లకు పెంచవలసిందని కూలీల సమ్మె జరిగింది. స్త్రీలు పెద్ద సంఖ్యలో కదిలారు. జెండాలు చేతబూని ప్రదర్శనలు చేశారు. భూస్వాములను లొంగదీసేందుకు, వారి ధాన్యపు కొట్లపై దాడిజేసి ధాన్యం స్వాధీనం చేసుకో మొదలెట్టారు. భూస్వాములు లొంగివచ్చి ఆ కూలికి వొప్పుకొనక తప్పలేదు.

గోదావరి తీర అడవులలో బీడీఆకు కోత ఒక పెద్దవృత్తి. వేలాది స్త్రీలు దానితో జీవనం గడుపుతారు బీడీ ఆకుకోతకు హెచ్చుకూలీ కావాలని జరిగిన పోరాటంలో స్త్రీలు ముందుపీటీన నిలిచారు.

పిండిప్రోలు, ఇల్లెందు పరిసర ప్రాంతాలలో 90 గ్రామాలలో వ్యవ సాయ కార్మిక సమ్మెలు జరిగాయి. దాదాపు 20 గ్రామాలలో ప్రత్యేకించి స్త్రీ కూలీల వేతనాల సమస్య ఇమిడివుంది. ఈ గ్రామాలలో స్త్రీలే ముందున్నారు.

పోలీస్ నిర్బంధకాండకు దాడులకు వ్యతిరేకంగా నిజాం రజాకార్ వ్యతిరేక పోరాట దినాలలోకూడా సాయుధసైనికులు, బాలేముల,పాతసూర్యా పేట, మల్లారెడ్డిగూడెం, దేవరుప్పల తదితర అనేక గ్రామాలపై దాడిజేసి నప్పుడు వారిని వడిశలలతో ప్రతిఘటిస్తున్న పురుషుల ప్రక్కనే నిలబడి వడి శలకి రాళ్ళందించారు స్త్రీలు ఈ కార్యక్రమంలో నిమగ్నమయిన ఒక స్త్రీ మల్లారెడ్డిగూడెంలో పోలీసు కాల్పులలో బలైపోయింది. (ఈ సందర్భంగా గాజుల్లంకలో మరణించిన వియ్యమ్మ గుర్తుకువస్తున్నది. ఆమె చల్లపల్లి జమీం దారుకు వ్యతిరేకంగా కృష్ణాజిల్లాలో పోరాడుతున్నప్పుడు పోలీసు లామెను సన్నీలతో పొడిచి చివరకు కాల్చి చంపారు ) పురుషులను మిలటరీ లారీలలో యెక్కించుకుపోతుంటే తమను కూడా వారితోపాటు తీసుకుపోవాలని వారి నేమి చేసినా తామూ అందులో భాగంపంచుకోవాలని స్త్రీలు లారీలను నిలేసే వారు. చివరకు వీళ్ళను కూడా కొంతమందిని లారీలలో యెక్కించుకుంటే తప్ప లారీలు కదిలేవికావు

భారతసైన్యాలు ప్రవేశించి కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పాటుజేసిన తర్వాత హుజూర్‌నగర్ తాలూకాలో విజయనగరం కేంద్రంలోనూ, మిర్యాల గూడెంలోనూ పోలీసులు చాలామంది పురుషులను పట్టుకొని లారీలలో ఎక్కించుకున్నారు. స్త్రీలందరూ లారీలను చుట్టుముట్టారు. పురుషులందరినీ

విడుదల చేయవలసిందిగా డిమాండ్ చేశారు. పదేపదే లాఠీచార్జిచేసినా వారు జంకలేదు గత్యంతరంలేక వాళ్ళ నక్కడేవదిలేసి వెళ్ళిపోవలసివచ్చింది.

గోదావరి అడవులలో గుండాల కోయగూడెంలో పోలీసులు చాలామంది మగవాళ్ళను పట్టుకుని, వాళ్ళను తీసుకుపో యత్నించుతుండగా ఈ సంగతి తెలియటంతోటే, ప్రక్కనేవున్న 10 గూడేలనుండి స్త్రీలు కదిలి వచ్చారు. పోలీసులను చుట్టు ముట్టారు. పోలీసులు కాల్పులు సాగించారు. అయినా చెట్లచాటునుండి రాళ్ళు విసురుతూ పోలీసులను నిలేశారేగాని వారు చెదిరిపోలేదు. చివరికి, పోలీసులు మగవారిని వదిలివెళ్ళకతప్పలేదు.

గుండాల ప్రాంతంలోనే, కట్టుగూడెం అనే కోయపల్లెపై మిలటరీ దాడి చేసినప్పుడు, గూడెంలోని స్త్రీలు, పురుషులు కలిసి ప్రతిఘటించారు. వారు ఒక సుబేదారును, ముగ్గురు సైనికులను చంపి వారి ఆయుధాలు గుంజు కున్నారు. సైన్యం పారిపోయింది. తర్వాత సైన్యం పెద్ద బలగాన్ని సమీ కరించుకుని మళ్ళీ యీ గూడెంపై దాడికి వచ్చింది గూడెం మొత్తంగా నట్టడివిలోకి వెళ్ళి తలదాచుకుంది. ఆ సందర్భంలో స్త్రీలు చూపిన ఓర్పు, సహనం, దీక్ష మరపురానివి. చివరికి వాళ్ల పిల్లలు యేడిస్తే శత్రువుకు తమ వునికి తెలిసిపోతుందని, వారిని ఏడవకుండా నోళ్లుమూశారు ఆ సందర్భంలో యెదురైన యెన్నో యిబ్బందులను యెదుర్కొని స్త్రీలలోవున్న పట్టుదల, కృతనిశ్చయం, మొండితనం నిరూపించారు.

రాజారం కేంద్రంలో లంబాడీ దంపతులిద్దర్ని గెరిల్లాలకు సహాయ పడుతున్నారన్న అనుమానంతో పోలీసులు క్యాంపుకుతీసుకెళ్ళారు. రహస్యాలు రాబట్టేందుకు తిండీతిప్పలు నీళ్లూ లేకుండా వాళ్ళని నిలబడే వుండమన్నారు. స్పృహదప్పి పడిపోతే కాసిని నీళ్ళిచ్చి స్పృహ వచ్చిన తర్వాత, మళ్ళీ నిలబెట్టేవారు. రజాకార్లు యింతగా బాధించినా, వారి కాళ్ళు వాచిపోయి చచ్చిపోయేందుకైనా సిద్ధపడ్డారుగాని, వారొక్క రహస్యంకూడా చెప్పలేదు. ఇంత మొండివాళ్ళతో లాభంలేదని శత్రువు చివరకు వాళ్ళని వదిలేశాడు.

చిదిరాల ? (చెలకుర్తి) గ్రామపంచాయితీ సభ్యుల భార్యలందర్నీ, మిలటరీ చెలకుర్తి క్యాంపుకు తీసుకునివెళ్ళి "యెన్నిసార్లు దాడిచేసినా మీ భర్తలు దొరకటంలేదు. వారి జాడ చెప్ప"మని యీ స్త్రీలను నానాబాధలు పెట్టారు. కొంతసేపటికి వదిలేస్తూ 'ఇంతకుముందు మీ యిళ్ళమీదపడి మీ పశువులను, పంటను లూటీచేశాం. ఇకముందు మీకుకూడా ముప్పు! మీ భర్తలు దొరకకపోతే మిమ్మల్ని పట్టుకువెళ్ళి శాశ్వతంగా జైళ్ళలో పెడతాం

జాగ్రత్త" అని బెదిరించారు. తిరిగివచ్చిన ఆ స్త్రీలు ద్విగుణీకృతోత్సాహంతో తమ భర్తలతోపాటు ఉద్యమంలోచేరి, మళ్ళీ పోలీస్ దాడుల సమయానికి తాము కూడా అందుబాటులో లేకుండా దాటుకుపోయారు.

ఇదే గ్రామంలో 150 మంది పోలీసులు తిష్టవేసి స్థానిక నాయకులను బంధించజూచారు కాని ప్రయోజనం లేకపోయింది పంచాయితీ కమిటీ సభ్యుని కొడుకు 14 సంవత్సరాల బాలుడొకడు దొరికాడు. అతనిని, అరెస్టుజేసి భయపెట్టి, బాది, "మీ నాయన యెక్కడో చెప్పమని" హింసించారు. అంత చిన్న పిల్లాడుకూడా ఒక్క విషయంకూడా పోలీసులకు చెప్పక పార్టీ ప్రతిష్ఠ నిలబెట్టాడు.

గెరిల్లా దళాలే, పార్టీ నాయకులో తమ తమ యిళ్ళల్లో తలదాచుకుంటుంటే ఆ యిళ్ళల్లో స్త్రీలు ఆ విషయం బయటకు పొక్కనీయకుండా వుండేందుకు, తగు జాగ్రత్తలు తీసుకునేవారు. పార్టీ నాయకులు నిద్రిస్తుంటే అవసరమైతే రాత్రల్లా యీ స్త్రీలు జాగారంచేస్తూ కాపలా కాసేవారు. ఎంత రాత్రివేళ దళాలు, తమ యిళ్ళకు వచ్చినా, యెంతో ఆప్యాయంగా, వారికి భోజన సదుపాయాలు చూసేవారు. గెరిల్లా దళాలు అడవులలోనో గుట్టలలోనో దాక్కుంటే, వారికి ఆహారం తీసుకువెళ్లేవారు దురదృష్టవత్తూ, వారిలో పోలీసులకు చిక్కితే, యెన్నో చిత్రహింసలకు, అవమానాలకు గురయ్యేవారు. ఆ మహత్తర పోరాటానికి దీటుగా వారు వాటన్నింటిని భరించేవారు.

ఎన్నో గ్రామాలలో, ఎంతోమంది యిళ్ళల్లో 1948-51 లో తీవ్ర పోరాటదినాల్లో నేను వుండవలసివచ్చింది. ఆ ఇళ్ళలో స్త్రీలు అతి జాగ్రత్తగా నన్ను ఆదరించిన విషయం వినమ్రతతో, కృతజ్ఞతతో కలకాలం జ్ఞాపకం వుంచుకుంటాను. ఉదాహరణకు రాత్రల్లా నడిచి, పీరుళ్లపాడు వూరుబయట వున్న కామ్రేడ్ పాటిబండ్ల జానకిరామయ్య యింటికి రాత్రి 2 గంటలకు చేరుకున్నాను. సమయానికి ఆయన ఇంట్లోలేడు. నేను చాలాఅలసిపోయి పడుకొని నిద్రపోయాను. తెలతెల వారుతుండగా మెలకువవచ్చింది. చూద్దునుగదా, ఆయన భార్య హనుమాయమ్మ నిండుగర్భిణి. గుమ్మంవద్దనే కాపలాకాస్తున్నది. స్త్రీలు చూపిన ఆ ఆప్యాయత, మెలకువ, నాడు రహస్యజీవితం గడిపిన కామ్రేడ్స్‌కి అందరికీ అనుభవమే ! ప్రజల ఆశయంపట్ల వారిప్రేమ ఆదరణ అలాంటిది ! మహోన్నతమైన ఆశయంకోసం పోరాడుతున్న మేమంటే వారిలో అంత గౌరవాభిమానాలుండేవి !

అంత విలువైన క్షణాలు. వుత్తేజపరిచే ఘటనలు, ధైర్యసాహసాలకు బాధ అవమానాలకు ప్రతీకగానిల్చిననాటి రోజులుఎప్పటికైనా మర్చిపోగలమా?

బెండలపాడు గ్రామంలో రాజమ్మ అనే రైతు వనితను పట్టుకున్నారు. దళాలకు అడవులలోకి అన్నం తీసుకువెళ్తున్నదని ఆమెపై ఆరోపణ! ఎఱ్ఱగా యినప కడ్డీలుకాల్చి ఆమెకు, ఆమె భర్తకూ వాతలు పెట్టారు ఆమె రొమ్ముపై మెడమీద, చేతులమీద వాతలు పెట్టారు. కాని దళాలనుగూర్చి ఒక్కమాట కూడా వారినోటినుండి బయటకురాలేదు నాటినుండి నేటివరకు వారు పార్టీకి అంటి పెట్టుకునేవున్నారు. 1961 లో ఒకసారి మళ్ళీ ఆ దంపతులను చూసే అవకాశం నాకు కలిగింది. పార్టీ యెడల వారి విశ్వాసం, భక్తిశ్రద్ధలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి

నేరెడ గ్రామం వుద్యమానికి బలమైన కేంద్రం. డి. యస్. పి. శ్రీనివాసరావు, హైదరాబాద్ అడ్మినిస్ట్రేటర్ వెల్లోడి దాన్ని తగులబెడతామని బెదిరించారు. ఒకసారి ఆ గ్రామంలో 70 మంది స్త్రీలను పట్టుకుని చింతబరికలతో బాదారు ఆ కిరాతకులు అంతటితో వూరుకోలేదు. వారికి పైజమాలు తొడిగించి పాదాలవద్ద గట్టిగా బిగగట్టి పైజమాలోపలికి తొండలను వదిలారు. ఆ సమయంలో స్త్రీలబాధ వర్ణనాతీతం. పైగాగాయాలపై కారంచల్లారు.ఐదు మాసాలవరకూ వారు అనారోగ్యంగానే వున్నారు

మరొక రోజున మిలటరీ వాళ్ళు స్త్రీలను నిర్బంధించి తమ పసిబిడ్డలకు పాలివ్వనీయలేదు – ఆ పిల్లలు తల్లి పాలకోసం ఒకటే యేడుపు–అయినా, యీ స్త్రీ లెవ్వరూ యే రహస్యమూ చెప్పలేదు.

ఈ గ్రామంలోనే ఒకసారి ఒక దళ నాయకుణ్ణి పోలీసులు చుట్టేశారు. వెంటనే స్త్రీలంతా కలసి, ఆ నాయకుడికి ఆడపిల్ల వేషంవేసి 'పెద్దమనిషి' అయినట్లు కూర్చోపెట్టి, చిమ్మిరి తొక్కి, పాటలు పాడుతూ, పోలీసులను మోసపుచ్చి పోలీసులు వెళ్ళిన తర్వాత, ఆ దళ నాయకుణ్ణి జాగ్రత్తగా మరొక రక్షణ స్థావరానికి తీసుకెళ్ళి విడిచి వచ్చారు.

సూర్యాపేట తాలూకా వల్లభాపురంలో భీమ్లా – వాత్స్య అనే లంబాడీల యిళ్ళలో స్త్రీలు వారి యింటిని ఒక రక్షణ స్థలంగా వుంచేందుకు యెన్నో జాగ్రత్తలు తీసుకునేవారు. నైజాం రజాకార్ దినాలనుండి కాంగ్రెస్ సైన్య ప్రవేశం తర్వాతకూడా వారియిల్లొక సురక్షిత ప్రదేశంగా వుండేది. ఆ తర్వాత వారిని అరెస్టుజేసి కాల్చిచంపారు. అయినా ఆ తర్వాతకూడా వారి యిండ్లలోని స్త్రీలు పార్టీ వుద్యమాలకు శాయశక్తులా సహకరిస్తూవచ్చారు.

● ● ●

సూర్యాపేట తాలూకా పర్సాయపల్లికి చెందిన అచ్చమ్మ, జోనల్ నాయకుడు, ఆ తర్వాత సూర్యాపేట తాలూకా ప్రాంతీయనాయకుడుగావున్న

కా|మ్రేడ్ అనిరెడ్డి రామిరెడ్డిని చాలాకాలం కంటికిరెప్పలా యింట్లోపెట్టుకు కాపాడింది. రామచంద్రపల్లిలో అనిరెడ్డి రామిరెడ్డి భీకరంగాపోరాడి తనదళం తప్పించుకునేందుకు దోహదపడి, అమరవీరుడైనాడన్న వార్తవిన్న అచ్చమ్మ దుఃఖానికి అంతులేదు. తన కన్నబిడ్డనుపోగొట్టుకున్నట్లు ఆమె విలపించింది.

లింగమ్మ సూర్యాపేట తాలూకాలో చిల్పకుంట గ్రామవాసి. ప్రజా శత్రువగు భూస్వామి జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో లింగమ్మ ముందుంది. తన కుటుంబం మొత్తాన్ని ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీలలో చురుకుగా పనిజేసే ప్రోత్సాహాన్ని, వుత్సాహాన్ని యిచ్చేది.

పోరాటానికి చాలాకాలం పూర్వమే తన కుమార్తెను లింగారెడ్డి అనే అతనికి పెళ్ళిచేసింది లింగారెడ్డిని నిత్యం ప్రోత్సహిస్తూ పార్టీలోకి పంపింది. క్రమేపీ లింగా రెడ్డి దళనాయకుడైనాడు.

అతడు చాలాసార్లు జన్నారెడ్డి గుండాలను తరిమికొట్టాడు. కానీ 1952 ఎన్నికలలో లింగారెడ్డి జన్నారెడ్డి భూస్వామితో లాలూచీ పడ్డాడు. లింగమ్మ, అల్లుణ్ణి యింటికి రానీయనేలేదు. తాను తన కూతురు కలిసి, తన అల్లుడు బలపరుస్తున్న అభ్యర్థికి వ్యతిరేకంగా తీవ్రంగా పనిచేసి వోడించారు. క్రమేపీ లింగారెడ్డికి వాస్తవం తెలిసింది జన్నారెడ్డి దుర్మార్గాలు సాగుతూనే వుండటం గమనించి లింగారెడ్డి మళ్ళీ తన పొరపాటు తెలుసుకుని ప్రజావుద్యమాలలోకి వచ్చాడు. తాను చేసిన తప్పులకు పరిహారంగా, జన్నారెడ్డి గూండాలతో పోరాడాడు అది జరిగిన తర్వాతనే లింగమ్మ అల్లుణ్ణి-కూతుర్ని తనగడప తొక్కనిచ్చింది.

## కొందరు వీరనారుల గాథలు

లచ్చుమ్మ · నడిగడ్డ గ్రామం. చాకలి. దళాల బట్టల్నివుతకటమే గాక వారికి ఆహారం జేరేసేది. భారత సైన్యానికి ఒకదాడిలో ఆమెదొరికింది. ఆమెను వివస్త్రనుజేసి, తల్లక్రిందులుగా చెట్టుకు వేళ్ళాడదీసి, లాఠీలతో, పేము బెత్తాలతోవాళ్ళంతా పెట్లిపోయేట్లుకొట్టి "రాములమ్మ ఎక్కడుందో" చెప్పమని హింసించారు అందుకు లచ్చుమ్మ మౌనమే సమాధానం విసిగి ఆమెను వది లేశారు. దళాలు, స్థానిక పార్టీ అభిమానులు ఆమెకు జాగ్రత్తగా వైద్యం చేయించిన పిదప ఆమెకోలుకుంది.

ఒకసారి లచ్చుమ్మ బట్టలుతుక్కుంటుంటే ఆ దారినే వెళ్తున్న రాములమ్మ కన్పించింది. లచ్చుమ్మ పరుగెత్తుకుంటూ వెళ్ళి, సంతోషంతో రాములమ్మను కౌగలించుకుంది. ఇద్దరూ చాలాసేపు అట్లా ఒకళ్ళనొకళ్ళు పట్టుకుని ఏడుస్తునేవున్నారు. ఆ తర్వాత రాములమ్మను తీసుకువెళ్ళి శుభ్రంగా

తలంటిపోసి లచ్చమ్మ యిష్టాగోష్టి మొదలెట్టింది. ఇంతలో ఫూళ్ళోఅందరికీ రాములమ్మ రాక యెరిక అయివచ్చి నాడు లచ్చమ్మనుపెట్టినబాధలు అన్నీ రాములమ్మకు వివరంగాచెప్పి లచ్చమ్మలాంటి స్త్రీ తమ గ్రామంలో వున్నందుకు వారెంతో గర్వపడ్డారు. వారే యేం! నిజానికి లచ్చమ్మలాంటి స్త్రీమొత్తం తెలంగాణాకు, యావద్భారతదేశానికే గర్వకారణం.

జైనాబీ రాజారం గ్రామంలో ఒక పేదకుటుంబీకురాలు. చిన్నతనానే భర్తపోయాడు ఒక్క కొడుకు, తమ్ముడు తానూ కూలికిపోయి దాని మీద బ్రతికేవారు చల్లా సీతారామిరెడ్డి-ఆదిరెడ్డి దళం ఆ దగ్గర గుట్టలనే కేంద్రంగా చేసుకు పనిచేస్తుండేది. ఆ దళానికి ఆహారం అందించివస్తుండేది జైనాబీ భారత సైన్యాలు వచ్చిన తర్వాత పార్టీకి బాగా పలుకుబడిగల గ్రామాలన్నింటా పెట్టినట్లే రాజారంలోనూ ఒక మిలటరీ క్యాంపు పెట్టారు దానికి జైనాబీ భయపడకుండా, అదివరకుకన్న యెక్కువ జాగ్రత్తలు తీసుకుంటూ మరింత ధైర్యంగా దళాలకు ఆహారం చేరవేసే కార్యక్రమం సాగించింది. ముగ్గురు గెరిల్లా దళసభ్యులు పొరపాటున దారితప్పి దళాలను కల్సుకోలేక పోతే, వారికి రక్షణయిచ్చి మెల్లగా దళ కేంద్రానికి పంపివేయగలిగింది.

ఒకరోజు మిలటరీ ఆమె యింటిపై దాడిచేసి, ఆమెను బాది "సీతారామిరెడ్డి యెక్కడున్నాడో చెప్పు-నిన్ను వదిలేస్తాం" అంటూ హింసించారు. "నాకు తెలియదు" అన్నదే ఆమె జవాబు జమేదారు ఆమెను బూటుకాళ్ళతో తొక్కాడు వారి హింసాకాండకు తట్టుకు నిలిచి, మళ్ళీ పార్టీ కార్యక్రమాలలో పాల్గొంది. పేదరికం జైనాబీకి అనుభవమే! అందుకే ఆమెకు పార్టీ అంతే అంత ప్రేమ, విశ్వాసమూ.

• • •

ప్రొద్దుటూరు ప్రాంతంలో జమేదార్ ఘాతుకాలకంతులేవు. ఆ చుట్టుప్రక్కల గ్రామాలైన లక్ష్మీపురం, కొత్తగూడెం, గోవిందాపురం, గార్లపాడు, నేరెడ గ్రామాలపై దాడిచేయని రోజులేదు. వాడికితోడు సీతయ్య అనే భూస్వాముల కిరాయి గూండా ఒకడు. వీరిద్దరూకలసి ఒక్క రోజునే 7 గురిని చంపించారు. ఆ ప్రాంత ప్రజలంతా గౌరవించె రామచంద్రారెడ్డిని చంపివేశారు వీళ్ళిద్దర్నీ హతమార్చే కార్యక్రమంతో, ఒక దళ నాయకుడు ఆ గ్రామానికి వచ్చాడు. నైజాం వ్యతిరేకపోరాటంరోజుల నుండీ, పార్టీకి సానుభూతిగావుండే ముస్లిం కుటుంబం ఒక్కటివుంది. వారింటికి ఈ కామ్రేడ్ వచ్చేసరికి అర్ధరాత్రి దాటింది. ఆ నాయకుణ్ణి అదివరకే ఎరిగి

వున్న ఆ యింటి ముసలమ్మ ఈ కామ్రేడ్‌ను సాదరంగా ఆహ్వానించి, ఆప్యాయంగా భోజనం పెట్టింది. అతడొచ్చినపని తెలుసుకున్న ఆమె సంతోషం యింతింతకాదు.

కాని ఇంతలో ఈ దళ నాయకుని కొరియర్ కృష్ణమూర్తి పట్టుబడ్డాడని తెలిసింది. వెంటనే రానున్న ప్రమాదాన్ని కామ్రేడ్ గుర్తించాడు ఆ కొరియర్ గనుక చిత్రహింసలుభరించలేక అసలు విషయంచెప్తే ఈ కుటుంబం మొత్తాన్ని మట్టిపాల్జేస్తారా దుర్మార్గులు ఆమెకు పరిస్థితిని వివరించి చెప్పాడు. అచ్చటినుండి తప్పుకోవాలని నిర్ణయించుకున్నాడు. దరిదాపులో ఎవ్వరూలేని సమయంచూచి యీ కామ్రేడ్ దాటుకుపోయాడు ఇతరులెవ్వరికీ కనపడకుండా తన తుపాకిని జాగ్రత్తగా దాచుకుని మరీ వెళ్ళాడు.

ఒక నెల తర్వాత అదే దళనాయకుడు ఆ యింట్లోబసచేసి, ఆ జమేదారును, పీడకుడైన సీతయ్యను మట్టుబెట్టాడు.

ఈ విధంగా నాటి తెలంగాణాపోరాట మహోన్నత దినాల్లో స్త్రీలు, పురుషులు, ప్రజల బాగుకోసం, శత్రువులను హతమార్చేందుకు, ఎంతటి సాహసోపేత కార్యాలనయినా – తమ ప్రాణాన్ని సైతం లెక్కచేయకుండా నిర్వహించేందుకు ముందుకువచ్చారు.

హాము – మంగిలీ : ధర్మాపురం పశ్చిమాన లంబాడి తండాలో నివసించేవారు. విసునూరు దేశముఖ్ కొడుకు 'బాబు' యీ తండాపై దాడి చేశాడు. హాము, అతని కొడుకులను వారిలో ముఖ్యుడైన కేంద్ర కార్యకర్త ధానూను పట్టుకునేందుకు దాడి జరిగింది. కనపడ్డవాళ్ళనల్లా నానాబాధలుపెట్టి చివరకు ధాను తల్లిదండ్రులు హమూ, మంగిలీలను పట్టుకున్నారు. విళ్ళిద్దర్నీ చిత్రహింసలు పెట్టడం మొదలెట్టారు మంగ్లిని ప్రత్యేకించి ! అంతబాధలోనూ ఆమె విసునూరు దేశముఖ్‌ను తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టింది. పైపెచ్చు గ్రామ ప్రజలందర్నీ తిరగబడి విసునూరు దేశముఖ్‌పై ప్రతీకారం తీర్చుకోండని వుసికొల్పటం మొదలెట్టింది.

అయిదుగురుయువకులనువిడదీసి, వారిచే చితులుపేర్పించి 'ధాను'ను గురించి చెప్పమని, బాధించారు "మమ్మల్ని కాల్చు ! చంపు ! ఒక్క గెరిల్లా జాడకూడా చెప్పబోమన్నదే వారి సమాధానం ! వారిని తుపాకితో కాల్చి చితిపైవేసిదహనంచేశారు దాను అన్న, హాము–మంగిలీ కొడుకు సోమ్లాకూడా ఆ ఐదుగురిలో ఒకడు. వృద్ధులైన తల్లిదండ్రుల కళ్ళముందే అయనను చంపివేశారు అతని మిగతా సహచరులు రెడ్డియా, బలరాం, చంద్రు, రాము.

రెండు నెలల తర్వాత మళ్ళీ దాడిజరిగింది. ఈసారి మంగిలీని ప్రత్యేకించి మరీ హింసించారు. బోడ ఘోలియా, బోడ తమినియా, జత్రవేధ్ ధాడా అనే ముగ్గురు యువకులను కాల్చిచంపారు.

ఎన్ని బాధలకు చిత్రహింసలకు గురైనా మంగిలీ దిగజారిపోలేదు. వారి నలుగురు కొడుకుల్నీ జైల్లోపెట్టారు. కోడళ్ళను, మనుమలనుకూడా విడిచిపెట్టకుండా హింసించారు. అయినా ఆ దంపతులు ఎర్రజండాను విడువ లేదు. మంగిలీ ఆప్రాంత ప్రజలందరికీ వుత్తేజం కలిగించే స్త్రీగా నిలిచిపోయింది. భారత సైన్యాల ప్రవేశం తర్వాతనే దళాలు విసునూరు బాబును హతమార్చి ప్రతీకారం తీర్చుకున్నాయి. చివరకు భారతసైన్యాలుధానూను పట్టుకున్నాయి. శత్రువులచేతుల్లో ధాను అసువులు బాశాడు. మంగిలీ మనుమలు జనార్ధన్‌ను, కొమరయ్యనుకూడా పోలీసులు అరెస్టుజేశారు. కొమరయ్యను చంపివేశారు. కాని జనార్ధన్ తప్పించుకుని రహస్యజీవితం గడుపుతూ, పోరాటకాలమంతా కార్యక్రమాలలో పాల్గొన్నాడు.

1951 నాటికి మంగిలీ బాగా పెద్దగయిపోయింది. అయినా ఆమె, మూడేళ్ళపాటు జైళ్ళలో గడిపిన మిగిలిన నలుగురు కొడుకులు, మనుమలు అంతా పార్టీకి ముఖ్యులుగావుంటూ అరుణపతాక గౌరవ ప్రతిష్ఠలను యినుమడింప జేశారు.

● ● ●

నేరెడలో వెంకయ్య, అనంతయ్య, సీతయ్య– వీళ్ళ కుటుంబం, వీళ్ళ యిళ్ళలో స్త్రీలు, వీరిభార్యలు, చెల్లెళ్ళు – రోశమ్మ, లచ్చమ్మ, నాంచారమ్మ – వీరందరూ కలిసి, శత్రువుచేతిలో చిక్కిన దళ నాయకుడొకరిని మృత్యముఖం లోంచి కాపాడారు మిలటరీ ఆగ్రామంపై దాడిచేసి వెంకయ్య కుటుంబాన్ని ప్రత్యేకించి చితకబాదారు. ఆ యింట్లోనే దళ నాయకుడు తలదాచుకున్నాడు– ఎంత బాధించినా, యెవ్వరూ, దళ నాయకుడి జాడ చెప్పలేదు. వెంకయ్య శరీరంలో రక్తంకారని చోటులేదు. తర్వాత డాక్టర్లు వెంకయ్య శరీరం మొత్తం కట్టుకట్టాల్సివచ్చింది. అతని చర్మం దాదాపు వూడిపోయింది. అయినా వెంకయ్య నోరు జారలేదు. నేరెడలో వెంకయ్య కుటుంబం పార్టీ కుటుంబం, పార్టీకోసం, ఆ కుటుంబంలో చిన్నా పెద్ద స్త్రీలు, పురుషులూ, అందరూ త్యాగం చేసినవారే.

● ● ●

మల్లికాంబ . భర్త పాలడుగు బ్రహ్మయ్య. పోరాటం మొదలవ టానికి 10 సంవత్సరాల ముందే మరణించాడు. ఆమె 6 గురు పిల్లల్ని పోషిం చాలి ! పెద్దకొడుకు వెంకటేశ్వర్లు దళాల్లో జేశాడు వారిది ఖమ్మంజిల్లా

ముద్దేపల్లి. ఆమె పార్టీకి యెంతో సహాయకారిగా వుండేది రజాకార్‌లు గ్రామంపై దాడిచేసి దోచుకుంటున్నారు. ఈలోపల మల్లికాంబ, మచ్చా వీరయ్య దళానికి ఈ విషయం కబురందించింది. దళం వచ్చి యీ రజాకార్‌లను తరిమికొట్టి, వారు దోచుకున్న దాన్ని తిరిగి ఎవరివి వారికి యిచ్చేసింది

ఆమె ఇంటిపై రజాకార్‌లు ఎన్నోసార్లు దాడిచేసి ఆమెను హింసించారు. ఆమె కొడుకు వెంకటేశ్వర్లు దళాలకు మందులు కొనేందుకై విజయవాడ వెళ్తే అతన్ని అరెస్టుచేసి, మునగాల క్యాంపులో చిత్రహింసలు పెట్టి చివరికి ఖమ్మం "బోనుకు" తీసుకువెళ్ళారు ఆమెనుకూడా క్యాంపుకు తీసుకువెళ్ళి 4 రోజులపాటు, యమయాతనలు పెట్టారు. ఆమె పంటలన్నీ నాశనం చేశారు. అయినా ఆమె మాత్రం, తన యింటిని దళాలకు, పార్టీ కార్యకర్తలకు, రక్షణ కేంద్రంగా నిర్వహిస్తూనే వుండేది.

● ● ●

*ఎర్రమ్మ* హుజూర్‌నగర్ తాలూకా రంగాపురం గ్రామవాసి అయిన ఎర్రమ్మ తన కుమార్తె అనసూయను గెరిల్లా నాయకుడు పార్టీ నాయకుడునగు కామ్రేడ్ మేదరమెట్ల సీతారామయ్యకు వివాహం చేసింది. రంగాపురంలో తన ముదుసలితల్లి రంగమ్మలాను యింకోచిన్న కుమార్తెతోను వుండేది ఆమె అన్న రాఘవయ్యకూడా పార్టీ అభిమాని

రజాకార్ దినాల్లో ఆమెయింటిపై దాడిచేసి ధ్వంసంచేశారు. వ్యవసాయం సాగనివ్వకుండా పొలాలను బీడుగానే వుంచేట్లు చేశారు. ఆమె ముదుసలితల్లి కొంచెం ఆందోళన చెందిందిగానీ నిబ్రదొక్కుకుంది రజాకార్లను అణచివేసిన తర్వాత రక్తపాతం జరపటం, చిత్రహింసలు పెట్టటం భారతసైన్యాల వంతయింది. రంగాపురం, ప్రత్యేకించి ఎర్రమ్మ కుటుంబం పదేపదే దాడికి గురయ్యారు. ఆ రోజు స్వూరిలో కొందరితోపాటు ఎర్రమ్మను ఆమె తల్లిని, ఆమెబిడ్డ అనసూయను అరెస్టుచేశారు. ఈ ముగ్గురిని కొక్కిరేణి క్యాంపుకు తీసుకువెళ్ళి తిట్టి, కొట్టి బెదిరించి చివరకు మంగలివాళ్ళచేత జుట్టుతీయించి అవమానించారు మంగళ్ళు కూడా మొదట్లో ఆ పనికి అంగీకరించకపోతే, వాళ్ళని చితక బాదించారు. తమ నాయకుల కుటుంబానికి జరిగిన అవమానానికి గ్రామం యావత్తు అట్టుడికినట్టుడికి పోయింది. కానీ వారేం చేయలేకపోయారు.

చివరకు ఎర్రమ్మ కుటుంబం రంగాపురం వదిలిపోవలసి వచ్చింది. అయితే ఏ బంధువుల యింటికివెళ్ళి తలదాచుకుందామనుకున్నా, ఆ బంధువుల యింటిపైకూడ మిలటరీ దాడిచేసేది. వేద్రాదివెళ్ళి దేవాలయం దాపున ఒక

గుడిశలో తలదాచుకున్నారు. అయినా ఆ కుటుంబం భయపడలేదు. దానికి తోడు కామ్రేడ్ సీతారామయ్య అప్పుడప్పుడు వెళ్ళి కన్పించి వారికి ధైర్యం చెప్పి వస్తూండేవాడు. ఇక్కడా వారిని ఎక్కువకాలం వుండనివ్వలేదు. ఇక గత్యంతరంలేక. ఎర్రమ్మ తన చిన్న కూతుర్ని ఎక్కడో ఒక దూరపు బంధువు యింటికి పంపింది. ఎర్రమ్మ తల్లి, మనుమరాలు అనసూయను తీసుకుని, గుంటూరు వెళ్ళింది. అనసూయ గుంటూరులో పుగాకు కంపెనీలో పనిచేస్తూ ఆ పోరాటకాలమంతా ఆ స్వల్పవేతనంతోనే కాలం గడిపింది. పోరాట విరమణ తర్వాత వారు స్వగ్రామం తిరిగి వచ్చారు. కాని సీతారామయ్యమాత్రం తనమీద వారంట్లు వుపసంహరించబడనందువల్ల చాలా కాలంవరకూ రహస్య జీవితం గడపాల్సి వచ్చింది.

● ● ●

రాంబాయమ్మ : పిండిప్రోలు గ్రామానికిజెందిన రాంబాయమ్మ చిన్నవయస్సులో భర్తను గోల్పోయింది. పిండిప్రోలు గుట్టలు, రజాకార్ క్యాంపులపై దాడికి పార్టీ కేంద్రంగా వుం డేది. ఈ కేంద్రానికి, దళాలకు రాంబాయమ్మ చాలా సహాయం చేసేది ఉద్యమానికితోడ్పడటంకోసం చుట్టు పట్ల గ్రామాలలోని స్త్రీలందరినీ సమీకరించేది. కొలదిమాసాల తరువాత ఆమెను అరెస్టుచేసి వరంగల్ జైలులో నిర్బంధించారు అచ్చట ఆమె18నెలలు గడిపింది జైల్లో స్త్రీలకు కనీససౌకర్యాలులేవని, అవి కలిగించమని 150 మంది స్త్రీ ఖైదీలు ఆందోళన నిరాహారదీక్షా మొదలెట్టారు. సౌకర్యాలు కల్పించలేని అధికారులు కిరాతకంగా పశువులలాగా లాఠీఛార్జి చేశారు. 18 నెలలు జైలు జీవితం గడిపిన రాంబాయమ్మ లాఠీఛార్జీవల్ల మరణించింది.

● ● ●

వెంకమ్మ . నందిగామ తాలూకా సరిహద్దులలో చొప్పకట్లవారి పాలెంకు జెందిన ధనికరైతు రత్తయ్య భార్య వెంకమ్మ. గెరిల్లా దళాలకు ఆమె భోజన సదుపాయాలుచూసేది. గాయపడ్డవారిని రహస్యంగా తన యింట్లో నైనా పొరుగు యిండ్లలోనైనావుంచి వైద్య సహాయం చేయించేది. నెహ్రూ సైన్యాలుప్రవేశించిన తర్వాత ఆమె యింటిపై దాడిచేసి, రత్తయ్యను ఖమ్మం క్యాంపుకు తీసుకువెళ్ళింది మిలటరీ. ఆ క్రూరులు వెంకమ్మను అవమానపరచి చివరకు చెరిచారు. ఆ అవమానాన్ని భరించలేక వెంకమ్మ విషంతిని ఆత్మ హత్య చేసుకుంది.

● ● ●

నాడు ఎన్నికుటుంబాలు యీ విధంగా అవమానాన్ని బాధల్ని భరించ వలసివచ్చిందో ! మన కార్యకర్తలలో చాలామంది వీరోచితమైన చరిత్రగలవా

రున్నారు. స్త్రీలు మొదట్లో వుద్యమంలోకి రాజకీయంగా రాకపోయినా ఆ తర్వాతకాలంలో మానవేతిహాసంలో వీరత్వానికి, త్యాగనిరతికిగల హద్దులు కొలిచారు పోరాటంలో వారిపాత్ర అనన్య సామాన్యమైనది.

"స్త్రీలు సంపూర్ణ సహకారాన్నందిస్తున్నారు. రహస్యాలు దాస్తున్నారు కామ్రేడ్స్‌కు రక్షణ ఇస్తున్నారు. వృద్ధస్త్రీలుకూడా మనల్ని కాపాడటంలో వెనుకంజ వేయటంలేదు. కొన్ని సందర్భాలలో చేలల్లో స్త్రీలకు మేం కనపడటం తటస్థిస్తే వారు అవసరమైనవి మాతో మాట్లాడతారు. కాని ఎవ్వరికీ చెప్పరు సూర్యాపేట తాలూకా సిరికొండ ప్రాంతంలో ఒకామె ముఖ్య కామ్రేడ్‌ను ఒకరిని గుర్తుపట్టి పేరుపెట్టి పిలిచింది. వెంటనే పక్కనున్నస్త్రీ యీామెనోరు నొక్కేసింది ఆవార్త బయటకు పొక్కలేదు"

"జయ్యారం ప్రాంతంలో మనకు రక్షణ యిచ్చిందేకాకముసలమ్మలు కూడా మన కరపత్రాలు పంచుతున్నారు. కోయస్త్రీలు చురుకుగా పార్టీకి సహకరిస్తుంటే వారి పురుషులు మొదట్లో అభ్యంతరం పెట్టారు యిప్పుడు వారి అభ్యంతరం ఏమీలేకపోయేసరికి కోయ స్త్రీలు మరింత చురుకుగా తోడ్పడుతున్నారు. ఇల్లెందు ప్రాంతంలో స్త్రీలు, దళాల్లో జేరేందుకు సిద్ధపడ్డారు. వ్యవసాయ కార్మిక స్త్రీలు ముందునిలిచారు.

"గార్ల ప్రాంతంలో ఒక యింట్లో మన ముఖ్య కార్యకర్త ఒకరు రక్షణ తీసుకుంటున్నాడు పోలీసులు ఆ ఇంటి దాపుకు రాగానే అతడు పారిపోతున్నాడు ఆ యింట్లోవున్న 15 సంవత్సరాలపిల్లను పోలీసులు "ఎవరతను" ఆ పరుగెత్తుతున్నదీ అని అడిగారు. ఆమె వెంటనే "నా భర్త! పోలీసులంటే ఆయనకు భయం అందువలన మిమ్మల్ని చూసి భయపడి పరుగెత్తుతున్నా"డని చెప్పింది. అయినా పోలీసులు నమ్మలేదు, ఆమెనుబెదిరించారు. చావబాదారు చివరకు చెరిచారుకూడా. అయినా ఆమె తనకథ మార్చలేదు (ఒకరహస్య స్థావరానికి దళాలనుండి వచ్చిన రిపోర్టులో నుండి.)

ఖమ్మంతాలూకా, గోవిందాపురంలో వుమ్మినేని రామయ్య అనే ప్రజాద్రోహిని దళాలు హతమార్చాయి పోలీసులు ఆగ్రామంపై దాడిచేసి దళాలకు రక్షణ యిచ్చినవారి ఆచూకీకొరకై మొత్తం స్త్రీ పురుషులందరినీ నానా చిత్రహింసలూ పెట్టారు. చివరకు 4 సం॥ 12 సం॥ మధ్య పిల్లలకు మిఠాయిపెట్టి మచ్చికజేసుకుని సమాచారం లాగుదామని యత్నించారు కాని మిఠాయిలు అయితేమెక్కారేగాని పిల్లలుకూడా ఒక్కరహస్యమూ చెప్పలేదు. ఇక వీళ్ళమీద దండోపాయం పోలీసులు ప్రయోగించినా, ప్రయోజనం శూన్యమైంది.

## తమ మానాలను సంరక్షించుకునేందుకై స్త్రీల పోరాటం

1946-47 లో నిజాం పోలీసులు, అధికారులు జనగామతాలూకాకు జెందిన ఆకునూరు, మాచిరెడ్డిపల్లి, గ్రామాలపై దాడిజేసి పది పదిహేనుమంది స్త్రీలను దారుణంగా చెరిచారు. కాంగ్రెసువారుకూడా యీ విషయం చాలా దారుణం అని, స్త్రీ జాతికే కాదు భారతదేశానికే అవమానమని ముందుకురాక తప్పలేదు శ్రీమతి సరోజినీ నాయుడు కుమార్తె పద్మజానాయుడు యీ విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకుంది. దేశం మొత్తంమీద యీ ఘటనకు నిరసన ప్రకటించబడింది.

అట్లాగే 1943 లో మధ్యప్రదేశ్ సర్వోంచ తాలూకాలో ఆస్తీ, చిమూర్ గ్రామాలపై బ్రిటిష్ పోలీసులు దాడిజేసి, స్త్రీలను చెరిచారు. దీనితో దేశం యావత్తు కోపంతో ఆందోళన మొదలెట్టింది అచార్య భన్సాలీ కాబోలు అందుకు సంబంధించిన అధికారిని సస్పెండుచేసి, ఆ విషయంలో దర్యాప్తుకు ఉత్తర్వు చేసేంతవరకూ నిరాహారదీక్ష సాగించారు

భారత సైన్యాలు- స్పెషల్ పోలీస్ యేమన్నా తక్కువ తిన్నాయా- ఒక ఆక్రమిత దేశంలో విదేశీ ఆక్రమణ సేనలు యెంత దురాగతాలను చేస్తాయో నెహ్రూ సైన్యం తెలంగాణాలో మూడు సంవత్సరాలపాటు అందుకు ఏమాత్రం తీసిపోని ఘాతుకాలను చేసింది. అయినా కాంగ్రెస్ ప్రభుత్వ ఆధీనంలో బూర్జువావర్గ అధీనంలోవున్న-యీ పత్రికలు, స్త్రీల గౌరవానికై పోరాడే ఉత్తములు ఒక్క మాటన్నా యీ నెహ్రూ సేనల ఘాతుకాలకు వ్యతిరేకంగా రాయలేదు ! పలకలేదు !!

నాడు జరిపిన దారుణాలు స్త్రీల మానభంగాలు, ఎంతపెద్దయెత్తున సాగినవో, తెలుసుకునేందుకు రహస్యస్థాపరానికివచ్చినఘటనల వివరాలు చాలు. అందులోంచికూడా సంక్షిప్తంగానేవుదహరిస్తాను అట్లాగే స్త్రీలుచేసినప్రతిఘటనలు, వారుచూపిన ధైర్యసాహసాలు అవికూడా సంక్షిప్తంగానే వ్రాస్తాను

మునగాల పరగణాలో 50 మంది స్త్రీలను, ఆంధ్రప్రాంతంలోని యితర తాలూకాల్లో 25 మందిని, హుజూర్‌నగర్-మిర్యాలగూడాప్రాంతంలోని నీలాయగూడెంలో 21 మందిని, మానుకోటతాలూకా బలపాలలో 15మందిని ఇల్లెందుతాలూకా సీమలపాడు'లో 70 మందినీ, నర్మెట, నంగనూర్ (జనగాం తాలూకా) లలో కలిపి 80 మంది స్త్రీలను చెరిచారు

పిండిప్రోలువద్ద ఖానాపురం కేంద్రంలో స్థానిక పార్టీ కార్యకర్త కామ్రేడ్ ఇమాం భార్యను యీ రక్కసులు యెత్తుకుపోయారు సూర్యాపేట

తాలూకా నాగారంలో, కాంగ్రెస్ ఏజెంటు చూపించిన ఒక స్త్రీని యీ మిలటరీ పశువులు లారీలో తీసుకువెళ్తూ-క్రూరంగా చెరిచి, ఆమె చనిపోతే, శవాన్ని రోడ్డుపక్క పారేసి పోయారు.

సూర్యాపేట తాలూకా, రాగిపాడులో మూడురోజుల క్రిందటే ప్రసవించిన ఒక స్త్రీని, భువనగిరి తాలూకా నారిగూడెంలో క్రితంరోజు ప్రసవించిన స్త్రీని చెరిచారు తేనుగుంటలో, రేపో మాపో ప్రసవించనున్న నిండు గర్భిణీని చెరిచారు. భువనగిరి తాలూకా యెనుపాడులోనూ, పుష్పాపూర్‌లో 10 సంవత్సరాల బాలికలనుకూడా, యీ మిలటరీ పశువులు చెరిచారు.

ఒకేసారి 5 లేక 10 మంది మిలటరీ పోలీసులు ఒక స్త్రీని చెరిచిన ఘటనలకు లెక్కలేదు. ఆ బీభత్సకర దినాల్లో ఈ విధమైన పశుత్వంవల్ల వంద మంది స్త్రీలు బలైపోయి వుంటారు మా కందిన సమాచారాన్నిబట్టి తెలిసింది, భారత సైన్యాల ప్రవేశ మొదటి సంవత్సరంలోనే, వెయ్యిమంది పైగా స్త్రీలు మానభంగాలకు గురైనారు. పోలీసు మిలటరీ బీభత్సంతోగూడిన మూడేళ్ళ కాంగ్రెస్ ప్రభుత్వ కాలంలోనూ కొన్ని వేలమంది స్త్రీలకు మానభంగం జరిగి వుంటుందంటే అందులో అతిశయోక్తియేమీ లేదు. మిలటరీ పోలీస్ క్యాంపు పెట్టిన ప్రతిచోట, స్త్రీలను మూకవుమ్మడిగా చెరచటం, బలవంతంగా వ్యభిచరించటాన్ని అసలు జరపటం నిత్యకృత్యమైపోయింది.

స్త్రీలు ప్రభుత్వ క్రౌర్యానికి వ్యతిరేకంగా నిరంతరాయంగా భీషణ పోరాటం సాగించారు. పోలీసులను తిప్పికొట్టారు, ఎన్నోసార్లు పోలీసుల దుర్మార్గంనుండి తమను తాము రక్షించుకున్నారు అలాంటి ప్రతిఘటనకు సంబంధించిన కొన్ని ఉదాహరణలను దిగువనిస్తున్నాం:

కమ్యూనిస్టు ప్రాంతాల నన్నింటినీ చుట్టుముట్టి చేసిన దాడుల తర్వాత ఇక కమ్యూనిస్టు బెడద అంతమయిందని పోలీసులు గతంలోకన్న స్వేచ్ఛగా తమ దారుణాలు కొనసాగించవచ్చని తలచారు. నవాబ్‌పేట క్యాంపునుండి జనగాం తాలూకాలోనే వడ్డిచెర్ల గ్రామానికి నల్గురు సైనికులు పొరిదుస్తులలో వెళ్ళి స్త్రీలను చెరిచారు. ఈ ఘటనకు గ్రామం యావత్తూ తన కోపాన్ని ప్రకటించింది. ఈ అవమానాన్ని భరించేకంటే మరణమే మేలని తలచి ఆ నలుగురు సైనికులు విడిదిచేసిన యింటిపై ఒక్కసారిగా దాడిచేశారు. ఇద్దరు సైనికులు పారిపోగా మిగతా యిద్దర్ని ప్రజలే హతమార్చి తమ పగ తీర్చుకున్నారు.

అంతటితో వూరుకోక, 'కమ్యూనిస్టులను చంపామని' నవాబ్‌పేట క్యాంపుకు కబురుజేశారు. నిజమనుకుని మిలిటరీ హడావిడిగా ఆ గ్రామం

వచ్చింది. తీరాచూస్తే చచ్చింది తమ సైనికులే! ఆ గ్రామప్రజలను కనపడ్డ వాళ్లనల్లా సైనికులు బాది వదిలిపెట్టారు "ఇందులో తప్పేముంది? మా ఆత్మగౌరవాన్ని మీ సైనికులు మంటగలిపారు - ఫలితం అనుభవించారు. పైగా కమ్యూనిస్టులను పట్టియివ్వమని మీరు మాకు చెప్తారు - మీరేమో నీచంగా స్త్రీలను చెరచడంలాంటి దౌర్భాగ్యపు పనులు చేస్తుంటారు. అందుకే వారి అంతం చూశాం"అని యెదురుతిరిగి ధైర్యంగా సమాధానం చెప్పారు గ్రామ ప్రజలు ఆనాడే మిలటరీ జనరల్ నంజప్ప జనగామవస్తే, ఈ గ్రామప్రజలు అతనిని కలుసుకొని "మీవాళ్లు మా 'స్త్రీలను అవమానించారు - మేం వారిని చంపాము" అని నంజప్పకే చెప్పివచ్చారు.

● ● ●

ప్రొద్దుటూరు గ్రామంపై మిలటరీదాడిచేసి ప్రజలను చావచితక బాది నలుగురు యువకుల్ని కాల్చి చంపారు. తర్వాత మిలటరీ స్త్రీలను చెర బట్టేందుకై ప్రయత్నించింది. ఇంతలో గ్రామంలోని స్త్రీలంతావచ్చి, మిలటరీని చుట్టుముట్టి వారి బారినుండి తమ సాటిస్త్రీలను రక్షించుకున్నారు.

మానుకోట తాలూకా మల్లాపురం గ్రామంలోనూ జరిగిందింతే! మిలటరీ ఒకామెను ఎత్తుకుపోబోతుంటే స్త్రీలంతా మిలటరీని చుట్టేసి వారి ఆటలు సాగనివ్వలేదు

మిర్యాలగూడెం తాలూకా మదురుగూడెంలో 'బాలకోటి' అనే స్థానిక కార్యకర్త భార్యను ఎత్తుకుపోబోతే ఆమె రక్కి, కొట్టి, కొరికి ఎదిరించి బయటపడ్డది.

1949 డిశంబరులో జలాల్‌పురంలో, ఒక సైనికుడు ఒక గర్భిణీస్త్రీని బలవంతం చేస్తున్నాడు. ఆమె అతణ్ణి మోసంచేసి, ఆ కబుర్లు యీ కబుర్లూ చెప్పి గదిలోకి పంపి బయట గొళ్ళెంపెట్టి వూళ్లో అందర్నీ పిలుచుకువచ్చింది ఇక ఆడవాళ్ళంతా కలిసి గదిలోవాణ్ణి ఒకటేతిట్లు, ఆ తర్వాత మిగతా సైనికులు కొందరొచ్చి వాణ్ణి తీసుకువెళ్ళారు. మరొక సైనికు డొక స్త్రీని పట్టుకోబోతే ఆ సైనికుణ్ణి ఒక్క తోపుతోసి కిందపడవేసి తాను పారిపోయింది

భట్టువెంకన్నబావి లంబాడీతండాలో స్త్రీలను మానభంగం చేయటానికి సైనికులు ప్రయత్నించారు స్త్రీలు, పురుషులూ అందరూ కలిసి ప్రతిఘటించారు. వాళ్ళు రాత్రిల్లా మెలకువగా అందరూ ఒక్కచోటనేజేరి ఏ స్త్రీ మీద ఏ మిలటరీవాడు చెయ్యి వేయకుండాచేశారు.

తిరుమలగిరిలో ఒక వడ్రంగి భార్యను బలవంతంచేయబోయాడొక మిలటరీవాడు వడ్రంగి తన బాడితతీసుకొనివాడిమీదకొచ్చాడు. అంతే.ఆ మిల టరీవాడు వెనక్కి తిరిగిచూడకుండా ఒకటేపరుగు.

కోయగూడెంలో ఇద్దరు పోలీసులు ఒక యింట్లో మగవాళ్ళులేని సమయంలో జొరబడ్డారు. ఆ యింట్లో ఆడవాళ్ళు, చుట్టుపక్కల స్త్రీలు కలిసి చేటలు తీసుకుని వాళ్ళు హూనం అయ్యేదాకాపోలీసుల్ని కొట్టుండగా, ఇంతలో మగవాళ్ళువచ్చి పోలీసుల పనిపట్టారు

నెరిజర్లలో ఒక పోలీసువాడు స్త్రీలంతా ఒకచోటవుండగా బట్టలన్నీ విప్పదీసుకుని గుంపులోవున్న ఒక స్త్రీని పట్టుకున్నాడు. ఒక ముసలామె రోకలి తీసుకుని వెంటపడ్డది. వాడు మొండిమొలతో అదేపరుగు – వాడితో పాటు పాపం అక్కడే వున్నయింకో యిద్దరు పోలీసులుకూడా కాలికి బుద్ధిజెప్పారు.

మానుకోటతాలూకా చెట్లముప్పారంలో 23 గ్గురు స్త్రీలను మిలటరీ వాళ్ళు ఒక లారీలో వేసుకుని మానభంగం చేయడానికి తమ క్యాంపుకు తీసుకు వెళ్ళబోయే సమయంలో ఆ వూళ్ళో ఆడవాళ్ళంతావచ్చి లారీ చుట్టూజేరి, లోపలవున్న ఆడవాళ్ళను వదిలేదాకా లారీ కదలనివ్వనేలేదు.

ఖమ్మం తాలూకా పమ్మి గ్రామంలో స్త్రీలంతాకలిసి మూకవుమ్మ డిగా మానభంగం చేసే ప్రయత్నాన్ని వమ్ముజేశారు.

అక్కడక్కడా ఆడవాళ్లు పోలీసుల వుంపుడుగత్తెలుగా తయారై గూఢచారులుగావున్న సందర్భాలు కూడా కొన్ని వున్నాయి స్థానికంగా పార్టీ ని కార్యకర్తలను రక్షించుకునేందుకు గెరిల్లాలు యిలాంటి సందర్భాలలో కొన్నిచర్యలకు పూనుకోవలసి వచ్చింది. పార్టీ ఒక ఆదేశాన్ని పంపింది. ఒక స్త్రీ ఎంత యెంతదుర్మార్గు రైనా, ప్రజాద్రోహిఅయినా ఆమెను మాత్రం ఏమి చేయవద్దు అని! అయినా యెక్కడన్నా యాదృచ్ఛికంగా చెదురుగా జరిగిన ఘటనలనైనా ప్రభుత్వం గోరంతలు కొండంతలుచేసి, ప్రజల అసహ్యాన్ని పార్టీ మీదకు తిప్పాలని ప్రయత్నించేది అచ్చంపేట సబ్ ఇనస్పెక్టరు భార్యను చంపినప్పుడూ యిలాగే చేశారు! అయితే పాలకవర్గాల సాయుధ బలగాలు మూకవుమ్మడిగా సాగించిన మానభంగాలతోగాని, అవమానాలతోగాని వీటికి పోలికెక్కడ ?

1952 పార్లమెంటులో ఆంధ్ర, కేరళ ప్రాంతాల పార్లమెంటు సభ్యులు పోలీసుల దుర్మార్గాన్ని బట్టబయలు చేశారు. పట్టుబడ్డ దళసభ్యులను,

కార్యకర్తలను పోలీసు లాకప్‌లలో తమ చెల్లెళ్ళను, తల్లులను చెరచమని యీ పోలీసు పశువులు చిత్రహింసలు పెట్టిన ఘటనలు వారు సోదాహరణంగా నిరూపించారు.

తమ అధికారాన్ని సవాలు చేసినప్పుడు పిచ్చెక్కిన ఈ పాలకవర్గాలు భూస్వాములు, గుత్తపెట్టుబడిదారులూ ఈ ప్రభుత్వమూ ఎంతటి పాశవిక చర్యలకు వొడిగట్టగలరో ప్రతి ఒక్క ప్రజాస్వామ్యవాదీ, ప్రజలకు పరిశుభ్రమైన మంచి జీవితంకోసం పోరాడే ప్రతియోధుడూ పై సంఘటనలనుబట్టి వూహించుకోవచ్చు. ఈనాడుకూడా 1970 – 71 లో ఇందిరాగాంధి ప్రభుత్వానికి చెందిన సాయుధ పోలీసులు ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళం ఏజెన్సీ ప్రాంతాల్లోనూ, పశ్చిమబెంగాల్‌లోని కొన్ని ప్రదేశాల్లోనూ చేస్తున్న దానినిబట్టి ఇదేవిషయం రుజువు కావడం లేదా? ప్రజలను భయభ్రాంతులను చేసేందుకు స్త్రీలను చెరచడం సులభమైన పనిగావారు భావించుతున్నారు. ఇంతకంటే పశుప్రాయమైన అనాగరిక ప్రవర్తన మరొకటి వుండగలదా? అందువలన ఇలాంటి క్రూరమైన, దుర్మార్గమైన అనాగరిక చర్యలను ఎదుర్కొనేందుకు మనం సిద్ధపడాలి. ఇలాంటి క్రూర శత్రువుల బారినుండి తమను కాపాడుకొనేందుకు మన స్త్రీలకు ఆత్మరక్షణ పద్ధతుల్లో శిక్షణ యివ్వాలి

## గెరిల్లా దళాలలో, పట్టణాలలోని రహస్య పార్టీ కార్యాలయాలలో స్త్రీల పాత్ర

ఇంతవరకు, తమ తమ యిళ్ళల్లోనే వుంటూ, స్త్రీలు తమ్మునుతాము రక్షించుకుంటూ, శత్రువు నెట్లా ఎదురుదెబ్బ తీసిందీ చూశాం. ఎంతటి బాధలకు సిద్ధమైందీ, ఎలా పోరాడిందీకూడా చూశాం. చాలామంది స్త్రీలు తమను దళాల్లోకి తీసుకొమ్మని దళాలతోపాటు అడవులలోకి తీసుకుపొమ్మనమని పార్టీని కోరారు. ఇళ్ళలో వుంటే శత్రువు మరింత దారుణాలు చేస్తాడని భయమే కావచ్చు! పార్టీ చాలా కొద్దిమంది స్త్రీలనే దళాలలోకి తీసుకుంది. అయినా రాజకీయంగా, మిలటరీరీత్యా విభిన్న కార్యక్రమాలను అడవులలోనూ, మైదానాలలోను నిర్వహించిన స్త్రీ కామ్రేడ్స్‌కు కొదువలేదు.

కామ్రేడ్ స్వరాజ్యం · కామ్రేడ్ భీమిరెడ్డి నర్సింహారెడ్డి చెల్లెలీమె. 1945 నుండి, యువతిగా వుండగానే ఆమె ఆంధ్రమహాసభ కమ్యూనిస్టు పార్టీలలో చాలా ఉత్సాహంగా పనిచేస్తూ వచ్చింది. ఆమె మంచి వక్త. చొరవ గలది. స్త్రీలను పురుషులను ఆ మహత్తర పోరాట దినాలలో వుద్యమాలలో, నిర్మాణయుతంగా తీసుకు వచ్చినామె. పార్టీకి సర్వకాల కార్యకర్తగా

నిజాం రజాకార్ రోజులలోనూ, ఆ తర్వాత గోదావరి అడవులలో మూడు సంవత్సరాలపాటు వుంది. ఆమె ముందు జోనల్ కార్యకర్తగావుండి, తర్వాత ప్రాంతీయ కమిటీ సభ్యురాలయింది. గుండాల కేంద్రంలో కోయలను వుత్తేజ పరచి వారికి నాయకత్వం వహించి, వారిని పోరాటంలోకి దింపిందామె. ఆమె భూస్వాముల కుటుంబం నుండి వచ్చింది. అయినా ప్రజలందరిలో అణగారిన వారైన, వ్యవసాయ కార్మికులలోకి చొచ్చుకుపోయి వారిలో ఒకతెగా కలిసి పోయేది. నేటికి నల్గొండజిల్లా ముఖ్యనాయకులలో ఆమె ఒకరు. ఆమె భర్త కామ్రేడ్ మల్లు వెంకటనర్సింహారెడ్డి, నేడు ఆంధ్రప్రదేశ్ కమిటీ సభ్యుడు

● ● ●

కామ్రేడ్ రాములమ్మ నల్గొండతాలూకా చెరుకపల్లి యీమె గ్రామం భర్తతోపాటు 1946 లో పార్టీలోకి వచ్చింది

రాములమ్మ భర్త 1948 లో, కొన్ని బలహీనతలవల్ల పార్టీని విడిచి పెట్టాడు. కాని ఆమె మాత్రం ప్రజలకు సేవచేస్తూ, పార్టీలోనే వుంది.

నైజాం వ్యతిరేకపోరాట కాలంలో ఆమె గెరిల్లా దళాలతోపాటు తిరుగుతుండేది పార్టీకి ఎర్రజెండాలు కుట్టిచ్చేది. ఆమె మిలటరీ శిక్షణ కూడా పొందింది.

కాంగ్రెసు మిలటరీ దాడులు అత్యంత దారుణంగా సాగుతున్న రోజుల్లో హుజూరునగర్ ప్రాంతంలో రహస్య సంబంధాలను నిర్వహించే ముఖ్య కార్యకర్తకు కొరియర్‌గా చాలానేర్పుగా వ్యవహరించి, పార్టీ కేంద్రానికి, ప్రజలకు మధ్య సజీవ సంబందాలు నిలిపింది. ఎంతో ప్రమాదకరమైన పరిస్థితులలోంచి యీమె ఒక ముఖ్య కార్యకర్తను రక్షించి, పార్టీ కేంద్రానికి తీసుకు వచ్చింది ఆమె శక్తి సామర్థ్యాలవల్ల ఆమె మిర్యాలగూడెం తాలూకా రాజారం మండలంలో ఒక కేంద్రానికి పార్టీకార్యదర్శి కాగలిగింది.

పల్నాడు తాలూకా తాళ్ళపల్లి గ్రామానికి ఆమె ఒకసారి పనిమీద వెళ్ళింది అక్కడ కొందరు ధనిక రైతులు ఆమెను మభ్యపెట్టి, పోలిసుల కప్పగించారు. ఆమె వద్ద రివల్వారు వుంది. దాని సాయంతో తప్పించుకునేందుకు కూడా వీలులేక పోయింది అసలిలాంటిది జరుగుతుందని వూహించనైనాలేదు. ఆమె అరెస్టు అయినదని తెలియగానే చూడటానికి వందలాది స్త్రీలు గుమిగూడారు. శత్రువుల మధ్య వుంది ఆమె. ఆ ప్రజలకొక వుత్తేజ పూరితమైన వుపన్యాసం యిచ్చింది. ఆమె వుపన్యాసం విన్నవాళ్ళల్లో కాంగ్రెసును తిట్టనివారు లేరు.

1951 లో ఆమె విడుదలై తాలూకాలో చురుకుగా పార్టీ కార్యక్రమాలన్నింటా పాల్గొంది ఆ ప్రాంత గెరిల్లా కమాండర్ కామ్రేడ్ ఆదిరెడ్డిని వివాహం చేసుకుంది. తనపైవున్న యెన్నో ఉరిశిక్ష కేసులను వదిలించుకుని, కామ్రేడ్ ఆదిరెడ్డి 1959 లో గాని విడుదల కాలేదు.

● ● ●

రంగమ్మ. నల్లమల అడవులలో తుపాకి ధరించిన, దళ సభ్యురాలు రాజకీయ కార్యకర్త పోరాట విరమణ తర్వాత హుజూర్‌నగర్ తాలూకా పార్టీ ముఖ్యులలో ఒకరైన పెంచికలదిన్నె గ్రామానికి జెందిన కామ్రేడ్ నారాయణను వివాహమాడింది.

తిరుపతమ్మ · చింతపాలెం పార్టీ కార్యకర్త భార్య ఆమెను ఆమె భర్తను, రాములమ్మతోపాటు పల్నాడు తాలూకాలో అరెస్టు చేశారు. కొన్నాళ్ళకు తిరుపతమ్మను వదలేశారు ఆమె బంధువు లెవ్వరూ ఆమెకు రక్షణ యివ్వలేదు. వెతుక్కుంటూ అమె అడవులలోకివచ్చి తనను దళాల్లోకి తీసుకోమని పార్టీని కోరింది కాని పార్టీ ఆమెను యింకొన్నాళ్ళు గ్రామాల లోనే గడపవలసిందని చెప్పింది. ఆమె గ్రామానికి తిరిగి వెళ్ళింది. రౌడీలామెను మోసగించాలని ప్రయత్నించారు ఆమె ఎట్లాగో వారి బారినుండి తప్పించుకుంది. నెల్లికల్లు రాములు అనేవాడు దళాలలో వుండేవాడు వాడు దళాలను విడిచి పారిపోబోతూ తిరుపతమ్మ యింటికి వెళ్ళి మహిళా నాయకురాలు రంగమ్మ విజయవాడలో వుంటున్నది – నిన్ను ఆమె దగ్గరకు జేర్చమని పార్టీ చెప్పింది" అని అబద్ధం ఆడాడు ఆమె వాడి వెంట బయలు దేరింది కాని దారిలో వాడి ప్రవర్తన, మాటలు, అనుమానం కలిగించడంవల్ల వాడిని తప్పించుకుని మళ్ళీ అడవులలోకి వచ్చింది. వెతుక్కుంటూ దళాలను కలుసుకుంది. కానీ సమయానికి ఆమెను పార్టీలో జేర్చుకునేందుకు మండల కమిటీ సభ్యులెవరూ అక్కడ లేరు. ఆ వేసవి కాలంలో గ్రామాలవెంట తిరిగి తిరిగి చివరకు మండల నాయకులను కలుసుకుని దళాలలో చేరింది చాలా చొరవ, వుత్సాహముగల తిరుపతమ్మ చదువుకున్నదికూడా దేవరకొండ ప్రాంతంలో రాజకీయదళంలో ఆమెకు ఆ తరువాత పని వొప్పగించారు.

● ● ●

సావిత్రమ్మ : ఈమెను హుజూర్‌నగర్ మండల కమిటీ పార్టీలోకి తీసుకుని, అడవులకుపంపింది. ఆమెకుచిన్నతనానే పనికిమాలిన వానికొకనికిచ్చి పెండ్లి చేశారు భర్త యింటికి పోకుండా తల్లి గారియింటవద్దనే వుంటూ, నిజాం రజాకార్ వ్యతిరేకపోరాట దినాలనుండి పార్టీకి సహకరించేది. భారతసైన్యాలు ప్రవేశించిన తర్వాత ఆమెను రెండుసార్లు జైల్లోపెట్టారు. తర్వాత విడుదలచేసి

భర్తఇంటికి పంపారు. ఆ యింట్లోంచి తప్పించుకుని, 5 రోజులపాటు శ్రమ పడి వెతుక్కుంటూ దళాల వద్దకు జేరింది. ఆమెకు మంచి చొరవ, చురుకు తనమూ వున్నాయి తన కిచ్చిన కార్యక్రమాన్ని ఆమె చాలా నేర్పుగా నిర్వ హించేది. ఒక దళ నాయకుడికి ఆమె కొరియర్‌గా పనిచేసేది. ఆమె తల్లి దండ్రులు, అన్నదమ్ములు అందరూ పార్టీకి మంచి సానుభూతిపరులు వాళ్ళందర్నీ అరెస్టుచేసి యీమె లొంగిపోతే వదిలి పెడ్తామన్నారు సావి త్రమ్మ లొంగలేదు

ఒకసారి దళ కేంద్రానికి నీరు తోడుకుపోతుంటే మిలటరీ ఆమెను పట్టుకున్నారు. చెప్పనలవికాని చిత్రహింసలు పెట్టారు కాని ఆమె ఒక్క రహస్యమన్నా చెప్పలేదు సావిత్రమ్మ ఆ బాధలకు తట్టుకోలేక నోరు జారి నట్లయితే ఆ దళ నాయకుడితోపాటు పార్టీ మండల కేంద్రంకూడా సర్వ నాశనమై వుండేది

● ● ●

నరసమ్మ : 1950 లో దళాలలోకి వచ్చేనాటికి ఆమె వయస్సు 20 సంవత్సరాలు. 1951 ఏప్రిల్‌లో పార్టీ సభ్యురాలైన యీమె పేద రైతు కుటుంబానికి జెందినది. చాలా చురుకైన కార్యకర్త తనకిచ్చిన కార్యక్రమాన్ని నిర్వహించేందుకు, యెన్నో కొత్త పద్ధతులు, విధానాలు ఆమె వెతుక్కునేది. ఆమె మాట్లాడుతుంటే వినే వాళ్ళకు విసుగు వుండేదికాదు వాళ్ళకు అర్థ మయ్యే రీతిలో చాలా చక్కగా చెప్పేది పార్టీ అంటే ఆమెకు అంతులేని విశ్వాసం, పార్టీ సాహిత్యం చక్కగా చదివేది కార్యకర్తలను అభివృద్ధి చేయ టానికి ప్రయత్నాలుచేసింది. తన ప్రాంతపు గెరిల్లాల, కార్యనిర్వాహకుల సమావేశంలో ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాలను కొన్నింటిని దిగువ నుదహరిస్తున్నాం .

"నైజాం రజాకార్ వ్యతిరేక పోరాట దినాలలో ప్రజలు పెద్దఎత్తున కదిలారు. తమంత తాముగా పనిచేసే చొరవ సంపాదించలేదు. ప్రతిపని చేయ టానికి ప్రయత్నించే వాళ్ళం ! బారత సైన్యాలు ప్రవేశించిన తరువాతకూడా అదే ధోరణి కొనసాగింది. నిర్బంధకాండ కొనసాగుతున్నందున ప్రజలు పాల్గొనటం సాధ్యంకాదని, కనుక ప్రజలు పాల్గొనకపోయినా, మనమే కార్య క్రమాలు నిర్వహించాలని చెప్పి మన ధోరణిని సమర్థించుకున్నాం నూతన పంథా ఈ పొరపాటును ఎత్తిచూపుతోంది.

"దళాలు తమ కందిన సమాచారాన్ని ఆధారం జేసుకుని, దాన్ని సరిగా పరిశీలించకుండా, కొంతమందిని పొరపాటుగా హతమార్చాయి. ఇవాళ

మిలటరీ వాళ్ళను నిర్మూలించటంలో తమ శక్తిని కేంద్రీకరించాలని దళాలకు ఆదేశాలివ్వబడ్డాయి. నిజానికి మనం మాటుగాచి మిలటరీని దెబ్బగొట్టేకంటే, మిలటరీయే మనలను దెబ్బకొడుతోంది. వాళ్ళే రాత్రింబవళ్లు కదులుతున్నారు.

"మనకు కేటాయించిన డబ్బు మనకు సరిపోవటం లేదు. ప్రజా ద్రోహుల వద్దనుండి మనం రాబట్టినదీ మనం చేసిన వసూళ్ళు మొత్తం పార్టీకి జమకడుతున్నాం. పార్టీయే మన కనీస అవసరాలను ఆదుకోవాలి ఇప్పుడు అవసరాలు ఏవీ తీరటం లేదు. "పార్టీ కార్యకర్తలకు కొలది దినాలు ఆలస్యమయినా బాగా శిక్షణ గరపాలి. ప్రత్యేకించి శత్రువు నుండి తప్పించుకోటం ఎలాగో నేర్పాలి కార్యకర్తల రక్షణ విషయంలో తగినంతముందు జాగ్రత్త చర్యలు తీసుకొనటంలేదు. మేము చదివి అర్థం జేసుకోగలిగిన పుస్తకాలు మాకందించాలి, అందుకోసం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి.

ఇప్పటికి మా స్త్రీలంటే తక్కువవాళ్ళనే పురాతన దృక్పధమే కొనసాగుతోంది. ఏ స్త్రీఐనా పొరపాటుచేస్తే నాయకత్వం ఆమెపై కఠినంగా వ్యవహరిస్తుంది ఆ విషయం పుబుసుపోక కబుర్లలోపడి అందరినోళ్ళల్లో నానుతున్నది. మాకు మంచి శిక్షణ యిచ్చి అభివృద్ధి చేయాలేగాని, దిగజార్చరాదు. కొంచెం స్వేచ్ఛగా వుంటేచాలు మమ్మల్ని అనుమానంతో చూస్తున్నారు. అసలు ప్రత్యేకంగా శత్రువులపై జరిపే దళ చర్యలలో ఒక్క స్త్రీనన్నా యెందుకు పాల్గొననివ్వలేదు ?"

మహిళా కార్యకర్త లెలా ఆలోచిస్తున్నారో, వారెలా అభివృద్ధి జెందుతున్నారో తెలిపేందుకే ఈసుదీర్ఘమైన భాగాలనుఉదహరించడం జరిగింది.

## ఉద్యమంలో కోయ స్త్రీల ముందంజ

గోదావరి తీర అడవులలో స్త్రీలు, అందునా కోయస్త్రీలు చాలా మంది దళాలలో జేరి చురుకుగా పనిజేశారు. గెరిల్లా దళాలలో 9 మంది, కొరియర్లుగా 15మంది, దళ వుపనాయకులుగా ఇద్దరు, ఆర్గనైజర్లుగా ఇద్దరు స్థానిక దళాలలో 10 మంది స్త్రీలున్నారు. వారిలో కొందరి పేర్లు : నాగమ్మ, పాపక్క, లచ్చక్క, రామక్క, పుల్లక్క, భద్రక్క, అడివమ్మ, నారాయణమ్మ.

కొందరు కోయ స్త్రీల గాథలు సంక్షిప్తంగా పేర్కొంటున్నాం

వెంకటమ్మ : ఒకసారి మిలటరీ ఒక కోయగూడెంపై దాడిచేసింది. వారి బారినుండి తప్పించుకునేందుకు వెంకటమ్మ అనే కోయ యువతి పరుగెత్తుతున్నది. మిలటరీ వెంటాడుతున్నది. ఈ పరిస్థితిలో జగన్నాథం దళం,

మిలటరీవాళ్లపై కాల్పులు జరిపి ఆమెను రక్షించింది నాటినుండి ఆమె దళాలలో చేరింది తన శాయశక్తులా పార్టీకి సహకరించింది. తుపాకి కాల్చటంలో సిద్ధహస్తురాలై, పోలీసులపైన, మిలటరీపైన జరిగిన యెన్నో దళ చర్యలలో పాల్గొంది ఆమె జగన్నాథం దళానికి ఉపనాయిక అయ్యింది. ఒకసారి, మిలటరీపై జగన్నాథం ఒకవైపునుంచి, వెంకటమ్మ ఒకవైపునుండి దాడి చేసి, నల్గురిని చంపి, వారివద్ద ఆయుధాలు లాక్కొని యింకో మిలటరీ లారీ వచ్చేలోగా తప్పుకున్నారు. వెంకటమ్మకు రజస్వల కాకముందే పెళ్ళయింది. భర్తముఖం చూడలేదు. దళాలలోకి వచ్చిన తర్వాత క్రమేపి జగన్నాథం, వెంకటమ్మ చేరువ కాసాగారు వారిద్దరూ యెంతో చర్చించుకున్నారు ఆమె కోయ స్త్రీ, జగన్నాథం గౌడ కులంవాడు. కోయలకు, మైదాన ప్రాంత జనం అంటేనే అనాదిగా అనుమానం, భయం వాటన్నింటినీ అధిగమించి, వారిద్దరూ పెళ్ళి చేసుకోదలచుకుని, పార్టీ అనుమతి కోరారు. పార్టీ అంగీకరించి వారి వివాహం జరిపించింది ఇవాళ, వారిద్దరూ పార్టీలో ప్రజావుద్యమాలలో, చురుకుగా పాల్గొంటున్నారు పోరాట కాలంలోనే చదవనూ, వ్రాయను నేర్చుకున్న వెంకటమ్మ, తన రాజకీయ చైతన్యాన్నికూడా అభివృద్ధి చేసుకుంది.

  

లచ్చక్క ఈమె కామ్రేడ్స్ ఫల్లూ–రాముల సోదరి పూసలపల్లి లంబాడితండాకుచెందిన ఫల్లు–రాము లిద్దరూ పార్టీలోనూ, ఆంధ్రమహాసభలోనూ బాగా కృషిచేస్తూ కార్యకర్తలు కాగలిగారు, 'బ్రిగ్స్ పథకాన్ని' అనుసరించి తమ తండాను ఖాళీ చేయమని మిలటరీ బలవంతపెడ్తే వీరిద్దరు మిగతా తండా లన్నింటిని కదిలించి వ్యతిరేకించారు. చివరకు ఖాళీచేయక తప్పలేదు అప్పుడుకూడా వారు దళాలతో సంబంధాలు పెట్టుకుని దళాలకు బాగా తోడ్పడేవారు – లచ్చక్కను అరెస్టుచేసి చిత్రహింసలు పెట్టారు. అయినా ఆమె ఒక్క రహస్యమన్నా చెప్పలేదు ఒకరోజు రాత్రి ఆ మిలటరీ క్యాంపు నుండి తప్పించుకొని, తన సోదరుల సిఫార్సుతో వెతుక్కుంటూ వెతుక్కుంటూ దళకేంద్రానికివచ్చింది. ఆమె తన పట్టుదలను కృతనిశ్చయాన్ని నిరూపించుకుంది. గెరిల్లా దళాలలో తన కార్యక్రమాలను సంతృప్తిగా నెరవేర్చటమే కాకుండా ప్రత్యేక శ్రమచేసి చదువు బాగా నేర్చుకుంది. ఆమె చాలా క్రమశిక్షణగల కొరియర్. చాలా నిగ్రహశక్తిగలది. కార్యకర్త, ఆర్గనైజర్. పార్టీ కేంద్రరక్షణ బాధ్యతలు నిర్వహిస్తున్న దళనాయకుడు వీరాస్వామిని వివాహం

చేసుకుంది, భల్లు–రాములను తెలంగాణాపోరాట విరమణ తర్వాత అనతి కాలంలోనే అరెస్టుచేసి యూనియన్ సైన్యం కాల్చి చంపింది.

● ● ●

*పాపక్క – తిరుపతయ్య* : ఈ కోయ దంపతులు యిద్దరూ ఎంతో ధైర్యసాహసాలుగలవారు అడవులలోత్రోవలుచూపటంలో చాలాఅనుభవజ్ఞులు. చాలా తేలికగా మైదానప్రజలతో కలిసిపోయేవారు అలాంటప్పుడు వారిని కోయలు అని గుర్తుపట్టటమేకష్టం. గోదావరి అరణ్యప్రాంతం అంతా, వరంగల్, కరీంనగర్, గోదావరిదాటినతర్వాత ఆదిలాబాద్, బస్తర్‌జిల్లాలన్నీ వారికి క్షుణ్ణంగా తెలుసు చాలా పెద్దపెద్ద బరువులు మోస్తూ మైళ్ళకొద్దీ నడవటమేగాక, కొండలు, గుట్టలు ఎక్కటం వారికి అవలీలగావుండేది వరదలో పొంగి పారుతున్న గోదావరిని సయితం ఒక కొయ్యదుంగసాయంతో ఈదగలిగేవారు. వారిని పట్టుకోవాలని ప్రభుత్వం చాలాప్రయత్నించిందిగానీ వారు దొరకలేదు.

నాటి పోరాట దినాలలో పలువురు కోయదంపతులు కొరియర్‌లుగా, త్రోవచూపేవారుగా, దళ సభ్యులుగాపాల్గొని ఎర్రజెండా ప్రతిష్ఠను యినుమడింపజేశారు లక్ష్మక్క – సుందరయ్య, రామక్క – పుల్లయ్య, పుల్లక్క – సెట్టి, ఆదెమ్మ – నారాయణ, భద్రక్క – అల్లయ్య, నాగమ్మ –పద్మయ్య; లచ్చక్క – రాములు. అలాంటివారే.

*పడిగపాటి నాగమ్మ* : ఈమె మేళ్ళచెరువుకుజెందిన పేదరైతు కుటుంబీకురాలు. గెరిల్లాదళాలకామె ఇల్లురక్షణస్థావరం. దళాలకు ఆహారాదులు జేరవేయటం ఆమె పని ఒక రోజామె మిలటరీ చేతిలో పట్టుబడింది. వారామెను పెట్టిన బాధలు అన్నీయిన్నీ కావు. పశువులలాగా చెరిచారు ఇంత చేసినా ఆమె నోరుతెరచి ఒక్క రహస్యమన్నా చెప్పలేదు. మూడురోజులపాటు చిత్రహింసల అనంతరం ఆమెను తుపాకీతో కాల్చి సజీవంగా గడ్డివామిలో పడవేసి దహనం చేశారు.

● ● ●

*బూదెమ్మ* : బెండలపాడుకు జెందిన కోయయువతి. ఆమెదళాలలో చేరి దళానికి కావలసినవాటిని సరఫరాచేసే స్త్రీల విభాగాన్ని పర్యవేక్షించేది. చాలాసార్లు తన సమయస్ఫూర్తివల్ల శత్రువుల కన్నుగప్పి అవసరాలందించింది. ఒకసారామెను పట్టుకుని మద్దులపల్లివాగులో చిత్రహింసలుపెట్టి మానభంగంచేసి చివరకు కాల్చి చంపారు.

● ● ●

*కోయ లచ్చక్క* : ఈమె సత్యం భార్య ఒక గెరిల్లా దళానికి ఉపనాయకురాలు పోలీసు చర్యల అనంతరం ఆమె దళాన్ని మద్దులపల్లివద్ద భార

తీయ సాయుధ పోలీసు లెదుర్కొన్నారు. తనవద్దనున్న స్టెన్‌గన్‌తో నలుగురు పోలీసువాళ్ళను కాల్చిచంపింది. ఇద్దరు దళ సభ్యులు తప్పుకు పోగలిగారు. ఆమె తప్పించుకో బోయింది. కానీ, ఒక ముళ్ళపొదలో ఆమె జుట్టు చిక్కుకుని కొంచెం ఆలస్యం అయింది దానితో శత్రువుల తుపాకిగుళ్లకు బలైంది.

గ్రామాలలోనూ అడవులలోనూవుండిపోరాడిన యిలాంటి స్త్రీలుగాక రక్షణస్థావరాలలో(డెన్స్‌లో)పనిచేసిన స్త్రీలూవున్నారు.అక్కడ కూడామిలటరీ ఏ క్షణంలోనైనా వచ్చి దాడిచేసి నానా చిత్రహింసలు పెట్టవచ్చు. అయినా ధైర్యంగా అక్కడేవుంటూ ఈ స్త్రీలు వేలాది పేజీల రిపోర్టులు, సర్క్యులర్లు, డాక్యుమెంట్లు తిరగరాయటం, కరపత్రాలను చాలా కాపీలు తీసిపెట్టటం ఉత్తర ప్రత్యుత్తరాలు చూడటంవంటి పనులు వోపికగా, వొంచినతల యెత్తకుండా చేసేవారు. వీరేగాక కొందరుస్త్రీలు తుపాకీ తయారి, మందుగుండు తయారీ విభాగంలోకూడా కార్యక్రమాలు నిర్వహించేవారు

చెప్పిన నిముషానికి రక్షణస్థావర బాధ్యుడు తిరిగిరాకపోతే, యీస్త్రీలు వెంటనే అక్కడ ప్రమాదచిహ్నమైన సంకేతాన్ని నిలిపేవారు. ఇక రాకపోకలు స్థంభించేవి. మూడు నాలుగుసార్లు కొన్ని ముఖ్యమైన రహస్య కేంద్రాలు శత్రువు వశమైనాయి. కాని ఈ స్త్రీలు తీసుకున్న జాగ్రత్తల ఫలితంగా మిగతా కేంద్రాలకు నష్టం జగగకుండా నివారించబడింది.

## వివాహం - నూతన సాంఘిక సమస్యలు

మైదాన ప్రాంతంలో ఉన్నత కులాలనుకునేవాటిల్లో వివాహ సంబంధం ఒక సమస్యగా వుండేది. సామాన్యంగా పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్లు జరుగుతుండేవి. విడాకులు, పునర్వివాహం అంశేచాలు గుడ్లెర్రజేసి చూసేవారు. సతీపతులమధ్య ఎంతో తీవ్ర విభేదాలున్నప్పుడు యిలాంటి సమస్యలు పార్టీవద్దకు, ఆంధ్రమహాసభవద్దకు, మన పంచాయితీలవద్దకు వచ్చేవి. కొన్ని జాతులలో విడాకులు, పునర్వివాహం జరగొచ్చుకానీ కొత్తభర్త పాతవానికి నష్టపరిహారం చెల్లించాలి. వీళ్ళు యివ్వము' అని మొండికెత్తేవాళ్ళు. అనేక సందర్భాలలో పాతమొగడు సాంప్రదాయసిద్ధమైన నష్టపరిహారంతో సంతృప్తి పడక తన భార్యయే తనకు కావాలని మొండిగాకోరేవాడు.

ఈ విషయంలో స్త్రీలు, పురుషులు సమానులే అన్నసూత్రాన్ని పార్టీ దృష్టిలో వుంచుకునేది ఎంతో తీవ్రంగా వారిద్దరినీ మళ్ళీ కలిపేయత్నంచేసినా విఫలమయితే, పునర్వివాహం చేసుకునేందుకు, విడాకులు యిచ్చేందుకు యిద్దరికీ సమానహక్కువుంది లైంగిక సంబంధాల్లోజరిగే ఏవో పొరపాట్లను

మనం, పాపమనే దృష్టితోనో, వైరాగ్య దృష్టితోనో పరిశీలించం. అయినా ఎట్టి పరిస్థితులలోను విచ్చలవిడి లైంగిక సంబంధాలను మనం ప్రోత్సహించం. సమస్య సందర్భంగా ఆ యిరువురిని కూర్చోబెట్టి సాధక బాధకాలుచెప్పి, అలాగే పార్టీ తీసుకున్న నిర్ణయంవల్ల ఏ విధంగా ఇకనుండైనా స్వచ్ఛమైన, సంతృప్తికరమైన జీవనం గడపవచ్చో ప్రజలకు నచ్చజెప్పి ఈ నూతననిర్ణయం వల్ల మన ప్రజాఉద్యమానికి, మన సాంఘిక సంబంధాలకుకలిగే ఉపయోగాన్ని వివరించి మరీ నిర్ణయం ప్రకటించేవారు. ప్రజాబాహుళ్యం యొక్క అభిప్రాయాన్ని మనకు వ్యతిరేకంగాతిప్పే అవకాశంవున్న ఏ నిర్ణయాన్ని ఆ రోజుల్లో చేయలేదు

ఈ నూతన దృక్పథాన్ని ఆచరణలోకి తెచ్చేందుకు ఆనాడు పార్టీ పంచాయితీలు ఎట్లా ప్రయత్నించేవో యీక్రింది వుదాహరణ చూడండి.

హుజూర్‌నగర్ తాలూకాలో చీరాలగ్రామం వుంది ఆ గ్రామ పంచాయితీలో ఒక వ్యవసాయ కార్మికుడు, ఒక పేదరైతు, ఒక మధ్యతరగతి రైతు వుండేవారు. ఆ వూళ్ళో ఒక ధనికరైతు తన కుమార్తెను యింకో ధనిక రైతుకొడుక్కి యిచ్చి చిన్న తనానే పెళ్ళిచేశాడు. ఆమె రజస్వల అయిన తర్వాత అత్తవారింటికి వెళ్ళింది. ఆమె భర్త ఆమెపట్ల సరిగా వ్యవహరించలేదు. హింసించేవాడు. ఇక వాడితో వేగలేక పోయింది. ఆమె ఒక వ్యవసాయ కార్మికుణ్ణి ప్రేమించి, అతనికి చేరువైంది ఆమె బంధువులంతా తాళికట్టిన వాడితోనే వుండమని నానా విధాలా చెప్పారు. నగలు, మంచిబట్టలు, హోదా యివన్నీ చూపి మభ్యపెట్టబోయారు చివరికి పాత మొగుణ్ణి అంటిపెట్టుకునేట్లు చేసేందుకు తాయత్తులు, పసర్లు, వగైరా తతంగం అంతా చేశారు. అయినా ఆ అమ్మాయి యీ వ్యవసాయ కార్మికుడినే చేసుకుని, అతనితో బ్రతుకుతానని పట్టుబట్టింది. ఈ తగాదా మనపార్టీ పంచాయితీ దగ్గరకు వచ్చింది. పార్టీ పంచాయితీ విడాకులు యిచ్చి, పునర్వివాహం చేసుకునే హక్కు ఆమెకు వుందని తీర్పు యిచ్చింది. ఆతర్వాత ఆమె వ్యవసాయ కార్మికుడిని వివాహంచేసుకుంది.

ఈ వివాహం, విడాకులు, పునర్వివాహం సమస్య ప్రధానమైనదిగా, జరూరు సమస్యగా, సామాన్య ప్రజానీకంలో ముందుకొచ్చింది. మన వుద్యమం పురోగమిస్తున్న కొలది, అంతవరకూ వున్న ఆర్థిక, సాంఘిక సంబంధాలలో మార్పులు వస్తున్నాయి. అంతేగాక, చాలామంది యువతులు, పోరాటంలో తమ భర్తలను పోగొట్టుకున్నారు. మన పార్టీ ఒక నూతన నైతిక సూత్రాన్ని ప్రతిపాదించింది – ఈ యువతులు మళ్ళీ పెళ్ళి చేసుకుని సంసారాలుజేస్తూ, ప్రజావుద్యమానికి తోడ్పడాలి అని. మళ్ళీ పెళ్ళి అంటే, పాపమూ కాదు, చని పోయిన భర్త యెడల అవిశ్వాసమూ కాదు. ఈ వితంతువులు తమకు తగిన

భర్తల నెన్నుకుని, పోరాటంలో మరణించిన భర్తల అడుగుజాడలలోనే, యీ దంపతులూ నడిచి తమ ఆశయాన్ని సాధించాలి ఇది చాలా సున్నితమైన విషయం. వారి అనుబంధాల్ని – అనురాగాల్ని నొప్పించకుండా, తమను వీడిపోయిన వారులేని లోటును కాలం మెలమెల్లగా సరిదిద్దుతున్నప్పుడు, వారు నూతన సంబంధాలు కల్పించుకోటానికి, నూతన జీవితాన్ని గడపటానికి మనం సహాయపడాలి

యిలాంటి వితంతువులైన యువతులను చాలామందిని మళ్ళీ పెళ్ళి చేసుకోమని ప్రోత్సహించాం. ఈ రోజువారు సుఖంగా జీవితం గడుపుతుండ టమేగాక వారిలో చాలామంది నేడు పార్టీకి మంచి సానుభూతిపరులుగా కూడా వుంటున్నారు.

స్త్రీ చేయగల త్యాగానికి హద్దులులేవు అని చెప్పేందుకు ఒక్క ఉదాహరణచెప్పి, ఈ అధ్యాయం ముగిస్తాను. ఆమె ఒకమృతవీరుని భార్య ప్రస్తుతానికిఆమెను 'కామ్రేడ్ పద్మ' అంచాం ఆమె, తన పసిపిల్లవాడితోసహా మాతో పాటు ఒక రహస్య కార్యాలయంలోవుంది మా రహస్య నిర్మాణంలో సమర్థుడైన ఒక కార్యకర్తతో ఆమె అనుబంధాన్ని పెంచుకునేందుకు మేము ప్రోత్సహించాం వారిద్దరూ అనురాగ బద్ధులైనారు శ్రీరావి నారాయణరెడ్డి, మేమం దరమూ వారిద్దరి వివాహాన్ని ప్రోత్సహించాం. కొన్ని నెలల తర్వాత శత్రువు దాడులు వుధృతమైనాయి. నగరంలోని రహస్య నిర్మాణానికి సంబంధించిన కార్యకర్తలను తగ్గించివేసి అందులో అధిక భాగాన్ని అడవుల్లోని స్థావరానికి పంపించవలసివచ్చింది. "కామ్రేడ్ పద్మ" నిండుగర్భవతి. త్వరలో ప్రసవించ నున్నది. ధనిక భూస్వాములగు ఆమె అన్నలు, ఆమెనుగాని ఆమె బిడ్డనుగాని తీసుకువెళ్ళటం తమకు పరువుతక్కువగా భావించి తీసుకువెళ్ళలేదు. తన భర్త కూడా అడవులకు వెళ్లవలసిన అవసరం ఆమె గుర్తించింది. చివరకు నేనొక సలహా యిచ్చాను. అది ఎంత బాధాకరమో నాకూ తెలుసు 'నీ భర్త అడవులకు వెళ్లాలీఅంటే నువ్వు ఆస్పత్రిలోనే బిడ్డనుకని ముక్కు మొగం తెలియని ఏవరికైనా పుట్టినవెంటనే నీ బిడ్డను యిచ్చేసి నువ్వు నీఅన్నల దగ్గరకు వెళ్లాలి. అప్పుడే నీభర్త అడవులకుపోగలడు" పార్టీకిఅవిధంగాపెద్దభారంతగ్గించగలవు అని చెప్పాను. ఆమె అంగీకరించింది. భర్త అడవుల్లోకి వెళ్ళాడు ఆమె ఆస్పత్రిలో ప్రసవించి పిల్లలులేనివవరికో తనబిడ్డనుయిచ్చేసి, తానుఅన్నలదగ్గరకు వెళ్లింది.

తెలంగాణా పోరాట విరమణ తర్వాత ఈ దంపతులు సామాన్యమైన ఆదాయంతో మామూలు జీవనం గడుపుతున్నారు. ఆమె పెద్దకొడుకు ఆమెతో వుండకూడదు. వుంటే ఇప్పుడాతనిని పెంచుతున్నవాళ్ళు తన గతించిన తండ్రి ఆస్థికి అతణ్ణి వారసుణ్ణి కానీయరు. రెండవ కొడుకు కనీసం వచ్చిచూచుకు

పోవటమూ సాధ్యంకాదు. ఇన్నాళ్ళు సాకిన తల్లిదండ్రులకి యిష్టంకాదు. పైపెచ్చు పుట్టినప్పుడే తనను పరులకప్పగించింది తన తల్లి అని తల్లిపై వైముఖ్యత రెండోకొడుకు పెంచుకోటం "పద్మ"కు యిష్టంలేదు ఇప్పుడు పెంచుతున్న వారన్నా అదే వైముఖ్యత పెరగొచ్చు.

ఆ సలహాయిచ్చిన నాటినుండి ఒకరకమైన పశ్చాత్తాపభావం, తప్పు చేశానేమోఅన్న ఆలోచన నన్ను వెంటాడుతున్నది "కామ్రేడ్ పద్మ"ను ఆమె పిల్లలను యింకెక్కడికన్నా తీసుకువెళ్ళి, పోరాట విరమణ తర్వాత ఆ దంపతులు పిల్లలతో కలిసివుండే అవకాశం కల్పించలేకపోయానే? అని అనిపించేది. కానీ, నాడు పోరాటాన్ని ఆపటమెప్పుడు అన్నది ఎక్కడతేలింది? సంపూర్ణ విముక్తి జరిగేవరకూ దీర్ఘకాలం పోరాడాలనుకుంటున్నాముకదా! శక్తివున్న అందరూ అడవులకు వెళ్ళారు మిగతావారు ఎక్కడవున్నా జీవితంలో స్థిరపడి విప్లవంకోసం వారు చేయగలిగింది చేయాలని అనుకున్నాం.

కానీ యీ ఘటన జరిగిన సంవత్సరం లోపలనే పోరాటం విరమించాం. కానీ యీ విషయం నా గుండెల్లో గూడుకట్టుకొని, తొలుస్తూనే వుంది 1965 జులైలో నాకు తీవ్రమైన జబ్బుచేసిన పరిస్థితిలో ఉస్మానియా ఆస్పత్రిలో వున్నాను. నా పరిస్థితి ప్రమాదకరంగావుందని పత్రికలు ప్రకటించాయి. డాక్టర్లు చాలా ఆందోళన చెందుతున్నారు. ఈ పరిస్థితుల్లో నన్ను చూసేందుకు చాలామందివచ్చి పోతున్నారు ఒకరోజు "కామ్రేడ్ పద్మ" వచ్చింది నన్ను పరామర్శించటానికి. నా హృదయభారం దించినట్లయింది. 15 సంవత్సరాలక్రితం వారికి నే నిచ్చిన సలహా జ్ఞప్తికి తెచ్చాను.

తెలంగాణా ఉద్యమంలో అలాంటి మహత్తర త్యాగాలను చేయవలసి వచ్చింది తెలంగాణాలోని స్త్రీలు అందుకు తగినట్లుగా ఉన్నతస్థాయి నందుకున్నారు. కామ్రేడ్ పద్మ అందుకొక ఉదాహరణ.

## అధ్యాయం 10

# భారత సైన్యం ప్రవేశించిన తర్వాత, ప్రతిఘటనలో ప్రాణాలర్పించిన

# కొంతమంది దళనాయకుల, పార్టీ నాయకుల సంగ్రహ చరిత్ర

కామ్రేడ్ కొంతలరెడ్డి : పాత సూర్యాపేటదగ్గర నెమ్మికల్లు రాతిగుట్టలలోని ఒక పెద్దగుహలో కామ్రేడ్ కొండలరెడ్డి, రావుల వీరయ్య దాక్కున్నారు. వారిని మిలటరీ చుట్టుముట్టింది. తప్పించుకోనటం అసాధ్యం అన్నవిషయం ఆవీరులకు అవగాహనఅయింది. అందుకే తాము మరణించేలోగా వీలైనంత ఎక్కువమంది శత్రుసైనికులను ఖతం చేసి మరీ ప్రాణాలొదలాలి అని నిశ్చయించుకున్నారు. ఒక సైనికుడు గుహ ద్వారంవద్ద నిలబడి లోపలికి చూడబోయాడు, అంతే! లోపలనుండి దూసుకువచ్చిన తుపాకిగుండు అతని అంతం చూసింది. ఆ గుహ ద్వార పరిసరప్రాంతాల్లో ఏ సైనికుని కదలిక కన్పించిలా లోపలినుండి ఈ వీరులిద్దరూ నిప్పులు కురిపించారు ఇంకొందరు సైనికులు సమసిపోయారు. సైనికులందరూ గుహలోపలికి కాల్పులు జరిపారు. లోపలినుండి తుపాకీకాల్పులమోతలు తగ్గిన తర్వాతగానీ మిలటరీ గుహ లోపలికివెళ్ళ సాహసించలేకపోయింది. లోపలికి వెళ్ళిన తర్వాతచూస్తే ఆ వీరు

లిద్దరూ అనువులుజూసి పడివున్నారు. వారిప్రక్కన ఒక స్టెన్‌గన్, ఒక సాదా తుపాకీ దొరికాయి. కాని వానిలో ఒక్క గుండు కూడాలేదు వారి ధైర్య సాహసాలు శత్రువునిసైతం ఆశ్చర్యపరిచాయి

కామ్రేడ్ కొండలరెడ్డి, సూర్యాపేట తాలూకాలోని 'యిస్తలాపురం' గ్రామంలో మధ్యతరగతి రైతు కుటుంబానికి జెందినవాడు. 1947 లో హైదరాబాద్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేయాలని ఉద్యమం సాగేకాలంలో ఆయన కాంగ్రెస్ పార్టీలో జేరాడు కాని కొద్దికాలం లోనే, కాంగ్రెస్ అసలురంగు తెలిసి, అతని భ్రమలు తొలగిపోయాయి. కమ్యూనిస్టుపార్టీలో చేరాడు తనతోపాటు రెండు కాంగ్రెస్ దళాలను, అనేక మంది ప్రజలను పార్టీలోకి తిసుకురాగలిగాడు. నైజాం వ్యతిరేక పోరాటంలో జరిగిన యెన్నో గెరిల్లా చర్యలలో కామ్రేడ్ కొండలరెడ్డి పాల్గొన్నాడు ఎర్రపాడు, ఆత్మకూరు, పోలీస్ క్యాంపులను ముట్టడించినవారిలో ఆయ నొకరు. యూనియన్ సైన్యాల ప్రవేశం తర్వాతకూడా ముఖ్యంగా నర్సంపేట పరిసర ప్రాంతాలలోని దళ చర్య లెన్నింటిలోనో ఆయన పాల్గొన్నాడు నాటికి అతనికి పట్టుమని పాతిక సంవత్సరాలుకూడా లేవు. ఆరోగ్యవంతమైన శరీరం మొక్కవోని ధైర్యం ఆయన సహజ సంపద ! ఆయనంటే శత్రువు గుండెల్లో రైళ్ళు పరుగెత్తెవి. అందుకే తన దళ సభ్యులకు, ప్రజలకుకూడా కామ్రేడ్ కొండలరెడ్డి ప్రియమైన నాయకుడు కాగలిగాడు

కామ్రేడ్ రావుల వీరయ్య : సూర్యాపేట తాలూకా ఏపూరు గ్రామంలో కల్లుగీత కుటుంబానికి చెందినవాడు 18 వ ఏటనే గ్రామదళంలో జెరిన వీరయ్య, తర్వాత గెరిల్లా దళసభ్యుడై, కామ్రేడ్ కొండలరెడ్డి దళంలో ఉపనాయకుడైనాడు. నైజాం వ్యతిరేకపోరాటంలో ఎన్నోదళచర్యలలోఆయన పాల్గొన్నారు. ఎర్రపాడు క్యాంపుపై దాడిజేసినవారిలో ఆయనొకడు. ఆ సంద ర్భంగా అతనికి బాంబు దెబ్బతగిలింది. ఒక ఆపరేషన్ తర్వాత మామూలు వాడై తిరిగి దళంలో జేరి తన దళ నాయకులతోపాటు వీరమరణం పొందాడు.

కామ్రేడ్ జాన్ : సూర్యాపేట, నల్గొండ, రామన్నగూడెం, తాలూకాలలోని 40 గ్రామాలను మిలిటరీ చుట్టుముట్టింది ఆ గ్రామాలలోని మగవాళ్ళందరినీ వర్ధమానుకోటవద్ద మందవేసి దళాల రహస్యాలను చెప్పమని చిత్రహింసలు మొదలెట్టింది. ఆ సందర్భంలో సూర్యాపేట తాలూకా అర్వపల్లి గుట్టలదాపున దళకమాండర్ జాన్, మరో కామ్రేడ్ పట్టుబడ్డారు. వారిరువురనూ వర్ధమానకోట తీసుకువచ్చారు. దళాలకు సంబంధించిన రహస్యాలు వెల్లడించ టానికి నిరాకరించినందుకుగాను, వారిని ఆ ప్రజల సమక్షంలోనే నిలబెట్టి కాల్చి చంపారు.

కామ్రేడ్ జాన్ సూర్యాపేట తాలూకా జాజిరెడ్డిగూడెంలోని ఒక వ్యవసాయ కార్మిక కుటుంబానికి చెందినవాడు 1947 లో నైజాం వ్యతిరేక పోరాటంలో ముందుకువచ్చిన జాన్ తర్వాత గెరిల్లా దళాలలోజేరాడు. కోటపాడు, నూతనకల్లు, తిర్మలగిరివంటిచోట్ల జరిగిన చరిత్రాత్మక పోరాటా లలో పాల్గొనటమేగాక అసమానశౌర్యం ప్రదర్శించాడు తాండ్రై క్యాంపుపై దాడిలో అక్కడ షావుకారు యింట్లో ఏర్పరచిన పోలీసు క్యాంప్‌లోకి జాన్ చొచ్చుకుపోయాడు ఆ సందర్భంగా అతని తొడలోగుండా తుపాకిగుండు దూసుకుపోయింది. కోలుకున్న వెంటనే తిరిగి దళాల్లోకి వచ్చాడు ఎర్రపాడు, ఆత్మకూరు, కొడకండ్ల దాడులన్నింటిలో పాల్గొన్నాడు మామూలు దళ సభ్యుడుగా జేరిన జాన్ తన ధైర్యసాహసాలవల్ల త్వరలోనే దళనాయకుడి స్థానానికి రాగలిగాడు. భారతయూనియన్ సైన్యాలపై అనేక చర్యలలో ఆయన పాల్గొన్నాడు ప్రజలకు జాన్ అంటే ప్రాణం – ఆయన తన ప్రాణా న్నైనా తృణప్రాయంగా త్యజించాడు కానీ ఒక్క రహస్యమైనా బయటపెట్ట లేదు. ఈనాటకీ ప్రజలు కామ్రేడ్ జాన్ ధైర్యసాహసాలనుగూర్చి కథలుగా చెప్పుకుంటారు. ఆయనతోపాటు పట్టుబడి, చిత్రహింసలకు గురియై కాల్చి చంపబడిన మరొక కామ్రేడ్ విలియంకూడా అంతే.

కామ్రేడ్ మచ్చా వీరయ్య: ఖమ్మం తాలూకా గోకినేపల్లి గ్రామానికి జెందిన చిన్న భూస్వామ్య కుటుంబానికి జెందినవాడు ఆంధ్ర మహాసభ ముఖ్య కార్యకర్తగా వుంటూ, 1943 – 46 మధ్య ఎన్నో ప్రజా వుద్యమాలలో పాల్గొన్నాడు 1947 – 48 నాటికి ఒక ప్రాంతీయదళ నాయికు డైనాడు. యూనియన్ భూభాగంనుండి పిండిప్రోలు ప్రాంతంలోని దళాలను కలుసుకునే సందర్భంగా రాకపోకలలో ఒకటి రెండు రోజులు ఈ కామ్రేడ్‌తో గడిపే అవకాశం నాకు కలిగింది. ఆయన గుట్టల్లో, రాళ్ళమధ్య ఎండకు ఎండుటూ, వానకు తడుస్తూ, తన మిగతాదళ సభ్యులతోపాటే గడిపేవాడు. ఆ దళంలో ఆ ప్రాంతానికే చెందిన చాలా పేదవారు అణగారిన ప్రజలు సభ్యులుగా వున్నారు. తన లోటుపాట్లనుగూర్చి దళ సభ్యులనుండి నిశితమైన విమర్శనలను ఆయన ప్రోత్సహించేవారు. వారి విమర్శలు స్వీకరించి తన పొర పాట్లు అంగీకరించి మరికయెన్నడూ అలాంటి తప్పిదాలు జరగకుండా చూసు కుంటానని వాగ్దానం చేసేవాడు అందుకే దళ సభ్యులకు సహచరులకు కామ్రేడ్ మచ్చావీరయ్య అంటే అంతులేని ఆప్యాయత విశ్వాసము వుండేవి ! రజాకార్ దాడులు వుధృతమైనప్పుడు రావెళ్ళ జానకిరామయ్యలాంటి జిల్లా

నాయకుడు రక్షణకోసం యూనియన్ భూభాగంలో కెళ్లాడు పార్టీ పదేపదే ఆదేశించినప్పటికీ ఆయన రంగంలోకి తిరిగిరాలేదు. కాని కామ్రేడ్ మచ్చా వీరయ్య ప్రమాదకరమైన ప్రాంతంలోనేవుండి ప్రజలమధ్యనే పనిజేస్తూ వచ్చాడు.

యూనియన్ సైన్యాలు ప్రవేశించిన తదుపరి ఆ ప్రాంతంలోనే వుంటూ, ఆ ప్రాంత ప్రజలను పోరాటం కొనసాగించమని ప్రోత్సహిస్తూ సంచరిస్తున్న సమయంలో ఆయనదళాన్ని మిలటరీ చుట్టుముట్టింది. కామ్రేడ్ వీరయ్య ఆయన సహచరుడు కామ్రేడ్ కృష్ణమూర్తి దొరికారు. వీరయ్యను ఎన్నో చిత్రహింసలకు గురిచేసింది మిలటరీ. చివరికి అతనికి రెండుకళ్లూ తోడించినదని కూడా చెప్పుకుంటారు. అయినా కామ్రేడ్ వీరయ్య ఒక్క రహస్యమైనా బయటపెట్టలేదు. తర్వాత కామ్రేడ్ వీరయ్యను, కృష్ణమూర్తిని సైన్యం కాల్చి చంపింది. ఖమ్మం పట్టణంలోను పరిసర గ్రామాల్లోనూ ఆయన శవాన్ని ప్రజలకూ అదేగతి పడుతుందని భయపెట్టేందుకై ప్రదర్శించారు. ప్రజలు కన్నీరు కార్చారు. కోపంపట్టలేక పటపట పండ్లుకొరికారు. నేటికీ వీరయ్యను గూర్చి ఆ ప్రాంత జనులు యెంతో విచారంగా ఆప్యాయంగా చెప్పుకుంటారు.

కామ్రేడ్ శ్రీనివాసరావు : గంగవరపు శ్రీనివాసరావు దళం ఖమ్మం తాలూకా కాచిరాజుగూడెం గుట్టలలో దాక్కుందన్న సంగతి మిలటరీకి తెలిసింది ఈ దళానికి కొరియర్‌గా దొండేటి సూరి అని ఒకడుండే వాడు. వాడు ప్రజా వ్యతిరేక కార్యక్రమాలలో పాల్గొంటున్నాడని అతడిని నమ్మకూడదని కామ్రేడ్ శ్రీనివాసరావును తోటి కామ్రేడ్స్ హెచ్చరించారు. కానీ శ్రీనివాసరావు వాళ్ళమాట పెడచెవినిపెట్టి సూరిని నమ్మేవాడు చివరకు ఆ సూరి ద్రోహంవల్లే మిలటరీకి, శ్రీనివాసరావు స్థావరం తెలిసింది. మూడు మైళ్లు వ్యాపించిన ఆ గుట్టలను మిలటరీ చుట్టుముట్టి రాత్రికి రాత్రే సెర్చి లైట్ల'తో ఆ గుట్టలు గాలించటం మొదలెట్టారు.

ఆ దళం సెంట్రీ వెంటనే మిగతా దళసభ్యులను లేపాడు. దళంలేచి చుట్టూ కలయజూచింది. మిలటరీ దాపుకువస్తున్నది. పైపెచ్చు వెన్నెలరాత్రి. యేంచెయ్యాలా అన్న ఆలోచనలో పడిందిదళం. ఈలోపల ఒక సైనికపటాలం మరీ చేరువకు వచ్చింది. "ఇక ఆలోచించి ప్రయోజనంలేదు కాల్చండి మనం శత్రువులకు ప్రాణాలతో దొరికేప్రశ్న లేదు" అని శ్రీనివాసరావు తన దళాన్ని ఆజ్ఞాపించాడు. తానొక స్టెన్‌గన్‌తో చుట్టూరా కాల్పులు సాగించాడు ఆయన సహచరులూ నిప్పులు కురిపించారు. శత్రుసైన్యం హడలిపోయింది. కొంతమంది సైనికుల ప్రాణాలు గాలిలో కలిశాయి. చాలామంది గాయపడ్డారు.

దీనితో మిగతా సైన్యంకూడా అచ్చటికే చేరింది. ఆ గుట్టలలో తప్పించుకుపోవటం అసాధ్యం. అందువల్ల ఏదోఒక రాతిబండలను మాటు

జేసుకుని కాల్పులు జరిపారు. తుపాకిమోతలతో పిడుగులుపడ్డట్లు చుట్టుపక్కల గ్రామాలు మేల్కొన్నాయి. యేంజరుగుతున్నదో అని జనం చెవులు నిక్కరించి వింటున్నారు.

దళం వద్దగల మందుగుండు సామగ్రి అయిపోయింది. చివరితూటా వరకు సద్వినియోగం చేయబడ్డది. దళం వైపునుండి కాల్పుల మోత ఆగిపోయింది. శత్రుపక్షాలనుండి కాల్పులు సాగుతూనేవున్నాయి. అయినా తెల్లవారితేగానీ సైన్యానికి దళందాపుకు వెళ్ళేందుకు దమ్ములులేవు. తీరా వెళ్ళిచూస్తే యేముంది! తమ చేతుల్లో తుపాకులు గట్టిగా పట్టుకునే దళం చచ్చిపడివుంది.

ఆ శవాన్ని తీసుకుని, కామ్రేడ్ శ్రీనివాసరావు స్వగ్రామం అయిన వెంకటాయపాలెం జేరింది మిలటరీ. వూళ్ళో పిన్న, పెద్ద అందర్నీ బలవంతాన కూడేసి ఆ శవాల్ని వాళ్ళకి చూపించారు. ప్రజలు పసిపిల్లలలాగా విలపించారు.

కామ్రేడ్ శ్రీనివాసరావు, ఒక భూస్వామ్య కుటుంబానికి చెందిన వాడు మెట్రిక్యులేషన్ కృతార్థుడైనాడు విద్యార్థి వుద్యమంలో వుత్సాహంగా పాల్గొన్నాడు. 1945 నుండి ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టు పార్టీలతో సంబంధం పెట్టుకుని, భూస్వాములకు దేశముఖులకు వ్యతిరేకంగా యెన్నో వుద్యమాలు నడిపాడు

ఖమ్మంతాలూకాలో సమర్థుడైన నాయకులలో ఒకడైనాడు. పదుల కొద్దీ గ్రామాలుగల ఒకమండలానికి ఆర్గనైజరుగా దళాలు నిర్మించి ఆప్రాంతాన్నే రజాకార్లకు దుర్భేద్యంగా మలిచాడు. మిలటరీ దురాగతాలను ప్రతిఘటించ టానికి ప్రజలను సన్నద్ధం జేశాడు. తానే స్వయంగా నాయకత్వం వహించి దాడులు జరిపి మిలటరీకి ఎంతో నష్టం కలుగజేశాడు.

వెంకటాయపాలెం ప్రజలు అమరవీరుడు కామ్రేడ్ శ్రీనివాసరావు భౌతికకాయాన్ని సర్వలాంఛనాలతో సమాధి జేశారు. నేటికీ అక్కడ ఆయన స్మృతి చిహ్నం వుంది. ప్రతి సంవత్సరం ఆ మృతవీరుని స్మారక దినం జరుగుతుంది.

కామ్రేడ్ ఆల్వాల నర్సింహారెడ్డి: కామ్రేడ్ నర్సింహారెడ్డి నల్లగొండజిల్లా మిర్యాలగూడెం తాలూకా ఆల్వాల గ్రామంలో చిన్న రైతు కుటుంబంలో జన్మించాడు. అతడంటే శత్రువుకు, అతనికి తాబేదార్లయిన భూస్వాములు, పటేల్, పట్వారీలు మొదలైన ప్రజాకంటకులకు సింహస్వప్నం. ఆయన ప్రజలకు ప్రియతమ నాయకుడు. ఆ పరిసర ప్రాంతాలలో పుల్లరితో సహా అన్నిరకాల పన్ను వసూళ్ళు జరగకుండా నిలిపివేశాడు. ఇబ్రహీంపట్నం

వంతెన వద్దవున్న మిలటరీ లారీలపై విజయవంతంగా దాడి చేశాడు ఎల్లల మంద గ్రామంలో విడిచిన మిలటరీపై మెరుపుదాడి చేసేసరికి మిలటరీ పలాయనం చిత్తగించింది. చర్లకుంట గ్రామంలో కాల్పులు జరిపి ముగ్గురు శత్రు సైనికులను ఖతం చేశాడు.

భారత సైనిక అధికారులు ఆయన కొరకు వేటాడ నారంభించారు. దిండి నదీ తీరంలో ఒక పశువుల మంద మధ్య కామ్రేడ్ నర్సింహా రెడ్డి వున్నాడని తెలిసి మిలిటరీ ఆ మందపై కాల్పులు సాగించింది. వెంటనే నర్సింహా రెడ్డి ఒక దున్నపోతు మీదయెక్కి నదిదాటి ఆవలి వడ్డునవున్న గుట్టల్లో అదృశ్యమైపోయాడు

రెండు సంవత్సరాల తర్వాత 1951 జులైలో మేము ఆ ప్రాంతం మీదుగా వెళ్తున్నప్పుడు నాతోవున్న దళ సభ్యులు ఆ చోటు చూపించి నర్సింహా రెడ్డి వీరకృత్యాలనుగూర్చి యెంతో గర్వంగా చెప్పారు.

ఆయనకు బాగా జ్వరం వచ్చి, తెప్పలమడుగు గ్రామంలో ఒక స్నేహితుని ఇంట్లో ఆశ్రయంతీసుకున్నాడు సంగతి తెలిసినమిలటరీఆగ్రామాన్ని చుట్టు ముట్టింది. తన స్నేహితునికి ఏ ఆపద రాకుండా వుండేందుకు నర్సింహా రెడ్డి ఆ యింట్లోంచి బయటకువచ్చి తన తుపాకితోసహా వూరి పొలిమేరలలో మిలటరీతో తలపడ్డాడు. అతని గురి అమోఘం సైనికులను అడుగు ముందుకు వేయనివ్వలేదు నర్సింహా రెడ్డి వద్ద మందుగుండు అయిపోవస్తున్నది అది గ్రహించి, ఆతడు చివరిగుండుతో తననే కాల్చుకున్నాడు గాని ప్రాణాలతో శత్రువులకు చిక్కలేదు చాలాసార్లు కాల్పులు జరిపిన తర్వాత నర్సింహా రెడ్డి మరణించి వుంటాడని నిర్ధారణ చేసుకున్న మిలటరీ ఆతని శవాన్ని సమీపించిది ఆ మిలటరీ కమాండర్ నర్సింహా రెడ్డి ధీరత్వానికి జోహారు లర్పించి అశ్రుపూరితులైన ఆ గ్రామ ప్రజల సమక్షంలో ఆ వీరుని భౌతికకాయానికి సైనిక లాంఛనాలతో అంత్యక్రియలు జరిపించాడు

1952 లో నేను అల్వాల గ్రామానికివెళ్ళి ఈ మహాయోధుని తల్లిని పరామర్శించాను. ఆయనపట్ల పార్టీకిగల గౌరవభావాన్నిగూర్చి తెలియజేశాను. ఆయన మరణంపట్ల పార్టీ తరపున ఆమెకు సానుభూతి ప్రకటించివచ్చాను.

కామ్రేడ వల్లభనేని సీతారామయ్య దేవరకొండ తాలూకాలో కంబ్లపల్లి గ్రామంలో ఒక నూతిసమీపంలో కామ్రేడ్ సీతారామయ్యా ఆయన దళం విశ్రమిస్తున్నారు. ఈ సంగతి స్థానిక ప్రజాశత్రువు వెంకటరెడ్డి

తెలుసుకొని గూర్ఖాసైన్యాన్ని తీసుకువచ్చాడు. వాళ్ళు ఆ దళాన్ని చుట్టు ముట్టారు. 1948 డిసెంబరు చివరిలో జరిగిన ఈ పోరాటంలో కామ్రేడ్ సీతారామయ్య అసువులు బాశారు

కామ్రేడ్ సీతారామయ్య పెంచికలదిన్నె గ్రామంలోని ఒక మధ్య తరగతి రైతు కుటుంబానికి చెందినవాడు. 9 వ తరగతివరకు చదువుకున్నాడు. చిన్నతనుండే వ్యవసాయ కార్మికులన్నా, పాలేర్లన్నా ఎంతో సానుభూతిగా వుండేవాడు. తన గ్రామంలో వ్యవసాయ కూలీలు, జీతాలు పెంచమని సమ్మె చేసిన సందర్భంలో కన్న తండ్రినికూడా యెదిరించి పేదలపక్షాన నిలబడ్డాడు. సూర్యాపేటలో దొంగ వ్యాపారస్థులకు, లంచగొండి అధికార్లకు వ్యతిరేకంగా పోరాటంలో చురుకుగా పాల్గొన్నాడు. హైస్కూలు హెడ్‌మాష్టర్ దురాగతాలన్ను యెదిర్చి, విద్యార్థులు సాగించిన పోరాటానికి నాయకత్వం వహించి వారి విశ్వాసాన్ని చూరగొన్నాడు 1947 లో స్కూళ్లు బహిష్కరించాలి అన్న పిలుపునందుకుని తెలంగాణా ప్రజావుద్యమంలోజేరి, ఆ వుద్యమంయొక్క ప్రియతమ నాయకులలో ఒక్కడైనాడు యూనియన్ ప్రాంతంలో ద్వీపంగా వున్న మునగాలలోవున్న పార్టీ ఆఫీసు బాధ్యతలు నిర్వహించాడు. పిదప మిర్యాలగూడెంతాలూకా రామడుగు ప్రాంతీయ రాజకీయ ఆర్గనైజర్‌గా, దళ కమాండరుగా పనిజేశాడు ప్రజలను వుత్సాహపరచి దగ్గర్లోవున్న చెరువునుంచి కాలువ తవ్వించి, మెట్ట పొలాలకు నీరు అందించాడు. మిలిటరీ దాడులు ఎక్కువ కావటంతో, దేవరకొండ తాలూకా అడవులలోకి వెళ్లాడు. అచిర కాలంలోనే ఆ చుట్టుపక్క గ్రామాల ప్రజల తలలో నాల్కయై స్థానిక దోపిడీ దార్లకు వ్యతిరేకంగా పోరాటాలు నడిపాడు.

కంబపల్లి గ్రామంలో అతని దళంపైదాడి జరిగినప్పుడు కామ్రేడ్ సీతారామయ్య శత్రు కాల్పులన్నింటినీ తనవైపుకు తిప్పుకుని మిగతాదళ సభ్యులను తప్పించుకొమ్మని సలహాయిచ్చాడు. గూర్ఖాసైనికుల తుపాకి గుళ్ళకు బాగా గాయపడి కళ్లు మూసుకు పడిపోయాడు. తీరా మిలటరీ అతని దగ్గరకు జేరేసరికి ప్రాణాలు కోల్పోయినట్లు నటిస్తున్న సీతారామయ్య తన చేతిలోదాచివుంచిన గ్రెనేడ్‌ను శత్రువులపై విసిరాడు. ఆ ప్రేలుడుకు మరికొంత మంది గూర్ఖా సైనికులు ఖతంఅయ్యారు ఆ సందర్భంలోనే కామ్రేడ్ సీతారామయ్య వీరమరణం పొందాడు.

కామ్రేడ్ పాశం రామిరెడ్డి: కామ్రేడ్ రామిరెడ్డిది కుర్రారం గ్రామం. ధనికరైతు కుటుంబంలో జన్మించాడు. 1947 – 48 మధ్యకాలంలో నైజాం సైన్యాలకు రజాకార్లకు వ్యతిరేకంగా ఎన్నో దాడులలో పాల్గొన్న

యీకామ్రేడ్ భువనగిరి ప్రాంతంలో అందరికన్నా అనుభవజ్ఞుడైన దళనాయకుడు భారత సైన్యాల ప్రవేశానంతరం భువనగిరి తాలూకాలో ఎన్నో రజాకార్ క్యాంపులను అతడు ఖాళీ చేయించాడు రజాకార్‌లకు బాగా బలమైన ఒక క్యాంపుకు తన దళంతో వెళ్ళి వాళ్ళను లొంగిపొమ్మని హెచ్చరించాడు. వాళ్లు అందుకు వొప్పుకున్నారు. రామిరెడ్డి దళసభ్యులు రజాకార్‌లవద్ద ఆయుధాలు గుంజుకుని వాళ్ళని నిరాయుధుల్ని చెస్తుంటే కామ్రేడ్ రామిరెడ్డి పర్యవేక్షణ చేస్తున్నాడు ఆ సమయంలో అక్కడేదాక్కొనివున్న కొందరు రజాకార్‌లు దొంగచాటుగా రామిరెడ్డిని కాల్చిచంపారు. వెంటనే కోపోద్రక్తులైన ప్రజలు తమ ప్రియతమ నాయకుడి హత్యకు ప్రతీకారం చేశారు. అయినా యూనియన్ సైన్యాలు అడుగుపెట్టిన తర్వాత ఏర్పడ్డ విపత్కర పరిస్థితిలో అంతటి అనుభవజ్ఞుడైన నాయకుడులేనిలోటు పూడనేలేదు.

కామ్రేడ్ రామానుజాచారి ఈ కామ్రేడ్ భువనగిరి తాలూకాకు చెందిన ఒక కేంద్రం ఆర్గనైజర్. చిర్రాకోడూరు గ్రామం శివారులలో ఒక్కడే ఒక చేలో పడుకుని వున్నాడు ఆ గ్రామంలో పార్టీ శత్రువులు ఆ విషయాన్ని పోలీసులకు తెలియజేశారు. వంటరిగా నిద్రిస్తున్న అతణ్ణి పోలీసులు చుట్టుముట్టి దాపునేవున్న తమ క్యాంపుకు తీసుకువెళ్ళి నానా చిత్రహింసలు పెట్టారు. "మీరు నరరూప రాక్షసులు – మీ ఘాతుకాలేవి నా నోటి నుండి ఒక్క రహస్యాన్నికూడా కక్కించలేరు" అన్నాడేగాని కామ్రేడ్ రామానుజాచారి ఇంకేమీ మాట్లాడలేదు. అతని నుండి ఏ సమాచారమూ లాగటం అసంభవం అని గ్రహించిన మిలటరీ అతనిని సన్నీలతో పొడిచి, యింకా ప్రాణం వుండగానే ఇసుకలో పూడ్చిపెట్టారు. ఆ సంగతి తెలిసి, మర్నాడు ఆ పరిసర ప్రాంతాల ప్రజలు వెళ్ళి కామ్రేడ్ రామానుజాచారి భౌతికకాయాన్ని వెలికితీసి అమరవీరునికి వుచితమైన విధంగా భక్తి శ్రద్ధలతో అంత్యక్రియలు జరిపారు.

కామ్రేడ్ కోదండ రామిరెడ్డి : నేటి భువనగిరి తాలూకా బ్రాహ్మణపల్లి గ్రామంలో ఒక ధనికకుటుంబానికి చెందినవాడు కామ్రేడ్ కోదండ రామిరెడ్డి. విద్యార్థి వుద్యమాలెన్నింటిలోనో పాల్గొన్న యీ కామ్రేడ్ క్రమంగా ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీలలో చేరాడు. దేశముఖులకు వ్యతిరేకంగా అతడెన్నో ప్రజాఉద్యమాలు నడిపాడు. ప్రజలు అతనిని ఆప్యాయంగా పెద్దన్న అని పిలుచుకునేవారు.

కామ్రేడ్ కోదండ రామిరెడ్డి రాజకీయ నాయకుడేకాక, గెరిల్లా నాయకుడుకూడా. ఇందిరాల, గోకారం గ్రామాలలోని రజాకార్ క్యాంపులపై దాడిచేసి వారికి తీరననష్టం కలిగించాడు. గుండ్రాంపల్లి నిజాం క్యాంపుపై జరిగిన చరిత్రాత్మకదాడికి నాయకత్వం వహించిందితడే. అందులో వందమంది

రజాకారులవద్ద ఆయుధాలను గుంజుకుని ఆక్యాంపు మొత్తాన్ని నేలమట్టం చేశాడు. భారతసైన్యాల ప్రవేశానంతరం వాటిపైనకూడా ఎన్నోదాడులు జరిపాడు.

భీతి అన్నది యెరుగని యోధుడాతడు. శతృవులకు ప్రాణసంకటు మాతడు. కనుక సహజంగానే, శతృవు తన సర్వశక్తులతో కామ్రేడ్ కోదండ రామిరెడ్డిని వేటాడబూనుకున్నాడు. తుట్టతుదకు శతృవు లాతనిని పట్టుకో గలి గారు. దొరికిందే చాలని కాల్చిచంపారు. ప్రక్కనేవున్న కామ్రేడ్ గాలి హను మయ్య వెంటనే శతృవులపై తూటాల వాన కురిపించాడు. శవాన్ని వదిలి శతృవులు పారిపోక తప్పలేదు. ప్రజలు, గాలి హనుమయ్య కలిసి కామ్రేడ్ కోదండ రామిరెడ్డి భౌతిక కాయాన్ని పెద్ద వూరేగింపుగా తీసుకువెళ్ళి గౌర వాభివందనలతో అంత్యక్రియలు జరిపారు ఆ వీరుని మరణానికి విల పించనివారు లేరు.

కామ్రేడ్స్ హనుమయ్య-సూర్యనారాయణ : సూర్యాపేటకు జెందిన కామ్రేడ్ జి. హనుమయ్య నాయకత్వానగల దళము రామన్నపేట తాలూకాకు జెందిన కామ్రేడ్ సూర్యనారాయణ నాయకత్వానగల దళమూ కలిసి సైనిక కాపలాతో వెళుతున్న కల్లులారీని ఆపాలని, వాళ్ళవద్దగల ఆయు ధాలను స్వాధీనం చేసుకోవాలనీ పథకం వేసుకున్నారు. పిల్లాయిపల్లి సమీ పంలో రోడ్డుకు యిరువైపులా యీ రెండు దళాలు కాపుకాశాయి.ఈ దళాలలో ఒక సభ్యుడు, మామూలు రైతులాగా వెళ్ళి లారీని ఆపమని చెయ్యెత్తాడు. లారీ ఆగీ ఆగంగానే అక్కడే దాక్కొనివున్న మిగతా దళసభ్యులు వచ్చి తుపాకులు యెక్కుపెట్టి బెదిరించి ఆయుధాలు వూడపెరుక్కున్నారు.

ఆ ఆయుధాలతోసహా 'మూసి' నది వద్దకు జేరారు. కానీ ఆ రోజే మిలటరీ ఆ ప్రాంతమంతటినీ చుట్టేసింది. ఆ వలయాన్ని ఛేదించుకు పోవాలని యీ దళాలు ప్రయత్నించినాయి కానీ వీల్లేక పోయింది. కామ్రేడ్ హనుమయ్య, కామ్రేడ్ సోమిరెడ్డి అనే యింకో దళ సభ్యుడు అక్కడికక్కడే మరణించారు. కామ్రేడ్ హనుమయ్య గుండెల్లోకూడా తుపాకిగుండు దూసుకు పోయింది. కామ్రేడ్ సూర్యానారాయణ బాగా గాయాలుతగిలి పడిపోయాడు. అతని చేతిలో తుపాకి అట్లాగేవుంది. అది గమనించిన శత్రువులు అతనిపై మళ్ళీ మళ్లీ కాల్పులుజరిపి కామ్రేడ్ సూర్యనారాయణ చనిపోయాడని నిర్ధారణచేసు కునిగాని అతన్ని సమీపించలేదు. ఆ పోరాటంలో బ్రాహ్మణపల్లికి జెందిన కామ్రేడ్ అచ్చయ్య. కొలనుపాకకు జెందిన కామ్రేడ్ ఈగల రామిరెడ్డి మృతి జెందారు. ఆ విధంగా ఆ రెండు దళాలు దాదాపుగా పూర్తిగా అంతమయ్యాయి.

కామ్రేడ్ హనుమయ్య సూర్యాపేట తాలూకాకు చెందిన ఒక సామాన్య కుటుంబీకుడు. 1943 నుండే ఆంధ్రమహాసభలో, పార్టీలో పని జేస్తున్నాడు. గెరిల్లాదళాలు ఏర్పడ్డ తర్వాత దళ నాయకుడైనాడు. నైజాం సైన్యానికి, భారతసైన్యాలకువ్యతిరేకంగా జరిగిన దాడులెన్నింటిలోనో పాల్గొని ఎంతోమంది శత్రుసైనికులను హతమార్చినవీరుడాతడు. చుట్టుముట్టడిదాడులు ప్రారంభమైన తర్వాత ఆయన షిర్కే తాలూకాలోకి తప్పుకున్నాడు. పోరాటంలోనే వీరమరణం పొందాడు.

కామ్రేడ్ సూర్యనారాయణ నల్గొండ తాలూకా కొత్తపల్లి గ్రామ వాసి. సామాన్య కుటుంబానికి చెందినవాడు. విజయవాడ, తెనాలి పట్టణాలలో హెూటళ్ళలో పనిచేస్తూ పొట్టపోసుకునేవాడు. తర్వాత బ్రిటిష్ సైన్యంలో జేరాడు. రెండో ప్రపంచయుద్ధం తర్వాత సైన్యం నుండి తిరిగివచ్చాడు. త్వరలోనే నైజాం వ్యతిరేకపోరాటంలో దళనాయకుడైనాడు. నల్గొండ, భువనగిరి తాలూకాలలో పనిజేశాడు. పోరాటంలో జీవితం చాలించాడు.

కామ్రేడ్ పద్మారెడ్డి : సంషాల గ్రామానికి పోలీస్ పటేల్‌గిరీ చేసేవాడు ఆ వుద్యోగాన్ని వదలుకొని ఆంధ్రమహాసభలో చేరాడు. తర్వాత కమ్యూనిస్టుపార్టీలో చేరాడు. భారత సైన్యాల ప్రవేశానంతరం అతణ్ణి అరెస్టు చేసి కష్టడీలో వుంచారు. కాని పన్నాల లక్ష్మారెడ్డి, పన్నాల నారాయణరెడ్డి, సిద్ధారపు ఎంగువారు అనే భూస్వాములు మిలటరీకి లంచంయిచ్చి 1949 జూన్‌లో కామ్రేడ్ పద్మారెడ్డిని కాల్చిచంపించారు.

కామ్రేడ్ గబ్బెట తిరుమలరెడ్డి · 1946 లో జనగాం మిషన్ హైస్కూలులో మెట్రిక్యులేషన్ పరీక్షకు సన్నద్ధమవుతూకూడా ఆ ప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రమహాసభ విస్తృతికై కృషిచేశాడు. తిరుమలరెడ్డి 1947 లో కాలేజీలు బహిష్కరించాలనే పిలుపునందుకొని తన గ్రామంవచ్చి కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తగాజేరి, త్వరలోనే దళ నాయకుడైనాడు. అతడెన్నో ప్రజాహిత కార్యములతో ముడిపెట్టుకున్నాడు. తిరుమలరెడ్డి పేరుచెప్పితేనే శత్రువులు గజగజలాడేవారు. అతని స్వగ్రామమైన గబ్బెటలోనే ఒక ద్రోహి అందించినసమాచారంవల్ల యూనియన్‌సైన్యాలతన్నిపట్టుకున్నాయి. ఆనాడువాటి సంతోషం అంతాయింతా కాదు. కామ్రేడ్ తిరుమలరెడ్డిని చిత్రహింసలకు గురి చేసి, చివరికి కాల్చిచంపారు. అయన మరణవార్త ఆప్రాంత ప్రజానీకాన్ని విషాదంలో ముంచెత్తింది. నేటికీ ఆయననుగూర్చి జనం పాటలుపాడుకుంటారు. ప్రతి సంవత్సరం అతని స్మారకసభ జరుపుకుంటారు.

కామ్రేడ్ రేకుల లక్ష్మారెడ్డి: కామ్రేడ్ లక్ష్మారెడ్డి, పెండ్యాల రాఘవరావు, మరి ముగ్గురు కామ్రేడ్స్, వరంగల్లు తాలూకా కొత్తపల్లి గ్రామంలో వున్నట్లు కాంగ్రెస్ సి. ఐ. డి లకు తెలిసింది. ఇంకేం 60 మంది మిలటరీ ఆ యింటిని చుట్టుముట్టారు. మిలటరీ వస్తున్న చప్పుడు కాగానే యీ కామ్రేడ్ తప్పించుకోజూచాడు. కాని, యీ లోపలే మిలటరీ కాల్పులు మొదలెట్టి కామ్రేడ్ లక్ష్మారెడ్డిని కాలుకి గాయమైంది. ఆయనా పెండ్యాల రాఘవరావు పట్టుబడ్డారు. మిగతా ముగ్గురు కామ్రేడ్స్ తప్పించుకున్నారు. రాఘవరావును జైలుకు పంపారు. కామ్రేడ్ లక్ష్మారెడ్డిని ఖానాపురం క్యాంపుకు తీసుకువెళ్ళారు. మిలటరీ, స్థానిక ప్రజాకంటకులు కలిసి, కామ్రేడ్ లక్ష్మారెడ్డి బీర్జాలు చితగ్గొట్టి దారుణంగా హత్యజేశారు.

కామ్రేడ్ సీతారామారావు. కామ్రేడ్ పొనుగోటి సీతారామారావు సూర్యాపేట తాలూకా చందుపట్ల గ్రామానికి జెందిన ఒక ధనిక రైతు కుటుంబానికి చెందినవాడు. 1946 నుండి విద్యార్థి వుద్యమాలలో పనిచేస్తూ 1947 "కాలేజీ బహిష్కరణ" పిలుపు ననుసరించి వరంగల్లు కాలేజీ వదిలేశాడు. తన ప్రాంతంలో ఒక కేంద్ర ఆర్గనైజరుమాత్రమేగాక ఒక దళ నాయకుడు కూడా. యూనియన్ సైన్యాల ప్రవేశానికి పూర్వం, మామిళ్ళగూడెం నిజాం క్యాంపుపై మెరుపుదాడి, చందుపట్ల, కాంపాడుమధ్యగల రోడ్డు ధ్వంసం, చివ్వెంల, కాంపాడు గ్రామాలలోని రజాకాకార్లపై దాడి, మొదలైన యెన్నో ఘటనలతో సంబంధంగల కామ్రేడ్ యితడు మదించిన భూస్వాములభూములు పేదలకు పంపిణీ చేసిన సీతారామారావు అంటే శత్రువులు హడలిచచ్చేవారు. "పోలీసు చర్య" తర్వాత అడవులలోకి వెళ్ళినవారిలో ఈయనొకడు. అక్కడ ప్రాంతీయ ఆర్గనైజరు బాధ్యతలు స్వీకరించాడు కొత్త ప్రాంతం! లయినా కామ్రేడ్ సీతారామారావు చురుకుగా కార్యక్రమంలోకి పోగలిగాడు. "ఎక్కడున్నా అదే పేదజనం. ఎక్కడున్నా అదే దుర్మార్గుడైన శత్రువు–కొత్తేమిటి ?" అనేవాడు. కొత్తగా చాలా గ్రామాల్ని కదిలించాడు. భూస్వాముల ధాన్యాన్ని పంచాడు. కొత్తగా ఎన్నో వందల ఎకరాలు సాగులోకి తెచ్చాడు. ప్రజా ద్రోహులపై పోరాటాలు నడిపాడు. ఇల్లెందు బొగ్గుగనుల ప్రాంతంలో మందుగుండు గిడ్డంగి వశం చేసుకుని ఎంతో మందుగుండు సంపాయించటంలో ప్రధాన బాధ్యత వహించాడు. కారేపల్లి, కొత్తపల్లి మిలిటరీ క్యాంపులపై మెరుపుదాడులు చేశాడు. తుదకు పోరాడుతూనే మరణించాడు ఆయన మరణాన్ని గూర్చి రెండు రకాలుగా చెపుతారు. పెద్ద తాళ్ళగడ్డ (ఇల్లెందు తాలూకా) వద్ద అడవులలో సీతారామారావు మరి యిద్దరు దళ సభ్యులు విశ్రమిస్తున్నారన్న వార్త మిలటరీకి జేరంగానే వారా ప్రాంతాన్ని హుటాహుటిగా

ఆక్రమించి మన కామ్రేడ్స్‌పై కాల్పులు జరపగా మన కామ్రేడ్స్; తమ చివరి తూటావరకు శత్రువుల నాశనానికే వినియోగించి ఇక మందుగుండులేని తరుణంలో శత్రువుకు చిక్కారు.

[కామ్రేడ్ సీతారామారావు మానుకోట తాలూకా పోచవరం గ్రామంలో తన సహచరుడైన కామ్రేడ్ సంఘంతోపాటు విశ్రాంతి తీసుకుంటున్నాడనీ, ఆ వార్త మిలిటరీకి గ్రామంలోని తన తాబేదార్ల ద్వారా చేరిందనీ, మిలిటరీ యీ కామ్రేడ్స్‌ను చుట్టేసి, రహస్యాలుచెప్పమని నానాబాధలు పెట్టి, వారినుండి అక్షరంముక్క రాబట్టలేక కాల్చిచంపిందనీకూడా చెప్పుకుంటారు ]
ఏది ఎమైనా ఆ సమయంలో కామ్రేడ్ పానుగోటి సీతారామారావు మరణం పార్టీకి చాలా పెద్ద లోటుగా వుండేది.

కామ్రేడ్ అనిరెడ్డి రామిరెడ్డి. కామ్రేడ్ రామిరెడ్డి సూర్యాపేట తాలూకా రామన్నగూడెంలో ఒక భూస్వామ్య కుటుంబంలో జన్మించాడు. 1947 లో కాలేజీ చదువుకు స్వస్తి చెప్పి, పార్టీ పిలుపుననుసరించి వుద్యమంలో జేరాడు అప్పటికే అతని సోదరులు ముగ్గురు పార్టీలో ప్రముఖస్థానాలలో వున్నారు. జాజిరెడ్డిగూడెం మండలం అర్గనైజరుగా బాధ్యత తీసుకొని, సూర్యాపేట, నల్గొండ, భువనగిరి తాలూకాలలో నిదాదాపు వందగ్రామాలలో ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించాడు. వేల యెకరాలు, వేలాది పశువులు పంపిణీ అతని నాయకత్వాన జరిగింది.

జాజిరెడ్డిగూడెం ప్రాంతంలోని రోడ్డు విధ్వంసక కార్యక్రమం, అతని కార్యక్రమాలలో,చెప్పుకోదగింది. ఈ సందర్భంగా శత్రువు బొల్లంపల్లిలో 12 మంది, కాసర్లపాడులో 18 మంది, రామన్నగూడెంలో 18 మంది, పాతర్లపాడులో 12 మంది, వ్యవసాయ కార్మిక, రైతు యువకుల్ని చంపి, రోడ్డు తవ్వినగుంటలలోపాతేశాడు. కామ్రేడ్ రామిరెడ్డిదళం వారుప్రజల్నికదిలించి చాలాసార్లు రజాకార్లపై దాడిచేసి కసితీర్చుకున్నారు. 13 మైళ్ళ పొడుగునా ఆ ప్రాంతంలో రోడ్డు ధ్వంసం చేయబడింది. ఒక విధంగా కామ్రేడ్ రామిరెడ్డి పట్టుదల, దృఢదీక్ష యీ రోడ్డు ధ్వంసకార్యక్రమానికి దోహదపడింది. హైద్రాబాద్‌కు భారత సైన్యాలు ప్రవేశించిన తరుణంలో పణిగిరి రజాకార్ క్యాంపుపై దాడిచేసి, వారిని లొంగదీసి వారివద్ద వున్న ఆయుధాలు గుంజుకున్నారు, రామిరెడ్డి అతని దళమూ !

వర్షాకాలం ప్రారంభం కాగానే మైదాన ప్రాంతంలో మళ్ళీ పార్టీ నిర్మాణాన్ని శత్రువును యెదుర్కొనేందుకు అనువుగా పునర్నిర్మించే ప్రయత్నం ప్రారంభించారు. 1950 సం॥ ఆగస్టు 2వ తేదీన కామ్రేడ్ యల్లాస్వామి అనే

సహచరుడితోసహా రామచంద్రపల్లి గ్రామంలోని ఒక నూతివద్ద వుండగా ఈ సంగతి ఒక ద్రోహిద్వారా తెలుసుకున్న మిలటరీ వారిని చుట్టుముట్టింది. వారి వ్యూహాన్ని ఛేదించుకు తప్పించుకుందామని ప్రయత్నం చేశాడు. రామి రెడ్డి స్టెన్‌గన్ కాల్పులకు శత్రువులు చాలామంది గాయపడ్డారు. కానీ ఆ సందర్భంలో ఆ వీరులిద్దరూ ప్రాణాలొదిలారు.

కామ్రేడ్ జగన్నాధం : నేలంపల్లి గ్రామం మంథెన తాలూకాలోవుంది. అచ్చటి భూస్వాములమాటనమ్మి కామ్రేడ్ జగన్నాథం అక్కడికి నిరాయుధుడుగా వెళ్ళాడు. కానివాళ్ళు అతనికిద్రోహంతలపెట్టిఒక్కణ్ణి పదిమంది కలిసిపట్టుకునిబోళ్ళగూడెంమిలటరీక్యాంపుకుఒప్పగించారు.మూడురోజులపాటు ఆయనను నానాహింసలూ పెట్టారు. తల్లకిందులుగా చెట్టుకు వేళ్ళాడదీసి ఉయ్యాలమాదిరి ఊపుతూ చితకగొట్టారు. ఇదంతాకూడా గ్రామ ప్రజలముందే జరిగింది తమ నాయకుడు బ్రతకడం అసంభవం అని గ్రహించిన ప్రజానీకం బావురుమన్నారు. కాని అతడేమన్నా రహస్యాలు బయటపెడతాడేమో అని భయపడ్డవాళ్ళు లేకపోలేదు. "నన్ను చంపగలరు. కానీ వందలమంది ఉద్యమంలోకి కొత్తగా వస్తారు – మీ అంతం చూస్తారు" అన్న మాటతప్ప అతని నోటి వెంట ఒక్క రహస్యమూ వెలువడలేదు విసిగిపోయి చివరికి మిలటరీ అతణ్ణి కాల్చింది. గుండు తన గుండెల్లో దూసుకుపోతుండగా ఆ కామ్రేడ్ "కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి" అంటూ అసువులు బాశాడు.

కామ్రేడ్ జగన్నాథం సూర్యాపేట తాలూకా సింగారం గ్రామంలో ఒక పేదరైతు కుటుంబీకుడు. నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొంటూ క్రమేణా తన దళానికి ఉపనాయకుడు కాగలిగాడు. సింగారం, పాతర్లపాడు, అన్నారం, ఎక్కపల్లి మొదలగు పలుగ్రామాలలో రజాకార్ స్థావరాలపై పెద్ద దెబ్బతీశాడు. 'పోలీసు చర్య' తర్వాత అడవులలోకివెళ్ళి అక్కడ కొందరు కోయ, గిరిజన యువకులను కూడగట్టి గంగారంరోడ్డుపైన, లల్వాల గ్రామంలోనూ తదితరచోట్ల శత్రువుపై దాడులలో పాల్గొన్నాడు.

కామ్రేడ్ జగన్నాథం మరణవార్త మిగతా దళాలకు పిడుగుపాటుగా చేరింది. దీనికి ప్రతీకారం చెయ్యాలని వారు నిశ్చయించుకున్నారు. రాత్రి 10 గంటల ప్రాంతంలో ఈ దళాలు మిలటరీవాళ్ళలాగా వేషాలు వేసుకుని, నేలంపల్లి గ్రామం వెళ్ళి, గ్రామకచేరి సావడిలో పడుకున్న సేత్‌సింధీని లేపి, "దొరవచ్చిండు వూరందర్నీ కూడగట్టు" మని చెప్పారు. అతడు నిజమనుకున్నాడు ఆ రోజుల్లో గ్రామంలోవున్న ద్రోహుల రక్షణార్థం రాత్రిళ్ళు మిలటరీ యిలారావటం మామూలే! ఇంకేం అందరూ చావడివద్దకు చేరారు. గ్రామంలోవున్న ప్రజాద్రోహులందరూ ముందువరసలో నిలబడి మిలటరీ

వేషంలోవున్న దళాలను నిజంగానే మిలటరీ అనుకుని "జైహింద్" అంటూ వందనం చేశారు. వెంటనే దళంల్లోంచి ఒకరు "జగన్నాథాన్ని పట్టించిన ఘనులెవ్వరోచెప్పండి. వారికిసన్మానం చేయాలనుకుంటున్నాం" అని కేకేశారు. నేనంటే నేనంటూ కొందరు ముందుకు తోసుకువచ్చారు. వారిలో పగమ కిరాతకుల్ని ఏరి దళాలు కాల్చేశాయి. మిగతావారిని తుక్కుతుక్కుగాకొట్టారు ఆ తర్వాత అచ్చటినుండి వెళ్ళిపోయారు.

ఆ ప్రాంతం ప్రజాద్రోహులకు కంటిమీద కునుకులేదు. వెంటనే మిలటరీ వచ్చి దళాలను పట్టుకునేందుకు యెంతో ప్రయత్నించారు కానీ ఒక్కరుకూడాదొరకలేదు. ఆ దెబ్బతో బోళ్ళగూడెం క్యాంపు ఎత్తివేసుకొనటమేగాక, రాత్రిళ్ళు గ్రామాలకు రావటం మానేసింది. గ్రామాలపై మిలటరీ దాడులుకూడా తగ్గించుకోవలసి వచ్చింది.

కామ్రేడ్ *లింగయ్య దళం :* గోదావరిలో స్నానంచేసి కామ్రేడ్ లింగయ్య దళం మొత్తం 7 గురు, ఎల్లాపురం అడవులలోగుండా వెళ్తున్నారు. రోజూ వారు యిదే దారిన వెళ్తున్నారని తెలుసుకున్న మిలటరీ దారికిరువైపులా పొంచి యీ దళం దాపుకు రాగానే చుట్టుముట్టి కాల్పులు సాగించారు. పారిపో వీలులేని దళం నేలమీద పడుకుని తిరిగి కాల్పులు సాగించింది. కానీ శత్రువు అన్నివిధాలా ఆధిక్యతతో వున్నాడు యీ 7 గురు కామ్రేడ్స్‌నూ బలిగొన్నారు. వారి వద్దగల ఒక రైఫిల్‌ను, మూడు బర్మార్లనూ వశపరచుకున్నారు.

సూర్యాపేట తాలూకా చందుపట్ల గ్రామానికి జెందిన ఒక గొల్ల కుటుంబానికి జెందిన లింగయ్య 1947 లో నిజాం వ్యతిరేక పోరాటంలో స్థానిక దళ సభ్యుడుగా పనిజేశాడు ఆ తర్వాత కామ్రేడ్ పానుగోటి సీతారామారావుకు కొరియర్‌గా పనిచేశాడు. తర్వాత గెరిల్లాదళ సభ్యుడై క్రమేపి దళ ఉపనాయకుడు, నాయకుడు కాగలిగాడు. నిరక్షరాస్యుడుగా పోరాటంలో ప్రవేశించిన కామ్రేడ్ లింగయ్య చదవనూ, వ్రాయనూ నేర్చుకుని, పై కమిటీలతో వుత్తరప్రత్యుత్తరాలు నడిపేవరకూ ఎదిగాడు చందుపట్ల పరిసర ప్రాంతాలలోని ఘటనలెన్నింటితోనే, యీ కామ్రేడ్‌కు సంబంధం వుంది.

యూనియన్ సైన్యం చుట్టుముట్టుడిదాడులు ప్రారంభించిన తరువాత, ఆయన అడవులలోకి వెళ్ళిపోయాడు. రైలు మార్గాలపై జరిగిన దాడులలోను, అనేక తావుల్లో సైన్యంపై మెరుపుదాడులు జేయటంలోనూ ఆయన ప్రముఖ పాత్ర వహించారు.

కా॥మేడ్ లింగయ్య ములుగు తాలూకా మంగపేట ప్రాంతంలో, వుద్యమాన్ని విస్తృతంచేసే బాధ్యత స్వీకరించాడు. గిరిజన, కోయ యువకుల్ని పోగుజేసి, కొత్త దళం ఏర్పాటుజేశాడు. తన పాత దళ సభ్యులందరినీ వివిధ బాధ్యతలతో వివిధ ప్రాంతాలకు పంపాడు. ఈ కొత్త దళం ఆసరాతో, ప్రజలను కదిలించి, స్థానిక భూస్వాములకు వ్యతిరేకంగా వుద్యమాలు నడిపి, వారి ధాన్యాన్ని, భూమిని పేదలకు పంచాడు. గిరిజన ప్రజల సమస్యల పరిష్కారానికై తీవ్రంగా కృషిచేశాడు. మంగపేట, యేటూరినాగారంమధ్య ప్రయాణం చేస్తున్న మిలటరీపై ఎన్నోసార్లు దాడిచేసి, ఆ దారిన ప్రయాణం చేయటం అంటే చాలు వాళ్ళకి హడలు పుట్టించాడు అళ్ళపల్లి మిలటరీ క్యాంపుపై దాడిలో ఆయన ప్రధాన పాత్ర వహించాడు ఆయన తన దళ సభ్యులతో పాటుగా, ఒకపోరాటంలో వీరమరణం జెందారు. ఆయన ఆచూకీని అందించిన, ద్రోహులను పట్టుకుని, మిగతా దళాలు ఆ తర్వాత ప్రతీకారం చేశాయి.

వాత్స్య-భీష్మ : వీరిద్దరూ సూర్యాపేట తాలూకా వల్లభాపురం వద్దగల లంబాడీ తండాకు జెందిన యువకులు నైజాం వ్యతిరేక పోరాటంలోనూ ఆ తర్వాత భారత సైన్యానికి వ్యతిరేక పోరాటసమయంలోనూ పార్టీ దళాలకు కొరియర్‌లుగా పనిచేసేవారు. వారి నివాసాలు మన ముఖ్య కార్యకర్తలకు ఒక రహస్య రక్షణ స్థావరం. వారి స్త్రీలు, పెద్దలూ కూడా యెంతో ప్రమాదానికి లోనవటానికి సిద్ధమైకూడా పార్టీ పనులు చేసేవారు.

ఈయిద్దరినీభారతసైన్యాలుఅరెస్టుచేసిచిత్రహింసలుపెట్టిచివరకుకాల్చిచంపాయి వారి మరణానంతరంకూడా వారిభార్యలుపార్టీకిఎంతోతోడ్పడేవారు.

కా॥మేడ్ సోయం గంగులు : నాటి తెలంగాణా పోరాటం మట్టిలోంచి ఎన్నో మాణిక్యాలను సృష్టించింది. వానిలో బంజారాఅనే 10 గుడిసెల కోయగ్రామానికి చెందిన కా॥మేడ్ సోయం గంగులు ఒకరు. మంచి విలుకాడు, ధైర్యవంతుడు తన భాషలో అతి సామాన్యమైన మాటలలో కోయజనానికి సమస్యలను వివరించటంలో, దోపిడీదారులకు వ్యతిరేకంగా పోరాడటానికి వారిని ఉత్తేజపరచటంలో కడుదిట్ట. అంతకుముందు నిరక్షరాస్యుడే అయినా పార్టీలోకివచ్చిన తర్వాత చదవను, వ్రాయను నేర్చుకున్నాడు. తాగుడు అలవాటు అతని బలహీనత. పార్టీ నిర్ణయానుసారం ఆ బలహీనత పోగొట్టుకునేందుకు ఎంతో యత్నించేవాడు. ప్రత్యేక శ్రద్ధతో పార్టీ నాయకత్వం అతడి అభివృద్ధికి దోహదం చేసేది అతను వారియెడల గౌరవపూర్వకంగా నమ్రతతో మెలిగేవాడు

అయన ధైర్యశాలి. సైనికంగా ఎత్తుగడలు వేయటంలో నేర్పరి. శత్రువులజాడను పసికట్టి చాలా మెలకువగా వాళ్ళని మాటుగాచి దెబ్బగొట్టే శక్తివుండేది. చాలాసార్లు, ఆయన తన తెలివితేటలవల్ల, సమయస్ఫూర్తివల్ల ఆ ప్రాంతపు కోయలెందరినో రక్షించాడు.

ఒకసారి అశ్వారావుపేట జమీందారు కొడుకు అతనిదళం చేతిలో చిక్కాడు. గంగులు అతణ్ణి వదిలివేస్తూ – "నీతో మాకేం పగలేదు–నీ తండ్రి దుర్మార్గుడు అందుకు నిన్ను శిక్షించటం జరగదు అనిచెప్పి "అతణ్ణి వదిలి పెడ్తూ" నీ తండ్రిలాగామాత్రం ప్రజావ్యతిరేకివి కావద్దు. ప్రజల కేదైనా కొంతమేలు చేయి" అని హెచ్చరించాడు.

కోయ ప్రజలకు అతడంటే, యెనలేని విశ్వాసం 'కోయబెబ్బులి' అని అతణ్ణి పిలిచేవారు. అతన్ని చంపాలని సైన్యం ఎన్నోసార్లు యత్నించింది. అయితే అది వారి వశంకాలేదు. పశ్చిమ గోదావరిజిల్లా సరిహద్దు ప్రాంతంలో ఒకనాడు ఒక స్త్రీ గంగులును మోసంచేసి బాగాతప్ప తాగించింది. నిద్రించు తుండగా పోలీసులకు పట్టించింది. అతణ్ణి కోయ గ్రామాలన్నింటా చేతులు విరిచికట్టి కోయప్రజలను భయభ్రాంతులను చేస్తూ తిప్పించారు "నా పార్టీ ఆదేశాన్ని లెక్కచేయకుండా నేను తాగాను, కనుకనే మీకు చిక్కాను. కానీ నా పార్టీని అణచటం మీ తరంకాదు. మీరెన్ని చిత్రహింసలు పెట్టినా నా ప్రజలకు నేను ద్రోహంచేయను" అని అన్నాడేగాని, తన ఎముకలను పిండిచేసేట్లు బాదినా ఒక్క రహస్యంకూడా బయట పెట్టలేదు. ఇక ప్రయోజనం లేదని అతణ్ణి మిలటరీ కాల్చేసింది.

గంగులు గ్రామానికి ఒకసారి నేనువెళ్ళి ఆయన కుమారుణ్ణి, తల్లిని పరామర్శించి,ఆయనసమాధినిచూసి ఆ వీరయోధునకు జోహార్లర్పించివచ్చాను. ఆ సందర్భంలో ఆ గ్రామస్థులు ఒక తాటిచెట్టుచూపి "మిలటరీ మా గ్రామంలో యువకులను పట్టుకుని ఆ తాడిచెట్టుయొక్క తాటిపండ్లు కొయ్యమనిచెప్పి చెట్టుపై కెక్కినతర్వాత ఒక్కొక్కళ్ళనే కాల్చిచంపేసింది" అని చెప్పారు తమ నాయకుడు గంగులు 'కోయ బెబ్బులి' నెలకొల్పిన వీరసాంప్రదాయానికి అనుగుణంగానే ఆ గ్రామప్రజలు త్యాగనిరతి ప్రదర్శించారు!

కామ్రేడ్ కుంజ ముత్యాలు: ఈయనకూడా ఒకకోయ కామ్రేడ్. గజయీతగాడు. వరద గోదావరి అతనికి ఒకలెక్కలోనిదికాదు. అనితర సాధ్యమైన ధైర్యమూ, సాహసము, పట్టుదల, మొండితనం అతనిసహజసంపద. వివిధ

దళాలమధ్యా – నాయకులమధ్యా అతడు సమాచారాన్ని జేరవేస్తూ చాలా ముఖ్యమైన బాధ్యత నిర్వహించేవాడు. అతడి సునిశితపరిశీలనసరైన సమాచారం మూలంగానే ఎన్నోసార్లు మిలటరీని చుట్టుముట్టి మట్టుపెట్టి వీలయ్యింది.

పాల్వంచ ప్రాంతం మొత్తంలో 20 మిలటరీ స్థావరాలుండేవి. కానీ ఒకచోట ఐదుమైళ్ళ ప్రాంతంలోనే 8 క్యాంపు లుండేవి. మన దళాలు 30, 40 చోట్ల, యీ మిలటరీని చుట్టుముట్టి దాదాపు 30 మందిదాకా ఖతంచేశాయి.

ఒకనాడు కామ్రేడ్ ముత్యాలు యేదో పనిమీద వెళ్తుండగా గంగారం గ్రామ పటేల్ అది గ్రహించి, తన గూండాలను పది మంది పోలీసులను వెంటబెట్టుకువెళ్ళి కామ్రేడ్ ముత్యాలును బంధించాడు. అతణ్ణి రహస్యాలు చెప్పమని చెప్పరాని బాధలు పెట్టారు. కామ్రేడ్ ముత్యాలు రహస్యాలు బయటు పెట్టినట్లయితే, యెంత నష్టం జరిగేదో చెప్పలేము – ఆ ప్రాంతంలో ఆయన కెన్నో గెరిల్లా రహస్య స్థావరాలు, నాయకుల వునికి తెలుసు. కానీ కామ్రేడ్ ముత్యాలు మౌనంగా ఆ బాధలు మొండిగా భరించాడుగానీ నోరు విప్పలేదు. ఆ తర్వాత ఆయన్నుకాల్చి చంపేశారు కోయప్రజల ప్రియతమ నాయకుడగు ముత్యాలు, కమ్యూనిస్టు ఉక్కుశిక్షణలో రాటుదేలి, ఎర్రజెండాగౌరవప్రతిష్టలు సగర్వంగా నిలబెట్టాడు

మరొక కోయనాయకుడు కోకా బుజ్జిని కూడా పోలీసులు అరెస్టు చేసి కాల్చిచంపారు. అతడు 40 కోయ గ్రామాలకు పటేల్‌గా వుంటూ ప్రజా వుద్యమా లెన్నింటిలోనో పాల్గొన్నాడు.

10. సంవత్సరాల తర్వాత నేనా ప్రాంతానికి వెళ్లే అవకాశం కలిగింది. అప్పటికీ వున్నపార్టీ కార్యకర్తలు నాడు భారతసైన్యాల దారుణకృత్యాలను కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ, తమ బాధలు చెప్పుకున్నారు వీర కిశోరాలైన, వీరులైన తమ నాయకులను గుర్తుచేసుకుని గర్వపడ్డారు.

1948 – 51 మధ్యకాలంలో పాల్వంచ – బుర్గంపాడు ప్రాంతంలో బ్రిగ్స్" పథకం అమలుజరిపారు. దళాలకు ఆహారాదులు అందకుండా జేసేందుకు కోయలను అడవుల నుండి తరిమివేయటం ఆ పథకం లక్ష్యం. ఆ సందర్భంలో దాదాపు నాలుగు అయిదు వందలమంది కోయలను మిలటరీ కాల్చిచంపింది.

కామ్రేడ్ బి. శేషయ్య . మధిర తాలూకా చిరునోముల ఈతని స్వగ్రామం. ఈతని నాయకత్వానవున్న దళంలోనే యిదే గ్రామానికి చెందిన రామకోటయ్య ముఖ్య దళ సభ్యుడు. పాల్వంచ తాలూకాలో యానంబెల్లి అడవులలో కొండకుదినివాగువద్ద ఈదళాన్ని మిలటరీ చుట్టేసింది.

ఈ యిద్దరూ తమ మిగతాదళసభ్యులు తప్పించుకునేందుకువీలుగా సైన్యంపై కాల్పులు సాగిస్తూ సైన్యం దృష్టి తమవైపే మరల్చుకున్నారు. మిగతా దళ సభ్యులు తప్పించుకున్నారు. ఈ యిరువురు కామ్రేడ్స్ తమవద్దనున్న చివరి గుండునుకూడా శత్రువుపైవాడి సద్వినియోగం చేసుకున్నారు. వీళ్ళవద్ద మందు గుండు అయిపోవటంతో శత్రువు వీళ్ళని పట్టుకున్నాడు. మూడురోజులపాటు వీరిద్దరిని రహస్యాలు రాబట్టేందుకై దుర్మార్గంగా హింసించారు. అయినా ఈ కామ్రేడ్స్ నోరు మెదపకపోయేసరికి వీరిని కాల్చిచంపారు. కామ్రేడ్స్ శేషయ్య, రామకోటయ్యలనేగాక, అదే గ్రామానికి చెందిన బోడేపూడి పున్నయ్యను కూడా సైన్యం కాల్చిచంపింది.

*రేపల్లెవాడ అమరవీరులు*. మధిర తాలూకా గోవిందాపురం గ్రామానికి చెందిన కామ్రేడ్ మోటూరపు రామచంద్రయ్యను, పట్టుకుని రహస్యాలు చెప్పమని మిలటరీ నిర్బంధించింది ప్రయోజనం శూన్యమై ఎముకలు విరగ్గొట్టి ఒక యింటి కప్పుమీదనుండి క్రిందకు దొర్లించారు. ఆ కామ్రేడ్ మరణించాడు. గోవిందాపురంవద్దనే విభిన్న ప్రాంతాలనుండి కామ్రేడ్స్ యల్లమందల చంద్రయ్య, మండా అచ్చయ్య (ఆలపాడు), గొట్టెముచ్చుల అజరయ్య, మద్ది రాములు (మధిర తాలూకా వల్లాపురం), మకదుపల్లి వీరాస్వామి, సామినేని గోపయ్య, తమ్మిన బుచ్చయ్య (వీరు రేపల్లెవాడ వాసులు), కిలారు వెంకయ్య (నందిగామ తాలూకా) యీ 8 మంది కామ్రేడ్స్‌ను పట్టుకవచ్చి కాల్చిచంపింది. స్థానిక ప్రజానీకం, వీరందరి జ్ఞాపకార్థం, ఒక స్మృతి చిహ్నం నిర్మించి, ప్రతియేటా స్మారకసభలు జరుపుతున్నారు.

*కామ్రేడ్ దొండేటి పుల్లయ్య*. మానుకోట తాలూకా, పింది ప్రోలు గ్రామం రజాకార్ వ్యతిరేక పోరాటంలో ప్రసిద్ధిగాంచింది ఆ గ్రామ వాసి కామ్రేడ్ దొండేటి పుల్లయ్య మధ్యతరగతి కుటుంబంలోంచి వచ్చి, మాధ్యమిక విద్య నేర్చి 1944 లో ఆంధ్రమహాసభలో జేరి 1948 లో కమ్యూనిస్టు పార్టీలో జేరాడు తన గ్రామంలోని ప్రజాద్రోహుల్ని మిగతా కామ్రేడ్స్‌తో కలిసి నిర్విరామంగా ఎదిర్చాడు. కామ్రేడ్ తీగల సత్యనారాయణ దళం, రజాకార్ల చేతుల్లో చాలా నష్టపోయిన పిదప, జోనల్ ఆర్గనైజరుగా అదనపు బాధ్యతలు స్వీకరించిన పుల్లయ్య, అప్పటికి గందరగోళంగా వున్న పార్టీని, దళాన్ని పునరుద్ధరించాడు తాను కొత్త ప్రాంతంలో పని చేస్తున్నా, ప్రజల మధ్య వుంటూ వారి కష్టసుఖాల్లో పాలుపంచుకుంటూ అనతికాలంలోనే ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు సూర్యాపేట తాలూకానుండి, వెనక్కితగ్గి మానుకోటజేరిన దళాల కాతడు రక్షణ కల్పించాడు.

చెల్లముప్పారం ప్రాంతంలో దళాల దాడులు ఎక్కువ కావటంతో శత్రువు కేంద్రీకరణకూడా ఎక్కువయింది. సూర్యాపేట తాలూకానుండి వచ్చిన దళాలు ఇక్కడే వున్నాయని గ్రహించిన మిలటరీ వందలాది సైన్యంతో ఆ అడవుల నన్నింటినీ ఆక్రమించి దళాలను వేటాడటం ప్రారంభించాయి. దొరికిన ప్రజలను దొరికినట్టు చావచితగ్గొట్టినా, సైన్యానికి దళాలజాడ దొరకలేదు. కొన్ని వారాలతరబడి వారు వెదికారు

చివరకు సింగారం గ్రామంలో ఒక ప్రజాద్రోహి యిచ్చిన సమాచారంవల్ల కామ్రేడ్ వుల్లయ్య అతని కొరియర్ దొరికారు. వీళ్ళిద్దర్ని గోళ్ళ క్రింద, పురుషాంగంలోనూ, బీర్జాలలోనూ సూదులుగుచ్చి రహస్యాలు చెప్పమని చిత్రహింసలు పెట్టారు. "నన్ను చంపినా యీ పోరాటం ఆగదు. పాపం, నాలుగు పైసలకోసం ఎక్కడెక్కడినుండో వచ్చారు మీరు. ఇళ్లకి తిరిగి వెళ్ళటం కల్ల! మీ కుటుంబాలకు మీరు మా దళాల చేతుల్లో శాశ్వతంగా దూరమవటం ఖాయం. మాలో ఒక్కొక్కణ్ణి చంపినందుకు వడ్డీతోసహా చెల్లించవలసివస్తుంది జాగ్రత్త" అని సైనికులను హెచ్చరించాడు. చివరకు మిలటరీ వారిద్దర్ని కాల్చిచంపింది. పిండిప్రోలు సాంప్రదాయానికి అనువుగా వారిద్దరూ ఎర్రజెండా గౌరవప్రతిష్టలను యినుమడింపజేస్తూ వీరమరణం పొందారు.

కామ్రేడ్ *గండ్రా చంద్రయ్య* : మానుకోట తాలూకా పెద ముప్పారం గ్రామవాసి అయిన చంద్రయ్య దళనాయకుడు. రాజకీయ కార్యకర్త కాగలిగాడు. బోడ్లాడ గుట్టలలో అతణ్ణీ అతనిదళాన్ని యూనియన్ సైన్యాలు చుట్టేశాయి మోకాళ్ళలోతు నీళ్ళల్లో కామ్రేడ్ చంద్రయ్య, ఆయన దళం తమతమ స్థానాలను వెంటనే స్వీకరించి కాల్పులు సాగించారు శత్రువు వెనక్కు తగ్గవలసివచ్చింది. దళం తప్పించుకుంది. కాని కామ్రేడ్ చంద్రయ్య పొట్టలోగుండా తుపాకిగుండు దూసుకుపోయి అతడక్కడే కుప్పలాకూలిపోయాడు "ఈ తుపాకి తీసుకో, అది శత్రువుచేతిలో పడనివ్వకు" అంటూ తుపాకి యింకో దళసభ్యుడికందిస్తూ ఆ వీరుడు కన్నుమూశాడు.

కామ్రేడ్ *అక్కులు* : అనే దళ సభ్యుడుకూడా యీ ఘటనలో మరణించాడు.

కామ్రేడ్ *ముగలి వెంకటయ్య*. చర్లపాలెంకు జెందిన యీ ఘటనలో రెండు కాళ్ళు విరిగితే, దళం అతన్ని 30 మైళ్ళు మోసుకుపోయింది. చాలా శ్రద్ధగా వైద్యం జరిగిన తర్వాత కోలుకున్నాడు.

కామ్రేడ్స్ *బాషు, రాములు* : దళాలు, తమ కార్యక్రమాలను కొత్త ప్రాంతాలకు విస్తరిస్తున్నాయి. అందులో భాగంగా ములుగు తాలూకా

గుంబ్రేగుల ప్రాంతం జేరాయి. ఆ ప్రాంతంలో ప్రజాద్రోహులమీద యెన్నో గణనీయమైన విజయాలు సాధించాయి. పోలీసులు, ఆ ప్రాంతంలో గ్రామాలపై దాడికి తిరిగి వస్తూండగా మూడుసార్లు వారిపై దాడిచేసి 10 మంది పోలీసులను దళాలు హతమార్చాయి. ఆ దెబ్బతో అదిరిపోయిన శత్రువు, యెవరన్నా వచ్చి దళాలు కన్పించినాయని చెప్పినా దాడికి వెళ్ళటం మానుకున్నాడు.

ఈ విజయాలతో వుత్సాహంపొందినమీదట, దళాలు, గోదావరి దాటి బస్తర్ ప్రాంతానికిగూడా వుద్యమాన్ని విస్తరింపజేయాలని నిశ్చయించుకున్నాయి. చుట్టూ పోలీసుక్యాంపులువున్నా, దళాలు గోదావరిదాటి అవలి వొడ్డున చాలా గ్రామాలతో సంబంధాలేర్పరచుకున్నాయి ఈవిషయం సైన్యానికి తెలిసి గోదావరిదాటే ప్రతిస్థలంవద్ద నదికి యిరువైపులా మిలటరీ పోస్టులను నెలకొల్పారు. 24 గంటలూ గస్తీఏర్పాటుచేశారు. అయినా దళాలు రాత్రిపూట కొయ్యదుంగలమీద గోదావరిదాటుతూనే వుండేవి. అలాంటి ఒక సందర్భంలో పదిమందిగల ఒక దళం గోదావరి దాటి అవలిఒడ్డుకు చేరింది కాని వెంటనే శత్రువుకాల్పులనెదుర్కొనవలసివచ్చింది. అసలే చీమలుదూరని చిట్టడివి. పైన కటిక చీకటి. ఒకరికొకరు కన్పించటంలేదు శత్రువు అన్నివైపులనుండి తోసుకువచ్చి దళాన్ని గోదావరి గట్టుకు తరిమి పారిపో వీలులేకుండా బంధించాలని ప్రయత్నం చేశాడు. గత్యంతరంలేక దళాలూ కాల్పులు మొదలెట్టాయి ఈ ఘటనలో కామ్రేడ్ బాపు, కామ్రేడ్ రాములు (చింతలగూడెం) ఇంకో కామ్రేడ్ ప్రాణాలు కోల్పోయారు. వాళ్ళ త్యాగఫలితంగా మిగతా ఏడుగురు కామ్రేడ్స్ తప్పించుకోగలిగారు. గోదావరి ఒడ్డునే నివసించే ఈ కామ్రేడ్స్ పడవ నడపటంలో అద్వితీయులు. వారి మరణం ఆ ప్రాంతం కామ్రేడ్స్‌కు తీరని లోటనిపించటంలో ఆశ్చర్య మేముంది?

కామ్రేడ్స్ రాము, భల్లు. ఈ ఇరువురు కామ్రేడ్స్ అన్నదమ్ములు స్వగ్రామం మానుకోట తాలూకాలోని పూసలపల్లి ఆ గ్రామంలో బంజారాజాతివారువీరు. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి దౌష్ట్యానికి వారి కుటుంబం యావత్తూ బలైపోయింది. కమ్యూనిస్టుపార్టీయే తమకు అండగా వుండగలదని వీరు పార్టీలో జేరారు. మొదట్లో స్థానికంగా పనిచేసేవారు. 1950 లో వారు గెరిల్లాదళాల్లో జేరారు. వారు దళాలలోకి వారి సోదరి లచ్చక్కను తీసుకువచ్చారు కామ్రేడ్ రాము భార్య కూడా దళ సభ్యురాలైంది ఈ స్త్రీలిద్దరూ కూడా పార్టీ దళాలకు ఎంతో తోడ్పడ్డారు.

కామ్రేడ్ రాము దళ నాయకుడు, కామ్రేడ్ భల్లు ఉపనాయకుడు. మహాభారతంలో భీమార్జునులు జ్ఞాపకం వస్తారు వాళ్ళని తలుచుకుంటే! వాళ్లు

నర్సంపేట తాలూకా కాకరవాయి మిలిటరీ క్యాంపుపై దాడిలో పాల్గొన్నారు. మానుకోట తాలూకా కరచాలపల్లి ప్రాంతంలో రోడ్డు మరమ్మత్తు చేసి తిరిగి వెళుతున్న సైన్యంపై దాడిచేసి, సైన్యానికి తీవ్ర నష్టం కలిగించారు. 1951 లో రాజకీయ బాధ్యతలు స్వీకరించి, చెట్లముప్పారం, పూసలపల్లి ప్రాంతంలో ప్రజలకెంతో సేవజేశారు. ప్రజలు వాళ్ళని ఆప్యాయంగారామ లక్ష్మణులు అనేవారు.

బంజారా జాతి ప్రజలకు వీళ్ళంటే ప్రాణం – చదువు రాకపోయినా అందరి మన్ననలు పొందారు. కామ్రేడ్స్ రాము భల్లూలు తెలంగాణా పోరాటం నిలిపివేసిన చాలాకాలం తర్వాత 1952 జనవరిలో ఎన్నికల ప్రచారం చేస్తున్న సందర్భంలో మానుకోట తాలూకా కోమటిపల్లిలో మిలిటరీ వీరిని కాల్చిచంపింది. చనిపోయే నాటికి కామ్రేడ్ రాముకు 25 సం॥ కామ్రేడ్ భల్లుకు 22 సం॥ మాత్రమే !

*కామ్రేడ్ నల్లా నరసింహులు ( జూనియర్ )* : ఔతాపురం గ్రామంలో చేనేత కుటుంబంలో జన్మించాడు అతని నాయకత్వాన దమ్మన పేటలో పదిమందిగల దళంవుంది. ఒక ద్రోహివల్ల యీ సమాచారం తెలుసుకున్న మిలటరీ 40 మందితో వచ్చి చుట్టుముట్టారు. దళంలోని సెంట్రీ అజాగ్రత్తవల్ల మిలటరీ బాగా దగ్గరకువచ్చి కాల్పులు జరిపేవరకూ, దళం మిలటరీని గమనించనేలేదు వెంటనే నరసింహులు తన 'గైడర్' (ఒక రకమైన చిన్న మరతుపాకి)తో కాల్పులు సాగించాడు. ఆరుగురు నిజాం సైనికులు అక్కడికక్కడే మరణించారు. చీకటి పడుతున్నది. మిలటరీ వెనక్కి తగ్గి తమ వారి శవాలను గాయపడ్డవారిని మోసుకుని పరారయింది దళంకూడా చెల్లా చెదరయింది. నరసింహులుకి తుపాకి దెబ్బ తగిలింది. మిగిలిన యిద్దరు దళ సభ్యులూ నరసింహులును మోసుకుని యింకో యింటికి తీసుకుపోయారు. అక్కడాయనను వదిలివేసి, అక్కడి కొంచెందూరంలోనేవున్న తిరుమలరెడ్డి దళానికి తెలియజేయడానికి వారు వెళ్ళారు. ఆ యింట్లో ఎవరూలేరు. నరసింహులుకు దాహం అయిపక్కనేవున్న చెలకలోని బావివద్దకు పాక్కుంటూ పోయాడు అది గమనించిన రైతులు కొందరాతన్ని యింకో సురక్షిత ప్రాంతానికి తరలించారు ఈ సంగతి తెలిసి మిలటరీ తెల్లవారు ఝామునే దాడిచేసి, నరిసింహులును బంధించి తీసుకువెళ్ళి నానా దుర్భాషలాడి అతణ్ణి కాల్చారు. మెడమీద గాయమై రక్తం కారిపోతుండగా కామ్రేడ్ నరసింహులు కుప్పలా కూలిపోయాడు. అతడు చచ్చిపోయి వుంటాడని భావించి మిలటరీ అతణ్ణి వదిలివేసి వెళ్ళింది.

మిగిలిన ఇద్దరు దళ సభ్యులు వెళ్లి చెప్పగా గబ్బెట తిరుమలరెడ్డి దళం ఆ సమయానికి అక్కడికివచ్చి, అతణ్ణి మోసుకుపోయింది ఒక సురక్షిత ప్రాంతంలో పార్టీ తరుపున అతనికి చక్కని వైద్యం జరిగి, కోలుకుని, మళ్ళీ కామ్రేడ్ నరసింహులు పోరాటంలోకి వచ్చాడు.

1952 ఎన్నికల ప్రచారంలో నిమగ్నమయి వుండగా మిలటరీ అతణ్ణి కాల్చిచంపింది. తన తుది నెత్తురుచుక్కకూడా ప్రజాసేవలో ధారబోసి శత్రువులకు పక్కలో బల్లెమై అమరుడైనాడు కామ్రేడ్ నల్లా నరసింహులు (జూనియర్).

కామ్రేడ్ బసవయ్య : గుంటూరుజిల్లానుండి నర్సంపేట తాలూకా సాయిరెడ్డిపల్లి గ్రామానికి వలస వచ్చిన ఒక కుటుంబానికి జెందినవాడు. అక్కడ భూములు కొనుక్కొని స్థిరపడ్డారు. నైజాం వ్యతిరేక పోరాటంలో 1947 లో పార్టీలోకి వచ్చాడు. నెక్కొండ ప్రాంతంలో పార్టీ ఆర్గనైజరుగా పనిచేస్తూ, తల్లాడ భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటం నడిపాడు. రెడ్లవాడ, తోపినపల్లి, మొదలగుచోట్ల దళాలను నిర్మించి, అక్కడ రజాకార్లను తరిమికొట్టాడు.

1950 లో ఆయన జోనల్ ఆర్గనైజరయినాడు బసవయ్యను, తిమ్మంపేట ప్రజాద్రోహులు, మిలటరీకి పట్టిచ్చారు. వారతన్ని చిత్రహింసలు పెడ్తూ గ్రామాలవెంట తిప్పారు. అతడొక్క రహస్యమూ చెప్పలేదు సరికదా. మిలటరీ సమక్షంలోనే కాంగ్రెసు వ్యతిరేక పోరాటాన్ని మరింత వుధృతం చేయండని ప్రజలకు ప్రబోధించేవాడు 15 రోజులు నానా బాధలకు గురిజేసి విసిగి చివరకు మిలటరీ కామ్రేడ్ బసవయ్యను కాల్చేసింది.

మిలటరీకి యీ కామ్రేడ్‌ను పట్టియిచ్చిన ప్రజాకంటకులకు ఎన్నో రక్షణలిచ్చింది మిలటరీ. అయినా మిలిటరీ దుస్తుల్లో వెళ్లి మన దళాలు ఆ ద్రోహులనుపట్టి పరిమార్చాయి.

కామ్రేడ్ దేవసాని వెంకటయ్య. ఈ కామ్రేడ్ జనగాం తాలూకా వడ్లకొండ గ్రామంలోని ఒక పేదకుటుంబానికి చెందినవాడు. 1945 లో ఆంధ్రమహాసభలో జేరి 1946 లో పార్టీలోకివచ్చి కేంద్ర ఆర్గనైజర్ బాధ్యతలు స్వీకరించాడు. నైజాం వ్యతిరేక పోరాట సందర్భంగా భూస్వాములకు వ్యతిరేకంగా ఎన్నో గణనీయమైన విజయాలు సాధించాడు. పార్టీపై దాడులు తీవ్రమయిన సందర్భంలో దళాలతో సంబంధాలు తెగిపోయి షోలాపూర్ వెళ్ళి తిరిగివచ్చి మళ్ళీ పోరాటంలో పాల్గొన్నాడు

కా॥ మేడ్ వెంకటయ్య మైదాన ప్రాంతంలో రహస్య జీవితం గడు పుతూ పార్టీ కార్యక్రమం నిర్వహిస్తూ వుండగా, ప్రజా శత్రువులైన వడ్లకొండ భూస్వాములు అతణ్ణి మిలటరీకి పట్టిచ్చారు. మిలటరీ అతణ్ణి ఇనప కమ్మీలతో చర్మం చిట్లి రక్తం కారేదాకా కొట్టింది. ఆ గాయాలపై కారం చల్లింది. ఎత్తు మీదినుంచి మూటకట్టి దొర్లించింది. చివరికి అతణ్ణి క్రింద పడవేసి మిలటరీ బూటు కాళ్ళతో ఆతని పైకెక్కి తొక్కింది. కా॥ మేడ్ వెంకటయ్య స్పృహ కోల్పోయిన తర్వాత మిలటరీ అతణ్ణి బచ్చన్నపేట క్యాంపుకు తీసుకు పోతుం డగా దారిలోనే ప్రాణాలు కోల్పోయాడు.

కా॥ మేడ్ శామ్యూల్ – అయిలయ్య . వివిధ దళాలకు చెందిన 35 మంది గెరిల్లాలు, వడ్లకొండగట్టులో కూర్చుని భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి చర్చించుకుంటున్న సందర్భంలో ఆ గ్రామంలోని మిలటరీ వాళ్ళ తాబే దారు ఒకడు, యీ సమాచారాన్ని మిలటరీకి అందించాడు 150 మందిగల మిలటరీ తెలతెలవారుతుండగా యీ దళాలను చుట్టుముట్టింది దూరంనుండే మిలటరీని గమనించిన సెంట్రీ హెచ్చరికతో కా॥ మేడ్ శామ్యూల్ ఒక రాయి చాటున దాక్కుని మిగతా దళ సభ్యులు తప్పించుకునేందుకు వీలుగా మిలట రీపై కాల్పులు సాగించాడు మిలటరీ ముందుకు రావడానికి కష్టమయింది యీ లోపల యింకో దళ నాయకుడు యీ వలయాన్ని ఛేదించుకుని వెళ్ళి ఒక మోటబావి చాటున నిలబడి మిలిటరీపై కాల్పులు సాగించాడు. అక్కడే చేలో వున్న పశుల మంద యీ కాల్పులకు బెదిరి అటూఇటూ చెల్లాచెదురుగా పరు గెత్త సాగాయి. వాటిని చాటు చేసుకుని, దళాలు అక్కడినుండి తప్పుకున్నాయి ఈ ఘటనలో కా॥ మేడ్ శామ్యూల్, అయిలయ్య అశువులు బాశారు. వీళ్ళకు అడ్డం రాబోయారన్న నెపంతో ఎంత ప్రాధేయపడ్డా విన్పించుకోకుండా, ఇద్దరు చిన్న పిల్లల్నికూడా మిలటరీ కాల్చిచంపింది.

జనగాం తాలూకా అక్కరాజుపల్లి గ్రామంలో ఒక శ్రామిక కుటుంబంనుండివచ్చిన కా॥ మేడ్ శామ్యూల్ 1947 లో నైజాం వ్యతిరేక పోరాటంలో దళసభ్యుడైనాడు తనధైర్యసాహసాలు ప్రజాసేవాతత్పరతవల్ల అనతికాలంలోనే దళనాయకుడుకాగలిగాడు అతడిదళంచేతిలో ఎంతోమంది రజాకార్లు "పోలీసుచర్య" తర్వాత సాయుధ పోలీసులు హతమయ్యారు.

కా॥ మేడ్ అయిలయ్య పోరాట ప్రారంభ తొలిదినాల్లోనే పార్టీలో జేరాడు. 1947 లో ఆలేరులో జెండా ప్రతిష్టాపన సందర్భంగా జరిగిన పోలీస్ కాల్పులలో తన కుడిచెయ్యిని కోల్పోయాడు. అవిటివాడినని యింటిదగ్గర కూర్చోకుండా దళాలతోవుంటూ, దళ సభ్యులకు చదువు నేర్పుతూ, వారికి ప్రజలకు కూడా రాజకీయాలు గరపుతూ ఆదర్శవంతుడైన కా॥ మేడ్స్‌గా

మెలిగేవాడు విమర్శ, ఆత్మవిమర్శలసందర్భంలో యిరుపక్షాలవారు కామ్రేడ్ అయిలయ్యను క్రమశిక్షణాయుత జీవితానికి ఉదాహరణగా చూపేవారు. చివరకు పోరాటంలోనే ఆ కామ్రేడ్ వీరమరణం చెందాడు

కామ్రేడ్ ధాను, అతని కుటుంబం కామ్రేడ్ ధాను తల్లిదండ్రులు జనగాం తాలూకా ధర్మాపురానికి జెందినవారు వారికి ఆరుగురు బిడ్డలు. వారిలో ధాను నాలుగోవాడు తెలంగాణా పోరాటం ఆరంభింపబడటానికి 15 సంవత్సరాలు పూర్వమే పరమదుర్మార్గులైన, విసునూరు దేశముఖ్, పునుకూరి రాఘవరావు అనే కంట్రాక్టరులు అక్రమంగా తమ భూములు ఆక్రమించుకుని, దౌర్జన్యం చేస్తుంటే, యీ లంబాడీలు, అందుకు వ్యతిరేకంగా తీవ్ర ప్రతిఘటన చేశారు

11 వ మహాసభ అనంతరం జనగాం తాలూకాలో, ఆంధ్రమహాసభ విస్తరింపజేయాలని నిర్ణయం తీసుకున్నప్పుడు మొట్టమొదట యీ కుటుంబం ఆంధ్రమహాసభలో జేరింది. విసునూరు దేశముఖ్, పునుకూరి రాఘవరావు, ఆంధ్రమహాసభను విచ్ఛిన్నం చేయబూనుకున్నప్పుడు, వారికి లొంగకుండా, యీ లంబాడీలు, తమ మార్గాన్నే ధైర్యంగా పురోగమించారు.

కడవెండి గ్రామంలో మిలటరీ కాల్పులుజరిపి కామ్రేడ్ దొడ్డి కొమరయ్యను బలిగొన్నప్పుడు గ్రామప్రజలకు ధైర్యంచెప్పి, వాళ్ళను మళ్ళీ కూడదీసి కదిలించింది యీ కుటుంబమే! విసునూరు దేశముఖ్ గూండాలు ఆ గ్రామంపై దాడిచేసినప్పుడు, వీరిచ్చిన ప్రోత్సాహం, వుత్సాహం వల్లనే ఆ గ్రామప్రజలు ఆ గూండాలకు తగినశాస్తి జేశారు! ఈ కుటుంబంలో చిన్న పిల్లలుకూడా పోరాటంలో తమవంతుపాత్ర నిర్వహించారు.

నాటినుండి ఆ కుటుంబం మొక్కవోని దీక్షతోనిలిచి ప్రజావుద్యమాలకు పెట్టనికోటలా వుండేది. ఆ కుటుంబాన్ని తలుచుకుంటేచాలు శత్రువుకు గంగవెర్రులెత్తేది. వారిని సర్వనాశనంచేయాలని శత్రువు ఎన్నోసార్లు యత్నించాడు మోహన్‌రెడ్డిఅనే స్థానిక నాయకుణ్ణి అరెస్టుచేసి పోలీస్‌స్టేషన్‌లో వుంచినప్పుడు ఎక్కుపెట్టబడివున్న పోలీస్ తుపాకులనుకూడా లెక్కచేయకుండా పోలీస్ వుద్యోగుల వద్దకువెళ్ళి నిలేసింది యీ కుటుంబమే. 300 మంది మిలటరీ వీరి గ్రామంపై దాడికి వచ్చినప్పుడు గ్రామప్రజలందర్నీ కదిలించి వడిశలలతో మూడు గంటలపాటు సైన్యాన్ని అడుగుముందుకు వేయనీయకుండానిలేసి శత్రువు ఓర్పును పరీక్షకు పెట్టింది యీ కుటుంబమే!

సహజంగానే శత్రువుకు ప్రజాకంటకులకు యీ కుంటుబం సింహస్వప్నమయింది. పార్టీకోసం పనిజేస్తున్న కుటుంబంలోని యువకులను వేటాడి

అంతం చేయాలని పోలీసులు, గూండాలు యెంతో ప్రయత్నంచేశారు చివరకు ధాను మూడోఅన్న కా॥మేడ్ సంకు దొరికాడు అతన్ని యెన్నో చిత్ర హింసలకు గురిచేసి, జైల్లోపెట్టి చాలాకాలం తర్వాత విడుదల చేశారు. ఆ తర్వాత 1947 లో భువనగిరి తాలూకా పల్లెర్ల గ్రామంలో పెద్దవాడైన జోధ్యా దొరికాడు అతన్ని జైలుకుపంపి నానా బాధలూపెట్టారు. రజాకార్ ఆగడాలరోజులలో వారి యింటిని రెండుసార్లు తగులబెట్టారు. చాలాసార్లు కొల్లగొట్టారు. వారి వ్యవసాయం సాగనియ్యనేలేదు.

తర్వాత కొన్నాళ్ళకు ధాను రెండో అన్న "సోమ్లా" ను పట్టుకున్నారు. ఆ కిరాతకులు సోమ్లా చేతనే కట్టెలు తెప్పించి, చితి పేర్పించి సజీవంగా కా॥మేడ్ సోమ్లాను దహనం చేశారు. చివరిక్షణాల్లో కూడా సోమ్లా తన ఆశయానికి బద్ధుడై ఎర్రజెండాను స్మరిస్తూ అమరుడైనాడు.

ఈ దెబ్బతో యీ లంబాడీ కుటుంబం కాళ్ళబేరానికివస్తుందని ఆశించిన శత్రువు ఆశలు అడియాసలైనాయి మళ్ళీ వారియింటిపై దాసిచేసి యిద్దరు పసిగందుల్ని చంపేసింది. అందువల్ల కూడా ఈ కుటుంబానికి పార్టీ యెడలగల విశ్వాసమూ, ప్రేమ రవ్వంత కూడా చెక్కుచెదరలేదు ఎట్టి పరిస్థితిలోను వారు దళాలకు రక్షణయివ్వటంలోనూ దళాలకు తోడ్పడటంలోనూ వెనుకంజ వేయలేదు. 80 సంవత్సరాల ఆ వృద్ధ దంపతులు తమకెన్ని కష్టాలు వచ్చినా పార్టీని కంటిలో పాపలాగ కన్నబిడ్డలాగా చూసుకున్నారు ధాను తండ్రి చెయ్యి విరగొట్టారు శత్రువులు. కానీ ఆ వృద్ధుడుమాత్రం వారికి దాసోహమనలేదు.

పోలీస్ చర్య తర్వాత వారి కుటుంబంపై శత్రువుదాడులు ఉధృతమైనాయి. వాటితోపాటు ఆ కుటుంబంలో ప్రతి ఒక్కరికి శత్రువుపై ద్వేషమూ పెరిగింది. ధాను తమ్ముడు ధర్మ, ఉద్యమంలోకి వచ్చి దళసభ్యుడై అచిర కాలంలోనే దళాలకు, ప్రజలకు ప్రేమపాత్రుడైనాడు. 1949 ఫిబ్రవరి 26న ధర్మను తీవ్రంగా హింసించి, అరెస్టుచేసి, మరణదండన విధించారు. మరణ శిక్షకై యెదురుచూస్తూకూడా ధర్మ జైలులోవున్న అందరి అభిమానము చూరగొని ఆదర్శమూర్తిగా వున్నాడు. ధర్మను అరెస్టుచేసిన పదిరోజులలో వారిలో చివరివాడైన, 18 సంవత్సరాల కిషన్‌ను జైల్లో పెట్టారు. ఒక కొడుకు చని పోయాడు. ముగ్గురు కొడుకులు జైల్లో వున్నారు. అయినా ఆ కుటుంబం తమ ఆశయాన్నుంచి, యీషణ్మాత్రం కూడా చెదరలేదు.

1950 మార్చి 20 వ తేదీ ముండ్రాయి గ్రామంలో కా॥మేడ్ ధాను వీర మరణం పొందాడు. తుది ఘడియల్లో అతని పెదవులపై "కమ్యూనిస్టుపార్టీ వర్థిల్లాలి" "శత్రువు అంతం చూడాలి" అన్న నినాదాలే నాట్యమాడాయి

కామ్రేడ్ ఖాను అత్యంత ధైర్యశాలి దృఢ దీక్ష కలవాడు ప్రజలంటే అమితమైన ప్రేమ, ప్రజలను, ప్రత్యేకించి తమ లంబాడీ జాతిని అణచి వేస్తున్న దుర్మార్గులంటే గుండె పట్టనంత ద్వేషం. ఇంకేం కావాలి ఖాను అనతికాలంలోనే ప్రజా హృదయాన్ని చూరగొనేందుకు ?

భారత సైన్యాలు ప్రవేశించిన క్షణం నుండి, కామ్రేడ్ ఖానుకోసం, అతణ్ణి సజీవంగా పట్టుకునేందుకై సైన్యం ప్రయత్నిస్తూనే వుంది. అయితే సంవత్సరం వరకూ అతడు శత్రువులకు చిక్కలేదు. కానీ చివరకు ఒక ద్రోహి యిచ్చిన సమాచారంవల్ల ఖాను శత్రువుల చేతుల్లో చిక్కాడు. అతణ్ణి పెట్టని హింసలేదు. ఎన్నిబాధలు పెట్టినా ఖాను ఒక్క పార్టీ రహస్యమన్నా బయట పెట్టలేదు. అతని మొండితనం, ధైర్యం, సైన్యాధికారులకుకూడా అద్భుతం అనిపించింది. వారతనిని చంప నిరాకరించారు. రామవరం దేశముఖు కటారు నరసింగరావు అతన్ని బండికి కట్టించి చివికి ముక్కలై పోయేవరకూ యీడ్పించి చంపాడు.

కామ్రేడ్ ఖాను వీరమరణం తర్వాత మూడురోజులకు దళం ఆ కుటుంబాన్నిచూసి వోదార్చేందుకు ముంద్రాయి వెళ్ళింది. ఆ కుటుంబం, వృద్ధదంపతులు తమ విచారాన్ని ప్రక్కకునెట్టి, దళం వున్నంతసేపూ దళ అవసరాలను తీర్చుతూ దళరక్షణలో నిమగ్నమైపోయారు. ఆకుటుంబానికి శత్రువుపై ప్రతీకారం చేయాలన్న వాంఛ, పార్టీపైగల ప్రేమా, విశ్వాసమూ చెక్కుచెదరనివి మొక్కవోనివి. తెలంగాణా పోరాటు చరిత్రలోనే గర్వకారణమైన కుటుంబమది.

కామ్రేడ్ గౌరెల్లి మల్లయ్య: సిరిసిల్ల తాలూకాలో ఒక పేద కుటుంబానికి జెందినవాడు నైజాం వ్యతిరేక పోరాటంలో దళాలలోకివచ్చిన మల్లయ్య తిరుగులేని గురిగాడు. అతడా నేర్పును ప్రజావుద్యమాలకై వినియోగిస్తూ, యెంతోమంది శత్రువులను గాయపరచాడు బొంతకట్టునాగారం గ్రామంలో ముగ్గురు సైనికులను హతమార్చి మూడు తుపాకులు సాధించిన దాడిలో అతని దళమే పాల్గొన్నది.

ఆ కామ్రేడ్ జ్వరం తగిలి బాధపడుతున్న సమయంలో శత్రువు చేతిలోచిక్కాడు. అతన్ని బండికి కట్టి యీడ్చారు. తోలు వూడిపోయింది. శరీరమంతా నెత్తురు వరదలై పారుతున్నది కానీ నోటివెంటమాత్రం ఒక్క రహస్యమన్నా రాలేదు. ఒకచెయ్యి తర్వాత యింకో చెయ్యి ఒక కాలు తర్వాత యింకో కాలు చొప్పున నరికారు. అయినా కామ్రేడ్ మల్లయ్య నోటినుండి ఒక్కమాటకూడా కక్కించలేకపోయింది మిలటరీ — తుదకు ఆ కామ్రేడ్ వీరమరణం పొందాడు.

కా౹మేడ్ భూపతిరెడ్డి : బసిరెడ్డిపల్లె వుద్యమ ద్రోహులపై చర్య తీసుకున్న తర్వాత, గెరిల్లా దళం కరీంనగర్ జిల్లాలోని చినసముద్రాల గ్రామంలో ఏపుగా పెరిగిన జొన్నచేలో విశ్రమిస్తున్న సమయంలో మిలటరీ వారిని చుట్టుముట్టింది. సెంట్రీ నిర్లక్ష్యంవల్ల శత్రువును ముందుగానే పసిగట్టలేకపోయారు.

మిలటరీ పొలంచుట్టూ కమ్ముకొని కాల్పులు సాగించింది. ఏది ఏమైనాసరే శత్రువుకు చిక్కకూడదు అని దళం నిర్ణయించుకుంది ఆ ప్రకారం కాల్పులు సాగించారు. శత్రువు పొలంలోకి చొచ్చుకురాసాహసించక నేల మీదపడుకునే కాల్పులు కొనసాగించారు. ఇల్లా యిరుపక్షాలమధ్య కాల్పుల యుద్ధం కొంచెంసేపు సాగింది. ఇక లాభంలేదు. శత్రువు బలహీనంగావున్న చోటుగుండా ఈ వలయాన్ని ఛేదించుకుబయటపడాలని నిశ్చయించుకున్నారు. దానికితోడు శత్రువు అదనపుబలగాన్ని తెప్పించుకునే ప్రమాదం కూడా వుంది. అనుకున్నట్లుగా మొత్తం 9 మంది దళం ఒకసారి ఒకచోటనుండి దూసుకు పోయారు ఒక్కసారిగా దళంమీదపడుతున్నదనుకుని శత్రువు వెనక్కితగ్గాడు. తుపాకులు కాలుస్తూనే దళం బయటపడి తప్పించుకుందిగానీ, ఆ ఘటనలో కా౹మేడ్ భూపతిరెడ్డిమాత్రం మరణించాడు.

కా౹మేడ్ గజ్జల రామనరసింహారెడ్డి : [ వెంకటాపురం ] మట్టంపల్లి కేంద్ర ఆర్గనైజర్. భూమికోసం జరిగే పోరాటంలోనూ, వ్యవసాయ కార్మిక పోరాటాలలోనూ నాయకత్వం వహించినవాడు. ధనిక కుటుంబానికి చెందినవాడయినా, కార్మికవర్గ దృక్పథము సుగుణాలు అలవరచుకున్న కా౹మేడ్ 1950లో మిలటరీ దాడులు వుధృతమై సందర్భంలో కా౹మేడ్ రామ నర్సింహారెడ్డి విజయవాడ వెళ్ళవలసివచ్చింది. అక్కడ మేళ్ళ చెరువుకుచెందిన రౌడీ సత్యం అనే పోలీస్ ఏజెంటు ఈ కా౹మేడ్‌ను పట్టించాడు. అతన్ని నానా విధాల బాధించారు కానీ అతడొక్క రహస్యం కూడా బయటపెట్టలేదు. 1950 ఎప్రిల్ చివరి వారంలో అతనిని దొప్పలగుట్ట లంబాడీ తండావద్దకు తీసుకువెళ్ళి ప్రజల సమక్షంలోనే మిలటరీ కాల్చి చంపింది,

కా౹మేడ్ ముత్తవరపు వెంకయ్య కాపుగల్లు ప్రాంత ఆర్గనైజరు నైజాం వ్యతిరేక పోరాటాల దినాలనుండి భూమికోసం వ్యవసాయ కార్మిక పోరాటాలన్నింటికీ ఆ ప్రాంతంలో నాయకత్వం వహించి ప్రజలందరి అసహ్యానికి, ద్వేషానికి గురైన కాపుగల్లు భూస్వాముల ఆస్తి ధ్వంసం చేశాడు. 1950 జనవరిలో శత్రువులా తనని చుట్టేశారు. ఎంతో ధైర్యంగా పోరాడి తన వద్ద మిగిలిన నాటుబాంబు వారిపై విసిరి తప్పించుకో జూచాడుగానీ శత్రువు అన్నివిధాలా అధిక్యతతోవుండి, ఆ కా౹మేడ్ వెంకయ్యను పట్టుకోగలిగాడు.

మూడురోజులు అతనిని పెట్టని బాధలేదు. అయినా ఆ కామ్రేడ్ నోటివెంట ఒక్కమాటకూడా రాలేదు. చివరికి అతనిని కాల్చి చంపారు. ఆ ప్రాంతపు ప్రజలంతా, తమ ఆత్మీయుడు తమనువీడిపోయినట్లు విలపించారు. శత్రువు చేతులో చిక్కినప్పుడుగూడా కామ్రేడ్ వెంకయ్య ప్రదర్శించిన స్థిమితాన్ని ధైర్యాన్ని ప్రజలు సగర్వంగా చెప్పుకున్నారు.

*కామ్రేడ్ నకిరెకంటి వెంకులు*. కీతవారిగూడెంలోని ఒక వ్యవసాయ కార్మిక కుటుంబానికి జెందిన కామ్రేడ్ వెంకులు బేతవోలు ప్రాంత ఆర్గనైజరు. భూమి పంపకం కోసం జరిగిన పోరాటాలలోను, వ్యవసాయకార్మిక సమ్మెలలోనూ ముందుండి నడిపాడు. ప్రజల ప్రేమాభిమానాలు చూరగొన్న యీ కామ్రేడ్ ఆ ప్రాంతంలో శత్రువులపై జరిగిన దాడులెన్నింటిలోనో గణనీయమైన పాత్ర నిర్వహించాడు. 1950 లో యాతవాకిళ్ళ గ్రామంలో గుండా వెళ్తున్నపుడు పోలీసులు ఆయనను పట్టుకుని, కాల్చి చంపారు. తుదిక్షణాలలో గూడా "కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి! ఎర్రజెండా వర్ధిల్లాలి! ప్రజాద్రోహులు నశించాలి!" అంటూనే మరణించిన ధన్యజీవి కామ్రేడ్ వెంకులు

*కామ్రేడ్స్ బలిజ రాములు, చాకలి సోములు*: ఈ యిరువురు చింతగుంట గ్రామానికిజెందినవారు, కామ్రేడ్ రాములు పెంచికలదిన్నె ప్రాంతం పార్టీ ఆర్గనైజర్. ఎన్నో వ్యవసాయ కార్మిక పోరాటాలు నడపటమే కాక, ఆ ప్రాంతంలో ప్రజా ద్రోహులైన భూస్వాములను, పోలీసు ఏజెంట్లను మట్టుబెట్టటంలో చెప్పుకోదగిన పాత్రగలవాడు వెంగళనరిసిరెడ్డి అనే చింతగుంట భూస్వామి నాయకత్వాన, భూస్వాములు, కామ్రేడ్ రాములును, ఏదో భూమి తగాదా పరిష్కారానికి సంప్రదింపులకు రమ్మనమని దగాచేసి సుబ్బారెడ్డిగూడెంలో పోలీసులకు పట్టించారు. కామ్రేడ్ రాములుతోపాటు, సోములు నాటికి 15 సంవత్సరాలైనా నిండని ముకుపచ్చలారని పసివాడు. ఈ యిరువురిని రహస్యాలు రాబట్టేందుకై చిత్రహింసలుపెట్టిన మిలటరీ వాళ్ళ యత్నం విఫలం కాగా,కామ్రేడ్ రాములును కామ్రేడ్ సోములు కళ్ళెదుటే కాల్చి చంపారు. రహస్యాలు చెప్పకుంటే నీకూ యిదేగతి పడుతుందని, సోములును బెదిరించారు. "సంఘంనాది,నావంటి వేలాది యువకులు సంఘంకోసంప్రాణాలర్పించేందుకు సిద్ధంగా వున్నాం" అని సగర్వంగా సోములు సమాధాన మిచ్చాడు. శత్రువు ఎడల ద్వేషంతో నిప్పులుకక్కే కామ్రేడ్ సోములును సుబ్బారెడ్డిగూడెం క్యాంపులో కాల్చి చంపారు. ఇది జరిగిన విషాదకరమైన రోజు 1950 మార్చి 21 వ తేది.

*కామ్రేడ్ బారెడ్డి సైదులు రెడ్డి*: రజాకార్ వ్యతిరేక పోరాటకాలంనుండీకూడా దళ నాయకుడుగా వుండేవాడు. ఇతని స్వగ్రామం మేళ్ళ

చెర్వు. ఆయన సెంటర్ ఆర్గనైజరు అయ్యాడు. కందిబండ్ల జానికిరామారావనే పరమదుర్మార్గుడైన భూస్వామికి వ్యతిరేకంగా, పోరాటాలు నడిపాడు, బండిలో బస్తీకి తోలుకుపోతున్న శత్రువు పత్తిబేళ్ళను స్వాధీనం చేసుకున్నాడు. జోనల్ ఆర్గనైజర్ వెంట ఒకసారి వచ్చి ఆయన కోసం ఒక చేలో ఎదురు చూస్తున్న సందర్భంలో శత్రువు ఏజెంట్లు అతన్ని గుర్తుపట్టారు ఇంకేం, మిలటరీ అతన్ని చుట్టుముట్టింది. "నేను చచ్చినా నాసంఘం చావదు నా మర ణానికి బదులుకు బదులు తీసుకుంటుంది నా సంగం"అంటూ గర్జించాడు 1949 జులైలో ఆయనసూ ఆయనతోపాటు బసెట్టి రాములు అనే యింకో కామ్రేడ్‌నుకూడా పోలీసులు కాల్చి చంపారు.

కామ్రేడ్ పెంటయ్య (కొప్పొలు పెంటారెడ్డి: లింగగిరి వరగణాలోని అమరవరం గ్రామవాసి అయిన పెంటయ్య ఎన్నో వ్యవసాయ కార్మిక పోరాటాలు నడిపాడు. ఆ గ్రామ పటేల్ (మునసబు) కోరిన మీదట పోలీసు క్యాంపులో యీ కామ్రేడ్‌ను చితగ్గొట్టారు జైలునుండి విడుదలైన తర్వాత 1950 లో పార్టీలోజేరాడు. మొదట ఆ గ్రామ మున్సబును అంతంజేశాడు. దళసభ్యుడై చురుకుగా పనిజేశాడు ఆతర్వాత దళ నాయకుడై ఎన్నో పోరాటాలకు నాయకత్వం వహించాడు ఎల్లంపేట పోలీస్ క్యాంపుపై దాడి సందర్భంలో కామ్రేడ్ పెంటయ్య - కిటికీలోగుండా, నాటుబాంబు విసి రేందుకై గోడ పాకుతున్నాడు. ఇంతలో అ క్యాంపుకు కావలివున్న జమేదార్, పెంటయ్యను కాల్చేశాడు ఆయన తలలోగుండా తుపాకిగుండు దూసుకు పోయింది. అప్పటికప్పుడే ప్రాణం వదిలాడు. ఎంతో ధైర్యశాలి, చొరవ వుత్సాహంగల కామ్రేడ్ పోరాటంలో అసువులు బాశాడు.

కామ్రేడ్ నాసరయ్య: మేళ్ళచెర్వు గ్రామానికి జెందినవాడు. నిరక్షరాస్యుడైనా ఎంతో ధైర్యము, దీక్షగలవాడు. గెరిల్లా దళ సభ్యుడు శత్రువుల ఏజెంట్లపై శత్రు శిబిరాలపై రజాకార్ వ్యతిరేక దినాలనుండి జరిగిన పోరాటాలన్నింటా ప్రముఖపాత్ర వహించాడు పెనుగంచిప్రోలు పోలీస్ క్యాంపుపై దాడిచేసి, యీ దళం 20 తుపాకులు సంపాదించింది. ఆ తర్వాత దళం మల్కాపురం గ్రామ శివార్లలో ఒక చేలో దాక్కుంది. పట్టపగలు ఆచేను కావలివాడు చూసి, పోలీసులకు తెలియజేశాడు అతని ద్రోహంవల్ల దళాన్ని మిలటరీ చుట్టేసింది తప్పించుకోబోతుంటే నాసరయ్య కందిమోడు అడ్డంతగిలి కిందపడ్డాడు, ఆయనను మిలటరీ సన్నీలతోపొడిచి, అట్లాగే గుచ్చిన సన్నీని తియ్యకుండా, ఆ గ్రామంలోకి తీసుకువచ్చి, మళ్ళీ సన్నీలతో పొడిచి రహస్యాలు చెప్పమని బాధించారు. ఒక్క రహస్యంకూడా ఆ కామ్రేడ్ చేత

చెప్పించలేకపోయారు. దళంలోని మిగతా సభ్యులు దాటుకు పోయారు. కానీ ఒక విలువైన ప్రాణమూ సంపాదించిన తుపాకులూ శత్రువశమైనాయి

*కామ్రేడ్ వక్కంటు సూర్యనారాయణ.* వెలిదండ గ్రామ వాసి. కీతవారిగూడెంలో యీ కామ్రేడ్‌ను-మరి నలుగురిని మిలటరీ కాల్చి చంపింది గొండ్రేలుకు జెందిన కామ్రేడ్ హరిజన చంద్రయ్య, సందువట్లకు జెందినహరిజన సోమయ్య, మల్కాపురానికి జెందిన చలసాని వెలమసోమయ్య, మరొకరు.ఈనలుగురుకామ్రేడ్స్ 1950లో దళాలలోకివచ్చారు. కామ్రేడ్‌సూర్య నారాయణ తన 18 వ ఏటనే చదువుకు స్వస్తిజెప్పి, నల్గొండజిల్లా వుద్యమంలో పనిజేస్తూవచ్చాడు తల్లిదండ్రులు తనపై ఎన్నోరకాల ఒత్తిడి తెచ్చినా కృత నిశ్చయంతో పార్టీ కార్యక్రమంలో భాగస్వామి అయ్యాడు. పోలీస్ చర్య జరిగిన వెంటనే అతన్ని అరెస్టుచేసి జైల్లోపెట్టి చావచితగ్గొట్టారు జైల్లోకూడా ఎన్నో పోరాటాలు నడిపారు.

జైలు నుండి విడుదల కాగానే యింటికన్నా వెళ్ళకుండా రహస్య జీవితం గడుపుతున్న పార్టీ వారితో సంబంధాలు పెట్టుకుని దళాలతో చేరాడు కేంద్ర ఆర్గనైజర్ బాధ్యతలు స్వీకరించాడు కీతవారిగూడెంలో తననుశత్రువులు చుట్టుముట్టినప్పుడు గుండ్లు అయిపోయిన తర్వాత, తనవద్దనున్న రివాల్వర్‌ను శత్రువులకు దక్కనీయకుండా చెరువులోకి విసిరేశాడు తర్వాత ప్రజలా రివాల్వర్‌ను వెలికితీసి మళ్ళీ దళాలకిచ్చారు. పవిత్రమైన ఆశయంకోసం ప్రాణాలిచ్చిన అమరవీరుడు కామ్రేడ్ సూర్యనారాయణ.

*కామ్రేడ్ రష్యా లింగులు.* హుజూర్‌నగర్ తాలూకా చింతకల్లు గ్రామం కామ్రేడ్ లింగులు జన్మస్థలం. నిజాంవ్యతిరేక పోరాటంనాడే దళాల్లో చేరాడు. నాటుతుపాకితో అయినా సూటిగా గురిజూచి కొట్టగల ధీశాలి. 'పోలీసుచర్య' తర్వాత తొలిదశలో పార్టీ నిర్మాణం దెబ్బతింది. పార్టీ కార్య కర్తలు తమతమ ప్రాంతాలువదిలి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడ్డప్పుడు కూడా కామ్రేడ్ లింగులు జనంమధ్యవుంటూ మనపార్టీ మళ్ళా తిరిగివచ్చి విజయం సాధించి తీరుతుందని, కొంచెం నిరాశగావున్న ప్రజలకు ధైర్యం చెప్పేవాడు. మళ్ళా పార్టీతో సంబంధాలు పెట్టుకున్నాడు. ఆయనను పట్టుకుని ఎన్నిబాధలు పెట్టినా పోలీసులు కనీసం తనపేరు వూరుఅన్నా చెప్పించలేకపోయారు. అతడెప్పుడు రష్యాలో విప్లవం, తర్వాత శ్రామికవర్గరాజ్యం ఏర్పడటం, అక్కడి ప్రజల సుఖసంతోషాలగూర్చి చెప్తూవుండేవాడు గనుక, అతడికి 'రష్యాలింగులు' అన్నపేరు స్థిరపడి పోయింది.

కొన్నాళ్ళ తర్వాత కొంతమందిని విడుదల చేసేటప్పుడు అనుకో కుండా కామ్రేడ్ లింగులు కూడా విడుదలైనాడు. ప్రజలాతనికి రక్షణయిచ్చి పార్టీ కేంద్రానికి పంపారు. పార్టీ నిర్ణయానుసారం మహబూబ్ నగర్ జిల్లా కొల్లాపూర్ ప్రాంతానికి వెళ్ళాడు అక్కడ ఉద్యమాన్ని విస్తరింపజేయటంలో కామ్రేడ్ లింగులు ముఖ్య బాధ్యత స్వీకరించాడు. ఒక రోజు అతడూ అతని దళమూ నిద్రిస్తున్న సమయంలో సిక్కు సాయుధ పోలీసులు వారిని చుట్టు ముట్టి కామ్రేడ్ లింగులును గాయపరచి పట్టుకున్నారు. రహస్యాలు చెప్పమని ఎన్నో చిత్రహింసలకు గురిచేశారు. అయినా కామ్రేడ్ లింగులు ఒక్క రహస్యమూ బయటపెట్టలేదు. నన్ను చంపుతారు కానీ నా పార్టీని కమ్యూనిస్టు పార్టీని చంపలేరు. నా పార్టీ అజేయం! నా మరణానికి నా పార్టీ ప్రతీకారం తీర్చుకుంటుంది. రష్యాలో ఏర్పరచుకున్నట్లు విప్లవాన్ని జయప్రదంజేసి శ్రామికవర్గ రాజ్యాన్ని ఏర్పరుస్తుంది" అదే మాటలతో ప్రాణాలొదిలినట్లు ప్రజలు చెప్పుకునే వారు.

కామ్రేడ్ *రావిపాటి లింగయ్య*. 60 ఏండ్ల వృద్ధుడు, కొరియర్. యీ లింగయ్య, మంచి యీతగాడు! నిజాం, రజాకార్ కాలంనుండీ కూడా, మన కామ్రేడ్స్‌ను కృష్ణానది దాటించటం ఆయనపని, అమాయకుడల్లే ప్రజలమధ్యవుంటూ, ఎంతో సమాచారం సేకరించేవాడు తన యిద్దరు కొడుకుల్ని బాగా తర్ఫీదు చేసి తమ ముగ్గురుకి పార్టీ సభ్యత్వానికై అభ్యర్థించాడు. పార్టీ అంగీకరించింది. దళాలు అడవులలోకి వెనక్కి తగ్గినప్పుడూ కామ్రేడ్ లింగయ్య బంధువుల యింట్లో రక్షణ తీసుకొంటుండగా పట్టుపడ్డాడు. ఎన్నోబాధలకు గురైనాడు ఆయన కండలు ఒక్కొక్కముక్క కోసి, ఆయనకు చూపెట్టింది. అయినా కామ్రేడ్ లింగయ్య ఒక్క రహస్యమూ చెప్పలేదు. చివరికి అతణ్ణి కాల్చి చంపారు.

కామ్రేడ్ రాము [ గంగిరెడ్డి కోటిరెడ్డి ] : హుజూర్‌నగర్ ప్రాంతంలో పార్టీ ముఖ్య కార్యకర్త ఆయన తిర్మలగిరి – మిర్యాలగూడెంకు జెందినవాడు. యాభైవేల రూపాయలు, ఒక టన్ను తుపాకి మందు, 15 తుపాకులతోసహా ముఖ్య నాయికులువున్న రహస్య స్థావరాలు యీ కామ్రేడ్‌కు తెలును. పోలీసులు ఆయనను పట్టుకుని 15 రోజులు నానా బాధలూ పెట్టారు – అయినా ఒక్కమాటకూడా కామ్రేడ్ రాము నోటి వెంట రాలేదు చివరికి మిలటరీ ఆయన్ను కాల్చింది. ఆయన వీరమరణం జెందాడు

కామ్రేడ్స్ – *అక్కల సైదయ్య – గింజలూరి పిచ్చయ్య* : కామ్రేడ్ సైదయ్య నైజాం – రజాకార్ రోజులనుండికూడా హుజూర్‌నగర్

ప్రాంతీయకమిటీ రహస్య కార్యకలాపాల నిర్వహణలో పనిచేస్తూవచ్చారు ఆయన బొత్తలపాలెంగ్రామవాసి నిజాం రజాకార్ రోజులనుండి పార్టీలో పనిచేస్తున్న కామ్రేడ్ సైదయ్యకు మొత్తం అరణ్యప్రాంతం అంతా కొట్టిన పిండే అడవులలోని, గుత్తేదార్లకు నిరంకుశ వుద్యోగులకు వ్యతిరేకంగా పేద ప్రజానీకానికి ఆయన ఎనలేని అండగావుండేవాడు పిచ్చయ్య మునగాల పరగణా జగన్నాధపురం వాసి. అక్కడి భూస్వాముల నెదిరిస్తూ యెన్నో వ్యవసాయకార్మిక పోరాటాలు నడిపినవాడు. ఫలితంగా వున్నవూరువదిలి వెళ్ళవలసివచ్చింది. పార్టీలోజేరి దళ సభ్యుడైనాడు.

దళాలకు ఆహారం కోసమై యీ యిరువురు కామ్రేడ్స్, బొత్తల పాలెం వెళ్ళారు ఆ గ్రామపటేల్ ఆధ్వర్యాన స్థానికగూండాలు వీరిపైబడి వీరిని పట్టుకుని పోలీసులకు అప్పగించారు పోలీసులు వీరి శరీరాన్ని కత్తి కొక్క కండగాకోసి వుదయంనుండి సాయంత్రందాకా హింసించారు అయినా ఆ వీరులిద్దరూ ఒక్కమాటన్నా చెప్పలేదు కామ్రేడ్ పిచ్చయ్య చేత, వూరు, పేరుకూడా చెప్పించలేక చివరికి యీ యిద్దర్నీ 1950 ఆగస్టు 8వ తేదీ కలువే పల్లి గుట్టల్లో కాల్చి చంపారు.

కామ్రేడ్ *గుండా వెంకన్న*: తడకమళ్ళ గ్రామానికిజెందిన వ్యాపారస్తుడు మంచి భూవసతి గలవాడుకూడా. నైజాం వ్యతిరేకపోరాటం రోజుల్లో పార్టీలోకివచ్చిన యీ కామ్రేడ్ కేంద్ర ఆర్గనైజర్ కాగలిగాడు. తోపుచర్లప్రాంతంలో కొన్నివేల యకరాలను పంచటంలో ముఖ్యపాత్ర వహించాడు. పోలీస్‌చర్య తర్వాత కోస్తా ప్రాంతంలో రక్షణ తీసుకుంటున్న యీ కామ్రేడ్ పార్టీసంబంధాలకై యత్నిస్తూవుండగా 1950 లో మచిలీ పట్నంలో పట్టుబడ్డాడు. హోమ్‌గార్డ్సులో జేరమని కామ్రేడ్ వెంకన్నను హింసించారు. అందుకు నిరాకరించడంతో ఆయన్ని కాల్చిచంపారు.

కామ్రేడ్ *రంగారెడ్డి*. కొమరెడ్డిగూడెంలోని ఒక ధనిక రైతు కుటుంబానికి జెందినవారు కామ్రేడ్ రంగారెడ్డి. నైజాం వ్యతిరేక పోరాటంలో పార్టీలోకి వచ్చిన యీ కామ్రేడ్ బాబాసాహెబ్‌పేట దేశముఖ్‌ల భూమి పంపకంలో ప్రముఖపాత్రవహించాడు పోలీస్‌చర్యతర్వాతకూడాఆప్రాంతంలో 1949 లో ఎన్నో వ్యవసాయ కార్మిక పోరాటాలు నడిపాడు. 1949 జనవరిలో శత్రువు లాతనిని పట్టుకుని కాల్చిచంపారు.

కామ్రేడ్ *అప్పిరెడ్డి*: రామడుగు కేంద్రానికిజెందిన పార్టీ కార్యకర్త, మధ్యతరగతి రైతు కుటుంబంనుండి వచ్చిన యీ కామ్రేడ్, నిజాం రజాకార్ రోజుల్లో పార్టీలో జేశాడు. పోలీస్‌చర్య తర్వాత ఆయనను జైల్లో

పెట్టారు జైలులోకూడాఎన్నోపోరాటాలలోపాల్గొన్నాడు. 1950 లో ఆయనను విడుడల చేసిన తర్వాత మళ్ళీ దళాల్లోజేరి, పోలీసు వాహనాలపై దాడులలో పాల్గొన్నారు. ఆయన దళాన్ని చుట్టుముట్టి పట్టుకుని మళ్ళీ జైల్లో వేశారు. రహస్యాలు చెప్పమని బాధించి ఏమీ రాబట్టలేక కాల్చిచంపారు.

కామ్రేడ్ ఆకారపుసైదులు . బొత్తలపాలెంలో ఒక వ్యవసాయ కార్మిక కుటుంబానికి చెందిన సైదులు ఎన్నో వ్యవసాయ కార్మిక పోరాటాలకు నాయకత్వం వహించాడు. ఎన్నోసార్లు ఆయనను పోలీసులు, భూస్వాములు గూండాలు పట్టుకుని చిత్రహింసలు పెట్టారు చివరకు 1950లో కాల్చిచంపారు.

కామ్రేడ్ సుంకర వెంకటప్పయ్య: రామసముద్రం గ్రామ వాసి. మునగాల దళ నాయకుడై ఎంతో మంది శత్రువులను హతమార్చాడు ఒకరోజు ఆయన చేలో పడుకుని వున్నప్పుడు – శత్రు ఏజెంట్లు పోలీసులను తీసుకువచ్చి చుట్టుముట్టారు. తన గైడర్‌తో చివరి గుండువరకూ, ప్రతిఘటించి తనవద్ద మందుగుండుఅయిపోయినతర్వాత, శత్రువుచేతుల్లోచిక్కాడు, ఆయనను ఆయన సహచరులిద్దరినీ పోలీసులు కాల్చివేశారు.

కామ్రేడ్ గొల్లముత్తయ్య,నందయ్య, గుర్రం నర్సిరెడ్డి : జగన్నాథ పురం కామ్రేడ్ ముత్తయ్య జన్మస్థలం. చదువుమానేసినదగ్గరనుంచీ మునగాల పరగాణాలో ఆర్గనైజరుగావుంటూ జమీందార్‌కు వ్యతిరేకంగా జరిగిన పోరా టంలో ప్రధానపాత్ర నిర్వహించాడు మునగాలలో ఒక రహస్యస్థావరంలో వుండగా కామ్రేడ్ ముత్తయ్యను,అదేగ్రామానికిచెందిన కామ్రేడ్ నందయ్యను జోనల్ ఆర్గనైజర్ కామ్రేడ్ గుర్రం నర్సిరెడ్డిని 1950 లో పోలీసులు పట్టు కున్నారు. వాల్యాపురం గుట్టలలో వాళ్ళని కాల్చిచంపారు. కామ్రేడ్ నర్సి రెడ్డిది తిమ్మాపురం. సూర్యాపేట మునగాల సరిహద్దులలో ఎన్నోగ్రామాల్లో జీతగాళ్ళ కూలీపోరాటాలకు, భూమిపంపకం పోరాటాలకు నాయకత్వం వహించాడు కామ్రేడ్ నర్సిరెడ్డి పేరుతలచుకుంటేనేచాలు స్థానిక భూస్వామి అనిరెడ్డి రంగారెడ్డికి కంటిమీాద కునుకువుండేదికాదు. కానీ ప్రజలకు మాత్రం ఆతడు ప్రాణం !

కామ్రేడ్ యస్. పున్నయ్య . మునగాల పరగాణా అంజలిపురం గ్రామానికిచెందిన వ్యవసాయ కార్మికుడు. లంబాడీలకు అతడంటే అత్యంత అభిమానం. రామనర్సారెడ్డి దళంలో సభ్యుడైన పున్నయ్య 1949–50 లో యూనియన్ సైన్యాల తీవ్రదాడుల తర్వాత పార్టీ సంబంధాలకై యత్నిస్తుం డగా అతని స్వగ్రామంలోనే మిలటరీపట్టుకునిహింసించి చివరికి కాల్చిచంపేసింది.

కామ్రేడ్ గుండు రాములు - బాలయ్య. కామ్రేడ్ రాములు మునగాల పరగణాలో ఎన్నో రైతు పోరాటాలలో పాల్గొని తెలంగాణా ప్రజాపోరాటంలో జేరాడు. తనకున్న దురలవాట్లను పోగొట్టుకుని, రాజకీయంగా మరింత చైతన్యవంతమయ్యేందుకు నిత్యం కృషిచేసేవాడు. మహబూబ్ నగర్ జిల్లాలో కృష్ణానదిని అనుకున్న లింగాలప్రాంతపు అడవులలో ఉద్యమాన్ని విస్తరింపజేశాడు.

కామ్రేడ్ బాలయ్య కొల్లాపూర్ జిల్లాలో కొత్తపల్లి గ్రామానికి చెందిన యువకుడు అతనిది ధనిక రైతు కుటుంబం కామ్రేడ్ రాములుతో కలసి పనిచేశాడు. కొత్తపల్లి పోలీస్ క్యాంపుపై దాడికి కావలసిన సమాచారం యావత్తూ సేకరించింది కామ్రేడ్ బాలయ్యే. కానీ బల్మూర్ గ్రామభూస్వాములు, వారి ఏజంట్ల ద్రోహంవల్ల వీరిద్దరూ శత్రువుకు పట్టుపడ్డారు. వారిద్దర్నీ హింసించి ఏ సమాచారమూ రాబట్టలేక కాల్చి చంపారు (తెలంగాణా పోరాటం సందర్భంగా మునగాల పరగణాకు చెందిన 43 మంది పార్టీ కార్యకర్తలు చంపివేయబడ్డారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం, మునగాలను, నల్గొండ జిల్లా హుజూర్ నగర్ తాలూకాలో కలిపారు)

కామ్రేడ్ ఉత్తరయ్య (నరసింహులు). బొల్లేపల్లి గ్రామంలో స్థానిక భూస్వాములవద్ద గుమాస్తాగావుండే వుత్తరయ్య పార్టీవైపు ఆకర్షితుడై తర్వాత దళాలలో పనిచేశాడు. ఉత్తరయ్య బంధువే అయిన సాలె రామస్వామి అనే ఒక ద్రోహియిచ్చిన సమాచారంవల్ల మిలటరీఆయనను పట్టుకుని 'నందనం మిలటరీ క్యాంపులో కాల్చి చంపారు. తర్వాత దళాలు రామస్వామిని హతమార్చి 3 తుపాకులుకూడా స్వాధీనం చేసుకున్నాయి. కొన్నాళ్ళకు దళాలకు సహాయం చేస్తున్నదన్న మిషమీద కామ్రేడ్ వుత్తరయ్య మేనత్తనుకూడా పట్టుకుని మిలటరీ ఆమెను చెరిచి మూడు రోజులకు కాల్చిచంపింది.

కామ్రేడ్ నందా కొమరయ్య. ఇతడూ ఒక గుమస్తా. ఆయన పెద్ద అన్నను గెరిల్లా దళాలు చంపేశాయి కొమరయ్యకు, కొమరయ్య రెండో అన్న అయిలయ్యకు మొదట్లో పార్టీ అంటే ద్వేషంవుండేది. కానీ క్రమేపీ పార్టీని గూర్చి తెలుసుకున్న తర్వాత పార్టీ ఆశయాన్ని ఆమోదించి, హర్షించి, వారే పార్టీలోజేరారు.

రామన్నపేట పార్టీ నాయకుడు రామచంద్రారెడ్డితోపాటు అయిలయ్యను అరెస్టుచేశారు. పోలీసుచర్యతర్వాత కొమరయ్య బగటు ప్రాంతానికి వెళ్ళాడు. భువనగిరితాలూకా కూనూరు గ్రామంలో ఆయనను అరెస్టు

చేశారు విడుదలైనతర్వాత ఆయన మళ్లీ కేంద్రఆర్గనైజరుగా పనిచేయ మొదలెట్టాడు. కానీ, మళ్ళీ ఆయనను కూనూరులోనే అరెస్టుచేసి మోటకోడూరు, మిలటరీక్యాంపులో కాల్చిచంపారు.

కామ్రేడ్ బద్దం నారాయణ. వ్యవసాయ కార్మిక కుటుంబం నుండి వచ్చిన నారాయణ ఎన్నో పోరాటాలు నడిపి, పాలేర్లకు నెలకు80 శేర్ల ధాన్యం జీతంగా సాధించగలిగాడు. ఆ తర్వాత పార్టీలోకివచ్చి, పార్టీకి సర్వకాల కార్యకర్త కాగలిగాడు. భువనగిరి ప్రాంతం వదలి వెళ్ళవలసినమీదట రైల్వేలో కార్మికుడుగా జేరాడు. కానీ, ఒక ద్రోహి సమాచారంవల్ల శత్రువు అతన్ని పట్టుకుని కాల్చిచంపేశాడు

కామ్రేడ్ గోకుల మట్టయ్య [రెడ్డి]: నైజాం వ్యతిరేక పోరాట దినాల్లోనే మట్టయ్యను అరెస్టుచేసి జైల్లోపెట్టారు. విడుదలైన వెంటనే మట్టయ్య ఆయన భార్య పార్టీలో చేరారు. కానీ, మళ్ళీ మిలటరీకి దొరికారు. కామ్రేడ్ మట్టయ్యను వెంటనే కాల్చిచంపారు. ఆయనభార్యనుమాత్రం మిలటరీపశువులు, చెరిచి బలిగొన్నాయి.

కామ్రేడ్ అప్పాజీపేట లింగయ్య: కామ్రేడ్ లింగయ్య నల్గొండ తాలూకా కొప్పోలు గ్రామస్థుడు

కామ్రేడ్ వెంకట నారాయణ: రామన్నపేట తాలూకాలో "పెద" గ్రామంలో చేనేత కుటుంబీకుడు. వీరిద్దర్నీ హోమ్‌గార్డ్ దళాలు మిలిటరీకి పట్టించాయి. మిలిటరీవారిని కాల్చిచంపింది.

ఆ తర్వాత దళాలు ఆ హోమ్ గార్డులను తాట వూడేవరకుకొట్టి వారిలో అసలు నేరస్థులను హతమార్చి, ఆ యిరువురు కామ్రేడ్స్ మరణానికి ప్రతీకారం చేశాయి.

కామ్రేడ్స్ గుట్టా సీతారామిరెడ్డి, పైలా రామచంద్రారెడ్డి. రాచకొండ గుట్టలలో వారం రోజులపాటు రాజకీయ పాఠశాల నడిచింది. మరునాడే 50 మందిదాకా కార్యకర్తలు, దళసభ్యులు తమ తమ ప్రాంతాలకు వెళ్లవలసివుంది కానీ ఆ రోజు వీరికి భోజనం తెచ్చిన వాళ్ళలో ఒకడు ఈ సంగతి శత్రువు చెవిన వేశాడు. తెల్లవారు ఝామునే మిలటరీవచ్చి దాడి చేసింది. ఆ ద్రోహమే జరగకపోయినట్లయితే రాచకొండగుట్టలలో యీ విషయం బయటకు తెలిసే అవకాశమేలేదు. గుట్టలకు కొంచెం దూరంలో పడుకున్న దళాలు యీ మిలటరీ వలయాన్ని గమనించాయి. కానీ కాల్పులు జరిపితే, తమ వునికి తెలిసిపోతుందని వారివారి స్థానాల్లోనే సర్వసన్నద్ధంగా నిశ్శబ్దంగా

వున్నారు ఈ మిలటరీని గమనించనివారు దొరికారు దాపునేవున్న చెరువువద్ద కలుసుకోవాలని ముందుగానే అనుకున్నారు. తదనుగుణంగా పి. రామచంద్రా రెడ్డి (ప్రాంతీయ కమిటీ సభ్యుడు) చెరువు వద్దకు వచ్చాడు. ఇలాంటి అనుకోని సందర్భాలలో యివ్వవలసిన సంకేతాలు యివ్వటం జరిగింది. అయితే యీ లోపలే మిలటరీ చుట్టేసి అన్నివైపులనుండి కాల్పులు సాగించింది. డాక్టర్ రాజబహద్దూర్‌గౌడ్ దొరికిపోయాడు

చెరువులో నీళ్ళు త్రాగుతూవుండగా రామచంద్రారెడ్డికి యిరువైపుల నుండి తుపాకిగుళ్ళు దూసుకుపోతున్నాయి. ఇక చెరువులోదూకి తలదాచుకోవటం మినహా వేరేగత్యంతరం లేదని రామచంద్రారెడ్డి చెరువులోకి దూకబోతుండగా మిలటరీ అతన్ని పట్టుకుంది. మిగతా దళసభ్యులు చాలామంది ఎలాగో తప్పించుకున్నారు. ఒక దళసభ్యుడు గొడ్లకాపరిలా దుస్తులనుధరించి మిలటరీని దాటుకుపోయి అతిసాహసంగా కొంచెందూరంగావున్న మరొక దళాన్ని హెచ్చరించాడు. ముందుగా యీ విషయం తెలియకపోయినట్లయితే ఆదళం కూడా దొరికేదే. ఈ హెచ్చరిక మూలంగానే వారు తప్పించుకున్నారు.

అరెస్టయిన ముగ్గురిలో కామ్రేడ్ రామచంద్రారెడ్డిని, సీతారామిరెడ్డిని పోచంపల్లి మిలటరీ క్యాంపుకు తీసుకువెళ్ళి నానాహింసలు పెట్టారు. సమాచారం రాబట్టేందుకై వారిని భువనగిరి, నల్గొండ, షిర్కీ తాలూకాలలో తిప్పారు. నెలరోజుల హింసతర్వాతకూడా, యీ యిరువురు కామ్రేడ్స్‌నుండి ఒక్కమాటకూడా రాబట్టలేకపోయింది మిలటరీ. "మీారు దోపిడీదొంగలు మా దళాల చేతుల్లోనే మీకు త్వరలోనే చావుమూడింది రహస్యాలు చెప్పి ప్రజాద్రోహానికి వొడిగట్టే నీచులంకాదు మేము" అన్నదే వారిమాట!

బయట పార్టీకి వారి అచూకీ తెలిసింది. పార్టీ రిట్ పిటిషన్ దాఖలు చేసింది. కోర్టులో ఆ ఇద్దరు కామ్రేడ్స్‌ను హాజరు పరచవలసిందిగా, హైకోర్టు వుత్తరువిచ్చింది. చిత్రహింసలకు నెల్లాళ్ళుగా గురైన ఆ కామ్రేడ్సును హైకోర్టు ముందు హాజరు పరిస్తే, కోర్టు మిలటరీ అధికారులను మందలించేది ఖాయం. అందుకు ప్రభుత్వమే ఒక కుట్రపన్ని వారిద్దర్ని దగ్గర గుట్టలలోకి తీసుకువెళ్ళి కాల్చి చంపింది

కామ్రేడ్ పైలా రామచంద్రారెడ్డిది రామన్నపేట తాలూకా సంషాల గ్రామం రామన్నపేట తాలూకా ఉద్యమ నిర్మాతలలో అయనొకడు. జనగాం నల్గొండ తాలూకాలలో కూడా ఉద్యమ విస్తరణకై కృషిచేసి భూస్వాములకు చెందిన వేలాది ఎకరాల భూమిని, పశుల మందలను ప్రజలకు పంచటంలో తనవంతు పాత్ర నిర్వహించాడు. రజాకార్ దేశముఖ్ దురాగతాలను అణచటంలో

తీవ్రకృషి చేశాడు "ఎన్ని బాధలు పెట్టినా రహస్యాలు చెప్పకూడదు. చివరికి మన ప్రాణమే పోయినా పార్టీకి, ప్రజలకు ద్రోహం చేయకూడదు" అని తన అనుచరులకు ఎన్నాళ్ళుగానో చెబుతూవచ్చిన మాటలను ఆచరణలో నిరూపించాడు కామ్రేడ్ రామచంద్రారెడ్డి.

కామ్రేడ్ సీతారామిరెడ్డి నల్గొండ తాలూకా కోరుమళ్ళ గ్రామంలోని ఒక సామాన్య రైతు కుటుంబానికి చెందినవాడు. జోనల్ కమాండర్‌గా వుంటూ చాలా విస్తృతమైన ప్రాంతంలో నైజాం వ్యతిరేక పోరాటాలు నడిపాడు భూమి, పశు సంపద, భూస్వాముల ఆస్తిని పేద ప్రజానీకానికి పంచటంలో ప్రముఖపాత్ర వహించాడు. శతృవులను ఆ ప్రాంతంలో తలెత్తనీయ లేదు. యూనియన్ సైన్యాల ప్రవేశానంతరం, రాచకొండ గుట్టలవద్దకు వెనక్కితగ్గినా ప్రజలతో నిత్యసంబంధాలు పెట్టుకునేవాడు. పార్టీ యెడలగల అచంచల విశ్వాసము, ప్రజల యెడలగల అనితర సాధ్యమైన అభిమానము చివరిక్షణాల్లో, ఎన్నో హింసలకు గురౌతూకూడా, ఆ కామ్రేడ్ అమరపేరు డయ్యేందుకు కావలసిన దీక్ష, పట్టుదల, అతనికి ప్రసాదించాయి.

కామ్రేడ్ ముకుందం . జన్మస్థానం చౌళ్లరామవరం వ్యవసాయ కార్మిక కుటుంబానికి చెందిన యీ కామ్రేడ్ రెండో ప్రపంచ యుద్ధం తర్వాత బ్రిటిష్ మిలటరీనుండి విడుదలై వచ్చాడు ప్రజావుద్యమాలలో పాల్గొంటూ, దళ సభ్యుడై, దళ నాయకుడైనాడు.

ఒకసారి కామ్రేడ్ ముకుందం పనిమీద హైద్రాబాద్ వెళ్లాల్సి వచ్చింది. ఈ సంగతి శతృవు యెట్లాగో పసిగట్టి అతన్ని అరెస్టుచేసి, సమాచారం సేకరించేందుకై ఎన్నో చిత్రహింసలుపెడుతూ రామన్నపేట తాలూకా మిలటరీ క్యాంపులన్నీ తిప్పారు. వారి ప్రయత్నాలేవీ ఫలించకపోగా రామన్నపేట తాలూకా వెల్దేవి గ్రామం తీసుకువెళ్ళారు గ్రామ ప్రజలందర్నీ ఒకచోట కూడేసి వారందరి కళ్ళెదుటే కామ్రేడ్ ముకుందాన్ని కాల్చిచంపారు "కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి" అని నినదిస్తూ ఆ కామ్రేడ్ కన్నుమూశాడు

కామ్రేడ్ ఎర్రా నర్సిరెడ్డి : జనగాం తాలూకా సిద్దంకి గ్రామ వాసి. 1947 లో నిజాం రజాకార్ వ్యతిరేకపోరాటంలో ఉద్యమంలోకివచ్చి కొలనుపాక ప్రాంతంలో కేంద్ర ఆర్గనైజరుగా బాధ్యత స్వీకరించాడు. ఒకనాడు కామ్రేడ్ నర్సిరెడ్డి – ఒక కొరియరు, ఇంకా 5 గురు దళ సభ్యులు భువనగిరి తాలూకా పటేల్‌గూడెంలో ఒక బావివద్ద వున్నారు ఊళ్ళో నుండి కొంతమంది ప్రజలు కూడా తమతమ సమస్యలు చెప్పుకునేందుకై ఈ దళం

వద్దకు వచ్చారు. ఈ సంగతి తెలిసి మిలటరీ ఆలేరు, జనగాం క్యాంపుల నుండి పెద్దయెత్తున వారినిచుట్టుముట్టారు. సెంట్రీ గమనించి దళాన్ని హెచ్చరించాడు. కాని అంత పెద్దబలగంతోవున్న శతృవలయాన్ని ఛేదించటం కష్టసాధ్యం. అందులోనూ దళంవద్ద రెండే తుపాకులున్నాయి అయినా వున్నతుపాకులే కాలుస్తూ, ఆ వలయాన్ని దాటుకుపోవటంతప్ప మార్గంలేదు.

ఈ ఘటనలో కామ్రేడ్ నర్సిరెడ్డి తొడలో తుపాకీగుండు దూసుకు పోయి కదలలేక పడిపోయాడు. ఆ బావిగల ఆసామి ఒక స్థానిక దళ సభ్యుడు. కొరియర్ పెంబర్తి మల్లయ్య అక్కడికక్కడే మరణించారు. కదలలేని నర్సిరెడ్డి గుండెపై తుపాకీనుంచి రహస్యాలుచెప్పమని బెదిరించింది మిలటరీ! "కాల్చండి! అంతేగా! కాని నేనేమన్నా సమాచారం చెప్తాననుకోటుంకల్ల!" అన్నాడు. మిలటరీ కాల్చిచంపిందికామ్రేడ్ను.

● ● ●

కామ్రేడ్ *వెదిరె రాజిరెడ్డి* : హుజూర్నగర్ తాలూకాలోని ఒక ధనిక కుటుంబంలో జన్మించాడు. ఆ ప్రాంతం ఆంధ్రమహాసభ నాయకులలో ముఖ్యుడు. కమ్యూనిస్టుపార్టీ తన కార్యకలాపాలను ఆ ప్రాంతానికి విస్తరించి నప్పుడు పార్టీలోజేరాడు. యూనియన్ సైన్యాలు ప్రవేశించగానే అతన్ని అరెస్టుచేసి వరంగల్లు జైల్లో పెట్టారు.

కామ్రేడ్ *రంగాచారి* . నిజామాబాద్జిల్లాలో కామారెడ్డిగూడెం వాసి. ఆయనొక యువ కళాకారుడు. హైదరాబాద్ పట్టణంలోవుంటూ, ఆంధ్రమహాసభ, కార్మికసంఘాలు యితర ప్రజాహిత కార్యాలలోనూ చురుకుగా పాల్గొంటుండేవాడు. ఎంతో స్ఫూహశక్తిగల యీ కామ్రేడ్ పార్టీకి సాంకేతిక విషయాలలో యెంతో వుపయోగపడేవాడు. 1949 లో అతన్ని అరెస్టు చేశారు.

ఈ ఇద్దరు కామ్రేడ్స్నుండి రహస్యాలు రాబట్టలేని మిలటరీ జైలు నుండి వీరిని తీసుకువెళ్ళి కాల్చి చంపింది.

కామ్రేడ్ *జగన్నాధాచారి* . మునగాల ప్రాంతంలో ఆంధ్రమహాసభలో ఒక ముఖ్య కార్యకర్త. అతన్ని అరెస్టుచేసి, ఎన్నో పోలీసు క్యాంపులలో నిర్బంధించి, చివరకు ఖమ్మం తీసుకువెళ్తూ దారిలో కాల్చిచంపారు.

ఈ ముగ్గురి విషయం 'హెబియస్ కార్పస్ పిటీషన్' ద్వారా సుప్రీంకోర్టుకు తీసుకువెళ్ళటం జరిగింది. అయితే ప్రయోజనం లేకపోయింది. వీళ్ళే జైలునుంచి తప్పించుకు పారిపోయారని, వీరి విషయం తమకేమీ తెలియదని ప్రభుత్వం బుకాయించింది.

1950 లో ఆంధ్రప్రాంతంలో చాలమంది కామ్రేడ్స్‌ను జైళ్ళనుండి కోర్టులనుండీకూడా తీసుకువెళ్ళి ప్రభుత్వం ఇలా కాల్చి చంపింది.

● ● ●

కామ్రేడ్ భీమిరెడ్డి కొండలరెడ్డి(సూర్యాపేట), కామ్రేడ్ పసులూరు సత్యం(ఖమ్మం): కామ్రేడ్ భీమిరెడ్డి కొండలరెడ్డి.ధనికవర్గంనుండివచ్చిన తన పినతల్లి, పెదతల్లి. బిడ్డలతోపాటు వుద్యమంలోకి వచ్చాడు. తన నమ్రత నిరాడంబరత, అలుపెరుగని శ్రమ ఫలితంగా తన దళంలోని యితర సభ్యులకు ఆదర్శప్రాయంగావుండి నాయకత్వం వహించాడు. వారందరూ ఏనాడూ కామ్రేడ్ కొండలరెడ్డి మాటకు జవదాటి ఎరుగరు.

శతృదాడులు వుధృతమైన తర్వాత దళాలు మానుకోట అడవులలోకి తగ్గాయి. అప్పుడు సమయానికి అక్కడ – కామ్రేడ్ భీమిరెడ్డి నర్సింహారెడ్డి లేడు. ఆయన రాష్ట్ర కేంద్రానికి వెళ్ళాడు దురదృష్టవశాత్తూ ఆయనలేని సమయంలో సి.హెచ్. తిరుమలరావు ప్రాంతీయ కార్యదర్శిగా వ్యవహరిస్తున్నాడు. అలాంటి గడ్డు సమయంలో దళాలను, దళ నాయకులను సమన్వయ పరచి, వారికి సరైన మార్గం చూపగల దక్షత, పరిపక్వత తిరుమలరావుకు లేవు.

పరిస్థితులు మరింత విషమిస్తున్నాయి. ఇక దళ చర్యలెలా జరపాలి, దళాల నేంచేయాలి అన్న విషయంపై కొన్ని విభేదాలు పొడసూపి చర్చలు సాగుతున్నాయి.

తిరుమలరావు కుట్రజేసి, యీ కామ్రేడ్ కొండలరెడ్డి, సత్యమూ, ఇంకో కొరియర్ లింగయ్యకలిసి తననూ నాయకత్వాన్ని హత్యచేయ నున్నారని యీ ముగ్గుర్ని చంపించాడు. ఆ తర్వాత పార్టీ యిలాంటినింద నిరాధారమని, వారు చాలా విశ్వాసపాత్రులైన కార్యకర్తలని తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రజలకోసం అనువులు బాసిన అమరవీరులని తీర్మానించింది.

పోరాటం ఆగిపోయిన తర్వాత తిరుమలరావు అరెస్టయ్యాడు. స్టేట్ కాంగ్రెస్‌లోవున్న తన బంధువుల సహాయంతో విడుదలైనాడు. ఆ తరువాత అతడు పార్టీని, ప్రజాఉద్యమాన్ని వ్యతిరేకించి, కాంగ్రెసు ఏజెంటుగా తయారయ్యాడు.

సాయుధ పోరాట విరమణ తర్వాత భారత సైన్యాలు చంపిన కామ్రేడ్స్‌లో కొందరిపేర్లు :

కామ్రేడ్ ముత్తిరెడ్డి వెంకటచలం,

కామ్రేడ్ నల్లా నర్సింలు (జూనియర్)

కామ్రేడ్ రాము, భల్లు,

(వీరినిగూర్చి యింతకుముందు వివరణ జరిగింది.)

కామ్రేడ్ హరిశ్చంద్రరావు – మంతెనతాలూకా మల్లారం గ్రామం.

కామ్రేడ్ నాను – మంథెన తాలూకా మహాదేవపురం వెలిదండ్ల గ్రామ నాయకులు.

కామ్రేద్ ఎల్లబోయిన రాములు, కె. సముద్రం గ్రామం

కామ్రేడ్ సీతారాములు–మానుకోటతాలూకా యింగుర్తి.

## అధ్యాయం : 11

# తెలంగాణా సాయుధ గెరిల్లా

# ప్రతిఘటన ఉపసంహరణ

ఫ్యూడల్ భూస్వాములు, దేశముఖులు, జాగీర్దారులూ అమలు జరిపే వెట్టిచాకిరికీ, అక్రమ వసూళ్ళకు, బేదఖళ్ళకూ వ్యతిరేకంగా తెలంగాణా కర్షకులూ, ప్రజలూ చాలాకాలంగా పోరాడుతూ వచ్చారు. హైద్రాబాద్ నిజాంనవాబు నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగానూ అతగాడి గ్రామ పటేళ్ళ, పట్వారీల తదితర రెవెన్యూ పోలీసు నిరంకుశ అధికార్ల పీడనకు ప్రతికూలంగానూ, తెలుగు, మరాఠీ, కన్నడ ప్రజల మాతృభాషలను అణచివేసే నిజాంనవాబు విధానానికి వ్యతిరేకంగానూ ఈ పోరాటం కొనసాగింది. వాక్ సభా, పత్రికా స్వాతంత్ర్యంలాంటి ప్రాథమిక ప్రజాతంత్ర హక్కులూ, పౌరహక్కులు కావాలనీ, నైజాం నవాబు వ్యక్తిగతనిరంకుశ పరిపాలనను తొలగించి సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నెలకొల్పాలని డిమాండ్ చేస్తూ కూడా వారు పోరాడుతూ వచ్చారు.

అయితే, 1943 లో ఆంధ్రమహాసభ నాయకత్వం కమ్యూనిస్టుపార్టీ దాని కార్యకర్తల చేతుల్లోకివచ్చిన తరువాత, తెలంగాణా ప్రజలు సాగించుతున్న యీ పోరాటం తీవ్రమైన, సమరశీల స్వభావాన్ని, ఆ తరువాత తెలంగాణాలోని రైతాంగ పోరాటం క్రమంగా వ్యవసాయక తిరుగుబాటు స్వభావాన్ని తీసుకొన్నది. చివరలో భూస్వామ్యవిధానాన్ని రద్దుచేయాలనీ, నైజాం

నిరంకుశ పరిపాలనను కూలదోయాలనీ, హైద్రాబాద్ సంస్థానాన్ని రద్దుచేసి అక్కడ వివిధ బాషలు మాట్లాడే ప్రజలను నూతనంగా ఏర్పాటుచేసే విశాలాంధ్ర, ఐక్యకర్ణాటక, సంయుక్తమహారాష్ట్రలలో విలీనం చేయాలనే నినాదాలు ముందుకొచ్చాయి. గూండాలదాడులకు, దేశముఖుల, రజాకార్ల, నైజాంనవాబు పోలీసులఅత్యాచారాలకువ్యతిరేకంగా, కర్రలతోనూ, వొడిశలలతోనూ రైతుల ఆత్మరక్షణపోరాటంగా మొదటు ప్రారంభమైన తెలంగాణా పోరాటం, చివరకు నైజాం నవాబు సంస్థానానికి వ్యతిరేకంగా సాయుధవిముక్తి పోరాటంగా పరిణమించింది.

హైద్రాబాద్ సంస్థానంలోకి భారతీయ సైన్యాలను పంపించిన కాంగ్రెసు ప్రభుత్వం రజాకార్ ప్రమాదాన్నీ, నైజాం వంశ పరిపాలనను అంత మొందించిన మాట వాస్తవమే కాని భారత యూనియన్ ప్రభుత్వం, ప్రజలంతా ద్వేషించే నైజాం నవాబును రాజప్రముఖ్‌గా కొనసాగడానికి అనుమతించింది. హైద్రాబాద్ ఫ్యూడల్ రాజ్య సరిహద్దులను యధాతధంగా అట్టే పెట్టింది. అంతేకాదు, వీరతెలంగాణా పోరాటానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభలకు వ్యతిరేకంగానూ, తెలంగాణా రైతాంగం కష్టపడి పోరాడి సాధించుకున్న విజయాలను దెబ్బతీయడానికి ప్రధానంగా తన దాడిని కేంద్రీకరించింది. ప్రజాభిమానాన్ని పొందిన ప్రజాతంత్ర రైతాంగ ఉద్యమాన్ని కమ్యూనిస్టుపార్టీని నాశనం చేయడమే భారత ప్రభుత్వమూ, దాని సాయుధ బలగాలూ తమ ప్రధానమైన లక్ష్యంగానూ, సత్వర బాధ్యతగానూ ఎంచుకున్నాయి.

ఈ పరిస్థితుల్లో సమరశీల తెలంగాణా ప్రజలూ, ఆ పోరాటానికి నాయకత్వం వహించే గౌరవాన్ని పొందిన కమ్యూనిస్టుపార్టీ ఒక అతిక్లిష్ట సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. అదేమంటే, రైతాంగం సాధించుకొన్న భూములను, తదితర ప్రజాతంత్ర విజయాలను సంరక్షించుకొనేందుకు భారత ప్రభుత్వ సాయుధ బలగాలకు వ్యతిరేకంగా సాయుధ గెరిల్లా ప్రతిఘటనను కొనసాగించడమా ? లేక ఆయుధాలను కాంగ్రెసు ప్రభుత్వ సైన్యాలకు అప్పగించి, పోరాటంలో నిమగ్నమైవున్న ప్రజలు మన పార్టీపై వుంచిన విశ్వాసానికి ద్రోహం చేయడమా ? సాయుధ గెరిల్లా ప్రతిఘటనను మనం విడనాడి, హైద్రాబాద్ సంస్థానంలో కాంగ్రెసు ప్రభుత్వ మిలటరీ పరిపాలన అనుమతించే చట్టసమ్మతమైన పోరాటాలనూ, ఆందోళననూ చేపట్టడమా ?

ఈ జీవన్మరణ సమస్యపై కమ్యూనిస్టుపార్టీ నాయకులలో పరస్పర విరుద్ధమైన రెండు తీవ్రమైన అభిప్రాయాలు ఏర్పడినాయి.

భారత యూనియన్ సైనిక దాడులకు వ్యతిరేకంగా సాయుధ గెరిల్లా ప్రతిఘటనను విరమించి, బహిరంగమైన, చట్ట సమ్మతమైన పోరాటు రూపాలను, ఆందోళనలను చేబట్టాలని ఒక సెక్షన్‌కు చెందిన కామ్రేడ్స్ వాదించ నారంభించారు వారి వాదనలన్నింటినీ ఒక క్రమ పద్ధతిలో రావి నారాయణ రెడ్డి అపఖ్యాతిపాలైన "తెలంగాణా నగ్నసత్యాలు" అనే తన డాక్యుమెంటులో పొందుపరచారు.

సాయుధ గెరిల్లా ప్రతిఘటనను విడనాడాలనే నినాదాన్ని తీసుకొన్న వారి ప్రధానమైన వాదనలు ఈ క్రింది విధంగా వున్నాయి .

(అ) భారత ప్రభుత్వ సైన్యాలు ప్రవేశించేంతవరకూ తెలంగాణా సాయుధ పోరాటాన్ని బలపరుస్తూ వచ్చిన ధనిక రైతాంగం, ఉదార స్వభావులైన భూస్వాములతోసహా ప్రజల్లోని ఒక పెద్ద భాగం గెరిల్లా పోరాటానికి వ్యతిరేకంగా తిరుగుతుంది. (ఆ) ప్రజలు కాంగ్రెసు ప్రభుత్వ సైన్యాలను పీడకులుగాకాక, విముక్తి దాతలుగా పరిగణించుతున్నారు. (ఇ) అఖిల భారతంగా సాయుధ పోరాటాలు ప్రారంభం కాకుండా, తెలంగాణాలాంటి చిన్న ప్రాంతంలో సాయుధ పోరాటాన్ని రక్షించుకోవడంగాని, దాన్ని కొనసాగించడంగాని సాధ్యపడదు దేశవ్యాపితంగా సాయుధ పోరాటాలు ప్రారంభమయ్యే అవకాశాలు శూన్యం. (ఈ) మన సాయుధ దళాలకు చాలా తక్కువ ఆయుధాలు వుండటమో లేక నిరాయుధంగావున్న పరిస్థితిలోనో వున్నాయి. అందువలన మంచి సాయుధ సంపత్తిగలిగి, హెచ్చు సంఖ్యలోవున్న భారత సైన్యాలను ప్రతిఘటించే స్థితిలో అవి లేవు.

పై అభిప్రాయంతో విశాలాంధ్ర కమ్యూనిస్టు కమిటీ విభేదించింది. తెలంగాణా రైతాంగం సాధించుకొన్న విజయాలపై యూనియన్ సైన్యాల దాడులను సాయుధ గెరిల్లా పోరాటంద్వారా ప్రతిఘటించాలనే నినాదాన్ని అది చేబట్టింది. విశాలాంధ్ర కమ్యూనిస్టు కమిటీ వాదనలు మొత్తంమీద ఈ క్రిందివిధంగా వున్నాయి .

ఒకటి తెలంగాణా రైతాంగం సాధించుకొన్న గొప్ప విజయాలను – ముఖ్యంగా రైతాంగానికి పంచిపెట్టబడిన పదిలక్షల యకరాల భూమిని సంరక్షించుకోవాలి. తీవ్రమైన ప్రతిఘటన, పోరాటంలేకుండా వర్గ శత్రువులు ఈ విజయాలను కాజేయడానికి అవకాశమీయరాదు.

రెండు : సాయుధ గెరిల్లా పోరాటానికి జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు అనుకూలంగా వున్నాయి. కాంగ్రెసుపార్టీకి చెందిన బూర్జువా – భూస్వామ్య ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ విముక్తి పోరాటానికి తెలం

గాణా పోరాటం నాంది ప్రస్తావన. భారతదేశ విప్లవం రష్యన్ విప్లవంకంటే చైనా విప్లవాన్నే హెచ్చుగా పోలివున్నదని తెలంగాణా సాయుధ పోరాటం స్పష్టం చేస్తున్నది. ఆనాటి ఆంధ్ర సెక్రటేరియేట్ దీన్ని ఎలా సూత్రీకరించిందో సరిగ్గా తెలుసుకోవాలంటే 1948 మేలో అది రూపొందించిన డాక్యుమెంటు లోని భాగాలనే ఉదహరించడం మంచిది :

"మన విప్లవం అనేక విధాలుగా రష్యన్ విప్లవంతో విభేదించు తుంది. చాలావరకు చైనా విప్లవంతో అది పోలి వుంటుంది. జనరల్ సమ్మె, సాయుధ తిరుగుబాటు, ఆ తరువాత గ్రామసీమల విముక్తిగాక, వ్యవసాయక విప్లవం రూపంలో భీషణ ప్రతిఘటన, సుదీర్ఘమైన అంత ర్యుద్ధం – తత్ఫలితంగా రాజకీయాధికారాన్ని ప్రజాతంత్ర సంఘటన వశపరచు కోవడం – ఇది మన విప్లవ పోరాట పంథాగా వుండగలదు."

ఆంధ్ర సెక్రటేరియేట్ థీసిస్‌లో యింకా ఇలా వుంది :

"దీన్నంటితనీ దృష్టిలో వుంచుకొని, మనకు ప్రజాసామాన్యంలో బాగా పలుకుబడిగల ఆంధ్ర, కేరళ, బెంగాల్‌లలోని కొన్ని ప్రాంతాల్లో, మనలను నిర్దాక్షిణ్యంగా తుదముట్టించడానికి తయారైన నెహ్రూ ప్రభుత్వ మిలటరీ దాడికి వ్యతిరేకంగా మనం గెరిల్లా యుద్ధాన్ని (చైనా మార్గం) సాగించాలన్న ఆలోచన చేయవలసిన సమయమాసన్నమైంది."

మూడు : జనతా ప్రజాతంత్ర విప్లవ సాధనకు అవసరమైన ఐక్య సంఘటనలో శ్రామికవర్గానికి మిత్రులుగా ధనిక రైతాంగాన్నీ, మధ్యతరగతి బూర్జువావర్గాన్ని జేర్చుకోవాలనికూడా ఆంధ్ర థీసిస్ కోరింది. సాయుధ పోరాటానికి సంబంధించిన అలాంటి విశాలమైన సంఘటనను కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన రూపొందించవచ్చునని ఆంధ్రథీసిస్ గట్టిగా చెప్పింది. ఈ లక్ష్యాల సాధనకు భౌతిక పరిస్థితులు త్వరితగతిని పరిపక్వ మవుతున్నాయని కూడా చెప్పింది అయితే తెలంగాణాలాంటి సుదీర్ఘమైన సాయుధ ప్రతిఘటన మాత్రమే పై ఉదహరించిన అలాంటి అనుకూల పరిస్థితులను తీసుకొని రాగలవని వాదించింది.

ఆంధ్ర సెక్రటేరియట్ తయారుచేసిన ఈ థీసిస్ మొత్తాన్ని పచ్చి సంస్కరణవాదంగా పార్టీ ద్వితీయ మహాసభకు ఎన్నికైన పొలిట్‌బ్యూరో జమకట్టి తిరస్కరించింది. చైనా పంథాను మార్క్సిజం–లెనినిజానికి సంబంధం లేని పెడమార్గంగా భావించి, దానిని పొలిట్‌బ్యూరో ఖండించింది. విప్లవానికి

ఒకే ఒక పంథా గలదని, అది రష్యన్ పంథా అనీ, అంటే, రాజకీయ జనరల్ సమ్మె, పట్టణాల్లో కార్మికుల సాయుధ తిరుగుబాటు ద్వారా అధికారాన్ని కైవసం చేసుకోవడం అని స్పష్టం జేసింది.

అయితే; తెలంగాణాలో సాయుధ ప్రతిఘటన నినాదాన్ని మాత్రం పొలిట్‌బ్యూరో గట్టిగా బలపరిచింది ఎందువల్లనంటే రానున్నదని భావించే యుద్ధానంతర విప్లవ సంక్షోభంలో కార్మికవర్గ జనరల్ సమ్మెను, సాయుధ తిరుగుబాటును తెలంగాణా సాయుధ ప్రతిఘటన త్వరితం చేయగలదని పొలిట్‌బ్యూరో భావించింది.

"తెలంగాణా మార్గమే మనమార్గం" అనే నినాదాన్ని 1948 ఫిబ్రవరి–మార్చిలో జరిగిన భారత కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ మహాసభ యిచ్చింది. తెలంగాణా సాయుధ పోరాటానికి ఆ మహాసభ సంపూర్ణమైన మద్దతును ప్రకటించింది. అలాంటి పోరాటాలను దేశంలో అనేక ఇతర ప్రాంతాల్లో అభివృద్ధి చేయవలసిందిగా మహాసభ పిలుపు నిచ్చింది. తెలంగాణా పోరాటాన్ని బలపరుస్తూ కార్మికవర్గ ఉద్యమాలను అభివృద్ధి చేయవలసిందిగా కూడా కోరింది. చివరికవి సాయుధ విప్లవానికి దారితీయగలవనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

కేరళ రాష్ట్రంలో వాయలార్ – పున్నప్రాలాంటి మహోజ్వల పోరాటాలు జరిగాయి. పశ్చిమబెంగాల్, త్రిపుర రాష్ట్రాల్లోని కొన్ని ప్రాంతాల్లో సాయుధ రైతాంగ చర్యలు జరిగాయి బొంబాయి రాష్ట్రంలోని వర్లీ రైతాంగ తిరుగుబాటు జరిగింది అలాగే దేశంలోని వివిధ ప్రాంతాల్లో సమరశీల రైతాంగ పోరాటాలు అనేకం జరిగాయి ఆ పోరాటాల సందర్భంగా పలుచోట్ల పోలీసులకూ రైతులకూ మధ్య సాయుధ సంఘర్షణలు జరిగాయి. అయితే ఈ పోరాటాలేవీ నిలబడగలగడంగానీ, గెరిల్లా సాయుధ పోరాటాలుగా అభివృద్ధి చెందడంగాని సంభవించలేదు.

1945–47 లో భారత నావికా దళం తిరుగుబాటుకు మద్దతుగానూ, భారత జాతీయ సైన్యానికిజెందిన ఖైదీలను విడుదల చేయాలనే డిమాండ్‌కు మద్దతుగానూ కార్మికవర్గం ముందుకొచ్చింది. కాని ఆ కార్మికవర్గాన్నే తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి మద్దతుగా రంగంలోకి తీసుకొని రావడం సాధ్యపడలేదు. 1948 సెప్టెంబరులో భారత యూనియన్ సైన్యాలు జోక్యం కలిగించుకొన్నప్పుడుగాని, ఆ తరువాత 1951 అక్టోబరువరకూ మూడు సంవత్సరాలపాటు సుదీర్ఘంగా తెలంగాణా సాయుధ ప్రతిఘటన జరిగిన సమయంలోగాని తెలంగాణా పోరాటంపట్ల సంఘీభావంగా కార్మికులు సమ్మెలు జరపలేదు. వారి నిర్దిష్ట కోర్కెలపైననే రైల్వే కార్మికుల జనరల్ సమ్మెకు

పిలుపునిస్తే ఏవో కొద్ది కేంద్రాల్లో మినహా దాన్ని కార్మికులు అందుకోలేదు. భారత ప్రభుత్వ సాయుధ బలగాల మొత్తం దాడినంతటినీ ఒంటరిగా తెలంగాణా సాయుధ పోరాటం మాత్రమే భరించవలసివచ్చింది. అదికూడా నెహ్రూ ప్రభుత్వాన్ని కూలదోయాలనే స్వీయమానసిక భావంతో తెలంగాణా రైతాంగం ఒంటరిగానే సాయుద పోరాటాన్ని కొనసాగించవలసివచ్చింది.

అంతర్జాతీయరంగంలో : విప్లవం తుదివిజయం పొందడంతో 1949 అక్టోబరులో చైనా ప్రజారిపబ్లిక్ అవతరించింది. తమ వలస పరిపాలనను తిరిగి రుద్దేందుకు ప్రయత్నించుతున్న ఫ్రెంచి సామ్రాజ్యవాదుల దాడులకు వ్యతిరేకంగా వియత్నాం ప్రజలు తమ కమ్యూనిస్టుపార్టీ,దానిప్రియతమ నాయకుడైన హోచిమిన్ నాయకత్వాన తీవ్రమైన సాయుధ ప్రతిఘటనను సాగించుతున్నారు. ఈ పోరాటంలో అశేషమైన త్యాగాలు చేయవలసి వచ్చినప్పటికీ, వియత్నాం ప్రజలు సామ్రాజ్యవాదులపై అతితీవ్రమైన దెబ్బలను తీయగలుగుతున్నారు. చైనా రిపబ్లిక్‌కు చెందిన పెద్ద వాలంటీరు సైన్యం సహాయంతో అమెరికా, దాని మిత్ర రాజ్యాల దురాక్రమణ సైన్యాలను 37 వ అక్షాంశరేఖ వెనక్కి కొరియా ప్రజాతంత్ర రిపబ్లిక్ నెట్టగలిగింది. చాంగ్‌కైషేక్ కీలుబొమ్మ ప్రభుత్వాన్ని కాపాడేందుకు అమెరికా సైన్యాలు తైవాన్‌లో దిగాయి. ఇవీ, బర్మా, మలయా, ఫిలిప్పైన్స్ వగైరా దేశాల్లో జరుగుతున్న తదితర విప్లవ పోరాటాలన్నీ అత్యంత సుదీర్ఘకాలం సాగే స్వభావాలుగలవిగా కనపడుతున్నాయి.

ఫ్రాన్సు, ఇటలీలలో యుద్ధానంతరం నూతనంగా ఏర్పడిన ప్రభుత్వాలనుండి కమ్యూనిస్టులు మినహాయించబడేటట్లు చేయడంలో జయప్రదమైన తరువాత, అమెరికా సామ్రాజ్యవాదులు అక్కడ గుత్తపెట్టుబడిదారుల నాయకత్వానగల ప్రభుత్వాలను సంఘటిత పరచేందుకు తమ ప్రయత్నాలను ప్రారంభించారు ఇందుకుగాను వారు మార్షల్ సహాయపథకాల్లాంటి వాటిని అమలు జరిపారు. నాటోలాంటి మిలటరీ కూటములలోకి ఈ దేశాలనుచేర్చారు.

నెహ్రూ ప్రభుత్వం తన నూతన రాజ్యాంగానికి తుదిరూపమిచ్చి ఇండియాను భారత రిపబ్లిక్‌గా ప్రకటించింది. అయినప్పటికీ నూతన భారత రిపబ్లిక్‌ను బ్రిటిష్ కామన్‌వెల్తులో సభ్యురాలుగానే అట్టేపెట్టారు. తాను నూతనంగా సాధించుకొన్న అధికారాన్ని నెహ్రూ ప్రభుత్వం రాజకీయంగా సంఘటిత పరచుకోగలిగింది మాజీ మహారాజులకూ, నవాబులకు విపరీతమైన సదుపాయాలను కలుగజేసినప్పటికీ, స్వదేశ సంస్థానాలన్నింటినీ భారత యూనియన్‌లో విలీనం చేసుకోగలిగింది. కాశ్మీరులో కాల్పుల విరమణ ఒప్పందం జరిగింది. దానితో దారుణ మతకలహాల మూలంగానూ, కాశ్మీరు

యుద్ధం మూలంగానూ భారత – పాకిస్తాన్‌ల మధ్య అంతకుముందు ఏర్పడిన ఉద్రిక్త పరిస్థితి సడలింది. యుద్ధానంతర విప్లవవెల్లువ ఖచ్చితంగా తగ్గుముఖం పట్టింది. మనదేశంలోని నూతన కాంగ్రెసు ప్రభుత్వం యుద్ధానంతరం సంక్షోభాన్ని, దాని ఫలితంగా వచ్చిన ప్రజాందోళనలను, పోరాటాలను జయప్రదంగా అధిగమించ గలిగింది.

"పోలీస్ చర్య" తరువాత భారత యూనియన్ సైన్యాలకు వ్యతిరేకంగా సాయుధ గెరిల్లా ప్రతిఘటన కొనసాగింపుకు తెలంగాణా ప్రాంతంలోని అనేక ఏరియా కమిటీలనుండి, కార్యకర్తలనుండి వ్యతిరేకత వచ్చిన విషయాన్ని ఇంతకుముందే మేము తెలిపాం. అలాగే, నెహ్రూ ప్రభుత్వంపట్ల, హైదరాబాద్ రాష్ట్రంలో ప్రజాతంత్ర వ్యవస్థను నెలకొల్పగలనని అదిచేసిన వాగ్దానంపట్ల భ్రమలు ఏర్పడిన విషయాన్ని గురించికూడా ఇంతకుముందే పేర్కొన్నాం. దీని ఫలితంగా శత్రువు దాడులకు వ్యతిరేకంగా తీసుకోవలసిన జాగ్రత్తలు సన్నగిలాయి. దళాలు రద్దుచేయబడినాయి. ఆయుధాలు మూల పెట్టబడ్డాయి. వీటన్నింటి మూలంగా పార్టీ కార్యకర్తలను, పోరాట యోధులను పెద్దఎత్తున అరెస్టుచేయడానికి ప్రభుత్వానికి వీలు కలిగింది.

అయితే, పార్టీ పట్లగల్ల అకుంఠిత విశ్వాసం, పార్టీ విధానానికి కట్టుబడి వుండాలనే క్రమశిక్షణ వుండటం వలన చివరికి సాయుధ గెరిల్లా ప్రతిఘటనను కొనసాగించాలనే విధానానిదేపై చేయికాగలిగింది. పార్టీ సభ్యులలో క్రమశిక్షణా భావమేగాక తాము ద్వేషించే దేశముఖులు, భూస్వాములు, గ్రామ పటేళ్ళు, పట్వారీలు తిరిగి గ్రామాలకు రావడం, రైతులనుండీ తిరిగి భూములను స్వాధీనం చేసుకోవడానికి దుర్మార్గంగా ప్రయత్నించడం, వారు సాగించిన భయంకరమైన అత్యాచారాలూ,—ఇవన్నీ కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభ కార్యకర్తలలో కోపోద్రేకాలను రగుల్కొల్పాయి. తెలంగాణాలోని కార్యకర్తలంతా తిరిగి దళాల్లో పునర్నిర్మాణమై యూనియన్ మిలిటరీని, పోలీసుల సాయుధ దాడులను ప్రతిఘటించడం ప్రారంభించారు.

లాలూకా, జోనల్, జిల్లాస్థాయిల్లోవున్న ఆంధ్రమహాసభకుచెందిన అనేకమంది కార్యకర్తలు మిలిటరీదాడులమూలంగా మైదానప్రాంతాలనుండీ, బాగా జనాభావుండే కేంద్రాలనుండీ రక్షణకోసం అరణ్యప్రాంతాలకు వెళ్ళిపోయిన విషయాన్ని ఇంతకుముందే వివరించాం ఈ కామ్రేడ్స్ అంతా అత్యంత ధైర్యసాహసాలతో చావుకు తెగించి ప్రతిఘటించడంద్వారా భూస్వాముల్లో భయోత్పాతాన్ని కలుగజేయగలిగారు. ఆవిధంగా ఈ దోపిడీదారులు తిరిగి తమ గ్రామాల్లో ప్రవేశించి తమ ఎస్టేట్లపై, భూఖండాలపై తమ పట్టును సుస్థిరపరచుకోకుండా చేయగలిగారు. యూనియన్ కాంగ్రెసు ప్రభుత్వం

యాభైవేలమంది సైనికులను ప్రయోగించి యేడాదికి సగటున పదిపదిహేను కోట్ల రూపాయాలను వ్యయపరచినప్పటికీ సాయుధ గెరిల్లా ప్రతిఘటనను తుడిచి పెట్టలేకపోయింది కాంగ్రెసుప్రభుత్వానికిగల ఈ అపారమైన సాయుధబలగాలతో సాగించిన ఈ అసమానమైన పోరాటంలో కమ్యూనిస్టుపార్టీకి, ఆంధ్ర మహాసభకుచెందిన సాయుధ గెరిల్లాలు తమ రక్తాన్ని చిందించారు

చావుకు తెగించి తనకంటే ఎన్నో రెట్లు బలంగల యూనియన్ సైన్యాలతో గెరిల్లాలు పోరాడవలసిన ఈ అత్యంత క్లిష్ట పరిస్థితులలో ఎంతకాలం ఇలా కొనసాగించగలమనే ప్రశ్నలు ఉదయించాయి. అలాంటి ప్రశ్నలు రావడం అత్యంత సహజమైన విషయంకూడా. భారత యూనియన్‌లో మరి ఏ యితర ప్రాంతంలోనూ మరి ఏ యితర రాష్ట్రంలోనూ తెలంగాణా పోరాటానికి మద్దతుగా ఇలాంటి సాయుధ పోరాటాలను ఎందుకు తీసుకొని రాలేక పోతున్నాం? ఒకవైపున తెలంగాణా సమరయోధులనుండి వస్తున్న వొత్తిడి మూలంగానూ, మరోవైపున ప్రక్కనేవున్న ఆంధ్రజిల్లాలపై కిరాతకమైన నిర్బంధ విధానాన్ని సాగించటానికి ప్రతీకారంగాను, తెలంగాణా సాయుధ పోరాటాన్ని నిర్వహించుతున్న నాయకత్వం సాయుధ గెరిల్లా ప్రతిఘటనా ప్రాంతాన్ని విస్తరింపజేయడానికి ప్రయత్నించింది. అయినాఆప్రయత్నం ఫలించ లేదు. కాని సాయుధ పోలీసులూ, భూస్వామ్య గూండాలు కమ్యూనిస్టు కార్యకర్తలను కిరాతకంగా హత్యచేయడానికి పూనుకున్నారు.

మూడువందల మంది కామ్రేడ్స్ చంపివేయబడ్డారు. ఇంకా మిగిలిన సమరశీల పార్టీ కార్యకర్తలను ఈ జిల్లాలనుండి అడవి ప్రాంతాలకుగాని, దూరంగావున్న ఇతర రాష్ట్రాలకుగాని తరలించవలసివచ్చింది దీని ఫలితంగా పార్టీ నిర్మాణంలో అయోమయ స్థితి ఏర్పడింది. ఇంక తరువాత ఏమి చేయాలన్న సమస్య విశాలాంధ్ర కమ్యూనిస్టు కమిటీని ఎదుర్కొన్నది.

తక్కిన దేశంలోకూడా పరిస్థితి ఏమంత బాగాలేదు. పార్టీ, విప్లవోద్యమము ఒకవైపున కాంగ్రెసు ప్రభుత్వ కిరాతక పోలీసుదాడులను ఎదుర్కొనవలసివచ్చింది. మరోవైపున ఆనాటి అఖిలభారత నాయకత్వం పొరపాటు, సెక్టేరియన్ విధానాలను అనుసరించడం మూలంగా పార్టీ విపరీతంగా బలహీన పడటమేగాక అనైక్యంగావుంది. దీనితోపాటు అనేకమంది పార్టీ కార్యకర్తలు, నాయకులూ అరెస్టుచేయబడి జైళ్ళల్లో డిటెన్యూలుగా బంధించబడ్డారు

సరిగ్గా ఆ సమయంలోనే భారత కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకత్వం అనుసరించుతున్న రాజకీయ విధానాన్ని నిశితంగా ఖండించుతూ 'అంతర్జా

తీయ కమ్యూనిస్టు పత్రికగావున్న "ఫర్ ఎ లాస్టింగ్ పీస్ ఫర్ ఎ పీపుల్స్ డెమాక్రసీ" ఒక సంపాదకీయాన్ని ప్రచురించింది. ఆ సంపాద కీయం మూలంగానూ దాని పర్యవసానంగా పార్టీలో జరిగిన అంతరంగిక చర్చలు, పోరాటం ఫలితంగానూ పార్టీ కేంద్ర కమిటీలోనూ, పొలిట్ బ్యూరోలోనూ తీవ్రమైన మార్పులు జరిగాయి పునర్నిర్మాణమైన కేంద్ర కమిటీ చండ్ర రాజేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగా ఒక నూతన పొలిట్ బ్యూరోను ఎన్నుకున్నది

కొత్తగా ఏర్పడిన కేంద్రకమిటీ, పొలిట్‌బ్యూరో రూపొందించిన నూతన రాజకీయ విధానం క్లుప్తంలో యిలావుంది

— పార్టీ ద్వితీయ మహాసభలో కార్యక్రమాన్ని గురించి ఇవ్వ బడిన అవగాహన, ఆ తరువాత "ఎత్తుగడల పంథా" లో వివరించబడిన అవగాహన నిరాకరించబడింది

— ఒకేదశ విప్లవమన్న థీసిస్ - అంటే భారతదేశంలో ప్రజా తంత్ర విప్లవం, సోషలిస్టు విప్లవమూ - రెండూ కలిసేవుంటాయనే సిద్ధాంతం నిరాకరించబడింది.

— ధనిక రైతాంగంతోసహా మొత్తం బూర్జువావర్గమంతా జనతా ప్రజాతంత్ర విప్లవానికి శత్రువులుగా మారారన్న సూత్రీ కరణ తిరస్కరించబడింది

— భారత విప్లవం చైనామార్గాన్ని అనుసరించాలనే దృక్పథం సరియైనదని అంగీకరించబడింది ఎక్కడ అవకాశాలు ఏర్పడితే అక్క డల్లా తెలంగాణాపోరాట నమూనాలో విశాలమైన వ్యవసాయ విప్లవ పోరాటాలను అభివృద్ధిచేయడానికి ప్రయత్నించాలని నిర్ణయించబడింది.

అయితే ఈ నూతన రాజకీయ విధానానికి వచ్చి మితవాద అవకాశ వాద దృక్పథాన్నుండి తీవ్రమైన వ్యతిరేకత వచ్చినదనే విషయాన్ని ఇక్కడ చెప్పవలసి వుంటుంది. ఈ నూతన వ్యతిరేకతకు బొంబాయిలోని పార్టీ ప్రధాన కార్యాలయం కేంద్రమైంది పార్టీలో ఏర్పడిన ఈ అంతరంగిక వ్యతిరేకతకు యస్ ఎ డాంగే, అజయకుమార్‌ఘోష్, యస్. వి ఘాటే నాయకత్వం వహించారు. ఈ నూతన వ్యతిరేకతకు నాయకత్వం వహించేవారు లీగల్‌గానూ బహిరంగంగానూ పనిచేయడానికి అవకాశం కల్పించబడింది. కాని పార్టీ కేంద్ర నాయకత్వమూ, తెలంగాణా సాయుధ పోరాటాన్ని నిర్వహించుతున్న

నాయకులు రహస్యంగా వుండి పనిచేయివలసి వచ్చింది. ఒక్కమాటలో చెప్పా లంటే పార్టీలోని అంతరంగిక పరిస్థితి మరింతగా అధ్వాన్నమైంది. ఆచరణలో పార్టీ రెండు ధోరణుల్లో రెండు ముఠాలుగా చీలిపోయింది

తాను ఎన్నికైన వెంటనే నూతన పొలిట్ బ్యూరో, పార్టీలో ఏర్పడిన ఈ ప్రమాదకరమైన రాజకీయ – సిద్ధాంత విభేదాల పరిస్థితిని గురించి సమీక్ష చేసింది భారత కమ్యూనిస్టుపార్టీలో రాజకీయ – సిద్ధాంత – నిర్మాణ ఐక్యతను పునరుద్ధరించాలంటే, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమంతటి భక్తి గౌరవాలను పొందిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ సలహాను, సహాయాన్ని తీసు కొన్నప్పుడే అది సాధ్యం కాగలదనే నిర్ణయానికి వచ్చింది. నూతన పొలిట్ బ్యూరో వెనువెంటనే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని, కామ్రేడ్ స్టాలిన్‌ను సలహా యివ్వవలసిందిగా అభ్యర్థించింది. భారత కమ్యూనిస్టుపార్టీని ఎదుర్కొంటున్న క్లిష్టమైన రాజకీయ–నిర్మాణ – సిద్ధాంత సమస్యలను పరిష్క రించు కొనేందుకు – సోదర భావంతో సహాయపడేందుకు సోవియట్ నాయ కత్వం వెంటనే అంగీకరించింది.

అయితే బొంబాయిలోని పార్టీ ప్రధాన కార్యాలయం నాయకత్వాన గల "లీగల్ ప్రతిపక్షం" మాత్రం సోవియట్ పార్టీనుండి, కామ్రేడ్ స్టాలిన్ నుండి సహాయాన్ని తీసుకొనేందుకు పోలిట్‌బ్యూరో నిర్ణయించినదని తెలిసిన తరువాతకూడా తమ విచ్ఛిన్న కార్యకలాపాలను కొనసాగించింది. వారి విచ్ఛిన్నచర్యలు తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటానికి విపరీతంగా హాని కలిగించాయి. మొత్తంమీద పార్టీకి, ప్రజాఉద్యమాలకుకూడా వారి విచ్ఛిన్న కార్యకలాపాలు నష్టం కలిగించాయి.

భారత కమ్యూనిస్టుపార్టీలో వివాదాస్పదంగావున్న అన్నిసమస్య లపై సోవియట్ పార్టీనాయకులతోనూ, కామ్రేడ్ స్టాలిన్‌తోనూ చర్చించివివరణ లను కోరడానికిగాను చండ్ర రాజేశ్వరరావు, మాకినేని బసవపున్నయ్య, అజయ కుమార్‌ఘోష్, యస్. ఎ. డాంగేలతోకూడిన ఒక పార్టీ ప్రతినిధివర్గం మాస్కోకు పంపించబడింది. మన పార్టీ ప్రతినిధివర్గంతో చర్చించి సహాయ పడేందుకు కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన కామ్రేడ్ స్టాలిన్, మోలటోవ్, మాలెంకోవ్, సుస్లోవ్‌లతోకూడిన ఒక కమిషన్‌ను సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ నియమించింది.

ఈ సందర్భంగా నేను మన ముందున్న సమస్యనుండి వైదొలగి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ – కామ్రేడ్ స్టాలిన్ మనకు సౌహార్దపూర్వకంగా చేసిన సహాయాన్ని గురించి కొద్దిమాటలు చెప్పవలసివుంది. ఇప్పటివరకూ

సోవియట్ పార్టీ నాయకులతో మన పార్టీ ప్రతినిధివర్గం జరిపిన సంప్రతింపులనుగురించిగానీ, వారు సోదరభావంతో చేసిన విమర్శనుగురించిగానీ, వారిచ్చిన సలహాలనుగురించిగాని బహిరంగంగా ఎక్కడా ఉద్దేశ్యపూర్వకంగానే ఉదహరించలేదు సోవియట్ పార్టీపైనా, మనపార్టీపైనా మన వర్గశత్రువులు దుష్ప్రచారాలు సాగించడానికి అది ఉపయోగపడుతుందనే ఉద్దేశ్యంతోనే అలా చేయలేదు. ఇంక ఇప్పుడు యస్ ఎ డాంగే, చండ్ర రాజేశ్వరరావులాంటి మితవాద కమ్యూనిస్టు నాయకులు సౌహార్ద్రపూర్వకంగా జరిగిన ఈ చర్చలను గురించీ, వచ్చిన నిర్ణయాలను గురించీ బహిరంగంగా పత్రికల్లోనే ప్రస్తావించుతున్నారు తెలంగాణా పోరాటం దాని గుణపాఠాలనుగురించి రాజేశ్వరరావు రాసినకరపత్రంలో కామ్రేడ్ స్టాలిన్ పేరునుకూడా ప్రస్తావించారు. అందువలన ఆ చర్చల స్వభావాన్నిగురించి, ఆ చర్చల ఫలితంగా మన పార్టీ చేసుకున్న నిర్ణయాలను గురించి వాస్తవాలను బయటపెట్టడంకంటే మాకు వేరే గత్యంతరం లేకపోయింది.

వివాదాస్పదమైన విషయాలు వేరువేరుగావున్న రెండు సమస్యలకు సంబంధించినవి ఒకటి. భారత జాతీయ కాంగ్రెసు నాయకులకు జరిగిన రాజకీయాధికారం బదలాయింపు వర్గ అంచనాకు సంబంధించినది భారత విప్లవం ఖచ్చితంగా ఏ దశలోవుంది? విప్లవ సాధనకై మన వర్గ వ్యూహం ఏమిటి ? అంటే ఏయే వర్గాలు మనతో కలసి వస్తాయి ? రెండు. భారత విప్లవ మార్గం ఏ రూపంలో వుండవచ్చుననే విషయం అంటే రష్యాపంథాయా లేక చైనా మార్గమా ? తెలంగాణాసాయుధపోరాటంయొక్క స్వభావం ఏమిటి ? రైతాంగ గెరిల్లా సాయుధ పోరాటానికి సంబంధించిన వివిధ దశలు ఏమిటి ? రాజకీయాధికారాన్ని కైవసం చేసుకొనేందుకు జరిగే సాయుధ పోరాటంతో ఈ రైతాంగ గెరిల్లా సాయుధపోరాటాలను ఎలా సరిపోల్చకూడదు ? వగైరా వగైరా. క్లుప్తంగా చెప్పాలంటే, మొదటిది పార్టీ కార్యక్రమానికి సంబంధించినది రెండోది ఎత్తుగడలకు సంబంధించిన సూత్రాలకూ సిద్ధాంతానికీ సంబంధించినది. వాటిని నిర్దిష్ట పరిస్థితులకు ఎలా నిర్దిష్టంగా వర్తింపజేయాలనే సమస్యలు వగైరాలు.

మొదటి సమస్యకు సంబంధించిన ప్రధాన నిర్ణయాలన్నీ భారత కమ్యూనిస్టుపార్టీ ముసాయిదా కార్యక్రమంలో పొందుపరచబడ్డాయి. అది మొదటిసారిగా 1951 ఏప్రిల్‌లో ముద్రించబడి, ప్రచురించబడింది దాన్ని ఆ తరువాత సవరించి 1951 అక్టోబరులో జరిగిన అఖిలభారత పార్టీ కాన్ఫరెన్సులో ఆమోదించడమైంది. ఆ తరువాత 1953లో మదురైలో జరిగిన పార్టీ మహాసభ

ఆమోదించింది. అయితే; దానిలోకొన్ని ముఖ్యమైన మార్పులు చేయవలసి వున్నదనిచెప్పి 1956 లో పాల్ఘాట్‌లో జరిగిన పార్టీ మహాసభ దాన్ని అమలు నుండి అవతల పెట్టింది.

1951 ఏప్రిల్‌లో ప్రచురించబడిన ముసాయిదా కార్యక్రమం ఇలా చెప్పింది: (అ) నూతనంగా అవతరించిన రాజ్యం ప్రధానంగా పాత సామ్రాజ్యవాద రాజ్యమే. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సమ్మతిమీదనే కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలో వుంచబడింది. అధికారంలో వుంచబడిన కాంగ్రెసు ప్రభుత్వం ఇండియాలో విదేశ బ్రిటిష్ పెట్టుబడులను అట్టేపెట్టి, సంరక్షించడానికి మాట యిచ్చింది. (ఆ) జనతా ప్రజాతంత్ర సంఘటనలో ధనిక రైతాంగంతోసహా మొత్తం బూర్జువావర్గం వుండదని పార్టీ ద్వితీయ మహాసభ యిచ్చిన అవగాహనను ఈ కార్యక్రమం తిరస్కరించింది వ్యక్తులు, గ్రూపులు ద్రోహం చేయవచ్చునని, వారు మినహాయించి మొత్తం భారతీయ బూర్జువా వర్గాన్నంతటినీ జనతా ప్రజాతంత్ర సంఘటనలోకి తీసుకొని రాగలిగే అవ కాశం గలదనే అవగాహనను యిచ్చింది (ఇ) విప్లవానికి సంబంధించిన రెండు దశలూ మిళితమైపోతాయన్న పొరపాటు సిద్ధాంతాన్ని ఈ కార్యక్రమం సరిదిద్దింది. అయితే అది చెప్పిన వర్గాల కలయిక సామ్రాజ్యవాదానికీ, దాని ఫ్యూడల్ మిత్రులకూ వ్యతిరేకంగా మొత్తం ఐక్యసంఘటన దశకు సరిపోలు తుంది. 1951 లోని ఈ కార్యక్రమాన్ని, దానికి చెందిన ప్రధాన సూత్రీకరణలను ఆ తరువాత వొదులుకోవడం జరిగింది. 1964 లో పార్టీ ఏడవ మహాసభ జరిగి నప్పుడు ఒక నూతన పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించడమైంది. అందువలన 1951 కార్యక్రమానికి సంబంధించిన మంచి చెడ్డలను వివరంగా ఇక్కడ నేను చర్చించదలచలేదు.

1947 లో అధికారాన్ని బసిలాయించిన తరువాత అమలులోకి వచ్చిన రాజ్యం బడాబూర్జువావర్గ నాయకత్వానగల ఒక బూర్జువా—భూస్వామ్య రాజ్యమని, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాను అనుసరించే సంకల్పంతో ఈ ప్రభుత్వం ఫ్యూడల్, అర్ధఫ్యూడల్ భూస్వామ్యవర్గంలో ఏకమవుతోందనీ, విదేశ పెట్టుబడిదారులతో మిలాఖత్ సంబంధాలను కొనసాగించుతోందని, నేటి మన పార్టీ కార్యక్రమం స్పష్టంగా పేర్కొన్నది.

విప్లవాన్ని సాధించేందుకు మన పార్టీ కార్యక్రమం నిర్దేశించే వర్గ కలయికలో బడాబూర్జువావర్గ నాయకత్వానగల రాజ్యాంగ యంత్రానికి ప్రభు త్వానికి వ్యతిరేకంగావుండే కార్మికులు, కర్షకులు, మధ్యతరగతి ప్రజలు బడాయేతర బూర్జువావర్గమూ వుంటాయి. అయితే జనతా ప్రజాతంత్ర సంఘ

టునకు పునాదిగా కార్మిక కర్షకకుల ఐక్యత వుంటుంది. నాయకత్వం కార్మిక వర్గానిది, దాని పార్టీది. ఈ దశలో మన విప్లవం భూస్వామ్య విధానానికి బడాబూర్జువావర్గానికి, విదేశీ గుత్తపెట్టుబడులకూ వ్యతిరేకంగా నిర్వహించ బడుతుంది..

నేటి భారత విప్లవదశ సోషలిజం కోసం కాదు; పెట్టుబడిదారీ విధానాన్ని పూర్తిగా అంతమొందించే లక్ష్యంలేని జనతాప్రజాస్వామికదశమాత్రమే. అయితే ఫ్యూడల్, అర్ధఫ్యూడల్ భూస్వామ్య విధానాన్ని అంతమొందించడంతో పాటు గుత్తపెట్టుబడిదారీవర్గానికీ, విదేశ సామ్రాజ్యవాదులకూ వ్యతిరేకంగా ఉద్దేశించబడుతుంది

భారత విప్లవం ఏ పంథాలో సాగనున్నదనేది ఈ చర్చకు సంబంధించిన రెండో సమస్య. అందుకు మనం అనుసరించవలసిన ఎత్తుగడలకు సంబంధించిన సిద్ధాంతం, సూత్రాలుకూడా ఇందులో ఇమిడివున్నాయి. ఇదికూడా 1951 లో జరిగిన అఖిలభారత పార్టీ కాన్ఫరెన్సులో ఆమోదించబడి, "పోలసీ స్టేట్‌మెంటు" అనే పేరిట ప్రకటించబడింది. ఈ డాక్యుమెంటులో అవసరమైన ముఖ్యమైన భాగాలు ఈ క్రింద యివ్వబడుతున్నాయి. ఇందుకు నేను అదనంగా కోటేషన్లలో లేని కొన్ని పేరాలనుకూడా జతపరుస్తున్నాను– ఆ సమయంలో మనపార్టీ ఎచ్చిన అవగాహనను వివరించడానికి ఈ పేరాలు ఉపయోగపడతాయనే ఉద్దేశ్యంతో.

## భారత విప్లవపంథా

నేటి బూర్జువా–భూస్వామ్య రాజ్యాంగ యంత్రం స్థానే జనతా ప్రజాతంత్ర రాజ్యాంగాన్ని నెలకొల్పడం విప్లవంద్వారానే సాధ్యపడుతుంది. ఆ విషయాన్ని మన పోలసీ స్టేట్‌మెంటు ఈక్రిందివిధంగా తెలిపింది :

"నూతన రాజ్యాంగంద్వారా నెలకొల్పబడిన పార్లమెంటును వినియోగించుకొని ఈ ప్రభుత్వంస్థానే జనతాప్రజాతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించుకొనవచ్చునని భావించేవారు చాలామంది వున్నారు. ఇలాంటి భావాన్ని ఈ ప్రభుత్వమూ, స్వార్థపరపర్గాలవారేగాక మితవాద సోషలిస్టులుకూడా ప్రోత్సహించి, పెంపొందించుతున్నారు. పార్లమెంటులో బలమైన ప్రతిపక్షం వుంటే ప్రభుత్వాన్ని గడగడపణికించి దాన్ని కూలదోయగలమని ఈ మితవాద సోషలిస్టులు ప్రచారం చేస్తున్నారు.

"కాని, గతంలో తాము సాగించిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల ఫలితంగా వచ్చినవనుకొన్న ఈ నూతన రాజ్యాంగంయొక్క

సామర్థ్యాన్ని ప్రజలువిశ్వసించడం ప్రారంభించారో లేదో అప్పుడే, అందులో వున్నాయనుకొన్న ప్రాథమికహక్కులూ, గ్యారంటీలను గురించిన మిథ్యా ప్రవచనాలు కాస్తా ఆ రాజ్యాంగంనుండి తొలగించివేయబడినాయి. ఈ ప్రజా తంత్ర వ్యతిరేకప్రభుత్వాన్ని వేటిద్వారా కుదిపివేద్దామని ప్రజలు భావించారో ఆ వాక్సభా, పత్రికా, వ్యక్తిస్వాతంత్ర్యాలు పోలీసుల లాఠీలకూ, నిరంకుశాధి కారులపాలనకు గురిచేయబడ్డాయి. పార్లమెంటరీ పద్ధతులద్వారా మాత్రమే దేశంలో ప్రధానమైన ప్రజాతంత్రమార్పులను ఈ ప్రభుత్వమూ, దాన్ని అధి కారంలో అట్టిపెట్టేవర్గాలు ఎన్నటికీ తీసుకొనిరానీయవనేవిషయాన్ని కమ్యూ నిస్టుపార్టీ ఇతర ప్రజాతంత్రవాదులూ. విప్లవకారులమాటలలావుంచి ఉదార వాదులు సహితం అంగీకరిస్తారు అలా అంగీకరించడానికి వారు సిగ్గుపడు తున్నారు కూడా. అందువలన మన పార్టీ కార్యక్రమంలో పొందుపరచబడిన విధంగా స్వాతంత్ర్యానికీ. శాంతికి, భూమికి, భుక్తికీ దారితీసేమార్గాన్ని ఇతరత్రా కనుగొనవలసివుంది.

"...ప్రజలకు వ్యతిరేకంగా బలప్రయోగానికీ, దౌర్జన్యాలకుదిగేది అభివృద్ధి నిరోధక పాలకవర్గాలు మాత్రమే. మన సిద్ధాంతం హింసావాదమా, అహింసావాదమా అన్న ప్రశ్నను లేవనెత్తేదికూడా వారే ఇలాంటి ప్రశ్నలను గాంధీ సిద్ధాంతవాదులు మాత్రమే లేవదీస్తారు వాస్తవానికి ఈ సిద్ధాంతం ప్రజలను తప్పుదారులు పట్టించుతుంది. అందువలన దానికి మనం దూరంగా వుండాలి ఈ ప్రశ్నకు చాలాకాలం క్రితమే ప్రపంచంలోని ప్రతిఒక్క దేశ ప్రజలకూ మార్క్సిజం, చరిత్ర ఖచ్చితమైన సమాధానమిచ్చింది. తమ ప్రయోజ నాల రక్షణకోసం, విముక్తి సాధనకోసమూ ప్రజలు తీసుకునే ప్రతిఒక్కచర్య పూజనీయమైనదే. తమ పురోగతికీ, స్వాతంత్ర్యానికి అడ్డుగావున్న కుళ్ళునూ, అభివృద్ధి నిరోధకత్వాన్ని తొలగించడంకోసం ప్రజలు చేయనిర్ణయించుకొన్న ప్రతిదానిని చరిత్ర అనుమతించుతుంది.

"పార్టీ ద్వితీయ మహాసభ అనంతరం భారత విప్లవోద్యమం అనుస రించదగిన పందాను గురించి పార్టీలో అంతరంగికంగా అభిప్రాయభేదాలు, వాదోపవాదాలు తలెత్తాయి. మన పోరాటానికి ప్రధానాయుధంగా రష్యాలో వలె పారిశ్రామిక కార్మికుల జనరల్ సమ్మె ఆయుధమై వుండాలని, దాని ననుసరించి దేశవ్యాపితంగా సాయుధ తిరుగుబాటు జరగాలని కొంతకాలం పాటు వాదన జరిగింది. ఆ తరువాత మన దేశంకూడా చైనావలె అర్థవలస దేశం కాబట్టి రైతాంగ గెరిల్లా సాయుధపోరాటం ప్రధాన ఆయుధంగా

చైనాలో మాదిరిగానే మన విప్లవం కూడా వృద్ధిపొందగలదని, చైనా విప్లవ పాఠాలను తప్పుగా అర్థంచేసుకొని దాని ఆధారంగా కొంతకాలం ఒక సిద్ధాంతం ముందుకొచ్చింది.

"కొన్ని నెలలపాటు సుదీర్ఘ చర్చల అనంతరం మన దేశానికి స్వాతంత్ర్యాన్నీ, మనప్రజలకు సౌభాగ్యాన్ని సాధించడానికి అవసరమైన సరియైనపంథా విషయమై నేడు పార్టీ ఒక నూతన అవగాహనకువచ్చింది. ఈ నూతనపంథాకు ఇటు రష్యా పేరుగాని, అటు చైనా పేరుగాని పెట్టలేము, పెట్టకూడదుగూడా. అది మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల బోధనలకు అనుగుణంగా వుండి, చరిత్రలోని పోరాటాలన్నింటి – ముఖ్యంగా రష్యా, చైనాల పోరాటాల పాఠాలన్నింటినీ వినియోగించుకొనేదిగా వుండాలి. అలా వుందికూడా. ఒక పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దేశంలో లెనిన్, స్టాలిన్‌ల కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కార్మికవర్గం సాగించిన తొలి సోషలిస్టు విప్లవం కావడంవలన రష్యా పాఠాలను, ఒక అర్ధ వలస పరాధీన దేశంలో చివరికి జాతీయ బూర్జువా వర్గంకూడా పాల్గొనగా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాగించిన జనతా ప్రజాతంత్ర విప్లవాలకు తొలిది కావడంవలన చైనా పాఠాలను మన పంథా స్వీకరించింది. అయితే, ప్రతి ఒక్క దేశానికి దాని స్వంత ప్రకృతి, సాంఘిక సంబంధమైన ప్రత్యేక విలక్షణాలు కొన్ని వుంటాయని, దాని విముక్తి పంథాను అవి కొంతవరకు నిర్ణయించకుండా వుండజాలవని ఇదే సందర్భంలో మనం గుర్తుపెట్టుకొని వుండాలి."

భారత పంథా రష్యన్ పంథాగా వుండజాలదు ఎందువల్లనంటే, ఇండియా ప్రధానంగా వ్యవసాయకదేశం. ఆర్థికంగా వెనుకబడివున్న దేశం. ఈ కారణంగా రైతాంగ పోరాటాలకుగల అపారమైన అవకాశాలను మనం తక్కువ అంచనా వేయరాదు. అందువలన పట్టణాల్లోనూ, పారిశ్రామిక ప్రాంతాల్లోనూ రాజకీయ జనరల్ సమ్మె మన విప్లవంలో ప్రధాన ఆయుధం కాదు. అలాంటి జనరల్ సమ్మె ఒక్కటే నేటి రాజ్యాంగ యంత్రాన్ని కూలద్రోసేందుకు అవసరమైన దేశవ్యాపిత సాయుధ తిరుగుబాటును ప్రజ్వరిల్ల జేయడానికి సరిపోదు.

అలాగే కొంతమంది వాదించుతున్నట్లు భారతవిప్లవ పంథా చైనా పంథా కాజాలదు. సరిగ్గా చైనాలో జరిగినట్లే సాయుధ గెరిల్లా యుద్ధంద్వారా కొన్ని విముక్తి ప్రాంతాలను నెలకొల్పి చివరికి నగరాలను విముక్తిచేయడం సాధ్యంకాదు. కనుక విప్లవ విజయానికి రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం ప్రధాన ఆయుధం కాజాలదు.

"అది రష్యన్ పంథాకాదు, చైనాపంథాకాదు. అది భారత పరిస్థితు లకు వర్తింపుచేయబడిన లెనినిజం పంథామాత్రమే."

## చైనా-భారత దేశాల్లోని పరిస్థితుల్లోగల తేడా

— మొదటి విషయంగా-1927 లోనే చైనాలోని కమ్యూనిస్టుపార్టీకి 30 వేలమందిగల సైన్యం వుంది. కాని భారతదేశంలో అలాంటిదేమీ లేదు.

— "చైనాకు ఏకీకృతమైన, ఉత్తమమైన రవాణా మార్గాలులేవు. అందువలన విముక్తి సైన్యాలపై కేంద్రీకృతదాడులూ, మెరుపుదాడులు చేయ డానికి శత్రువుకు అవకాశం లేకుండా పోయింది. ఈ విషయంలో చైనా పరి స్థితికి భారతదేశ పరిస్థితికి తేడా వుంది. చైనాతో పోల్చిచూస్తే భారతదేశంలో ఏకీకృతమైన, సువ్యవస్థితమైన దూరవ్యాప్త రవాణా సౌకర్యాలున్నాయి. అందువలన గెరిల్లా ప్రాంతాలపైనా, కేంద్రాలపైనా పెద్దగా సాయుధ బలగా లను సులభంగానూ, త్వరితగతిలోనూ ప్రయోగించేందుకు భారత పాలక వర్గాలకు అవకాశం వుంది."

[భారతదేశానికి అత్యంత కేంద్రీకృతమైన పరిపాలనా వ్యవస్థకూడా వుంది. ఉభయ దేశాలకుగల ఒకేరకమైన విప్లవ దశ వున్న పరిస్థితుల్లో పెట్టు బడిదారీ విధానం చైనాలోకంటే భారతదేశంలో ఎక్కువగా అభివృద్ధిచెంది వుంది. భారతదేశం ఒకే సామ్రాజ్యంకింద వుంది. కాని చైనాలో వివిధ సామ్రాజ్యవాద రాజ్యాలకు విభిన్న ప్రాంతాల్లో పలుకుబడి వుంది. వివిధ యుద్ధ ప్రభువులు (వార్‌లార్డ్స్) ఒకరితో మరొకరు తగాదాపడుతూ వుండే వారు. వారంతా ఏకమై విప్లవ కేంద్రాలపై కలిసి దాడి చేయగలిగిన స్థితిలో వుండేవారు కాదు.]

— "తన స్వాతంత్ర్య పోరాట సమయంలో భారతదేశంలో చైనాలో కంటేకార్మికవర్గం చాలా ఎక్కువసంఖ్యలోవుంది. అందువలన మన పోరాటంలో నిర్ణయాత్మకమైనపాత్రను నిర్వహించేందుకు కార్మికవర్గానికి అవకాశంవుంది."

— "చైనా ఎర్రసైన్యం మంచూరియాను చేరుకునేంతవరకూ అనేక సార్లు చుట్టుముట్టబడి తుదముట్టించబడే ప్రమాదానికి గురైంది. చైనా ఎర్ర సైన్యాలు మంచూరియా చేరుకొన్న తరువాత పారిశ్రామిక కేంద్రం దానికి లభ్య మైంది. దానితోపాటు వెనకపక్కన మహత్తరమైన స్నేహపూర్వకమైన సోవియట్ యూనియన్ వుంది. అందువలన వెనకతట్టునుండి శత్రువు దెబ్బకొట్టే

అవకాశం లేనందున చైనావిముక్తిసైన్యం పునర్నిర్మాణమై విజయానికి దారితీసిన అంతిమదాడిని చేయగలిగింది. ఈ విషయంగాచూస్తే భౌగోళికంగా భారతదేశ పరిస్థితి అందుకు పూర్తిగా భిన్నంగావుంది."

— "అయితే ఇంతమాత్రాన విప్లవదశ, దాని ప్రధాన కర్తవ్యాల్లో మినహా మనకూ చైనాకు ఎలాంటి సామ్యమూలేదని భావించరాదు. చైనా లాగానే భారతదేశమూ విశాలమైన దేశం. అలాగే చైనాలోలాగానే భారత దేశంలోకూడా అపారమైన రైతాంగజనం వుంది. అందువలన మన విప్లవానికి చైనా విప్లవానికి అనేక సామాన్యలక్షణాలున్నాయి కాని భారతదేశంలో చైనా పంథాననుసరించి మాత్రమే సాగించే రైతాంగ పోరాటాలు విజయానికి దారితీయజాలవు."

"అంతేకాదు, చైనాపార్టీ రైతాంగ సాయుధ యుద్ధానికొక్కదానికే కట్టుబడిందంటే అది కేవలం అవసరంఅయితప్ప, ఒక సిద్ధాంతంకోసంకాదనే విషయాన్ని మనం మనస్సులో వుంచుకోవలసివుంటుంది. . చైనా వారికి అలా జరిగిందిగాబట్టి దాన్నే మనకొక అవశ్యాచరణీయ సూత్రంగా చేసుకొని, కార్మికవర్గాన్ని ప్రత్యక్ష నాయకత్వస్థితికి తీసుకొనిరావడంలోనూ, మన విముక్తిపోరాటంలో వారు పాల్గొనేటట్లు చేయడంలోనూ మనం ఎందుకు విఫలమవ్వాలి ?"

భారత విప్లవవిజయిసాధనకై రైతాంగ సాయుధ గెరిల్లాపోరాటాన్ని ఇతర ప్రధాన ఆయుధాలైన - కార్మికవర్గ సమ్మెలతోనూ జనరల్ సమ్మెల తోనూ కార్మికవర్గ సాయుధదళాల నాయకత్వాన నగరాల్లో తిరుగుబాటు తోనూ జతపరచవలసివుంటుంది. రైతాంగ సాయుధ గెరిల్లాపోరాటమూ, నగ రాల్లో కార్మికుల తిరుగుబాటూ - ఇవి రెండూ విప్లవానికి మూలమైనశక్తులు.

## కార్మికవర్గ నాయకత్వపాత్ర,
## కార్మిక - కర్షక మైత్రి

"పట్టణాల్లో జనరల్‌సమ్మెలపై ఆధారపడిన పూర్వపంథా రైతాంగ పాత్రను నిర్లక్ష్యం చేసినట్లే, ఆ తరువాతవచ్చిన రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటపంథాకార్మికవర్గపాత్రపట్లచిన్నచూపుచూసింది.అంటేఏ కార్మికవర్గాన్ని అయితే రైతాంగం తన సన్నిహితమిత్రంగా ఎంచుతున్నదో ఆ కార్మికవర్గం యొక్క మిత్రత్వాన్ని నాయకత్వాన్ని ఆచరణలో రైతాంగం తనకు లేకుండా చేసుకుంటున్నదన్నమాట. ఆచరణలో ఈ రెండు పంథాలకుఅర్థం ఐక్యజాతీయ

సంఘటన ప్రాతిపదికగా కార్మిక, కర్షక మైత్రిని నిర్మించే కర్తవ్యాన్ని ఉపేక్షించడమే అవుతుంది. అలాగే విముక్తిపోరాటంలో అగ్రశ్రేణిలో కార్మిక వర్గాన్నివుంచే కర్తవ్యాన్ని కూడా విస్మరించడం కాగలదు.

"... కార్మికవర్గ నాయకత్వం కేవలం పార్టీద్వారా, కర్షక పోరాటాలకు పార్టీ వహించే నాయకత్వంద్వారా మాత్రమే లభ్యంకాదు రైతుల కోర్కెలకోసం కార్మికవర్గం ధైర్యంగా నిలబడి తన కార్యాచరణద్వారా రైతాంగ పోరాటాలకు తోడ్పడినప్పుడే ఆ నాయకత్వం లభ్యమవుతుంది. కార్మిక - కర్షకమైత్రి కేవలం సిద్ధాంతరూపంలోనే కాకుండా, ప్రత్యక్షంగానూ, క్రియాపూర్వకంగానూ అమలుజరగాలి. కార్మికవర్గం కార్యాచరణలో మిత్రంగావుండి పోరాడే రైతాంగానికి ఖచ్చితంగా సహాయపడి, ఉమ్మడి శత్రువుపై విజయాన్ని సాధించగలిగేదిగా వుండాలి.

"కార్మికవర్గం వ్యవసాయ కార్మికులపైనా, పేదరైతాంగంపైనా ఆధారపడుతూ, రైతాంగంతో దృఢమైనమైత్రిని నెరపుతూ యావత్తు ప్రజానీకంతోనూ కలసి విముక్తికోసం, భూమికోసం, భుక్తికోసం, పనికోసం, శాంతి కోసం పట్టణాల్లోనూ, పల్లెసీమల్లోనూ జరిగే పోరాటాలకు నాయకత్వం వహించి నడుపుతుంది."

తన కోర్కెలకోసమే కాకుండా, దోపిడీ చేయుబడే అన్ని తరగతుల, అన్నివర్గాల ముఖ్యంగా రైతాంగం కోర్కెలకోసం కార్యాచరణకు పూనుకోవడంద్వారానూ, మొత్తం ప్రజాతంత్ర ఉద్యమానికి మొదటిశ్రేణిలో మొనగాడుగా నిలబడటంద్వారానూ కార్మికవర్గం తన నాయకత్వ పాత్రను సాధించుకో గలుగుతుంది.

ముఖ్యమైన పరిశ్రమ లన్నింటిలోనూ మెజార్టీ కార్మికుల విశ్వాసాన్ని పార్టీ పొందవలసి వుంటుంది. అలాగే షాపు కమిటీల ప్రాతిపదికపై శక్తివంతమైన ఉద్యమాన్ని, సంఘాలను పార్టీ నిర్మించాలి.

"పార్టీ కార్మికవర్గ ఐక్యతను నిర్మించవలసివుంది మొత్తం మన ప్రజలందరి యెడల తనకుగల కర్తవ్యాలను పార్టీ గుర్తించేటట్లు చేయాలి. కార్మికోద్యమంలో నేడున్న చీలికలు కార్మికవర్గ పోరాటాల అభివృద్ధిని అటంకపరుస్తున్నాయి. అందువలన సాధ్యమైనంత తక్కువ కాలంలో శాయశక్తులా కృషి సలిపి చీలికలున్న ఈ పరిస్థితిని అధిగమించి, కార్మికవర్గ ఐక్య ప్రజా సంస్థలను నిర్మించాలి.

"కార్మికవర్గాన్ని రాజకీయంగా కూడా చైతన్యవంతం చేయవలసి వుంది. సమైక్యమై రాజకీయ చైతన్యంగలిగిన కార్మికవర్గం మాత్రమే ప్రజలకు నాయకత్వం వహించగలిగిన పాత్రను నిర్వహించగలుగుతుంది.

"ధనిక రైతాంగంతో సహా రైతాంగంలోని అన్ని తరగతులవారు వ్యవసాయ సంస్కరణల కోసం పోరాడేటట్లు మనం ఉత్తేజపరచాలి. ఈ పోరాటం సందర్భంగానే రైతాంగ ప్రజల సంస్థలను పునర్నిర్మించాలి. ఇందుకు గాను మనం వ్యవసాయక జనాభాలో మెజార్టీగావున్న వ్యవసాయ కార్మికుల పైన, పేదరైతులపైనా దృఢంగా ఆధారపడాలి."

పోరాటాలకు నాయకత్వం వహించి, నిర్వహించేందుకుగాను గ్రామాల్లో రైతు, వ్యవసాయ కార్మిక సంఘాలను విరివిగా నిర్మించాలి. అత్యంత సమరశీలమైన, చైతన్యవంతమైన వారితో వాలంటీరు దళాలను నిర్మించి, శత్రువు దాడులకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని సంరక్షించుకోవాలి. ఉద్యమం ఉన్నత స్థాయికి అభివృద్ధి చెందడంతో ఈ వాలంటీరు దళాలే సాయుధ గెరిల్లా దళాలుగా అభివృద్ధి చెందుతాయి.

"మన దేశం విస్తారమైనది కావడంవలనా, వ్యవసాయ సంక్షోభమూ, కార్మిక కర్షక ఉద్యమాలు తరతమ స్థాయిలలో అభివృద్ధిచెంది వుండటంవలనా, అలాగే రైతాంగ జనసామాన్యం నిర్మాణస్థితీ, చైతన్యమూ, పార్టీ పలుకుబడి వివిధ పరిణామాల్లో వుండటంవలనా, రైతు ఉద్యమం అన్ని చోట్ల ఒకేస్థాయిలో అభివృద్ధి చెందజాలదు. అందువలన సంక్షోభం పరిపక్వపరిస్థితినిబట్టి, రైతాంగ ప్రజల ఐక్యతాస్థితి, వారి మనోభావస్థితి, పార్టీబలం, తదితర పరిస్థితుల ననుసరించి వివిధ నిర్మాణ రూపాలను, వివిధ పోరాట రూపాలను అనుసరించ వలసి వుంటుంది.

"ఈ కర్తవ్యాలను నిర్వహించాలంటే అత్యంత గాఢమైన దీక్ష తోనూ, ఓర్పుతోనూకూడిన దైనందిన కృషిని ప్రజల్లో సాగించడం అవసరం. మన మూల కార్యక్రమం కోసమూ, ప్రజల సాధారణ తక్షణ కోర్కెల సాధన కోసమూ నిరంతరాందోళన సాగించాలి. సర్వసాధారణ పరిస్థితులకూ, స్థానిక పరిస్థితులకు అనుగుణంగా వివిధ తరగతులకు చెందిన ప్రజల కోర్కెలను వాస్తవ రీతిలో నిర్దిష్టంగా రూపొందించాలి. ప్రజా పోరాటాలకు ప్రత్యక్ష నాయకత్వం వహించాలి. వివిధ పోరాట రూపాలను సమన్వయ పరచాలి. ఒక క్రమ పద్ధతిలో వివిధ ప్రజాసంఘాలను నిర్మించాలి.

"అన్నింటికంటే ముఖ్యంగా మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని తన లక్ష్యంగా వుంచుకొనే ఒక కమ్యూనిస్టుపార్టీని ఓర్మితోకూడిన పోరాటం ద్వారా నిర్మించుకోవలసిన అవసరం వుంది. తగిన వ్యూహాన్ని, ఎత్తుగడలను

రూపొందించుకోవడంలో పార్టీ చాకచక్యాన్ని కలిగివుండాలి ప్రజలతో అతి సన్నిహిత సంబంధాలను కలిగివుండి ఆత్మ విమర్శ, ఉక్కు శిక్షణలాంటి క్రమ శిక్షణను పార్టీ పాటించవలసి వుంటుంది.

"ప్రజల ఉద్యమంపై అదేపనిగా ప్రభుత్వం ప్రయోగించే నిర్బంధ జ్వాలలను తట్టుకొనే విధంగా మనం నిర్మించుకొనే పార్టీ ప్రజా సంస్థలూ వుండాలి". కార్మికవర్గంనుండి తదితర శ్రామిక వర్గాలనుండి ఉత్తములైనవారిని పార్టీలో జేర్చుకోవాలి. పార్టీని ప్రజా పార్టీగా అభివృద్ధి చేసుకోవాలి. అదే సమయంలో పూర్తిగా పరీక్ష చేయకుండా నమ్మదగని వారెవరూ పార్టీలోకి జొరబడకుండా అత్యంత జాగరూకత వహించవలసి వుంటుంది.

## నేటి పరిస్థితిని గురించీ, కర్తవ్యాలనుగురించి అంచనా

"ప్రభుత్వం పూర్తిగా అపఖ్యాతి పాలై ప్రజలనుండి వేరుపడి పోయిందనీ, ప్రజలు తిరుగుబాటు చేయడానికి సిద్ధంగా వున్నారనీ, కొన్ని ప్రాంతాల్లో ప్రభుత్వంతో తలపడుతున్నారనీ, ఈ పరిస్థితులలో పోలీసు కాల్పులతో ప్రభుత్వ పాలన సాగించుతున్నదని దేశంలో అప్పుడే అంతర్యుద్ధ పరిస్థితి ఏర్పడిందని కొందరంటున్నారు. అందువలన మన కార్యకలాపాలన్నీ తదనుగుణ్యంగానే సాగించుకోవాలనీ వారంటున్నారు.

"ప్రభుత్వంఅంటే ప్రజలు చాలా అనుమాన దృష్టితో చూడటం ప్రారంభించినమాట నిజమే. భూస్వాములను, వడ్డీ వ్యాపారులనూ, ప్రజలను తదితర విధాలుగా దోపిడీచేసే ఇతరులనూ కాపాడుతున్న ఈ ప్రభుత్వాన్ని తమ శత్రువుగా ప్రజలు ఎంచడం ప్రారంభించిన విషయమూ కూడా వాస్తవమే. అందువలన నానాటికీ ఆకలితో అలమటించి చచ్చిపోయే ఈ పరిస్థితిని ఇంకేమాత్రం భరించలేక ప్రజలు మెల్లగా పోరాటాలకు తయారవుతున్నారు." తమదైనందిన కోర్కెలకోసం, తిండికోసం, సరిపడ వేతనాలకోసం, వ్యవసాయ సంస్కరణలకోసం, తాము పండించే పంటలకు న్యాయమైన ధరలకోసం, యింకా యితర డిమాండ్లతో వందల వేలాది ప్రజలు కార్యాచరణకై ముందుకొస్తున్నారు. అయితే, జనరల్ ఎన్నికలద్వారా ఈ ప్రభుత్వం స్థానే నిజమైన ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పవచ్చు ననివారు విశ్వసించుతున్నారు.

"దేశం అప్పుడే సాయుధ తిరుగుబాటు లేక విప్లవదశలో ప్రవేశించిన దనిగాని, లేదా దేశంలో అప్పుడే అంతర్యుద్ధం సాగుతున్నదనిగాని చెప్పడం

పూర్తిగా అతిశయోక్తి కాగలదు. పరిస్థితిని మనం ఇంత పొరపాటుగా అంచనా వేస్తే అది మనలను దుందుడుకు ధోరణిలోకిలాగుకొనిపోతుంది. ప్రజల చైతన్య స్థాయికి, అవగాహనస్థాయికి, వారి సన్నద్ధతస్థాయికిగాని, ప్రజలనుండి ప్రభుత్వం ఏమేరకు దూరమైనదో దానిస్థాయికిగాని అందని నినాదాలను ప్రజలకు యిచ్చే స్థితికి పోగలం. అలాంటి నినాదాలు మనలను ప్రజలనుండి వేరుచేసి వారిని సంస్కరణవాద విచ్ఛిన్నకులచేతికి అప్పగించుతాయి.

"మరోవైపున కేవలం ప్రజాశక్తుల అనైక్యతను, అభివృద్ధి నిరోధకుల ఎదురుదాడిని మాత్రమేచూచి, మన శక్తులను పునరాయత్తం చేసుకోవాలనే పేరుతో వెనక్కు లాగాలనే విధానమూ - నిర్బంధవిధానాన్ని కొనితెస్తుందనే నెపంతో తీవ్రచర్యలన్నింటినీ దిగమింగుకోవాలనే విధానమూ అనుసరించడం కూడా అదేవిధంగా పొరపాటు కాగలదు. కనుక పరిస్థితిని ఆ విధంగాతప్పుగా అవగాహనచేసుకొని దాని ప్రాతిపదికపై ఎత్తుగడలను రూపొందించుకోవడం అంటే మనం ప్రజలకు ద్రోహంచేసి శత్రువుముందు మోకరిల్లడానికి మాత్రమే దారితీయగలదు.

"మనం పరిస్థితిని వాస్తవిక దృష్టితో అంచనా వేసుకొని ఆ దృష్టితోనే ప్రజాపోరాటాలను నిర్వహించవలసి వుంటుంది. అది మనలను దుందుడుకు వాదంలోకి ఈడ్చుకొని పోకుండా చూచుకోవాలి. అదే సమయంలో సంక్షోభం పరిష్కారం కావడంలేదనీ, అది నానాటికి పెరుగుతున్నదనే విషయాన్ని మనం మరువరాదు.అందువలనతీవ్రమైన సంక్షోభం ప్రజలను ఆవరించలేదన్నట్లుగానూ ముందుముందు తీవ్రపోరాటాలుఅలముకోబోవటంలేదన్నట్లుగాను ఎంచి మనం తాపీవైఖరినిఅవలంబించరాదు. అయితేసాయుధతిరుగుబాటు,అంతర్యుద్ధ పరిస్థితి లేనంతమాత్రానసర్వహక్కులూ,స్వాతంత్ర్యాలుగల ప్రజాతంత్ర రాజ్యాంగంలో మనంవున్నట్లు భావించి తిరుగుతామని, పనిచేద్దామని కొంతమంది భావించవచ్చు పార్టీని, ప్రజాసంఘాల నాయకత్వాన్ని ప్రభుత్వ నిరంకుశ దాడుల నుండి కాపాడుకోవలసిన అవసరం లేదనుకోవచ్చు. అలాంటి దృక్పథంతో మనం పనిచేస్తే మనం సర్వనాశనం చేయబడతాం. మనం నిర్మించ గలిగేది ఇంకేమీ వుండదు"

తమ దైనందిన పోరాటాల్లో ప్రజానీకానికి పార్టీ నాయకత్వం వహించి నడపవలసి వుంటుంది. వారిని క్రమక్రమంగా ముందుకు తీసుకొని వెళ్ళాలి. ఆ విధంగా ప్రజలు తమ స్వానుభవంద్వారానే విప్లవ కార్యాచరణ ఆవశ్యకతను గుర్తించగలుగుతారు.

"కాని, సంక్షోభం తీవ్రతరం కావడంతో, కోర్కెలను నినదించ డానికి జరిగే వూరేగింపుల్లాంటి ప్రాథమిక చర్యలుకూడా కాల్పులవరకూ దారితీయడంవలనా, వేలాదిమంది బజారుల్లోకి వచ్చే పరిస్థితి ఏర్పడింది. కాబట్టి ప్రజాసంఘాలను నడిపించే నిత్యసామాన్య కార్యకలాపాలకు స్వస్తి చెప్పడం మంచిదని కొందరు అనుకుంటారు. ఫాసిజం తప్పనిసరిగా వస్తుందని, లేదా అప్పుడే అది అధికారానికి వచ్చిందని భావించి, పార్లమెంటరీ ఎన్నికల కోసమూ, లేదా పౌరసత్వ హక్కులకోసం పోరాడేందుకు విశాల జన సామాన్యాన్ని సమీకరించాలనిగానీ, అలా సమీకరించవలసి వుందనిగాని వారు భావించకుండా వాటిని నిరసిస్తూ వుంటారు."

ఫాసిజం అనివార్యమని పార్టీ ప్రచారం చేయరాదు. పైపెచ్చు దేశంలో అపారంగావున్న ప్రజాతంత్ర అభిప్రాయాన్ని వినియోగించుకొని ప్రజలను ఐక్యంచేసి, ప్రస్తుత ప్రభుత్వం ఫాసిజం వైపుకు పోకుండా అరికట్ట డానికి కృషిచేయాలి. ఓర్పుతో ఒక క్రమపద్ధతిలో దైనందిన కృషిద్వారా, ప్రజల కోర్కెలను ధైర్యంగా బలపరచడంద్వారా, వివిధ తరగతులకు చెందిన ప్రజల నిర్దిష్ట పోరాటాలకు సరియైన నాయకత్వాన్ని ఇవ్వడంద్వారా పార్టీ అభి వృద్ధి చెందగలదు, ఆ విధంగా మాత్రమే పార్టీ ప్రజల ప్రజాతంత్ర ఉద్యమాలు నిర్మాతగానూ, నాయకుడుగానూ తన పాత్రను నిర్వహించగలుగుతుంది.

"త్వరితగతిని ప్రజలు తీవ్రవాద భావపూరితు లవుతూ దేశంలోని అనేక ప్రాంతాల్లో కార్యాచరణకు దిగుతున్నప్పటికీ, ప్రస్తుత ప్రభుత్వం పట్ల దాని విధానాల, పద్ధతులపట్ల ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి పెరుగుతున్నప్ప టికీ. ప్రజా ఉద్యమం పెరుగుదల దానితో సరితూగడంలేదన్న విషయాన్ని మనం గుర్తించాలి. ఇందుకు కారణం నిర్బంధ విధానమని చెప్పుకోవడం సరి కాదు. మన పార్టీ బలహీనత, అభ్యుదయ శక్తుల శిబిరంలో చీలికలే ప్రజా ఉద్యమ బలహీనతకు అన్నింటికంటే ఎక్కువ కారణం. అందువలన ఈచీలికలను అధిగమించడానికి పార్టీ కృషి సలపాలి. అభ్యుదయకాముక శక్తులన్నీ ఐక్యం కావలసిన అత్యవసరాన్ని నొక్కి చెప్పాలి ఈ ఐక్యతను కార్యాచరణద్వారా మాత్రమే నిర్మించుకోగలం. పోరాడే ప్రజాసామాన్యం నుండి ఉత్తములైన వారిని తనలో జేర్చుకొనడంద్వారా, పార్టీ తనను తానే ప్రజా పార్టీగా అభివృద్ది చేసుకోగలదు.

"పార్లమెంటరీ ఎన్నికల్లోనూ, ప్రజాబాహుళ్యాన్ని సమీకరించ డానికి. వారి ప్రయోజనాలను కాపాడేందుకు వీలున్న ప్రతి ఒక్క ఎన్నిక లోనూ మనం పాల్గొనాలి. ప్రజలువుండే ప్రతిచోటూ మనం వుండాలి. వారు మనలను వాంఛించే ప్రతిఒక్క చోటూ మనం వుండాలి."

ఇక్కడ ఒక విషయాన్ని చెప్పవలసివుంది. ఎత్తుగడల డాక్యుమెంటు లోని కొన్ని భాగాలు "పోలసీ స్టేట్‌మెంటు"లో జేర్చలేదు మన పార్టీ ప్రతినిధివర్గానికి సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ కమిషన్‌కు మధ్య జరిగిన చర్చలకు సంబంధించిన కొన్ని ప్రశ్నలు, వాటికి యివ్వబడిన సమాధానాలు కూడా అలా జేర్చబడనివాటిలో వున్నాయి. అలా వదిలివేయబడిన భాగాలు నిజానికి "పోలసీ స్టేట్‌మెంటు"లోని అంతర్భాగాలుకావు "పోలసీ స్టేట్‌మెంటు"కు ఆధారభూతమైన సిద్ధాంత ప్రాతిపదికను వివరించడానికి, కొన్ని సిద్ధాంత సమస్యలను, సూత్రాలను వివరించేందుకు మాత్రమే ఉద్దేశించబడినాయి. కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన సోవియట్ పార్టీ కేంద్ర కమిటీకి మన పార్టీ కేంద్ర కమిటీ ప్రతినిధులకూమధ్య సోదరభావంతో జరిగిన సంప్రతింపులను, వచ్చిన నిర్ణయాలను గురించిన చారిత్రక విషయాలను గురించి యథాతథంగా చెప్పడం అవసరం. అలాగే "పోలసీ స్టేట్‌మెంటు"యొక్క అర్థాన్ని గురించి అటు మితవాదులుగాని, ఇటు అతివాద అవకాశవాదులుగాని వక్రంగా చిత్రించేందుకు అవకాశం ఇవ్వరాదు అందువలన అందులో వదిలివేయబడిన భాగాలను-వివరణలకూ ప్రశ్నలకు సమాధానాలకూ సంబంధించిన భాగాలను నేను ఇక్కడ ఇవ్వదలచాను ఆనాడు పార్టీలో ఏర్పడిన తీవ్రమైన సంక్షోభం కారణంగా భారత విప్లవానికి సంబంధించిన సమస్యలను దృష్టిలో వుంచుకొని ఈ చర్యలు, నిర్ణయాలు జరిగాయనే విషయాన్ని పాఠకులు సులభంగానే అర్థం చేసుకోగలరు. భారత విప్లవానికి సంబంధించిన నిర్దిష్టమైన పంథా, వివిధవర్గాల ప్రాంత పోరాటాల రూపాలు-ఇవన్నీ కూడా 1948-50లో తెలంగాణా సాయుధ పోరాటం సందర్భంగా బయటకు వచ్చాయి ఇది గమనించినప్పుడు మాత్రమే చర్చించబడిన సమస్యలన్నింటినీ వాటి చారిత్రక ప్రాధాన్యతదృష్ట్యా సరిగా గ్రహించేందుకు వీలవుతుంది.

## రైతాంగ సాయుధ గెరిల్లాపోరాటంపట్ల మార్క్సిస్టు - లెనినిస్టు అవగాహన : పాక్షిక గెరిల్లా పోరాటం

సంక్షోభం పరిపక్వమవుతున్నకొద్దీ, జనసామాన్యంలో ఐక్యత, చైతన్యం, నిర్మాణశక్తి పెరిగినకొలదీ పార్టీబలమూ, పలుకుబడి పెంపొందినకొద్దీ వ్యవసాయక ఉద్యమాన్ని అణచివేసేందుకు శత్రువు అధికాధికంగా క్రూరమైన చర్యలను తీసుకొన్నకొలదీ సాయుధపోరాటానికి ఎప్పుడు ఎక్కడ, ఎలా

తయారవ్వాలన్న సమస్య తప్పనిసరిగా మనముందుకువచ్చి తీరుతుంది. ఈ సమస్యకు ఆచరణలో అత్యంత ప్రాధాన్యతవుందిగాబట్టి, దానివిషయంలో పార్టీ సందేహాలకు ఏమాత్రం తావులేని స్పష్టమైన సమాధానం తప్పనిసరిగా ఇవ్వవలసివుంటుంది.

ఈ సందర్భంగా ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి అదేమంటే భారతదేశం అతివిశాలమైన దేశం. దేశంలోని వివిధ ప్రాంతాల్లోని ప్రజల చైతన్యం, ప్రజాఉద్యమాలూ వివిధస్థాయిల్లో ఉంటాయి. వ్యవసాయ సంక్షోభం కూడా అన్ని ప్రాంతాల్లోనూ ఒకవిధంగానే వుండదు. అలాగే పార్టీ బలమూ, పలుకుబడి వివిధప్రాంతాల్లో వివిధస్థాయిల్లోవుంటుంది; అన్నిచోట్లా రైతాంగ ఉద్యమం ఒకేరకమైన రీతిలో అభివృద్ధిచెందదు. పరిస్థితులు పరిపక్వంకాకుండా తిరుగుబాటు చెయ్యడం, వివిధరకాలైన దుందుడుకు చర్యలు తీసుకోవడం నిస్సందేహంగా విసర్జించవలసివుంటుంది. కాని అదేసమయంలో ఉద్యమం దేశంలోని అన్ని ప్రాంతాల్లో తిరుగుబాటుస్థాయికి వచ్చేంతవరకూ ఏఒక్క నిర్దిష్ట ప్రాంతంలోనూ సాయుధ గెరిల్లా పోరాటరూపంలో సాయుధ ఆత్మ రక్షణ చర్యలకు దిగరాదనే షరతులు పెట్టడం పొరపాటు. ఎందువల్లనంటే ఉద్యమం అభివృద్ధిచెందుతున్న ఒకానొకదశలో అనేక ప్రాంతాల్లో రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం రూపంలో సాయుధ పోరాటాలను జరప వలసిన పరిస్థితులు ఏర్పడవచ్చు. ఉదాహరణకు, భౌగోళికంగా అనుకూల మైన ఒక పెద్దప్రదేశంలో రైతాంగ ఉద్యమం భూములనూ, ధాన్యాన్ని స్వాధీనం చేసుకోగలిగిన స్థాయికి పెంపొందవచ్చు. అప్పుడు భూములను ఎలా స్వాధీనం చేసుకోవాలి, స్వాధీనం చేసుకొన్న భూములను ఎలా సంరక్షించు కోవాలి అన్న సమస్య తక్షణం ఎదుర్కొనవలసిన సమస్యగా పరిణమిస్తుంది. అలాంటి పరిస్థితుల్లో అశేషరైతాంగం వాస్తవంగా పాల్గొన్న రైతాంగఉద్యమం వుండి, పార్టీ నాయకత్వంక్రింద రైతాంగ జనసామాన్యమంతా ముఖ్యంగా అందరికంటే అధికంగా దోపిడికి, పీడనకూ గురికాబడే పేదరైతాంగం దృఢంగా ఐక్యమైవుండి భూస్వాములను సాంఘికంగాబహిష్కరించడం, సామూహికంగా కౌలుచెల్లించ నిరాకరించుతూ, పోరాడటం, వ్యవసాయకార్మికుల సమ్మెల్లాంటి ఇతర రూపాల్లోకూడా పోరాటాలను జతపరచి సాయుధగెరిల్లా పోరాటాన్ని ప్రారంభించేపక్షంలో దాన్ని సరిగా అర్గనైజుచేసి నాయకత్వంవహించి నడిపే పక్షంలో అది ఇతర ప్రాంతాల్లోని రైతాంగాన్ని ఉత్తేజపరచి సమీకరించే ప్రభావం కలిగివుంటుంది. వారు తమ పోరాటాలను ఉన్నత రూపాల్లోకి పెంపొందించుకోవడానికి సహాయపడుతుంది.

రైతాంగ గెరిల్లా సాయుధ పోరాటాలు అభివృద్ధి చెందిన ప్రాంతాలన్నింటా, సమ్మెలు, ప్రదర్శనల రూపంలో ముఖ్యంగా ప్రక్కనున్న ప్రాంతాల్లోని కార్మికవర్గం కార్యాచరణకు దిగేటట్లు చూడవలసి వుంది. వున్న వాస్తవిక పరిస్థితులను, అవకాశాలను జాగ్రత్తగా అంచనా వేయాలి. అత్యంత జాగ్రత్తతో సన్నద్ధం కావాలి. వీటి ఆధారంగా ప్రారంభించబడే సాయుధ గెరిల్లా పోరాటాన్ని, శక్తివంచన లేకుండా అన్ని రూపాల్లోనూ ఉద్యమ విజయాలను సంరక్షించుకొంటూ, అత్యంత ధైర్య సాహసాలతోనూ, దీక్షతోనూ పార్టీ నిర్వహించవలసి వుంటుంది.

అదే సమయంలో గెరిల్లా ప్రాంతాలపై శత్రువు అత్యధిక సంఖ్యలో కేంద్రీకరించి గెరిల్లా శక్తులను వోడించి, సర్వనాశనం చేయగలిగిన ప్రమాదం ఏర్పడినప్పుడు, పార్టీ చాలా జాగ్రత్త తీసుకొని పట్టువిడుపులతో వ్యవహరించవలసి వుంటుంది.

## విముక్తి పోరాటంలో అంతర్భాగంగా సాయుధ గెరిల్లా పోరాటం

సంక్షోభం తీవ్రతరమైన కొద్దీ, రైతాంగ ఉద్యమం భూములను, తిండిగింజలను స్వాధీనం చేసుకోగలిగిన విప్లవస్థాయికి వచ్చినకొలదీ, తమను పీడించే స్థానిక దోపిడి శక్తుల ఆటకట్టించి వాటిని తుడిచిపెట్టగలిగిన స్థితికి వచ్చినకొలదీ దేశంలోని వివిధ ప్రాంతాల్లో సాయుధ గెరిల్లా ప్రాంతాలు తప్పనిసరిగా అవతరించుతాయి. అయితే, శత్రువుచే చుట్టుముట్టబడి దాని చేతుల్లో సర్వనాశనం చేయబడే ప్రమాదాన్నికూడా ఈ గెరిల్లా ప్రాంతాలు సదా ఎదుర్కొనవలసి వస్తుంది. దేశంలోని అనేకప్రాంతాల్లో స్వంత సాయుధ బలగాలు గలిగిన విముక్తి ప్రాంతాలు ఏర్పడినప్పటికీ ఈ శత్రుప్రమాదం వుండనే వుంటుంది. ఎందువల్లనంటే ఆ ప్రాంతాలనే శత్రు మూకలు అన్ని వైపులనుండీ చుట్టుముట్టగలవు. అందువలన సాయుధరైతాంగ గెరిల్లా యుద్ధ మొక్కటే – అది ఎంత విశాల ప్రాంతంలో విస్తరించబడివున్నప్పటికీ భారత దేశంలో నేడున్న నిర్దిష్ట పరిస్థితుల్లో శత్రువుమీద విజయాన్ని సాధించలేదు.

సంక్షోభం పరిపక్వం కావడంతో పెద్ద ఎత్తున సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాలు విజృంభిస్తాయి. అనేక ప్రాంతాల్లో గెరిల్లా శక్తులు, శత్రువుకు వ్యతిరేకంగా పోరాడుతున్నప్పుడు పట్టణాల్లోనూ, కీలక పరిశ్రమల్లోనూ ముఖ్యంగా రవాణా వ్యవస్థలో పనిచేసే కార్మికులు నిర్ణయాత్మకమైన

పాత్రను నిర్వహించవలసి వుంటుంది. గెరిల్లా శక్తులపైనా, విముక్తి ప్రాంతాల పైనా శత్రువుచేసే దాడులను కార్మికవర్గం తమ సామూహిక సమ్మె పోరాటాల ద్వారా అరికట్టగలగాలి, వమ్ముచేయగలగాలి. వందలాది గెరిల్లా పోరాటాలు నగరాల్లో జనరల్ సమ్మెతోనూ, కార్మికుల తిరుగుబాటుతోనూ జతకలిస్తే అప్పుడు శత్రువు తన శక్తులను అన్నిచోట్ల కేంద్రీకరించి విప్లవశక్తులను వోడించ గలగడం అసాధ్యమవుతుంది. పైపెచ్చు తానే వోటమినీ, సర్వనాశనాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది. చివరకు ప్రభుత్వానికి జెందిన సాయుధ బలగాల్లో కూడా సంక్షోభం పెరుగుతుంది, అందులోని ప్రధానమైన సెక్షన్‌లు విప్లవ శక్తులతో కలిసిపోతాయి.

## సాయుధ గెరిల్లా పోరాటం - వ్యక్తిగత హింసావాదం

సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటానికి ముందు దెబ్బతీసే స్వభావం వున్నప్పటికీ ప్రారంభదశలో మన ఆందోళనలోను, ప్రచారంలోకూడా గెరిల్లా పోరాటంయొక్క ఆత్మరక్షణా స్వభావాన్ని గురించి నొక్కిచెప్పడం అవసరం ప్రభుత్వమూ, దాని పోలీసుశాఖల దాడులనుండి రైతులను రక్షించ డమే ఈ గెరిల్లా పోరాటం లక్ష్యమని చెపుతూవుండాలి. అలా చెప్పేసందర్భంలో రైతులు ఏ కోర్కెల సాధనకైతే పోరాడుతున్నారో ఆ కోర్కెల గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకొని వివరించవలసి వుంటుంది. అలాగే రైతులు ఆయుధాలను చేపట్టడానికి దారితీసిన ప్రభుత్వ అత్యాచారాలను గురించి చెప్పాలి అదే సమయంలో దౌర్జన్యకాండకూ, రక్తపాతానికి బాధ్యత ప్రభుత్వానిదేనని నొక్కిచెప్పవలసిన అవసరంవుంది.

రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటమూ-వ్యక్తిగత హింసావాదనూ (ఇండివిడ్యుల్ టెర్రరిజం) ఒకటేనని చెప్పి గందరగోళ పరచటం సాధార ణంగా జరుగుతూ వుంటుంది. గెరిల్లా పోరాటంలో వ్యక్తిగత హింసా చర్యలు ఒక భాగమేనని కొందరు చెపుతారు భాగమే కాదు, గెరిల్లా పోరాటానికి అదే పునాదనికూడా చెప్పడం జరుగుతున్నది. ఇది పూర్తిగా పొరపాటు అంతేకాదు. వ్యక్తిగత హింసావాదం గెరిల్లా సాయుధ పోరాటంయొక్క దృక్పధానికి, లక్ష్యానికీ పూర్తిగా విరుద్ధమైనది. గెరిల్లా పోరాటానికీ దానికి ఏ మాత్రం పొసగదు. మొదటి విషయం : కొంతమంది ప్రత్యేక వ్యక్తులను చంపడమే వ్యక్తి గత హింసావాదంయొక్క లక్ష్యం అంతేకాని, ఫ్యూడల్ దోపిడీని, ప్రజలను అణచివేసే పరిపాలనా వ్యవస్థను నిర్మూలించడం దాని లక్ష్యంకాదు. కాని

గెరిల్లా సాయుధ పోరాటం లక్ష్యం కొంతమంది వ్యక్తులను చంపి వేయడం కాదు, సుదీర్ఘమైన ప్రజల పోరాటంద్వారా అంతా ద్వేషించే పరిపాలనా వ్యవస్థను నాశనం చేయడం ఇంక రెండో విషయం : వ్యక్తిగత హింసా చర్యలకు పూనుకొనేది, వ్యక్తిగత హింసావాదులు లేదా హింసావాదులతోకూడిన ఒక చిన్న దళం, వారికి జనసామాన్యంతో ఎలాంటి సంబంధమూ వుండదు. ప్రజల పోరాటంతో వారికి ఎలాంటి అవినాభావ సంబంధమూ వుండదు కాని గెరిల్లా పోరాటం అందుకు భిన్నమైనది అప్పటి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించే జనసామాన్యంతో సన్నిహిత సంబంధంతో గెరిల్లాపోరాటం కొనసాగించబడుతుంది.

వ్యక్తిగత హింసావాదం ఒక పరిపాలనా వ్యవస్థకు వ్యతిరేకంగా కాక, కొంతమంది వ్యక్తులకు వ్యతిరేకంగా ఉద్దేశించబడుతుంది. ఈ కారణంగా పరిపాలనా వ్యవస్థకు చెందిన కొంతమంది వ్యక్తిగత ప్రతినిధులను చంపివేస్తే అసలు ఆ పరిపాలనా వ్యవస్థనే నిర్మూలించడం సాధ్యమనే హానికరమైన భ్రమలు ప్రజల మనుస్సులో సృష్టించబడతాయి. పరిపాలనా వ్యవస్థను నిర్మూలించడం గాక ఆ వ్యవస్థకు జెందిన కొంతమంది వ్యక్తిగత ప్రతినిధులను చంపివేస్తే సరిపోతుందనే అభిప్రాయాన్ని అది కలుగజెస్తుంది. అలాగే ఆ వ్యవస్థలో చెడేమీ లేదనీ, ఆ పరిపాలనా వ్యవస్థకు చెందిన కొంతమంది దుర్మార్గులు వుండటమే ఈ చెడుకంతటికీ కారణమనీ, అందువలన వారిని చంపివేస్తే సరిపోతుందనే అభిప్రాయాన్ని కలిగిస్తుంది వ్యక్తిగత హింసావాదం. కాబట్టి వ్యక్తిగత హింసావాదం వలన సృష్టించబడే ఈ భావం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల పోరాట పటిమను బలహీనపరచడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. ఆ విధంగా ప్రజలకు వ్యతిరేకంగా ప్రభుత్వం జరిపే పోరాటానికి సహాయపడుతుంది. వ్యక్తిగత హింసావాదం ప్రజల సాయుధ గెరిల్లా ఉద్యమానికి కలుగజేసే హాని ప్రధానంగా ఇదే.

వ్యక్తిగత హింసాచర్యలను జరిపేది జనసామాన్యంగాక ప్రజలతో నిమిత్తంలేని కొంతమంది వ్యక్తులేగాబట్టి వ్యక్తిగత హింసావాదం ప్రజా ఉద్యమంయొక్క పాత్రను చాలా తక్కువ అంచనావేసి చూపుతుంది. మరో వైపున వ్యక్తిగత హింసావాదులపాత్రను విపరీతంగా పెంచి చెప్పడానికి ప్రయత్నించుతుంది. ప్రజల సాయుధ గెరిల్లా ఉద్యమాభివృద్ధితో నిమిత్తం లేకుండా వ్యక్తిగత హింసావాదులు తమ శక్తిద్వారానే ప్రజలను విముక్తి చేయగలరనే భావాన్ని కలుగజేస్తుంది. వ్యక్తిగతహింసావాదంవలన సృష్టించబడే అలాంటి

భావం ప్రజాసామాన్యంలో ఉపేక్షాభావాన్ని కలుగజేసి, గెరిల్లాపోరాటం అభివృద్ధిని దిగజార్చివేస్తుంది. విప్లవోద్యమానికి వ్యక్తిగత హింసావాదంవలన జరిగే రెండో ప్రధానమైన హాని ఇది.

ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రజల సాయుధ గెరిల్లా పోరాటం ప్రజ్వరిల్లడానికిగల అవకాశాలను వ్యక్తిగత హింసావాదం వమ్ముచేస్తుంది. అందువలన దానిని హానికరమైనదిగానూ, ప్రమాదకరమైనదిగానూ ఎంచి తిరస్కరించాలి.

## సాయుధ గెరిల్లా పోరాటానికి వ్యక్తిగత హింసావాదానికి సంబంధించిన కొన్ని సమస్యలు

ప్రశ్న : ఇతర గ్రామీణ ప్రాంతాలు సాయుధ పోరాటానికి పరిపక్వం కాకపోయినప్పటికీ, తమ కార్యాచరణతో కార్మికులు తమ పోరాటాన్ని బలపరచేందుకు సిద్ధంకాక పోయినప్పటికీ, ఒకానొక ప్రాంతంలో అందుకు పరిస్థితులు పరిపక్వమైనప్పుడు అక్కడ రైతాంగ సాయుధ గెరిల్లా యుద్ధాన్ని ప్రారంభించడం సరియైనదేనా ?

జవాబు. అవును, మీరు ప్రారంభించాలికూడా. సాయుధ పోరాటం ప్రారంభించడం, ప్రారంభించకపోవడమనేది మనపై ఆధారపడి వుండదు. అది ప్రజల నిర్మాణ బలంపైనా, వారి మనోభావాలపైనా ఆధారపడి వుంటుంది. ప్రజానీకం అందుకు సిద్ధంగావుంటే మీరు తప్పని సరిగా పోరాటాన్ని ప్రారంభించాలి.

ప్రశ్న . పాక్షిక డిమాండ్లకోసం జరిగే రైతాంగ పోరాటం భూమి పంపిణీ, గ్రామ రైతుకమిటీల స్థాపన దశకు చేరుకొన్నప్పుడు మాత్రమే మనం సాయుధగెరిల్లా పోరాటాన్ని ప్రారంభించాలా ? లేక ఉద్యమం ఇంకా పాక్షిక డిమాండ్ల దశలోనే (ఉదాహరణకు కౌలుతగ్గింపు కోసం) వుండగా గెరిల్లా పోరాటాన్ని ప్రారంభించవచ్చా ?

జవాబు. సాయుధ గెరిల్లా పోరాటానికి కూడా దశలువున్నాయి. అది చిన్న చిన్న కోర్కెలతో ప్రారంభం కావచ్చు. ఉదాహరణకు కౌలురేటు తగ్గింపు. అప్పటికింకా అది సాయుధ గెరిల్లా పోరాటం కాజాలదు. శత్రువు ఆ డిమాండ్లను కూడా అంగీకరించ నిరాకరించినప్పుడు, రైతాంగం

బలప్రయోగంతో తమ కోర్కెలను సాధించుకోవాలనే ఆదుర్దాతో వున్నప్పుడు సాయుధ గెరిల్లా పోరాటాన్ని ప్రారంభించవచ్చు. అది భూముల స్వాధీనం కోసంగాక కౌలురేటు తగ్గింపుకోసమే కావచ్చు. అయినప్పటికీ అది సాయుధ గెరిల్లా పోరాటమే.

కనుక అది మనమీద ఆధారపడి వుండదు. ప్రజానీకం సిద్ధమై పోరాడటానికి ఆదుర్దాగా వుంటే, మనం వారికి సహాయపడతాం.

ప్రశ్న : రాకపోకల సౌకర్యాలు బాగా అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో చాలా చిన్నతరహాలోనైనా రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాన్ని ప్రారంభించవచ్చునా ?

జవాబు ప్రారంభించవచ్చు. అయితే శతృవు చుట్టుముట్టినప్పుడు అందులోని ఉత్తమ శక్తులను మరోప్రాంతానికి మార్చివేయాలి. ఇతర ప్రాంతాల్లోని సాయుధ బలగాలతో చేరిపోయేవిధంగా సాయుధ శక్తులకు నాయకత్వం వహించు. ఆ విధంగా నీ స్వంతవిముక్తి సైన్యాన్ని సృష్టించుకో.

ప్రశ్న : రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటంయొక్క లక్ష్యం, రైతాంగ జనసామాన్యం తోడ్పాటుతో శతృసాయుధ బలగాలను అంతమొందించటమైవుండాలి. ఇతర పీడకులను భయపెట్టి వారు తమ పీడనను మానుకొనేటట్లు చేసేందుకు వ్యక్తిగత పీడకులను చంపివేయడమే టెర్రరిజం. (వ్యక్తిగత హింసావాదం) కాని ఏ పీడకుడైన భూస్వామినిగాని, దుర్మార్గుడైన ఆఫీసర్‌నుగాని లేదా గూఢచారినిగాని వ్యక్తిగతంగా చంపడాన్నికూడా టెర్రరిజంపేరిట ఒక సూత్రంగాఎంచి పూర్తిగా నిషేధించడాన్ని నేను అర్ధంచేసుకోలేకుండావున్నాను. కొన్ని సమయాల్లో గెరిల్లా పోరాటం ప్రారంభంలో కొంతమంది మరీ దుర్మార్గులైన పీడకులపై – ఇతర పీడకులను భయపెట్టి వారు పీడనను మానివేసేటట్లుచేసే వుద్దేశంతోగాక, గెరిల్లా దళాల భద్రతకోసమే కొన్ని చర్యలు జరపడం అవసరమని నేను అభిప్రాయపడుతున్నాను. అలాంటి చర్యలు ప్రజలను ఉపేక్షాభావం వహించేటట్లు ఎలాచేస్తాయో నేను అర్ధంచేసుకోలేకుండా వున్నాను. మన అంతర్జాతీయ సాహిత్యాన్ని నేను అర్ధంచేసుకొన్నమేరకు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధకాలంలో జర్మన్, జపాన్ ఫాసిస్టులకు వ్యతిరేకంగా గెరిల్లాలు వ్యక్తిగతంగా టెర్రరిస్టు చర్యలుకొన్ని జరిపారు. ఇప్పుడుకూడా గెరిల్లా యుద్ధాలు సాగుతున్న మలయా, బర్మా, ఇండోచైనా వగైరా ఆసియా దేశాల్లోకూడా అలాంటి వ్యక్తిగత టెర్రరిస్టు చర్యలు జరుగుతూనేవున్నాయి. నాకు జ్ఞాపకమున్నంతవరకూ గెరిల్లా యుద్ధంపై తానురాసిన వ్యాసంలో లెనిన్ అలాంటి చర్యలను నిషేధించకపోగా పైపెచ్చు అలాంటి

చర్యలను అరాచక చర్యలని ఖండించిన మెన్షివిక్కులను తీవ్రంగా ఖండించాడు. ఈ విషయంమీద నేను వివరణను కోరుతున్నాను.

*జవాబు :* వ్యక్తిగత హింసావాదం ప్రజల కార్యాచరణను ఎందుకు మందగింపజేస్తుందో తనకుఅర్థంకావడంలేదని కామ్రేడ్ అంటున్నాడు. అది కొంతమంది పీడకులపై వ్యక్తిగతంగా ఉద్దేశించబడటమేగాక, దానిని ప్రజాసామాన్యంతో నిమిత్తంలేకుండా వ్యక్తులు లేదా గ్రూపులే నిర్వహించుతాయిగాబట్టే, దానికి వ్యక్తిగతహింసావాదమనే పేరువచ్చింది ప్రధానంగా ఈ చెడుఅంతా ప్రభుత్వంవలనగాక వ్యక్తులవల్లనే జరుగుతున్నదనే భ్రమను వ్యక్తిగత హింసావాదం సృష్టించుతుంది. అందువలన మరి కొద్దిమందిని చంపివేస్తే ఈ ప్రభుత్వం అంతమవుతుందనే భావాన్ని కలుగజేస్తుంది. దీనినిబట్టి సామాన్య ప్రజానీకం ఎలాంటి నిర్ణయానికి వస్తుంది ? ఈ రకమైన టెర్రరిస్టు చర్యలద్వారా చాలాకాలం పోరాటం జరిగిన తరువాత ఈ ప్రభుత్వాన్ని నాశనం చెయడం సాధ్యపడుతుంది రైతాంగం ఇలాంటి నిర్ణయానికేవస్తే ఇంకా వారు ఇలా అంటారు : "ఈ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటాన్ని అభివృద్ధిచేయడంవలన ప్రయోజనంవుండదు. మన టెర్రరిస్టువీరులు ఆ పని పూర్తిచేయగలరు" అలాంటిభావమే వారిలో ఏర్పడితే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల దాడి సన్నగిలి పోతుంది అందువలన వ్యక్తిగత హింసావాదం హానికరమైనది, ప్రమాదకరమైనది.

ప్రధానమైన పోరాటశక్తి ప్రజాసామాన్యంగాక, వీరులైన టెర్రరిస్టులనే విశ్వాసాన్ని వ్యక్తిగత హింసావాదం కలుగజేస్తుంది. వేచిచూస్తూ, సంతోషించడం మాత్రమే ప్రజలు నిర్వహించవలసిన పాత్ర. అంటే ప్రజలు ఉపేక్షా భావంతో వుండాలని చెప్పడమేకాగలదు. ప్రజానీకం తమ విముక్తిని తామే సాధించుకోవలసి వుంటుందని మార్క్స్, ఎంగిల్సులు మనకు బోధించారు. అదే మీరు వారికి చెప్పవలసి వుంటుంది వ్యక్తిగత టెర్రరిజం వలన విభిన్న ఫలితాలు కలుగుతాయి. టెర్రరిస్టులను వీరులుగానూ, తమ విముక్తి దాతలుగాను ప్రజలు పరిగణించుతారు

లెనిన్ చెప్పిన దానిని గురించి ఈ కామ్రేడ్ ప్రస్తావించారు. కాని దానికి ఏమాత్రం ఆధారంలేదు. వ్యక్తిగత హింసావాదానికి వ్యతిరేకంగా లెనిన్ రాసిన అనేక వ్యాసాలను మేము ఆయనకు ఇవ్వగలం. విప్లవం తగ్గుముఖం పట్టినప్పుడు మెన్షివిక్కులు వ్యక్తిగత హింసావాదాన్ని చేబట్టినందుకు వారిని లెనిన్ ఎంతగా ఖండించాడో మీరు తెలుసుకోవాలి.

విప్లవ పోరాటం తగ్గుముఖం పట్టినప్పుడే వ్యక్తిగత హింసావాద సిద్ధాంతంముందుకు వస్తుంది. అది ఉద్యమంయొక్క బలహీనతకు చిహ్నం. విప్లవోద్యమం బాగా విజృంభణలోవున్నప్పుడు ప్రజలే స్వయంగా వెల్లువలో ముందుకొచ్చి తిరుగుబాటు చెస్తున్నప్పుడు వ్యక్తిగత హింసావాద సిద్ధాంతం రంగనుండే అదృశ్యమవుతుంది ప్రశ్న వేసిన కామ్రేడ్ ఈ విషయాన్ని మనస్సులో వుంచుకోవాలి

# తెలంగాణా సాయుధ పోరాటం దాని భవిష్యత్తు

సోవియట్ పార్టీ కేంద్రకమిటీ నాయకులతోనూ, స్టాలిన్‌తోనూ చర్చలు జరిపే అవకాశం లభించిన మన కేంద్రకమిటీ ప్రతినిధివర్గం తాము తెలంగాణాపై జరిపిన చర్చలసారాంసాన్నికూడా మన కేంద్రకమిటీకి తెలియజేశారు. 'కొన్ని పాక్షిక ఆర్థిక డిమాండ్లపై మొదట రైతు ఉద్యమంగా ప్రారంభమైన తెలంగాణాసాయుధ గెరిల్లా ప్రతిఘటన చివరికి హైద్రాబాద్ సంస్థానంలో నైజాం నవాబు పరిపాలనను కూలద్రోసేందుకు ఒక సాయుధ విముక్తి పోరాటంగా అభివృద్ధి చెందడంపట్ల సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కమిషన్ తన ప్రశంసాభావాన్ని వెల్లడించింది. ఈ పోరాటానికి నాయకత్వం వహించే భాగ్యం తెలంగాణా రైతాంగానికీ, కమ్యూనిస్టుపార్టీకి లభించడం గర్వించదగిన విషయమేనన్నారు.

కాని; 1948 సెప్టెంబరులో భారత యూనియన్ సైన్యాలు నైజాం పరిపాలనను కూలద్రోసిన తరువాత హైద్రాబాద్ రాష్ట్రం భారత యూనియన్‌లో విలీనం అయిన తరువాతకూడా భారత యూనియన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జనతా ప్రజాస్వామిక రాజ్యాన్ని నెలకొల్పేందుకు, దానిని విముక్తి పోరాటంగా కొనసాగించడం సరికాదు. అది సెక్టేరియన్ ధోరణి. ·ఆనాటి వర్గశక్తుల పరస్పర బలాబలాలుగాని, ఆనాడున్న రాజకీయ పరిస్థితిగాని అలాంటి సత్వర కార్యాచరణ నినాదానికి అవకాశం యిచ్చేవిగా లేవు

అయితే, తెలంగాణా రైతాంగం సాధించుకొన్న విజయాలను–భూమి, తదితర ప్రజాతంత్ర హక్కులను యూనియన్ ప్రభుత్వమూ, దాని సాయుధ బలగాలూ హరించుతున్నప్పుడు వాటిని సాయుధ గెరిల్లా పోరాటం ద్వారా సంరక్షించుకోవడంమాత్రం సంపూర్ణంగా సరియైనదే. ఈ సాయుధ గెరిల్లా పోరాటాన్ని రైతుల భూముల రక్షణకై జరిగే ఒక పాక్షిక పోరా

టంగా కొనసాగించివుంటే సబబుగానూ, సరియైనదిగానూ వుండేది. తెలంగాణా రైతాంగానికి సంబంధించిన భూమి సమస్యను రాయబారాలద్వారా, సంప్రతింపులద్వారా పరిష్కరించుకొనేందుకు ఒకవైపున సంసిద్ధతను వెల్లడించుతూనే, మరోవైపున ఆ న్యాయమైన పోరాటానికి అండగా ప్రజాతంత్ర అభిప్రాయాన్ని పెద్ద ఎత్తున సమీకరించి వుండవలసింది. అలా చేసివుంటే తెలంగాణాలో పోరాడే ప్రజలకూ, గెరిల్లాలకు ఎంతోబలం చేకూరేది మరోవైపున ఫ్యూడల్ భూస్వాములను బలపరుస్తూ రైతాంగంపై అన్యాయంగా దాడిచేస్తున్న భారత ప్రభుత్వం ప్రజలనుండి వేరుబడిపోయేది. కాని భూమికోసం జరిగే పాక్షిక పోరాటంగా కాక, కాంగ్రెసు పరిపాలనకు వ్యతిరేకంగా ఒక విముక్తి యుద్ధంగా తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటం పొరపాటుగా నిర్వహించడమైంది. అందువల్లనే రైతాంగంపై దాడిచేసే భారత ప్రభుత్వాన్ని, దాని సైన్యాలను వేరుపరచి, ప్రజాబాహుళ్యంయొక్క అండదండలను తెలంగాణా పోరాటం సాధించలేకపోయింది.

అప్పుడున్న పరిస్థితుల్లో తెలంగాణా సాయుధ గెరిల్లా ప్రతిఘటనను సంరక్షించుకొని, కొనసాగించుకొనలేకపోవడం దురదృష్టకర విషయమని కూడా వారు అనడం జరిగింది సాయుధ గెరిల్లా పోరాటాన్ని ఉపసంహరించుకొనే సమయమాసన్నమైంది. అయితే ఏ షరతులపై దాన్ని ఉపసంహరించుకోవాలి, ఎలా రాయబారాలను సాగించాలి, సముచితమైన షరతులను పొందేందుకు దానిని ఎంతకాలం కొనసాగించాలి, సరిగ్గా ఎప్పుడు సాయుధ ప్రతిఘటనను ఉపసంహరించుకోవాలి వగైరాలన్నీ నిర్ణయించుకోవలసింది భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమే సాయుధ గెరిల్లా పోరాటానికి అండగా రైతాంగ ప్రజావెల్లువ లేనప్పుడు తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటాన్ని అదేపనిగా పొడిగించడంవలన అది దళ, వ్యక్తిగత హింసావాదంకింద దిగజారే ప్రమాదం ఏర్పడవచ్చు.

## 1951 లో కేంద్ర కమిటీ సమావేశం - దాని నిర్ణయాలు

సోవియట్ పార్టీ నాయకులతోనూ, కామ్రేడ్ స్టాలిన్‌తోనూ మన ప్రతినిధివర్గం జరిపిన చర్చలను గురించి కేంద్ర కమిటీకి ఎరుకపరిచి, అవసరమైన రాజకీయ-నిర్మాణ సంబంధమైన నిర్ణయాలను తీసుకునే ఉద్దేశ్యంతో ఈ కేంద్ర కమిటీ సమావేశం ఏర్పాటు చేయబడింది. 1950 మేలో ఎన్నికైన ప్రధాన కార్యదర్శి రాజేశ్వరరావు, పొలిట్‌బ్యూరో సభ్యులు రాజీనామాలు దాఖలు

చేశారు. నాయకత్వంలో తాము కొనసాగడంవలన పార్టీలో తిరిగి ఐక్యత నేర్పరచి, నూతనంగా రూపొందించబడిన పార్టీ విధానాన్ని అమలుజరిపేందుకు సరియైన వాతావరణం వుండదనే ఉద్దేశ్యంతో వారు ఆ విధంగా రాజీనామా యివ్వడం జరిగింది. తత్ఫలితంగా పొలిట్ బ్యూరోను పునర్నిర్మించడం జరిగింది. కామ్రేడ్ అజయ్‌కుమార్‌ఘోష్ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

1951 మేలో జరిగిన కేంద్రకమిటీ సమావేశంలో తెలంగాణా పరిస్థితిని గురించి క్షుణ్ణంగా చర్చించి ఒక తీర్మానం చేశారు. ఆ తీర్మానం పూర్తి పాఠాన్ని క్రింద నిస్తున్నాం. ఆంధ్రకు చెందిన కేంద్ర కమిటీ సభ్యులను తెలంగాణా సాయుధ గెరిల్లా పోరాటం జరుగుతున్న ప్రదేశాలకు వెళ్ళి దళ నాయకులనూ, స్థానిక కమిటీ నాయకులను కలుసుకొని వారితో చర్చలు జరపవలసిందిగా కేంద్ర కమిటీ ఈ సమావేశంలోనే కోరింది సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకునే ముందు అనుకూలమైన షరతులకోసం ప్రభుత్వంతో రాయబారాలను జయప్రదంగా సాగించగలిగినంతకాలం గెరిల్లా ప్రతిఘటనను కొనసాగించ గలిగే స్థితిలో వారున్నదీలేనిదీ చర్చించి తెలుసుకోమని కోరడమైంది. సాయుధ ప్రతిఘటనను ఉపసంహరించుకొనేందుకు నిర్ణయం తీసుకోవడానికి ముందు రెండు ముఖ్యమైన షరతులను రాబట్టాలని కేంద్ర కమిటీ అభిప్రాయపడింది అవి యివి : (1) రైతుల స్వాధీనంలోవున్న భూమిని లాగేసి తిరిగి భూస్వాములకు అప్పగించరాదు (2) పోరాటం సాగించుతున్న నాయకులందరిపైగల అరెస్టు వారంట్లునూ, కేసులను ఉపసంహరించుకోవాలి. జైళ్ళలో వున్న ఖైదీలందరినీ విడుదల చేయాలి. కమ్యూనిస్టుపార్టీ మీద, ఆంధ్ర మహాసభ మీద విధించిన నిషేధాన్ని ఎత్తివేసుకోవాలి.

ఎలాంటి తీవ్రమైన ప్రజాపోరాటాలపైనా – ముఖ్యంగా తెలంగాణా సాయుధ రైతాంగ గెరిల్లాపోరాటంలాంటివాటిపైనా, ఆ పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్నవారితోనూ, ఆ పోరాటాలను నిర్వహించిన నాయకులతోనూ సరిగా సంప్రతించకుండానూ, చర్చలు జరపకుండానూ ఎలాంటి తుది నిర్ణయాలనుతీసుకోరాదని కేంద్రకమిటీ అత్యంత సరియైన నిర్ణయానికివచ్చింది.

స్థానిక గెరిల్లా నాయకులతో చర్చించేందుకు తాము తెలంగాణా ప్రాంతాలకు బయలుదేరివెళ్ళేముందు ఆంధ్ర నుండి కేంద్రకమిటీలో సభ్యులుగావున్నవారు పరిస్థితిని తిరిగి అంచనావేసేందుకై వేరుగా సమావేశమై చర్చలు జరిపారు. తెలంగాణా పోరాటాన్ని ఇంకా కొనసాగించే విషయంలో

ఆరంభంలో వారిమధ్య కొన్ని విభేదాలున్నప్పటికీ ఆ తరువాత ఆ విభేదాలను అధిగమించగలిగి, ఏకాభిప్రాయంతోనే పార్టీసభ్యులవద్దకు ప్రజల ముందుకు వారు వెళ్ళారు.

పార్టీ రహస్య నివాసగృహంనుండి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయి పార్టీ వ్యతిరేకప్రచారం చేసినందుకు రావి నారాయణరెడ్డిని పార్టీ నుండి బహిష్కరించుతూ తీసుకొన్న క్రమశిక్షణాచర్యను 1951 మేలో జరిగిన కేంద్ర కమిటీ సమావేశం రద్దుచేసింది. అయితే చెప్పకుండా ఆ గృహాన్ని విడిచిపెట్టి వెళ్ళి, ఇతర కామ్రేడ్స్ భద్రతకు ప్రమాదం తెచ్చిన ఆయన చర్యను కేంద్ర కమిటీ నిరసించింది. అలాగే 1948 సెప్టెంబరు తరువాత తెలంగాణా సాయుధ పోరాటంపై నిందలువేస్తూ "తెలంగాణా నగ్నసత్యాలు" అంటూ ఒక డాక్యు మెంటును తయారుచేసి పంచినందుకుకూడా ఆయనను కేంద్రకమిటీ తీవ్రంగా విమర్శించింది కేంద్రకమిటీ నిర్ణయాన్ని అనుసరించి రావి నారాయణరెడ్డిగారు పార్టీ సభ్యత్వాన్ని పుచ్చుకున్నారు కాని కేంద్రకమిటీ నిర్ణయాలకూ, ఆదే శాలకూ విరుద్ధంగా ఆయన తెలంగాణా వ్యతిరేకప్రచారాన్ని కొనసాగించారు.

# తెలంగాణాపై 1951 మేలో కేంద్రకమిటీ చేసిన తీర్మానం

[ గమనిక . తెలంగాణా ప్రజాఉద్యమం వ్యక్తిగత హింసావాదంతో పూసు కొన్నదనీ, అరాచకమైనదని కేంద్రకమిటీ తన తీర్మానంలో ఖండించినట్లు కొన్ని పత్రికలూ, కొంతమంది వ్యక్తులూ ప్రచారం చేస్తున్నారు. ఆ తీర్మానం ఎవరు చదివినా ఈ ప్రచారానికి ఏమాత్రం ఆధారంలేదనీ, అది కేవలం నిందాప్రచారం మాత్రమేనని స్పష్టంగా తెలుసుకోగలరు. కొన్ని పత్రికలూ, కొంతమంది వ్యక్తులూ తమ ప్రచారం ద్వారా ప్రజల్లో సృష్టించిన ఈ గందరగోళాన్ని తొలగించేందుకు కేంద్రకమిటీ చేసిన తీర్మానం పూర్తిపాఠాన్ని ప్రకటించుతున్నాం. — ఆంధ్రరాష్ట్ర కమిటీ]

గత అయిదేళ్లుగా తెలంగాణాలో సాగుతున్న పోరాటం విషయంలో అవలంభించిన విధానాన్ని గురించీ, పద్ధతులను గురించీ, అవలంబించవలసిన పద్ధతులను గురించీ పార్టీలోనూ, తెలంగాణా రైతాంగ పోరాటంపట్ల సాను భూతిగావున్న కొన్ని వర్గాలలోనూ కొన్ని ప్రశ్నలు, సందేహాలు తలెత్తాయి.

కేంద్రకమిటీ ఒక విషయాన్ని ఖచ్చితంగా నొక్కి చెప్పవలచకుంది. అదేమిటంటే; తెలంగాణా పోరాటంలో అనుసరించవలసిన విధానాలను గురించి, ఎత్తుగడలను గురించి, పద్ధతులను గురించి కేంద్రకమిటీకి సూచన

లివ్వడానికి దేశంలోని అన్ని ప్రాంతాల్లోవున్న పార్టీ యూనిట్లకూ, పార్టీ సభ్యులకూ హక్కు వుంది. వాటిని గురించి వారు అలా సూచనలు చేయడం వారి విధ్యుక్తధర్మంకూడా. అయితే, ఈ సమస్యలను ప్రధానంగా నిర్ణయించ వలసింది తెలంగాణా ప్రజానీకమే, ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగా భూమి కోసం, స్వాతంత్ర్యంకోసం ఆ మహత్తర పోరాటాన్ని ప్రారంభించి, దాన్ని కొనసాగించి, అంతులేని బాధలుపడి ఎనలేని త్యాగాలుచేసిన ఆ తెలంగాణా ప్రజానీకమే. ఆ ప్రజానీకంతో భుజం భుజం కలిపి, నిరంకుశ పీడనకు వ్యతిరేకంగా వారు సాగించిన వీరోచిత పోరాటానికి నాయకత్వం వహించానని చెప్పుకోవడానికి కమ్యూనిస్టుపార్టీ గర్వపడుతోంది. అయినప్పటికీ ప్రజాభీష్టంతో నిమిత్తం లేకుండా, తన ఇష్టం వచ్చినట్లు పోరాటాలను గురించి నిర్ణయాలు చేయడం, వాటిని కొనసాగించడమో ఉపసంహరించడమో సాగించే అలవాటు గల కాంగ్రెసుపార్టీలాగా కమ్యూనిస్టుపార్టీ వ్యవహరించజాలదు

భారత ప్రభుత్వం హైద్రాబాద్ సంస్థానంలోకి తన సైన్యాలను పంపించింది బూజుపట్టిన నైజాం ఫ్యూడల్ పరిపాలనను అంతంచేసి అక్కడ ప్రజాతంత్ర పరిపాలనను నెలకొల్పడానికేనని చెప్పుకొన్నది. కాని ఈ మాటల బూటకత్వాన్ని సైన్యాలు ప్రవేశించిన అనంతరం మూడు సంవత్సరాల్లో అభ్యుదయకాముకులంతా గుర్తించారు. వందలాదిసభలు, ప్రదర్శనలు, విజ్ఞప్తులు మొదలైనవాటిద్వారా ప్రజలంతా ఏకకంఠంతో జరిపిన ఆందోళనే పన్నెండుమంది తెలంగాణా వీరులపై విధించబడిన ఉరిశిక్షను ప్రభుత్వం రద్దుపరిచేలా చేసింది. ఫ్యూడల్ భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, రైతుకు భూమి, ప్రజలకు తిండి లభింపజేసేందుకు వ్యవసాయ సంస్కరణలను అమలుజరపాలనే సమస్యను ప్రభుత్వం వెనుక తిష్టవేసుకొనివున్న స్వార్థపర అభివృద్ధినిరోధక వర్గాలు దేశం మొత్తం మీదనే బుట్ట దాఖలు చేశాయి.

ఇలాంటి పరిస్థితుల్లో తెలంగాణా ప్రజా వుద్యమాన్ని రక్షించడమంటే, లక్షలాది వ్యవసాయ కార్మికుల, రైతుల స్వాధీనంలోవున్న భూమిని కాపాడటమూ, కౌలు, వడ్డీల తగ్గింపును, వెట్టి చాకిరీలనుండి విముక్తి సాధించడమే కాగలదు ఇవన్నీ వీరోచిత పోరాటాలద్వారా సాధించబడినవే. వీటిని నేడు కాపాడుకోవడమంటే కాగితాలమీద వాగ్దానాల రూపంలోగాక, దేశం మొత్తంమీద వాస్తవంగా వ్యవసాయ సంస్కరణలను సాధించుకునే మార్గాన్ని చూపడమే కాగలదు.

అదే సమయంలో తెలంగాణా ప్రజల, రైతుల ప్రయోజనాలను సంరక్షించి కాపాడే దృష్టితోనూ, ఆ ప్రాంతంలో శాంతియుత పరిస్థితులను

పునరుద్ధరించే దృష్టితోనూ, సంప్రదింపులద్వారా అంగీకారం కుదుర్చుకొని ఈ సమస్యను పరిష్కరించేందుకు కేంద్ర కమిటీ తన సంసిద్ధతను వెల్లడి చేయదలచుకొన్నది.

తెలంగాణా పోరాటం నెహ్రూ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కొనసాగించబడుతున్నదని కొందరు భావించుతున్నారు కాని భూమికోసమూ, ఫ్యూడల్ భూస్వామ్య పీడనను, నైజాంపాలనను అంతమొందించడంకోసం తెలంగాణా రైతులు సాగించుతున్న ఈ పోరాటం నెహ్రూ ప్రభుత్వం ఏర్పడటానికి చాలాకాలంముందే-అంటే 1946 లోనే ప్రారంభమైనదన్న వాస్తవాన్ని వారు గుర్తించడంలేదు. నెహ్రూ సైన్యాలు నైజాం సంస్థానంలో ప్రవేశించిన తరువాతకూడా ఈ పోరాటం కొనసాగుతున్నదంటే అందుకు కారణం లేక పోలేదు. నైజాం పరిపాలనను అంతమొందించే లక్ష్యంతోనే హైదరాబాద్ సంస్థానంలో ప్రవేశించానని చెప్పుకున్న నెహ్రూ సైన్యాలు ఆ నైజాంనవాబుతోనే చేతులు కలిపి, పారిపోయిన భూస్వాములను, తిరిగి తీసుకొనివచ్చాయి. కనుక నెహ్రూ ప్రభుత్వం ఏర్పడిన తరువాతకూడా భూస్వాముల పీడనకు వ్యతిరేకంగా రైతుల ప్రయోజనాల రక్షణకోసం అదే పోరాటాన్ని కొనసాగించవలసివచ్చింది. అందువలన తెలంగాణా రైతాంగ పోరాటం ప్రారంభం కావడంగాని, కొనసాగడంగాని నెహ్రూ ప్రభుత్వాన్ని కూలదోయడానికి కాదనీ, ఫ్యూడల్ భూస్వామ్య పీడనను తుదిముట్టించడం కోసమేననే విషయం అందరూ తెలుసుకోవాలి. ఫ్యూడల్ భూస్వామ్య పీడనను నిర్మూలించేందుకు జరిగే పోరాటం అవసరమన్న విషయాన్ని దేశం అభ్యుదయంవైపు పురోగమించాలని వాంఛించే వారంతా అంగీకరిస్తారు. ఎందువల్లనంటే, అలాంటి పోరాటం విజయం పొందడం ద్వారానే అందరికీ తిండి, అందరికీ పని, అభ్యుదయమూ, స్వాతంత్ర్యమూ చేకూరగలవు.

ఈ లక్ష్యాన్ని దృష్టిలోవుంచుకొనే కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరోను ఈ క్రిందివిధంగా ఆదేశించుతోంది.

1. తెలంగాణా సమస్యను సమీక్షించి, తెలంగాణా పోరాటాన్ని జయప్రదంచేసేందుకు అవసరమైన అన్నిమార్గాలను, పద్ధతులను అనుసరించాలి.

2 తెలంగాణా రైతుల డిమాండ్లకు దేశంలోని ప్రజలందరి సానుభూతి సహకారాలను సంపాదించాలి. తెలంగాణాలో మిలిటరీ సాగిస్తున్న అత్యాచారాలనూ, నిర్బంధవిధానాన్ని ప్రతిఘటించటంలో దేశంలోని ప్రజలందరి, కార్మికుల, కర్షకులసహాయాన్ని సమీకరించేందుకు పార్టీయూనిట్లన్నీ, పార్టీ సభ్యులందరూ పూనుకొనేలా చేయాలి.

3 మిలిటరీ దాడులనుండీ, అత్యాచారాల నుండి తెలంగాణా ప్రజలను కాపాడేందుకు ముందుకు రావలసిందిగా ప్రజాతంత్రవాదులందరికీ కేంద్రకమిటీ విజ్ఞప్తి చేస్తోంది.

4. తెలంగాణా రైతాంగానికి సంబంధించిన ఈ దిగువ కోర్కెలకు మద్దత్తుగా ప్రజలను సమీకరించవలసిందిగా కేంద్ర కమిటీ అందరికీ విజ్ఞప్తి చేస్తోంది.

## కోర్కెలు :

— ఇప్పుడు వ్యవసాయ కార్మికులు, రైతులు సేద్యం చేసు కొంటున్న భూములన్నీ వారి హక్కు భుక్తంగా వుండాలి. సేద్యంచేస్తున్న ఏ రైతునుగాని, వ్యవసాయ కార్మికుణ్ణిగాని భూమినుండి వెళ్ళగొట్టరాదు. రైతుల స్వాధీనంనుండి బలవంతంగా లాక్కున్న భూములన్నింటినీ తిరిగి ఆ యా రైతులకు యిచ్చివేయాలి

— అడవి ప్రాంతాల్లో నివసించే వారందరు అటవీ సంపదను స్వేచ్ఛగా తమ స్వంత అవసరాలకోసం ఉపయోగించుకునేందుకు, అమ్ము కునేందుకూ హక్కును కలిగివుండాలి. అలాగే తాము ఎన్నుకున్న పంచాయ తీల అజమాయిషీకింద అడవుల్లోని భూములను స్వేచ్ఛగా సాగుచేసుకొనేం దుకు వారికి హక్కు వుండాలి.

— గ్రామ వ్యవహారాల నన్నింటినీ స్త్రీ పురుషులంతా కలసి ఎన్ను కొనే పంచాయితీలే నిర్వహించాలి.

— తెలంగాణాలో సాయుధ బలగాలన్నింటినీ వెంటనే ఉపసంహ రించుకోవాలి. హోమ్‌గార్డు దళాలను రద్దుచేయాలి.

— శిక్షలు పొందిన, డిటెయిన్ చేయబడిన రాజకీయ ఖైదీలనూ, తెలంగాణా ఉద్యమానికి సంబంధించిన వారినందరినీ విడుదల చేయాలి. పెండింగులోవున్న కేసులను, వారంట్లను ఉపసంహరించుకోవాలి. ఉమ్మడిగా విధించబడిన జరిమానాల నన్నింటినీ రద్దుచేయాలి.

— ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీలపై విధించిన నిషేధాన్ని ఉపసంహరించుకోవాలి. పౌరసత్వ హక్కులన్నింటనీ పునరుద్ధరించాలి.

— నైజాం వంశం పరిపాలననూ, హైదరాబాద్ సంస్థానాన్ని రద్దుజేసి అందులోని ఆయా భాషాప్రాంతాలను ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక

భాషారాష్ట్రాల్లో విలీనంచేసే సమస్యను హైదరాబాద్ సంస్థానంలోని ప్రజలు వయోజన వోటింగుద్వారా ఎన్నుకునే ఒక రాజ్యాంగసభ నిర్ణయానికి వదిలివేయాలి.

● ● ●

ఈ తీర్మానంచేసి, పార్టీ కేంద్ర నాయకత్వంలో మార్పులు జరగ డంతో దాన్ని తమకు అనుకూలమైన సూచనగా ఎంచుకొని తెలంగాణాలోని రావి నారాయణరెడ్డి వర్గమూ, బొంబాయిలోని పార్టీ ప్రధాన కార్యాలయం నుండి బహిరంగంగా పనిచేస్తున్నవర్గమూ అఖిల భారతంగానే తెలంగాణా పోరాటాన్ని ఎలాంటి షరతులు లేకుండా పూర్తిగా ఉపసంహరించుకోవాలనీ, నాయకత్వంలోని అన్ని స్థాయిలనుండి పోరాడే కేడరును తొలగించాలని పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించారు కేంద్రకమిటీ పోరాటాన్ని ఉపసంహరించి వేసిందనే ప్రచారం చేశారు ఆంధ్రనాయకులు మాత్రమే (బెజవాడ మురా) పోరాటాన్ని పట్టుదలతో కొనసాగించుతున్నారని చెప్పడం ప్రారంభించారు. వ్యక్తిగత హింసాకృత్యాలూ, అరాచక చర్యలు మినహా ఈ పోరాటం అంత కంటే ఎక్కువేమీలేదని దుష్ప్రచారాన్ని సాగించారు.

1948 ఫిబ్రవరిలో భారత కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ మహాసభకు హాజరైన యుగోస్లోవియా ప్రతినిధివర్గం సలహాపై ఇటు అఖిల భారతపార్టీ నాయకత్వమూ అటు ఆంధ్ర నాయకత్వంకూడా టైటొయిస్టు విప్లవ పద్ధతులను అనుసరించుతున్నారనీ, చిన్న చిన్న దళాలతో గెరిల్లా పోరాటాన్ని సాగించు తున్నారని బొంబాయిలోని పార్టీ ప్రధాన కార్యాలయంలో ఏర్పడిన "ఓపెన్ ఫోరమ్", రావి నారాయణరెడ్డి ఏర్పాటుచేసిన గ్రూపూ భారత యూనియన్ సైన్యాలు నైజాం సంస్థానంలో ప్రవేశించి నప్పటినుండి ఒక క్రమ పద్ధతిలో ప్రచారం సాగిస్తూ తెలంగాణా సాయుధ పోరాటాన్ని ఖండిస్తున్నారు. పి. సి. జోషి అనుయాయుడుగావున్న ఓ. పి. సంగాల్ ఆనాడు ఈ నిందా ప్రచారాన్ని సాగించిన వారిలో ఒకడు. కమ్యూనిస్టులు రజాకార్లతో ఏక మయ్యారని ప్రభుత్వం సాగించిన దుష్ప్రచారం ఎంతటి రొచ్చుగుంట స్థాయిలో వుందో ఇదీ అంతే. విప్లవ పోరాటానికి శత్రువులైన వారికి కమ్యూనిస్టులను దెబ్బతీయడానికి ఏ రాయి దొరికినా సహజంగా ఉపయోగించుకొంటారు.

ఇంక తెలంగాణాలోనే హైద్రాబాద్ సిటీ గ్రూపు, రావి నారాయణ రెడ్డి గ్రూపు, జైలునుండి విడుదలైన మరికొంతమంది నాయకులూ కలిసి ఒక సమావేశాన్ని జరిపి "ప్రిపరేటరీ కమిటీ" అనే పేరిట ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. తెలంగాణా పోరాటం ఉపసంహరించుకోబడినట్లూ, వచ్చే ఎన్నికల్లో పాల్గొనడానికి నిర్ణయించుకొన్నట్లు ప్రకటనచేశారు.

పోరాటాన్ని బహిరంగంగా ఉపసంహరించుకోవాలని ఈ గ్రూపు అఖిలభారతంగా తీవ్రమైన వొత్తిడిని తీసుకొని రావడంతో,పోరాటాన్ని ఉపసంహరించుకొనేందుకు ప్రభుత్వంతో రాయబారాన్ని సాగించేందుకు ఒక కమిటీని నియమించినట్లు పొలిట్‌బ్యూరో ప్రకటించింది. పోరాటాన్ని ఉపసంహరించుకోవాలని అఖిలభారత కిసాన్‌సభ కోరింది. తెలంగాణా పోరాటాన్ని వెనువెంటనే ఉపసంహరించుకోకపోతే దాన్ని ఖండిస్తూ తాను ప్రకటన చేయవలసివస్తుందని అజయకుమార్‌ఘోష్ బెదిరించాడు ఆనాడు ఆంధ్ర కమిటీకి కార్యదర్శిగావున్న మద్దుకూరి చంద్రశేఖరరావు అజయఘోష్ బెదిరింపుకు ప్రతి బెదిరింపుచేశారు. అలాంటి ప్రకటననే ఆయనచేస్తే ఆయననూ, ఆయన నాయకత్వాన్ని నిరాకరించుతూ తెలంగాణా ఉద్యమనాయకులుబహిరంగంగా ప్రకటన చేయగలరని హెచ్చరిక చేశారు. దానితో అజయఘోష్ తగ్గారు తెలంగాణా ఉద్యమాన్ని నిర్వహించుతున్న నాయకులు గెరిల్లా దళాలను కలుసుకొనేందుకు అడవుల్లో సుదీర్ఘంగా ప్రయాణం చేయవలసి వచ్చింది. నూతనంగా పార్టీ వచ్చిన అవగాహనను వారికి వివరించి, తెలంగాణా పోరాటయోధుల భద్రతకై కనీస గ్యారంటీలను సాధించేవరకూ, రైతుల స్వాధీనంలో ఇంకావున్న భూములను ప్రభుత్వం లాక్కొని భూస్వాములకు అప్పజెప్పకుండావుండే గ్యారంటీని పొందేంతవరకూ పోరాటాన్ని కొనసాగించే స్థితిలో వున్నదీ లేనిది తెలుసుకొనేందుకు వారితో నాయకులు చర్చలు జరిపారు. పార్టీ కార్యకర్తలను, గెరిల్లా దళాలను కలుసుకొని చర్చించేందుకు ఇలా అడవుల్లోకి వెళ్ళిన నాయకులలో కొంతమంది తిరిగివచ్చేసరికి సెప్టెంబరు నెలాఖరయింది.

ఈలోపున హైద్రాబాద్ నగరంలో చాలా అరెస్టులు జరిగాయి. అనేక రహస్య కేంద్రాలు పోలీసులకు పట్టుబడ్డాయి. జైళ్ళల్లోవున్న అనేకమంది నాయకులు పోరాటాన్ని ఎలాంటి షరతులు లేకుండా ఉపసంహరించడానికి తాము అనుకూలమని బహిరంగంగా చెప్పడం ప్రారంభించారు అలా ప్రకటించినవారినందరినీ జైళ్ళ నుండి విడుదల చేశారు. బయటకువచ్చినవారు ఉపసంహరణ జరగాలనే ఆందోళనలో ఉధృతంగా పాల్గొననారంభించారు. అయితే; ఈ ప్రకటనలవలన ప్రయోజనం ఏమీలేదనీ, "బెజవాడ ముఠా" నాయకత్వానగల పోరాటకమిటీ పోరాటాన్ని ఉపసంహరిస్తూ ప్రకటించితేనే ఉపయోగముంటుందని భారత ప్రభుత్వం, రాయబారకమిటీకీ, మధ్యవర్తులకూ స్పష్టం చేసింది. గెరిల్లాదళాలకోసం వేట నిర్విరామంగా సాగుతోంది. ఇది ఇలావుండగా కరీంనగర్ - ఆదిలాబాద్ ఏరియా కమిటీ, పాల్వంచ ఏరియా కమిటీలు కూడా పోరాటాన్ని ఉపసంహరించమని కోరాయి.

ఇక్కడ మరొక ముఖ్యమైన విషయాన్ని కూడా పేర్కొనవలసివుంది. అదేమంటే; జనరల్ ఎన్నికలు సమీపించడంతో కాంగ్రెసూ, లీగల్‌గావున్న పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంటూ తెలంగాణా గ్రామాలకు వెళ్ళి ఎన్నికల ప్రచారాన్ని ప్రారంభించాయి. మన గెరిల్లాలు తమ చర్యలను మానివేసి నట్లయితే ఇక్కడ-తెలంగాణాలో కూడా పోలీసు క్యాంపులు ఎత్తివేయబడతా యనీ, మన దళాలు, నాయకులు గ్రామాల్లోకి వచ్చి ఎన్నికల్లో పాల్గొనేందుకు అవకాశం కల్పించబడుతుందని చెప్పడం ప్రారంభించారు. అప్పుడు మనం పార్టీకి వోటుచేసి, కాంగ్రెసును వోడించవచ్చునని, అదేపనిగా జరిగే ఈ పోలీసుదాడులూ, ప్రజలను చితకబాదడం వగైరాలు అంతమవుతాయని వారు చెబుతూవచ్చారు.

ఆంధ్రప్రాంతంలో జూన్-జులై మాసాల్లోనే జైళ్ళనుండి పార్టీ కార్యకర్తలు విడుదలయ్యారు. వారు ఎన్నికలకు తయారుకావడం ప్రారంభిం చారు కామ్రేడ్ ఏ. కె. గోపాలన్ గ్రామాల్లో పర్యటించి, పోలీసు నిర్బంధ విధానాన్ని ఖండించారు. నాయకులపైగల అరెస్టు వారంట్లను ఉపసంహరించు కోవాలని ప్రభుత్వాన్ని డిమాండ్‌చేశారు వందలాది గ్రామాల్లో తిరిగి ఎర్ర జెండాలు ఎగరడం ప్రారంభమైంది. ఇంక ఈ పరిస్థితుల్లో తెలంగాణా సాయుధ పోరాటానికికూడా నాయకత్వం వహించుతున్న ఆంధ్రరాష్ట్ర కమిటీ ఎన్నికల్లో పాల్గొనేందుకు పార్టీ సభ్యులకు అనుమతి నిచ్చింది. కృష్ణానదీ అరణ్య ప్రాంతంలో తెలంగాణా గెరిల్లా దళాలతోపాటు పోరాటంలో నిమగ్నమై వున్న ఆంధ్రప్రాంతానికి చెందిన పార్టీ సభ్యులూ, దళనాయకులూ ఆ ప్రాంతా లను వదిలి ఎన్నికల్లో పాల్గొనేందుకు తిరిగి ఆంధ్రకు వచ్చారు.

ఆనాడు తెలంగాణా సాయుధ పోరాటాన్ని నిర్వహించుతున్న నాయ కత్వంలో ఈక్రింది వారున్నారు :

*చండ్ర రాజేశ్వరరావు, మాకినేని బసవపున్నయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, దేవుల పల్లి వెంకటేశ్వరరావు, భీమిరెడ్డి నరసింహారెడ్డి.*

దేవులపల్లి వెంకటేశ్వరరావు కేంద్ర కమిటీ సమావేశానికి హాజరైన తరువాత నూతన అవగాహనను అంగీకరించారు. పోరాట విరమణకు తన సమ్మతిని వెల్లడించారు. గెరిల్లాలను కలుసుకొని వారికి నూతన అవగాహనను, నూతన కేంద్ర కమిటీ నిర్ణయాలను వివరించేందుకని 1951 జూన్‌లో గోదావరి

అడవి ప్రాంతానికి బయలుదేరి వెళ్ళారు. కామ్రేడ్ భీమిరెడ్డి నరసింహారెడ్డి అదే అడవి ప్రాంతానికి అంతకుముందే 1951 మార్చిలో వెళ్ళారు. కామ్రేడ్ సుందరయ్య అమరాబాద్ అరణ్య ప్రాంతానికి వెళ్ళి తిరిగి వచ్చారు.

అక్టోబరు 20వ తేదీన దేవులపల్లి, భీమిరెడ్డి మినహా తక్కిన నలుగురు కామ్రేడ్స్ సమావేశమై చాలా ఆదుర్దాతో సుదీర్ఘంగా చర్చలు జరిపారు. ఇప్పుడున్న పరిస్థితుల్లో కనీస షరతులను సహితం సాధించే అవకాశాలు లేవనే నిర్ణయానికి వారు వచ్చారు. ఇంకా పోరాటాన్ని కొనసాగించడమంటే పోరాటంలో వున్న పార్టీ కార్యకర్తలను దళాలను మరింత ప్రమాదానికి గురి చేయడమే కాగలదనే అభిప్రాయానికి వచ్చారు. పోరాటంలో పాల్గొన్న కేడరుకు క్షమాభిక్ష ప్రకటించబడుతుందని, రైతాంగానికి భూమి హామీ వుంటుందని ప్రభుత్వం యిచ్చిన మాటమీదనే ఆధారపడి బేషరతుగా పోరాటాన్ని ఉపసంహరించుకోవడం మంచిదనే నిర్ణయానికి వారు వచ్చారు.

## ఈ నిర్ణయానికి దారితీసిన పరిస్థితులు

1951 మే లో కేంద్ర కమిటీ సమావేశమై చర్చించినప్పుడే, తెలంగాణా ఉద్యమానికి నాయకత్వం వహించుతున్న కేంద్రకమిటీ సభ్యులు ప్రారంభంలో కొందరు అభిప్రాయ భేదాలను వెలిబుచ్చినప్పటికీ, చర్చల అనంతరం భూమికోసం జరిగే పాక్షిక గెరిల్లా పోరాటంగాకూడా తెలంగాణా సాయుధపోరాటాన్ని ఇంకెంతోకాలం మనం కొనసాగించడం సాధ్యంకాదనే నిర్ణయానికివచ్చారు. సాధ్యమైనన్ని అనుకూలమైన రాయితీలను సాధించుకొని పోరాటాన్ని ఉపసంహరించాలనే అభిప్రాయానికి వారు వచ్చారు. అలాంటి నిర్ణయానికి రావడానికి దారి తీసిన పరిస్థితులు ఇవీ :

అన్నింటికంటే మొట్టమొదటి విషయం · తెలంగాణా ఉద్యమానికి అసలు దుర్గాలుగావున్న నల్లగొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాలలో అన్ని మైదాన ప్రాంతాల్లో పోరాడే గెరిల్లాల పట్ల ప్రజల అభిమానం వున్నప్పటికీ ప్రజానీకం పాల్గొనడం నానాటికి తగ్గిపోతున్నది. పార్టీ, ఆంధ్ర మహాసభ, అర్ధ సైజర్లూ, గెరిల్లా దళాలు ఆ ప్రాంతాలను విడిచిపెట్టి సుదూరానగల అరణ్య ప్రాంతాలకు తిరోగమించవలసి వచ్చింది. అడవుల్లోవున్న తమ కేంద్రాల నుండి గెరిల్లా దళాలువచ్చి దాడులు చేస్తూనే వున్నాయి. భూస్వాములకు, శత్రువు ఏజెంట్లకూ వ్యతిరేకంగా వారు జరిపే చర్యలకు ప్రజల నుండి సహాయం

లభించుతూనే వుంది. అందువలన భూస్వాములూ, ప్రభుత్వంకూడా "మామూలు పరిస్థితులను" నెలకొల్పి – అంటే గతంలోవలె భూస్వాముల దోపిడీని కొనసాగించడానికి తమ పరిపాలనను స్థిరపరచుకోలేక పోతున్నారు. అయితే పోరాటంలో ప్రజానీకం పాల్గొనక పోవడం, పోరాటంలో ప్రజల ప్రత్యక్ష పాత్ర తగ్గిపోవడం – వాటిని అధిగమించి ముందుకు పోవడం గెరిల్లా దళాలకు సాధ్యపడటం లేదు.

1947–48 లో నైజాంకూ, అతగాడి రజాకార్లకూ వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పెద్దయెత్తున ప్రజలు పాల్గొన్నారు. అంతేకాదు, భారత సైన్యాలు ప్రవేశించిన తరువాతకూడా కొంతకాలం ప్రజలు బాగా పాల్గొనడం జరిగింది. చివరికి 1949 ఆఖరులోనూ, 1950 ఆరంభంలోనూ పోరాటం కొత్త ప్రాంతాలకు విస్తరించినప్పుడుకూడా దానంతటదే పెద్దఎత్తున ప్రజావెల్లువను చూడగలిగాం ఇవన్నీ జ్ఞాపకం తెచ్చుకొని పోల్చిచూస్తే ఇప్పుడు ప్రజలు పోరాటంలో పాల్గొనడం తగ్గినట్లు స్పష్టంగా విదితం కాగలదు.

పార్టీ, సంఘం ఆర్గనైజరు, గెరిల్లా దళాలు నూతన ప్రాంతాలకు పురోగమించి, అక్కడ ప్రజలను ఉత్తేజపరచినప్పుడు ప్రారంభ దశలో కోయ ప్రాంతంలోనూ, లేదా మహబూబ్‌నగర్ అడవిప్రాంతంలోనూ, ఇంకా ఎక్కువగా కరీమ్‌నగర్ జిల్లాలోనూ సామాన్య ప్రజానీకం పోరాటపిలుపును బాగా అందుకొన్నారు కాని ప్రభుత్వం తన మిలటరీనీ, పోలీసులను పంపించి క్యాంపులను నెలకొల్పగానే ప్రజల్లో మొదట్లో వచ్చిన ఆ పెద్దపూవు తగ్గిపోయింది. ఇంక అప్పుడు మళ్ళీ దళ చర్యలే ప్రతిఘటనకు ప్రధాన రూపంగా పరిణమించాయి. గోదావరి అడవి ప్రాంతంలో మొత్తం కోయప్రజానీకాన్నంతటినీ అడవిప్రాంతంనుండి లేవగొట్టి అడవుల వెలుపల కాన్‌సెంట్రేషన్ క్యాంపులలో పెట్టిన విషయాన్ని మనం చూశాం.

ఇంక రెండో విషయం: ప్రభుత్వం తన మిలిటరీ పోలీసు క్యాంపులను విరివిగా నెలకొల్పడంతో, ప్రజలు పోరాట చర్యలలో పాల్గొనడం నానాటికీ తగ్గడంతోనూ, శత్రువుల సాయుధ బలగాలపైనా, మిలటరీ, పోలీసు, సాయుధ హోమ్‌గార్డులమీద గెరిల్లా దళాలు శక్తివంతంగా దాడి చేయగలగడం సన్నగిలింది. శత్రువు తన క్యాంపులనూ, దాడులనూ అన్ని ప్రాంతాల్లోనూ హెచ్చించడంతో ఒక రక్షిత అడవి ప్రాంతాల్లో మినహా – అక్కడకూడా సాయుధ బలగాలకు వ్యతిరేకంగా గెరిల్లా దళాల సాయుధ చర్యలు క్రమక్రమంగా తగ్గిపోనారంభించాయి.

దళ చర్యలు ఎక్కువెక్కువగా వ్యక్తులుగా శత్రుఏజెంట్లపైనా, వ్యక్తులుగా భూస్వాములపైననే కేంద్రీకరించబడుతూ వచ్చాయి. ఇంకా సాయుధ పోరాటాన్ని కొనసాగించివుంటే, అది మొత్తంగా వ్యక్తిగత హింసావాదంలోకి దిగజారిపోయే ప్రమాదం వుందని స్పష్టంగా అప్పుడే కనపడింది. ప్రధానమైనవాడి పాలకవర్గాల సాయుధబలగాలపైన గాకుండా, వ్యక్తిగత భూస్వాములపైన, వారి ఏజెంట్లపైననే జరిగితే రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటంయొక్క ప్రధాన స్వభావమే ఎగిరిపోతుంది.

పాలకవర్గాల సాయుధ గెరిల్లాబలగాలకు వ్యతిరేకంగా దాడిచేయగల శక్తి, వారి మిలిటరీ నైపుణ్యమూ అన్ని విధాలుగా పెరగడానికి బదులు తరిగిపోయింది.

మూడోది : అన్యాక్రాంత భూముల్లోనూ కౌలుభూముల్లోనూ హెచ్చుభాగమూ సాగులోకి తేబడిన బంజరు భూములు దాదాపు మొత్తంగాను రైతుల చేతుల్లోవున్నాయి. కాని, వారు భూస్వాముల నుండి స్వాధీనం చేసుకోగలిగిన అదనపుభూమిలో హెచ్చుభాగం మాత్రం వారి చేతుల్లో నుండి పోయింది చివరికి తమ స్వాధీనంలోవున్న భూములకుకూడా వారు నిర్బంధంగా కౌలు చెల్లించవలసిన పరిస్థితి ఏర్పడింది. అయితే అనేక భూముల విషయంలో అవికొద్దిమొత్తాలేకావచ్చు. కొన్ని సందర్భాల్లో కేవలం లాంఛన ప్రాయమేకావచ్చు. కాని వాటన్నింటినీ తిరిగి స్వాధీనం చేసుకోవడంగాని లేదా ఆయుధాలతో వాటిని ఎంతో కాలం సంరక్షించుకోవడంగాని సాధ్యమయ్యే పరిస్థితిలేదు.

నాలుగు : రాజకీయ అధికారం బదలాయింపు అయినవెంటనే తాము ఎదుర్కోనవలసివచ్చిన అపారమైన ఇబ్బందులన్నింటినీ అధిగమించి, పాలక వర్గాలు దేశం మొత్తంమీదనే తమ స్థానాన్ని బలపరచుకోగలిగాయి. యుద్ధానంతరం పెద్దఎత్తునవచ్చిన ప్రజా వెల్లువ త్వరితగతిని తగ్గనారంభించింది. ఇందుకు చక్కని తార్కాణం ఏమంటే తెలంగాణా ఉద్యమాల్లాంటివి దేశంలో మరెక్కడా బయలుదేరలేదు. కనీసం 1947-48 లో వచ్చిన ప్రజా పోరాటాల్లాంటివికూడా ఎక్కడా రాలేదు. అంతేకాదు, తెలంగాణా పోరాటాన్ని బలపరుస్తూ తక్కిన దేశంలో ఎక్కడాకూడా ముఖ్యమైన సంఘీభావ చర్యలుగానీ, సహాయక ఆందోళనలుగాని జరగనేలేదు.

అయిదు : తెలంగాణా ఉద్యమం ఎదుర్కోనవలసి వచ్చిన అత్యంత క్లిష్ట పరిస్థితి దృష్ట్యా, పోరాటంలో పాల్గొంటున్నవారు, సహాయపడేవారూ వూహాకందని తీవ్రరూపంలో మిలిటరీ, పోలీసు చిత్రహింసలనూ,

బీభత్సకాండనూ ఎదుర్కొనవలసివచ్చిన దృష్ట్యా; ఇకముందు ఉద్యమాన్ని ఎలా నిర్వహించాలనే విషయంలో మరొకసారి నాయకత్వంలో తీవ్రమైన విభేదాలు తలెత్తాయి. దానికి ముఖ్యమైన ఉదాహరణం ఏమంటే, రావి నారాయణరెడ్డి తన రహస్యగృహాన్నుండి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయి, బొంబాయిలోని పార్టీ ప్రధాన కార్యాలయంలోని "ఓపెన్ ఫోరం"లో చేరి తెలంగాణా ఉద్యమానికి వ్యతిరేకంగా బహిరంగంగా నిందాప్రచారాన్ని సాగించడం, 1950 మేలో ఎన్నికైన నూతన పొలిట్‌బ్యూరో అనుసరించు తున్న మొత్తం రాజకీయ, ఎత్తుగడల విధానాన్ని బొంబాయిలోని లీగల్‌పార్టీ ప్రధాన కార్యాలయంనుండి అజయ్ – డాంగే – ఘోషేల నాయకత్వాన తూర్పార బట్టడం

ఆరు : ఇంక పోరాటప్రాంతాల్లో గెరిల్లా నాయకులమధ్యనే విభేదాలు ఏర్పడటం ఆరంభమైంది. దళ సభ్యులలోనూ, కేంద్ర ఆర్గనైజర్ల లోనే కొందరు విడిచిపెట్టి వెళ్ళిపోనారంభించారు. మానుకోట – ఇల్లెందు ఏరియాలో దాయం రాజరెడ్డి నాయకత్వాన ఒక చిన్న గ్రూపు తిరుగుబాటు చేయడానికి ప్రయత్నించింది. అది విఫలం కావడంతో అతడూ, మరికొద్దిమంది పార్టీకి ద్రోహంచేసి శత్రువర్గంలో చేరిపోయారు. ఇది తీవ్రమైన హెచ్చరికగా పరిగణించబడింది.

ఇంక చివరికి, పాక్షిక డిమాండ్ల కోసం జరిగే రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటానికి విముక్తి పోరాటంలో ఒక భాగంగా జరిగే గెరిల్లా యుద్ధానికి ప్రధానమైన తేడా వున్నదనే స్పష్టమైన అవగాహనను పొందడంతో తెలంగాణా విషయమై భవిష్యత్తులో అనుసరించవలసిన ఎత్తుగడల పంథాను రూపొందించుకోవడం తెలంగాణా ఉద్యమ నాయకులకు సులభమైంది.

నైజాం పాలనకు వ్యతిరేకంగా విముక్తి పోరాటంగా అభివృద్ధి చెంది, కొనసాగుతున్న తెలంగాణా సాయుధపోరాటం, హైద్రాబాద్ స్టేట్‌లో భారత సైన్యాలు ప్రవేశించిన ఫలితంగా భారతదేశంలో ఒకభాగంగా అది విలీనమైన తరువాత అది ఇంకెంతమాత్రం విముక్తి పోరాటం కాదని మనం గుర్తించి యుండవలసింది. రైతుల స్వాధీనంలోవున్న భూములను సంరక్షించుకొనేందుకు జరిగే రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటంగా మాత్రమే అదివుండగలదు, అంటే పాక్షిక సాయుధ గెరిల్లా పోరాటమన్నమాట. అప్పుడు మనం సాయుధంగా సంరక్షణ పోరాటాన్ని కొనసాగించుతూనే సాధ్యమైనన్ని హెచ్చు సౌకర్యాలను రైతాంగానికి సాధించేందుకు పట్టువిడుపులుగల ఎత్తుగడలను చేబట్టి పరిష్కారంకోసం ప్రయత్నించి వుండవలసింది. అప్పుడు సకాలంలో తిరోగమించి మంచిస్థితిలో బయటపడగలిగి వుండేవారం.

సాధించుకున్న వాటిని నిలబెట్టుకునేందుకు సాయుధ పోరాటాన్ని చివరికి మనమే దెబ్బతీసేంతవరకు సాగించాం.

తెలంగాణా ఉద్యమానికి నాయకత్వం వహించుతున్న కేంద్రకమిటీ సభ్యులు 1951 మేలో కేంద్రకమిటి చేసిన తీర్మానాన్ని అంగీకరించడానికి దారితీసిన కారణాలివీ పార్టీ అంతా ఐక్యంగా తెలంగాణా పోరాటాన్ని బలపరచి, దాని తరపున దృఢంగా నిలబడి, సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకోవడానికి వీలుపడే గరిష్ట షరతులను సాధించడానికి తోడ్పడుతుందని మా ఆశ, మా ప్రగాఢమైనవాంఛ అలా జరిగితే ఆ పరిస్థితుల్లో, ఆ సమయంలో సాధ్యమైనంతగా హెచ్చువిజయాలను కాపాడుకో గలిగేవారం.

కాని, పైన వివరించినట్లుగా కేంద్రకమిటీ తీర్మానం తరువాత జరిగిన ఘటనల పరిణామం మన లక్ష్యాలను సాధించడానికి వున్న అవకాశాలన్నింటినీ వమ్ముచేశాయి అందువలన అనివార్యమై ఎలాంటి షరతులు లేకుండా పోరాటాన్ని విరమించుకోవలసివచ్చింది.

ఈ నిర్ణయాన్ని అంగీకరిస్తూ 1951 నవంబరు 21వ తేదీన అమరాబాద్ ప్రాంతీయ కమ్యూనిస్టుల, గెరిల్లాల సమావేశం చేసిన తీర్మానాలు వున్న పరిస్థితిని సరిగ్గా ప్రతిబింబించాయి. ఆ తీర్మానాలను ఈ క్రింద నిస్తున్నాం :

## సాయుధ పోరాట ఉపసంహారణపై తీర్మానం

గత అయిదు సంవత్సరాలుగా తెలంగాణా ప్రజలు ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన నైజాం నవాబుకు, భూస్వాములకూ వ్యతిరేకంగా భూమికోసం, జాతీయ స్వాతంత్ర్యంకోసం సాయుధ పోరాటాన్ని సాగించుతున్నారు. నైజాం నవాబు పరిపాలన పతనం కాబోతున్న పరిస్థితుల్లో నైజాం రజాకార్లను అంతమొందించుతామనే పేరుతో కాంగ్రెసు ప్రభుత్వ సైన్యాలు హైద్రాబాద్‌లో ప్రవేశించాయి. కాని వాస్తవంలో తెలంగాణా ప్రజలు సాధించుకొన్న విజయాలను వమ్ముచేయడంలో అవి నిమగ్నమైనాయి. నైజాం నవాబును రాజప్రముఖ్‌గా అట్టిపెట్టారు. తెలంగాణా రైతాంగాన్నుండి భూములను లాక్కొని, వాటిని దేశముఖుల, భూస్వాముల స్వాధీనం చేయడం ప్రారంభించారు.

తెలంగాణా ప్రజలు తమ పార్టీ నాయకత్వాన నెహ్రూ సైన్యాలను ప్రతిఘటించి, రైతుల భూములను రక్షించారు. గత మూడు సంవత్సరాల

కాలంలో నెహ్రూ సైన్యాలు వందల వేలాది ప్రజలను ఘోరమైన చిత్రహింసలకు గురిచేసినప్పటికీ, వేలాది స్త్రీలను మానభంగం చేసినప్పటికీ, గ్రామాలకు గ్రామాలనే తగులబెట్టినప్పటికీ, కొండజాతి ప్రజలను తమ గ్రామాలను వదలి వేసేటట్లు నిర్బంధంచేసి, వారిని అడవుల వెలుపలచుట్టూ మిలిటరీ కాపలాతో కాన్‌సెంట్రేషన్ క్యాంపుల్లో పెట్టినప్పటికీ రెండువేలమందికిపైగా గెరిల్లాలను, పార్టీ, ప్రజా నాయకులను, పార్టీని గట్టిగా సమర్థించేవారినీ కాల్చి చంపి వేసినప్పటికీ, తెలంగాణా ప్రజలు తాము సాధించుకొన్నవిజయాల్లో అనేకాన్ని అట్టిపెట్టుకొని, సంరక్షించుకోగలిగారు.

— కౌలుకు తీసుకున్న భూమిలో అత్యధిక భాగాన్ని తమ స్వాధీనంలోనే అట్టిపెట్టుకొని, దాన్ని వారు సాగుచేసుకోగలుగుతున్నారు.

— భూస్వాములవద్దనుండి స్వాధీనం చేసుకొన్న అదనపు భూమిలో అత్యధిక భాగాన్ని బడాభూస్వాములు మిలటరీ, పోలీసు సాయంతో తిరిగి లాక్కోగలిగినప్పటికీ, కొంతభాగాన్ని రైతాంగం నిలబెట్టుకోగలిగింది. బడా భూస్వాములు తాము గుంజుకోగలిగిన భూములను సయితం సాగుచేసుకోలేక పోయారు వాటిల్లో చాలా బాగం బంజరుగానూ, వ్యవసాయం చేయని భూములుగాను, మిగిలిపోయింది

— బంజరు భూములను, పడావు భూములను, పోరంబోకులనూ, లేదా ఫారెస్టు రిజర్వు భూములన్నింటినీ తెలంగాణా రైతులు సాగుచేసుకొని అనుభవించగలుగుతున్నారు.

— అటవీ సంపద నంతటినీ వారు ఉచితంగానే వాడుకోగలుగుతున్నారు.

— నిత్యమూ వుండే పీడనా పాలననుండి, పటేళ్ళ, పట్వారీల ఫారెస్టు గార్డుల దౌర్జన్యాలనుండి విముక్తి పొందగలిగారు.

— భూస్వాములకు వెట్టిచాకిరి చేయడం మానివేశారు.

బడా భూస్వాములకు గ్రామాల్లో నివసించే ధైర్యం లేకుండా పోయింది. అందువలన వారు పట్టణాలకు, పోలీసు క్యాంపులకు పారిపోయారు. ఆర్థికంగా బాగా బలహీనపడిపోయారు.

అయిదు సంవత్సరాలపాటు సాయుధ పోరాటాన్ని కొనసాగించడంతో తెలంగాణా ప్రజలు బ్రహ్మాండగా చైతన్యం పొందారు, తమ హక్కులకోసం, నూతన జీవితాన్ని సాధించడానికి గట్టిగా నిలబడాలని కృతనిశ్చయులయ్యారు.

ఆంధ్ర మహాసభ తెలంగాణా ప్రజల సంస్థగా (ఐక్యసంఘటనగా) తయారైంది. కమ్యూనిస్టుపార్టీ, వారి ప్రేమనూ, విశ్వాసాన్నిపొంది తెలంగాణా ప్రజాపార్టీగా తయారైంది.

భూమికోసం, భుక్తికోసం, నిజమైన స్వాతంత్ర్యంకోసం పోరాడేందుకు ఆచరణలో ఒక నూతన మార్గాన్ని భారతదేశంలోని ప్రజలందరికీ తెలంగాణా రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటం చూపెట్టింది.

నెహ్రూ కాంగ్రెసు ప్రభుత్వంయొక్క నిజస్వభావాన్ని ప్రపంచ వ్యాపితంగా బట్టబయలు చేయడానికి తెలంగాణా ప్రజల పోరాటం సహాయపడింది. ఈ పోరాటం ప్రపంచంలో అభ్యుదయ కాముక ప్రజలందరి ప్రశంసలను పొందగలిగింది.

తెలంగాణా ప్రజల సాయుధ ప్రతిఘటనను తుడిచిపెట్టి పారవేయడం సాధ్యంకాదని నెహ్రూ ప్రభుత్వం భావించింది. అది ఇంకా కొనసాగితే భారతదేశంలోని అనేక ప్రాంతాల్లో అనేక తెలంగాణాలు అవతరించవచ్చునని భయపడింది. అందువలన తెలంగాణా సాయుధ పోరాటాన్ని ఉపసంహరించుకొనేటట్లు చేయడానికి రాయబారాలు కొనసాగించాలని నిర్ణయించుకొన్నారు. ఇందుకోసం ప్రజలకు కొన్ని రాయితీలు కల్పించటానికి సిద్ధపడ్డారు

అయితే, తెలంగాణా ప్రజలపోరాటాన్ని నిర్వహించటంలో కొన్ని పొరపాట్లు వుండిపోయినాయి. అవి యివి .

తెలంగాణా రైతాంగం నైజాం నవాబుకు వ్యతిరేకంగా భూమికోసం, ఆంధ్రప్రజల జాతీయ ఐక్యతకోసం, తమ స్వాతంత్ర్యంకోసం పోరాడుతోంది. కాని మనం దాన్ని నెహ్రూ కాంగ్రెసు ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు అఖిలభారత పోరాటంగా వుండదగిన విముక్తికై ప్రజల సాయుధ పోరాటం ఆరంభంగా పొరపాటుగా ఊహించుకొన్నాం. ఈ పొరపాటువలన నెహ్రూ ప్రచారాన్ని సకాలంలో వమ్ముచేయలేకపోయాం. తెలంగాణా ప్రజలపోరాటానికీ, వారి న్యాయమైన డిమాండ్లకు మద్దతుగా భారతదేశంలోని ప్రజాతంత్రవర్గాలకుచెందిన ప్రజలందరినీ సమీకరించలేకపోయాం.

ఎంత పెద్దయెత్తున నిర్బంధవిధానమూ, బీభత్సకాండ సాగుతున్నప్పటికీ నిజమైన ఏ ప్రజాపోరాటానికైనా ప్రజలతో అవిచ్ఛిన్నమైన నిత్యసంబంధాలను వుంచుకోగలగడం తప్పనిసరిగా అవసరం. కాని అందుకోసం అవసరమైన రహస్య ప్రజాసంస్థలనుగాని, రహస్య పార్టీ నిర్మాణాన్నిగాని మనం ఏర్పరచుకోలేకపోయాం. ఆ కారణంగా నెహ్రూ సైన్యానికి వ్యతిరేకంగా

ప్రజలు సాధించుకున్న విజయాల రక్షణకోసం ఇతర డిమాండ్లకోసం జరిగే పోరాటంలో ప్రజలు ఇతోధికంగా పాల్గొనేందుకు సమీకరించడంలో మనం విఫలమయ్యాం.

మన గెరిల్లా దాడులు ప్రధానంగా ప్రభుత్వ సాయుధ బలగాలకు వ్యతిరేకంగా గాక, ప్రభుత్వ ఏజెంట్లపైన, భూస్వాములపైన, తదితర ప్రజా శత్రువులపైన మాత్రమే కేంద్రీకరించడం జరిగింది.

గెరిల్లాల మిలిటరీ నైపుణ్యాన్ని తగినంతగా త్వరితగతిని మనం అభివృద్ధి చేయలేక పోయాం అలాగే పార్టీ సభ్యుల, అర్గనైజర్ల రాజకీయ, సిద్ధాంత స్థాయినికూడా అభివృద్ధి చేయలేక పోయాం.

ఈ పరిస్థితుల్లో, రైతులను భూములనుండి తొలగించకపోతే, తెలంగాణా ప్రజా పోరాటానికి సంబంధించిన రాజకీయ ఖైదీలందరినీ విడుదలచేస్తే, అరెస్టు వారెంట్లన్నీ రద్దుచేస్తే, తెలంగాణా పోరాటానికి సంబంధించిన వారిపై పెండింగులోవున్న కేసులన్నింటినీ ఉపసంహరించుకొంటే, కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర మహాసభలపై నిషేధాలను తొలగించితే, మిలిటరీ తదితర సాయుధ బలగాలను ఉపసంహరించుకొని, పౌరసత్వ హక్కులను పునరుద్ధరించితే – గెరిల్లా చర్యలన్నింటిని ఉపసంహరించుకోవాలని పార్టీ నిశ్చయించింది. అలాంటి విరామాన్ని, ఏర్పడిన అవకాశాలను ఉపయోగించుకొని, మన బలహీనతలను అధిగమించి, తెలంగాణా ప్రజా ఉద్యమాన్ని నూతన ఉన్నత స్థాయికి తీసుకొని వెళ్ళగలమనీ, నూతన ఎత్తుగడలతో అనేకరెట్లు ఉద్యమాన్ని బలపరచుకోగలమని మేము భావించాం.

కాని గతరెండు సంవత్సరాల కాలంలో పార్టీలోసాగిన అంతరంగిక చర్చలు పార్టీని బలహీనపరచి, తెలంగాణా రైతాంగ సాయుధపోరాటానికి ఎనలేని హానిని కలిగించాయి. తెలంగాణా ప్రజా ఉద్యమం వ్యక్తిగత హింసా వాదమూ, లేదా దళ చర్యలుమినహా మరేమీ కాదనీ, అందులో ప్రజలు అసలు పాల్గొనడమేలేదనీ తప్పుడు వాదనలనూ, ప్రచారాన్ని కొనసాగించారు.

నూతనపార్టీ కార్యక్రమాన్ని నూతన ఎత్తుగడల పంథాను ఆధారం చేసుకొని కేంద్రకమిటీ ఒక తీర్మానం చేసింది. కాని దానికి పూర్తి విరుద్ధంగా వ్యక్తిగత హింసాచర్యలను, దళచర్యలను ఖండించుతూ పొలిట్‌బ్యూరో ఒక బహిరంగ ప్రకటన చేసింది. ఆ ప్రకటన/ పైనపేర్కొన్న నిందా ప్రచారానికి సహాయపడి, తెలంగాణా లక్ష్యానికి హానిని మాత్రమే కలిగించింది.

మనం సంప్రదింపులద్వారా పరిష్కారానికి సిద్ధంగా వున్నామనే కేంద్రకమిటీ తీర్మానంలో భాగాన్ని పత్రికలకు విడుదలచేయడం మూలంగా

ఇంక మనశక్తి ఉడిగిపోయిందనీ, లొంగుబాటుకు సిద్ధంగా వున్నామని ప్రభుత్వం భావించి, మనపట్ల బిర్రబిగిసింది.

మరాట్వాడా కమ్యూనిస్టు నాయకుడు వి. డి. దేశపాండే హైద్రాబాద్ ప్రభుత్వానికి చెందిన హోమ్ – పోలీసుమంత్రి శేషాద్రి అయ్యర్ వద్దకు వెళ్ళి తెలంగాణా ఉద్యమమంతా వ్యక్తిగత హింసాచర్యలేనని (టెర్రరిజం) ఖండించి వచ్చాడు. తెలంగాణాలో రావి నారాయణరెడ్డి, వి. డి. దేశపాండే, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డిగార్ల నాయకత్వాన "కన్వెన్షన్ గ్రూపు" అనే పేరిట ఒక పోటీ పార్టీ పని చేయడం ప్రారంభించింది. ఈ కన్వెన్షన్ గ్రూపుకు చెందిన వారు కొందరూ, జైళ్ళలో డిటెన్యూలుగా వున్నవారిలో కొందరూ హైదరాబాద్ స్టేట్ ప్రధాన పరిపాలకుడుగా వున్న వెల్లోడికి తాము పోరాటాన్ని ఉపసంహరించుకొని, రాజీపడటానికి సిద్ధంగావున్నామని తెలియజేశారు. జడ్. ఎ. అహమ్మద్ నాయకత్వానగల కేంద్ర కిసాన్ కౌన్సిల్, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి నాయకత్వాన అఖిల హైద్రాబాద్ కిసాన్ కమిటీ తెలంగాణా ఉద్యమం వ్యక్తిగత హింసావాదమంటూ ఖండిస్తూ తీర్మానాలు చేశాయి. ఇవన్నీ చూసి, తనదే పైచేయిగా వున్నదని ప్రభుత్వం భావించి మరింత బిర్రబిగిసికూర్చున్నది.

కేంద్ర కమిటీ చేసిన తీర్మానం ప్రకారం తెలంగాణా ప్రజల డిమాండ్లను బలపరుస్తూ సంఘీభావ ఉద్యమాన్ని ఒక్క ఆంధ్ర ప్రాంతంలో మినహా మొత్తం భారతదేశంలో మరెక్కడా సాగించలేదు.

ఒకవైపున మన బలహీనత, మరోవైపున పార్టీలో నానాటికి పెరిగిపోతున్న విభేదాలూ, చీలికలూవున్న ఈ పరిస్థితుల్లో, ప్రభుత్వంనుండి మనం ఆశించిన కనీసమైన షరతులనుకూడా రాబట్టలేకపోయినప్పటికీ తెలంగాణా ప్రజల పోరాటం సాధించిన విజయాలను కాపాడుకొని ముందుకు పోవడానికి తప్పనిసరై నూతన ఎత్తుగడలను స్వీకరించవలసివచ్చింది. ఇందుకోసం గెరిల్లా చర్యలను ఆపుచేయాలని రాష్ట్రకమిటీ చేసిన నిర్ణయాన్ని ఈ సమావేశం ఆమోదించుతోంది.

ఉరకలుపెడుతూ ముందుకు వెడుతున్నప్పుడు ఉద్యమానికి ఎంత నైపుణ్యంతో నాయకత్వం వహించాలో, అలాగే అననుకూల పరిస్థితులు ఏర్పడి తప్పనిసరై తిరోగమించవలసిన సమయంలోకూడా నాయకత్వం ధైర్యం వహించి, చొరవతో అందుకవసరమైన చర్యలను తీసుకోవడం అవసరం. ఈ తిరోగమనంవలన మనం నిరుత్సాహపడవలసిన అవసరమేమీ లేదు. ఉద్యమంలో మనం గడించిన అనుభవంరీత్యా, ప్రజల్లో మనకుగల లోతైన

పునాదుల మూలంగా, నూతన కార్యక్రమాన్ని, నూతన ఎత్తుగడల విధానాన్ని ఆధారం చేసుకొని తెలంగాణా ఉద్యమంలోగల బలహీనతలను అధిగమించ గలుగుతామనే విశ్వాసం మాకు వుంది. అప్పుడు తెలంగాణా ప్రజాఉద్యమాన్ని అనేక రెట్లు శక్తివంతంగా అభివృద్ధి చేసుకొని, జాతీయ సమైక్యతనూ, స్వాతంత్ర్యాన్ని సాధించుకోగలుగుతామనే నమ్మకం మాకుంది. భారతదేశంలో జనతా ప్రజాతంత్ర ఉద్యమంలో మా వంతు కర్తవ్యాన్ని నిర్వహించి తీరుతామని మేము ప్రతిజ్ఞ తీసుకొంటున్నాం.

# కేడరు సంరక్షణపై

గత ఐదు సంవత్సరాలపాటు జరిగిన తెలంగాణా గెరిల్లా పోరాటంలో అనేక కష్టనష్టాలకు గురై అగ్నిపరీక్షల్లో ఆరితేరిన అనుభవంగల కేడరు ఇప్పుడు రంగంలో దాదాపు 650 మంది వున్నారు అందులో ఈ ప్రాంతానికి చెందినవారు 233 మంది వున్నారు. వీరంతా మన ఉద్యమానికి అమూల్యమైన పెట్టుబడి లాంటివారు. ఈ కేడరును సంరక్షించుకొని, నిలబెట్టుకునేందుకు అవసరమైన చర్యలన్నింటినీ తీసుకోవడం తప్పనిసరిగా అవసరం.

ఇంక నూతన ఎత్తుగడల ననుసరించి గెరిల్లా దళాలను రద్దుచేసి, వారిని రాజకీయ దళాలుగా మనం పునర్నిర్మించుకొని, ఆ విధంగా పని చేయించాలి. ప్రభుత్వం మన సంఘంమీద, మన పార్టీ మీద నిషేధాన్ని కొనసాగించుతూనే వున్నందున, మన కేడరును, దళాలను తుడిచిపెట్టివేయాలనే పన్నాగంతోనే వున్నందున, మన కేడరుకు శత్రువునుండి గొప్ప ప్రమాదం ఏర్పడింది. అందువలన ఆత్మరక్షణకోసం వారికి అవసరమైన ఆయుధాలను యివ్వడం అవసరం. మిలటరీ, రాజకీయ దళాల్లోవున్న సభ్యులను సమపాళంలో కలిపివేసి, రాజకీయ–నిర్మాణ సంబంధమైన కర్తవ్యాలను శక్తివంతంగా నిర్వహించడానికి వీలుగా దళాలను మనం పునర్నిర్మించుకోవలసి వుంటుంది.

ఈ దళాలు తమ కార్యక్రమాన్ని కొనసాగించే సందర్భంలో సాంకేతిక పరమైన ప్రతిఒక్క జాగ్రత్తను తీసుకోవాలి. పోలీసులుగాని, భూస్వామ్య గూండాలుగాని తమను పట్టుకొంటే ఆత్మసంరక్షణకోసం, ఇతర రక్షణకోసం వారు అవసరమైన తగిన చర్యలను తీసుకోవాలి.

తీవ్రమైన ఆహార సమస్యను కేడరు ఎదుర్కొనవలసి వస్తుంది. ఇందుకోసం వారు పూర్తిగా ప్రజలపైననే ఆధారపడాలి. ప్రజలనుండి అన్నిరూపాల్లోనూ విరాళాలను వసూలు చేసుకొని, తమను తాము పోషించుకోగలగాలి. భవిష్యత్తులో నిర్బంధాలు తగ్గిపోయినకొద్దీ, గ్రామాలకు తిరిగివెళ్ళి అక్కడ

స్థిరపడి పనులు చేసుకొనేందుకు అవకాశాలు ఏర్పడినకొద్దీ, కేడరు గ్రామాలకు వెళ్ళాలి. అక్కడ ప్రజల్లో ఒకరుగా జీవించాలి. తమ జీవన పోషణకోసం సంపాదించుకొని వారితో కలసి మెలసి పనిచేయాలి.

ఈ లోపున నేడు మనకు అడవుల్లోగల రహస్య కేంద్రాలను మనం కాపాడుకొంటూ వుండాలి. మన కేడరు, మననాయకుల రక్షణకోసమూ, మన కార్యకలాపాల కొనసాగింపుకోసం మన ఆఫీసులు పనిచేసేందుకూ వాటిని ఉపయోగించుకొంటూ వుండాలి. ఇందుకోసం ఇంతకు పూర్వంలాగానే మన ప్రయత్నాలూ, జాగ్రత్తలు కొనసాగుతూ వుండవలసిందే.

ఇంతకు ముందువలె దళాలలోకి మనం ఎవ్వరినీ జేర్చుకోరాదు. అయితే అభివృద్ధి చెందుతున్న చైతన్యవంతమైన కేడరును గ్రామసంస్థల్లో పెట్టి, వారి పని, రాజకీయస్థాయి పెరిగేలా చూడాలి.



తెలంగాణా సాయుధపోరాటాన్ని ఉపసంహరించుకొంటూ చేసిన నిర్ణయం 1951 అక్టోబరు 21 వ తేదీన ప్రజలకు, పత్రికలకు విడుదల చేయబడింది. ఆ రోజునే ఈ వార్తను రేడియోలో ప్రసారం చేశారు.

## ఉపసంహరణ అనంతరం జరిగిన పరిణామాలు

కామ్రేడ్ సుందరయ్య అమరాబాద్ అడవిప్రాంతానికి మరొకసారి వెళ్ళారు నవంబరు మూడోవారంలో అక్కడ జరిగిన పార్టీ, గెరిల్లాయోధుల కాన్ఫరెన్సులో ఆయన పాల్గొని, పోరాటాన్ని విరమించుతూ చేసిన నిర్ణయాన్ని, భవిష్యత్తు కార్యక్రమాన్ని వివరించారు. మృతవీరులకు జోహార్లర్పించుతూ, సోవియట్ యూనియన్‌ను అభినందించుతూ ఆ కాన్ఫరెన్సు ఒక తీర్మానం చేసింది. ఆ తరువాత పోరాటఉపసంహరణ నిర్ణయాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానమూ, కేడరును సంరక్షించుకొనే సమస్య, భూ సమస్య, ధాన్యం లెవీలు, ఆహారం, వ్యవసాయ కార్మిక సమస్యలు, శాంతి ఉద్యమం, రాబోయే ఎన్నికలు, పీపుల్సు డెమోక్రాటిక్ ఫ్రంట్, పార్టీ నిర్మాణం మొదలుగాగల సమస్యలపై తీర్మానాలను ఆమోదించింది.

రాజేశ్వరరావు, దేవులపల్లి వెంకటేశ్వరరావుగార్లు వరంగల్-ఖమ్మం ప్రాంతాలకువెళ్ళి పోరాట ఉపసంహరణను గురించిన పార్టీ నిర్ణయాన్ని వివరించారు.

రహస్యంగావున్న పార్టీ నాయకత్వం 25 మంది సభ్యులతోకూడిన ఒక నూతన తెలంగాణా కమిటీని ఏర్పాటుచేసింది. ఆ కమిటీలో అజ్ఞాతవాసంలోవున్న కేడరు, జైళ్ళనుండి విడుదలైనవారూ, ఇంకా జైళ్ళలోవున్న వారూ వున్నారు ఎన్నికలను గురించి ఎప్పటికప్పుడు నిర్ణయాలను తీసుకొనేందుకు, పోరాట విరమణ అనంతరం కేడరును, ఉద్యమాన్ని సంరంక్షించుకొనేందుకు అవసరమైన చర్యలకోసమూ కార్యవర్గంగా ఒక చిన్న కమిటీని కూడా వేశారు. దానిలో బయటవున్న వారు కొందరూ, హైద్రాబాద్ నగరంలోవుండే రాష్ట్ర కమిటీలోని నాయకత్వంలోని కొందరూ వున్నారు. అయితే ఈ కమిటీతో సహకరించడానికి లీగల్ కామ్రేడ్స్ నిరాకరించారు.

అజ్ఞాతవాసంలోవున్న రాష్ట్ర నాయకత్వంతో సంప్రతించకుండానే అజయకుమార్‌ఘోష్ ఒక "ఎలక్షన్ కమిటీ"ని ఏర్పాటు చేశారు. అయితే ఈ కమిటీకే ఆచరణలో రాష్ట్ర కమిటీగా పనిచేసే అధికారాన్ని ఇచ్చాడు. ఎన్నికల వ్యవహారాలకు మినహా తతిమ్మా విషయాల్లో ఆ కమిటీని ఖాతరు చేయవలదని కోరుతూ అజ్ఞాతవాసంలోవున్న పార్టీ రాష్ట్ర కమిటీ ఒక సర్క్యులర్‌ను జారీచేసింది. ఆ విధంగా రహస్యంగావున్న కేడరుకు అవసరమైన సలహా సంప్రతింపులన్నీ తానే యిస్తూ వచ్చింది. "ఎలక్షన్ కమిటీ"కి బహిరంగంగావున్న కేడరు సహకారం లభించింది. కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించనందున కమ్యూనిస్టుపార్టీ, పార్టీ పేరుతో అభ్యర్థులను ఎన్నికల్లో నిలబెట్టలేకపోయింది. అందువలన పి. డి. యఫ్ అభ్యర్థుల గెలుపుకోసం అజ్ఞాతవాసంలోవున్న కేడరు చాలా కష్టపడి పనిచేసింది

భూస్వాములు ఇంకా గ్రామాలకు తిరిగి రాలేదు. వారు తమ పెత్తనాన్ని నిలబెట్టుకోలేదు. కనుక ప్రజలకు స్వేచ్ఛగా వోటు చేసేందుకు వీలు కలిగింది. బ్రహ్మాండమైన మెజార్టీలతో పి. డి. యఫ్ అభ్యర్థులను ఎన్నుకున్నారు. కాంగ్రెసు అభ్యర్థులు అనేకమంది ధరావతులను సహితం కోల్పోయారు. నల్లగొండ, ఖమ్మం, వరంగల్, కరీమ్‌నగర్ జిల్లాలలో నాలుగుసీట్లు మినహా అన్ని సీట్లను పి. డి. యఫ్. గెలుచుకొన్నది. తెలంగాణా మొత్తం మీదగల వంద స్థానాలకుగాను 40 మంది పి డి.యఫ్. అభ్యర్థులు పి. డి. యఫ్. తోడ్పాటుతో పోటీచేసిన 10 మంది సోషలిస్టు, షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్ అభ్యర్థులూ గెలుపొందారు. సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులంతా వోడిపోయారు. 14 లోక్‌సభ సీట్లలోనూ 7 సీట్లను పి. డి. యిఫ్ గెలుచుకొన్నది.

తెలంగాణాలో లభించిన ఈ ఎన్నికల విజయాలూ, ఆంధ్ర ప్రాంతంలోకూడా (అంత బ్రహ్మాండమైనవి కాకపోయినా) ఇలాంటి విజయాలను సాధించడంతో, అతివాద సెక్టేరియన్, అరాచక, వ్యక్తిగత హింసావాదంతోకూడిన ఉద్యమం ద్వారా మొత్తం ప్రజా ఉద్యమాన్ని నాశనం చేశారనీ, ప్రజల నుండి పూర్తిగా వేరుపడి పోయారనీ పార్టీలోని రెండో వర్గం చేసిన నిందా ప్రచారానికి ఏ మాత్రం ఆధారం లేదని పూర్తిగా రుజువైంది. ఇంకా యధార్థం చెప్పాలంటే కమ్యూనిస్టు పార్లమెంటరీ గ్రూపులోవున్న 29 మంది సభ్యులలోనూ 19 మంది ఆంధ్రప్రదేశ్ నుండి వచ్చినవారే. ఈ విజయాలతో ఆంధ్ర నాయకత్వానికి మరొకసారి అఖిల భారత నాయకత్వంలో సముచితమైన స్థానం లభించింది.

1952 ఫిబ్రవరి మాసంలో పోరాట ప్రాంతాలనుండి వచ్చిన ముఖ్యమైన తెలంగాణా కామ్రేడ్స్‌తోనూ, వెలుపలవున్న వారితోనూ మొతం సుమారు పాతికమందితో ఒక వారం రోజులపాటు సమావేశం జరిగింది. కేడర్‌లోవున్న విభేదాలకు సంబంధించిన సమస్యల నన్నింటిసీ వారు చర్చించారు. పార్టీ ప్రధాన కార్యదర్శిగా అజయ్‌కుమార్‌ఘోష్ ఆ సమావేశానికి హాజరై చర్చలకు సారధ్యం వహించారు. అంగీకరించబడిన నిర్ణయాలను ఆయన సమీక్షించారు. ఆ తరువాత తెలంగాణా ఉద్యమానికి నాయకత్వం వహించి నిర్వహించేందుకుగాను ఐక్య తెలంగాణా కమిటీ ఏర్పాటుచేయబడింది. కామ్రేడ్ సుందరయ్య ఈ కమిటీకి కార్యదర్శిగా ఎన్నికయ్యారు. కామ్రేడ్స్ బసవపున్నయ్య, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మఖ్దూమ్, దేవులపల్లి వెంకటేశ్వరరావు, భీమిరెడ్డి నర్సింహారెడ్డి గార్లతో సెక్రటేరియట్ ఏర్పడింది. ఏ సమస్యపైన అయినా విభేదాలు అదే పనిగా కొనసాగితే మూడింట రెండు వంతుల మెజార్టీతో నిర్ణయాలు తీసుకోవాలని అంగీకరించబడింది. ఐక్యతకోసం మేము ఎంతగానో ఆదుర్దాపడినందున ఈ సూత్రానికి సహితం మేము అంగీకరించటం జరిగింది.

ఎన్నికల అనంతరం 1952 లో నాయకత్వంలో వున్న అనేకమంది కార్యకర్తలు బహిరంగంగా వచ్చారు. అయినప్పటికీ అజ్ఞాతవాసంలో వున్న దళాలపైనా, కేడరుపైనా పోలీసువేట సాగుతూనే వుంది పోలీసులు మన కేడరుకై వేటాడి కొద్దిమందిని చంపివేసిన ఉదాహరణలుకూడా వున్నాయి. అరెస్టులూ, కేసులూ కొనసాగుతూనే వున్నాయి. కొంతమందికి దీర్ఘకాల శిక్షలుకూడా విధించడం జరుగుతున్నది. పోరాటాన్ని విరమించేపక్షంలో కేసులను, అరెస్టు వారంట్లను ఉపసంహరించుకొంటామనీ, అరెస్టు చేయబడిన,

శిక్షలు విధించబడిన కామ్రేడ్స్‌ను విడుదల చేస్తామనీ చేసిన వాగ్దానాలను ఎందుకు నెరవేర్చరని ప్రభుత్వాన్ని ప్రశ్నించితే గెరిల్లాలు ఇంకా తమవద్దనున్న ఆయుధాలను అప్పగించలేదనే సాకు చెప్పడం ప్రారంభించింది. ఆయుధాలను అప్పగించనంతకాలం మన కామ్రేడ్స్‌ను వారు వేటాడటం తగ్గదని అర్ధమైంది. అప్పుడు తెలంగాణా కమిటీ సమావేశమై ఆయుధాలు మనవారివద్ద వుండటం వలన ప్రయోజనమేమీలేదనీ, పైపెచ్చు మనపై కక్షి సాధించేందుకు ప్రభుత్వానికి అదొక సాకుగా ఉపయోగపడగలదని భావించి, ఆయుధాలను అప్పగించాలని ఏకగ్రీవంగా నిర్ణయించింది భవిష్యత్తులో ఒకవేళ ప్రజలు ఆయుధాలను చేబట్టవలసిన పరిస్థితి ఏర్పడితే బూజుపట్టిన ఈ పాత తుపాకులపై ఆధారపడేకంటే, గతంలోవలె తిరిగి ఆయుధాలను సేకరించుకోగలగడం సులభమే కాగలదు. అందువలన ఆ నిర్ణయాన్ని అనుసరించి నిర్ణీతమైన ప్రదేశాల్లో ఆయుధాలను పార్టీ అప్పగించింది.

ఆయుధాలు అప్పగించాలన్న ఈ నిర్ణయానికి దేవులపల్లి వెంకటేశ్వరరావుకూడా భాగస్వామే. కాని 1969 లో పక్కా నగ్జలైట్ నాయకుడుగా అయిన మారిపోయిన తరువాత పోరాటాన్ని ఉపసంహరించడాన్నీ, ఆయుధాలను అప్పగించడాన్నీ ఘోరమైన విద్రోహమని ఆయన ఖండించారు. ఒకవేళ తెలంగాణా పోరాటాన్ని ఉపసంహరించినప్పటికీ, ఆయుధాలను అప్పగించి వుండకపోతే ఆ తరువాత పరిణామాలు వేరు విధంగా వుండేవని ఆయన వాదించుతున్నారు ! విచిత్రమైన తర్కమే !!

ఇక్కడే మరో విషయాన్నికూడా నేను స్పష్టంగా చెప్పదలచాను. అదేమంటే, 1951 నుండి 1967 వరకూ ఈ మధ్య సంవత్సరాల్లో చైనా ఎన్నడూకూడా తెలంగాణా ఉద్యమాన్ని ఉపసంహరించి వుండటం పొరపాటని చెప్పివుండలేదు. వారికిఅలాంటి అభిప్రాయమేవుండివుంటే ఆవిషయాన్ని మాకు చెప్పేందుకు వారికి అనేక అవకాశాలున్నాయి. మేము వారిని స్వయంగా కలుసుకొని మాట్లాడిన సందర్భాల్లోకూడా వారలాంటి అభిప్రాయాన్ని వెలిబుచ్చి వుండలేదు. ఒకసారిమేము వారితో మాట్లాడుతూ ఆత్మవిమర్శనా ధోరణిలో "మాకు సరియైన అవగాహనే అప్పుడు వుండివుంటే తక్కువ నష్టాలతో, ఎక్కువ లాభాలతో మేము తిరోగమించి వుండేవాళం" అని అనగా ఆ విషయాన్ని నొక్కిచెప్పవలదనీ, దేశంలోని ఒక చిన్నప్రాంతంలో సాగిన రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాన్ని సహితం నెహ్రూప్రభుత్వం అణచివేయలేకపోయిందన్న విషయానికిగల విప్లవ ప్రాధాన్యతను ముందుకుతెచ్చి వివరించవలసిందిగా వారు మాతో అన్నారు.

# విభేదాల కొనసాగింపు

1. భారత యూనియన్ సైన్యాలు ప్రవేశించిన తరువాత కూడా రైతాంగం స్వాధీనంలోవున్న భూములను రక్షించుకునేందుకు సాయుధ పోరాటాన్ని కొనసాగించడం సరైనదేనని, అలా కొనసాగించకుండా వుండటమంటే, రైతాంగానికి మనం ద్రోహంచేసినట్లు పరిగణించబడే వారమని అజయకుమార్ ఘోష్ తన తుది అభిప్రాయంగా చెప్పినప్పటికీ, రావి నారాయణరెడ్డి గ్రూపు ఆ వైఖరిని అంగీకరించడానికి నిరాకరించింది. సాయుధ పోరాటాన్ని కొనసాగించి వుండటం తప్పనే తమ ప్రచారాన్ని కొనసాగించుతూనే వచ్చారు.

2. ఆంధ్ర–తెలంగాణా ప్రాంతాలు రెండింటికీ నాయకత్వం వహించే కమిటీగా విశాలాంధ్ర కమిటీ ఏర్పడాలనీ, ఆ కమిటీకి లోబడి వేరు వేరుగా రెండు ప్రాంతీయ కమిటీలు ఏర్పడాలన్న అభిప్రాయాన్ని వారు వ్యతిరేకించారు. ఆంధ్ర – తెలంగాణా కమిటీలు వేరు వేరుగా వుండి, అవి నేరుగా కేంద్ర కమిటీ నాయకత్వం కిందనే వుండాలని వారు పట్టుబట్టారు. విశాలాంధ్ర కమిటీ ఉమ్మడి సమస్యలపై ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకునే వేదికగా మాత్రమే వుండాలని వారన్నారు.

3. తెలంగాణాలో ప్రజాతంత్ర వాదులందరి ఐక్యసంఘటనగా ఆంధ్రమహాసభను అభివృద్ధి చేయాలనే ప్రతిపాదనను వారు వ్యతిరేకించారు. పి. డి. యఫ్. మాత్రమే మొత్తం హైదరాబాద్ స్టేట్‌కు ఐక్యసంఘటనగా వుండాలనేది వారి పట్టుదల. యధార్థానికి, కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్ని వెనక్కి నెట్టి పి. డి యఫ్ నే ఒక పార్టీగా అభివృద్ధి చేయాలనేది వారి అభిప్రాయం. ప్రజా కార్యకలాపా లన్నింటినీ పి డి. యఫ్ తరఫునే నిర్వహించాలనేది వారి కోరిక.

4. అజ్ఞాతవాసంలో యింకావున్న కేడరుకు సముచితస్థానమిచ్చి, వివిధస్థాయిల్లో పార్టీ కమిటీలను ఏర్పాటుచేయడానికి వారు వ్యతిరేకించారు. అజ్ఞాతవాసంలోవున్న కేడరును "ఒంటెత్తువాదులనీ", "సాయుధ పోరాటం గాళ్లు" అనీ నిందించి, వారిని కమిటీలనుండి మినహాయించాలనేది వారి అభిప్రాయం. అయితే పైకిమాత్రం రహస్యంగావుంటున్నవారూ, బయటవుంటున్నవారు కలిసి సమావేశంకావడం కష్టమని సాకులుచెప్పేవారు అజ్ఞాతవాసంలో వున్న కేడరుకు పునరావాసం కల్పించడానికీ, లేదా పార్టీలో పనిచేయడానికి వారు సహాయపడలేదు.

5 ముల్కీ ఉద్యమంయొక్క విచ్ఛిన్నకర స్వభావాన్ని వారు గ్రహించనూలేదు, దానికి వ్యతిరేకంగా తీవ్రంగా పోరాడనూలేదు. ముల్కీ ఉద్యమాన్ని 1952 లో తెలంగాణాలోని అభివృద్ధినిరోధకులు రెచ్చగొట్టారు. వెలుపలినుండివచ్చేవారి–అంటే ఆంధ్రప్రాంతంనుండివచ్చిన వారి ఆధిపత్యానికి వ్యతిరేకంగాపోరాడే నెపంతో భూస్వాములూ, అభివృద్ధినిరోధక ప్రభుత్వ అధికారులూ, మార్వాడీ వ్యాపారస్తులూ ప్రజాతంత్ర ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి సిద్ధమయ్యారు.

6 తమ స్వాధీనంలోవున్న భూములను సాగుచేసుకోకుండా రైతులను భూస్వాములు వెళ్ళగొడుతూవుంటే, వారికి వ్యతిరేకంగా సమరశీలమైన ప్రతిఘటనకు నాయకత్వం వహించడానికి బదులు అనేక సందర్భాల్లో రైతుల ప్రయోజనాలకు విరుద్ధంగానే ఆ తగాదాలను పరిష్కరించేందుకు భూస్వాములతో రాజీలు చేసుకోవడానికి వారు (రావి నారాయణరెడ్డిగారి గ్రూపు) సిద్ధమవుతూ వుండేవారు.

... సాగుచేసుకొంటున్న భూములనుండి రైతులను తొలగించివేసే కాంగ్రెసు ప్రభుత్వ భూస్వాముల ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఎలా పోరాడాలన్న సమస్యపై ఏర్పడిన విభేదం అతిముఖ్యమైనది సరిగ్గా ఈ సమస్య మీదనే అన్ని ప్రదేశాల్లోనూ తీవ్రమైన విభేదాలు పొడసూపాయి. ఒకవైపున రావి నారాయణరెడ్డి గ్రూపు, లీగల్‌గావున్న కేడరుకూ, మరోవైపున అజ్ఞాత వాసంలోవున్న గ్రూపుకూ మధ్య ఈ సమస్యపైననే ఘర్షణ నిత్యకృత్యంగా తయారైంది. కేంద్రకమిటీముందు వారు ఏమి చెప్పినప్పటికీ, ఆచరణలో వారి చర్యలన్నీ భూస్వాములకే అనుకూలంగా వుండేవి. ప్రజలను సమీకరించి, రైతుల స్వాధీనంలోవున్న భూములను సంరక్షించుకొందామనేది వారి వైఖరి కాదు ఏదోవిధంగా భూస్వాములతో రాజీపడదామనేదే వారి వైఖరి. ఇదీ మా దృఢమైన అభిప్రాయం. కేంద్రకమిటీ అభిప్రాయంకూడా అదే. అజ్ఞాత వాసంలోవున్న కేడరులో కొన్ని సెక్టేరియన్ వైఖరులు వున్నప్పటికీ, భూసమస్యమీద మాత్రం వారిది మితవాద సంస్కరణవాదమే. ఇదికూడా కేంద్రకమిటీ అంగీకరించిన అభిప్రాయమే. రోజువారీ పనిలో రైతాంగానికి సంబంధించిన అత్యంత ముఖ్యమైన సమస్యలపై తీవ్రమైన భేదాభిప్రాయాలు ఏర్పడినప్పుడు [రాజేశ్వరరావు దీన్ని గుర్తించకపోవడం ఆశ్చర్యకరం] ఆ భేదాభిప్రాయాలను పార్టీ కమిటీలో చర్చించకుండా రావి నారాయణరెడ్డి, ఎల్లారెడ్డిగార్ల గ్రూపు అజ్ఞాతవాసంలోవున్న కేడరు దుస్సాహసిక చర్యలను కొనసాగించుతున్నారంటూ పూర్తిగా తప్పుడు ప్రచారాన్ని కొనసాగించుతున్నారు."

["మన విభేదాలపై 1953 లో సుందరయ్య రాసిన లేఖనుండి]

ఇంక చివరికి, రాజేశ్వరరావు కార్యదర్శిగా వున్న ఆంధ్రకమిటీ నాయకత్వం ఈ విచ్ఛిన్నకర విధానాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు సిద్ధంగా లేకపోవడం—అలాగే కేంద్రకమిటీకూడా అజ్ఞాతవాసంలోవున్న సమరయోధుల దృక్పథాన్ని రాజకీయంగా సమర్థించుతూనే ఆచరణలో దాన్ని అమలుపరచ డానికిగాని, కనీసం తమ అభిప్రాయాన్ని లిఖితపూర్వకంగా యివ్వడానికిగాని సిద్ధం కాకపోవడం – తెలంగాణా, ఆంధ్రకమిటీలు వేరువేరుగా పనిచేస్తూ వుండటం – ఇవన్నీ చూసిన తరువాత, ఇంక ప్రయోజనం లేదని భావించి కామ్రేడ్స్ సుందరయ్య, బసవపున్నయ్య తిరిగి ఆంధ్రప్రాంతానికి వచ్చేశారు. మళ్ళీ 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాతనే తిరిగి ఐక్యపార్టీ కమిటీ అమలులోకి వచ్చింది.

# ఉపసంహారం

తెలంగాణా ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టులు ఒక రాజకీయశక్తిగా తయారై, భూస్వామ్య వ్యతిరేక, నైజాం వ్యతిరేకపోరాటానికి నాయకత్వాన్ని స్వీకరించి ఇప్పటికి 30 ఏళ్లు అయింది తాము సాగుచేసుకొంటున్న భూములను సంరక్షించుకునేందుకూ, భూస్వాముల సాయుధ దాడులను, నైజాం సాయుధ బలగాలను ఆ తరువాత యూనియన్ సైన్యాల జోక్యం అనంతరం భారత ప్రభుత్వాన్ని ప్రతిఘటించేందుకు రైతాంగ జనసామాన్యం ఆయుధాలను చేబట్టి ఇప్పటికి పాతికేళ్లకు పైగా అయింది ఆ వీరోచిత సాయుధ గెరిల్లా పోరాటాన్ని ఉపసంహరించుకొని ఇప్పటికి 20 ఏళ్ళకుపైగా అయింది పోరాటం 1951 అక్టోబరు 21 వ తేదీన ఉపసంహరించుకోబడింది రెండుదశాబ్దాల సుదీర్ఘకాలం అనంతరం ఇప్పుడు *"తెలంగాణా ప్రజల పోరాటం - దాని గుణపాఠాలు"* అన్న చారిత్రక గ్రంథం మనం రాస్తున్నప్పుడు, ఇప్పుడు 1972 లో ఆ ప్రాంతంలో ప్రజాఉద్యమం పరిస్థితి ఎలా వున్నదనే విషయాన్ని తెలుసుకోవడం కనీసం అవసరం కమ్యూనిస్టుపార్టీ స్థితి అక్కడ ఇప్పుడెలావుంది, ఆనాడు ఉద్యమంలో ప్రధానంగా పాల్గొన్నవారూ, ఉద్యమ నాయకుల పరిస్థితి ఇప్పుడేమిటి ? పోరాటాన్ని విరమించిన తరువాత అనుసరించబడిన ఎత్తుగడలన్నీ సరియైనవేనా ? లేక వేరే ఏమైనా ప్రత్యామ్నాయ చర్యలను తీసుకొని వుండవలసిందా ? కనీసం ఇప్పుడున్న పరిస్థితికంటే మెరుగ్గా వుండేందుకుగాను మనం ఇంకేమి చేసివుండవలసింది ? లేక ఇదంతా అనివార్యమేనా ? మన దేశంలో విప్లవోద్యమాభివృద్ధికిగాను భవిష్యత్తులో చర్యలు తీసుకొనేందుకు ఆ పోరాటాన్నుండి మనం తీసుకోవలసిన గుణపాఠాలేమిటి ?

మన ముందుకొచ్చిన సమస్యలలో ఇవికొన్ని. నా అభిప్రాయాలను, అనుభవాలను సమీక్ష చేస్తా.

ఈనాటికికూడా - 20 సంవత్సరాలకుపైగా కాంగ్రెసు ప్రభుత్వం తుపాకుల సహాయంతో తిరిగివచ్చిన భూస్వాములు అదేరీతిలో హత్యాపూరితమైన దాడులను చేస్తున్నప్పటికీ, తమదైన ఆ కాంగ్రెసు ప్రభుత్వాల సహాయ సహకారాలలో దాడులను కొనసాగించుతున్నప్పటికీ, మన పార్టీ అయిన

కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) పలుకుబడిలోనూ, నాయకత్వంలోనూవున్న సుమారు 300 గ్రామాల్లో ఈ నాటికీ తెలంగాణా రైతు ఉద్యమం జవసత్వాలు గలిగి బలంగానేవుంది. తెలంగాణా ఉద్యమం అత్యున్నతస్థాయిలో వున్నప్పుడు దాదాపు 3000 గ్రామాల్లో పార్టీ నాయకత్వ స్థానంలో వుండేది. ఇప్పటికి కూడా రైతు ఉద్యమం నల్లగొండ జిల్లాలోని అయిదు తాలూకాల్లోనూ, వరంగల్-ఖమ్మం జిల్లాలకు చెందిన మరో అయిదు తాలూకాల్లోనూ బలమైన శక్తిగా వుంది. ఈ జిల్లాలలోనూ, ఇంకా ఇతర జిల్లాలలోనూ విస్తరించిన మన ఉద్యమానికి లోతుగా పునాదులు పడలేదు అందువలన అణచివేయబడింది. మితవాద కమ్యూనిస్టులకు కూడా దేవరకొండ, నర్సపూర్, అదిలాబాద్, సిరిసిల్ల, వరంగల్ తాలూకాల్లో (ఇది ఒక్కొక జిల్లాలో ఒక్కొక్క తాలూకా) తగినంత పలుకుబడి వుంది.

ఈ ప్రాంతాల్లోనూ, అలాగే మొత్తం తెలంగాణాలోనూ, ఆ మహత్తర పోరాటం సాధించిన ఫలితాలను జనసామాన్యం ఏ మేరకు అనుభవించినప్పటికీ అదంతా భూస్వాముల, కాంగ్రెసు ప్రభుత్వంయొక్క క్రూరమైన నిర్బంధ విధానాన్ని దీక్షతో నిర్విరామంగా వీరోచితంగా ప్రతిఘటించిన కారణంగానే గాని, కాంగ్రెసు మంచి పరిపాలనవలన కానేకాదు.

ఉద్యమానికి చెందిన పాత ఏరియాలో అత్యంత తీవ్రమైన దెబ్బ తగిలింది. వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలో. ఈనాడు కాంగ్రెసు బురఖా తగిలించుకొన్న పాతకాలపు శక్తివంతులైన దేశముఖులు, భూస్వాములు ఇక్కడ రైతాంగ ఉద్యమంపై అత్యంత క్రూరమైన హింసాకాండను ఒక క్రమ పద్ధతిలో సాగించి, దాన్ని అణచివేశారు. ఈ భూస్వాముల బీభత్స ఎత్తుగడలను మనం తిప్పికొట్టలేకపోయాం. మన చురుకైన కార్యకర్తలలో చాలమందిని మాటిమాటికి చావబాదడంతోనూ, వారి స్వాధీనంలోవున్న ఆస్తులను లూటీచేయడంవల్లనూ తప్పనిసరై వారు భూస్వాములతో రాజీపడిపోయారు. కొంతమంది వారితో ఏకమై పార్టీపైనా, ప్రజలపైనా వారితో కలిసి దాడి చేశారుకూడా. దీనికితోడు భూస్వాములు నక్కజిత్తులనుకూడా చేబట్టారు. పంచాయితీలలో కొన్ని స్థానాల నివ్వడం, ప్రజల్లోని కొన్ని తరగతుల వారికి కొన్ని సదుపాయాలను కలిగించి చీల్చి వారిని తమ వైపుకు తిప్పుకోవడం — ఇవన్నీ చేయడం ద్వారాకూడా ఉద్యమాన్ని కొంతవరకు విచ్ఛిన్నం చేయగలిగారు.

ప్రజాఉద్యమాన్ని కమ్యూనిస్టు పార్టీని అణచివేసి, తుడిచిపెట్టించేందుకు మనకు బలంగావున్న ఇతరప్రాంతాల్లోకూడా ప్రయత్నాలు జరిగాయి. గత అయిదు సంవత్సరాల కాలంలో హుజూర్‌నగర్ — సూర్యాపేట ఏరియా

లోనూ, ఖమ్మం – మధిర ఏరియాలోనూ, నర్సంపేట–ములుగు ఏరియాలోనూ ఈ దుర్మార్గ ప్రయత్నాలు మరింత ఉధృతం చేయబడ్డాయి. ఏదో ఒక క్రిమినల్ కేసులో పార్టీ నాయకులు, సాధారణ రైతులతోసహా వేలాదిమంది ఇరికించబడ్డారు. ప్రత్యేకంగా ఈ తప్పుడు పనికోసమే అక్కడ నియమించబడిన పోలీసుల, లంచగొండి పోలీసు ఆఫీసర్ల ఖచ్చితమైన తోడ్పాటుతో ఒక పథకం ప్రకారం పార్టీ సభ్యులపైనా, వారి యిండ్లపైనా గూండా దాడులను చేయించుతున్నారు. ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొని, మన పార్టీ యూనిట్లూ, శ్రామిక ప్రజలూ ఈ దాడులను ఎదుర్కొని, మహత్తరమైన త్యాగదీక్షతో ఉద్యమాన్ని సంరక్షించుకొనేందుకు ప్రయత్నించుతున్నారు.

అయితే, పాత తెలంగాణా రైతాంగ ఉద్యమం వున్న ప్రాంతాల్లోని సాంఘిక ఆర్థిక వ్యవస్థలోని మార్పులనుకూడా మనం దృష్టిలోకి తీసుకోవడం అవసరం.

ఉద్యమం కాలంలో గ్రామాలనుండి పారిపోయిన, లేదా తరిమి కొట్టబడిన భూస్వాములు తిరిగి వచ్చి గ్రామ సీమల్లో తమ స్థానాలను తిరిగి సంఘటిత పరచుకోగలిగారు. శేరీ భూములనబడే వాటిని చాలవరకు భూస్వాములు లాక్కోగలిగారు. అన్యాక్రాంతాల్లో చాలభాగమూ, పాత కౌలుదార్ల చేతుల్లో వున్న భూములనూ ఇతర ధనిక వ్యవసాయదారులకూ, కొంతమంది రక్షిత కౌలుదార్లకూ అమ్మకోగలిగారు. ఇలా కొనుక్కొనే హక్కు వారికి 1950 లోని భూచట్టం కింద, ఆ తరువాత తెలంగాణా రైతు ఉద్యమ ప్రభావంతోనూ లభించింది. రైతులూ, వ్యవసాయ కార్మికులూ సాగుచేసుకొంటున్న బంజరు భూములు వారికి కాకుండా చేయడానికి ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి. మరోవైపున త ము సాగుచేసుకొంటున్న ఈ భూములపై తమకు పట్టా హక్కు కావాలని నేటికీ తీవ్రమైన పోరాటాలు సాగుతూనే వున్నాయి. భూ గరిష్ట పరిమితి చట్టాలన్నీ కాగితాల మీదనే వున్నాయి. సీలింగుకు పై బడ్డ భూములను స్వాధీనం చేసుకొన్నదీలేదు, వాటిని పేదలకు పంచిందీలేదు.

అయితే, పూర్వంలోలాగా భూస్వాములు తమ పేరుమీద వేలాది యకరాలను వుంచుకోవడంగాని, లేదా పాత పద్ధతుల్లోనే కౌలుకు యివ్వడంగాని, లేదా బహిరంగ పద్ధతుల్లో పచ్చి భూస్వామ్య దోపిడీని సాగించడంగాని జరగడం లేదు. అమ్మకొన్నది పోగా యింకా మిగిలివున్న భూములను తమ బంధువుల మధ్య పంచివేసుకొన్నారు. దానితోబాటు డబ్బిచ్చి కూలీలను పెట్టుకొనడంద్వారా, ఆధునిక వ్యవసాయ పద్ధతులతో "స్వంత సేద్యాన్ని" ప్రారంభించారు. అయితే నేడు గ్రామ సీమల్లోవున్న పరిస్థితులనుబట్టి ఫ్యూడల్

రూపాల్లో దోపిడీని, వడ్డీలద్వారా, తక్కువ కూలిని చెల్లించడంద్వారా, పీడనను పరోక్షంగా కొంత వెట్టిచాకిరిని ఏదో ఒక రీతిలో ఉపయోగించుకుంటూనే వున్నారు

గ్రామసీమల్లో నూతన సంపన్నవర్గాలుగా ఈ భూస్వాములు అభివృద్ధిచెందారు పెట్టుబడిదారీ వ్యవసాయదారులుగాని, పెట్టుబడిదారీ భూస్వాములుగాని తమ పొలాల్లో శారీరకంగా కష్టపడి పనిచేయరు పూర్తిగా కూలీలచేతనే వ్యవసాయం చేయిస్తారు వాళ్ళుమాత్రం పైనవుండి అజమాయిషీ చేస్తారు. ధనికరైతులు కూడా తమ పొలాల్లో శారీరకంగా కొంత స్వయంగా పనిచేసినప్పటికీ హెచ్చుగా కూలీలపైననే ఆధారపడతారు ఆ విధంగా అదనపు ఆదాయాన్ని రెగ్యులర్‌గా సంపాదించగలరు

మధ్యతరగతి రైతాంగం కూడా కొంతవరకు తయారైంది. చిన్న చిన్న నదీ ప్రాజెక్టులకింద, నాగార్జునసాగర్ కాల్వలకింద, ఎలక్ట్రిక్ పంపులతో నడిపే బావులక్రింద సేద్యపు నీటివనరులు పెరగటంతో నూతన ధనిక, మధ్య తరగతి రైతాంగం పెంపొందింది.

భూస్వాములు తమ భూ యాజమాన్యపద్ధతులను, వ్యవసాయ పద్ధతులనూ మార్చడమేగాక, నానాటికీ పెంపొందుతున్న ప్రజాఉద్యమాలను దెబ్బతీసేందుకు అనుసరించవలసిన తమ ఎత్తుగడలనుకూడా మార్చివేశారు తమ క్రూరమైన బీభత్స పద్ధతులు, నిర్బంధ చర్యలతోపాటు ప్రజా ఉద్యమంలో వున్న వారిని చీల్చే ఎత్తుగడలనుకూడా చేబట్టారు భూములిస్తామని వాగ్దానాలు చేస్తారు నిజానికి కొన్ని కులాలను, మతాలను ప్రాతిపదిక చేసుకొని గ్రామసీమల్లోని కొన్ని తరగతుల ప్రజలకు, పచ్చిక బయళ్ళను, పోరంబోకులను, బంజరు భూములను యిస్తారుకూడా. ఇప్పటికే భూములను సాగుచేసుకుంటూ కిసాన్, లేదా వ్యవసాయ కార్మిక సంఘం, లేదా కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి కిందగల వారిపై, మరో తరగతికి చెందిన ప్రజలను రెచ్చగొడతారు.

మామూలు కల్లుగీతపని వారికి వ్యతిరేకంగా అబ్కారీ కాంట్రాక్టర్లను క్రియాత్మకంగా బలపరుస్తారు. ట్రాక్టర్లను కొనుక్కోవడానికి యిచ్చే రుణాలను, బావులకు సరఫరాచేసే విద్యుచ్ఛక్తిని, ఎరువులూ వగైరాలను, కమ్యూనిటీ ప్రాజెక్టులనూ, సహకార సంఘాలను వినియోగించుకొని మధ్య, ధనిక రైతాంగంపై తమపలుకుబడిని పెంచుకుంటారు. వివిధ ప్రభుత్వడిపార్టుమెంటులలోని కీలకమైన పరిపాలనా పదవుల లన్నింటిపై గుత్తాధిపత్యాన్ని సంపాదించుకోవడానికి ప్రయత్నించుతారు గ్రామపంచాయితీలపైనా, పంచాయితీసమితుల

పైన, జిల్లా పరిషత్తులపైనా ఆధిపత్యాన్ని సంపాదించుకొని ఈ స్థానిక సంస్థల ద్వారాఅన్ని లాభాలనూ పొందడానికి, ఎలాంటి అవినీతికరమైన పద్ధతుల కైనా సిద్ధపడతారు.

వాటితోపాటు, గ్రామాలపై పెత్తనాన్ని సాగించడానికి ఈ చర్య లన్నీ ఇంకా సరిపోకపోతే మొత్తం పోలీసుల, ఇతర ప్రభుత్వ యంత్రాంగం యొక్క మద్దతుతో గూండా చర్యలకు సహితం పాల్పడతారు.

ఈ అన్ని కారణాలవలన మన ఉద్యమమూ, పార్టీ ప్రధానమైన స్థానంలోవున్న ఈ 300 గ్రామాల్లోకూడా పల్లెటూరు పేదల్లో గణనీయమైన కొంతభాగమూ, మధ్య తరగతి ధనిక రైతాంగంలో హెచ్చుమందీ కాంగ్రె సుతో వున్నారు. గ్రామాల్లో ఏర్పడిన ఈ నూతన వర్గశక్తుల కలయికను గురించి నిర్దిష్టంగా పరిశీలనచేసి, బలహీనతలను అధిగమించి, శత్రువు పన్నాగాలను ఓడించి, ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోయేందుకు అవసరమైన నిర్దిష్ట ఎత్తుగడలను మనం చేబట్టవలసివుంటుంది

యదార్థానికి, భూస్వాముల భూములను స్వాధీనం చేసుకొని, సాగు చేసుకొనేవారికి వాటిని పంచిపెట్టగలిగిన కార్యక్రమాన్ని ఆచరణలో చేపట్ట గలిగినంత బలమైనస్థితిలో నేటి వ్యవసాయికవుద్యమంలేదు తమ స్వాధీనంలో వున్న భూములను కాపాడుకొనే స్థితిలోనూ, బంజరు భూములను సాగుచేసు కొనేహక్కు కొనసాగించుకొనే స్థితిలోనూ, లేదా రెండు దశాబ్దాల కాలం క్రితం మనం డిమాండ్‌చేసి అమలుపరచిన ఆ ప్రాంత కనీస వేతనాలను వ్యవ సాయ కార్మికులకు చెల్లించాలనే డిమాండ్ చేసేస్థితిలో మాత్రమే నేడు మన ఉద్యమంవుంది

## ఇతర రంగాల్లో

తెలంగాణా పోరాటకాలంలోకూడా కార్మికవర్గంలో విప్లవో ద్యమమూ, ముఖ్యంగా మనపార్టీ బలహీనంగానేవుండేది. నేటికికూడా అలా బలహీనమైన స్థితిలోనేవున్నాం హైద్రాబాద్ పారిశ్రామిక ప్రాంతంలోనూ, బెల్లంపల్లి – సిరిపూర్ ప్రాంతంలోనూ, ప్రభుత్వ మధ్యతరగతి ఉద్యోగులలో, ఉపాధ్యాయులలో, షాపు గుమాస్తాల్లో మన నిర్మాణమూ, ఉద్యమమూ కూడా నేటికి బలహీనంగానే వుంది వారందరిపైనా ప్రధానంగా కాంగ్రెసూ, వేరు వేరు ఇతర రాజకీయ, కుల సంబంధమైన నాయకులు ఆధిపత్యాన్ని సాగించ గలుగుతున్నారు వారిలో వామపక్ష ప్రజాతంత్ర పార్టీలుగాని, కమ్యూనిస్టు పార్టీగాని ప్రధానమైన శక్తిగాలేవు.

మొత్తంగా ఈ దశలో మన ఘోరమైన వైఫల్యమేమంటే, బలమైన ప్రజాతంత్రయుతమైన విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించుకోలేకపోవడమే. కనీసం విద్యావంతులైన యువతరంతో – పెటీబూర్జువా మేధావులతో లోతైన సంబంధాలను సహితం పెట్టుకోలేకపోయాం.

ఈ కారణంగా ఈ యువతరాన్నీ, కార్మికవర్గాన్ని, మధ్యతరగతి ఉద్యోగులనూ తమలోకి ఆకర్షించుకోగలిగింది విప్లవశక్తులుకాదు, వివిధ అభివృద్ధినిరోధకశక్తులే. దీని ఫలితాన్ని ఇటీవల సాగిన "ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర" ఉద్యమంలో చూడగలం. ఈ వేర్పాటు ఉద్యమానికి నాయకత్వం వహించింది మొదటినుండీ తెలంగాణా రైతాంగ ఉద్యమాన్ని, ప్రజల ప్రజాతంత్రవాంఛలను, భాషారాష్ట్రాల నిర్మాణాన్ని, ప్రజాతంత్ర ప్రాతిపదికపై జాతుల ఐక్యతను వ్యతిరేకించుతూవచ్చిన భూస్వాములు, అభివృద్ధినిరోధక బడా వ్యాపారవర్గాలవారే విద్యార్థులూ, ప్రభుత్వ, తదితర మధ్యతరగతి ఉద్యోగులూ అవాస్తవికమైన ఊహలతోనూ, అసత్య హామీలతోనూ కొట్టుకొనిపోయారు. ఒకప్పుడు భాషా రాష్ట్రాల నిర్మాణానికి తన బలంతో ప్రభుత్వంచే అంగీకరింపజేయగలిగిన ఆ మహత్తర ప్రజాతంత్ర ఉద్యమం అదే ప్రాంతంలో ఎంతగా బలహీనపడిపోయిందంటే, అందుకు వ్యతిరేకమైన నినాదం అభివృద్ధినిరోధకుల అండదండలతోనూ, వారి నాయకత్వంతోనూ ముందుకొచ్చింది. అయితే, మరల కమ్యూనిస్టుపార్టీకి బలమైన కేంద్రాలుగా వున్న నల్లగొండ, ఖమ్మం జిల్లాలలోనే ఈ వేర్పాటు ఉద్యమాన్ని ఎదుర్కొనేందుకు ప్రజలు సమాయత్తులై ముందుకువచ్చారు.

ఇదంతా ఎందుకు జరిగినట్లు? ఇదంతా అనివార్యమేనా? ఈ పరిస్థితి రాకుండా పార్టీ ఏమైనా చేసివుండవలసిందికాదా? లేక ఒక్కొక్క ఏరియా వేరు వేరుగా ఉరకలతో ముందుకురావడం ఆ తరువాత పాలకవర్గాలు వాటినిఅణచివేసి, చాలా కాలంవరకు మరల అవి తలెత్తకుండా చేయగలగటం జరుగుతోందా? విప్లవ ప్రజాతంత్ర ఉద్యమాన్ని సంఘటితపరచుకొని ఇతర ఏరియాలుకూడా దానితో జతపడేంతవరకూ బలమైన ప్రాంతాలను సంరక్షించుకొనే అవకాశంలేదా? ఆ విధంగా పాలకవర్గాల రాజ్యాధికారంపై చావుదెబ్బ కొట్టి, కార్మికవర్గ నాయకత్వాన జనతా ప్రజాస్వామికాన్ని నెలకొల్పే అవకాశం లేదా?

## కొన్ని వైఫల్యాలు

సాయుధ పోరాటాన్ని విరమించిన తరువాత తెలంగాణా రైతాంగం స్వాధీనంలోవున్న భూములను సంరక్షించుకొనే సమస్యపై తెలంగాణాలోని

మన పార్టీ నాయకులమధ్య తీవ్రమైన విభేదాలు ఏర్పడిన విషయాన్ని ఇంతకు ముందే నేను ప్రస్తావించివున్నాను. నెహ్రూ ప్రభుత్వం జోక్యం కల్పించు కున్న తరువాత భూమిని సాయుధ పోరాటంతో సంరక్షించుకోవడానికి వ్యతిరే కించినవర్గం ఆ క్లిష్టపరిస్థితుల్లోకూడా సాధ్యమైన హెచ్చుసదుపాయాలను రైతాంగాన్ని సమీకరించడంద్వారా సాధించుకోవడానికి బదులు ప్రధానంగా భూస్వాములతో రాజీపడటానికే ప్రయత్నించిన విషయాన్నికూడా ఇంతకు ముందే చెప్పివున్నాను.

భూమిని కాపాడుకోవాలనే సమరశీల విధానాన్ని మనం చేబట్ట లేదు. ఆ విధంగా వ్యవసాయక జనసామాన్యం ముందు, మొత్తం ప్రజాతంత్ర ఉద్యమం ముందుకు భూ సమస్యనే ప్రధానమైన సమస్యగా మనం తీసుకొని రాలేక పోయాం. మొత్తం పార్టీఅంతా, ఒక్క తెలంగాణాలోనేగాక యావత్తు దేశంలోనే మొత్తం భారత దేశ విప్లవోద్యమ భవిష్యత్తు అభివృద్ధిని గురించిన సరియైన అవగాహనను కలిగివుండివుంటే అలా చేయగలిగివుండే వారం అలాకాకుండా పార్టీలో కొంతభాగం నెహ్రూ ప్రభుత్వంయొక్క అభ్యుదయకర విధానాలపై గొప్ప ఆశలను పెట్టుకొని, రాజ్యాంగ బద్ధమైన పార్లమెంటరీ విధానంతో అబివృద్ధిని సాధించగలమనే వైఖరినిచేబట్టడం జరిగింది!

మనదేశంలో విప్లవ ప్రజాతంత్ర ఉద్యమం అత్యంత అసమానంగా అభివృద్ధి చెందినదన్న విషయాన్ని మనపార్టీ అవగాహన చేసుకొని వుండ వలసింది. అందుకనుగుణ్యంగా ముఖ్యమైన కొన్ని కీలక ప్రాంతాల్లో ఉద్య మాన్ని సర్వతో ముఖంగా, అన్ని రంగాల్లో అభివృద్ధి చేసేందుకు అవసరమైన ఎత్తుగడలపైననే మనం కేంద్రీకరించి పనిచేసివుండవలసింది మొదట వాటిని నిజమైన రాజకీయ కేంద్రాలుగా అభివృద్ధి చేయాలి. అవే ఇతర ప్రజాతంత్ర శక్తులకు ఆదర్శమై, ఉత్తేజపరచి వాటి కార్యచరణకు మార్గదర్శకం కాగలవు.

ఇంక ఇతర ప్రాంతాల్లో ఇతర ప్రజాతంత్రశక్తులతోనూ, పార్టీల తోనూ, ప్రజాసంఘాలతోనూ మనం అత్యంత సన్నిహిత సంబంధాలను నిర్మించుకొని వుండవలసింది ఆ శక్తులు, ఆ పార్టీలు ఎంతగా వూగిసలాట వైఖరిని అనుసరించినా, చివరికి అనేక సందర్భాల్లో వెనకచూపుచూచే వైఖరిని అవలంబించేవే అయినా, మెల్లగా, క్రమక్రమంగా అవి సరియైన విధానాల వైపుకు వచ్చేందుకు సహాయపడుతూ, ఉద్యమాన్ని అభివృద్ధి చేయాలి.

ఇంకమూడోది: పాలకవర్గాలూ, వారి ప్రభుత్వమూ ఎలాంటి నిర్బంధ విధానాన్ని, భీభత్స చర్యలను చేపట్టినప్పటికీ, అన్నికీలక రంగాల్లోనూ, అన్ని కీలక ప్రాంతాల్లోనూ పార్టీ తన అన్ని రకాల కార్యకలాపాలను కొన

సాగించడానికి వీలుగావుండే పద్ధతిలో పార్టీని అభివృద్ధి చేసుకోవాలి ఎలాంటి పరిస్థితుల్లోనైనా పనిచేయగలిగే స్థితిలో వుండేటట్లు పార్టీని తయారు చేసుకోవాలి. సన్నద్ధంలో వుంచుకోవాలి మనకున్న పార్లమెంటరీ భ్రమలతో ఈ కర్తవ్యాన్ని మనం నిర్లక్ష్యం చేశాం

# కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం

1 మన పార్టీ రాష్ట్రకమిటీ తీసుకొన్న నిర్ణయాల్లో అత్యంత వినాశకరమైన నిర్ణయం ఒకటున్నది. ఆ నిర్ణయాన్ని కేంద్ర నాయకత్వం ప్రోత్సహించి, ధృవపరచిందికూడా. అదేమంటే, పిరికితనాన్ని చూపిన వారిని, చివరికి పోలీసులకు లొంగిపోయిన వారిని, పార్టీ రహస్యాలను, రహస్య కేడరుకు, రహస్య నిర్మాణ వ్యవస్థకు సంబంధించిన సమాచారాన్ని శత్రువులకు తెలియజేసి ద్రోహంచేసిన వారినందరినీ, ముఖ్యమైన నాయకులతోసహా తిరిగి పార్టీలో జేర్చుకోవడం. అందుకు వారు చెప్పిన సాకు ఏమంటే; ఆనాటి అఖిల భారత నాయకులు పొంకెత్తు విధానాలను, దుందుడుకు పోకడలనూ అనుసరించి చాలా ప్రమాదానికి కారకులయ్యారు, అందువలన ఈ వ్యక్తులు శత్రువు యొక్క బీభత్స చర్యలను ఎదుర్కొనలేకపోయారు, కనుక పార్టీనుండి బహిష్కరించదగినంతనేరంవారు చేయలేదు అనేదే.ఆంధ్రలోజైళ్ళనుండివచ్చిన లీగల్ కామ్రేడ్స్ అజ్ఞాతవాసంలోవున్న కామ్రేడ్స్కంటే ముందుగా బయటకు వచ్చి, ఒక్క వోటు మెజార్టీతో ఈ నిర్ణయాన్ని తీసుకొన్నారు. హైద్రాబాద్ సంస్థానంలో బారత సైన్యం ప్రవేశించిన తరువాత తెలంగాణా సాయుధ ప్రతిఘటనను కొనసాగించి వుండటం తప్పనికూడా ఈ మెజార్టీ సభ్యులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అందువలన బలహీనతలను చూపెట్టిన వారినీ, ముందే పిరికితనంతో వ్యవహరించిన వారినీ, పచ్చిగా ద్రోహంచేసిన వారినీ పార్టీలోకి తిరిగి తీసుకోవచ్చుననే అభిప్రాయాన్ని వారు వెలిబుచ్చారు.

ఈ విధంగా పార్టీలోకి తిరిగి దూరగలిగినవారేగాక, తెలంగాణా పోరాటంలో ముమ్మరంగా పాల్గొని, అది ఉపసంహరించ బడిన తరువాత కాంగ్రెసులోచేరి, పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక ఏజెంట్లుగా తయారైన వారుకూడా వున్నారు

2 మరో తరహా కామ్రేడ్స్కూడా వున్నారు వారు నెహ్రూ ప్రభుత్వ జోక్యం అనంతరం సాయుధ పోరాటాన్ని కొనసాగించడాన్ని వ్యతిరేకించారు. దాదాపు వారంతా 1949 – 1951 మధ్యలో జైళ్ళలో వున్న వారే విడుదలైన తరువాత వారంతా తెలంగాణా ఉద్యమానికి వ్యతిరేకంగా

సాగిన ప్రచారంలో బాగా పాల్గొన్నారు. యదార్ధానికి వారంతా మితవాద వర్గానికి చెందినవారే. ఒక్కరుకూడా బిరుపోకుండా వారంతా ఆ తరువాత మితవాద కమ్యూనిస్టుపార్టీలో చేరారు

3. తెలంగాణా సాయుధ పోరాటం సాగినంతకాలమూ ప్రథమ శ్రేణిలో నిలబడి పోరాడినవారు మరికొందరున్నారు. కాని పార్టీకి లీగాల్టీ వచ్చిన తరువాత మితవాద కమ్యూనిస్టులతో వుంటేనే తమకు మంచిదనీ, వారి జాతీయ ప్రజాస్వామికం, కాంగ్రెసుతో సంయుక్త సంఘటన, శాంతి యుత పరివర్తనా మొదలుగాగల సిద్ధాంతాలతోనే సరిపెట్టుకోవడం మంచిదని వారు భావించారు.

4. ఇంకా మరికొంతమంది ముఖ్యమైన కామ్రేడ్స్ వున్నారు వారు మొదటినుండీ విప్లవదృక్పధాన్నే అనుసరించుతూ, సరియైన పార్టీ వైఖరికే కట్టుబడి వుంటూవచ్చారు కాని ఆ తరువాత విప్లవోద్యమాభివృద్ధికిగల సుదీర్ఘ కాలస్వభావంతో విసిగెత్తిపోయారు అందుకవసరమైన భౌతిక పరిస్థితులు వున్నాయా లేవా అనేదానితో నిమిత్తంలేకుండా వెనువెంటనే సాయుధ పోరాటాన్ని ప్రారంభించాలని కోరే చైనాపార్టీ సెక్టేరియన్ ధోరణిలోపడి వారు ఉగ్రవాదులుగా మారి, వివిధ నగ్జలైట్ గ్రూపులకు నాయకులయ్యారు

5. పోరాటం సాగినకాలమంతా అందులో పూర్తిగా నిమగ్నమై వుండి, ఆ తరువాత క్రమంగా రాజకీయరంగాన్ని విడిచిపెట్టి, తమ కుటుంబాలకై మంచి ఆదాయాలను సంపాదించుకుంటూ, రాజకీయేతరజీవితాన్ని గడుపుతున్నవారు చాలా మంది కామ్రేడ్స్ వున్నారు. తమ బిడ్డలసంఖ్య పెరిగినకొద్దీ జీవిత భద్రత కావాలనే వొత్తిడి ఎక్కువైనకొద్దీ, విప్లవాన్నే వృత్తిగా స్వీకరించి, అహోరాత్రులు పనిచేసిన దశనుండి పార్టు టైమర్‌గామారి ఇంక ఆ తరువాత సంపాదనలోనే నిమగ్నమై, కేవలం సానుభూతిపరులుగా మిగిలిపోయే ధోరణి ఒకటి కనిపిస్తోంది

పార్టీలో సభ్యులుగా జేర్చుకోవడంలో విప్లవ జాగరూకత లోపించడం ఇంకా కొనసాగుతూనేవుంది ఒక వ్యక్తియొక్క గతాన్ని జాగ్రత్తగా పరిశీలనలోకి తీసుకోకుండా, కొంత చొరవనూ, కొన్ని శక్తియుక్తులు ప్రదర్శించితే చాలు పార్టీలోకి మనం తీసుకొంటాం.

# మన కేడర్‌యొక్క సిద్ధాంత బలహీనతలు; సమరశీలురతోనూ, పార్టీసభ్యులతోనూ సంబంధాలను పెట్టుకొని అభివృద్ధి చేయడంలో వైఫల్యం

1. ఇదంతా చూస్తే, నాయకత్వ స్థానంలో వున్న కేడరుకుకూడా సిద్ధాంత పరిజ్ఞానం కొరవడిందని, సిద్ధాంతాన్ని నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించ గల శక్తి చాలావరకు లోపించినదని స్పష్టమవుతుంది. ఈ కారణంగా జీవి తాంతం ఓర్పుతో విప్లవ కృషిని కొనసాగించలేకపోవడం, అన్ని పరిస్థితుల్లో, ఎప్పటికప్పుడు పరిణామం చెందే క్లిష్టమైన జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్లో తన ఖచ్చితమైన స్థానం ఏమిటో తెలుసుకోగలిగిన స్థితిలో కేడరు వుండ లేక పోవటం జరుగుతోంది.

మన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ముందుకు పోవడం, మళ్ళీ అంత లోనే తిరోగమించడానికి గల కారణాలలో ఒకటి నాయకత్వ స్థానంలోవున్న మనకేడరును సహితం సిద్ధాంత రీత్యనూ, రాజకీయంగానూ అభివృద్ధి చేసుకోవ డంలో వైఫల్యాన్ని పొందడమే.

2. తెలంగాణాలో గత రెండు దశాబ్దాలుగా జరిగిన విషయాలను పునఃపరిశీలించుకొంటే మనలను మనం నిందించుకోవలసిన అవసరం కనపడు తుంది. ఎందువల్లనంటే, తెలంగాణా పోరాటం కొనసాగినంతకాలమూ అనేక బాధలు పడినవారూ, లెక్కలేనన్నిసార్లు శారీరకంగా చిత్రహింసలకూ, అవమా నాలకు గురయిన వారూ, సుదీర్ఘకాలం జైలు జీవితాలను గడిపిన సమరశీలురూ వేలాది సంఖ్యలో వున్నారు. కాని వారందరితో మనం నిత్యసంబంధాలను పెట్టుకోలేకపోయాం. కాంగ్రెసు పాలనపట్ల వారికిగల క్రోధాన్ని అలాగే పెంచుతూ, కాంగ్రెసు పాలనకూ, దాని విధానాలకూ వ్యతిరేకంగా పోరాడే యోధులుగా వారిని అభివృద్ధి చేసుకోకపోయాం. గ్రామస్థాయిలో వారిని ప్రజాసంఘాల్లో పనిచేసేటట్లు ఆకర్షించలేకపోయాం. ఆ విధంగా వారిని పోరాటు కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొనే వారుగా మనం అభివృద్ధి చేయలేక పోయాం. అలాంటి వేలాది సమరశీలురలో ఎంత చెప్పుకొన్నా బహు కొద్ది మందిని మాత్రమే మనం ప్రజాసంఘాల్లోకి, రాజకీయ కార్యకలాపాల్లోకి తీసుకొనిరాగలిగాం.

3. దీన్నంతా మనం సాధించాలంటే గ్రామాన్నుండి పైవరకూ గ్రామశాఖ లేదా కొన్ని గ్రామాలకుకలిపి ఒక శాఖ చురుగ్గా పనిచేసేందుకు

వీలుగా క్రమపద్ధతిలో పార్టీ నిర్మాణం వుండవలసినమాట నిజమే అలాంటి పదుల సంఖ్యలోగల పార్టీశాఖలకు సారథ్యం వహించి నడపగలిగిన శక్తి సామర్థ్యాలుగల ఒక స్థానికకమిటీ, అలాగే యీ స్థానిక కమిటీలకు సలహాలనిచ్చి నడపగలిగిన ఒక జిల్లా కమిటీ వుండాలి అలాంటి పార్టీ నిర్మాణపద్ధతిని మనం అభివృద్ధిచేసుకోలేక పోయాం. మనం నిజమైన విప్లవపార్టీ నిర్మాణ ప్రాతిపదికపైగాక, జనరల్ బాడీ సమావేశాల ద్వారా బహిరంగసభలూ, పార్లమెంటరీ, పంచాయితీ రూపాల్లోనే మనం పనిచేశాం.

4. సమరశీలశక్తుల మాటలావుంచి, కనీసం పార్టీసభ్యులను, కేడరునైనా విజ్ఞానవంతులనుచేసి, సిద్ధాంత రీత్యా అభివృద్ధి చేసుకోకుండా నిర్లక్ష్యం చేశాం.

మనం ఇంత నిర్లక్ష్యంగా వ్యవహరించినప్పటికీ, నాయకత్వం స్థానంలోవున్న కేడరూ, పార్టీ సభ్యులు అభివృద్ధిచెంది, నేడు ఉద్యమానికి నాయకత్వం వహించగలుగుతున్నారంటే అది ప్రధానంగా వారి వ్యక్తిగత దీక్ష, శక్తిసామర్థ్యాలు, ఉద్యమంలోవుండి తప్పొప్పులతోకూడిన దీర్ఘకాల అనుభవం పొందటమే అందుకుకారణం. వారిని సిద్ధాంతరీత్యా విజ్ఞానవంతులను చేయడానికిగాని, ఉద్యమానికి సంబంధించిన ఆచరణపూర్వకమైన బాధ్యతలను నిర్వహించడంలో తగినశిక్షణ యివ్వడానికిగాని చైతన్యపూరితమైన, నిర్మాణయుక్తమైన కృషిజరగనేలేదు.

5. అందుల్లనే, ఏదో ఒక ఏరియాలో అలాంటి ఒక ప్రధానమైన పార్టీ కార్యకర్త పనిచేయడం మానినా లేక వూగిసలాడినా, లేక అనేక వొత్తిడులఫలితంగా పార్టీనివిడిచి పెట్టినా ఇంక ఆ ప్రాంతమంతా, అనేకమంది పార్టీ సభ్యులతోసహా అతనితోపాటు పార్టీనుండి వెళ్ళిపోవడం జరుగుతున్నది. దానితో ఉద్యమమూ, పార్టీకూడా విపరీతంగా నష్టపడిపోతుంది, చివరికి ఆ ఏరియాలోనే మనకు ఏమీలేకుండా పూర్తిగా పోతుంది.

## నేటి మన కర్తవ్యాలు

ఇంక ఇప్పుడు, తెలంగాణా పోరాటంలో పాల్గొన్న 1942 లోని పాత తరానికి చెందినవారు (అప్పుడు వారి వయస్సు 18 నుండి 35 ఏండ్ల వరకూ వుండేది) ముసలివారై పోయారు, లేదా చనిపోతున్నారు. మరి వారి స్థానాలను స్వీకరించేందుకు రెండు తరాలకు చెందిన కేడరును అభివృద్ధి చేసుకొని వుండవలసింది. చివరికి కింది స్థాయిలోకూడా అలాంటిది సంతృప్తికరంగా

జరుగుతున్నట్లు మనకు కానరావడంలేదు. వారందరినీ పార్టీలోకి తీసుకొనివచ్చి అభివృద్ధిపరచి త్వరత్వరగా ఉన్నత నాయకత్వానికి ప్రమోట్ చేయకపోతే, ఉద్యమం అంతగా అభివృద్ధి చెందజాలదు

నిర్మాణానికి, సిద్ధాంతరీత్యా అభివృద్ధికి, ముందుకుపోయిన ఉద్యమాల సంరక్షణకూ, ఇతర ఏరియాల్లోనూ, ఇతర రాష్ట్రాల్లోని ఉద్యమాలను అభివృద్ధి చేసుకోవడంలాంటి వాటికి సంబంధించిన ఖచ్చితమైన సమస్యలను మనం ఎదుర్కొంటున్నాం. తెలంగాణా పోరాటాన్నుండి మనం నిజంగానే సరైన గుణపాఠాలను తీసుకొని, ఆయా రాష్ట్రాల్లోని నిర్దిష్ట పరిస్థితులకు అన్వయింప జేసుకొంటే, మనం నేడు ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలకు తెలంగాణా అనుభవాలు సహాయకారిగావుండగలవని మేము ఆశించుచున్నాం.

# అనుబంధం - 1

# వ్యవసాయ కార్మికుల, పేదరైతుల స్థితిగతులు

[ 1948 - 51 మధ్యకాలంలో తెలంగాణాలోని వివిధ పోరాట ప్రాంతాలలో వ్యవసాయ కార్మికుల, పేదరైతుల స్థితిగతులకు సంబంధించిన కొన్ని వివరాలను ఆంధ్రమహాసభ, మన దళాలు ప్రజా సమీకరణకు ప్రాతిపదికగా జేసుకున్న డిమాండ్లను దిగువ నిస్తున్నాం. కొలదిమంది భూస్వాముల చేతుల్లో భూమి కేంద్రీకృతమై వుండగా, దానికి భిన్నంగా రైతాంగంయొక్క పరిస్థితులెలా అధ్వాన్నంగా వున్నదీ వాటివల్ల విదితం కాగలదు. ]

**హుజూర్‌నగర్ తాలూకా**

జానపాడు కేంద్రంలో పనులు ముమ్మరంగావుండే తరుణంలో వ్యవసాయ కార్మికులకు కూలి రోజుకు మూడుశేర్లు, పనుల వొత్తిడి అంతగా లేనితరుణంలో రోజుకు రెండుశేర్లు వడ్లుయిచ్చేవారు. (కొలత శేర్లు, తూకం గాదు). పాలేరుకు నెలకు 60 నుండి 80 శేర్ల వరకు, లేదా సంవత్సరానికి 7 నుండి 10 వరకు 75 కిలోగ్రాముల (వందశేర్ల) బస్తాలు వడ్లుయిస్తుండేవారు. భూస్వామి పొలంపనులన్నీ నిర్వర్తిస్తూ ఎంతో నమ్మకస్తుడుగా పరిగణించ

బడుతూ, బాగా ఎక్కువజీతం పొందుతున్నాడనుకునే పాలేరుకు మూడు పూటలా అన్నంబెట్టి సంవత్సరానికి వందరూపాయలిస్తుండేవారు

మరింత సారవంతమైన భూములుగల మట్టంపల్లి కేంద్రంలోను, కాపుగల్లు కేంద్రంలోను, విజయనగర కేంద్రంలోని కొన్ని గ్రామాలలోను, నల్లరేగడి నేలలున్న ప్రాంతంలోనూ రోజుకూలి పనులవొత్తిడి తక్కువగా వుండే తరుణంలో మూడుశేర్లవడ్లు లేదా రెండుశేర్ల జొన్నలు, పనులు ముమ్మరంగావుండే తరుణంలో రోజుకు ఆరుశేర్లవడ్లు లేదా ఒకసారి భోజనం పెట్టి మూడుశేర్ల జొన్నలివ్వటం జరుగుతుండేది ఆ ప్రాంతాలలో వేతనాలు ఆ రెండురేట్లకుమధ్య తరతమ భేదాలలో వుండేవి ఆ ప్రాంతాలలో పాలేర్లకు రోజుకు మూడుపూటలా అన్నంబెట్టి ఏడాదికి వందనుండి నూటయిరవై రూపాయలవరకు, అన్నంపెట్టకుండా అయితే మూడువందల రూపాయలు యిస్తుండేవారు.

## అప్పులు - వడ్డీరేట్లు

వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు అప్పులు దొరకటమే కష్టంగా వుండేది అందువల్ల, మాసూళ్ళ తరుణంలోనో, పనులు ముమ్మరంగా వుండే యితర సమయంలోనో తమకు పనులు దొరికినప్పుడు రూపాయకు మూడుశేర్లు చొప్పున జొన్నలు, రూపాయకు ఐదుశేర్లు చొప్పున వడ్లు యిచ్చి అప్పు తీర్చుకుంటామని వాగ్దానం చేయవలసి వచ్చేది. ఆ మాసూళ్ళ తరుణంలో సాధారణంగా రూపాయకు మూడుశేర్ల వడ్లు, రూపాయకు రెండుశేర్ల జొన్నలు యిస్తుండేవారు.

అదేవిధంగా, వ్యవసాయ కార్మికులుకూడా, ఏప్రిల్-జూన్ మధ్య కాలంలో, అంటే వారి కెలాంటి పనులు దొరకని వేసవికాలంలో అప్పులు తీసుకొని, వాటిని తీర్చటానికిగాను అక్టోబరు-నవంబరు నెలల్లో వేరుశనగ మాసూళ్ళ తరుణంలో వేరుశనగ పీకి, కాయలు కోసినందుకుగాను 44 శేర్లకు 10 నుండి 14 అణాలు (60 పైసలనుండి 85 పై). చొప్పున అతిస్వల్పమైన వేతనం తీసుకుని పనిజేస్తామని వాగ్దానం జేయవలసి వచ్చేది.

పేదరైతులు, చిన్నరైతులు అప్పులు సంపాదించుకొనటంకోసం, సాధారణంగా పుట్టి వంద రూపాయల ధర వుండే వేరుశనగకాయను, పంటలు రాగానే పుట్టి రు 60 నుండి రు 80 లు రేటుకు యివ్వటానికి మాట యివ్వవలసి వుండేది. అనేక సందర్భాలలో, నిరుపేదవర్గాలు, రూపాయకు నెలకు అణా వడ్డీ చొప్పున కలవారి యిండ్లలో ఆడవాళ్ళవద్ద చిన్న చిన్న మొత్తాలు అప్పుగా తీసుకుంటుండేవారు.

ధనిక రైతులకు మాత్రమే, నాటికి నెలకు రూపాయి, నూటికి సంవత్సరానికి 12 రూపాయల వడ్డీ చొప్పున అప్పులు లభించేవి.

దేవరకొండ తాలూకా

ఈ తాలూకాలో భూములు అంత సారవంతమైనవికాదు వర్షపాతం తక్కువ దిండిప్రాజెక్టు ప్రాంతంలో మినహాయిస్తే, నీటిపారుదల సౌకర్యాలు స్వల్పం. అలాంటి ఈ తాలూకాలో, రోజుకూలి, రెండుశేర్ల వడ్లు. జొన్న మాసూళ్ళకు, రెండుశేర్ల జొన్నలు రాలే జొన్నచొప్ప కట్టగాని, కంకులుగాని యిచ్చేవారు. వరి మాసూళ్ళ తరుణంలో రోజుకూలి మూడుశేర్లు వడ్లు యిచ్చేవారు.

పాలేర్లకు భోజనంపెట్టి ఏడాదికి రు 60 లు నుండి రు 80 ల వరకు యిస్తుండేవాళ్ళు. చిన్న కమతాలమీద పనిజేసే పాలేర్లకు భోజనం పెట్టి ఏడాదికి రు 30 ల నుండి రు 40 ల వరకు యిస్తుండేవాళ్ళు ఉద్యమంద్వారా ఈ వేతనాలలో మొత్తంమీద ఏడాదికి రు 20 లు అంతకంటే ఎక్కువా సాధించుకోవడం జరిగింది

దేవరకొండ, మిర్యాలగూడెంజోన్‌లో ధాన్యం నాగురేటువిపరీతంగా వుంది. కొత్తపంటలు వచ్చేముందు, ఎలాంటి పని దొరకక, పసులుంటూవుండే వ్యవసాయ కార్మికులు, పల్లెటూళ్ళలోని యితర పేదలూ శేరుకు శేరున్నర ధాన్యం చెల్లించే పద్ధతిలో ధాన్యం అప్పుతీసుకోవలసివచ్చేది. ధాన్యంఅప్పుగా తీసుకోవటానికి – తిరిగి చెల్లించటానికీ మధ్య వ్యవధి 15 రోజులనుండి 30 రోజులకు మించకపోయినప్పటికీ అంత అధిక వడ్డీ గుంజేవాళ్ళు.

వ్యవసాయ కార్మికులు సాధారణంగా రు 15 లు నుండి రు 30 ల వరకు అప్పు తీసుకుంటుండేవారు వారు నెలకు నూటికి రు 30 ల వరకు వడ్డీ చెల్లిస్తుండేవారు ఇదిగాక ఆ అప్పు సంపాదించటంకోసం వారు ఒక గొర్రెనో, మేకనో, కోళ్ళనో బహుమతిగా యివ్వవలసివచ్చేది పేదరైతులు సాధారణంగా యాభై, అరవై రూపాయల చొప్పున అప్పులు తీసుకుంటుండేవారు. వారు మాసూళ్ళ తరుణంలో ధాన్యం రూపంలో తీర్చుతుండేవారు వారు పండించిన పంటకు అతి తక్కువ ధరగట్టేవారు తద్వారా వాళ్ళనుండి గుంజే విపరీత వడ్డీని దాచిపెట్టేవారు. ధనిక రైతులు సయితం, అప్పుతెచ్చుకుంటే నూటికి సంవత్సరానికి రు 18 లు చొప్పున వడ్డీ చెల్లించవలసివచ్చేది.

## ప్రశ్నలు - సమాధానాలు

వేతనాల రేట్లు తదితర డిమాండ్లపై ఎదురైన ప్రశ్నలు, వాటికి దళ నాయకులిచ్చిన సమాధానాలు దిగువ నివ్వబడ్డాయి. ఇరవై సంవత్సరాలక్రితం సయితం, తక్షణ సమస్యలను సవ్యమైన వర్గప్రాతిపదకపై పరిష్కరించేందుకు స్థానిక కార్యకర్తలెలా తంటాలుపడిందీ వీటిద్వారా ఒకఅవగాహనకు రావచ్చు.

వేతనాల సమస్యపై దళాలు ఆందోళన సాగించాయి. మానూళ్ళ తరుణంలో రోజుకూలి మూడుశేర్ల ధాన్యం యివ్వాలని, స్త్రీలకు. పురుషులకు సమాన వేతనాలు చెల్లించాలని డిమాండ్ చేసేవారు. దీనిపై భూస్వాములనేక ప్రశ్నలు లేవనెత్తారు. పంటలు బాగా పండనప్పుడు మేము మూడుశేర్లు చొప్పున వేతనాలెట్లా యివ్వగలం? అవసరమైన దానికంటె ఎక్కువమంది వ్యవసాయ కార్మికులు పొలాలమీదికెగబడితే, వాళ్ళందరికీ మూడుశేర్లు చొప్పున ఎలా యివ్వగలం? స్త్రీలు, పురుషులుజేసినంతపని చేయలేరు–వాళ్ళకు సమాన వేతనాలెలా యివ్వగలం? ఇది ఇలా వుండగా మరోవైపున, కడుపులు కాలుతున్న రోజువారీ కూలీలు సమైక్యమవటం, సమ్మెజేయటం సాధ్యమేనా అని వ్యవసాయ కార్మికులుకూడా సందేహాలు వెలిబుచ్చారు. వేతనాలను ధాన్యమైతే కొలిచో, తూచో కాకపోతే రొక్కరూపంలోనో చెల్లించాలేగాని, పాతపద్ధతిలో జొన్నచొప్పగాని, వరిగడ్డిగాని ఒక కట్ట యివ్వటమో, ఒక పట్టెడో బుట్టెడో మిరపకాయలో, వడ్లో, తృణధాన్యాలో యివ్వటమో కూడదనే డిమాండ్ లేవనెత్తబడినప్పుడు, పేదరైతులు, చిన్న రైతులు ఆ విధంగా ఎలా చెల్లించగలరు? అందు కవసరమైన పెట్టుబడిగాని, నిల్వలుగాని వారి వద్ద వుండవుగదా అనే ప్రశ్న ఎదురయింది.

ఈ ప్రశ్నలన్నింటికీ దళనాయకులు దిగువవిధంగా సమాధానా లిచ్చేవారు ,

భూస్వామి గాని, ధనికరైతుగాని, పంటలు బాగావున్నప్పుడు నియమించినంతమంది కార్మికులను, పంటలు బాగాలేనప్పుడు నియమించరు. అందువల్ల మూడుశేర్ల కనీస వేతనం చెల్లించటంలో కష్టమేమీలేదు. అంతేగాదు, పనులులేని రోజులలోను, కరువుకాలంలోనూ, పంటలులేని రోజులలోనూ, మధ్యతరగతి రైతులు, ధనిక రైతులు సయితం చాలా తక్కువమంది కార్మికులనే నియమించుకుంటారు. అత్యవసరమైన పనులన్నీ వారి స్వంత కుటుంబ సభ్యుల శ్రమద్వారానే పూర్తిచేసుకుంటారు. వ్యవసాయకార్మికులలో అత్యధిక సంఖ్యాకులచేత పనిచేయించుకునేది భూస్వాములే. ఎంత పంట పండింది అనే దానితో నిమిత్తంలేకుండా, పనిజేసిన కార్మికుడు కొంత శ్రమ

శక్తిని ధారబోయవలసి వుంటుంది. అతని శ్రమలో తగ్గేదేమీలేదు. అందువల్ల ఎప్పుడు పనిచేయించుకున్నా, కార్మికునకు కనీసవేతనం పూర్తిగా చెల్లించవలసిందే.

దొరికిన మేరకు పని చేసుకుందామని పెద్దసంఖ్యలో రోజుకూలీలు మూగటం విషయం : వ్యవసాయ కార్మికులను సంఘటితపరచటంద్వారా, వాళ్ళు సమిష్టిగా బేరమాడే అవకాశ మేర్పడుతుంది. తమలో తాము పోటీ బడకుండా, తక్కువ వేతనాలకు పనిజేయటానికి సిద్ధమవకుండా, లభ్యమైన పనిని వేర్వేరు ముఠాలు వంతులవారీగా పంచుకోవచ్చు. అంతేకాదు. వేతనాల సమస్య నొక్కదానినే తీసుకుంటే సమస్య పరిష్కారంకాదు. అందువల్ల, భూ సమస్యను 'దున్నేవానికే భూమి' నినాదాన్ని తక్షణమే చేపట్టవలసిన అవసరంవుంది.

తిండిగింజలు నిల్వ ఏమీలేక, నిరాధారంగా వున్నవారిని సమ్మెలోకి రాబట్టం సాధ్యంకాకపోతే, వారిని లెక్కలోకి తీసుకోకుండా, సమ్మె పోరాటం సాగించాలని ఒక దళనాయకుడు చెప్పాడు. మరొక దళనాయకుడు ఆయన చెప్పినదానిని సరిదిద్దాడు. సమ్మెచేస్తున్న కార్మికులు తమవద్దగల కొద్దిపాటి వనరులనూ చేర్చి, తిండిలేక మాడుతున్నవారికి అప్పుగాయిచ్చి, వాళ్లను కూడా సమ్మెలో నిలబెట్టాలని చెప్పాడు. సమ్మెను జయప్రదం చేయడంకోసం, పాలేర్లను కూడా సమ్మెలోకి రాబట్టాలి ఇతర కష్టజీవి వర్గాల మద్దతునూ సంపాదించాలి. సమ్మెదారులు దిగజారిపోకుండాను, సమ్మె దెబ్బతినిపోకుండాను కాపాడటంకోసం, సమ్మెకాలంలో మరీఇబ్బంది పడుతున్నవారికి సహాయపడడంకోసం అప్పులూ,విరాళాలూ సేకరించటంకూడా అవసరం. వారి వర్గచైతన్యాన్ని సంఘీభావాన్ని వుత్తేజపరిచాలి. పరిస్థితు లనుమతించేట్లయితే, పస్తులుంటున్న కార్మికులకు తిండిబెట్టడంకోసం భూస్వాముల పొలాల్లో పంటలను స్వాధీనం చేసుకోవచ్చు. అయితే, సమ్మె విజయవంతం కావాలంటే, ఏపరిస్థితిలోనూ, కార్మికులలోని ఏ కొందరైనా పనులలోకి వెళ్ళటాన్నిగాని, సమ్మె విచ్ఛిన్నకులుగా వ్యవహరించటాన్ని గాని సాగనివ్వరాదు.

ఒక గ్రామంలో ఒక దళం పాలేర్ల సమస్యను తీసుకుంది. నెలకు తొంభైశేర్ల వడ్లు చొప్పున యివ్వాలని డిమాండ్ చేశారు. అప్పటికి అమలులో వున్న రేటు నలభై శేర్లు. ఆ పరిస్థితిలో తొంభైశేర్ల డిమాండుకు భూస్వాములు అంగీకరిస్తారా అని పాలేర్లకు అపనమ్మకం ఏర్పడింది. సానుభూతిపరులుగా వున్న భూస్వాములు సయితం ఆ డిమాండ్‌ను అంగీకరించటానికి తటపటాయించారు. అది కేవలం సమస్యపట్ల మనంతీసుకొన్న దృక్పథంలోని లోపాన్ని మాత్రమే విదితంజేసింది. వ్యవసాయ కార్మికుల చైతన్యాన్ని పెంపొందించ

కుండా, ఆచరణసాధ్యమని, సాధించుకొనదగినవని భావించిన తమ డిమాండ్లను సాధించుకొనటంకోసం వారు పోరాడేట్లుచేయకుండా ప్రచార నినాదాలు వల్లించి నందువల్ల ప్రయోజనంలేదు అందువల్ల వారు యితరు లెవరో సాధించి పెడతారని ఎదురుజూడటానికే ప్రోత్సాహం కలుగుతుంది తమ డిమాండ్లను అంగీకరించునట్లుగా సాయుధదళాలు, భూస్వాములపై ఒత్తిడిచేయగలవని మాత్రమే ఎదురుజూస్తారు. అలాచేస్తే బాగుండుననుకుంటారు. తమంతతామే చురుకుగాపాల్గొని పోరాడటంద్వారానే తమ డిమాండ్ ను సాధించుకోవాలనే విషయాన్ని మాత్రం వారు గుర్తించజాలరు.

ఒక గ్రామంలో రైతులను సమ్మెచేయవలసిందిగా కోరాం. తాము సమ్మెజేసేట్లయితె పొరుగుగ్రామంనుండి కూలీలొచ్చి భూస్వాములవద్ద పనులు జేస్తారని వారు సమాధాన మిచ్చారు. "అధిక వేతనాలు చెల్లించేట్లుగా భూస్వాములపై మీరు వత్తిడి చేయండి. మేము మీ వెంటనే నిలబడుతాం" అని వారు చెప్పారు. మన సానుభూతి పరులలో వొకరిచేత ఈ డిమాండ్ కు అంగీకరింపజేసేట్లయితే మిగతా భూస్వాములూ అంగీకరించటం తప్పనిసరవు తుందని మరొకచోట చెప్పారు. అధిక వేతనం చెల్లించేట్లుగా, మన అభిమాను లలో ఒకరిచేత దళం వొప్పించింది. అయినా మిగతా భూస్వాములు అదే విధంగా చెల్లించటానికి నిరాకరించారు. శ్రామికులందరూ సమిష్టిగా పోరాడటం ద్వారానే, ఆ డిమాండ్ ను అంగీకరించేట్లుగా, భూస్వాములను లొంగదీయ వచ్చునని, తియ్యని మాటలతోగాని, సానుభూతిపరుడైన భూస్వామి ఆదర్శాన్ని చూపడంవల్లగాని సాధించుకొనటం సాధ్యంకాదని వారికి వివరించబడింది.

తాము సమ్మెజేసేట్లయితే, భూస్వాములు పోలీసులను తీసుకురారా అని మరొక గ్రామంలో కార్మికులడిగారు. న్యాయమైన తమ డిమాండ్లను సాధించుకొనటంకోసం, పోలీసులనెదుర్కొనటానికి, అనేక యితర కష్టాలకూ సంసిద్ధం కావలసివుంటుందని వివరించి చెప్పడం జరిగింది. అయితే అసంఖ్యాకు లయిన కష్టజీవులు ఐక్యపోరాటంద్వారా. తమ డిమాండ్లను సాధించుకొనటం సాధ్యమవుతుందనికూడా వారికి చెప్పాం.

నిర్ణీతమైన కొలతలతోగాని, నిర్ణీతమైన రేట్లతోగానికాక, ఒక పట్టెడో, బుట్టెడో ధాన్యపు కంకులో, పది బుట్టలు ప్రత్తి తీస్తే ఒక బుట్టెడు వేతనంగా చెల్లించటం వలె, పంటలో యిన్నో వంతనో వేతనం చెల్లించే పురాతన ఫ్యూడల్ పద్దతులనుగూర్చి మరొక ప్రశ్న లేవనెత్తబడింది. వేతనాలు గానో, వారిక వేతనంగానో నిర్ణీత మొత్తాలను చెల్లించటానికి మారుగా, పంట కల్లం అడుగున కొంత ధాన్యం వదలి పెట్టటమో, ఒక బుట్టెడో, తట్టెడో ధాన్య మివ్వటం, మానూళ్ళ తరుణంలో ఒక మోపు వరిగడ్డి ఇవ్వటం

వంటి చర్యలద్వారా భూస్వాములు ఉదారులైన దయార్ద్ర హృదయులుగా కనిపించటం, మరొక రూపంలో భూస్వామ్య దోపిడీ సాగించటం జరుగుతోంది. చిన్న రైతులు, మధ్యతరగతి రైతులు ప్రస్తుత పంటలోనుంచే వేతనాలు చెల్లించ వలసి వుంది గనుక, వారు కొలతల ప్రకారం చెల్లించటం ఎలా సాధ్యమవు తుందన్న ప్రశ్న అడగబడింది. "అలాంటి సందర్భాలలో ఒకటి రెండు పట్లో, ఒకటి రెండు బుట్టలో అధికంగా యివ్వవలసిందిగా డిమాండ్ చేయాలని ఒక దళ కమాండర్ చెప్పాడు. "కార్మికులంతా కలసి, కోత కోసి, నూర్పిడి జేసి, ధాన్యం బాగుజేసి, కోతకోసినందుకు, నూర్పిడి జేసినందుకు లెక్కల ప్రకారం వేతనాలు తీసుకోనివ్వండి. అంతేగాని, పాతఫ్యూడల్ పద్ధతులు మాత్రం వద్దు. అంతేకాదు, ధనిక రైతులు, నిర్ణీతమైన కొలతలప్రకారం వేతనాలుచెల్లించటం కోసం అవసరమైన ధాన్యమో, రొక్కమో అప్పుగా తేవచ్చు" అని మహిళా దళ సభ్యురాలైన నరసమ్మ చెప్పింది

పాలేర్లకు ఏడాదికి ముప్ఫై రోజులు సెలవు లుండాలనేది మన డిమాండు. పాలేరు సెలవు దీసుకున్నప్పుడూ, పండుగ రోజునా, తన యింటి పనులు, పొలం పనులు, పశువులు గాయటం వంటి పనులన్నీ తానొక్కడే ఎలా చేసుకోవాలని ఒక ధనిక రైతు, మన దళ నాయకుడిని అడిగాడు అలాంటి రోజున హెచ్చింపు వేతనం చెల్లించి మరొక రోజు కూలినైనా నియమించు కోవాలి. లేదా తన కుటుంబంలోని మరొకరెవరైనా ఆ పని చేసుకోవాలి. అంతేగాని ఈ కారణంతో పాలేరుకు పండుగ రోజు, జబ్బుపడినప్పుడూ సెలవు తీసుకునే హక్కు లేకుండా చేయగూడదు అని మన కామ్రేడ్ సమాధాన మిచ్చాడు.

అంతేగాదు. పాలేర్ల న్యాయమైన డిమాండ్లన్నింటినీ తీసుకుని కృషి చేసేటప్పుడు ధనికరైతుల, భూస్వాముల కష్టాలన్నింటినీ పరిష్కరించజాలం. వాళ్లు కొన్ని కష్టాలకు లోనుగావలసిందే. సుఖానికలవాటుపడ్డ తమ అల వాట్లను కొన్నింటిని వదులుకొనటానికి సిద్ధంకావలసిందే వాటికోసం పాలేర్లను నష్టపరచటానికి వీలులేదు. ఉదారవాద భూస్వాములను, ధనిక రైతులను కూడగట్టటం కోసమని, వ్యవసాయ కార్మికుల ప్రయోజనాలను బలి బెట్టటమనే భ్రమలకు తావీయరాదు. స్వల్పమైన వేతనాలతో, సెలవులు లేకుండా పరిమితిలేని పనిగంటలతో పాలేర్లు ఎ విధంగా దోపిడీ చేయబడు తున్నదీ మనం బట్టబయలు చేయాలి. అయితే మనం డిమాండ్లను రూపొం దించేటప్పుడు అవి ఆచరణ సాధ్యంకానివిగాను, పేరాశతో గూడినవిగాను కనిపించేట్లు వుండరాదు మనం ముందు ముఖ్యమైన పండగలకు సెలవులతో

ప్రారంభించాలి నిదానంగా చైతన్యం పెరిగినకొలదీ, నిర్మాణం పెంపొందిన కొలదీ సెలవులను ఏడాదికి 15 నుండి 30 రోజులకు పెంచాలనే డిమాండ్‌ను ముందుకు తీసుకురావాలి

దీన్ని సాధించటంకోసం మనం రోజుకూలీలకు, పాలేర్లకు మధ్య ఐక్యతను, సంఘీభావాన్ని పెంపొందించాలి గ్రామాలలో కార్మికులు గోంగూర, పచ్చిమిరపకాయలతో పచ్చళ్ళు చేసుకోనటానికి, పక్కానికొచ్చిన ధాన్యపుకంకులు రాల్చుకొని తినటానికి అలవాటుపడ్డారు మనం వాళ్ళకు సహాయపడటానికి ప్రయత్నించాలి. దానిని అవకాశంగా తీసుకొని భూస్వాములు వారిని అణచివేయకుండా చూడాలి. వ్యవసాయ కార్మికులు కలసి నివసించే వ్యవసాయ కార్మిక పేటలలో, పల్లెలలో ప్రాంతాలలో వారిని ప్రత్యేక బృందాలుగా, సంఘాలుగా సంఘటితపరచాలి. మన దళాలు వారిని చిన్న బృందాలుగా ప్రతిరోజూ కలుసుకొనటానికి తద్వారా అవకాశం కలుగుతుంది. యువకార్మికులను, పశుల కాపరులనుకూడా వ్యవసాయ కార్మిక సంఘంలోకి తీసుకురావాలి.

సంఘటితమైన ప్రజాసంఘాలు లేకుండా ప్రజావుద్యమమే లేదు.

## మహిళలకు సమాన వేతనం సమస్య

స్త్రీలు, పురుషులు జేసినంత పని చేయగల స్థితిలో లేరనే వాదనకు సమాధానంగా, మన దళాలు దిగువ విధంగా వివరించుతుండేవి . అనేక వ్యవసాయ పనులలో, స్త్రీలు పురుషులతో సమానంగాను, కొన్ని సందర్భాలలో అంతకంటె మెరుగుగానో పనిజేస్తారు. ఉదాహరణకు, పంటకళ్ళంలో ధాన్యం నుండి దుమ్మును వేరుజేయటంవంటి కొన్ని పనులు స్త్రీలు మాత్రమే చేస్తారు. పెద్ద బరువులు మోయటంలో మాత్రమే స్త్రీలు, పురుషులకంటె బలహీనులు. సామాన్యమైన బరువులను పురుషులతో సమానంగా వారూ మోస్తారు. ఆ మాటకొస్తే, పురుషులలో సయితం, కొంతమంది బలహీనంగా వుంటారు. కొంతమంది మరికొంతమందికంటె ఎక్కువ పనిచేయగలరు. అయినా, వారి బలాన్నిబట్టో, వారు చేయగలిగిన పనినిబట్టో వారికి వేర్వేరు రకాలుగా వేతనాలు చెల్లించటంలేదు. అలాంటప్పుడు, స్త్రీపట్లనే ఎందుకీ వివక్ష ? భూస్వాములు తమ దోపిడీని సాగించటంకోసం, స్త్రీ-పురుష విభేదమనే అంశాన్నొక సాకుగా వుపయోగించుకొంటున్నారు.

తమ ప్రచార కార్యక్రమాల సందర్భంలో, మన దళాలు అనేకమంది స్త్రీలను, చిన్న చిన్న బృందాలుగా కలుసుకున్నాయి. వారు తమ కష్టగాథలను

వివరించారు. దళాలలోని, మన మహిళా కార్యకర్తలు, ప్రస్తుత మూఢనమ్మకాలను ఖండించేవారు తమ కష్టాలకు వ్యతిరేకంగా పోరాడవలసిందిగా వారిని ప్రోత్సహించేవారు. వారి కష్టాలన్నింటికీ కారణం, నేడు అమలులోవున్న సాంఘిక వ్యవస్థ, దాన్ని కాపాడుతున్న ప్రభుత్వమూ అనే విషయాన్ని స్పష్టం జేయటానికి మారుగా, వాటన్నింటికీ కారణం పురుషులేనని నిందించే ధోరణి వొకటుంది మన దళం ప్రబోధానంతరం, ఒక మహిళ, యికమీదట తన భర్తచేత వంట జేయిస్తానని ప్రకటించేంతవరకు వెళ్ళింది. ఈ ధోరణి గృహ కల్లోలానికి దారిదిస్తుందే తప్ప, ప్రస్తుత సాంఘిక, రాజకీయ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటంలోకి స్త్రీలను రంగంలో దించటానికి దోహదపడదనీ నాయకత్వం వివరించింది.

విపరీతమైన వడ్డీరేట్లతో అప్పులిచ్చి, ఆ అప్పులకు బదులుగా, భూస్వాములు లంబాడీ బాలికలను బానిసలుగా తీసుకొనిపోయి, తమ ఇండ్లలో పనులు చేయించుకొంటూవుండటం మరొక సమస్య. ఆ బాలికలు పెరిగి పెద్దవారై, పెండ్లీడు వచ్చిన తర్వాత, వాళ్ళను అమ్మివేసి, తమఅప్పులు రాబట్టుకోవచ్చుననేది వారి వుద్దేశం ఇది సర్వసాధారణమైనదిగా, విధికృతమైన సాంప్రదాయంగా లంబాడీలు భావించజొచ్చారు. ఈ సాంప్రదాయానికి వ్యతిరేకంగా ప్రచారం చేయవలసిందిగాను, పోరాడవలసిందిగాను మన దళాలకు ఖచ్చితమైన ఆదేశాలివ్వబడినాయి.

అదేవిధంగా, కొందరు లంబాడీ బాలికలు, దళాలలోని మనమహిళా కార్యకర్తల దగ్గరకొచ్చి, తమను ఒక్కొక్కరిని రెండు అవుపెయ్యలకు బదులుగా భూస్వాములకు ఎలా అమ్మివేస్తున్నదీ వివరించారు. తమకింకా పెండ్లి కాలేదని, యుక్తవయస్సురాగానే, తమను అమ్మివేస్తారనీ వారు చెప్పారు. అది వాళ్ళ సాంప్రదాయం. ఈ సాంప్రదాయానికి వ్యతిరేకంగా కూడా మన కార్యకర్తలు వుద్యమాలు సాగించారు.

ఒక రుణదాత, తన భార్యను లేవదీసుకుపోయి, ఆమెతో కాపురం జేస్తున్నాడని, అతనిని చంపివేసి తనకు న్యాయం కలుగజేయవలసిందిగా ఒక వ్యక్తి దళాన్ని కోరాడు. తాము ఆ విధంగా చంపబోమని దళం సమాధానం జెప్పింది. భూస్వాములుగాని, వడ్డీ వ్యాపారస్తులుగాని, పేద ప్రజల స్త్రీలను బలవంతంజేసినా, లేవదీసుకుపోయినా, అలాంటి వాటికి వ్యతిరేకంగా ప్రచారంచేసి, అలాంటివి జరగకుండా అరికట్టగలమని చెప్పారు. స్త్రీలు, తమ భాగస్వాములను స్వేచ్ఛగా ఎంచుకోవచ్చునని, తమ భర్తలవద్దకు తిరిగి వెళ్ళటానికి వారు స్వయంగా అంగీకరించకపోతే స్త్రీలపై బలప్రయోగంచేసి వారి పూర్వపు భర్తలకు మనం వొప్పగించజాలమనీ చెప్పారు.

అంతమంది స్త్రీలు, మీ దగ్గరికొస్తున్నప్పుడు, వారిని, మహిళా సంఘంగా ఎందుకు ఏర్పాటుజేయలేదని మన దళాలను అడిగినప్పుడు స్త్రీలలో అధిక సంఖ్యాకులు బిడ్డతల్లులని, అందువల్ల వారిని, పటిష్టంగా పనిజేసే మహిళా సంఘాలలో చెర్చటం కష్టమని వారు సమాధానమిచ్చారు.

ఆదిలాబాద్ తాలూకా

"ఈ తాలూకా, తెలంగాణా ఉత్తరువు కొసనవుంది. అరణ్యప్రాంతానికి సరిహద్దునవుంది. గిరిజనులకు ప్రక్కనేవుంది. ఈ తాలూకాలో వ్యవసాయ కార్మికుల పరిస్థితులు, యితర ప్రాంతాలలోకంటె మరింత వెనుకబడివున్నాయి. మరింత ఎక్కువ ప్యూడల్ దోపిడి సాగుతోంది. అక్కడ రెండు రకాల వ్యవసాయ కార్మికులున్నారు ఒకరకం — పాలేర్లు వారికి రొక్కరూపంలోనో, ధాన్యంరూపంలోనో నిర్ణీత వేతనం చెల్లించబడుతుంది మరొకరకం — ఒకజత ఎడ్లతో సాగుజేయటానికి వీలయిన భూమిలోని నికర వుత్పత్తిలో సగం వాటా యివ్వబడుతుంది. మొత్తం జనాభాలో నూరింట 70 మంది వ్యవసాయ కార్మికులు, 20 మంది పేదరైతులు, ఒక అరకపొలంగలిగిన మధ్యతరగతి రైతులు 5 గురు, రెండు మూడు అరకల పొలం గలిగినవారు, నాలుగరకల భూమి, అంతకుపైగా గలిగిన వారు నూరింట ఐదుగురు. ఆచరణలో మొత్తం భూమి, పశువులు, ధనం యావత్తూ వారి అధీనంలోనే వున్నాయి. కూలీలలో ఎక్కువమంది పనిజేసేది వాళ్ళక్రిందనే. వారికి అతి తక్కువ వేతనాలు చెల్లించేవారు.

పాలేర్లకు, నెలకు 40 నుండి 50 శేర్లవరకు జొన్నలిచ్చేవారు. రోజుకు 14 గంటలపని వుండేది. వ్యవసాయపనులు, యింటిపనులు చేయాలి. జబ్బుపడినాసరే సెలవులులేవు. వాళ్ళకు సాధారణంగా పూరిగుడిసెలుండేవి. కాని, వారిలో చాలమంది తమ యజమానుల పశువులచావళ్ళలోనూ నివసించుతుండేవారు. వారి భార్యలు, ఎనిమిది, పదిసంవత్సరాల వయస్సుగల పిల్లలు కూడా వారి యజమాని పొలాలలో పనిజేసేవారు వారిపశువులను మేపేవారు. ఆ పిల్లలకు ముప్పైశేర్లు వడ్లుచొప్పున యిచ్చేవారు యజమాని పొలాలలోగాని, యింటిలోగాని సంవత్సరం మొత్తంమీద 120 రోజులు పనిజేసినందుకుగాను స్త్రీలకు మొత్తం సంవత్సరానికి రు. 40 లు గాని, అందుకు సరిపడే ధాన్యంగాని యిచ్చేవారు. ఇంతజేసినా, కుటుంబమంతా అర్ధాకలితో మాడుతుండేది. యజమానినుండి అప్పుజేయటం తప్పేదిగాదు. వారు ఆ అప్పులను ఎన్నటికీ తీర్చజాలరు గనుక తమ యజమానులక్రిందబానిసలవలె పనిజేస్తూండేవారు. వారు, మరొక భూస్వామివద్ద పనికికుదరాలంటే, ఆ భూస్వామి ఆ

కార్మికుడు పాతభూస్వామికి చెల్లించవలసిన అప్పులన్నీ తీర్చాలి. నిజానికి ఇది కొత్త యజమాని, పాతయజమానినుండి అతనిని కొనుక్కోవటమేతప్ప వేరేమీకాదు.

ఒక అరకపొలంలోని నికరపంటలో ఒక ఎద్దువాటా చొప్పున చెల్లించబడే వ్యవసాయ కార్మికుని జీవితంకూడా అలాగే దుర్భరంగా వుండేది. అతనికి ఆరుమాసాలపాటు, నెలకు 40 నుండి 50 శేర్లు ధాన్యం యివ్వబడుతుంది. మిగతా ఆరుమాసాలకుగాను, అరకపొలంలోని నికరపంటలో ఒక ఎద్దువాటా యివ్వబడుతుంది. అయితే ఆ విషయంలోనూ అనేకవిధాలుగా మోసగించటం జరుగుతుంది. ఒక అరకపొలంలో రెండు ఎడ్లు పనిజేసినట్లుగాక, మూడెడ్లు పనిజేసినట్లు లెక్కిస్తారు సగంవాటాకు బదులు మూడోవంతే యిచ్చేవాళ్ళు. రెండరకలు అంతకంటె ఎక్కువగావున్న భూముల్లో యిలాంటి మోసం మరింత ఎక్కువగా జరుగుతుంది. రెండరకల పొలం దున్నటానికి, సాగుజేయటానికి ఎన్ని ఎడ్లు అవసరమనేద భూస్వామి తన యిష్టం వచ్చినట్లు లెక్కతేల్చవచ్చు. ఇక రెండోవిషయం: (1) పొలంలో చల్లిన విత్తనాలను వాస్తవంగా చల్లినదానికి రెట్టింపుగా చూపడం (2) ఎడ్లమేతఖర్చు (3) ప్రత్తివిత్తనాల ఖర్చు (ఈ ప్రాంతంలో ప్రత్తి సర్వసాధారణమైన వాణిజ్య పంట) (4) వ్యవసాయ పరికరాలపై ఖర్చు (5) పండుగల, సాంఘిక సంబంధమైన ఖర్చులు (6) పాలేర్లు తీసుకున్న అప్పులపై, ధాన్యంరూపంలోనో, డబ్బు రూపంతోనో విపరీతమైన వడ్డీరేట్లు లెక్కజూపటంద్వారా ఖర్చును ఎక్కువగా చూపడం జరుగుతుంది.

వివిధ వ్యవసాయ పనులకు అనాడు అమలులోవున్న వేతనాల రేట్లు వాటికి మనం డిమాండ్‌జేస్తున్న రేట్లు దిగువవిధంగా వున్నాయి :

| పని వివరం | అమలులోవున్న రేట్లు | మన డిమాండ్ |
|---|---|---|
| బెండేరుడు (పొలం చదును చేయటం, రాళ్లేరటం వగైరా) | 2 అణాలు (12 పై) | 6 అణాలు (37 పై.) |
| విత్తనాలు జల్లటం ,నాట్లు | 4 అణాలు (25 పై) | 8 అణాలు (50 పై) |
| ప్రత్తి తీయటం | మణుగుకు 6 అణాలు | మణుగుకు 8 అణాలు |
| పత్తి విత్తులు నాటినందుకు | ,, 8 అణాలు | ,, 10 అణాలు |
| పురుషుల రోజుకూలి | రు 1-00 | 8 గంటల పనికి రు 1-50 లు. |

పాలేర్లకు మన డిమాండ్లివి :

1. నెలకు 80 శేర్ల ధాన్యం, లేదా ఏడాదికి రు 300 లు.

2. రోజుకు 8 గంటల పని.

3. ఏడాదికి 15 రోజులు పూర్తిజీతంతో సెలవు.

4. పాలేర్లు తీసుకున్న అప్పులపై రొక్కరూపంలోగాని, ధాన్యం రూపంలోగాని వడ్డీ వుండరాదు.

ఆరుమాసాలకు ఒక ఎద్దు వాటా యివ్వబడేవారికి నెలకు 80 శేర్లు, పైన పేర్కొన్న యితర అన్ని సౌకర్యాలు కల్పించాలి. ఎద్దువాటాను సవ్యంగా లెక్కగట్టాలి. ఆ సందర్భంగా బెండేరుడు, విత్తనాలుజల్లడం, కలుపుతీయటం, మాసూళ్ళు, పశువులుగాసే కుర్రవాడిజీతం, ప్రభుత్వ పన్నులుపై వాస్తవంగా ఖర్చుబెట్టిన మొత్తాలనే తగ్గించాలి పశువుల మేత పేరుతోగాని, వడ్డీ రేట్ల పేరుతోగాని ఎలాంటి తగ్గింపులు జరగరాదు.

వేతనాల హెచ్చింపుకోసం పోరాటంలో మనం పాలేర్లను, ఎద్దు వాటా పాలికాపులను, రోజు కూలీలను సమీకరించాలి వెట్టి చాకిరికి వ్యతిరేకంగా, నిర్బంధ లెవీ సేకరణకు వ్యతిరేకంగా, లంచగొండితనానికి వ్యతిరేకంగా, చౌబీనా, బంబ్రాయ్‌లకు వ్యతిరేకంగా, పాత అప్పుల రద్దుకోసం కౌలు రేట్ల తగ్గింపుకోసం, మనం పేద రైతులను, మధ్యతరగతి రైతులను, కౌలుదార్లను, యితర పేదలందరినీ రోజువారీ పోరాటాలలో సమీకరించాలి. "దున్నేవానికే భూమి" అనే కేంద్రీయ నినాదంతో ఈ పోరాటాలన్నీ సాగించబడాలి.

మన శత్రువు లెవరు ? జమీందార్లు, ఇజారాదార్లు, భూములుగల ధనికులు, వడ్డీ వ్యాపారస్థులు, కాంగ్రెస్ ప్రభుత్వం – మన శత్రువులు.

## మన శత్రువుల అసత్య ప్రచారం

పొలాల్లో పండుతున్న పంటలను పరిగణనలోకి తీసుకోకుండానే, అధిక వేతనాల రేట్లకోసం మనం వ్యవసాయ కార్మికులను రెచ్చగొడుతున్నామని, తద్వారా వ్యవసాయాన్ని నాశనం జేస్తున్నామని.

— ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుపార్టీ, ప్రజలలో వర్గ విద్వేషాన్ని, వర్గ పోరాటాన్ని రెచ్చగొట్టుతున్నాయని వారంటున్నారు.

— మధ్యతరగతి రైతులను మననుండి, తమవైపుకు రాబట్టుకొనటానికి మన శత్రువులు ప్రయత్నిస్తారు

— కష్టజీవులైన, మనలోగల కులాలను, కులతత్వాలను వుపయోగించుకుని, "ఈ మాల మాదిగలు మన మాట వినటానికి నిరాకరిస్తున్నారు" అని వారు అంటారు. ఆ విధంగా వ్యవసాయ కూలీలకు వ్యతిరేకంగా, పై కులాలకు జెందిన పేద రైతులను సయితం రెచ్చగొట్టటానికి వారు ప్రయత్నిస్తున్నారు.

— ప్రభుత్వ నిర్బంధకాండతో మనలను బెదిరిస్తారు. యింకా అనేక విధాలుగా మనలను భయపెట్ట జూస్తారు.

అయినా, మనం సమైక్యంగా వుంటే మన బలం పెంపొందుతుంది. శతృవులు పన్నే ఈ కుట్రలేవీ ఫలించవు

## మన డిమాండ్ల విషయంలో ప్రజలకు నచ్చ జెప్పటమెలా ?

— మన డిమాండ్లు, పేద, మధ్యతరగతి రైతులకు హానికలిగించవు. బాగా ఎక్కువ పొలాలున్నవారికి, భూములున్న ధనికులకు, భూస్వాములకు, జమీందార్లకు, వడ్డీవ్యాపారస్థులకు మాత్రమే వాటివల్ల దెబ్బతగులుతుంది.

— పాలేర్లకు, రోజుకూలీలకు అధిక వేతనాలిస్తేనే, వారికి సరిగా తిండిపెడితేనే, వారు సవ్యంగా పనిచేయగలరు అధికంగా పండించగలరు.

— ఒక్క అరకగల ఆసాములు పాలేర్లను పెట్టుకోరు రెండరకలు, అంతకుమించినవారే పాలేర్లను పెట్టుకుంటారు. వ్యవసాయంనుండి వారి నికరాదాయం, మనం డిమాండ్ చేస్తున్న వేతనాలను సులభంగా చెల్లించటానికి వీలుకల్పిస్తుందని మనం చూపవచ్చు. (ఈ సర్క్యులర్ చివరన రెండరకల వ్యవసాయానికి వచ్చే ఆదాయానికి సంబంధించిన సంఖ్యా వివరాలివ్వబడ్డాయి.)

— ధనిక రైతులు, జమీందార్లు, వడ్డీవ్యాపారస్థులు, కూలీలను, పాలేర్లను దోచుకుని, తమ ధాన్యం గోదాములు నింపుకుంటారు. రొక్కరూపంలోనో, ధాన్యం రూపంలోనూ (నాగు) విపరీతమైన వడ్డీరేట్లు గుంజేది వారే. తాము అక్రమంగా ఆర్జించిన ధాన్యాన్ని అత్యధిక ధరలకు పేదలకు అమ్ముకునేదీ వారే. వారు కూలీలను దోచుకుంటారు. పేదల శ్రమను కాజేస్తారు. వాళ్ళను తిండిలేకుండా మాడ్చిచంపుతారు.

— మనం, వ్యవసాయ కార్మిక సంఘాలుగా సంఘటితపడాలి. వాటిద్వారా, ఈ డిమాండ్లకోసం ఆందోళన చేయాలి.

— మన డిమాండ్లకు అంగీకరించకపోతే మనం సమ్మె చేయాలి. ఈ డిమాండ్లను అంగీకరించేట్లు చేయాలి.

## రాజకీయ లక్ష్యం

మన కష్టాలూ, కడగండ్లన్నీ పోవాలంటే, దున్నేవారందరికీ భూమి లభ్యం కావాలంటే, జలగల్లాగా మన రక్తం పీల్చే దొంగలను, దోపిడీదార్లను అంతంజేయాలి వారి పాలనను తుదముట్టించాలి. జనతా ప్రజాస్వామ్యాన్ని స్థాపించిననాడే మనకు విముక్తి. ఇందుకుగాను, రోజువారీ కూలీలు, పాలేర్లు, పేదరైతులు, కష్టంజేసి జీవించేవారు అంతా ఏకం కావాలి కూలి-కాపుల రాజ్యంకోసం కొట్లాడాలి

## మన నినాదాలు

— భూమిపై ధనిక రైతుల, భూస్వాముల, వడ్డీ వ్యాపారస్తుల, జమీందార్ల, ఇజారాదార్ల, వతందార్ల గుత్తాధిపత్యాన్ని రద్దుజేయాలి. వారి భూములను, వారి నాగళ్ళను, వారి పశువులను, అన్నింటినీ వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచిపెట్టాలి.

— దున్నేవానికే భూమి. భూమినంతా ప్రభుత్వం స్వాధీన పరచుకోవాలి.

— ఇప్పుడు సాగుజేసుకుంటున్న వారికే భూములపై పట్టా హక్కులివ్వాలి. కౌలుదార్లు, తాము సాగుజేసుకుంటున్న భూములను వదులుకోరాదు. వారు ఆ భూములపై పట్టాహక్కులు పొందాలి

— కౌళ్ళు తగ్గించాలి. కౌలురేటు, ప్రభుత్వం వసూలుజేసే భూమిశిస్తుకు మించరాదు.

— పోరంబోకలు, కరీజ్కాతాలవంటి అన్యాక్రాంతాలపై, వాటిని సాగుచేసుకుంటున్న వారికి పట్టాహక్కులివ్వాలి.

— రొక్కం రూపంలో, ధాన్యం రూపంలోగల అప్పులన్నీ రద్దుజేయాలి.

— ఫారెస్టులనుండి, గడ్డి, కలప, గృహావసరాలకు సరిపోయే వంటచెరకు వుచితంగా తెచ్చుకునేందుకు పేదప్రజలకు వుచితంగా అనుమతించాలి.

— పెట్టుబడిదారీ విధానం నశించాలి. ఫ్యాక్టరీలన్నీ కార్మికుల అధీనంలోకి రావాలి. కార్మికులకు, జీవనోపాధికి తగినంత వేతనం ముట్టజెప్పాలి.

— జనతా ప్రజాస్వామ్యంకోసం (కూలి-కాపుల రాజ్యంకోసం) పేద, మధ్యతరగతి రైతులందరూ, కష్టజీవు లందరూ మధ్యతరగతి వర్గాలవారూ కార్మికుల నాయకత్వాన సాగిపోవాలి.

— జనతా ప్రజాస్వామ్య విశాలాంధ్ర సాధించాలి !

— తెలంగాణానుండి మిలటరీని వుపసంహరించాలి !

— ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీలపై నిషేధం తొలగించాలి !

## ఒక అరక వ్యవసాయ కమతం

### ఆదాయ - వ్యయాలు

| భూమినుండి రాబడి | | వ్యయం | |
|---|---|---|---|
| ప్రత్తి (ఒకకోస్లాం) | రు. 225-00 | పన్నులు | 10-00 |
| జొన్నలు (600 కి గ్రా) | 300-00 | దాణాలు | 20-00 |
| తొగలు (249 కి గ్రా) | 160-00 | విత్తనాలు | 15-00 |
| నువ్వులు (60 కి. గ్రా) | 45-00 | ప్రత్తి విత్తనాలు | 25-00 |
| వడ్లు (2 బస్తాలు) | 70-00 | నాట్లు, మానూళ్ళు | 25-00 |
| మిర్చి (2 మణుగులు) | 50-00 | ఇతరఖర్చులు | 25-00 |
| | రు 850-00 | | రు. 120-00 |

### రెండరకల కమతం

| | |
|---|---|
| మొత్తం రాబడి | 1700-00 |
| ఖర్చు | 240-00 |
| నికరాదాయం | 1460-00 |
| పశువులకాపరిజీతం | 100-00 |
| నికరాదాయం | 1360-00 |

అందువల్ల రెండరకల కమతంగల యజమాని, పూర్తికాలం తనవద్ద పనిచేసే పాలేరుకు రు 300 లు చెల్లించగలడు. ఇంకా ఆయనకు సంవత్సరానికి వెయ్యిరూపాయల ఆదాయం మిగులుతుంది.

— ఆదిలాబాద్ తాలూకా ఆంధ్రమహాసభ — కమ్యూనిస్టుపార్టీ ప్రచురించిన కరపత్రంనుండి :

## హుజూర్‌నగర్ - మిర్యాలగూడెం జోన్‌లో
## 1951 లో జీవితావసరవస్తువుల ధరవరలు

| పరుకు | 25 పౌ. మణుగు ఒక్కింటికి మిర్యాలగూడెం పట్టణంలో టోకు ధరలు | 25 పౌ. మణుగు 1 కి గ్రామాలలో చిల్లర ధరలు |
|---|---|---|
| నువ్వులనూనె | 20–0–0 | 24–0–0 |
| కిరోసిన్‌నూనె | 5–8–0 | 9–0–0 |
| బెల్లం | 6–8–0 | 9–0–0 |
| ఉల్లిపాయలు | 4–8–0 | 6–0–0 |
| చింతపండు | 5–0–0 | 8–0–0 |
| కొబ్బరినూనె | 37–8–0 | 48–0–0 |
| కొబ్బరి | 26–0–0 | 32–0–0 |
| మిర్చి | 15–0–0 | 20–0–0 |
| తిప్పతీగ | 75–0–0 | 100–0–0 |
| జీరా | 75–0–0 | 100–0–0 |
| పచ్చివక్క | 36–0–0 | 48–0–0 |
| ఇనుము | 5–8–0 | 8–0–0 |
| రాగి | 110–0–0 | 135–0–0 |
| వెండి (తులం) | 2–4–0 | 2–6–0 |
| బంగారం (తులం) | 132–0–0 | 137–0–0 |
| కంచు | 68–0–0 | 80–0–0 |
| ఇత్తడి | 80–0–0 | 120–0–0 |
| బెల్ మెటల్ | 75–0–0 | 100–0–0 |
| 40 గజాల లాంగ్‌క్లాత్ | 80–0–0 | 120–0–0 |
| పంచదార (కంట్రోలుధర) | 11–8–0 | 12–0–0 |
| ,, (బ్లాక్‌మార్కెట్) | 18–0–0 | 24–0–0 |
| పాలడబ్బా (ఒకటి) | 2–0–0 | 2–4–0 |
| కాఫీ (పౌను) | 3–4–0 | 4–0–0 |
| సిగరెట్లు దిండు | 4–0–0 | 5–0–0 |
| పొగాకు (మణుగు) | 18–0–0 | 24–0–0 |
| ఉప్పు (రూపాయికి) | 20 శేర్లు | 18 శేర్లు |

తీర్మానాలు

1951 నవంబరులో జరిగిన, అమరాబాద్ ప్రాంతీయ అజ్ఞాత పార్టీ, గెరిల్లా, రాజకీయ దళ నాయకుల సమావేశంలో ఈ క్రింది తీర్మానాలు ఆమోదించబడినాయి :

తెలంగాణా రైతాంగం గత ఐదు సంవత్సరాలుగా, భూమికోసం సాయుధ గెరిల్లా పోరాటం సాగిస్తోంది. ఈనాటికీ, వారు తాము సాగుచేసు కొంటున్న కౌలుభూములను తమ అధీనంతోనే నిలబెట్టుకున్నారు.

భూస్వాములు తమవద్దనుండి అక్రమంగా, దౌర్జన్య పూర్వకంగా గుంజుకున్న భూములను, భూస్వాముల మిగులు భూములనూ రైతులు ఆక్ర మించుకున్నారు. కాని, ఆ భూములలో ఎక్కువ భాగాన్ని భూస్వాములు, మిలటరీ సహాయంతో తిరిగి స్వాధీనం చేసుకున్నారు. అయినా, యిప్పటికీ ఈ భూములలో కొంతభాగం రైతాంగం అధీనంలోనేవుంది.

పోరంబోక, బంజరు, ఫారెస్టు రిజర్వు భూములను వదులుకోకుండా ప్రజలు సాగుజేసుకుంటూనేవున్నారు. అలాంటి భూమిని యింకా, యింకా ఆక్రమించుకుని సాగుజేసుకుంటున్నారు.

వారు ఇప్పటికే సాగుచేసుకుంటున్న భూములనుండి రైతులను బేదఖల్ జేయటానికి భూస్వాములు, ప్రభుత్వమూ చేస్తున్న ప్రయత్నా లన్నింటినీ ప్రతిఘటించటంకోసం, ఈ భూమిపై తమ హక్కులను కాపాడు కొనటంకోసం రైతాంగాన్ని సమీకరించటమే మనముందున్న ప్రధానకర్తవ్యం.

1. కౌలు భూములను సాగుజేసుకుంటున్న రైతులు ఆభూములలో ఏడాదిపంట విలువకు మూడురెట్లుధర చెల్లించి వచ్చే ఆరుమాసాలలోగా ఆ భూములులను కొనుక్కోకపోతే, భూస్వాములు ఈ భూములను తమయిష్టం వచ్చిన వారికెవరికైనా అమ్ముకోవచ్చునని ప్రభుత్వం ఒక శాసనం చేసింది. భూమిని అమ్ముకునేహక్కు భూస్వామికుండరాదని, భూమిని ప్రస్తుతం సాగుజేసు కుంటున్నవారికే వుచితంగా పట్టాహక్కులివ్వాలని మనం డిమాండ్ చేయాలి. తమ భూములకే అంటిపెట్టుకుని వుండునట్లుగాను వాటినుండి తొలగించటానికి జరిగే ఎలాంటి ప్రయత్నాన్నైనా ప్రతిఘటించవలసిందిగాను రైతులను ప్రబో ధించాలి. అందుకోసం వారిని సమీకరించాలి. రైతాంగం సాగుజేసుకుంటున్న భూమిని కొనటానికి యితరులెవ్వరూ ముందుకు రావలదని కోరుతూ మనం ప్రచారం చేయాలి.

కౌలు రేట్లను మాగాణి భూమిలో మొత్తం పంటలో మూడోవంతుకు, మెట్ట భూమిలోను నీటిపారుదల సౌకర్యంగల భూములలోనూ మొత్తం వుత్పత్తిలో నాలుగోవంతుకూ హెచ్చించటానికి ప్రభుత్వం తెచ్చిన కొత్తచట్టం భూస్వాములకు అవకాశం కల్పిస్తున్నది. ఇప్పుడు అమలులోవున్న కౌళ్ళను పెంచకుండా నిరోధించటంకోసం, కౌలు రేట్లు అధికంగా వున్నచోట్ల వాటి తగ్గింపుకోసం మనం ఆందోళనచేయాలి పోరాటాలను పెంపొందించాలి.

2 రైతాంగంనుండి భూస్వాములు అక్రమంగా స్వాధీనం జేసుకొన్న భూములన్నింటినీ తిరిగి రైతులకు పొప్పగించాలని మనం డిమాండ్ చేయాలి. తాము పోగొట్టుకున్న భూములను తిరిగి సంపాదించటంకోసం పోరాడటానికి ప్రజలను సమీకరించాలి.

3. వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు భూమి కల్పించాలంటే, అవసరంగాబట్టి, భూస్వాములనుండి మిగులు భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని, ఈ భూములను వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు పంచాలని మనం నిరంతరం ఆందోళన సాగించాలి.

4. బంచరాయి, పోరంబోకు, ఫారెస్టు రిజర్వు భూములన్నింటినీ చెట్లుగొట్టి, చదునుజేసి, సాగుజేసుకొనటం కోసం ప్రజలను సమీకరించటానికి మనం పూర్తిగా కేంద్రీకరించి కృషి చేయాలి. ఆభూములను ఆక్రమించుకున్న వ్యవసాయ కార్మికులకు, యితర పేదలకు వాటిపై యాజమాన్యం కల్పిస్తూ పట్టా లివ్వవలసిందిగా మనం డిమాండ్ చేయాలి. ప్రభుత్వం అలాంటి వారి నుండి అదనపు పన్నులు వసూలు చేయరాదని, పెనాల్టీలు విధించరాదని వారి వద్ద మామూలు రేట్ల ప్రకారమే పన్నులు వసూలు జేయాలని కోరాలి.

5. భూకేంద్రీకరణ ఏమేరకు వుంది? ఆ ప్రాంతాలలో వ్యవసాయ కార్మిక, రైతుకుటుంబాలు ఎన్ని వున్నాయి? ఆ ప్రాంతంలో ఎంత భూమి లభ్యమవుతుంది మొదలగు వివరాలను, ప్రతి ప్రాంతంలోనూ పార్టీ యునిట్లన్నీ తక్షణమే సేకరించాలి

## ధాన్యం లెవీలు

లెవీ సేకరణ విషయమై ప్రభుత్వం క్రొత్తగా ఒక ఆర్డినెన్సు జారీ చేసింది. ఈ ఆర్డినెన్సు ప్రకారం, మాగాణి భూములపై రు 12 ల వరకు శిస్తు చెల్లించే వారంతా తాము శిస్తుగాచెల్లించే ప్రతి రూపాయికి ఎనిమిదిశేర్ల చొప్పున లెవీ క్రిందధాన్యం డిపాజిట్ చెయాలి. మెట్టభూముల విషయంలో ప్రతి రూపాయికి నాలుగుశేర్లచొప్పుద జొన్నలు గాని యితర గట్టిగింజలే

వైనాగాని లెవీగా డిపాజిట్ చేయాలి. మెట్టభూములలో పది రూపాయలకు పైన మాగాణి భూములలో పన్నెండు రూపాయలకు పైన శిస్తు చెల్లించేవారు నిర్ణీత స్కేలు ప్రకారం వేరు వేరు మొత్తాలలో లెవీచెల్లించాలి. ఈ స్కేలులో వివిధ ప్రాంతాలకు వివిధరకాలైన రేట్లనునిర్ణయించింది. లెవీ విషయంలో జారీ జేయబడిన ఈ ఆర్డినెన్సును అన్ని వర్గాల ప్రజలూ విమర్శించారు. వ్యతిరే కించారు అయినా, ఎలాంటి మార్పులు చేయకుండానే తన ఆర్డినెన్సును అమలు జరపబూనుకుంటున్న ప్రభుత్వ చర్యను ఈసభ ఖండిస్తున్నది.

ఈ ఆర్డినెన్సు ఎంతో అభ్యుదయకరమైనదని వుద్దేశ్య పూర్వకంగా ప్రభుత్వం ఒక క్రమ పద్ధతి ప్రకారం మోసపూరిత ప్రచారం సాగిస్తోంది పేద సన్నగారురైతాంగం పండించిన పంటలో ఆరోవంతు భాగాన్ని ప్రభుత్వం కొల్ల గొట్టుతోంది. మరోవైపున పెద్ద భూస్వాములవద్ద వందిలాది పుట్ల ధాన్యం వదులు తోంది (ఒక పుట్టి 75 కిలో గ్రాముల వడ్ల బస్తాలు, లేదా 120 కి. గ్రా జొన్నల బస్తాలు ఎనిమిదింటికి సమానం). తమ భూమిలో కొంత భాగాన్నైనా సాగుజేయనివారు, వాణిజ్య పంటలు పండించినవారు సయితం ధాన్యం లెవీ తప్పనిసరిగా చెల్లించాలని ఈ ఆర్డినెన్సు నిర్దేశిస్తున్నది. భూస్వామి చెల్లించే మొత్తం శిస్తు ప్రాతిపదికగా నిర్ణయించబడిన రేటు ప్రకారం, భూమిని సాగు జేసుకుంటున్న కౌలుదారే లెవీ ధాన్యం చెల్లించాలనికూడా ఈ చట్టం కోరు తున్నది. ఇది బహిరంగ దోపిడీతప్ప మరేమీకాదు

ఈ ఆర్డినెన్సు, కష్టజీవులైన రైతాంగం పండించిన పంటను దోచు కోవటమేనని, భూస్వాముల ఆహార ధాన్యాల బ్లాక్‌మార్కెట్ వ్యాపారానికి పేదప్రజలను గురిజేయటమేనని ఈ సభ ఖండిస్తోంది.

బహిరంగ దోపిడీతప్ప మరేమీకాని, ఈ లెవీ ఆర్డినెన్సుకు వ్యతిరే కంగా పెద్దఎత్తున ఆందోళన జేయవలసిందిగాను, దాన్ని తీవ్రంగా మార్పు జేసేట్లుగా ప్రభుత్వంపై వొత్తిడిచేయవలసిందిగాను అతివాదులందరికీ, ప్రజా తంత్రవాదులందరికీ ప్రజలందరికీ ఈ సభ విజ్ఞప్తిజేస్తోంది ఈలెవీ ఆర్డినెన్సును అమలుజరపటాన్ని ప్రతిఘటించటంకోసం దృఢనిశ్చయంతో పోరాటాలు సాగించవలసిందిగా ఈ సభ ప్రజలకు విజ్ఞప్తిచేస్తోంది

## ఆహార సమస్య

ఆహార సంక్షోభానికి, ప్రజలను దోపిడిచేసే భూస్వామ్య వ్యవస్థ కూడా కారణం. ప్రస్తుత ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలు ఆహార సంక్షో

భాన్ని తీవ్రతరం జేస్తున్నాయి. ప్రజలు పస్తులతో మాడేట్లు చేస్తోంది. అంత కంతకూ ఎక్కువమంది, వివిధ రకాలైన అంటువ్యాధులవాత బడేటట్లుచేస్తోంది. ఆ విధానాలవల్ల ప్రజలు బాధలకు గురవుతున్నారు.

ఆహార సమస్యకు మూలకారణం భూస్వామ్య విధానం. దాన్ని రద్దు జేసి, దున్నేవానికే భూమిని పంపిణీచేసినప్పుడే ఆహార సమస్యకు శాశ్వత పరిష్కారం సాధ్యమని గుర్తించి తీరాలి. చైనాలో జనతా ప్రజాస్వామిక రాజ్యం ఏర్పడిన రెండు సంవత్సరాల లోపునే దున్నేరైతులకే భూముల పంపిణీ చేయబడింది. అందువల్ల కరువు కాటకాలు నిర్మూలించటమేగాక, మన దేశానికి పదిలక్షల టన్నుల బియ్యాన్ని ఎగుమతి చేయగలిగింది కూడా.

ఆహార సంక్షోభానికి ఈ మూలకారణానికితోడు, ఈ సంవత్సరం సకాలంలో వర్షాలులేనందువల్ల పంటలు దెబ్బతిన్నాయి. దానితో ఆహార సమస్య మరింత తీవ్రతరమయింది. ప్రజల పరిస్థితి ఆందోళనకరంగా తయారైంది. దీనంతటికితోడు, శిస్తురేట్ల ప్రాతిపదికపై లెవీ విధించటం పేరుతో రైతాంగం వద్దగల ధాన్యమంతటినీ కాజేస్తున్నది. వారిని పస్తులుండే స్థితికి దిగజార్చుతోంది. తత్ఫలితంగా ఏర్పడిన కరువు పరిస్థితిని పరిష్కరించేందుకు ప్రభుత్వం సిద్ధంగా లేదు.

అవమానకరమైన షరతులు లేకుండా, సమానత్వం ప్రాతిపదికపై ప్రభుత్వం విదేశాలనుండి అవసరమైన ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవాలి. ప్రత్యేకించి, సోవియట్ యూనియన్, చైనాలనుండి దిగుమతి జేసుకోవాలి.

ప్రభుత్వం యింకా దిగువ చర్యలుకూడా తీసుకోవాలి :

— ప్రజల అవసరాలకు సరిపడునంత ధాన్యాన్ని గ్రామాలలో వుండనివ్వాలి. మిగులు ధాన్యాన్ని మాత్రమే పట్టణాలకు తీసుకెళ్ళాలి. కొరత గ్రామాలకు, వెలుపలినుండి ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోవాలి.

— బ్లాక్‌మార్కెట్ వ్యాపారాన్ని నిరోధించటంకోసం, సరసమైన ధరలకు ప్రజలకు ఆహారధాన్యాలు సరఫరా జేయటంకోసం గ్రామ ప్రజాకమిటీల అజమాయిషీ క్రింద, ప్రభుత్వం పెద్దఎత్తున రేషన్ దుకాణాలు తెరవాలి.

— ఆహారధాన్యాలు కొనుక్కోగల పరిస్థితిలో లేని ప్రజలకు, ప్రత్యేకించి, ఫారెస్టు ప్రాంతాలలోని చెంచులు మొదలైన గిరిజనులకు ప్రభుత్వమే వుచితంగా ధాన్యం సరఫరా చేయాలి.

— భూస్వాములచేత, 75 కిలోగ్రాముల వడ్లబస్తా రు 25 ల చొప్పున అమ్మించాలి. వెంటనే డబ్బు చెల్లించి, కొనుక్కోలేనివారికి, తర్వాత చెల్లించే పద్ధతిపై అప్పుగా అమ్మించాలి.

పైన పేర్కొన్న డిమాండ్లన్నింటినీ సాధించుకొనేందుకుగాను, ప్రజలను సమీకరించి, ప్రభుత్వ కార్యాలయాలవద్దకు ఆకలియాత్రలు నడప వలసిందిగా ఈ సభ పార్టీ యూనిట్లన్నింటినీ కోరుతోంది.

## వ్యవసాయకార్మికులు

మన తెలంగాణా పోరాటంలో, వ్యవసాయ కార్మికులు ముందు పీటీన నిలిచారు. అనేకచోట్ల వారు అధిక వేతనాలకోసం, పెద్ద సమ్మెలు నడిపి, తమ డిమాండ్లను సాధించుకున్నారు. కాని, ఇప్పుడు ప్రభుత్వం సాగిస్తున్న కౄర నిర్బంధకాండక్రింద, వ్యవసాయ కార్మికులను అణచివేయటానికీ, తక్కువ వేతనాలను వారినెత్తిన రుద్దటానికీ భూస్వాములు ప్రయత్నిస్తున్నారు.

వ్యవసాయకార్మికులను, బలమైన వ్యవసాయ కార్మికసంఘాలలో సంఘటిత పరచలేకపోయినందున, తీవ్రనిర్బంధకాండ అములులోవున్న నేటి పరిస్థితులలో వారు తమ ప్రయోజనాలను సంరక్షించుకొనలేక పోతున్నారు. అందువల్ల వారిని, వ్యవసాయ కార్మిక సంఘాలలో సంఘటిత పరచడం, వారి డిమాండ్లను, హక్కులను కాపాడుకునేందుకు పోరాటాలు సాగించటం అవసరం. భూ సారాన్నిబట్టి, వ్యవసాయపరిస్థితులనుబట్టి, వ్యవసాయకార్మికుల డిమాండ్లను, మూడు విభిన్నతరగతులుగా రూపొందించాలి.

1. నల్లనేల : మామూలు రోజుల్లో రోజుకు నాలుగుశేర్లు, పనులు ముమ్మరంగా వుండేరోజులలో ఎనిమిదశేర్లు జొన్నలు రోజుకూలిగా వుండాలి.

పాలేర్లకు, భోజనంపెట్టి ఏడాదికి రు. 300 లు, లేదా 15 బస్తాల జొన్నలు లేదా యితర తృణధాన్యాలు యివ్వాలి

2. ఎర్రనేల . రోజుకూలి, మామూలు రోజులలో మూడుశేర్లు, పనులు ముమ్మరంగా వుండే రోజులలో ఆరుశేర్లుగా వుండాలి.

పాలేర్లకు నెలకు 90 శేర్ల జొన్నలివ్వాలి.

3. ఇసుకనేల : భూసారం అతి తక్కువగా వుండే గలసా నేలల్లో, రోజుకూలి, మామూలురోజుల్లో మూడుశేర్ల వడ్లు, పనులవాతిడి రోజులలో నాలుగుశేర్లువడ్లు యివ్వాలి. పాలేర్లకు నెలకు తొంభైశేర్లు వడ్లుయివ్వాలి. (శేరున్నరవడ్లు, శేరు జొన్నలకు సమానంగా లెక్కగట్టాలి)

4. ఫారెస్టు ప్రాంతాలలోని, పచ్చికబయళ్ళ ప్రాంతాలలో, పాలేర్లకు, రోజుకు ఒకశేరు జొన్నలు, దానికవసరమైన యితర అనుబంధ

పదార్థాలు, అవిగాక సంవత్సరానికి రు 200 లు రొక్కం యివ్వాలి. లేదా, నెలకు రు 50 లు జీతమైనా యివ్వాలి.

5. అన్నిప్రాంతాలలోనూ పాలేర్లకు సంవత్సరం మొత్తంమీద ముప్పై రోజులు సెలవు లివ్వాలి. (ప్రతి నెలపొడుపు రోజు, పౌర్ణమిరోజు, సంవత్సరాది, దీపావళి, దసరా, సంక్రాంతి, మేడే, కొన్ని స్థానిక వుత్సవాలు సెలవు దినాలుగా పరిగణించబడాలి, పాలేర్లకు రోజుకు ఎనిమిదిగంటల పని కాలం అమలు జరపాలి

6. స్త్రీలకు కూడా పురుషులతో సమానంగా వేతనాలు చెల్లించాలి.

## మానుకోట ప్రాంతంలో

## భూ సమస్యపై మన నినాదం

భూమి పంపిణీయొక్క మౌలిక లక్ష్య మేమిటి? మనం ఈ వుద్యమం సాగించటానికి ప్రధాన కారణమేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానంగా కా॥మేడ్ లీ-షావ్-చీ యిలా చెప్పాడు: "అయితే ఈ పరిస్థితిని మార్చటంకోసం, మనం భూసంస్కరణల ముసాయిదాలోని మొదటి అధ్యాయాన్ని అనుసరించాలి. భూస్వామ్య విధానాన్ని, ఫ్యూడల్ దోపిడీని అంతజేయటంద్వారా (భూమి పంపిణీద్వారా - ప్రాంతీయ సమన్వయ కేంద్రం) గ్రామీణ ప్రాంతంలో వుత్పత్తి శక్తులను బంధనాలనుండి విముక్తి చేయటంకోసం, చైనా దేశ పారిశ్రామికీకర ణకు బాటవేయటంకోసం మనం, దున్నేవానికే భూమి" విధానాన్ని ప్రవేశ పెట్టాలి ఈ మౌలిక ఆశయంతో, ఈ మౌలిక లక్ష్యంతో, మనం భూసంస్కర ణలు అమలుజరపవలసియుంది". (పీపుల్స్ చైనానుండి)

*భూమి పంపిణీ విధానం:* 1. ప్రధమదశలో పెద్దభూస్వాముల భూములను పంపిణీచేయాలి. తాత్కాలికంగా కొంతకాలంవరకు చిన్న భూస్వాముల జోలికి పోకుండావుండాలి. తద్వారా వారిని తటస్థులుగావుండు నట్లుచేయవచ్చు పెద్ద భూస్వాములన్నప్పుడు తాలూకా మొత్తంమీద పెద్ద భూస్వాములైన వారినే పరిగణనలోకి తీసుకోము. మనం ఈ సమస్యను గ్రామ ప్రాతిపదికపైన కూడా పరిశీలించాలి ఏదైనా ఒక గ్రామంలోగాని, ఒక కేంద్రంలోగాని భూమి పంపిణీ చేయవలసివచ్చినప్పుడు, స్థానిక భూస్వాములలో పెద్దసెక్షను ఏదోచూచి వారి భూములను పంపిణీచేయాలి పెద్దభూస్వాములంటే వందల, వేల ఎకరాలభూమి గలిగియుండి, ప్రజలపై పెత్తనం చేస్తుండే వాళ్ళు. వాళ్ళే స్టేట్ కాంగ్రెస్ నాయకులుగా, పోలీసు ఏజెంట్లుగా, హోంగార్డుల నాయకులు మొదలైన వారుగాకూడా వుంటారు. వీరి

భూములను పంచిపెట్టిన తర్వాత ఈ భూములపై ప్రజలు తమ ఆధిపత్యాన్ని సుప్రతిష్ఠిత మొనరించుకున్న తర్వాత మనం క్రమంగా మిగతా భూస్వామ్య వర్గం యొక్క భూముల పంపిణీకి పూనుకోవచ్చు.

2. తటస్థంగావుంటూ పోరాటానికి హాని కలుగజేయని భూస్వామి కయితే ఆ గ్రామాలలో ధనికరైతుకు వుండేంతభూమినివుంచి మిగతాభూమినే పంచిపెట్టాలి. శత్రువులుగా వ్యవహరిస్తున్న భూస్వాముల భూములను పూర్తిగా స్వాధీనం చేసుకోవాలి.

3. పంపిణీ చేయబడేభూమిలో అత్యధికభాగం వ్యవసాయ కార్మికు లకు, పేదరైతులకూ దక్కాలి. ఆ తర్వాత మధ్యతరగతి రైతులకు యివ్వాలి

4. పోరంబోకు, బంచరాయి భూములలో కొంతభాగాన్ని గ్రామ సమిష్టి అవసరాలకోసం వదిలి, మిగతా భూమినికూడా పంపిణీజేసే భూములలో చేర్చాలి. ఫారెస్టు ప్రాంతాలలో పోడుసాగు చేసుకునేందుకు గ్రామస్థులందరికీ స్వేచ్ఛవుండాలి వ్యవసాయ కార్మికుడుమొదలు, ధనిక రైతువరకు ప్రతివారూ తమకవసరమైనంతమేరకు పోడుసాగు చేసుకోవచ్చు. అయితే ఒక్కొక్కరి అధీనంలోవుండే భూమి ధనికరైతు పరిమితులు దాటరాదు.

*కౌలు భూములు :* ఆయా భూములను వాటిని సాగుజేసు కుంటున్న కౌలుదార్లకే యివ్వాలి. అయితే కౌలుదార్లుగా వున్నది ధనిక రైతు లయితే, చాలా దీర్ఘకాలంగా వారు ఆ భూములను తమ అధీనంలో కలిగి వుంటేనే వారి కివ్వవచ్చు. అలా కానట్లయితే, ఆ భూములనుకూడా పంపిణీ కోసం తీసుకోవాలి. దీర్ఘకాలంగా కౌలు హక్కు కలిగివుండటమంటే, సాధార ణంగా ఐదారు సంవత్సరాలు, అంతకు పైగా అధీనంలో వుండటమే. కౌలు హక్కు నిర్ణయం మూడు లేదా అంతకంటె ఎక్కువ సంవత్సరాలకు జరగాలి. ఈ కొలబద్ద కేవలం మన అవగాహనకోసమే. కొన్ని సందర్భాలలో మినహా యింపులుకూడా వుండవచ్చు.

*అక్రమ ఆక్రమణ :* భూస్వాములచే అక్రమంగా ఆక్రమించుకో బడిన భూములను, వాటి వాటి స్వంతదారులకు తిరిగి యిచ్చివేయాలి. ధనిక రైతులచేతనో, మధ్య తరగతి రైతుల చేతనో అక్రమంగా ఆక్రమించుకోబడిన భూముల విషయంలో రాజీ పద్ధతిలో పరిష్కారం జరగాలి.

ఇతర ప్రాంతాలలో వలెనే, మానుకోట ప్రాంతమంతటిలోనూ భూమి పంపిణీ సమస్య ద్విముఖమైన సమస్య : (1) పంపిణీ చేయబడిన భూములపై రైతుల హక్కుల రక్షణ, (2) కొత్త భూముల పంపిణీ. వరంగల్– ఖమ్మం రోడ్డుకు తూర్పువైపునగల మానుకోట, సూర్యాపేట ప్రాంతాలలోని

దాదాపు అన్ని గ్రామాలలోను, 'పోలీసు చర్య'కు ముందుగాని, 'పోలీసుచర్య జరిగిన వెనువెంటనే గాని పూర్తిగా పంపిణీ చేయబడింది. ఇచ్చట ప్రజలు తమకు పంచి యివ్వబడిన భూములలో ఎక్కువభాగాన్ని, కౌలురూపంలోనో పాలు రూపంలోనో తమ అధీనంలో వుంచుకొన్నారు. లేదా కొద్దిపాటి ధర చెల్లించి కొనుక్కున్నారు. భూస్వాములచే అక్రమంగా ఆక్రమించుకోబడిన భూముల విషయంలో కౌలుగాని, పాలుగాని చెల్లించటానికి ప్రజలు నిరాకరిస్తున్నారు. అందువల్ల, ఈ ప్రాంతంలో గతంలో భూస్వాములనుండి స్వాధీనం జేసుకున్న భూములకు ప్రజలు గట్టిగా అంటిపెట్టుకుని వుండేట్లు చూడవలసి వుంది. భూస్వాములకు మిగిలివున్న భూములపైనకూడా కౌళ్ళు, పాళ్లు నిరాకరించేందుకుగాను ప్రజలను సమీకరించవలసియుంది.

ఖమ్మం – వరంగల్ రైల్వేలైనుకు, ఖమ్మం–వరంగల్ రోడ్డుకుమధ్య గల మానుకోట, వరంగల్ తాలూకాలలోని మేటరాజుపల్లె, పిండిప్రోలు, జయ్యారం, వెంకటాయపాలెం కేంద్రాల గ్రామాలలో భూమి పంపిణీ కొంత మేరకు జరిగింది. అత్యధిక సంఖ్యాకగ్రామాలలో భూమి పంపిణీ యింకా జరగలేదు. అందువల్ల పంపిణీని పూర్తిజేయటమే ఈ గ్రామాలలో సమస్య.

ఫారెస్టు ప్రాంతాలలో : ఫారెస్టుభూములను సాగుకు యోగ్యం జేయటమనే సమస్య కూడా మనముందున్నది. పాఖాల్,రామప్ప,లఖ్నవరం, బయ్యారం, గండిపేట చెరువులక్రిందగల భూస్వాముల భూమిపంపిణీని యింకా చేపట్టవలసేయుంది. గార్ల, పాఖాల్, గుండాల పచ్చికబయళ్ళలో పోడుసాగు యిప్పటికే సాగుతోంది. దానినే అన్నిప్రాంతాలకు విస్తరించవలసియుంది.

కొత్తప్రాంతంలో అంతే, మంథెన, చెన్నూరు మొదలగు గ్రామాలలో ఫారెస్టువుంది. అయితే ఎక్కువ భూములు భూస్వాముల అధీనంలో వున్నాయి. పోడుసాగు సమస్య యిక్కడ కూడా వుంది.

ఈ ప్రాంతాలలో ఆహారధాన్యాలు స్వాధీనం చేసుకోబడ్డాయి. ప్రజలతో దృఢమైన సంబంధాలేర్పరచుకోబడ్డాయి. ఇక్కడ నిర్మాణం పటిష్ఠమైంది. మిగిలివున్న సమస్య భూమిపంపిణీయే. ఈ సమస్యపై ప్రజలను సమీకరించేందుకు పార్టీ తక్షణమే కదలాలి. మైదాన ప్రాంతాలలోవలెనే, ఈ ప్రాంతాలలోనూ ఒక్కొక్కరిక్రింద ముప్పై – నలభై మంది కౌలుదార్లుగల చాలా పెద్దజమీందార్లున్నారు. కొంతమందివద్ద ముప్పైనలభై అరకలున్నాయి. వారిలో కెల్లా పేరుమోసినవాళ్ళు, పింగళి కుటుంబం, ఆనంద చక్రవర్తి, తాడిచర్ల పాపారావు, గూడెం జగన్నాథరావు, కాల్వ రాంరెడ్డి మొదలైనవారు. ఈ భూస్వాముల భూముల పంపిణీకోసం ప్రజలంతా ఎదురుజూస్తు

న్నారు. వారు ఈ దోపిడీదార్లను ప్రతిఘటిస్తున్నారు కూడా. అందువల్ల పార్టీ ఈ భూముల పంపిణీని చేపట్టినట్లయితే కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో పెద్ద యెత్తున వెల్లువ ఏర్పడుతుంది. ఈ ప్రాంతపు మైదాన ప్రాంతాలకు చెందిన అన్ని గ్రామాలు మన ఉద్యమపరిధిలోకివస్తాయి.

## ఇతర విప్లవ ప్రజాపోరాటాలు

ప్రతి మూలమలుపులోను, ప్రతి క్లిష్టపరిస్థితిలోనూ, వ్యవసాయ కార్మిక పోరాటాలద్వారానే కొత్తవూపు ప్రారంభ మవటాన్ని మనం చూస్తున్నాం. అందువల్ల, పార్టీ వాటిపైనే సవ్యంగా కేంద్రీకరించాలి.

ధనిక రైతులు కూడా మనఐక్యసంఘటనలోచేరే అవకాశమున్న వర్గమే వారు కూడా వ్యవసాయ కార్మికుల పోరాటాలకు అండగా నిలవాలి. వారిని, సాధారణ సమస్యపై రంగంమీద నిలపటంతోనే సంతృప్తిచెందరాదు.

*స్వాధీనం చేసుకొనటానికి సంబంధించిన సమస్యలు :* ఆహార ధాన్యాలను స్వాధీనం చేసుకొనటానికి, ప్రజలు మొదటినుండీ వెల్లువగా లేస్తూనేవున్నారు. ఆ చర్యయే వుద్యమాన్ని సజీవంగా నిలువుతోంది. నూతన ప్రాంతాలలో ఈ చర్యతోనే మన వుద్యమం ప్రారంభమవుతుంది. వ్యవసాయ కార్మికుల పోరాటాలను, ధాన్యం స్వాధీనం చేసుకొనటాన్ని, భూ పోరాటాలుగా పెంపొందించాలి. అలా చేయకపోతే, అవి ఆర్థిక పోరాటాలుగా మాత్రమే మిగులుతాయి.

*మహిళల సమస్య :* ప్రజా పోరాటాలన్నింటిలోనూ స్త్రీలూ సమాన భాగస్వాములనే విషయాన్ని విస్మరించరాదు. దీన్ని దృష్టిలో వుంచుకొని, పురుషులతో సమానంగా స్త్రీలనుకూడా సమీకరించాలి. ఆస్థిహక్కు, విడాకులు, రాజకీయ, సాంఘిక, ఆర్థిక రంగాలలో సమానహక్కులు మొదలుగాగల, వారి ప్రత్యేక సమస్యలపైన కూడా వాటితోపాటే పోరాటాలు నిర్వహించాలి. ప్రపంచ శాంతి సంరక్షణ సమస్యపైనకూడా మహిళలను సమీకరించాలి.

# ప్రస్తుత రహస్య నిర్మాణం

## మన కర్తవ్యాలు

సర్క్యులర్ నెం. 8 & 10

14—5—1949

ఆత్మవిమర్శనను, అనుభవాన్ని ఆధారం చేసుకొని మనం పార్టీ నిర్మాణం, రాజకీయ విధానం, మిలటరీ వ్యవహారాలపై కొన్ని నిర్ణయాలకు, సహజంగా వస్తాం. అలాగే మన గత అనుభవాన్ని దృష్టిలో వుంచుకొనే రహస్య పార్టీ సంస్థలను నిర్మించుకునే విషయంలోకూడా ఒక స్పష్టమైన అవగాహనకు రావలసి వుంటుంది.

### మనం రహస్య పద్ధతులను
### ఏ ప్రాతిపదికపై అనుసరించాలి ?

మనం తీసుకోవలసిన జాగ్రత్తలు, రహస్యపద్ధతులు, ప్రజావుద్యమాల పైన, ప్రజా పోరాటాల స్థాయిపైన, గ్రామాలలో మనకుగల సంబంధాలపైన; శత్రువుయొక్క బలం, ఎత్తుగడలపైన, నిర్బంధం యొక్క స్వభావంపైన ఆధార పడి వుంటాయి. అందువల్ల, నిర్దిష్ట పరిస్థితి కనుగుణంగా మన రహస్య నిర్మాణ పద్ధతులను మార్చుకోవలసి వుంటుంది.

శత్రువు యొక్క ఎత్తుగడ లేమిటి ? నిర్బంధకాండ యొక్క స్వభావ మేమిటి ? జరిగిన మార్పు లేమిటి ? వాటినిబట్టి మనం తీసుకోవలసిన జాగ్రత్త లేమిటి ? అనే విషయాలను మనమిప్పుడు పరిశీలిద్దాం.

## శత్రువు యొక్క ప్రస్తుత పథకం

1. శత్రుక్యాంపులు తక్కువ దూరంలో, ఒకదానికొకటి సమీపంలో ఏర్పాటు చేయబడినాయి. మన కామ్రేడ్సు ఆచూకీ తెలుసుకునేందుకు వారు తమ కార్యకలాపాలను సమన్వయ పరచుకుంటున్నారు. కొన్ని క్యాంపులలో వైర్లెస్ సాధనాలుకూడా ఏర్పరచబడ్డాయి.

2. ప్రత్యేకంగా రాత్రివేళల్లో, వారు మన మార్గాలపై కాపలా గాస్తున్నారు. మన కామ్రేడ్సు కొరకు మూలమూలలా, పొలాలలో సయితం వెదుకుతున్నారు. ఖమ్మం ప్రాంతాలలో ధనిక రైతుల బృందం తోడ్పాడుతో వారుఅడవులలో గాలించారు. సెంట్రీల మెలకువవల్ల నేమనంతప్పించుకోగలిగాం.

3. గ్రామాలలో సి. ఐ. డి. శాఖను (లేదా డబ్బుతీసుకొని పనిజేసే ఏజెంట్ల బృందాన్ని) బలంగా అట్టిపెట్టుకున్నారు. ధనిక రైతాంగం మనపట్ల శత్రుత్వ వైఖరి నవలంబించినప్పుడు, శత్రువుకు మన జాడనుగూర్చిన సమాచారం పొక్కడంలో ఆశ్చర్య పడవలసిందేమీలేదు.

పిండిప్రోలు కామ్రేడ్సు సిగరెట్లకోసం ఒక కుర్రవాడిని పంపించారు. అప్పుడు అతని నుండి ఆ దుకాణదారుడు దళము, నాయకులూ ఎక్కడున్నదీ సమాచారం రాబట్టాడు పోలీసులకు కబురంపాడు. పోలీసులు తక్షణమే అక్కడికివెళ్ళి మన కామ్రేడ్సును చుట్టుముట్టారు. అతి కష్టంమీద మాత్రమే వారు తప్పించుకోగలిగారు· అలాంటి సంఘటనలనేకం జరిగాయి. సి. ఐ. డి. శాఖ, ధనికవర్గాలూ మన కామ్రేడ్సును ఏ విధంగా వెంటాడు తున్నదీ దీన్నిబట్టి విదితమవుతుంది.

వీరాచారి అనునొకరికి కొన్ని వస్తువులిచ్చిన ధనికరైతు ఒకరు పోలీసులకు సమాచారమందించాడు. ధనికులు మన కామ్రేడ్సుకు ఆశ్రయం కల్పిస్తూనే, సహాయంచేస్తూనే పోలీసులకు సమాచారం పంపిన ఘటన లనేకమున్నాయి.

4. శత్రువు చాలా ముమ్మరంగా సంచరిస్తున్నాడు. రాత్రయినా, పగలైనా మనజాడ తెలిసిన మరుక్షణమే లెంపరితనంతో శత్రువు మనలను చుట్టుముట్టుతాడు బయ్యారం ఫారెస్టులో యిటీవల శత్రుకేంద్రీకరణ జరిగింది. మనజాడను తెలుసుకుని శత్రువు బొడ్లాడ కొండలవద్దకు రావటం, మన ఖమ్మం

కా[మ్రేడ్సుపై నాగులంచవద్ద దాడిజేయటం ఇవన్నీకూడా శత్రువు ఎంత మెలకువగా వుంటున్నాడో, ఎంత త్వరత్వరగా వ్యవహరించ గలుగుతున్నాడో స్పష్టంగా సూచిస్తున్నాయి అంతేకాదు, పిండి[ప్రోలు [ప్రాంతంలో వాల్ పోస్టర్లు అంటించబడిన వెనువెంటనే [గ్రామస్థులపైన వారు పెద్దఎత్తున దాడి జేశారుకూడా. మన కార్యకలాపాలలో [ప్రతి అంశాన్ని అవరోధించటానికి శత్రువు చురుకుగా పనిజేస్తున్నట్లు దీనినిబట్టి తేలుతున్నది.

5. మన రహస్యాలను రాబట్టుకొనేందుకు శత్రువు తీ[వతరమైన నిర్బంధకాండకు, హింసాకాండకు పూనుకుంటున్నాడు. దీనివల్ల మెతకదనం గలవారిద్వారా మన రహస్యాలను, జాడలను వారు సులభంగా తెలుసుకో గలుగుతున్నారు.

మనకు సహాయపడిన వ్యక్తులపై శత్రువు క్రూరచర్యలకు దిగుతున్నాడు. డి ఆర్. రెడ్డికి ఆ[శయమిచ్చాడనే ఆరోపణపై కొత్తగూడెం [గ్రామస్థుడగు బొబ్బాల వెంకన్నను బండకేసి బాది చంపారు. ఇప్పటికే యిలాంటి ఘటనలు లెక్కలేనన్ని జరిగాయి.

భవిష్యత్తులోకూడా యిలాంటి క్రూరచర్యలు సాగించటానికే శత్రువు కృతనిశ్చయంతో వున్నాడు. [ప్రజలు మనకు తోడ్పడకుండునట్లు చూడటమే వాళ్ల వుద్దేశ్యం.

మన రహస్యాలను తెలుసుకొనటానికిగాను, శత్రువు దిగువ పేర్కొన్న పద్ధతులనుకూడా అనుసరించుతున్నాడు. అవి [ప్రధానంగా రెండు తరహాలుగా వుంటాయి ఒకటి, అడవి[ప్రాంతాలలో, రెండోది మైదాన [ప్రాంతాలలో అనుసరించబడే విధానాలు

## ఫారెస్టు [ప్రాంతంలో

తలమీాదిజుట్టు [క్రాపువేయబడి వున్నా, తెల్లటి దుస్తులు ధరించి వున్నా, సబ్బువాసనగాని, కొబ్బరినూనెవాసనగాని తగిలినా అనుమానం మీాదనే శత్రువు అరెస్టులు సాగిస్తున్నాడు. జేబుల్లో కాగితంముక్క కనిపించినా అనుమానిస్తున్నాడు. తమ బంధువులద్వారా, తమకుగల సాంఘిక సంబంధాల ద్వారా మనలనుగూర్చిన సమాచారం సేకరించేందుకు కోయలు, తదితరుల లోగల అభివృద్ధినిరోధకులు [ప్రయత్నిస్తున్నారు మనం దాగివుండే కేం[దాలను గూర్చి తెలుసుకొనటానికి శత్రువు ఫారెస్టు కాం[ట్రాక్టర్లద్వారా కూడా [ప్రయత్నిస్తున్నాడు

వంట జేసుకొనటానికుపయోగించిన యిటుకలను, పాత్రలను, పుల్లిపాయలమీదిపొట్టు, మిరపకాయలతొడిమలు భోజనం చేసిన విస్తరాకులు మొదలైనవాటిని గమనించటంద్వారాకూడా మన స్థావరాల జాడ కనిపెట్టేంతటి అతిజాగ్రత్తలో వారున్నారు.

నీటివూటలవద్ద, జలాశ్రయాలవద్ద వారు కాపలాకాస్తారు. మనకామ్రేడ్స్‌ను, ఒకచోటగాకపోతే, వేరొక చోటనైనా పట్టుకోవచ్చుననే వుద్దేశ్యంతో వారు ఒక్కొక్కసారి ఐదు లేక అంతకంటే ఎక్కువ జలాధారాలను చుట్టుముట్టుతున్నారు

రాత్రివేళల్లో కూడా కాపలా కాస్తున్నారు గ్రామాలను కూడా చుట్టుముట్టుతున్నారు.

## మైదాన ప్రాంతాలలో

మోటబావుల వద్దను, పశువుల చావళ్ళ వద్దనూ శత్రువు నిఘా వేసి వుంచుతున్నాడు. మన రాకపోలను గమనించడం కోసమని ధనిక రైతులు మోతులవద్దకు ఆకస్మికంగా వెళ్ళివస్తున్నారు.

అదే వుద్దేశ్యంతో, ధనిక రైతులు ఏదో ఒకసాకుతో శ్రమజీవుల యిండ్లలో అడుగుబెడుతున్నారు. ఫారెస్టులలోగల కామ్రేడ్స్‌కు అవసరమైన వస్తువులను కొనుగోలు చేస్తున్న వ్యక్తులను శత్రువు అనుమానిస్తున్నాడు. పెన్సిళ్ళు, కార్బన్ పేపర్లు, తెల్లకాగితాలు మొదలైనవి సాధారణ అవసరాలకుమించి కొన్నప్పుడు, అలాంటి వారిని అనుమానంతో చూస్తున్నారు. వ్యాపారస్థులుగాక, మామూలు వ్యక్తులు అలాంటివి కొన్నప్పుడు, వారిని అనుమానంమీద నిర్బంధంలోకి తీసుకుని, వారిద్వారా మనజాడ తెలుసుకొనటానికి ప్రయత్నిస్తారు.

పదిమందిగాని అంతకంటె ఎక్కువమందిగాని, ఏదైనా సమావేశానికి హాజరవటానికిగాని, మరే పనిమీదనైనాగాని ఎక్కడికయినా కలసి వెళ్ళితే, శత్రువు వాళ్ళను వెంటాడటం జరుగుతోంది.

గుప్తమైన రూపాలలో కామ్రేడ్సుకు సహాయపడుతున్నారని, తామనుమానించినవారి యిండ్లకువెళ్లి తలుపుదట్టి ఫలానా నాయకు డొచ్చాడనో, ఫలానాదళం వచ్చిందనో చెప్పి దానిపై వారెలా వ్యాఖ్యానిస్తారో తెలుసుకొనటానికి, వారు మన కామ్రేడ్సుకు సహాయపడుతున్నదీ లేనిదీ తెలుసుకొనటానికి ఎత్తుగడలు వేస్తుంటారు.

శత్రువు యింకా ఎలాంటి కొత్త ఎత్తుగడలనుసరిస్తున్నదీ మీ స్వంత అనుభవం ద్వారా తెలుసుకోవాలి.

## ప్రజా సహకారం

దోపిడీకి గురవుతున్న సామాన్య ప్రజానీకం, శత్రు ఎత్తుగడలను సులభంగా అర్థం చేసుకొనగలరు అనేకమంది పార్టీ సభ్యులకంటె ప్రజలే బాగా అవగాహన చేసుకోగలరు కార్మికవర్గ చైతన్యమూ, దృక్పథం లోపించినందువల్ల, వివిధ వర్గాలనుండి వచ్చిన పార్టీ సభ్యులు కొందరు శత్రు పథకాన్ని, కార్యకలాపాలను అర్థం చేసుకొనజాలరు.

శత్రువు సంచారాన్నిగూర్చి, ఎత్తుగడలనుగూర్చి ఈనాడు ప్రజలే మనకు ముందుగా సమాచారం అందజేస్తున్నారు. జాగ్రత్తగా వుండవలసిందిగా వారు మనలను హెచ్చరిక జేస్తున్నారు. దారుణమైన భీభత్సకాండ సాగుతున్నప్పటికీ, వారు మనకు భోజనాలు పెడుతున్నారు. తమ యిండ్లలోను, నూతులవద్దనూ మనకు ఆశ్రయం కల్పిస్తున్నారు. మనం దాగివున్న చోట్లను చూపవలసిందిగా ప్రజలను హింసించినప్పుడు, వారు వుద్దేశ్య పూర్వకంగానే ఏదో వొక విధంగా వాటిని చూపకుండా తప్పుకుంటున్నారు మనకు ముందుగానే సమాచార మందించటం ద్వారానో, శత్రువుకు తప్పుడుసమాచారమివ్వటం ద్వారానో, శత్రువు వచ్చిపడుతున్నట్లు మనకు సూచన ప్రాయంగా తెలుపటం కోసం పెద్ద గొడవ చేయటంద్వారానో మనకు తోడ్పడుతున్నారు.

మన కామ్రేడ్సు తమను గురించిన సమాచార మెక్కడ బయటపెడతారోనని కొన్ని సందర్భాలలో ప్రజలు భయపడుతున్నారు. అందువల్లనే, కొన్ని సందర్భాలలో ప్రజలు మనకు సహాయపడటానికి ముందుకు రావటం లేదు. ఆ విధమైన భయం వున్నప్పటికీ, ప్రజలు మనకు సహాయపడుతూనే వున్నారు ఒక తల్లి అజ్ఞాతవాసంలో వుంటున్న తన కుమారునికి భోజనం పెడుతూ, యిలా అడిగింది: "నువ్వు భోజనం చేసిన తర్వాత, శత్రువుకులొంగిపోయి, ఈ విషయాన్ని శత్రువుకు వెల్లడించి, నన్ను కొట్టించి, హింసలపాలు జేస్తావా ? శత్రువుకు ఎన్నటికీ తలవంచ వద్దు. లొంగిపోవద్దు ఎన్నడూ పోలీసుల చేతికి చిక్కవద్దు." మన పోరాటంపట్ల, మన విధానంపట్ల ప్రజలకు సంపూర్ణ విశ్వాసం వుంది. రహస్యంగా పనిచేయటానికి, ప్రజలను బయటపెట్టకుండా వుండటానికి మనకుగల శక్తి విషయంలోనే వారికి సందేహం. మనవైపునుండి ఇటీవల అలాంటి వైఫల్యాలనేకం జరగడమే అందుకు కారణం. ప్రజలకు, శత్రువుకు తెలియనీయకుండా మనం, రోజువారీ కార్యకలాపాలు సాగిస్తుండేట్లయితే వారికి మనపట్లగల విశ్వాసాన్ని పునరుద్ధరించేట్లయితే, ప్రజలు ఎంతటి మహా

న్నత త్యాగాలకయినా సిద్ధమే. వారి నుండి మనం ఆశించుతున్న కర్తవ్యాల నిర్వహణకు వారు సంసిద్ధమే అందువల్ల, పైన పేర్కొన్న శత్రు ఎత్తుగడలను తట్టుకుంటూ, ప్రజా చైతన్యంయొక్క స్థాయి ననుసరించి, మన దళాల భద్రత, పని నిర్వహణ, ఆయుధాలు, పార్టీ సభ్యులు, కొరియర్లు, ఆర్గనైజర్లు, ఆయుధాల పాతర్లు, కేంద్రాలు, మార్గాలు మొదలగు వాటిపై ఆధారపడి రహస్య కార్య కలాపాలు సాగించటం మన ప్రధాన కర్తవ్యంగా, ఎత్తుగడగా వుండాలి.

మనం పనిచేసిన తీరును, చేసిన తప్పులనుగూర్చి మనం సమీక్షించు కొని, అవే తప్పులు తిరిగి జరగకుండా జాగ్రత్తపడాలి.

## మన లోపాలు, పొరపాట్లు

మన తక్షణ అవసరాలకు సంబంధించినంతవరకూ మనం సాంకేతిక మైన జాగ్రత్తలన్నీ పాటిస్తాం. కాగా, ఆ తర్వాత మనం వాటిని నిర్లక్ష్యంచేస్తాం.

1 మనం ఒక్కతావున వున్నంతకాలం మనంజాగ్రత్తగానేవుంటాం. అక్కడినుండి మకాం మార్చితే యిటుకలు, సిగరెట్లు, కాగితాలు, పాతకుండలు, పాతగుడ్డలు, ఆకులు మొదలగు వస్తువులన్నీ అక్కడే వదిలేసి వెళ్తాం. వంట జేసుకున్నచోట్లు, స్నానాలుజేసినచోట్లు, నిద్రబోయినచోట్లు శత్రువుకు మన ఆచూకీ తెలిపే స్థితిలోనే వుంటాయి. మనం ఆ స్థలాన్ని, ఆ విధంగా వదిలి వెళ్ళటంలో మన వుద్దేశ్యం, మనం తిరిగి ఆ చోటికి రాబోమని, అందువల్ల, శత్రువు దాన్ని చూచినా ఎలాంటి హాని జరగదనేదే. దీనిద్వారా, శత్రువుకు మన జాడ తెలుసుకోవటం సాధ్యపడకపోయినప్పటికీ, మనం సాధారణంగా ఏ తరహా స్థలాల నుపయోగించుకొంటామో తెలుసుకొనటానికి అది వుపయోగ పడుతుంది అలాంటి స్థలాలకోసం వారు గాలిస్తారు. మొదట ఖాళీజేసిన చోట్లకు తిరిగి రాకుండా స్థలాలు మార్చుకొంటూపోవటం కష్టమనే విషయాన్ని కూడా మనం గుర్తించాలి. అంతేకాదు, మన దళం ఒక్కటేకాదు. ఇంకా యితర దళాలుకూడా వున్నాయి. అందువల్ల ఒక స్థలం శత్రువుకు వెల్లడయితే అది మన యితరదళాల భద్రతకుకూడా ముప్పు తెచ్చిపెడుతుంది. మనం ఈలోపాన్ని గూర్చి అర్థంచేసుకోవాలి.

మన దళసభ్యులు, ఆర్గనైజర్లు ఆశ్రయంపొందే విషయంలోను, ఆహారంగాని, యితర సహాయంగానిపొందే విషయంలోనూ చాలా జాగ్రత్త గానేవుంటారు. ఆ అవసరం తీరగానే మన కామ్రేడ్సు అంత జాగ్రత్తగా వుండరు. కొన్ని సందర్భాలలో అజాగ్రత్తవల్ల అలా సహాయపడినవారు వెల్లడవుతుండటం కూడా జరుగుతుంది. ఆ విధంగా మనం అనేకమంది సహా

యకులను కోల్పోతున్నాం. తత్ఫలితంగా ప్రజలు చిత్రహింసలకు గురవు తున్నారు. నిర్బంధకాండకు ఎరవుతున్నారు. సంపూర్ణ సహకారమివ్వటానికి తటపటాయించుతున్నారు. రహస్య పనిపద్ధతి, వ్యక్తిగత వ్యవహారంకాదు. మనం ఎవరెవరితో సంబంధాలు కలిగివున్నామో వారందరి రాజకీయ విజ్ఞానాన్ని పెంపొందించాలి. ప్రజలతోపాటు వారందరికీ రహస్య పనిపద్ధతులలో శిక్షణ గరపాలి.

2. మన అజ్ఞాత కార్యకలాపాలనుగూర్చి మన పార్టీ కేంద్రానికి వివరంగా తెలియటానికిముందే, శత్రువు తెలుసుకోగలుగుతున్నాడు. ఉదాహరణకు, ఒక సి. ఐ. డి. వాడు చంపబడ్డాడు. ఈ విధంగా చంపబడిన విషయం, చంపినవారిపేర్లతోసహా శత్రువుకు వెంటనేతెలిసిపోయింది. నిజానికి అలాంటిచర్యలలో పాల్గొన్నవారిపేర్లు, అందులో పాల్గొన్నవారికితప్ప ఇతరులెవ్వరికీ తెలియగూడదు.

3. కేంద్రం ఒకటున్నదనే విషయం కూడా దానితో ఏ విధంగా సంబంధంలేని వారికికూడా అనేకమందికి తెలుసు. అందువల్ల ఒక వ్యక్తిని అరెస్టు చేసేట్లయితే, చిత్రహింసలకు గురిజేస్తే, ఆయనవద్ద నుండి రహస్యం పొక్కుతుందేమోవన్నభయంతో వెంటనే ఆ కేంద్రాన్ని ఖాళీ చేయటం తప్పనిసరవుతున్నది మన కేంద్రాలలో చాలావాటి విషయంలో అలాగే జరిగింది. కొన్ని సందర్భాలలో పట్టుబడిన వ్యక్తులే మన కేంద్రాలకు పోలీసులను తీసుకొచ్చారు.

గ్రామాలలో మన పార్టీ సభ్యులెవరో, సానుభూతిపరులెవ్వరో కామ్రేడ్స్ అందరికీ తెలుసు. ప్రతివారూ వారి యిండ్లకు పోతున్నారు. భోజనాలు చేస్తున్నారు. యితరవిధాల సహాయం పొందుతున్నారు. అందువల్ల, ఎవరైనా శత్రువుకు లొంగిపోయేట్లయితే, కామ్రేడ్స్ అందరూ, సానుభూతి పరులందరూ వెల్లడవుతారు. బాధలకు గురిజేయబడతారు. కామ్రేడ్సు కొత్త కేంద్రాలకు వచ్చినప్పుడు, వారిద్దరూ మరొకచోట కలుసుకునేట్లు చేయటానికి మారుగా, సరాసరిని ముఖ్య కామ్రేడ్ వున్నచోటికే తీసుకెళ్లటం జరుగుతున్నది.

4. కొందరు కామ్రేడ్సు అరెస్టు చేయబడినప్పుడు కొంత సమాచారం బయటపెడుతున్నారు. వారి వారి చైతన్య స్థాయినిబట్టి, ఆయా కామ్రేడ్సుకు తగిన బాధ్యతలను వొప్పగించటం లేదుగాబట్టి, యిది జరుగుతోంది. ఎవరు కనిపిస్తే వారికి, ఏదోవిధంగా నిర్వర్తించవలసిందిగా పనులు వొప్పగించుతున్నందుననే యిది జరుగుతోంది. దీనివల్ల, ఆ పనిని తక్షణమే నిర్వర్తించటానికేగాక, పార్టీ యంత్రాంగానికే శాశ్వతంగా హాని జరుగుతోంది.

5. సాంకేతికపరమైన సాధారణ జాగ్రత్తలను సయితం మనం పాటించడంలేదు.

— రాత్రివేళల్లోకూడా కామ్రేడ్సు సిగరెట్లు కాల్చుతున్నారు.

— సొల్లువాగుడు, నిరుపయోగమైన కబుర్లు చెప్పుకోవటం, ఎవరి ముందుబడితే వారిముందు, అవసరమైన విషయాలనుగూర్చి అనవసర విషయాలగూర్చి చర్చలు జరపటం సర్వసాధారణమైపోయింది

— సెంట్రీ డ్యూటీలో వుండగా అజాగ్రత్తగా వుండటం, నిద్ర పోతూ వుండటం జరుగుతోంది.

— నడిచిపోతుండగా ముందు జాగ్రత్తకోసం ఒక కామ్రేడ్ పైలట్‌గా ముందు నడవటంలేదు. కామ్రేడ్సు చిన్న బృందాలుగా చీలటం లేదు. మాట్లాడకుండా నడవటం మనకు సాధ్యమవటంలేదు. నిశ్శబ్దంగా వుండటం జరగటంలేదు పాటలుపాడటం జరుగుతూనే వుంది.

— మనం రహస్య పేర్లను వాడటం మరచిపోతున్నాం.

— యూనియన్ సైన్యాలు ప్రవేశించిన తరువాతకూడా, కాలం చెల్లిన నైజాం పోలీసు రోజులలో వ్యవహరించిన పాతపద్దతులలోనే వ్యవహరిస్తున్నాం కొంతమంది కామ్రేడ్స్, సాంకేతిక నిబందనలను ఎంతమాత్రం పాటించటంలేదు.

6. శత్రు కేంద్రీకరణ తగ్గినప్పుడు, శత్రువు యిప్పుడు దాడిజేసే అవకాశం లేదన్న సాకుతో, ఇది కొత్తచోటుగదా, శత్రువు యిక్కడికెలా వస్తాడులెమ్మని మన సాంకేతిక సంబంధమైన జాగ్రత్తలను తీసుకోవడంలో సడలింపు జరుగుతోంది.

7. ప్రజలనుండి ఏ విషయాన్నీ దాయనవసరంలేదనే ధోరణి పార్టీలోపలవుంది. రాష్ట్రకమిటీ ఈ విషయాన్నెత్తి చూపింది. ఈ మనస్తత్వం కలిగివున్నందున, సభ్యులకు – సభ్యులకుమధ్య, ఒకసెల్‌కు – మరొకసెల్‌కు మధ్య, ఒక జోన్‌కు మరొకజోన్‌కుమధ్య రహస్యాలు కాపాడబడటం లేదంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు. నాయకత్వం ఈ విషయాలను పట్టించుకొనటం లేదు. వారుకూడా ఈ లోపాలకు లోనవుతున్నారు. సాధారణపార్టీ సభ్యుల నుండి, ప్రాంతీయ కమిటీసభ్యులవరకూ ఈ తప్పులు చేస్తున్నారు

ప్రతియూనిట్టు, ప్రతిసభ్యుడూ ఎప్పటికప్పుడు తన ఆచరణను పరిశీలించుకోవాలి. ఇంకా యితరత్రా ఏ విధమైన సాంకేతిక పరమైన నిర్లక్ష్యాలు జరుగుతూవున్నాయో తెలుసుకొంటూ వుండాలి.

వర్గచైతన్యం కొరవడటంవల్లనూ, మనం సుదీర్ఘమైన పోరాటాన్ని సాగించవలసి వున్నదన్న విషయాన్ని విస్మరించటంవల్లనూ ఈ తప్పులు చేస్తున్నాం భారతీయ బూర్జువావర్గానికి వ్యతిరేకంగా దీర్ఘకాల పోరాటం సాగించటానికి సరిపడే సవ్యమైనఅజ్ఞాతవాసఎత్తుగడలను రూపొందించుకోలేక పోయాం సంస్థానంలో బారతసైన్యం ప్రవేశించిన తరువాత, భూస్వామ్య, ధనిక రైతువర్గాలు మన వుద్యమాన్ని అణచటంలో శత్రువుతో చేతులు గలిపాయి. మన సాంకేతిక యంత్రాంగమూ ముందుజాగ్రత్తలూ తక్షణావసరం కోసం మాత్రమే కాదని, దీర్ఘకాలంపాటు వుద్దేశించబడినవనే దృష్టితో మన ఎత్తుగడలను రూపొందించుకోవాలి. భారతసైన్యం ప్రవేశించినతర్వాత, మన శత్రు శిబిరంలోని వర్గాలతో, వర్గ సంబంధాలలో వచ్చిన మార్పును మనం వెంటనే గమనించలేదనేదికూడా వాస్తవమే అవసరమైన సాంకేతిక సంబంధమైన ముందుజాగ్రత్తలు రూపొందించుకొనలేకపోవటానికది వొకకారణం.

పై తప్పుల కారణంగా, గ్రామాలలో పార్టీలో సగభాగం దెబ్బతిని పోయింది సాంకేతిక లోపాల కారణంగా, ముఖ్యమైన దళాలు, ఆర్గనైజర్లు, నాయకత్వమూ తుడిచిపెట్టుకొని పోయాయి.

అంతేకాదు, రహస్యాలు కాపాడేందుకు మనకుగల శక్తిపట్ల ప్రజలలోగల విశ్వాసం కొంతవరకు సడలిపోయింది. అందువల్ల, తమ సహకారమందించటానికి వారు వెనుకాడుతున్నారు మనం, మన అజ్ఞాత కార్యకలాపాలను, సవ్యంగా నిర్వహించేట్లయితే, ప్రజల ప్రతిఘటనకూడా పెంపొందుతుంది లేకపోతే ప్రజలు వెనుకాడుతారు మన రహస్యాలను, రికార్డులను తాము సంపాదించగలిగామని శత్రువుకూడా ధైర్యం పుంజుకుంటాడు. శత్రువుకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. వారు తమ దాడిని వుధృతం జేస్తారు. అందువల్ల, మన అనుభవాన్ని దృష్టిలోవుంచుకుని కొత్తఎత్తుగడలను రూపొందించుకోవాలి

## రాష్ట్ర కమిటీ సర్క్యులర్

కామ్రేడ్స్,

ఇంతవరకూ మీరు, మీ కార్యకలాపాలన్నిటినీ బహిరంగంగా సాగించటాని కలవాటుపడి వున్నారు. ప్రజానీకంలోను, కష్టజీవులలోను అత్యధిక సంఖ్యాకులనుండి సంపూర్ణమైన, సర్వతోముఖమైన సహకారం పొందటానికి మీరు అలవాటుపడి వున్నారు. అందువల్ల, పార్టీ సభ్యులపేర్లను ఎవ్వరికీ తెలియనీయవలదని, సెల్ సమావేశాలను రహస్యంగా జరపాలనీ, పార్టీ ఆర్గనైజర్లు రహస్యంగా వుండిపోవాలనీ, తప్పనిసరిగా అవసరమైతేనే సమావే

శాలు జరపాలనీ, దళాలు సయితం రహస్యంగా వుండాలని ఈనాడు మిమ్మ కోరినా, మీకు చెప్పినా మీకు ఆశ్చర్యం కలుగవచ్చు. మనం శత్రువుకు కన పడకుండా రహస్యంగా వుండవచ్చు. కాని, ప్రజలనుండి మనం రహస్యంగా ఎలావుండగలం? మనం ప్రజలలో మిళితమైపోయి, వారితోనే జీవించవలసి వుండగా, మనం ప్రజలనుండి రహస్యాల నెలా దాయగలం? మీరు అలాంటి ప్రశ్నలడగవచ్చు.

నిజమే. ఇప్పుడు ఏర్పడిన పరిస్థితిలో మనం మన కార్యకలాపాలను శత్రువు దృష్టిలో పడకుండానేగాక ఆయా కార్యక్రకలాపాలతో ప్రత్యక్షంగా సంబంధంవున్న పార్టీ సభ్యులకు, ప్రజలకూతప్ప మొత్తం ప్రజలందరికీకూడా వెల్లడవకుండా రహస్యంగానే వుంచవలసివుంది. ప్రజానీకంలోని అన్నివర్గాల నుండి పూర్తిగా వేరుబడిపోయిన నైజాంకు వ్యతిరేకంగా మన పోరాటం సాగిస్తున్న తొలిరోజులలో సయితం రహస్య పని పద్ధతులను పాటించనందువల్ల మనం ఎంతగా నష్టపోవలసివచ్చింది మీకందరికీ తెలుసు అయితే ఈనాడు గ్రామాలలో అనేకమంది ప్రజలతో అనేకమైన సన్నిహిత ఆర్థిక సాంఘిక సంబంధాలు గలిగివున్న ధనికరైతు సెక్షన్లు శత్రుశిబిరంలోకి పోయాయి. మన వుద్యమాన్ని అణచివేయిటంకోసం చురుకుగా పనిజేస్తున్నాయి. శత్రువు మిలటరీ, పోలీసు సాయుధ క్యాంపులనేకం ఏర్పాటుజేసుకొని మన దళాలకోసం, ఆర్గనైజర్లకోసం గాలించుతున్నాడు. ఈ పరిస్థితిలో మనం రహస్యంగా కార్య కలాపాలు సాగించటానికి చాలా ఖచ్చితమైన జాగ్రత్తలను పాటించకపోతే ఎందలాది మన యోధులు పట్టుబడతారు వారు తమ ప్రాణాల నర్పించవలసి వస్తుంది. ఈ వీరోచిత విప్లవోద్యమాన్ని శత్రువు క్రూరంగా నిర్మూలించేందుకే అది దారిదీస్తుంది.

మనం నిర్వహించే కార్యకలాపాలలో ప్రతిఒక్కటీ ప్రజలందరికీ తెలిసేట్లయితే అది ధనికరైతులకుకూడా తప్పక తెలుస్తుంది ధనిక రైతుకు అది తెలిసిందంటే సమీపంలోవున్న మిలటరీ క్యాంపుకు తప్పక తెలియజేసి తీరుతాడు ఈ సంకటస్థితినుండి బయటబడటానికి ఏకైకమార్గం, మిలటరీవాళ్లకు రహస్యాలందిజేసే వాళ్లను ఒకళ్లిద్దరిని చంపివేయటమేననీ, అలాచేసేట్లయితే మనకు వ్యతిరేకంగా ఏమిచెయ్యటానికీ సాహసించకపోడు అని మీరు వాదించవచ్చు.

శత్రువు గ్రామాలన్నిటా మిలటరీ క్యాంపుల నేర్పాటు జేశాడు. అందువల్ల, మన రహస్యాలను బయటబెడుతున్న ధనిక రైతులను ఒకరిద్దరిని చంపివేస్తేనే చాలదు. మన ప్రజారాజ్యా న్నేర్పరచగలిగి, గ్రామాలనుండి శత్రు మిలటరీక్యాంపులపై ఆధిక్యత సాధించగలిగేట్లయితే, అప్పుడది సరిపోతుంది.

కాని, ప్రస్తుతం, మనం ఈ ఎత్తుగడద్వారా మన లక్ష్యాన్ని సాధించుకోవా లంటే, మనం ధనిక రైతులను చాలా పెద్ద సంఖ్యలో చంపవలసి వుంటుంది. ఆ వర్గానికిజెందినవారిని, దాదాపుగా అందరినీ నిర్మూలించవలసి వుంటుంది ! ఇది అర్థంలేనిపని. అసాధ్యమైనపని. అందువల్ల, ఈనాటి పరిస్థితిలో, మన దళాలను, మన పార్టీ నాయకులను కాపాడుకొనటం కోసం మనం అనుసరించవలసిన ప్రధానమైన పద్ధతి, మన కార్యకలాపాలను రహస్యంగా సాగించటమేగాని ధనిక రైతులను నిర్మూలించటం మాత్రం కాదు. రహస్య పని పద్దతులను పెంపొందించుకోవాలి. శత్రువుకు వార్త లందకుండా అరికట్టాలి. అయితే,శత్రువు వద్ద డబ్బుదీసుకుని శత్రువుకు ఏజెంట్లుగా పనిజేయటమే వృత్తిగా పెట్టుకున్న వారిని కొలదిమందిని ఈ ప్రయత్నంలో నిర్మూలించవచ్చు. అందువల్ల, మన కార్యకలాపాల్లో ప్రతిదానినీ రహస్యంగా కొనసాగించాలి. ఆ కార్యక్రమాన్ని నిర్వహించటంలో ప్రత్యక్ష సంబంధంగల పార్టీ సభ్యులకు, యితర ప్రజలకు మాత్రమే దానిని గురించి తెలియాలి. ప్రజలలోగాని, పార్టీ సభ్యులలోగాని యితరులెవ్వరికి తెలియనివ్వరాదు. ఈ సూత్రాన్నే మన కార్యకలాపాలన్నింటి లోనూ అనుసరించాలి. అందు కవసరమై సాంకేతిక యంత్రాంగాన్ని ఏర్పరచు కోవాలి. అవసరమైన ముందు జాగ్రత్తలు తీసుకోవాలి. రాష్ట్రంలో మన ఉద్యమం మరింత పెంపొందిన కొలదీ, మనం ధనికరైతులను పూర్తిగా వేరు జేయగలం. మనం యింకా ఎక్కువగా మధ్యతరగతి రైతులను మనవైపుకు రాబట్టుకోగలం. ఇప్పుడు మరింత బహిరంగంగా. కార్యకలాపాలు సాగించ టానికి, బహిరంగంగా పార్టీ కార్యకలాపాలు సాగించటానికి పూనుకోవచ్చు. కాని ఇప్పుడు, మన కార్యకలాపాల నన్నింటినీ ఖచ్చితంగా రహస్య ప్రాతి పదికపైనే సాగించాలి. అందుకుగానుదిగువన కొన్ని సూచనలు చేస్తున్నాం :

**ఆర్గనైజర్లకు :**

1. ప్రతి ఆర్గనైజరూ నమ్మకమైన శాశ్వత కొరియర్‌ను ఒకరిని ఏర్పాటుజేసుకోవాలి ఎవరినిబడితే వారిని కొరియర్‌గా ఉపయోగించు కొంటుండేట్లయితే, మనం రహస్యాలను దాచివుంచజాలం.

2. గ్రామస్థుల సమావేశం జరపటం అవసరమైతే గ్రామంచుట్టూ సెంట్రీలను, కాపలాదార్లను ఏర్పాటుజేసిన తర్వాతనే జరపాలి. సమావేశం పూర్తయిన వెనువెంటనే ఆర్గనైజరూ, దళమూ ఆ గ్రామం నుండి వెళ్ళ పోవాలి. ఈ గ్రామంలోని వారెవరికి తెలియని దూరపుగ్రామానికి చేరాలి. గ్రామ సమావేశాలను వ్యవసాయ కార్మికులతోను, పేదరైతులతోనూ జరప

వచ్చు. ఈ సమావేశాలకు ధనిక రైతులను, భూస్వాములను రానివ్వకుండా వుండటం మంచిది. కనీసం శత్రువుకు సమాచారం చేరవేస్తున్నారన్న అనుమానంవున్న వ్యక్తులనయినా ఈ సమావేశాలలో పాల్గొననివ్వరాదు.

పగటివేళల్లో గ్రామాలలో వుండవద్దు పోలీసులు గ్రామంలోని ప్రజలందరినీ ఒకచోటకు పోగుజేస్తారు. అలా జరిగినప్పుడు శత్రువు, ఆర్గనైజరును సులభంగాగుర్తించగలడు. పొలాలలో పైర్లులేవుగనుక, శత్రు ముట్టడి జరిగినప్పుడు తప్పించుకుపోవడం కూడా కష్టం. అందువల్ల గ్రామాలకు బయటనేవుండటం, వారు ధరించినటువంటి దుస్తులనే ధరించి స్థానిక ప్రజలతో మిళితమైపోవటం మంచిది. మనలను గురించి గ్రామస్థులకు కూడా తెలియనివ్వరాదు శత్రువు దాడిజేసినప్పుడు రైఫిల్‌కు అందుబాటులోవున్నంత దూరంలోవుంటే పారిపోరాదు. అలా చేసేట్లయితే నువ్వు ముఖ్యమైన కామ్రేడ్ అనే విషయం శత్రువుకు అర్ధమవుతుంది

3. ఆర్గనైజర్లు తామే వ్యక్తిగతంగా ప్రజల సమస్యలను పరిష్కరించటం యింకెంతమాత్రం సాధ్యం కాదు. చర్చల అనంతరం సెల్సుద్వారా, పార్టీ కమిటీలద్వారా వాటిని పరిష్కరింపజేయాలి. అందువల్ల, ఆర్గనైజరు గ్రామానికి పరుగెత్తు కెళ్ళటం, ప్రజలను కలుసుకొనటం, నిర్ణయాలివ్వటం, తాను ఆశ్రయంలోవున్నా, పొలాలలోవున్నా గ్రామస్తులు ఆర్గనైజరు చుట్టూ మూగడం, తమ కష్టాలనుగూర్చి చెప్పుకోవటం, వాటికి పరిష్కారాలు కోరటం వంటి పాత పద్ధతులు విడనాడాలి

4. మన ఆర్గనైజర్లు, పై కమిటీలకు పంపుతున్న నివేదికలమీద తమ పూర్తిపేర్లు, చిరునామాలు వ్రాస్తున్నారు ఈ నివేదికలు శత్రువుచేత జిక్కేట్లయితే, రహస్యాలన్నీ బయటబడే విధంగా, విచక్షణా రహితంగా గ్రామాల పేర్లను, వ్యక్తుల పేర్లను వుదహరిస్తున్నారు అందువల్ల నివేదికలలోను, వుత్తర ప్రత్యుత్తరాలలోను మారు పేర్లనే వుపయోగించాలి. ప్రత్యేకావసరాలకోసం వుపయోగించే గ్రామాల పేర్లను ఎన్నడూ వుదహరించరాదు. ఈ గ్రామాలకు వేరే పేర్లు వాడవచ్చు. మనం ఈ పద్ధతి ననుసరించేట్లయితే, కొంతమేరకు, ప్రజలను వుధృతమైన పోలీసు హింసాకాండ బారినుండి కాపాడవచ్చు.

5. భూస్వామ్య కుటుంబాలనుండి, యితర దోపిడీ వర్గాలనుండి వచ్చిన మన ఆర్గనైజర్లు కొందరు, తమ కుటుంబాలను చూచిరావటానికి వెళ్ళినప్పుడు అరెస్టు చేయబడుతున్నారు దోపిడి వ్యవస్థను, వర్గాలను నిర్మూలించటంకోసం మనం పోరాటాలు ప్రారంభించిన తరువాత, తమ అత్తమామలు, బావమరదలు, తలిదండ్రులు, సోదరులు గతంలోవలెనే తమను యింకెంత మాత్రం ప్రేమించరని అర్ధంజేసుకునే స్థితిలో మన కామ్రేడ్సు లేరు. మన

కామ్రేడ్స్, వారిని తమ వర్గశత్రువులుగా పరిగణించాలి. మన కామ్రేడ్స్ తమ భార్యా, బిడ్డలను కలుసుకోవచ్చు అయితే, వారు తమ కుటుంబాలలోని మిగతా వారితో సంబంధాలు తెగదెంపులు చేసుకుంటేనే అలా చేయవచ్చు. అలా కానప్పుడు వారితోకూడా సంబంధాలు త్రెంచివేసుకోనటం మినహా మార్గాంతరం లేదు డబ్బు, బట్టలు, తదితర సౌకర్యాలు సంపాదించటంకోస మైనా మనం వారితో సంబంధాలు పెట్టుకోగూడదు. మనం ఈ పని చేయనంత కాలం, కష్టజీవులైన సామాన్య ప్రజానీకానికి పార్టీపై విశ్వాసం ఏర్పడదు. దోపిడీవర్గాలనుండి వచ్చిన పార్టీ సభ్యులు ఏక్షణంలోనైనా తమ కుటుంబాలకు లొంగిపోవచ్చునని వారు భయపడతారు. అన్యవర్గాలతో సంబంధాలు తెగ దెంపులు చేసుకున్నప్పుడు, తామే వర్గంనుండి వచ్చారో ఆ వర్గ అవశేషాలను విడనాడినప్పుడూ మాత్రమే కామ్రేడ్స్ పార్టీలో వుండగలరు.

## 6. ఎలాసంచరించాలి ?

ఒంటరిగా ఎప్పుడూ వెళ్ళవద్దు. ఒకకొరియర్‌ను వెంటతీసుకుపోవాలి,

ఎవ్వరూ సంచరించనిఅడవిప్రాంతంలో అయితే తప్ప, సాధ్యమైనంత వరకు ప్రయాణాలన్నీ రాత్రివేళల్లోనె చేయాలి.

ప్రయాణం సాగించవలసిన మార్గాన్నిగూర్చి ముందుగానే నిర్ణ యించుకోవాలి. శత్రువు ఏదైనా వలపన్నాడా ? మొదలగు విషయాలనుగూర్చి ప్రయాణానికి ముందుగానే సమాచారం సేకరించాలి.

ముందు దారిచూపేందుకు ఒకమనిషి ప్రత్యేకంగా లేనిపక్షంలో కొరియర్ ముందువెళ్ళాలి, ఆర్గనైజరు ఆ వెనుక వెళ్ళాలి.

ఏ దిశగా వెళ్ళబోతున్నదీ, ఏ వూరికి వెళ్ళబోతున్నదీ, మీరు బయలుదేరే గ్రామంలో ఎవ్వరికీ తెలియనీయవద్దు. అలాంటి సమాచారం చెప్పి వెళ్ళవలసిన అవసరం వస్తే, సెల్ కార్యదర్శికిగాని, మరెవరైనా ముఖ్య కామ్రేడ్‌కుగాని చెప్పవచ్చు.

మీరు ఎవరినైనా వచ్చి కలుసుకోవలసిందిగా కోరినప్పుడు, అలాంటి వారికి, మీరు నివసించే చోటునుగూర్చిగాని, మీ స్థలాన్నిగూర్చిగాని ఎలాంటి సమాచారమూ యివ్వకూడదు. దానికి బదులుగా, అందుబాటులో వున్న వేరే ఒక నిర్ణీత స్థలానికి వచ్చి, మీకు సమాచారం అందజేసేట్లుగా ఏర్పాటు జేసుకోవాలి.

గ్రామాలలో సరాసరిని ప్రవేశించటం ఎన్నడూతగదు దూరంగా ఒకచోటువుండి, ఆ గ్రామంలో పరిస్థితులనుగూర్చి తెలుసుకొనిరావటానికి,

మనకు సంబంధంవున్న వ్యక్తులను, లేదా గ్రామంలోని పార్టీ సభ్యులను మీ వద్దకు తీసుకురావటానికి మీ కొరియర్‌ను ముందుగా పంపండి.

## 7. గ్రామాలలో మకాం వేయడం

గ్రామ పార్టీ సెల్ సమావేశాలను, గ్రామంవెలుపలరహస్యస్థలాలలో జరపండి. శత్రువు గ్రామంలో లేనప్పుడు మాత్రమే, గ్రామంలో బహిరంగ సభలు జరపవచ్చు అప్పుడుకూడా గ్రామానికి వెలుపల కాపలా ఏర్పాటు చేయాలి. శత్రువు గ్రామాలలోవున్నప్పుడు, గ్రామం వెలుపల చిన్న గ్రూపు సమావేశాలు మాత్రమే జరపవచ్చు.

గ్రామాలలో ఎన్నడూ మకాం పెట్టవద్దు గ్రామసమావేశాలు జరిగేటప్పుడే అందుకు మినహాయింపు.

ఆహారం తదితర అవసరాలను గ్రామం వెలుపలకు చేరవేయటం అవసరమైనప్పుడు, ప్రస్తుతం జరుగుతున్నవిధంగా ఆ విషయం చాలమందికి తెలియనివ్వకూడదు. గ్రామ సెల్ కార్యదర్శికి, వాటిని చేరవేసే వ్యక్తికి మాత్రమే ఆ విషయం తెలియాలి.

గ్రామం వెలుపల, మీరు నిద్రించే చోటునుగురించి మీకు, మీ కొరియరుకుతప్ప యితరులెవ్వరికీ తెలియనివ్వరాదు.

మీరు పగటివేళల్లో, మనకు గట్టి సానుభూతిపరులైనవారి పొలాల లోనే కూర్చుండాలి. వాటిచుట్టూ, ధనిక భూస్వాముల పొలాలుండరాదు ప్రజలు అచ్చటికి పదేపదే రాకుండా వుండటం మంచిది

మీరు ఏదైనా ఒక గ్రామానికి వెళ్ళినప్పుడల్లా, గ్రామం వెలుపల ఒక్కచోటునే మకాం వేయవద్దు. మీరు గతసారి ఆ గ్రామానికి వెళ్ళివచ్చిన తర్వాత, ఆ చోటు వెల్లడయితే, ఆ చోటును తప్పనిసరిగా మార్చవలసిందే.

వాన మొదలైనవాటినుండి రక్షణపొందటానికి మీకు ఎక్కడ, ఎట్లా ఏర్పాటు చేయబడిందీ ఎవ్వరికీ తెలియనివ్వవద్దు. వర్షం కురుస్తున్నప్పుడు మాత్రమే ఆ ఏర్పాటును వుపయోగించుకోవాలి.

## 8. కొరియర్లు, ఉత్తర ప్రత్యుత్తరాలు,

ముందుగా కొరియర్ అనుకొన్న సమయానికి తిరిగిరాకపోతే, ఆ కొరియరు ఏదైనా ప్రమాదానికి లోనయ్యే అవకాశమున్నట్లు భావించి

అందుకనుగుణమైన చర్యలు తీసుకోవాలి. కొరియరు ఎలాంటి ప్రమాదానికి లోనుగాకపోయినా, అలాంటి చర్య తీసుకున్నందువల్ల నష్టమేమీలేదు

పై కమిటీల వద్దకుగాని, యితర ఆర్గనైజర్ల వద్దకుగాని కొరియర్లను పంపినప్పుడు వారిని నిర్దిష్టస్థలానికి మాత్రమే పంపాలి వారుండేచోట్లు మీకు తెలిసినప్పటికీ కొరియర్లను సరాసరి వారివద్దకు పంపరాదు.

అదే విధంగా మీ ఉత్తరాలను నిర్దిష్టమైన చిరునామాకు పంపటాన్ని గూర్చి ముందుగానే తెలియజెయ్యాలి. కేంద్రంనుండి వస్తున్న వుత్తరాలన్నీ మీకు అందునట్లుకూడా అన్నిఏర్పాట్లూ చేసుకోవాలి.

అవసరమైన కాగితాలను, వస్తువులను మాత్రమే మీ దగ్గరవుంచుకోండి. తక్షణమే అవసరంలేని కాగితాలను, వస్తువులనూ ప్రత్యేకంగా నమ్మకమైనచోటున భద్రపరచవచ్చు మీ తరఫున వాటిని భద్రపరచిన కామ్రేడుకు, మరొక ముఖ్యకామ్రేడ్‌కు మినహా యితరులెవ్వరికీ ఈ స్థలాన్నిగూర్చి తెలియనివ్వరాదు

ఏపనికయినాసరే, ఎవరు కనిపిస్తే వారిని పంపించవద్దు మీ కొరియరునుగాని, గ్రామంలోని ముఖ్యకామ్రేడ్ నెవరినైనాగానిమాత్రమేపంపాలి. పై కమిటీలవద్దకు పంపునప్పుడు ఎల్లప్పుడూ ఒకవ్యక్తినే పంపాలి.

మీరుగానీ, మీ కొరియరుగాని మీరు తెలిసిన కాంటాక్టుస్థలాలను మరెవ్వరికీ వెల్లడించగూడదు.

రహస్య స్థలాలనుగూర్చి అషామాషీగా మాట్లాడేవారెవరినైనా అలా చేయవలదని హెచ్చరించాలి.

9. సర్వదా వందరూపాయలు మీదగ్గర వుంచుకోండి. అంతకు పైబడిన మొత్తాలను పై కమిటీలకు పంపించాలి.

ఆత్మరక్షణకొరకు మీవద్ద తప్పనిసరిగా ఏదో ఒక ఆయుధం వుంచుకోవాలి. మరేదీ లభ్యంకానప్పుడు, కనీసం మంచికత్తయినా దగ్గరుంచుకోవాలి.

శత్రువు సంచారాన్ని గూర్చి గమనిస్తూవుండాలి. గ్రామంలోకివచ్చే. బిచ్చగాళ్ళు, వ్యాపారస్తులు, ఇతర క్రొత్తవాళ్ళను ఒకకంట కనిపెట్టివుండాలి.

## 10. మీరు ప్రజలలో మిళితమైపోవాలి. వేష, భాషలలో, ఉచ్ఛారణలో ప్రజలకు భిన్నంగా కనిపించరాదు.

### రహస్యంగా పనిచేయాలి

మన ఆర్గనైజర్లు అజ్ఞాతంగా కార్యకలాపాలు సాగించాలని చెప్పినప్పుడు మీకు ఆశ్చర్యం కలుగకపోవచ్చు కాని, పార్టీ సభ్యుల పేర్లను వెల్లడించగూడదని, సెల్ సమావేశాలను రహస్యంగా జరపాలని చెప్పినప్పుడు మీరు ఆశ్చర్యపడటం సహజం. పార్టీ సభ్యుల పేర్లను రహస్యంగా వుంచటం ఎలా సాధ్యమనికూడా మీరడగవచ్చు. శత్రువు పార్టీ సభ్యులను పట్టుకుని, వారిని వేరు వేరుగా హింసలకు గురిజేసినప్పుడు, ఈ ఆవశ్యకతను, దాని ప్రాధాన్యతను మనం అర్థం చేసుకోగలం. దీనినుండి బయటబడటానికిమార్గంవుంది.

ప్రముఖవ్యక్తులు మినహా, యితరులు, తాము పార్టీ సభ్యులనే విషయం వెల్లడించుకోవలసిన అవసరంలేదు. గ్రామ జనాభాలో నూరింట 75 మంది మన పార్టీకి సంబంధించినవారే అయినచోట్ల, మన పార్టీ కార్యకలాపాలు సాగించటానికి ముందుకొచ్చే యువకులు చాలామంది వుంటారు. అలాంటి సందర్భంలో, వారంతా పార్టీ సభ్యులేనని శత్రువు భావిస్తాడు; తమను ఎవ్వరు ఎక్కువగా తిడితే, ఎవరెక్కువగా గల్లంతుజేస్తుంటే వారు సభ్యులని కూడా అనుకుంటాడు అందువల్ల, జనసామాన్యంలోనుండి, పార్టీసభ్యులెవరో కానిదెవరో తెలుసుకోవటం శత్రువుకుసాధ్యంకాదు. పెద్దసంఖ్యలో ప్రజలను పట్టుకెళ్ళినప్పుడు, యాదృచ్ఛికంగా వారిలో కొందరు పార్టీసభ్యులుకూడా వుండవచ్చు. కాని, పార్టీ సభ్యులందరూ ఒక్కసారే అరెస్టుచేయబడే అవకాశం లేకపోవచ్చు. అందువల్ల కొత్తగా పార్టీ సభ్యులయిన వారిని యితరులకు వెల్లడవకుండా మనం కాపాడుకోవచ్చు. మన పార్టీ సభ్యులు, దళసభ్యులు అందరికీ వెల్లడయినందున కలుగుతున్న ప్రమాదాల తీవ్రతను గమనించవలసివుంది. మన సెల్ సమావేశాలను, కమిటీ సమావేశాలను రహస్యంగా జరుపుకోవాలి. ఆ సమావేశ స్థలాలు యితరులకు తెలియనీయరాదు.

### సమాచారం అందించుకొనే మార్గం.

ఈనాడు, ఒక ప్రాంతీయ కమిటీకి, మరొక ప్రాంతీయ కమిటీకిమధ్య, ఒక ప్రాంతంలోని ఒక జోన్‌కు మరొక జోన్‌కు మధ్య, సెంటర్ ఆర్గనైజర్‌కు–

జోనల్ కమిటీకీమధ్య పరస్పర సంబంధాలు కొనసాగించే క్రమబద్ధమైన విధానమేదీ లేదు. ఏదైనా అవసరం ఏర్పడినప్పుడెల్లా, దగ్గరలో ఎవరు అందుబాటులోవుంటే వారిని అందుకోసం వినియోగించటం జరుగుతోంది. ఆకామ్రేడ్ ఆ గ్రామానికి వెళ్ళి ఆర్గనైజరుకోసం, ప్రాంతీయ సభ్యులకోసం, యితర కార్యనిర్వాహకులకోసం వారిని అడిగి అడిగి, చివరకు వాళ్ళను తెలుసుకొంటాడు. తన ద్వారా పంపిన వర్తమానాన్ని అందజేస్తాడు కాని, ఈ పద్ధతి మన ఆర్గనైజర్ల జాడ శత్రువుకు తెలుసుకోవటానికే తోడ్పడుతుంది. ఈ పద్ధతి యింకెంతమాత్రం కొనసాగనివ్వరాదు.

క్రమబద్ధమైన పరస్పర సంబంధాల నిర్వహణ పద్ధతి వుండటం అవసరం. ఇందుకుగాను ప్రత్యేకమైన కొరియర్లను తయారుచేసుకోవాలి. వుత్తరాలను అందజేయటానికి నిర్దిష్టమైన తావులను ఎంచుకోవాలి. నిర్ణీత దినాన, కొరియర్ వుత్తరాలను, కరపత్రాలను, యితర కమిటీల కుద్దేశించబడిన యితర వస్తువులనూ అందజేయాలి. ఇతర కేంద్రాల నుండి పంపబడిన టపాను, యితర వస్తువులను అచ్చటనుండి తీసుకెళ్ళాలి. ఈ పనిని నిర్వహించటానికి నిర్దేశించబడిన కామ్రేడ్స్‌కు రహస్యాన్ని కాపాడటంతో శిక్షణ యివ్వాలి. ఆయన కొరియరుగా పనిజేస్తున్నాడనే విషయం యితరులకు తెలియరాదు. ఈ పనికి నిర్దేశించబడిన కామ్రేడ్ స్థానిక వేష భాషలతో, సాధారణ ప్రయాణీకుని వలె సంచరించాలి.

ఆర్గనైజర్ల, దళాల క్షేమం పార్టీ యంత్రాంగంయొక్క భద్రత ఈ కామ్రేడ్స్ చేతుల్లో వుందిగనుక, వారి కుండవలసిన లక్షణాలను గురించి ముందుగానే పరిశీలించుకోవాలి. వారు దృఢనిశ్చయం కలవారై వుండాలి. అయితే వారు ప్రత్యేకమైనవారుగాక, సర్వసమాన్యులుగా అగుపించాలి. అత్యంత నమ్మకమైనవారుగాను హింసలకు గురిజేయబడి నప్పటికి రహస్యాలు వెల్లడించనివారై వుండాలి

ఇందుకుగాను, మనం నమ్మకస్తులైన కామ్రేడ్స్‌నే ఎంచుకున్నప్పటికీ అనుకున్న సమయానికి ఆ కొరియర్ తిరిగి రాకపోతే తక్షణమే ముందు జాగ్రత్త చర్యలు కొన్ని తీసుకోవాలి.

కొత్త సెంటర్ ఆర్గనైజర్ల పేర్లను, నిర్మూలనా దళాలలోకి చేర్చుకోబడిన పార్టీసభ్యుల పేర్లను అత్యంత రహస్యంగా వుంచాలి. ఎలాంటి పరిస్థితుల్లోనూ వారి పేర్లు ఇతరులకు తెలియరాదు.

కొత్త ఆర్గనైజర్లు, కార్యకర్తలు ఏదో వొక వ్యాపారం జేస్తూనో, వృత్తి నవలంబిస్తూనో పార్టీ పని నిర్వహించాలి.

గ్రామాలలోని పార్టీ సభ్యులు, దళ సభ్యులు, తమ తమ వృత్తులలో మామూలుగా పనిజేసుకుంటూనే, పార్టీపని చేస్తూవుండాలి. వారి కార్యకలాపాలు రహస్యంగా జరగాలి.

పార్టీ సభ్యుల, గ్రామ దళసభ్యుల, గ్రామ కమిటీల సభ్యుల పేర్లను ఎక్కడారాసివుంచరాదు మహాఅయితే, సెల్ కార్యదర్శి, గ్రామ కమిటీ సభ్యులు, "శాబటేజ్" దళ కమాండరు, సెంటర్ కమాండరు, గ్రామ ఆంధ్ర మహాసభ కమిటీ అధ్యక్ష, కార్యదర్శుల పేర్లను మారు పేర్లతోనో (లేదా పేరులోని మొదటి చివరి అక్షరంతోనో కాగితంమీద రాసి, జోనల్ కేంద్రంలో వుంచాలి. ఆ పేర్లు వెల్లడవకుండా చూడటం, జోనల్ సెంటరు కామ్రేడ్ బాధ్యత ఏదైనా పేరు బయటపడితే, అందుకు ఆయనే బాధ్యత వహించాల్సి వుంటుంది. అలాంటి జాబితా నొకదానిని ప్రాంతీయ కమిటీకికూడా పంప వచ్చు. ప్రాంతీయ కమిటీకూడా అదేవిధమైన బాధ్యత కలిగివుంటుంది

సెంటర్ ఆర్గనైజరు, జోనల్ కేంద్రానికి పేర్లు వ్రాసి పంపగూడదు. వారే కలుసుకున్నప్పుడు ఆ పేర్ల నివ్వవచ్చు. అలాంటి పేర్లను జోనల్ కేంద్రంనుండి, ప్రాంతీయ కేంద్రానికి పంపే సందర్భంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. గ్రామాల పూర్తి పేర్లు వ్రాయగూడదు. మొదటి అక్షరం చివరి అక్షరంరాస్తే చాలు లేదా మరేదైనా సంకేతనామాన్ని వాడవచ్చు.

మన ప్రచార సభలు, యితర కార్యకలాపాలు, సాధ్యమైనంతవరకు రాత్రివేళల్లోనే జరపాలి. రాత్రి పన్నెండు గంటల సమయమే మనకోసం వుద్దేశించబడిందని మనం అర్థం చేసుకోవాలి మనం, మన కార్యకలాపాలలో రాత్రిని పగలుగాను, పగలును రాత్రిగాను మార్చివేయాలి.

ఎవరైనా సి. ఐ. డి ని గాని, పోలీసునుగాని చంపేట్లయితే, ఆ ఘటనలలో ఎవరు పాల్గొన్నదీ యితరు లెవ్వరికీ తెలియకూడదు. ఆ చర్యను, ఏ దళం నిర్వర్తించిందికూడా వెల్లడించగూడదు ఆ చర్య పార్టీ నాయకత్వాన జరుపబడిందని తెలుసుకుంటే చాలు. అయితే, పై కమిటీకి సవివరమైన నివేదికను పంపించాలి.

మిలటరీ రిపోర్టులను ప్రత్యేకంగా వ్రాయాలి. అదేవిధంగా, పార్టీ నిర్మాణం, రహస్య కార్యకలాపాలనుగూర్చి ప్రత్యేకమైన నివేదికలో వ్రాయాలి. నివేదికలో మారు పేర్లు వుపయోగించాలి.

పోలీసుదాడులు, ప్రజావుద్యమమూ, ప్రజాసమస్యలు, గ్రామకమిటీల కార్యకలాపాలనుగూర్చి ప్రత్యేక నివేదికను పంపాలి. ముఖ్యమైన రికార్డు దేనని ఎప్పుడూ దగ్గర వుంచుకోరాదు దానిని తక్షణమే, సురక్షిత స్థలంలో దాచివేయాలి.

కొరియర్లకు సూచనలు

మీరు సంచరించే ప్రాంతాల ప్రజలతో మీరు మిళితం కావాలి. వేషభాషల్లో మీకూ, స్థానిక ప్రజలకూమధ్య ఎలాంటి తేడా వుండకూడదు. స్థానిక ప్రజలు ధరించే దుస్తులవంటివే మీరూ ధరించాలి. అవసరమైతే మీ జుట్టు కత్తిరింపు స్టయిలు మార్చండి. అవసరమైతే చొక్కా కూడా తొలగించాలి.

ఏ ఊరికి వెళ్తున్నారు? మీదే ఊరు? వంటి మార్గమధ్యంలో ఎదురయ్యే ప్రశ్నలకు ఏమి సమాధానం చెప్పవలసిందీ ముందుగానే నిర్ణయించుకొనివుండాలి.

మీకెవరైనా ప్రజలుగాని, కొత్తవారుగాని ఎదురయినప్పుడు మామూలుగానే వ్యవహరించాలి. ఇతరులకు మీ విషయం ముందుగానే తెలుసున్నట్లుగా గందరగోళపడరాదు, భయపడరాదు. మీ కెదురయ్యే ప్రశ్నలకు సహజంగాను, నిబ్బరంగాను సమాధానం చెప్పాలి.

ప్రయాణంచేసే సమయంలో మీరు ముందు వెనుక కూడా జాగ్రత్తగా కనిపెట్టుతూవుండాలి. అయితే ఆ పని సహజంగా కనిపించాలి.

నడిచి వెళ్లేటప్పుడు కొలదిదూరంముందు ఒక కొరియర్ నడుస్తుండాలి. ముఖ్యమైన వస్తువులు, ఉత్తరాలూ వెనుక నడుస్తున్న కొరియర్‌వద్దవుండాలి.

సి. ఐ. డి. వ్యక్తి ఎవరైనా నిన్ను వెంటాడుతున్నాడని అనుమానించేట్లయితే మార్గాన్ని మార్చుకోవాలి. మరొకవైపుకు వెళ్తున్నట్లు కనిపించు. అయినా, అతడింకా వెంటాడుతుంటే, విశ్రాంతి తీసుకుంటున్నట్లుగా కూర్చోవాలి. అతని ప్రవర్తనను, అతని కదలికలను గమనించాలి. అతడు సి.ఐ డి అని ధృవపడితే అవసరాన్నిబట్టి, అవకాశాన్నిబట్టి అతనిని కుదిపివేయటమో, చంపివేయటమో జరగాలి.

సాధ్యమైనంతవరకు ప్రయాణాలన్నీ రాత్రివేళల్లోనే చేయాలి.

మీరు ఫలానాచోటికి వెళ్ళవచ్చినట్లు, ఫలానావారిని కలుసుకున్నట్లుగాని, ఫలానా వ్యక్తి ఫలానాచోట వున్నాడనిగాని ఎన్నడూ బహిర్గతం చేయవద్దు.

మీరు, మీ కివ్వబడిన సూచనల ప్రకారం, వెళ్ళవలసినచోటుకే వెళ్ళాలి. కలుసుకోవలసిన వ్యక్తులు మరేయితర చోటునయినా వుంటారని మీకు తెలిసినప్పటికీ మరే యితరచోటుకూ వెళ్ళవద్దు.

మీరు తీసుకువెళ్తున్న వుత్తరాలను, కాగితాలను, యితర వస్తువులను జాగ్రత్తగా కాపాడాలి. శత్రువు వెంటాడేట్లయితే, ముఖ్యమైన వుత్తరాలను ధ్వంసం చేయాలి. అలాంటి అవకాశంలేకపోతే వాటిని నమిలి మింగివేయాలి. సామానులను ఆధునిక తరహా సంచులలోగాని, జనపనార సంచులలోగాని తీసుకెళ్ళరాదు. రైతులు, తమ ప్రయాణాలలో సామానులు తీసుకెళ్ళే పద్ధతిలోనే, గుడ్డలో మూటగట్టి తీసుకుపోవాలి.

కొత్తవాళ్ళతో సామాన్య విషయాలు మాత్రమే మాట్లాడాలి. వారితో రాజకీయ విషయాలు ముచ్చటించవద్దు. రాజకీయోపన్యాసాలివ్వరాదు.

మీరెంత అమాయకంగా కనిపిస్తే అంతబాగా మీ విధులను నిర్వర్తించవచ్చు.

మీరు ఆకస్మికంగా శత్రువుచే పట్టుకోబడితే, తగినవిధంగా నమ్మబలికి, తప్పించుకోవాలి. చుట్టాలయింటికి పోతున్నాననో, గొర్రెలు కొనుక్కోబోతున్నాననో అలా ఏదో ఒక కథ అల్లి నమ్మబలకాలి.

వాళ్ళు చిత్రహింసలకు గురిచేయటం ప్రారంభిస్తే ఏ రహస్యమూ బయటపెట్టవద్దు. నీకేవిషయమూ తెలియదనిమాత్రమే చెప్పు.

విశ్రాంతి సమయంలో రాజకీయాలు నేర్చుకొనటానికి ప్రయత్నించాలి. నిరక్షరాస్యులైన కామ్రేడ్స్, వ్రాయనూ, చదవనూ నేర్చుకోవాలి.

కొరియర్లు, తమకు సంబంధించిన విషయాలలోతప్ప, ఏ యితర విషయంలోనూ జోక్యం కల్పించుకోవద్దు. తమకు నిమిత్తంలేని విషయాలను తెలుసుకొనటానికి వారెలాంటి ప్రయత్నమూ చేయరాదు.

కొరియర్లకు దగ్గర కర్రవొకటుండాలి. బ్యాటరీలైటు వున్నట్లయితే ఎంతో అరుదుగా మరీ అవసరమైనపుడు మాత్రమే వాడాలి. ప్రజలు బ్యాటరీ లైట్లు వాడుతూవుండనిచోట్లనూ, ప్రజలకు వెలుతురు కనిపించేచోట్లనూ బ్యాటరీ లైటువాడరాదు. గ్రామం దగ్గరకు వచ్చిన తర్వాత అసలే వుపయోగించరాదు.

పాము కాటువేసినప్పుడు, తేలుకుట్టినప్పుడు ప్రథమచికిత్స చేయడం నేర్చుకుని వుండాలి. ఒక బ్లేడు, అగ్గిపెట్టె దగ్గర వుంచుకోవాలి. ఇతర సాధారణమైన మందులుకూడా దగ్గరుంచుకోవాలి.

కామ్రేడ్స్,

ఈనాడు మన పార్టీ నిర్మాణంలో కొరియర్ల పాత్రకు ఎంతో ప్రాధాన్యతవుంది. ఈ కామ్రేడ్స్ ప్రశాంతంగా, చాకచక్యంతో సకాలంలో పనులు నిర్వర్తించేట్లయితే, మన పార్టీ అప్రతిహతంగా పురోగమిస్తుంది. మన

పార్టీ కార్యకలాపాలు ఈ కామ్రేడ్స్‌పైనే ఆధారపడివున్నాయి. అందువల్ల ఈ కొరియర్ కామ్రేడ్స్‌పై అంతటిబాధ్యతవుంది. వారు ఏమాత్రం ఉదాసీనంగా వున్నా, నిర్లక్ష్యంగావున్నా మన పార్టీకి తీవ్రమైన దెబ్బ తగులుతుంది అందువల్ల ఈ కామ్రేడ్స్ తమ బాధ్యతలను గుర్తెరిగి, తమ విధులను జాగరూకతతో నిర్వర్తించాలి.

దళాలకు సూచనలు

మన దళాలు, పూర్తిగా రహస్యంగా పనిచేయాలి. అలా పనిజేస్తేనే మనం దీర్ఘకాలికపోరాటం సాగించగలమని అనుభవం తెలుపుతోంది.

1. దళం మకాం

దళం సర్వదా రహస్యంగానే వుంటుంది. అది ఒక గ్రామానికి వెళ్ళాలనుకుంటే, ముందుగా ఆ గ్రామంలో పరిస్థితులనుగూర్చి తెలుసుకొని రావటానికి తన స్కౌట్‌ను పంపించాలి. దళం, గ్రామానికి చేరుకున్నతర్వాతకూడా గ్రామానికి దూరంగా సురక్షితమైన స్థలంలో కూర్చుండాలి. గ్రామంలోని ఒకరిద్దరు ముఖ్యులకోతప్ప యితరులెవ్వరికీ దళం వచ్చిన విషయం తెలియగూడదు అది తన కవసరమైన వాటినన్నింటినీ రహస్యంగానే పెద్ద హడావుడి లేకుండా, ఆ ఒకరిద్దరిద్వారానే సేకరించుకోవాలి.

దళంలో ఎంతమందిసభ్యులున్నాసరే, వారిలో ఒకరిని సెంట్రీగా నియమించాలి సెంట్రీగావున్న కామ్రేడ్ గతంలోవలె ఎత్తైనచోటునగాని, దారిప్రక్కనగాని నిలబడరాదు తాను యితరులకు కనబడకుండా, ఇతరులు తనకు కనిపించటానికి వీలైన చోటును ఎంచుకోవాలి

గ్రామంలోని ఒకరిద్దరు ముఖ్యకామ్రేడ్సును నిఘాతో వుండవలసిందిగా కోరాలి. అయినా, వారిమీదనే ఆధారపడి సెంట్రీని ఏర్పాటుజేయకుండామాత్రం వుండరాదు.

ఏ పరిస్థితుల్లోనూ పగటివేళ యూనిఫారములు ధరించరాదు.

బీడీలు, సిగరెట్లు కాల్చటం జరిగితే చివరకు మిగిలిపోయిన ముక్కలను కంటికి కనిపించకుండేట్లు నలిపివేయాలి. లేదా ఆకులో మట్టోపైన కప్పాలి అదే విధంగా, భోజనం చేసిన తర్వాతకూడా అందుకు ఉపయోగించిన విస్తరాకులు మొదలైనవాటి జాడలుకూడా ఏమీ కనిపించకుండునట్లు చూడాలి.

వర్షాలనుండి రక్షించుకొనటానికిగాను ఫారెస్టులలోకూడా ఏర్పాట్లు చేసుకోవాలి. ఈ ఏర్పాట్లనుగూర్చి యితరులెవ్వరికీ తెలియనివ్వరాదు.

## 2. దళ ప్రయాణం

చేయవలసిన ప్రయాణానికి సంబంధించిన వివరాలన్నీ ముందుగా తెలుసుకోవాలి. మీ ప్రయాణ సమయంలో స్కౌట్లు దారిజూపాలి. దళం కొంతదూరం వెనుకనేవుంటూ నడవాలి.

శత్రువు మీకోసం చారిగాచివుండే అవకాశంవున్న మార్గాలగుండా గాక, యితర మార్గాలగుండా ప్రయాణం చేయాలి.

రాత్రివేళల్లో మాత్రమే ప్రయాణం చేయండి

ప్రయాణం చేస్తున్నంతసేపూ మీఆయుధాలను సిద్ధంగావుంచుకోండి.

## 3. ఇతర యూనిట్లతో సంబంధాలు పెట్టుకొనడం

తన టపాఅంతటినీ ఒక ప్రత్యేక తావుకు తెప్పించుకునేందుకు ప్రతి దళమూ ఏర్పాట్లు చేసుకోవాలి. ఆ తావునుండి ప్రతివారు తన వుత్తరాలను తెప్పించుకొనేందుకు ఏర్పాట్లు చేసుకోవాలి. అంతేకాని, కొరియర్లు దళాన్ని వెదుక్కుంటూపోరాదు

దళంనుండివచ్చే కొరియర్ కూడా, ముందుగా నిర్దేశించబడిన చోటుకేవెళ్ళి, వుత్తరాలను అందజేయాలి.

దళసభ్యులు సరాసరిని తమ యిండ్లకుపోరాదు. వారు గ్రామం వెలుపల మకాం చేయాలి లేదా ఫారెస్టు ప్రాంతంలోనేవుండి, తమ కుటుంబాలను అక్కడికే రప్పించుకొని కలుసుకోవాలి. ఆ గ్రామంలో శత్రువు నిఘా వున్నా, స్థానిక శత్రువులున్నా, తమను కలుసుకొనటంకోసం వారు తమ కుటుంబాన్ని మరొక గ్రామానికి పిలిపించుకోవాలేగాని, వారిని తమ స్వంత గ్రామాలలోనే కలుసుకోరాదు.

## పార్టీని, దళాలను సంరక్షించుకొనేందుకు ప్రజలను సన్నద్ధం చేయండి

పోరాటాలలోకి ప్రజలను సమీకరించే సందర్భంలో, కొన్నిసార్లు మనం రహస్య పద్ధతులను అనుసరించవలసిరావచ్చు. ఉదాహరణకు, మనం రోడ్లను తెగగొట్టేముందు, ఆ పథకాన్నిగూర్చి అందరికీ ముందుగానే బహి

ర్గతం చేయరాదు. ఏ గ్రామంనుండి ఎంతమంది వచ్చి పాల్గొన్నారనే విషయం యితరులకు వెల్లడించగూడదు. ప్రజలను వేర్వేరు బృందాలుగా ఏర్పాటు చేయాలి. ఆ బృందాలన్నింటినీ కలగలపకుండా పనిచేయించాలి. అదేవిధంగా మనం ఆహార ధాన్యాలను స్వాధీనం చేసుకునే సందర్భంలో కూడా బృందాలను ఏర్పాటుజేయాలి. పంపిణీని ఆ యా బృందాలద్వారా జరిపించాలి. ధాన్యాన్ని తిరిగి శత్రువు చేతుల్లోకి పోనివ్వరాదు. ధాన్యాన్ని రహస్యంగా పాతరవేసి వుంచాలి. తీసుకువెళ్లేటప్పుడు ధాన్యంగింజలు రాలకుండా జాగ్రత్త పడాలి. గొడ్డళ్ళు పారలు, కొడవళ్ళను జాగ్రత్తగా దాచివుంచాలి. వాటిని యితరుల కివ్వనవసరంలేదు. మీ పని పూర్తయిన తర్వాత వాటిని జాగ్రత్త పరచండి. పని వున్నప్పుడు వాటిని బయటకు తీయండి పని పూర్తయిన తర్వాత వాటిని యధాస్థానంలో భద్రపరచండి. మనం ధాన్యం స్వాధీనం చేసుకోబోతున్న విషయాన్ని శత్రువుకు ముందుగా తెలియనివ్వరాదు. ధనిక రైతులను సయితం దూరంగానే వుంచాలి. స్వాధీనంచేసుకునే కార్యక్రమాన్ని క్రమపద్ధతిలో నిర్వహించాలి

మనపార్టీని సంరక్షించేందుకుగాను ప్రజల చైతన్యాన్ని పెంపొందించాలి. అవసరమైతే, ప్రాణత్యాగం చేసైనాసరే, పార్టీని సంరక్షించేందుకు మనం ప్రజలలో ప్రచారం చేయాలి. ముఖ్యమైన పార్టీనాయకత్వాన్ని సంరక్షించేందుకు, అవసరమైన చైతన్యాన్ని పార్టీ సభ్యులలో కల్పించాలి. శత్రువు దాడులుచేసినట్లయితే, తమ నాయకత్వాన్ని సంరక్షించుకునేందుకుగాను, ఎలాంటి త్యాగానికయినా సిద్ధంగావాలని సభ్యులకు వివరించి చెప్పాలి. అందువల్లనే, దాడులలో ప్రాంతీయకమిటీ సభ్యులు, ముఖ్యనాయకత్వమూ పాల్గొనరాదని రాష్ట్రకమిటీ స్పష్టంచేసింది. అత్యవసర పరిస్థితులలో తప్ప, దాడులలో జోనల్ నాయకత్వం సాధారణంగా పాల్గొనరాదని కూడా స్పష్టంజేసింది ముఖ్యనాయకులను సెంట్రీలుగా నియమించరాదు. శత్రువురాకను గూర్చి తెలుసుకొనటానికే సెంట్రీ వుద్దేశించబడతాడు. అందువల్ల, శత్రువు తూటాకు ముందుగా ఎర అయ్యేది అతడే. సెంట్రీ బాధ్యతలు నిర్వహించే ముఖ్యనాయకుడెవరయినా తొలిదెబ్బకే అంతంకావలసిందే. అలాంటప్పుడు సెంట్రీ ఎందుకు? సెంట్రీ మొత్తం దళానికంతకూ వుద్దేశించబడినప్పటికీ, నాయకత్వంయొక్క భద్రతకూడా ప్రధానాంశమే. అందువల్ల, ఎవరు ముఖ్యమైన కామ్రేడ్? అన్నప్రశ్న తలెత్తుతుంది.

ముఖ్యనాయకత్వం అంటే. అక్కడ మకాం వేయబడిన దళంలో ముఖ్య కామ్రేడ్స్ అని అర్థం. ఇతరులు, వారినిగూర్చి, శ్రద్ధతీసుకోవాలి. వారిని కాపాడుకోవాలి.

మన కరపత్రాలలోను, సర్క్యులర్లలోను, వాల్ పోస్టర్లలోను, నినాదాలలోను మన సాంకేతిక రహస్యాలు వెల్లడవకుండా జాగ్రత్తపడాలి.

కొత్త కామ్రేడ్ ఎవరైనావస్తే, అందుకుసంబంధించిన వ్యక్తిమాత్రమే కలుసుకోవాలి. ఆయన ఏ గ్రామానికి జెందిన వాడనే విషయం అడగటానికిగాని, తెలుసుకొనటానికిగాని యితర సభ్యులు ప్రయత్నించరాదు. ఎవరైనా అలాంటి ప్రశ్నలడిగేట్లయితే, కొత్త కామ్రేడ్ తన గ్రామాన్నిగాని, పేరునుగాని, తానక్కడకు వచ్చిన పనినిగూర్చిగాని, వెల్లడించరాదు.

రిఫరెన్సుకు అవసరమైన రహస్య రిపోర్టులు, యితర రికార్డులుమినహా రోజువారీ కార్యకలాపాలకు సంబంధించిన యితర రికార్డులను ధ్వంసం చేయవచ్చు రహస్య టెక్ సర్క్యులర్లు, యితర రహస్య గెరిల్లా ఎత్తుగడలు, మన కొత్తఎత్తుగడలు, శత్రువుచేతుల్లోపడితే హానికరమయ్యే యితర పత్రాలు చేతిసంచుల్లో వుంచరాదు. బాధ్యతారహితమైన కామ్రేడ్స్‌వద్దనూ వుంచరాదు. వాటిని, బాధ్యతగల కామ్రేడ్స్‌వద్దనే వుంచాలి. మిగతా కామ్రేడ్స్‌కు వాటిని చదివి వినిపించాలి. చదివిన తర్వాత, వాటిని జాగ్రత్తగా భద్రపరచాలి. లేదా ధ్వంసం చేయాలి.

కొత్త కామ్రేడ్‌గాని, కొరియర్‌గాని, నిర్దిష్టమైన పనిమీద మరెవరైనాగాని–యింకొక వ్యక్తిని కలుసుకొనటానికి వెళ్ళినప్పుడు, అతనిని బయటకు పిలిచి మాట్లాడాలి. ఇతరుల ఎదుట మాట్లాడరాదు కొత్త కామ్రేడ్‌కూడా అందరి ఎదుటా హడావుడిగా మాట్లాడరాదు. ఏదో యితరచోట కూర్చోవాలి.

మరే యితర కామ్రేడ్‌తోనైనా చర్చించదగిన స్వల్పవిషయమైతే, ఒక వుత్తరంద్వారాగాని, కొరియర్‌ద్వారాగాని ఆ పనిచేయవచ్చు. ప్రతిస్వల్ప విషయానికి సమావేశం అవసరంలేదు. అనివార్యమైనప్పుడే సమావేశం ఏర్పాటు చేయాలి.

## టెక్నికల్ సర్క్యులర్ - రెండవ భాగం

1. ఆశ్రయంపొందే తావులు

(ఎ) ఒకచోట ఎంత తక్కువమందివుంటే అంతగా భద్రతవుంటుంది. రహస్యాన్ని అంతగా కాపాడవచ్చు. ఈ సూత్రాన్ననుసరించే, ఆర్గనైజర్లు దళాలవెంట బయటకు వెళ్ళడం సరికాదని నిర్ణయించడం జరిగింది ఈ రోజులలో సాయుధదళమే ప్రధాన రక్షణకాదు. రహస్యాన్ని కాపాడటమే ఆర్గనైజరుకు ప్రధానమైన రక్షణ. అందువల్ల, ఒకరిద్దరు నమ్మకమైన కొరియర్లు మినహా, ఆర్గనైజరుతో మరెవ్వరూ వుండరాదు.

(బి) గ్రామాలవెలుపల,నూతులవద్దగాని, పొలాలలోగాని,ఆశ్రయం తీసుకొంటున్నప్పుడు, యిరుగు పొరుగు నూతుల యజమానులు, పొలాల యజమానులు మన సానుభూతిపరులై వుండునట్లు చూడాలి. మనం ఆశ్రయం తీసుకుంటున్న నూతి యజమాని ఎప్పటికప్పుడు శతృవుకు సంబంధించిన వార్తలను, అతని రాకపోకలకు సంబంధించిన వార్తలను యిరుగు పొరుగువారినుండి తెలుసుకొనేందుకు ఏర్పాట్లు చేసుకోవాలి. అలాగే అవసరమైన రక్షణ ఏర్పాట్లు చేయాలి.

(సి) కాపలా బాధ్యతలు నిర్వర్తిస్తున్న కామ్రేడ్, పొలాలలోని రైతులు ధరించేదుస్తులే ధరించాలి. ఆ పొలాలలో తీరికలేకుండా పనిజేసుకుంటున్నట్లుగా కనిపించాలి. అయితే తన కాపలా బాధ్యతను నిర్వర్తిస్తూనేవుండాలి.

(డి) ఆశ్రయం తీసుకునేందుకు, చిన్న కొండలను, రాళ్ళగుట్టలను కూడా వుపయోగించుకోవచ్చు. అయితే, ఆహారం, నీరు తీసుకురాబడిన సమయాలలో అదనపు జాగ్రత్తలు తీసుకొనడం అవసరం. ప్రజలు సాధారణంగా వెళ్ళని చోట్లకు భోజనం నీరూ తీసుకెళ్ళడం అనుమానాలు కలుగజేస్తుంది.

(ఇ) తాముకూడా పూర్తిగా ప్రజలలో కలిసిపోయేందు కనువుగా, ఆర్గనైజర్లు, కొరియర్లు తమ దుస్తులను ధరించాలి. అలాంటి అలవాట్లనేచేపట్టాలి. తన తలమీాదిజుట్టు కత్తిరించేపద్ధతికూడా (నున్నగా గొరిగించటమో, పొట్టిగా కత్తిరించటమో, వివిధ రకాలయివ కత్తిరింపులు) ఆ ప్రాంత ప్రజల తల కత్తిరింపులను పోలి వుండాలి. ఈ ప్రాంతాలలో రైతులు ధరించే, బనియన్లను,

లేదా పొట్టిచొక్కాలను పోలిన ముడిగుడ్డ చొక్కాలను ధరించాలి రైతుల ధోవతులవలెనే వుండే సీరుకావి ధోవతులు వాడాలి. చేతికి రిస్టువాచీ ధరించ కూడదు (ఎవరికీ కనిపించకుండా చొక్కా జేబులో పెట్టి వుంచుకోవచ్చు, ఫౌంటెన్ పెన్లను, యితరులకు కనిపించేట్లుగా చొక్కా జేబులో పెట్టుకోరాదు. మీసాలను రైతులకువలెనే పెంచుకోవాలి. వాటిని, ఆధునికపద్ధతిలో జాగ్రత్తగా కత్తిరించి, తీర్చిదిద్దటం కూడదు.

మనం బట్టలుతికే సబ్బును వాడరాదు. ఎందుకంటే శత్రువు, అనుమానంతో వ్యక్తుల దుస్తులను వాసన జూస్తున్నాడు. తలకు తలగుడ్డ చుట్టుకొనడం మంచిది.

(యఫ్) మనం దాగివుండే స్థలాలు రహదారులకు సమీపంలో వుండరాదు. శత్రువు తరచు తిరుగుతుండేమార్గాలకు చేరువలోనూ వుండరాదు. అత్యవసర పరిస్థిల్లో, చాలా తక్కువ ప్రాంతానికే పరిమితమై, శత్రువు సమీపించినప్పుడు సంఘర్షణ పడవలసివస్తుందిగనుక అలాంటి తావుల్లో రక్షణ తీసుకోరాదు. శత్రువు అకస్మాత్తుగా వచ్చినప్పటికీ మన రక్షణకు, శత్రువు ముట్టడి నుండి, శత్రువు పట్టులోనుండి తప్పుకొనటానికి అవకాశం వుండేందుకు అనువైన స్థలాలుగా అవి వుండాలి. అంటే వాగులు, కొండలు, చెట్లు, గుంటలు చిత్తడి పొలాలు, లేదా సరస్సులు, శత్రువు మన రక్షణ స్థలాలమీద వచ్చిపడే ముందు అలస్యం జరిగేందు కనువైన ఏదోరకమైన ఆటంకాలైనా వుండే స్థలాలుగా వుండాలి. అలాంటి స్థలాలను ఎంచుకొనటంలో మనకు ఎంతో అనుభవంవుంది.

(జి) మనం తోలు సంచులనో, ఆధునికమైన సంచులనో వెంటేసుకు తిరగరాదు. మన వస్తువులన్నింటినీ, గుడ్డమూటల్లో కట్టి వుంచటం తీసుకెళ్ళటం జరగాలి.

## 2. *ఆహారం విషయం*

(అ) మనం ఆశ్రయం తీసుకుని వుండే స్థలాలకు పగటివేళ భోజనం తెప్పించుకొనటం కష్టం. అరుదుగా లభించే కొన్ని సందర్భాలలో మాత్రమే అలా తెప్పించుకొనటం సాధ్యం కావచ్చు. అయితే అలా తెప్పించుకొనటం భద్రత దృష్ట్యా మంచిదికాదు. రాత్రివేళల్లోగాని, చీకటిపడిన తర్వాతగాని మనం వుండే చోట్లకు ఆహారం తెప్పించుకొనటం చాలా సులభం. మనం భోజనం తెప్పించుకునేటప్పుడు, మరుసటిరోజు వుదయానికిగూడా కొంత మిగిల్చి వుంచేందుకు వీలుగా వుండాలి. నిలవవుండే తరహా ఆహార పదార్థాలుగా వుండాలి. మనకు అలాంటి ఆహారం లభ్యం కాకపోతే, వేయించిన శనగపప్పు

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 11 మైసయ్య | తుంగతుర్తి | కొరియర్, పోలీసులు చుట్టుముట్టి కాల్చిచంపారు. |
| 12 కొమరయ్య | " | " |
| 13 లక్ష్మణ్ | జనగామ తాలూకా | " |
| 14. వాసు | " | " |
| 15. దాసు | " | కేంద్ర ఆర్గనైజర్. పోలీసులు చుట్టుముట్టి కాల్చిచంపారు. |
| 16 రంగయ్య | " | దళసభ్యుడు. పోలీసులు చుట్టుముట్టారు ఘర్షణపడుతుండగా పోలీసులు కాల్చిచంపారు. |
| 17. మనోహర్ | " | జోనల్ కమిటీ సభ్యుడు ,, |
| 18 వెంకటయ్య | " | కొరియర్ " |
| 19. గుట్టయ్య | " | దళసభ్యుడు " |
| 20. బాలయ్య | గుండాల | దళసభ్యుడు మశూచి వ్యాధి సోకి మృతి చెందాడు |
| 21. నల్లెళ్ల రాములు | " | దళసభ్యుడు. క్షయ వ్యాధివల్ల మరణించాడు. |
| 22 జోగయ్య | " | జోనల్ కమాండర్, పోలీసులు చుట్టుముట్టి కాల్చి చంపారు |
| 23. దళ సభ్యుడు | " | శత్రు ఏజెంట్లు పట్టించారు. పోలిసులు కాల్చి చంపారు. |
| 24. బాలరాజు | వరంగల్ తాలూకా | జోనల్ కమిటీ సభ్యుడు శత్రు ఏజెంట్లు పట్టించారు. |
| 25. ఒక కొరియర్ | " | " |
| 26 ఒక కొరియర్ | " | " |
| 27. నందయ్య | " | దళ కమాండర్. పోలీసులు చుట్టుముట్టి కాల్చి చంపారు. |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 28. శంకర్ | వరంగల్ తాలూకా | దళ డిప్యూటీ కమాండర్ పోలీసులు చుట్టుముట్టి కాల్చి చంపారు. |
| 29. అమ్మయ్య | " | కొరియర్ " |
| 30. మట్టయ్య | " | కొరియర్. శత్రు ఏజెంట్లు పట్టించారు. పోలీసులు కాల్చి చంపారు. |
| 31 రాగయ్య | " | సెంటర్ ఆర్గనైజర్. |
| 32. దలపతి | " | సెంటర్ ఆర్గనైజరు. శత్రు ఏజెంట్లు పట్టించారు. పోలీసులు చంపారు. |
| 33 ఒక కొరియరు | " | శత్రు ఏజెంట్లు పట్టించారు. పోలీసులు కాల్చిచంపారు. |
| 34. రామనాధం | " | కొరియర్. శత్రు ఏజెంట్లు పట్టించారు. పోలీసులు కాల్చి చంపారు. |
| 35. ధర్మయ్య | " | " |
| 36. కోటయ్య | " | |
| 37. బుచ్చయ్య | ఇల్లెందు | |
| 38 సీతారామయ్య | | " |

ఇల్లెందు తాలూకా

| | | |
|---|---|---|
| 1. పున్నయ్య (బత్తుల వీరాస్వామి) | నాగులంచ (ఖమ్మంతాలూకా) | పండితాపురంవద్ద చంపివేయబడ్డాడు. సైనిక గస్తీ దళాలను మాటుగాచి అనేక దెబ్బలు తీశాడు. అల్లాపల్లి క్యాంపు సమీపాన నలుగురు గూర్ఖాలను చంపాడు. గంగారం-సత్తిపల్లి వద్దగల నంజప్ప క్యాంపుపై దాడిజేశాడు |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 2. ఆయన అనుచరుడు చంద్రమౌళి (కన్నయ్య) | పండితాపురం | |
| 3. బుచ్చయ్య | " | |
| 4. షేక్‌లాల్ | " | మామిళ్ళపల్లి భూస్వాములు పట్టించారు. ఏ రహస్యమూ వెల్లడించనందున చిత్రహింసలకు ఎరజేసి చంపారు. |
| 5. యీసం భూపతి | పండితాపురం | అల్లాపల్లి క్యాంపువద్ద చంపివేశారు. |
| 6. యేనిగపాటి నాగయ్య | తాళ్ళగూడెం | ఆర్గనైజర్ కొప్పురాయినుండి సరిహద్దు ప్రాంతానికి వెళ్తుండగా మార్గమధ్యంలో కాల్చి చంపారు. |
| 7. చెంచులక్ష్మయ్య | ఎలుగుబల్లి | 1949 నవంబరు 8 న కె. సముద్రంవద్ద చిత్రహింసల పాలుజేసి కాల్చిచంపారు. |
| 8. ఒక కోయయువకుడు | అల్లీగూడెం | 1949 నవంబరు 14 న |
| 9. ఒక గెరిల్లాదళసభ్యుడు | | గోదావరినదిని దాటుతుండగా 1949 నవంబరు 15 న. |
| 10. వరదా ముత్యాలు | మైలవరం | 1950 మే 1 న. |
| 11. శ్రీరాములు | వామనదేవ అడవులు | 1950 మే 2 న. |
| 12. బాలయ్య | " | " |
| 13. కోండ్రు రాజయ్య | మొగరాలగుట్టల సమీపాన | 1950 మే 3 న. |
| 14–16. ముగ్గురుకామ్రేడ్స్ | | చింతపాలెముకు– నెల్లిపాకకు మధ్యన ఫారెస్టులో 1950 మే 7 న. |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 17. కాసం మల్రాజు | | చంద్రాయపాలెం అడవులలో 1950 మే 14 న |
| 18. వెంకటప్పయ్య | | " |
| 19 సార లక్ష్మయ్య | | " |
| 20–21. ఇద్దరు కామ్రేడ్స్ | కప్పల బంజరు | |
| 22. ఒక రైతు | గంగారం | 1950 ఏప్రిల్ 19 న |
| 23–42. ఇరవై మంది స్త్రీలు | సోంపల్లి | దారుణంగా చెరిచి చంపారు. |
| 43 మేకల లింగయ్య | పంతరపాడు అడవులు | 1950 అక్టోబరు 13 న |
| 44. మొక్కా ముత్తయ్య | " | " |
| 45. పడిగల శేషయ్య | రామవరం అడవులు | " |
| 46. వేణు (కృష్ణమూర్తి అనబడే నరసింహయ్య)<br>47. రంగయ్య<br>48. పుల్లయ్య | " | బొగ్గు గనుల ప్రాంతంలోని వేణు, బాలు, ఆనందం, వీరు ముగ్గురేకావచ్చు. వీరినిరామవరం అడవులలో 1950 డిసెంబరులో చంపివేశారు. |
| 49. రామం పుల్లయ్య | గుండాల ప్రాంతం | |
| 50. నంది బాలయ్య | " | |
| 51. రాజయ్య | " | |
| 52. భూపతి | ఎర్రాయిగూడెం | 1951 జనవరి 22న. |
| 53 అప్పారావు | కమలాపురం | " |
| 54. సూలూరి సమ్మయ్య | | |
| 55. కట్టి రామయ్య | దేవలగూడెం | |
| 56. సాగిబోయిన గుత్తయ్య | " | |
| 57. కుంజ బుచ్చిరాములు | లింగగూడెం | |
| 58 బుచ్చయ్య | " | |
| 59. కె. భూమయ్య | " | |
| 60. కట్టి నరసయ్య | " | |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 61. మట్టా వెంకటేశ్వర్లు | చంద్రపాలెం | 1951 జనవరి 8న. |
| 62. లాలు (సైదులు) | రాఘవపురం అడవులు | 1951 జనవరి 25న. |
| 63. నారాయణదాస్ | బొమ్మనపల్లి | 1951 మార్చి 9న. |
| 64. గోపయ్య | " | " |
| 65 భీమయ్య | " | " |
| 66-67 ఇద్దరు కొరియర్లు | బుడతెంపాడు | |
| 68. ఒక కొరియరు | లింగాల | |
| 69 తోటెం గుత్తయ్య | సోంపల్లి గ్రామం | దళ సభ్యుడు. కోయ పెద్దలు ద్రోహంచేసి పట్టించారు |
| 70. కోయ నర్సయ్య | | గుండాల - చెనిగపురం క్యాంపుపై దాడిలో చంపబడ్డాడు |

**గడిపాడు, గుండాల క్యాంపులలో సుమారు 300 మంది కామ్రేడ్స్‌ను కాల్చి చంపారు**

నరసంపేట (పాఖాల) ములుగు తాలూకాలు

| | | |
|---|---|---|
| 1. రోశయ్య | అల్లాపురం | పరుండబెట్టి, రాళ్ళతో తల పగులగొట్టి చంపారు. |
| 2. దుర్గా లచ్చయ్య | పాఖాల అడవులు | 1950 జూన్ 5 న |
| 3. అబ్దుల్ హుస్సేన్ | " | " |
| 4. రామిరెడ్డి కుమరయ్య | | |
| 5. రామిరెడ్డి నరసయ్య | | |
| 6. తాతా ముత్తయ్య | | ములుగు తాలూకా నార్లపూర్‌కు - ఇస్లాంపూరుకు మధ్య కాల్చి చంపారు. |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 7 | మొగలి వెంకటయ్య | చంద్రపాలెం పాల్వంచ అడవులు | 1950 అక్టోబరు 24 న |
| 8. | కందుల నందయ్య | తిమ్మాపురం అడవులు | దళ కమాండర్ |
| 9. | పెంటి శంకరయ్య | " | డిప్యూటీ కమాండర్ |
| 10. | గోళ్ల అయిలయ్య | | |
| 11 | గోళ్ల చొక్కయ్య | " | |
| 12. | నరహరిరావు | " | |
| 13 | ఆలుబోయిన నరసయ్య | పంచపాండవుల గట్టు | 1950 నవంబరు 26 న |
| 14 | బాసిపోయిన నరసయ్య | " | " |
| 15. | నరసింహులు | " | " |
| 16. | బుర్రా ఆగయ్య | " | " |
| 17. | అల్లోరు | పెనుకొండ అడవులు | రెడ్లవాడ దళం |
| 18 | ఉప్పల వెంకటయ్య | " | " |
| 19. | చాకలి యాకయ్య | " | " |
| 20 | మరో కామ్రేడ్ | " | " |
| 21. | సీతారామయ్య | రాఘబోయిన గూడెం | 1951 జనవరి 8 న |
| 22. | మల్లెల లచ్చయ్య | పెగడపల్లి | కోయ కామ్రేడ్ |
| 23. | పిచ్చయ్య | నాగారం | " |
| 24 | బుగ్గా కమ్మయ్య | జంగాలపల్లి | " |
| 25. | పెద్దబోయిన పాపయ్య | గొరిమళ్ళ అడవులు | |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 26. పుల్లయ్య | యెల్లారుగూడెం కొండలు | |
| 27. కల్టి అచ్చయ్య (రాములు) | చీమలగూడెం | బస్తర్ ప్రాంతంలో వుద్యమ విస్తరణావకాశాలను గూర్చి పరిశీలిస్తుండగా చంపివేశారు. |
| 28. నరసయ్య | " | " |
| 29. మోకళ్ళ సమ్మయ్య | పెనుగొండ | |
| 30. కుంజ నరసయ్య | " | |
| 31. ఏర్పు కన్నయ్య | " | |
| 32. పెనక సమ్మయ్య | ,, | |
| 33. పెండకట్ల నరసయ్య | ,, | |
| 34 నలిపెడ బుచ్చయ్య | ,, | |
| 35. మంకెడి అచ్చయ్య | ,, | |
| 36. బండలసాటి నారాయణ | నీలాలనరసాపురం | |
| 37. మల్లెల నందయ్య | తగడపల్లి | |
| 38. యం శంకరయ్య | ,, | |
| 39. సత్తెం | ,, | |
| 40. ఊకే పెదపోటయ్య | లింగాల | |
| 41. ఊకె రాజయ్య | ,, | |
| 42. మిసి రామయ్య | యెల్లాపురం | |
| 43. * భాషు | ములుగు తాలూకా | |
| 44. * రాములు | " | |
| 45. * రాము | " | |
| 46. భిల్లు | | |
| 47. ఒక అభిమాని | గంగారం | 1950 ఏప్రిల్ 19న. |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 48. ఒక అభిమాని | పాఖాల అడవులు | 1950 జూన్ 1న. |
| 49–55. ఏడుగురు మిలిటెంట్లు | ములుగు అడవులు | 1950 అక్టోబరు 5న. |
| 56. ఒక కామ్రేడ్ | పాఖాల తాలూకా | |
| 57. ఒక కామ్రేడ్ | పాతరపల్లి | 1950 అక్టోబరు 13న. |
| 58–63. ఆరుగురుకామ్రేడ్స్ | మారపు అడవులు | " " |
| 64–67. నలుగురు క్రామేడ్స్ | గంగారం | 1950 అక్టోబరు 22న |
| 68. ఒక కామ్రేడ్ | తంటివారిపాలెం | 1950 డిసెంబరు 6న. |
| 69–70. ఇద్దరు కామ్రేడ్స్ | | ములుగు తాలూకాలో రామానుజపురానికి – బుద్ధవరానికి మధ్య. |
| 71–79. తొమ్మిదిమంది మిలిటెంట్లు | పాఖాల ములుగు అడవులు | |
| 80–94. పదిహేనుమంది | | నర్సంపేటక్యాంపు జైలునుండి కొత్తగూడెం క్యాంపుకు తీసుకెళ్ళి కాల్చిచంపారు. |

*జనగామ, వరంగల్ తాలూకాలు*

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 1 * గబ్బెట (గంగిసాని) తిరుమలరెడ్డి | గబ్బెట | |
| 2. రేకుల లక్ష్మారెడ్డి | ఖమ్మంజిల్లాకు చెందినవాడు | వరంగల్‌లో విద్యార్థిగా వుంటూనే దళంలో చేరాడు |
| 3. బక్కయ్య | సీతారామపురం | |
| 4. జల్లి అయిలయ్య | చింతపల్లి | 1949 ఆగస్టు 6 న |
| 5. చీమల బాలయ్య | ,, | ,, |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 6. వాసి రామిరెడ్డి | చింతపల్లి | 1949 ఆగస్టు 6 న |
| 7. భీమారావు | | విచారణలో ఖైదీగా వుంటూ క్షయవ్యాధి వాతబడి మృతి జెందాడు. |
| 8. లూమాలంబాడి | ముంద్రాయి | 1950 మార్చి 2 న |
| 9 వెంకయ్య | ” | ” |
| 10. యెర్రా నరసయ్య | బొంగరాలగుంట | 1950 అక్టోబరు 9 న |
| 11 –16. మరో ఆరుగురు | ” | ” |
| 17. అచ్చా సగిలయ్య | మహాదేవపురం | 1950 అక్టోబరు 30 న |
| 18. అబ్బా సైగా | వారిజపేట | |
| 19. ముత్తయ్య | ఐనునూరు | గడ్డివాములో పడవేసి సజీవదహనం చేశారు. |
| 20. వెంకట నరసింహారెడ్డి | చెన్నూర్ | |
| 21. భద్రయ్య | మాధవపురం | కొరియర్, పట్టుకుని చంపివేశారు |
| 22. మరొకరు | ” | ” |
| 23. బొక్కా సోమయ్య | | |
| 24. * తాను | | |
| 25. * గానుగుపాటి నారాయణరెడ్డి | | జోనల్ ఆర్గనైజర్, కమాండర్ |
| 26. * నల్లా నరసింహులు (జూనియర్) | | |
| 27. * దేవసాని వెంకయ్య | | |
| 28. * బసవయ్య | | |
| 29. శామ్యూల్ | | |
| 30. అయిలయ్య | | |

| పేరు | గ్రామం | వివరాలు |
| --- | --- | --- |
| 31. సయ్యద్ శామ్యూల్ | వడ్లకొండ | కాల్చి చంపారు. |
| 32. శివరాత్రి బాలయ్య | " | " |
| 33. దొండిగల బాలయ్య | " | " |
| 34. కుర్మి అయిలయ్య | " | " |
| 35. మరో మిలిటెంట్ | " | |
| 36–39. నలుగురు మిలిటెంట్లు | అడవి కేశవపురం | |
| 40. కొండపల్లి నరసయ్య | | |
| 41. మేకల పుల్లయ్య | మద్దికుంట (వరంగల్ తాలూకా) | |
| 42. డోకల పాపయ్య | " | |
| 43. మేడా సోమయ్య | " | |
| 44. వీసం ముత్తయ్య | " | |
| 45 కోటం లోకయ్య | " | |
| 46. కొమ్మా రాజయ్య | రాజారం (వరంగల్ తాలూకా) | |
| 47–54. ఎనిమిదిమంది | ధర్మాపురంతండా (జనగామ తాలూకా) | |
| 55. కొమరయ్య | " | |

రజాకార్ బీభత్సకాలంలో

| పేరు | గ్రామం | వివరాలు |
| --- | --- | --- |
| 1. దొడ్డి కొమరయ్య | కడవెండి (జనగామతాలూకా) | 1946 జులై 4 న |
| 2. మండాది సోమిరెడ్డి | " | దేవరుప్పులపై నైజాం పోలీసు దాడిలో. |
| 3. మరో కామ్రేడ్ | సీతారామపురం | |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 4. కొత్తవీరారెడ్డి | చీటకోడూరు | |
| 5. కొత్తరాజిరెడ్డి | ,, | |
| 6. కొండహనుమయ్య | ,, | |
| 7. అయ్యోరురామయ్య | ,, | |
| 8-9 ముగ్గురులంబాడీలు | ఎర్రబల్లి | పగసాధింపుచర్యగా, |
| 10. ఒక మిలిటెంట్ | కోయాడ(వరంగల్ తాలూకా) | ,, |
| 11. కుమ్మరి నరసింహులు | | ,, |
| 12 యాచగిరి | వడ్లకొండ | తుపాకి తూటా దెబ్బవల్ల |
| 13. మరో కామ్రేడ్ | ,, | ,, |
| 14-20. ఏడుగురు | | రజాకార్, పోలీసు దాడినుండి ఆకునూరుగ్రామాన్ని రక్షించు కొంటుండగా మృతిజెందారు. |
| 21. మోటం పోశాలు | బైరాంపల్లి | |
| 22. మోటం రాములు | ,, | |
| 23-108. బలిజనాగయ్య మరో 85 మంది | ,, | బైరాంపల్లిలో కాల్చి చంపబడ్డారు |
| 109. యెంబయ్య | గంగాపురం | సిద్దిపేట తాలూకా. |
| 110-128. మరో 19 మంది | కూటిగల్లు | కాల్చిచంపారు. |
| 129-131. ముగ్గురు | దేవరుప్పల లంబాడీలు | సజీవ దహనం చేశారు. |
| 132-153. 22 మంది | అక్కిరాజుపల్లి | |
| 154-183. 30 మంది | కొడకండ్ల | |
| 184. వడ్ల రాజయ్య | | |
| 185 కంపల అయిలయ్య | ఎర్రగొల్లపాడు | రజాకార్లకు, నైజాం పోలీసులకువ్యతిరేకంగా పోరాడుతూ అసువు లర్పించాడు. |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 186–188 ముగ్గురు గెరిల్లాలు | | తాటికొండ క్యాంపు పై దాడిలో మృతిజెందారు. |

## కరీంనగర్ - ఆదిలాబాద్

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 1. హరిశ్చంద్రరావు | పెద్దతాండ్ల | 1950 అక్టోబరు 29 న |
| 2. కాశిం | ,, | ,, |
| 3. కుంట లక్ష్మయ్య | గుండపల్లి కొండలు | 1950 నవంబరు 5 న |
| 4. కుంట సాయిరెడ్డి | ,, | ,, |
| 5. వకీల్ రాజిరెడ్డి | ,, | ,, |
| 6 రామయ్య | ,, | ,, |
| 7. దాసమయ్య | ,, | ,, |
| 8. సంపతి హనుమాలు | సందర్ల క్యాంపు | 1950 నవంబరు 4 న |
| 9 ఒక కామ్రేడ్ | సారంగపూర్ | ,, |
| 10–11. ఇద్దరు కామ్రేడ్స్ | పన్నార్పల్లి (జహీరాబాద్ తాలూకా) | 1950 అక్టోబరు 16 న |
| 12. గుండబోయిన చంద్రయ్య | మరికిపేట, సిర్సిల్ల | |
| 13 రామిరెడ్డి | ,, | |
| 14 రాజమల్లయ్య | సిద్దిపేట (మెదక్ జిల్లా) | 1951 మార్చి 20 న |
| 15 * కె. రంగాచారి | కామారెడ్డి | |
| 16 లచ్చయ్య | అక్కన్నపేట | సెంటర్ ఆర్గనైజర్. |
| 17. ఒక ఆంధ్ర కామ్రేడ్ | కరీంనగర్ అడవులలో | |
| 18. * భూపతిరెడ్డి | బసిరెడ్డిపల్లి | |
| 19 * గౌరెల్లి మల్లయ్య | | |
| 20 లచ్చానాయక్ | కానాపురం | జగిత్యాల్ తాలూకా |
| 21. జానూ | ,, | |
| 22. చక్కి | ,, | |
| 23-24 ఇద్దరు రైతులు | చింతకుంట | |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| **ఆర్మూరు తాలూకా** | | |
| 1. నీలం క్రిష్ణయ్య | మానాల గ్రామం | |
| 2. కిషన్ | ,, | |
| 3 చల యెల్లయ్య | ,, | |
| 4. ముదం మల్లయ్య | ,, | |
| 5. ఒక మిలిటెంట్ | ,, | |
| **రజాకార్ల దాడుల్లో** | | |
| 1. * * ప్రభాకరరావు | | |
| 2. * * దామోదర్‌రెడ్డి | | |
| 3. రామచంద్రం | కరీంనగర్ | విద్యార్థి, హుజూరాబాద్ తాలూకాలో కాల్చిచంపారు. |
| 4. దేవానందం | వరంగల్ | ,, |
| 5 నర్రా గోపాలరెడ్డి | జనగాం తాలూకా రేగులబౌతాపురం | హుజూరాబాద్ లింగంపల్లి వద్ద కాల్చి చంపివేశారు. |
| 6. మల్లారెడ్డి | పసరమెడ్ల | ,, |
| 7. బోడ అయిలయ్య | మద్రిగడ్డ | ,, |
| 8–9. ఇద్దరు కామ్రేడ్సు | హుజూరాబాద్ | |
| **తూర్పు గోదావరిజిల్లా** | | |
| 1. కందికట్ల నాగభూషణం | కడలి రాజోలు తాలూకా | జిల్లా వ్యవసాయ కార్మిక నాయకుడు. జిల్లా పార్టీ కార్యదర్శివర్గ సభ్యుడు యూనియన్ పోలీసులు ఠాణాంవద్ద కాల్చి చంపారు. |
| 2. చింతం సత్యనారాయణ దాస్ | కోరుమిల్లి (రామచంద్రపురం తాలూకా) | జిల్లా పార్టీ కార్యదర్శి వర్గ సభ్యుడు. రైతు నాయకుడు |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 3. పెనుమత్స అనంత రాజు | ర్యాలి (కొత్తపేట తాలూకా) | పార్టీ కార్యదర్శి వర్గసభ్యుడు. |
| 4 గుర్రం వెంకటరెడ్డి | | వ్యవసాయ కార్మిక నాయకుడు. రాజోలు తాలూకా. 1950 జూన్ 21న కాల్చి చంపారు. |
| 5. గుబ్బల నరసింహమూర్తి | మల్కిపురం | 1950 జూన్ 21న గుర్రం వెంకటరెడ్డితో పాటు కాల్చి చంపారు. |
| 6. గుబ్బల వెంకటరెడ్డి | " | యువజన నాయకుడు. శివకోడేరు లాకులవద్ద కాల్చి చంపారు. |
| 7. అల్లూరి బుచ్చిరామరాజు | అంతర్వేదిపాలెం [రాజోలు తాలూకా] | యువజన నాయకుడు. 1950 లో పాశర్లపూడివద్ద చెట్టుకుకట్టి కాల్చి చంపారు. |
| 8. సానబోయిన జగన్నాథం | విశ్వేశ్వరాయపురం | 1950 లో చిత్రహింసలుపెట్టి, అనంతరం కాల్చి చంపారు. |
| 9. రాపాక సూర్య నారాయణ | మోరి | వ్యవసాయ కార్మిక నాయకుడు. రాజమండ్రి జైలులో చిత్రహింసలుపెట్టి చంపారు. |
| 10. నండూరి సుబ్బారావు | భీమనపల్లి (అమలాపురంతాలూకా) | కాల్చిచంపారు. |
| 11. కందికట్లయేసురత్నం | బట్టెలంక (జోరాలుతాలూకా) | 75 సంవత్సరాల వృద్ధ వ్యవసాయ కార్మికుడు. 1949 లో కొట్టి చంపారు. |
| 12. దొంగా నరసింహమూర్తి | గుడిమెళ్ళంక | 1949 జూన్ 21 న కాల్చి చంపారు. |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 13. బొమ్మనబసవరాజు | పెద్దాపురం | చేనేత కార్మిక నాయకుడు. చిత్రహింసలుపెట్టి చంపారు. |
| 14. డాక్టర్ వీరయ్య | కాకినాడ | అజ్ఞాతవాసంలో వుండగా పాము కాటువల్ల మృతి జెందాడు |
| 15. పర్వతనేని వెంకటేశ్వరరావు | గుంటూరుజిల్లా | పోలీసులు వెంటాడుతుండగా పరుగెత్తుతూ చీకట్లో ఒక నూతిలోపడి మృతి జెందాడు. |
| 16 టి లక్ష్మణమూర్తి | రామచంద్రపురం తాలూకా | వికారాబాద్ ప్రాంతంలో కాల్చిచంపారు. |
| 17. అనపర్తి రామన్న | ఏడిద (రామచంద్రపురం తాలూకా) | గ్రామ మునసబును హత్య జేశాడనే కేసు బనాయించి 1951 లో వురితీశారు. |
| 18. ఒక సానుభూతి పరుడు | రామేశ్వరం (రాజోలుతాలూకా) | తీవ్రంగా దెబ్బలు కొట్టి చంపారు. |

పశ్చిమగోదావరిజిల్లా

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 1. పేరెప మృత్యుంజయుడు | ఆచంట (నర్సాపురం తాలూకా) | జిల్లా కార్యదర్శి వర్గసభ్యుడు; రాష్ట్రకమిటీ సభ్యుడు 1950 మే 16 న |
| 2. నర్రా ఆంజనేయులు | పెదపాడు (ఏలూరు తాలూకా) | జిల్లా కార్యదర్శివర్గ సభ్యుడు 1950 మే 24 న |
| 3 ఈడ్పుగంటి పూర్ణచంద్రరావు | పెదమద్దాలి గుడివాడ తాలూకా | జిల్లా కార్యదర్శివర్గ సభ్యుడు 1950 జూన్ 16 న |
| 4. పడాల సుబ్బారావు | ఉల్లంపర్రు (నర్సాపురం తాలూకా) | తాలూకా నాయకుడు 1950 మే 24 న |

| పేరు | గ్రామం | వివరాలు |
| --- | --- | --- |
| 5. రుద్రరాజు గోపాలరాజు | చించినాడ (నర్సాపురం తాలూకా) | వ్యవసాయ కార్మిక నాయకుడు, కేంద్ర ఆర్గనైజర్ బెయిలుమీద వుండగా 1950 జులై 9 న కాల్చిచంపారు. |
| 6. రుద్రరాజు అయ్యపరాజు | ,, | వ్యవసాయకార్మికపోరాటాలు నడిపాడు 1950 మే 22 న కాల్చి చంపారు. |
| 7. బూసి వెంకట్రావు | ,, | వ్యవసాయ కార్మిక నాయకుడు. 1950 ఏప్రిల్ 7న కాల్చి చంపారు |
| 8. బూసి ముసలయ్య | ,, | ,, |
| 9. అల్లూరి రామరాజు | ,, | ,, |
| 10. తాళ్ళ బసవమల్లయ్య | వేమవరం [నరసాపురం తాలూకా] | వ్యవసాయ కార్మిక నాయకుడు, చేనేత నాయకుడు అయ్యపురాజుతోపాటు కాల్చి చంపారు. |
| 11. వేగేశిన శివ రామరాజు | కాపవరం | అజ్ఞాతవాసంలో పాము కాటుకు ఎరయై మృతి జెందాడు. |
| 12. కలిదిండి సూర్య నారాయణరాజు | పాలమూరు [తణుకు తాలూకా] | తాలూకా నాయకుడు. 1950 మే 10 న. |
| 13. గండేటి నరసింహం | విప్పర్రు [తణుకు తాలూకా] | కొరియరు, ఎలాంటి సమాచారం వెల్లడించలేదు. 1950 జులై 18 న. కాల్చిచంపారు. |
| 14. దేవరకొండ సుబ్బారావు | వేంద్ర [భీమవరం తాలూకా] | కొవ్వూరు తాలూకా నాయకుడు, 1950 మార్చి 9 న. |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 15. | బొరుసు మంగన్న | దండగర్రు (తాడేపల్లిగూడెం తా॥) | గ్రామనాయకుడు బెయిలు మీద వుండగా పోలీసులు కాల్చి చంపారు. |
| 16. | పి. మాధవరావు | చింతలపూడితాలూకా | ఉపాధ్యాయులు పార్టీకి తోడ్పడుతున్నారన్న మిషతో 1950 ఏప్రిల్ 17 న కాల్చి చంపారు. |
| 17. | ఇ. సాంబయ్య | " | |
| 18. | పి. వెంకటరత్నం | " | |
| 19–22. | నలుగురు | బుచ్చంపేట | కోయ మిలిటెంట్లు |
| 23. | గారపాటి రాజారామమోహన్ | పెదపాడు | ఏలూరుతాలూ |

కృష్ణాజిల్లా - దివితాలూకా

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 1. | చల్లపల్లి నారాయణరావు | చల్లపల్లి | వ్యవసాయ కార్మిక నాయకుడు జిల్లా పార్టీ నాయకుడు. |
| 2 | చలసాని జగన్నాధరావు | భట్లపెనుమర్రు | జిల్లా కార్యదర్శివర్గ సభ్యుడు. |
| 3 | చలసాని శ్రీనివాసరావు | ,, | జిల్లా విద్యార్ధి నాయకుడు. |
| 4. | కీర్తి సుబ్బారావు | ,, | |
| 5. | చలసాని రత్తయ్య | ,, | |
| 6. | చలసాని కాంచనరావు | ,, | విద్యార్థి |
| 7 | దాసరి నాగేశ్వరరావు | ,, | |
| 8. | దాసరి నాగభూషణం | ,, | |
| 9 | రావి భీమారావు | పాగోలు | విద్యార్ది |
| 10 | దాసరి భిక్షమయ్య | చినముత్తేవి | |
| 11. | కూరపాటి బైరాగి | ,, | |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 12. | గరికపాటి శివరామయ్య | నాగాయతిప్ప | |
| 13. | గరికపాటి శ్రీరాములు | ,, | |
| 14. | గరికపాటి అంజయ్య | ,, | |
| 15. | తాతినేని చెన్నయ్య | మొవ్వ | |
| 16. | మండవ వెంకటేశ్వరరావు | ,, | |
| 17. | మొవ్వ వెంకటరంగం | ,, | |
| 18. | వాసిరెడ్డి విశ్వనాథం | వేములపల్లి | |
| 19. | కొడాలి శంభయ్య | ,, | |
| 20. | కొడాలి బాలయ్య | ,, | |
| 21. | రావి సుబ్బారావు | కాలిపర్రు | |
| 22. | మేకా సుబ్బారావు | మేకావారిపాలెం | |
| 23. | మేకా నాగేశ్వరరావు | " | |
| 24. | పరుచూరు రాజ గోపాలరావు | మోపిదేవి | |
| 25. | నడకుదిటి లక్ష్మీపతి | చిరువోల్లంక | |
| 26. | పీటా అంకినీడు | " | |
| 27. | కోగంటి వెంకటేశ్వరరావు | వెలువోలు | |
| 28. | తొట్టెంపూడి నారాయణరావు | చిట్టూర్పు | |
| 29. | యెలమంచిలి వెంకటేశ్వరరావు | వెలువోలు | తాలూకా ఆర్గనైజర్. |
| 30. | గోగినేని తాతయ్య | స్వతంత్రపురం | " |
| 31. | నాదెండ్ల వెంకట కృష్ణయ్య | నాదెండ్లవారిపాలెం | " |
| 32. | మేరుగు శ్రీరాములు | కొండవరం | |
| 33. | మండవ కోటేశ్వరరావు | అముదాల్లంక | |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 34. | శ్రీమతి వియ్యమ్మ | గాజుల్లంక | పోలీసు కాల్పులలో మృతి జెందారు |
| 35. | సనకా సుబ్బారావు | " | " |
| 26. | మత్తి సుబ్బారావు | " | " |
| 37. | తాడిశెట్టి వెంకటేశ్వర్లు | " | " |
| 38. | సనకా అంకినీడు | " | చల్లపల్లి జమీందారుగూండాలచే చంపబడ్డారు |

గన్నవరంతాలూకా

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 39. | చింతపల్లి పాపారావు | బుద్ధవరం | జిల్లా పార్టీ కార్యదర్శి వర్గ సభ్యుడు. |
| 40. | కాట్రగడ్డ చినవెంకట్రాయుడు | దావాజీగూడెం | సెంటర్ ఆర్గనైజర్. |
| 41. | పామర్తి సుబ్బారావు | అల్లాపురం | |
| 42. | జాస్తి రాఘవయ్య | గన్నవరం | సెంటర్ ఆర్గనైజర్. |
| 43 | ఆంధ్రయ్య | ముస్తాబాద | |
| 44. | ఇరుగు నోబుల్ | తేలప్రోలు | |
| 45. | జాస్తి బసవారావు | కేసరపల్లి | |
| 46. | కడియాల నారాయణరావు | కాటూరు | తాలూకా ఆర్గనైజర్. |
| 47. | ఈడ్పుగంటి సుబ్బారావు | " | " |
| 48. | నార్ల తాతారావు | " | |
| 49. | చీలి రత్నం | " | |
| 50. | నాగులపల్లి కోటేశ్వరరావు | ముదునూరు | ప్రజాశక్తి ప్రెస్ మేనేజరు. |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 51. | యెలమంచిలి రామకృష్ణయ్య | ముదునూరు | |
| 52. | గుంటుక చినఅప్పిరెడ్డి | పెదవోగిరాల | |
| 53. | ద్రోణవల్లి సత్యప్రసాద్ | మామిళ్ళపల్లి | తాలూకా ఆర్గనైజర్. |
| 54. | చిగురుపాటి కుటుంబరావు | అగినపర్రు | |
| 55. | యెలమంచిలి బసవయ్య | క్రిష్ణాపురం | |
| 56. | గుళ్లపల్లి బసవయ్య | ,, | |
| 57. | యెలమంచిలి క్రిష్ణయ్య | మేడూరు | |
| 58. | పర్వతనేని తిరుమలరావు | మర్రివాడ | |

గుడివాడ తాలూకా

| | | | |
|---|---|---|---|
| 59 | యలమంచిలి వెంకట కృష్ణారావు | కనుమూరు | సెంటర్ ఆర్గనైజరు |
| 60. | అట్లూరి వెంకట చలపతిరావు | వానపాముల | |
| 61. | అట్లూరి సుబ్బారావు | చౌటపల్లి | |
| 62. | మలిరెడ్డి సత్యనారాయణ | లింగవరం | |
| 63. | ఏ. నారాయణరావు | కోడేరు | |
| 64. | చలసాని వెంకటరత్నం | నూజెళ్ళ | |
| 65 | వి. వి. కృష్ణారావు | తమిరిశ | |
| 66. | పొట్లూరి వెంకట నరసింహారావు | పెదమద్దాలి | |
| 67. | మన్నే నరసయ్య | వెన్ననపూడి | |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 68. | ఈడ్పుగంటి పూర్ణ చంద్రరావు | పెదమద్దాలి | సెంటర్ ఆర్గనైజరు |
| 69. | పోతుల ఆది నారాయణ | నందివాడ | |

బందరు పట్టణం, తాలూకా

| | | | |
|---|---|---|---|
| 70. | భూపతి రామారావు | | ట్రేడ్ యూనియన్ నాయకుడు |
| 71. | బొందలపాటి పురుషోత్తం | | |

నూజివీడు తాలూకా

| | | | |
|---|---|---|---|
| 72. | చలసాని రాజ గోపాలరావు | అన్నవరం | తాలూకా ఆర్గనైజరు |
| 73. | ఆలపాటి పుల్లయ్య | రంగన్నగూడెం | |
| 74. | అక్కినేని రంగారావు | పోతురెడ్డిపల్లి | |
| 75. | తగరం పుల్లయ్య | " | |
| 76. | పొట్లూరి మాధవరావు | కొత్తపల్లి | |
| 77. | ఈదర నారాయణ | చింతలపల్లి | |

విజయవాడ తాలూకా, పట్టణం

| | | | |
|---|---|---|---|
| 78. | పర్వతనేని సత్యనారాయణ | నెప్పల్లి | |
| 79. | బెల్లపు శోభనాద్రి | విజయవాడపట్టణం | పట్టణ ఆర్గనైజర్ |
| 80 | దుర్గాసి కనకారావు | ,, | |
| 81. | ఇలుపిళ్ళ అప్పారావు | ,, | |
| 82. | బి. వీరయ్య | ,, | రైల్వే కార్మికుడు |
| 83. | మల్నీడు వెంకయ్య | కొటికలపూడి | |
| 84. | సందిపాము నాగయ్య | వెల్వడం | |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 85. గురజాల కోటేశ్వరరావు | వెల్వడం | |
| 86. గొల్లపూడి పురుషోత్తం | ,, | |
| 87. నోబుల్ | కోడూరు | ఉపాధ్యాయుడు |
| 88 అనుమర్లపూడి సీతారామారావు | ,, | జిల్లా పార్టీ నాయకుడు. కడలూరు జైలులో కాల్చి చంపారు |
| 89. మన్నే క్రిష్ణయ్య | ,, | |
| 90. మన్నే రత్తయ్య | ,, | |
| 91. మన్నే పిచ్చయ్య | ,, | |
| 92 సీదా పగిడయ్య | ,, | |
| 93. జి. బొర్రారెడ్డి | పాతపాడు | |
| 94. యం. లక్ష్మయ్య | కొటికలపూడి | |
| 95. జి. వెంకట సుబ్బయ్య | గణపవరం | |
| 96. వై. వెంకటేశ్వరరావు | దావులూరు | |
| 97. యలమంచిలి వెంకటేశ్వరరావు | ఉప్పులూరు | |
| 98. కోనేరు మల్లికార్జునరావు | పటమట | |

నందిగామ తాలూకా

| | | |
|---|---|---|
| 99. తిరుపతయ్య | ఇందుగమల్లి | |
| 100. కిలారు వెంకయ్య | కమ్మవారిపాలెం | |

తిరువూరు తాలూకా

| | | |
|---|---|---|
| 101. ఏరువ వెంకట రామిరెడ్డి | కూనపరాజుపర్వ | నెలరోజులపాటు చిత్రహింసలకు గురిజేసి, వినగడపగట్టు వద్ద కాల్చి చంపారు. |
| 102. శ్రీ వెంకటరామిరెడ్డి భార్య | ,, | పోలీసు భీభత్సకాండను భరించలేక ఆత్మహత్య చేసుకుంది. |

| గ్రామం | పేరు | వివరాలు |
|---|---|---|
| 103. తుమ్మలపల్లి గోపయ్య | కూనపరాజువర్వ | ధవళేశ్వరంవద్ద 1950 జూన్ 14 న. |
| 104. పొన్నగంటి నాగేశ్వరరావు | ,, | కొండపల్లివద్ద 1950 జూన్ 13 న. |
| 105. కొంగల వీరయ్య | ఎరుకపాడు | వినగడపగట్లువద్ద. |
| 106. కోట గోపయ్య | ,, | ఖమ్మంజిల్లా తాళ్ళపెంటవద్ద |
| 107. కొంగల అబ్రహాం | ,, | ఖమ్మంజిల్లా కల్లూరుగట్లువద్ద. |
| 108. సంగసాని పిచ్చయ్య | | మధిర తాలూకా శంబుడి గూడెంవద్ద కాల్చి చంపారు. |

గుంటూరుజిల్లా

సత్తెనపల్లి తాలూకా

| | |
|---|---|
| 1. షేక్ ఘౌస్‌సాహెబ్ | తాళ్ళూరు |
| 2. షేక్ పాపాసాహెబ్ | ,, |
| 3 పసువులేటి రోశయ్య | ,, |
| 4. కోసన తిరుపతయ్య | ,, |
| 5. చెన్నంశెట్టి పెద్దబ్బాయి | ,, |
| 6. సబ్బినేని పున్నయ్య | నాగవరం |
| 7. షేక్ నన్నే | ,, |
| 8 ఇబ్రహీం | ,, |
| 9. గుడిపూడి కోటేశ్వరరావు | రెంటపాళ్ళ |
| 10. బారా రామకోటి | ,, |
| 11. మాదల వీరభద్రాచారి | మాదల |
| 12. చావా భద్రయ్య | అందుకూరు |
| 13. ఏలూరి మంగళగిరి | అచ్చంపేట |
| 14. కంచి రామకోటి | కోళ్లూరు |
| 15. ఘంటా నాగులు | ,, |

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 16. | వోర్ల రోశయ్య | పులిచింత | |
| 17. | చింతిరాల సైదులు | ,, | |

## నరసరావుపేట తాలూకా

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 18. | దండా నారాయణస్వామి | గోరంట్లవారి పాలెం | రైతు నాయకుడు |
| 19. | పిల్లి అంకమ్మ | చిలకలూరిపేట | ఐ. యల్. టి. డి. కార్మిక నాయకుడు. |
| 20 | గడ్డం మోషే | వేలూరు | |
| 21. | కొండ్రగుంట రాములు | " | ఉపాధ్యాయుడు. తెలంగాణా పోరాట ప్రాంతానికి 1949 లోనే పంపబడ్డాడు. 22 వ ఏటనే 1950 మే 10 న నకెరికల్లు అడవి సమీపంలో పట్టుకొని, క్యాంపుల్లో చిత్రహింసలుపెట్టి చంపారు. |
| 22. | కాకాని రామచంద్రయ్య | వేలూరు | |
| 23. | అళ్ళ వెంకయ్య | " | |
| 24. | కట్టా దామోదరం | " | |
| 25. | దండా అంకమ్మ | " | |
| 26. | ముకిరి మోషె | పురుషోత్తంపట్నం | |
| 27. | దావల గంగయ్య | యద్దనపూడి | విద్యార్థి 20 సంవత్సలు. |
| 28. | బోనం పోతరాజు | | |
| 29. | మామిడాల సుబ్బారావు | జొన్నలగడ్డ | రజక కామ్రేడ్ 20 సం॥ |

## వినుకొండ తాలూకా

| | పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|---|
| 30. | ఏనుగుపాలెం కోటయ్య | ఏనుగుపాలెం | పాలేర్ల సంఘం నాయకుడు |

| పేరు | గ్రామం | వివరాలు |
|---|---|---|
| 31. యస్. ఖాజామియా | వినుకొండ | |
| **గుంటూరు తాలూకా** | | |
| 32. నెలకుదిటి సత్య నారాయణ | దొండపాడు | |
| 33. తల్లం శ్రీమన్నా రాయణ | | |
| **పల్నాడు తాలూకా** | | |
| 34. షేక్ అబ్దుల్ రసూల్ | దాచేపల్లి | |
| 35. గోళ్ళమూడి నారాయణ | జూలకల్లు | |
| 36. గుర్రం నాగయ్య | రామాపురం | |
| 37. గుర్రం కోటయ్య | ,, | |
| 38. ఉప్పు రాజిరెడ్డి | ,, | |
| 39. భీమనాదుల వీరారెడ్డి | ,, | |
| 40. ఆకూరి కిచ్చారెడ్డి | ,, | |
| 41. తంగెడ జానికమ్మ | ,, | |
| 42. దాసరి కోటయ్య | కరాలపాడు | |
| 43. గడ్డం హుస్సేను | ,, | |
| 44. మాదాసు నాసరయ్య | ,, | |
| **రేపల్లె తాలూకా** | | |
| 45. కంరంనేని వెంకట రత్నం | పల్లెకోన | |
| 46. దాసరి సుబ్బయ్య | ఇసుకపల్లి | |
| 47. గుమ్మడి సీతారామయ్య | గుడ్డికాయలంక | |
| 48. కస్తూరి కుటుంబరావు | కనగాల | |

| పేరు | గ్రామం | వివరం |
|---|---|---|
| 49. ముత్తురెడ్డి వెంకటుచలం | ఓలేరు | |
| 50 మోటూరు వెంకటరత్నం | వెల్లటూరు | |
| 51 మోటూరు వెంకటరత్నం కుమార్తె (3 ఏండ్ల బాలిక) | ,, | |

తెనాలి తాలూకా

| | | |
|---|---|---|
| 52. పండితారాధ్యుల మల్లికార్జునశర్మ | ఈమని | జిల్లా వ్యవసాయ కార్మిక నాయకుడు. |
| 53 చుక్కపల్లి నరసయ్య | కంచర్లపాలెం | |
| 54. నిమ్మగడ్డ రత్తయ్య | దుగ్గిరాల | |
| 55 నిమ్మగడ్డ భాస్కరరావు | ,, | |

బాపట్ల తాలూకా

| | | |
|---|---|---|
| 56. ముక్తి నూతల లక్ష్మీనారాయణ | ఫల్లుఖానుడుపాలెం | ఉపాధ్యాయుడు. 1950 మే 13 న. |
| 57. జెట్టి సుబ్బారావు | మాచవరం | 1949 జూన్ 4న జూపూడిలో |
| 58. చివుకుల శేషశాస్త్రి | బాపట్ల | 1950 మే 12 న. |
| 59. బండారు వెంకటప్పయ్య | పాలపర్రు | 1950 ఏప్రిల్ 13 న. |
| 60. కరణం శ్రీరాములు | " | 1950 ఏప్రిల్ 19 న |
| 61. నాగభైరవ వీరయ్య | " | " |
| 62. పెద్దిపాగ ప్రకాశం | " | " |
| 63. బత్తుల ధనుంజయ | " | " |
| 64. బొందలపాటి అమ్మయ్య | " | 1950 మే 2 న తెనాలివద్ద. |

| పేరు | గ్రామం | వివరం |
|---|---|---|
| 65. పోపూరి రంగారావు | పాలపర్రు | 1950 మే 12 న కాల్చి చంపారు. |
| 66. సరికొండ అప్పయ్య | " | " |
| 67. బండారు వెంకటేశ్వర్లు | పందిళ్ళపల్లి | |
| 68. సజ్జా సూర్యబాలానందం | వేటపాలెం | |
| ఒంగోలుజిల్లా | | |
| 69. మాదల నరసయ్య<br>70. మాదల కోటయ్య | మైనంపాడు | ఇద్దరినీ కలిపి కాల్చిచంపారు. |
| 71. తిమ్మరాజు లక్ష్మీనారాయణ | కొణికి | కాల్చిచంపారు. |
| 72. వెంకటేశ్వరరావు | కనిగిరి తాలూకా | |
| కడపజిల్లా | | |
| 73. వెంకట కొండారెడ్డి | పెదపసుపల | పోలీసు కాల్పులకు గురై మృతిజెందాడు. |
| 74. పెదవెంకన్న | యు. రాజుపాలెం (పులివెందుల తాలూకా) | 1949 అక్టోబరులో కాల్పులు జరిపి చంపారు. |
| 75. చినవెంకన్న | " | |
| 76 మరెన్న | " | |
| 77 – 79. ముగ్గురు మిలిటెంట్లు | ఇంద్రేశ్వరం | కర్నూలుజిల్లా. |

# అనుబంధం - 4

# వీర తెలంగాణా

## విప్లవ గాథలు

ఇంగ్లీషు మూలం . ఆంధ్రీకరణ :

*హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ,* *ఆరుద్ర,*

[ తెలంగాణా సాయుధ పోరాటం సాగుతున్నకాలంలో ప్రఖ్యాత కవి శ్రీ హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ తెలంగాణా విప్లవ గాథలను గురించి రాసిన గేయాలను ఇస్తున్నాం. ]

విలేఖించనిందు నన్ను
తెలంగాణ వీరగాథ
వ్యథలతోడ నిండిననూ
వ్యాకుల త్యాగాలతోడ
వెల్లువికే ఆశాలత
పల్లవించు పరమగాథ

అమాయకుల హత్యలతో
సతుల మాన భంగాలతొ
బరువు తాళలేని జనత
తిరిగి చిందునెత్తురుతో
తడిసిన యీ అమరగాథ
తడయక ప్రకటించు నొకటి

ఇది అంతిమ పోరాటం
ఇది సంకుల సంగ్రామం
వలసరాజ్య విధానాలు
ప్రజ ఇంక సహించబోదు
ఫాసిస్టుల అత్యాశలు
ఈషణ్మాత్రము సాగవు
మరఫిరంగి నోళ్ళతో
మదించుగడ్డ సామ్రాజ్యం
కూలికితెచ్చిన బాంబులు
కురిపించే హానివాన
ఇంకానా ? అసంభవం
ఇది అంతిమ పోరాటం
విన్నారో ? వినలేదో ?
వీరతెలంగాణా వీణ !

ప్రపంచమ్ము ఇదివిన్నది
పరమాశ్చర్యం ! అన్నది
పరిష్కృతమ్ము చెందినట్టి
చరిత్రకిది మారుపేరు
విలువలు సరిదిద్దితీర్చి
పేర్చిన ఇతిహాసమిదే
మ్రోగెను ఇది మార్మోగెను
రాగల కాలమ్ములోని
చీకటి వాకిళ్ళనిండి
ఆ కడపల నధిగమించి
చారిత్రక తర్కమింక
సాగును తన పెను సిద్ధికి

అచ్చంపేటా నీవొక
అసామాన్య కుగ్రామము
తెలంగాణా పల్లెలన్ని
మిళితమాయె నీలోనే
నీ గ్రామపు సంగ్రామము
నిజముగ ఏకాకికాదు
కొరియాలో మలయాలో

కోరకరాని వియత్నాముసన
బర్మా ఇండోనేషియ
పల్లెలు నీ చెల్లెళ్ళు !

ఈ సంగతి నీకు తెలుసు
నీ సమరము జగతి ఎరుక !

ఉరు వీరుని దేహములో
హృదయము స్పందించునట్లు
అమరజీవి ధమనులలో
విమల రక్త ముడుకునట్లు
సమరశీలి నాసికలో
శ్వాసలు ప్రసరించునట్లు
హా ! సాధారణ గ్రామమూర్తి
ఇతిహాసపు పుటలలోన
స్పందించుము జ్వలియించుము
ప్రసరించుము వర్ధిల్లుము !

మహిత తెలంగాణమందు
విహితమైన రణ శిబిరమ !

భావి మహా శిబిరాలకు
నీవేలే జనయిత్రివి !

అజేయమగు శిబిరమ్ములు
నిజంగానే మన భూమిని
స్వాతంత్ర్యంబని వాకొను
బాధనుండి విడిపించును
పరసంపద కొల్లగొట్టు
నరరూప పిశాచమ్ములు
జీవితాన్ని దోచువాళ్ళు
చివుకుతున్న శవాలపై
చెచ్చెర బలిసేటి వాళ్ళు
శ్వేతముఖుల ఘాతకముల
చెడుకామన్ వెల్తునుండి
విషవలయం బారినుండి
విముక్తి మనకు కలిగించును

ఓ పౌరక మహాశయా!
ఈ పేరును వ్రాసుకొమ్మొ
అచ్చంపేట;
అచ్చంపేట!
ఈ నల్లని రేగడిలో
ఈ విషాద క్షేత్రమ్ముల
దేశముఖుల కాడిక్రింద
దేహమ్ములు బరువెక్కగ
పురమాయించే కూలీ
కొరడాతో వెన్నుచిట్లు
తెల్లబోయి నల్లబారి
ఒళ్ళంతా హూనమవగ
ఈ రైతుల శ్రమ ఫలితం
పేరాశపు ఫలసాయం
కారులోన వానకన్న
ఈ రైతుల చెమట మిన్న
వీరిలోని మూలుగులు
పైరుయొక్క సోదరులు
మారాడక ఈ కండలు
మరల మరల పాటుపడును
మండుటెండ కొలిమిలోన
మల మల మాడిన వీరల
కాళ్ళూ చేతులు వేసవి
బీళ్ళలోన బీటలాయె!

ఈ రైతులు గత మందున
క్రూర విధిని విశ్వసించి
తరతరాల మత్తు మతం
తమకేదో మైక మొసగ
కొడవలి కోసేటప్పుడు
నడుము వంచు పైరులాగ
తలవంచిరి తత్త్వానికి
ఒలిపశువులుగా మారిరి
బానిసవృత్తికి మనస్సు

హీనంగా కట్టువడెను
బ్రతుకంతా పెనువిరక్తి
బ్రతికేందుకులేదు శక్తి
నిట్టూర్పులకైనచూడు
నిస్సత్తువ అడ్డమొచ్చు
ధైర్యంపోయిన కళ్ళకు
సూర్యుడు ఎర్రని గాయం
శశి కూడా యీ దృష్టికి
రసికారే పెద్దపుండు
అర్ధమరేతిరిమింటను
అలరారే ఆ చుక్కలు
పగలంతా తమ వీపుల
దిగజారే చెమటబొట్లు
తరలిన ప్రతిఒక్క ప్రొద్దు
మరణానికి మైలురాయి
క్రుంగుతున్న ప్రతిప్రొద్దూ
క్రూరవిధికి సరిహద్దు
కామందులు ఎరువిచ్చిన
కత్తీ గునపం కొడవలి
చేతపట్టి అలసినట్టి
జీవికి మలిసంజె ముక్తి
కామందుల కంటిచూపు
కత్తికన్న మహాపదును
ఇరవైనాలుగు గంటలు
కొరడా దెబ్బలకోసం
వంగిన యీ వీపులపై
వడిగ పడును మెరుపుదెబ్బ
ఈ మనుగడ రాతిదిబ్బ
ఇదంతా గతం! గతం!

చావులాంటి జడతనుండి
కావిరి కన్నులు తెరుచుక
మేలుకొనెను యీ జనత
మేలుకనెను మానవత

తామూ మనుష్యులమంటూ
తమకూ యీ దేశంలో
తప్పనిసరి చోటుందను
జ్ఞానముతో జల్దుకొనిరి
తామే యీ మాగాణికి
ఏమైనను జీవగర్ర
శ్రమియించే జనత-కనుక
తమకే వున్నది హక్కు !
ఈనేలా చిరుగాలీ
ఆనందం తమ రచనలు !
ఏ పాటూపడని వాళ్ళు
ఇన్నాళ్ళూ జలగలవలె
ఎలా తమ్ము పీల్చినదీ
ఈనాటికి బోధపడెను
ఈనాటికి తెలిసివచ్చె
ఎలాగతం కొల్లగొట్టి
తమ నెత్తురు పిండినదో
తమ మూల్గులు పీల్చినదో
వేదాంతపు బూటకాలు
వెనుకటి తెరనాటకాలు
మనసు నెలా మభ్యపెట్టి
మాయజేసెనో తెలిసెను
గతానికిక భవిష్యత్తు
అతుకదనుచు తెలిసికొనిరి
తమకు తెలుసునను వైనము
ధరణికింక చాటగలరు
మోసగించు భూస్వామికి
ఈ సంగతి తెలుపగలరు
దోచుకునే పెనుజలగకు
ఈ చందం తెలుపగలరు
జ్ఞానోదయ మవగానే
సర్వత్రా మార్పుతోచె
బంధమ్ములు తొలిగినట్లు
పంటపొలం తలపోసెను

అరుదెంచే కలపంటల
ధరియించిన ధరగర్భం
మిసమిస చూలాలు వోలె
గుసగుస లాడింది యిటుల: .
నా కానుపు నొప్పులివే
మీ కాఠిన్యం విరుగుడు.

ఈ రైతాంగానికి ఇప్పుడు
ధీరత్వం కొరవడెనా ?
దేహమొణుకుఎలుకలాంటి
దేశముఖును అడిగిచూడు
సర్కారీ బంధూకుల
చాటున యిటు నక్కి నక్కి
దురంతాలు కావించే
దుష్టులు పాలింతు రివుడు
స్వార్థానికి స్వేచ్ఛ నిచ్చు
స్వాతంత్ర్యం తమ జెండా
మరో రెండు బావుటాలు
మాటు వడెను దాని వెనుక
పాడు వలస పద్ధతులకు
వీడుకోలు యివ్వలేక
తచ్చాడే ఆంగ్లేయుల
"ధర్మ పతాకం" మొదటిది !
తోడుదొంగ గ్రుడ్డికొంగ
కోడె సామ్రాజ్యవాది
నరరక్తం రుచి మరిగిన
నాలుక చాపే బెబ్బులి
ఆసియా యూరోపూ
ఆఫ్రికాల నెత్తురుకై
దప్పిగొన్న మెకమెవ్వరు ?
తప్పక ఆ అమెరికా
వారల "తారల చారల"
పతాకమ్ము రెండవది
మన ప్రభుతకు యీ సంగతి

మనసు కెక్కనే లేదా
తెలియ దనుచు నటియించే
తెలివిలేని వాజమ్మా !!
కాదు కాదు తెలుసు తెలుసు
కనుకనే నిర్లిప్తత
ప్రజల పేర పాలిస్తూ
ప్రజల పైన స్వారి చేయు
ప్రభుత జనుల అభిమతాన్ని
పవనాలకు ఎగురగొట్టు
వీస్తున్నవి సామ్రాజ్యవాద
విషవాయువు లీగడ్డను
పక్షవాత రోగి వంటి
ప్రభుత్వమ్మె ముక్కు నిండ
చెడుగాలిని పీల్చగానె
చెంప లేమొ కెంపులౌను
ఈ కెంపును కీర్తింతురు
ఈ వాపును బలు పందురు
ఫాసిస్టుల మైత్రి నెరపు
పరమ కిరాతులు వీళ్ళు
మోసంలో ప్రభవించిన
అషాఢభూతి లుచ్ఛాలు
మరఫిరంగి మగసిరిపై
వారిగెడు పెనుకొజ్జాలు
బడాబడా బద్మాషుల
బడాయి తెగ పెరుగుటకై
గ్రుడ్డిగ కడు కష్టించే
కూలివాళ్ళ హస్తాలను
కోయుటకై నిర్మింతురు
ఆయుధాల నీ దుష్టులు
ఇప్పటికే రైతన్నలు
ఇచ్చుట చేలకు ఒరిగిరి
ఎన్నెన్నో తుపాకులు
ఈ మెదళ్ళ నెగుర కొట్టె
అవి అన్నీ ఆంగ్లేయుల

ఆయుధాలు అనుకొందును !
శత్రువుల తుపాకు లిపుడు
మిత్రుల శస్త్రమ్ము లాయె
దీనిని ప్రజ తెలుసుకొనెను
కాన నేడు తిరగబడెను

ధీరత్వం కొరవడెనా ?
దేశముఖును అడిగిచూడు !
బొర్ర పెంచి విర్రవీగు
భూస్వామిని అడిగిచూడు
తేరగ తిని బలిసినట్టి
పోరగాండ్ల నడిగిచూడు
ఖూనీలకు వెనుకాడని
గూండాలను గుచ్చి అడుగు
కల్లలాడకున్న యెడల
తెల్లము చేస్తారువాళ్ళు
చెప్పలేరు అబద్దాలు
గుప్పిటనున్నవి గుండెలు
ప్రజలు లేచి వాళ్ళ వాళ్ళ
నిజరూపం బయటుపెట్టి
తొడుక్కున్న బురఖాలను
తొలగించిరి హఠాత్తుగ
పాతకులు విద్రోహులు
పందికొక్కు లీ పందలు
ముక్కోణము మూతులతో
మొన వణికే మీసాలతో
అంతిమ పతనమ్మె తమకు
ఆసన్నం అయిన దనుచు
దారుణ భయసంభ్రమాల
తేరిచూచు కన్నులతో
నిలువెల్లా కంపరాన
ఎలుకలు విలపిస్తున్నవి
"విప్లవాల గోళ్ళు వాడి"
వాళ్లకు అ సంగ తెరుక

చెప్పకుండ చెయ్యకుండ
గొప్ప విప్లవమ్మొచ్చి
గడువు ఇవ్వదని ఎరింగె
గాదికింద పందికొక్కు

ముచ్చిరేకు కిరీటాల
పిచ్చి పిచ్చి సర్కారూ!
మూర్ఖంగా హింసించే
కర్కోటక ప్రభుత్వమా!
పీడనతో ఉబ్బువాళ్ళు!
పెనుపోజుల వుపకారులు!
సాయుధ బల సంపదతో
చరియించే మొనగాళ్లూ!
చాల పగటి వేషగాళ్లు
కాలపు నెత్తుటి బుడగలు
త్వరలోనే మీరంతా
పగులుట తథ్యమ్మనుండి!
తెలంగాణా ప్రజాబలము
నిలువున మిము పగులగొట్టు
అసలు సిసలు యీ వీరుల
కండదండ లెన్నొ కలవు
బెంగాలూ మలబారూ
బీహారూ గుజరాతూ
తమిళనాడు మహారాష్ట్ర
పంజాబూ కాశ్మీరూ
తీరాంధ్రం భూములలో
సోదరులంతా లేచిరి
అన్యాయా లక్రమాలు
అంతము కావించదలచి
జాతికి నిజమైన మంచి
నీతి ప్రసాదించదలచి
ఐక్యతనూ అర్థాన్నీ
అవనికి చేకూర్పదలచి
దీక్షబూని వీరంతా
తిరుగుబాటు కావించిరి!

ప్రజ నేడొక పెను వెల్లువ
ప్రబలమైన తరగలతో
దిక్కులు ఎరుపెక్కునపుడు
లెక్కకు అందని వీరుల
ఈ వెల్లువ ఈనుతూంది
ఇనుమిక్కిలి ఒసగుతూంది.
ఉక్కు కత్తి వీళ్ళముందు
తుక్కు! తుక్కు! దిగదుడుపు!
సంఘటితమ్మయిన ప్రజల
శక్తికి ఎదురేమున్నది
అంతమంది ఒకే ఒక్క
ఆయుధమ్ము ధరియించిరి
కులాతీతమైనట్టిది
పలుమతాల కవతలిది
అందరికీచెందినట్టి
ఆకలి! పెనుఆయుధమ్ము
అందరినీ కలిపియుదే
ముందుకు నడిపిస్తున్నది
అంతిమవిజయం తథ్యం!
అది దక్కును అనవరతం
(ఉక్కు నియంతకు విజయం
దక్కదులే చిరకాలం)
అనిచాటే ఆయుధాన్ని
అందరు ధరియించినారు.
చూడుడు: ఈ శిరసులపై
సుందరతర కిరీటాలు
తామే సృష్టించుకున్న
కోమలమగు స్వర్ణశోభ
మరణముకన్నను తథ్యము
మనుగడకన్నను చిత్రము

లంజకొడుకు భూస్వామి
లయించాలి ! నశించాలి
భూస్వామి కాళ్ళవద్ద
మురికినాకు పెనుతొత్తులు
రక్తసిక్తమైనఘోర
రాక్షస కామక్రీడల
విందులలో పాల్గొను యీ
పందులన్ని నశించాలి
ఏమిచేసె ? భూస్వామి,
ఏమిచేయలేదు వాడు !
యీ పల్లెల వీధులలో
నాపరాళ్ళ నడిగిచూడు
కంపరమెత్తించు కథల
కన్నీటితో వచిస్తాయి !
బడుగు పేదగుడిసెగోడ
నుడివే గాథలు వింటే
మరుగుతుంది మండుతుంది
మరల మరల మీ రక్తము
దారిపక్క ప్రతిచెట్టూ
దారుణాలు లెక్కించును
పాలవయను కన్నెపిల్ల
శీలమెట్లుపోయిందో
చెప్పగలవు వ్యథల కథలు
విప్పగలవు ఈ తరువులు
ఊరబావి నడిగిచూడు
ఘోరాలను వినిపించును
బావినీళ్ళతో నిండిన
బానలైన వచియించును
ఆడా మగా తేడాలను
అట్టే పాటించకుండ
కానరాని నఖములతో
మానవులను భూస్వామి
ఎట్లా తన్నుకుపోవునో
ఎట్లా ఎగురుచుపోవునో
ఎగురునపుడు పొలాలపై
నిగుడును రాబందు నీడ

ఏం చేసెను భూస్వామి ?
ఇంచుక చెవులను తెరచి
ధైర్యమున్న కడవరకూ
దయతో ఆకర్ణించుడు
తప్పుడు పత్రాలపైన
అప్పుల పత్రాలపైన
రైతాంగం నిశానీలు
రచ్చకీడ్చి వేయించెను.
అటు పిమ్మట వాళ్ల బ్రతుకు
అన్ని దిశల బంధించెను
తీర్చలేని అప్పులతో
ఓర్చలేని వడ్డీలతో
నలిగిపోవు రైతు జనుల
పలు విధముల హింసించెను.
తనఖాలకు తాకట్లకు
కోర్టుకెక్కి రైతులపై
కోరిన డిక్రీలు పొంది
నాగలి ఎద్దులు, బండీ
సాగుచేయు పనిముట్లూ
కుండలు గిన్నెలు గోనెలు
కొంపలోని ప్రతిసరుకూ
అతడూ అతనిల్లాలు
అతనిదైన ప్రతి అణువూ
తన స్వంతం చేసుకొనెను
ధనస్వామి భూస్వామి :
వెట్టికి పిలిపించవచ్చు
వేలం వేయించవచ్చు
తలచుకొన్నచో రైతుల
తదితరుల కివ్వవచ్చు.
రైతునుండి భూస్వామి
రాసులనే కొల్లగొట్టె

అతని భార్య శీలమ్మును
అవలీలగ అపహరించె
అతనిబిడ్డ ఎప్పుడైనా
అపురూపపు నోటిముద్ద
నోచుకున్న అడ్డుపడును
నీచుడు యీ భూస్వామి!

ఇందులోన ఇతగాడికి
ఎవరెవ్వరి సాయముంది
సర్కారీ పోషణగల
సాయుధ పోలీసుబలం
శాంతిభద్రత లందున
సొంతంగా మరబొమ్మలు
హింసానందులు! మూర్ఖులు!
ఈ మహా యంత్రమ్మున
చక్రము లోపల చక్రము
వక్ర దంష్ట్రిలో దంష్ట్రిము
పట్టెడు మెతుకుల కోసం
బ్రతుకు లమ్ముకునే వాళ్ళు.
ఆ మెతుకులలో తడిసిన
అమాయకుల రక్తముంది
వీరరైతు హృదయాలను
పేగుల కైమా వొనర్చి
కూలీ పోలీసు కిచటు
కూడుగ వడ్డించుతారు
ఈ రైతుల కుదురు నుండె
ఈ రాక్షసులూ వచ్చిరి
వంచనతో భర్తీ అయి
లంచాలను ఆశిస్తూ!
సాటి జనుల హింసిస్తూ
చంపుటకైనా తగ్గని
సాయుధ పోలీసు బలం
సాక్షాత్తు విద్రోహులు!
వీరిలోన ఒకరిద్దరు

క్రూరాత్ములు కాజాలరు
నిరుపేదల బలిచేసే
నీతిని ఎదురించుతారు
గురిపెట్టి సహోదరుణ్ణి
కూల్చము పొండంటారు
వీరు చంపగా ఒల్లని
వీరులతోపాటు నిలపి
వారల ఇంకొకరిచేత
విధిగా చంపించు ప్రభుత!

ఆహాహా! ఈ మానవాళి
మహద్వీర సాహసికులు
చుక్కల కన్నుల లోపల
సుకృతాల కృతజ్ఞతలు
సూర్యుని పెక్కు స్థలాన
శోభించే ఎర్రదనము
నింపెడు యీ మానవాళి
నిరత మొసగు భరోసాలు
నిండు బ్రతుకు కొనసాగును
నీతికూడ కొనసాగును
అందమ్ములు కొనసాగును
అంతిమ విజయము దక్కును
కల్లలాడు దుర్మార్గులు
కఠినాత్ముల పలుతొత్తులు
అడ్డెకు వచ్చే నీచులు
అసలు సగం మృగతుల్యులు
వీరందరి ఓటమితో
విజయము లభియించగలదు
కడలి తీర మందు మసలు
కవోష్ణ రక్త ఫేనమ్ములు
ఆ నెత్తుటి నురగలతో
ఆసనములు ఎరు పెక్కగ
మహాజన సముద్రమ్ము
మరింతగా తరంగ లించు

ఆ కడలిలోని దొడ్డ లహరి
అవుతుందీ రైతాంగం
నవ్యారుణ బాలార్కుల
దివ్యశోభ కైపులతో
భవ్యోదిత బాలచంద్ర
భాసనముల సందడితో
పరిపరి సంగీత గతుల
కరతాళమ్ములు చేయుచు
మోదమ్మును ప్రకటింతురు
మాదే యీ జగత్తనుచు
మాదే యీ జగతి సుమా
మనమే యీ ప్రపంచమ్ము!

అజీర్ణాల ప్రచారమ్ము
అంతటనూ కల దిప్పుడు
అది చీకటి 'మైఫిల్' వలె
ఆకర్షించును మనుజుల!
ఆ చీకటి నిరంకుశుల
అంతిమ పతనమ్ము బోలు
ఆనర్తనశాల వైపు
అరుదెంచే వాళ్లెవ్వరు?
గోడమీది పిల్లిలాంటి
గొప్ప గొప్ప మేధావులు
ఇటూ అటూ చెందినట్టి
ఋషిపక్షులు గబ్బిలాలు
పదకకుర్చి పోలిటిక్సు
పకడ్బందిగా ఆడే
చతురులు ప్రజ్ఞావంతులు
చదరంగం కిలాడీలు
అవకాశవాద విపణిలోన
ఆవర్జాలమ్ము వాళ్లు.
మురికితొట్టి చెత్తలాగ
పెరుగుతున్న ప్రచారమ్ము
దినపత్రిక కరపత్రం
నినాదాల ఆర్భాటం
శతసహస్ర సంఖ్యలోన
సతతము ముద్రించబడుచు
సులభముగా ఏదైనను
సూటిగ నమ్మే ప్రజపై
అభాండాలు అశుద్ధాలు
అతివడిగా వడ్డించును
ప్రచారమ్ము నారగించ
ప్రజనెత్తురు చెడిపోవును
హృదులనుండి మెదడువరకు
మెదడునుండి హృదిదాకా
ప్రవహించదు దేహములో
ప్రస్ఫుటముగ రక్తమింక
హృదయమైన మెదడైనా
ఒంట్లో ఇక కానరావు
సిరలందున ధమనులతో
నరనరాల గడ్డకట్టు
అస్తుల కంటుకుపోవును
అతిదారుణ ప్రచారమ్ము
ఆ ప్రచార గానముతో
ఆవేశపు తానముతో
బూర్జువాల ద్వేషాన్ని
భూస్వాముల క్రౌర్యాన్ని
ఆమోదింతురు పాపం
అమాయకులు కొంతమంది
తెలియకనే ప్రజలపట్ల
ద్వేషులుగా మారగలరు.

ప్రజ మాత్రం మారబోదు
నిజ మెరిగిన ప్రజలు వీరు
పాటుపడుచు కష్టాల్లో
రాటు తేరినట్టి వాళ్ళు
మరణించకనే నిత్యం
మరణబాధ నెరుగువాళ్ళు

'చూపరాదు ఏమైనా
జీవిస్తాం!' అనెడి గొప్ప
తిరుగులేని నిర్ణయాన్ని
తీసుకున్న మహాజనులు!
ప్రచారాల రంగు బుడగ
ప్రజ నిప్పుడు కవ్వించదు
వీరి దృష్టి సునిశితమ్ము
వీరిది కడు దూరదృష్టి
ఆకలి అధ్యాపకుడై
యీ కనుచూపుల దిద్దెను
కలలీ కన్నుల లోపల
కరవాలపు తళతళలు
అసత్యాల అభాండాల
అవి ఒక వ్రేటున చీల్చును.

హఠాత్తుగా విప్లవమ్ము
అరుదెంచే అతిథి కాదు
అది అభేద్యమైన దొడ్డ
అగ్ని పర్వతము వంటిది
పురుషాంతరముల తరబడి
గురక లేక నిదురించును
గుట్టు చప్పుడవకుండా
కుత కుతమని ఉడుకుతుంది
పొగలు రేగి సెగలు చిమ్మి
భగభగమని మండుతుంది
దీని శూన్యోదరమ్ము
త్రేన్చును పిత్తాధిక్యత
శిఖరాగ్రపు గొంతుకింద
ముఖరించే నడుముకింద
ఆదిమ భౌతిక శక్తుల
అదృశ్యపు కుదురు మొదల
అంతరాళమున అడుగున
సంతరించుకొను ఉగవడి

అటువంటిది విప్లవమ్ము
అటువలనే ప్రజలు కూడ
ముడతలు వారిన ఒడలూ
ముకుళించిన జీవితాలు
తరతరాల సుప్తిలోన
స్తబ్ధులుగా నున్న వాళ్ళు
పైపై చూపుల కెపుడూ
ప్రమాదకరమవని వాళ్ళు
చల్లారినట్లు కనిపిస్తూ
జ్వలిస్తారు జ్వలిస్తారు
గొప్ప గొప్ప ఇతిహాసపు
నిప్పుకొండ లీ ప్రజలు
గుట్టు చప్పుడవకుండా
కుత కుతమని ఉడుకుతారు
పొగలు రేగి సెగలు చిమ్మి
భగ భగమని మండుతారు
వారల శూన్యోదరాలు
పైత్యపు త్రేన్పులు త్రేన్చును
శిఖరాగ్రపు గొంతునుండి
చిరకాలము దిగమింగిన
అవమానాగ్నులు మెల్లగ
ఆకారమ్ములు దాల్చును
ఎర్రని ఉరవడినివారు
ఎడనెత్తుట సంతరింత్రు
ఆ ఉరవడి మెలమెల్లగ
అరికాళ్ళనుండి పైకెగయును
మట్టికి చుట్టమ్ములయిన
దట్టపుటరికాళ్ళనుండి
పట్టెడు మెతుకులు ఎరగని
పొట్టనుండి రొమ్మునుండి
స్పందించె గళమునుండి
జ్వలియించే హృదిలోనికి
గంధకాల పొగలు క్రక్కు
కడుబాధల మెదడుచేరి

పరమోత్తమ తరుణమందు
పగులు అగ్ని పర్వతమ్ము
గొప్పగొప్ప సంబరముగ
నిప్పుల ఉప్పెన యెగయును
స్వార్ధపరులు నిర్మించిన
సర్వమ్మును కబళించును
కలసికట్టుఅయిన ప్రజలు
కఠినాగ్నుల పర్వతాలు
చారిత్రక ముహూర్తాన
జ్వాలలు వెలిగ్రక్కుతారు
ఇది ప్రకృతికి అవసరమ్ము
ఇది ధరణికి అపసరమ్ము
వ్రయ్యలయిన ఇలగర్భము
ప్రతీకార మడుగుతోంది
ప్రకృతిలో మానవుడే
పరమాద్భుత పరాకాష్ట.
ఆ తూగును చెదిరిస్తే
అవును ఎలాసహిస్తుంది

మాగాణము మబ్బుతునక
మంచినీరు పర్వతమ్ము
విహంగమ్మూ పెనుమెకమ్ము
వీచుగాలి మానవుడూ
ప్రకృతి తన సృష్టితోడ
ఒక తీరునె శ్వాసించును
శ్రావ్యముగా అందరనీ
సమరీతిని లాలించును
చిరానంత కల్పమ్ముల
క్షేత్రగణిత యాత్రలోన
సరళ రేఖలూ వలయము
చదరమ్ముల రూపమ్ములు
వివిధరీతి వేగమ్ముల
వేరులయల వేరుగితుల
జీవన సంగీతమామె
చేయి సదావిరచించును
ఆమె వేసుకొనెడి లెక్క
ఏమైనను తప్పిపోదు
ఆమె మహద్విజ్ఞానము
ఆమె సర్వ సుజ్ఞానము
అనంత కాలమ్ములోన
అనాది కాలమ్మునుండి
అనుభవాలు గాదెలయిన
మనీషులూ కళజ్ఞులూ
స్వార్ధరహిత శాస్త్రజ్ఞులూ
ప్రకృతి నిర్దేశించిన
ప్రస్ఫుట మార్గమ్ములందు
నిర్వికార సరళిలోన
నిరతము కృషి కావింతురు

సకల చరాచర జీవుల
సమ్యక్సా రాంశమ్మగు
తనలోగల విజ్ఞానము
వినయముగా విమలముగా
ఓరిమితో మెలగునపుడు
నేరని అవివేకమొచ్చి
నేనేలే ఘనమంటూ
నిత్యమడ్డు పడుచున్నను
ప్రకృతి గణితమ్మెప్పుడు,
ప్రస్ఫుటముగ లెక్కతేల్చు
క్షణికానికి అమరత్వము
అనుకున్నచో ఇవ్వగలదు.
వికృతమ్ము కాజాలని
ప్రకృతి పథకమ్ములోన
ఏదైనను దేనికన్న
ఎక్కువ తక్కువ కాదు
ఆమెలోన జీవించును
అనంతమగు అంశమ్ములు
ఎన్నబోవ ఎంచిచూడ

అన్నియును సమానమ్మై
స్వయం చైతన్యమున్న
ప్రతి అంశము జీవాత్మ్యము
విమల మహారచనమందు
తమ స్థానము తమకు తెలుసు
ప్రకృతి పథకమ్ముగ కొంత
వికృతి కావించువాడు
తన వినాశనమ్ముగ తాను
తప్పక చెల్లించుకొనును
ప్రకృతి ధర్మాల నెవడు
పట్టుగ ఉల్లంఘించునో
ఉల్లంఘించిన ధర్మమె
పెల్లుగ వానిని విరచును
కాలముతో అవకాశము
కలపగల్గు విజ్ఞానము
పరిశోధన ఫలితమ్ములు
పరమాద్భుత లీలావళి
సహజ పరిజ్ఞాన దీప్తి
శ్రమించగల మహితశక్తి
నోచలేరు నీచులెపుడు.
వారు రద్దు చేతురేమో
వసుధలోని పరమార్థమ్ము
సంపూర్ణము సువిశాలము
సమిష్టి వ్యక్తి మానవుని!

కట్టుటకే కాని విరగ
కొట్టుటకా మన జ్ఞానము
వలచుటకే కాని అలిగి
వగచుటకా మన జ్ఞానము!
చిగుర్చుటకేకాని రాలి
చివుకుటకా మన జ్ఞానము!
నిర్మాణాత్మక ధ్వంసన
నియమించును ఆ ప్రకృతి
ధరణిలోన అనవరతం

సరితూగును నిలువుటకై
దురాక్రమణ దారల పైను
పరాక్రమాలు సహియించదు
పసవలు రణధీరులట్లు
ముసుగు ధరించుట ఒప్పదు
కడుమెల్లగ ప్రవేటుపడును
పడినంతనె ఇక ఆఖరు
ప్రకృతి కంఠమ్ముగ నేడు
ప్రకటించును చరిత్రలో
ఏనాడూ ఎరగనట్టి
ఎలుగెత్తిన గొంతుకలో :
"మానవుడా నీ కొసగిన
మహిత ధనము జీవితమ్ముగ
ఇది దాచుట కొరకె కాదు
ఇంకా అభివృద్ధి కొరకు
సౌరులోన యశములోన
సమిష్టి జ్ఞానసంపదలో
సమభాగమె అందరికీ
సమభోగమె అందరిదీ
ఒకరి కళ్ళలోన ఒకరు
ఉత్సాహముగ చూస్తూ
భ్రాతృత్వపు సంతోషపు
రహస్యాల చేబట్టుచు
పరస్పర హృదయమ్ములందు
పలు వన్నెల విరచించుచు
ఛాయలేమి బరపకుండ
చక్కగ జీవించుటకే!
దొడ్డ రహస్యాలు మీకు
దుర్వినియోగము చేయగ
ఇవ్వలేదు అభివృద్ధికె
అవ్వాటిని వాడవలెను
దీర్ఘాయువు సాధించుచు
చివరకు మృత్యువును గెల్చి

అస్తిత్వములో సౌఖ్యము
సుస్థిరము చేయవలెను"

పాటుపడే వాళ్లెపుడూ
ప్రకృతి కతి సన్నిహితులు
ఆమెలోని ప్రతి మెళుకువ
అవగాహన వారి కగును
అలసిన తమ చర్మమందు
ఆమె తంతులే మెరయును
ప్రకృతి సంస్పందనమ్ము
వారి రక్తమందు బ్రతుకు
ఋరద, వాన, ధూళి, వేడి
తరుగుతున్న చందమామ
పెరుగుతున్న నెలవంక
విహాయసములో చుక్కలు
మంచిరోజులను తెచ్చే
మార్తాండుల కిరణమ్ములు
సర్వము ఈ శ్రమజీవుల
సాటి రక్త బంధువులే
పాత పాత నమ్మకముల
పాతుకుపోయిన వీరలు
నడుస్తారు మెలమెల్లగ
నవ్యాశయ పథ మందున
ఫలియించని చేదువగరు
పరిశ్రమల నిమిత్తమే
పుట్టలేదు తామటన్న
గట్టి నమ్మకమ్మొదవెను
వెలదిప్రసవ వేదనమ్ము
విషాదాలు సృష్టించదు
ప్రమోదాలు సృష్టించదు
ప్రయోజనము సృజియించును
ప్రతిమానవ వదనానికి
ప్రతి మానవ అంగానికి

జీవన దివ్యత్వమొసగు
పావనమగు అర్థమొసగు

అవునునిజం! అవునునిజం!
అర్థముంది ప్రతిమనిషికి
కరములతో హృదయముతో
కడువెలిగెడి మేధతోడ
కలలుగాంచు కళలుమించు
కష్టజీవికర్థముంది
పాటుపడక సాపాటుకు
సూటిహక్కు ఎవరికుంది
పుడమితల్లి కొంకకానుక
తొడగలేని పటుపాపికి
లెక్కలేని కానుకలా
లేనుపిల ఇవ్వవలెను
కవితలోన శిల్పములో
కమ్మని సంగీతమ్మున
చిత్రములో నాట్యములో
చిత్రములోగల భావము
చెప్పనట్టివారు, గుట్టు
విప్పనట్టి శాస్త్రజ్ఞులు
విశ్వమహా రహస్యాలు
విశదము కావించనట్టి
విపులము కావించనట్టి
విజ్ఞానులకీ వసుధను
పరికించుటకేమిగాని
శ్వాసించగలేదు హక్కు!
పాటుపడే వాళ్లెపుడూ
ప్రకృతి కత్యంత ప్రియులు
మిల్లులోనొ పొలములోనొ
మిక్కిలి శ్రమియించువారు
మూగిపుడమి పేగులలో
మూగిన ఖనిజాలుత్రవ్వి
నల్లని ఆ బొగ్గుగనులు

మెల్లగ మచ్చికచేసుకు
బొగ్గు నుండి పలురంగుల
నిగ్గు నుండి పరిమళాల
గుట్టులరసి సాధించే
గట్టివాళ్ళు శ్రమజీవులు
మనిషితోలు యంత్రమ్ములు
పనిచేయగ చమురుతెచ్చి
మరలవోలె ఇకమీదట
మనజాలని మానవాళి
ధరణినుండి ఉద్భవించి
తరణి నుండి శక్తిపొందు
భూరి వృక్షశాఖలతో
పోల్చదగ్గ శ్రమజీవుల
పాటుపడే హస్తమ్ములె
పటిష్ఠాలు శ్రేష్టమ్ములు
పచ్చినెత్తురూ మాంసం
పిచ్చిగా ఆశించు బలులు
తెచ్చిపెట్టు విభేదాలు
తీరాలూ సరిహద్దులు
చెరిపేసిన నవలోకం
చెడుపులేని నవలోకం
శ్రామిక సామ్రాజ్యమగును
శ్రామికులే సామ్రాట్టులు

* * *

అచ్చంపేట నివాసిని
లచ్చుమమ్మ కథ వినండి
ఆమె గుడిసె అరచీకటి
అర వెలుగుతో ముచ్చటించు
బయటునున్న పెనుచీకటి
బాధల బరువుల వైనము
గుసగుస లాడుచు చెప్పెను
అసలు సిసలు రహస్యాలు
ఇట్టి పేద గుడిసెలోన
పుట్టెడు నిశ్శబ్దమ్మున
కలుసుకొనెడి వాళ్ళవంటి
కష్టించే మానవాళి
ఒక చక్కటి ఆదర్శము
ఒకటిగా కావించునపుడు
స్వార్థరహిత మహనీయులు
జయము నీకు ప్రసాదించ
ఓ మనోజ్ఞ జీవితమా
భూమి మనకు స్వంతమగును
పూరి కొంప ఇచ్చోటనె
ప్రారంభము విజయానికి !

పగలంతా లచ్చుమమ్మ
పాటుపడెను మాటాడక
ఆ చేతులు మట్టిపాత్ర
లందుకొనుచు పని చేయగ
ఆమె మెదడు చక్రమగుచు
ఆలోచన ఇరుసుమీద
గిరగిర గిరగిర తిరిగెను
పరిపరి ఊహల జొచ్చెను
పీడించే బలవంతుల
పీడ విరగడయి నప్పుడు
తగిలించిన శృంఖలాలు
పగిలి నేలపడి నప్పుడు
సమరాన్ని జయించినపుడు
సమానత్వ మొచ్చినపుడు
శాంతినిండు భూమినింక
స్ఫటికము కావించునపుడు
నిసువుల చిరుశేట పండుగు
నేత్రమ్ముల భయము తొలగి
తోలుతిత్తు లట్టుప్రాలు
పాలిండ్లకు పేపకలిగి
ఇంతి ఎదురు రొమ్ము యింక
చింతలతో కృంగనపుడు

రానున్న తరాలకామె
రసదుగ్ధము చేపునపుడు
ఎటులుండును ? ఎటులుండును ?
ఇటులామె తలంచసాగె
అట్టిరోజు ఉదయించును
అమరవీర రక్తముతో
ఎరుపెక్కిన ప్రసూనమ్ము
విరిసినట్లు ఆ హృదయము
చరిత్రలో మనిషి మనికి
సార్థకమ్ము కావించును

తన బ్రతుకును విరచలేని
తరతరాల వెతలవల్ల
రాటుతేరె జ్ఞాని అయిన
లచ్మి మిగుల వృద్ధురాలు
అవర్థియసి చూడగ
కేవల మొకవ్యక్తికాదు
సతమతమగు రైతాంగపు
చరిత్రయే ఆమె రూపు
ఆమెలోన వారికలలు
ఆశలు సంకల్పమ్ములు
కూడి చిన్నగుండెలోన
గూడుకట్టుకొని వున్నవి
మహాజలధిలో రెచ్చిన
మరుత్తులు ఉరు ఝంఝలు
రేపిన పెనుముడతలట్లు
ఆమె ఒడలి ముడతలుండు
బలిమికి చిహ్నాలుగాని
బలహీనతకవి చెందవు.
పుడమిలోన ప్రవేశ్యాని
ఏడుగులు వర్షించిననూ
స్వర్గానికి వెరవనట్టి
సగర్వ వృక్షచయము వోలె
ముడుతపడు ఆ చేతులు

పుట్టెడు ఆశల గుంపులు
ఇచ్చుట ప్రతిసంధ్యవేళ
ఇరుల మసక ముసుగులోన
అర్ధరు కమ్యూనిస్టులు
అనవరతం కలుసుకొంద్రు
ఎగసిపడే ముదిలాంతరు
పొగరేగే వెలుగులోన
హృదయమిప్పి వినిపించిరి
ఒక్కొక్కరు ఒక్కగాథ
వేధించే వీరగాథ
విద్వేషపు అమరగాథ.

## మొదటి గాథ

రాములనువాడు పడుచుకుర్రడు
గ్రామమందున కలడు ఒక్కడు
వెర్రిబాగుల గొర్రెకాపరి
ఇర్రిలాగున తుళ్ళుచుండును
ప్రొద్దుకూకులు పాడుకుంటూ
మురిసిపోవును రాములెప్పుడు
బాలకృష్ణునిమీద పదమో
బయుహ్కొపునవిన్నపాటో
కూనిరాగం తీసుకుంటూ
గొర్రెలను తను కాచుచుండును

గాలికన్నా స్వేచ్ఛయున్నది
బాలరాములు అంతరాత్మకు
పులుగుతీరున అతనిమనసు
గళము నెత్తి పాడుచుండును
లోకమందున విన్నపాటకు
ఏకసంగ్రాహిరాములు
చెవినిపడ్డమాటలన్నియు
చిలుకతీరున అప్పచెప్పును

పాట అతనికి పాలబువ్వ
పాట అతనికి సర్వలోకము
నింపునెప్పుడు పాటలాతని
నెత్తురందున టంకారము

పంటపొలములు మింటమబ్బులు
పాటపాడగ మారుమ్రోగును
అవని అంతయు స్వరములన్నియు
చెవియొగ్గిశ్రద్ధగ ఆలకించును

కట్టుకొన్నది గోచి పాతయె
పట్టుకొన్నది వెదురు కర్రనె
చదువుసంధ్యలు నేర్వడాతడు
చక్కగా మాట్లాడజాలడు
తెలియజాలడు పాపమాతడు
తెలుపు ఎరుపులలోనతేడా
పుడమితల్లితో చాల చనువు
పొంగువాగుతో చాల చనువు
భూమివాసనలన్ని తెలియును
ప్రొద్దుచూస్తే గంట చెప్పును
ఎన్నడూ నెహ్రూ గురించి
విన్నవాడేకాడు రాములు
కమ్యునిజమను మాటనతడు
కలను కూడా విని యెరుంగడు
కాంగిరేసు స్వరాజ్యముందను
ఖబురు కూడా తెలియదతనికి

ప్రొద్దుయింకా మిగిలివుంటే
మురిసిపోయే అక్కుపక్షి !
మూగజీవాలతని చుట్టూ
మూగి పాటకు పొంగిపోవును
పాటలోనే వాడు బ్రతుకును
వాడి బ్రతుకే గాలిపాట !

ఒక్కరోజున ప్రొద్దుగ్రుంగక
చిక్కనగు తన గళమునెత్తి
పాటపాడాలనే కోరిక
పరవళ్ళు తొక్కెను అతని జిహ్వను
వాయితెరచీ స్థాయిపెంచీ
పాడె నాతడు పరవశమ్మున
మురిసిపాడే సమయమందున
సిరులలో శ్రీమంతుడతడే !

లొల్లాయిపదమా ? కానెకాదు
అల్ల సినిమాపాట కాదు
ఇపుడుపాడే పాటలోపల
ఏదియో ఒక జీవమున్నది
అందు రేగల మాటలన్నీ
అగ్గిపూసలు; వాటినన్నీ
అగ్గిదారముతోనే గుచ్చిరి
అతని మనసో అమిత – తెల్లన
అతడు పాడినపాట ఎర్రన
బలముగా ఎలుగెత్తి పాడిన
పాట లోపల మంత్రమున్నది
ఈడ్చుకొంటూ ఏడ్చుకొంటూ
ఎలాగో బ్రతికేటి జనులకు
రంగు రంగుల ఆశలెన్నో
రక్తితో కలిగించు గానము
ఏమి ఎరుగక వాడు పాడెను
ఎర్రజెండా మీద కీర్తన
ఆ పతాకము పైన ఎన్నో
అంశాలుండుట వాడు ఎరుగడు !

చుక్కలనియెడు చెవులు తెరచుక
చక్కగా ఆ నింగి విన్నది
పాటలో తన గుండె లోపలి
ప్రాణమంతా పోసి పాడెను
పొలికేక పెట్టి అతడు పాడ

పోలీసులేమో దాపురించిరి
పాట వారికి పరిచితమ్మే
మాటలన్నియు పరిచితములే !
కష్టజీవుల విజయ యాత్ర
గానమును వారాలకించిరి
ఆ పాటలో ఒక్కొక్క పదమూ
అగ్నులను వెదజల్లు చుండును
కష్టజీవుల వేల సంఖ్యలో
కదిలించి నడిపిన పాట అయ్యది !

"పట్టుకోండి కుర్రవాడిని !"
అట్టహాసము చేసె నొక్కడు
'సంగపోళ్ళతో చేరె పోరడు'
'సంగతంతా పాట తెలుపును
సర్కారు ఏమని హుకుము నిచ్చెను
కఠోరంగా ఈ సంగపోళ్ళను
ఎర్ర జెండా పట్టినోళ్ళను
బుర్ర బద్దలు కొట్ట మన్నది !"
వెర్రిబాగుల గొర్రెకాపరి
వాళ్ళచేతికి చిక్కిపోయెను
సంకెలేసీ చౌకు వద్దకు
చక్కగా నడిపించు కెళ్లిరి
"నేను చేసిన నేరమేమిటి ?"
పూని అడిగిన ప్రశ్నకెవరూ
బదులు చెప్పరు, చెప్పరెందుకు
పాడుసంగం పోరగాడిని !

కోర్టు కీడ్చిరి బోనులోపల
కుర్రవాడిని నిలవపెట్టిరి
కుక్షికోసం డబ్బు కతికి
సాక్ష్యమిచ్చెను పొరుగువాడే
సర్కారుపైనే కత్తి కట్టెను
సమరమున బందూకు పట్టెను
నేరగాడని నిర్ణయించిరి
నిలువునా పెనుశిక్ష వేసిరి

ఏమి నేరము చేసినాడో
దేముడేకద చెప్పగలుగు
బహుశ యీ సర్కారు న్యాయము
భగవంతుడైనా తెలియ జాలడు
హజము రాజ్యము చేయునప్పుడు
నిజము నిద్దురపోవుచుండును
అక్కటా ఫాసిస్టు జులుమున
ఒక్కడూ నిలవేసి అడగడు !

తొంగిచూచే గాలి ఆగెను
దొంగ లాగున ఆలకించెను
పొంచివిను నిశ్శబ్దమంతట
పోలీసు జులుముకు విస్తుపోయెను
పొయ్యి లోపల కర్రమండెను
పొయ్యిమీదను గంజి ఉడికెను
ఆరుబొచ్చల గంజిపోసి
ఆరగించండనెను లచ్చు
"ఏడి ఏడిది జుర్రగానె
ఇంక ప్యానం లేచివచ్చును"
నిశీధము పన్నెండు కొట్టెను
నిశ్చలత స్తంభించసాగెను ... ...

# రెండవ గాథ

'ఇపుడే ఈనిన ఆవు
ఎంత మంచిగున్నదిర !
దూడతోను మా దొడ్డికి
తోలించర తొందరగా'

అన్నాడిది దేశముఖుడు
విన్నాడిది పేదరైతు
అంతే ఇక మారాడక
అర్పించా లడిగినది

ఆవుకైన దూడకైన
అచ్చేముదరా ఇవ్వడు
చేస్తున్న చాకిరీకి
నాస్తి! నాస్తి! కూలిడబ్బు

దొరయింట్లో రేపుపెళ్ళి
దొడ్డవిందు చేయగలరు
పక్కఊళ్ళ చుట్టాలూ
పక్కాలూ వందమంది

దొరకొడుకే పెళ్ళికొడుకు
పొరుగుదొర వియ్యంకుడు
కోనారులు కడుతెరగ
కొట్టాలిక తలోమేక

కడువృద్ధులు పలుపెద్దలు
కడివెడు వెన్నలు తేవలె
కిక్కురు మనరాదు వాళ్ళు
బక్కవాళ్ళు గొణగరాదు

పొరుగు దొరల మేడకన్న
దొరభవంతి పెరగవలెను
ఎండలో తాపీ మేస్త్రిలు
కండలు కరగించాలిక

వాళ్ళ వాళ్ళ బళ్ళలోన
రాళ్ళూ ఇటుకలు తేవలె
విరిగిన హృదయాలేకద
దొరభవంతి ఇటుకలగును

పన్నుల సుంకాలవల్ల
వెన్నువిరుగు పేదోళ్ళకు
కన్నులు తెరుచుకు వెలితిగ
మిన్నుచూసి ప్రార్థింతురు

ప్రజల వేల్పు చెవిటివాడు
పైపెచ్చుగ మూగవాడు
సూర్యుడతని గ్రుడ్డికన్ను
చూడడు దొరవేయుపన్ను

రైతుపనిత పొలంపనికి
రానంటే ఇక అంతే!
చీరవొలచి పదిమందిలో
చీరేయును దొరకమ్మా!

ఇల్లాలితో పేదరైతు
ఒళ్ళువంచి సహించాలి
దేహము మానము ప్రాణము
దేశముఖునికే స్వంతము.

చెరపట్టే రాక్షసుల
తలదన్నును దేశముఖుడు
కన్నెపిల్లలా తుంటరి
కంటిఉచ్చు దాటలేరు.

సూర్యపేట చాయలందు
తుచ్ఛుడు కచ్చాడుతాడు
పరిసరగ్రామాలు వాడి
పచ్చి కామ రంగమ్ములు

రెండున్నరవేల పూల
రేకులు నలిపేశాడు
రెండున్నరవేల స్త్రీలు
గండాలకు బలిఅయ్యిరి.

ముప్పది అయిదేళ్ళవాడు
ముప్పులిన్ని తెస్తూంటే
అలగా జనమతని అంతు
ఆశిస్తే ఏమివింత!

త్రాళలేక తిరగబడితె
తప్పెవ్వరు పట్టగలరు ?
తల్లుల చెల్లెళ్ళ చెరచ
తప్పదు బదులుకు బదులు

బొత్తిగ ఒక తరము క్రింద
కొత్త పెళ్ళి కూతుళ్ళట
దేశముఖుని శయ్యమీద
దేహము నర్పించేరట !

ఆడదలచు బూతులాడి
అందాలను పీల్చి పీల్చి
కట్టుకొన్న వానికి ఆ
కట్టెను మరునాడు పంపు

సిగ్గు సిగ్గు అవమానం
చెప్పరాని దీ శోకం
ఇంక రైతు తిరగబడిన
ఎవ్వరు నిందించగలరు ?

రక్తారుణ పతాకమ్ము
శక్తులు పెంపొందించగ
ప్రతీకార వాంఛలతో
ప్రజలంతా ఏకమైరి

అంధ తమసు గడ్డకట్టు
అర్ధరాత్రి చలిచుక్కల
ఊపిరి బిగవట్టివినెను
హృదయాంతర రహస్యాలు
ఎందుకొమ్మ విరుగుతూంది
పండుటాకు రాలుతూంది
గుంటనక్క ఊళపెట్టి
ఒంటరి నది అలలు రేపె
నీలిసిరా పొక్కులవలె

నీడలు గ్రామంపు గోడు
మదిలో తలపోయసాగె
హృదిలో విలపించసాగె
గుడిసెలు రైతుల పాలిటి
గోరిలే ఈ ఊళ్ళో
నిదురించే ఈ గ్రామం
చెదిరిన ఛాయా చిత్రం

అయినా ఈ గుడిసెలోని
అర్ధరాత్రి తెలుసుకుంది
చక్కని అరుణోదయాన్ని
చర్చిస్తున్నారిచ్చట
చిరువేకువ లన్నిటిని
మరిపించే మహోదయం
జీవన భానూదయమ్ము
స్వేచ్ఛాదితోదయమ్ము
శృంఖలాల సైకించని
శోకాశ్రుల వెలివేసెడి
నిరంకుశుల నిర్జించెడి
నిత్యమానవోదయమ్ము
ఇచ్చట ఈ గుడిసెలోన
ఇప్పుడు చర్చించబడును.

ఆర్గురిలో ఒక్కడిపుడు
అందరికీ తెలియుటకై
తనుకన్నది మెలమెల్లగ
వినిపించెను, లచ్చుమమ్మ
బొమ్మలాగ కూర్చున్నది
పూర్ణంగా ఇది విన్నది:

కొండ వెనుక ఎర్రప్రొద్దు
క్రుంకి నపుడు కెంజాయలో
ఓలుదార్ల దగ్గర ముది
చెట్టుకింద చేరినారు

ఊరిలోని ప్రజలందరు
ఒక్క నిశ్చయాని కొచ్చి
సమ్మెజేసి దొరజులుమును
వమ్ము చేయ దలచినారు

ఒకే ఒక్క సంకల్పము
హృదులలోన విద్యుత్తయి
అందరిలో ప్రవహించెను
ఆశలెన్నో వెలిగించెను
ఆ సంకల్పము నెవరూ
అణుమాత్రం కదపలేరు
అందులోన మెరుపుతీగ
లసంఖ్యాకముగనున్నవి
పర్వతాల పటుశక్తులు
పదిలక్షల అలలమ్రోత
ఆ సంకల్పములోపల
అణిగిమణిగి నేడున్నవి
పెచ్చుపెరిగి లేచినచో
మచ్చికవదు ఎవ్వరికీ
సమ్మె చేసినారు జనులు
సమ్మెటపడినది దొరపై
తప్పదింక తప్పదింక
చావుమూడుతుంది తనకు
ఊరివాళ్ళ వీపులపై
స్వారిజేసె తనతండ్రి
తానూ ఒక పుష్కరమ్ము
మేనులమేనా ఎక్కెను
ఇంకెన్నో పుష్కరాలు
ఇట్లా సాగించదలచె
వంగిన వీపులు లేచెను
లొంగరింక గ్రామస్తులు
నిటారుగా ఊరు నిలువ
నెత్తురుకొక కొత్తచేవ
గ్రామవీణ తంత్రులపై
కడు నూతన ఆశ మ్రోగె

## మహాడవ గాథ

పౌరుగూళ్లో భూస్వామి
నరరూపంలో పిశాచి
దోచి దోచి నలుపెక్కిన
దుష్టబుద్ధి వింతబూచి
వినిపిస్తా విడ్డూరము
వినండి మీ చెవులు తెరచి

చెప్పుకోండి భూస్వామికి
చెప్పులింక కుట్టమనిరి
ఆ గ్రామంలో గొడార్లు
ఇంటిపనులు పెంటపనులు
ఇంక మేము చేయమనిరి
ఆ ఊళ్లో నౌకర్లు
వాడికొరకు ఇకమీదట
వడిగా పరిగెత్తమనిరి
ఆ ఊళ్లో చాకర్లు
విసుగెత్తిన పందులైన
అశుద్ధాన్ని ముట్టవనిరి
పాకీపని చేయువారు
దుస్తులు కుడితే వాడికి
పస్తులెకద మా ఫలితం
కుట్టమనిరి దర్జీలు
ఎంత నీళ్లు మోసినా
గొంతుమాకు తడిసేనా
మోయమనిరి నీళ్ళ వాళ్లు
ఉరిమిచూచు నెంతసేపు

ఉతికేస్తాం వాడి వీపు
అని చెప్పిరి మగవాళ్ళు
ఎలకలాగ వణుకుతాడు
ఎవరికింక వీడి బెదురు
అని నవ్విరి ఆడవాళ్ళు
క్షవరం చేయాల ? శుద్ధ
క్షవరం చేసొదిలేస్తాం
అన్నారు ఊరి మంగళ్ళు
పాపంచేసే లోగిట
దీపమింక వెలగదనిరి
ఊరిలోని తెలకులాళ్ళు
వీడి మనసు వీడి దిరుసు
పాడుకంపు ! కుళ్ళు ! కుళ్ళు !
ఉతకమనిరి చాకళ్ళు
జులుం హజం గతం గతం
పలుగాకులు హతం హతం
మార్మ్రోగె వేయినోళ్ళు

ఆలించే గదిలోపలి
పాలిపోవు వెలుగువినెను
ఎర్రని ఆ గోడలపై
ఏ క్రీనీడలు సాగెను
శోకాకుల కుటీరాన
శుభశకునాలను చెప్తూ
గోడమీద పురుగులను
కోరిబల్లి భక్షించెను
గంటలు కొట్టారు రెండు
గట్టిగ గొంగళి కప్పుకు
నాలవ గాధను లచ్మి
ఆలించెను మౌనముగా

# నాల్గవ గాథ

అతడు కొత్త పెళ్ళికొడుకు
అమ్మకు తానొకడె కొడుకు
అతడు తప్ప ఈ జగతిని
ఆ తల్లికి లేవు నిధులు

అమావాస్య నాడాతడు
హాయిగ మనువాడినాడు
అతని చెలి జాబిలివలె
అనుదినమూ ఎదుగుతూంది

నల్లని తన కురులలోన
తెల్లని మల్లెలు ముడిచెను
చూడ ముచ్చటగును ఆమె
చుక్కలాంటి చక్కదనం

అతని వయసు పదునెనిమిది
ఆమెకు పదిహేను నిండె
వేయి గులాబీలు విరియు
తీయని తొలిరేయి వచ్చె

పరిమళాల తరగలాగ
అరుదెంచెను మొదటి రేయి
'మంది కొరకె మంచి కొరకె
మన బతుకులు' అనె నాతడు

'సంకెళ్ళులేని జగతికొరకు
అంకితాలు మన బతుకులు
మరువకు కమ్యూనిస్టుకు
మగనాలివి నీవైతివి'

తొలి నాలుగు నిశీధాలు
తొందరగా గడిచిపోయె

(వడివడి వచ్చే అలజడి
వర్ణించుట ఎవరితరం!)

అయిదవ రాతిరి గ్రామము
ఆదమరచి నిదురపోయె
అల్లుకొన్నిన చీకట్లూ
ఒళ్ళుమరచి నిదురపోయె

వినువీధిని శశినిచూసి
శునకమ్ములు మొరగసాగె
అపశకునం తోచినట్లు
అర్ధరాత్రి అదరసాగె

మబ్బువెనుక చుక్కలన్ని
మాటువడెను మెలమెల్లగ
వెన్నెల సమ్మెను చేసెను
వెలవెల బారెను లోకము

నిశ్శబ్దము అదిరిపడెను
నిశీధమ్ము వణకసాగె
బాటమీద యమదూతై
మోటరుసైకిలు వచ్చెను.

దారితీయ ఆ సైకిలు
లారీ ఒకటనుసరించె
జోరుచూసి హోరుచూసి
దారులన్ని దద్దరిల్లె

శకటములో ఉన్నదెవరు?
సాయుధ పోలీసు బలం!
కాంగ్రెస్సుకు రక్షకులే
కటిక కసాయి హజం!

ఏతెంచిరి యమదూతలు
భీతిచెంద ఆ గ్రామము

మెల్లగ ఆ పరిసరాలు
వల్లకాడుగా మారెను

సరాసరి ఇంటిముందు
సైకిలు లారీలాగెను
'కలుగులోంచి వెలికిరా!
కమ్యూనిస్టెలుకా!'

గద్దించెను కటికవాడు
కనపడితె చాలు! చాలు!
కమ్యూనిస్టుల కాల్చుట
కటికవానికొక వేడుక!

బందూకులు తిరగవేసి
బద్దలు కొట్టిరి తలుపులు
'వహ్వారే! పెళ్ళికొడుకు
వయ్యారితొ కులికేనా?'

వెకిలినవ్వు వెకిలిచూపు
వెటకారం వికటించెను
కళ్ళల్లో కాను-వెర్రి
ఒళ్ళంతా అపహాస్యం.

"బయటకు రారా కొడకా!
పాన్పు నీకు వేయిస్తాం
ఇంతకన్న మహామంచిది
ఇపుడిపుడే చూపిస్తాం

నీ పెళ్ళాం నీ తల్లీ
నెత్తి మొత్తుకొంటారేం?
నీకు కొత్త శోభనాన్ని
నేరపుటకే మే మొచ్చాం!"

సారె శయ్యనున్న వాణ్ణి
సరగున బరబర ఈడ్చిరి

కోరెక్కలు విరిచికట్టి
కుదవేసిరి ఇంటిముందు

"గోలీమారో!" అంటూ
గొంతెత్తెను కటికపెద్ద
అంత కురిసె గుళ్ళవాన
అవనీ గగనాలు ఏడ్చె

"తప్పుడు కమ్యూనిస్టూ!
ఇప్పుడు పీనుగువైతివి
లిస్టునుండి ఒక పేరును
స్పష్టంగా తుడిచేశాం!"

అచ్చట శవమును వదిలి
వచ్చినదారిని పోయిరి
ఊరివాళ్ళ గుండెలన్ని
గోరీలై ఎదురేగెను

చెట్టునీడ శవముపాతి
పెట్టినారు గ్రామస్థులు
అరుణపతాకం గుర్తుగ
ఆ సమాధిపై నిలిపిరి.

లాంతరులో చమురుపోయ
లచ్చుమమ్మ లేచినది
అసంఖ్యాక కాయమేడుల
కన్నమిడిన చేతులతో
లాంతరులో నూనెపోసు
అంతరాన ఇట్లు తలచె:
"మూర్ఖులు హింసించితే
బొందికే ఆ బాధలు
బందూకులు పేలిస్తే
బొందికదా వాలుతుంది
బొందికన్న వేరొక్కటి
ఉందిసుమా గట్టిగా

దాన్నెవరూ ఆపలేరు
దాన్నెవరూ చంపలేరు
మంది కొరకు బలిఅయ్యే
మంచోళ్ళలో అది ఉంది
చలియించదు ఆ నమ్మిక
కలకాలం బతుకుతుంది

వత్తిలోన జ్వాల ఎగసె
హత్తిన చీకటి తొలగెను
తడిసెను బంగరు కాంతుల
గుడిసె గోడ లంతలోన
'ఆలించండిక నా కథ'
అన్నాడయిదవ మిత్రుడు

## అయిదవ గాథ

మరువకండి అన్నలార!
మన నెత్తురు మన చెమటలు
మాగాణిని తడుపుతాయి
అన్నాడిది కుమరయ్య
విన్నారిది ప్రజలు!
పైరు పచ్చగా ఉంటే
పస్తుల నరకం లోపల
పడుతున్నాం మనమెందుకు?
అన్నాడిది కుమరయ్య
విన్నారిది ప్రజలు!
ఏటికి ఏతాముఎత్తి
ఎయ్యిపుట్లు పండిస్తాం
ఎందుకు ఒక మెతుకెరగవు
అడిగాడిది కుమరయ్య
ఆలించిరి ప్రజలు
దొరమబ్బులు పుట్టించడు
దొరవానలు కురిపించడు

తోలుకుపోతాడు పంట
అన్నాడిది కుమరయ్య
విన్నారిది ప్రజలు
గాదులలో వడ్లుపోసి
కడుపుచల్ల కదలకుండగ
కమ్మగదొర బతుకుతాడు
అనిచెప్పెను కుమరయ్య
వినసాగిరి ప్రజలు
మనం బ్రతుకు శవాలము
మనకన్నా కుక్కలకే
మంచికూడు దొరుకుతుంది
అనిచెప్పెను కుమరయ్య
వినసాగిరి ప్రజలు
ఆకలి దహియించుతూంది
అమ్మా, ఆలీ, బిడ్డలు
ఆకలిమేకుల కాహుతి
అనిచెప్పెను కుమరయ్య
వినసాగిరి ప్రజలు
లెండి లెండి మీరంతా
రండి రండి దొరవద్దకు
తిండిగింజ లడుగుదాము
అని చెప్పెను కుమరయ్య
ఆశపడిరి ప్రజలు !
తిండిగింజ లివ్వుదొరా
తేరగ ఇవ్వొద్దు సుమా
తిరిగి అప్పు తీర్చుతాము
అని వ్రాసెను కుమరయ్య
అది చూసిరి ప్రజలు.
పంపినారు మహాజరు
బదులు దొర ఇవ్వడు
'పస్తులుండి చావనీ'
అని తలచెను దొర
అతనికి ప్రజ చీదర.
గడిచిపోయె మూడునెలలు
కడుపులు మలమల మాడెను
గాదులు తెరిపిద్దామిక
అని చెప్పెను కుమరయ్య
వినసాగిరి ప్రజలు
దోపిడి ఇది కాదు కాదు
దుర్మార్గం అసలు కాదు
దొరకు మరల తీర్చేద్దాం
అని చెప్పెను కుమరయ్య
వినసాగిరి ప్రజలు
పంట మరల పండగానె
ఇంటికి అది రాగానె
వెంటనె వాపసు చేద్దాం
అని చెప్పెను కుమరయ్య
విని లేచిరి ప్రజలు
ఆలస్యం చేయలేదు
అతి ధీరుడు కుమరయ్య
అందరితో కలిసి వెళ్ళి
పాతర తెరిపించాడు
పంచినాడు గింజలు
నీ భూములె దున్నుతాము
నీ గాదులె నింపుతాము
నిన్నె అప్పడుగుతాము
అని చెప్పిరి ప్రజ
వినదంటుడు దొర.
గాలిమీద బతకలేము
కడుపుమంట సైచలేము
కనుకనే తెగించాము
అనిచెప్పిరి ప్రజ
వినదంటుడు దొర
బిచ్చంగా అడగలేదు
వచ్చే ఏడాది నీకు
కచ్చితంగ తీరుస్తాం
బాస చేసె ప్రజ
ఈసడించె దొర

'నన్నే ఎదిరిస్తాడా ?
నాశనమ్ము చెయ్యాలిర'
నౌఖరుతో దొర చెప్పెను
రాణా కెళ్ళిండు వాడు
రాణువనే తెచ్చిండు
గుళ్ళవాన కురిసినప్పుడు
కుమరయ్య చలించలేదు
గుండెలొగ్గి నిలచినాడు
ఒళ్ళంతా తూట్లు తూట్లు
ఒరిగినాడు నేలమీద
'వీరుడితని పెదవి నుండి
వెలువడు రక్తాన తడిసి
పెనుజెండాలెర్రనాయె'
ప్రజలట్లు తలంచిరి
ప్రతిజ్ఞలను చేసిరి
ఆ పెదిమలు కడసారిగ
అభిభాషించిందేమిటి
'ఆపకండి పోరాటం !'
సాగిస్తాం సమరం
సాధిస్తాం విజయం

గంటలు నినదించె మూడు
గంట మ్రోగునపుడు రవము
నిశీధిలో నిశ్చలతను
నిశితముగా శోధించును
ముసిరిన నీడలలోపల
పసలసాగి ఒక మానిసి
వేటాడే మెకములాగ
వెలుగును ఆ కనులకని
లంచాలను కతుకువాడు
వంచనపై బతుకువాడు
[illegible]జాటున పురుగులాగ
పొట్టమీద పాకుతాడు
పుంతలలో నక్కినక్కి
కంతలలో గెంతుతాడు
పరులను పసికట్టువాణ్ణి
పరికిస్తున్నారెవరో
వాడు లచ్మిగుడిసెచేరె
గోడచాటుగా నిలబడి
వేకువ వరకును నక్కెను
వేగుతీయు ఆ తుచ్ఛుడు
'కడకువీళ్ళ పసికడితిని
కాల్పిస్తా వీళ్ళనింక
కమ్యూనిస్టుల కాశ్రయ
కల్పనకావించు లచ్మి
ఆర్గురితోపాటు తాను
అంతం కావలసిందే !'
అని తలచుచు ఆ నీచుడు
అతిరయమున సాగిపోయె

వేగులవాడిని చూసెను
వేరొక ఇల్లాలప్పుడు

'అమ్మా ఓ లచుమమ్మా
ఆళ్ళ నిఘా పడిందమ్మ
జాగిలాలు జాడలరసె
జాగ్రతగ ఉండవమ్మ
నీడలలో నక్కినక్కి
నీచుడొకడు నిఘావేసి
ఆడ ముసుగు నల్లమబ్బు
అందులోన పిడుగులుండు'
వచ్చిన ఆ రైతు వనిత
హెచ్చరించె కచ్చితముగ
ఆమె కళ్ళు డేగ కళ్ళు
ఆమె చెవులు పాము చెవులు
ఎన్నిసార్లో హెచ్చరించి
ఎందరినో కాపాడెను
గ్రామం నశియించకుండ
ఆమె వేగు రామ రక్ష !

ఎక్కడనో దూరముగా
'కొక్కొరొకో' అనెను కోడి
ఆ వేకువ సమయంలో
ఆవలించె లచ్చుమమ్మ
"రాతి రెల్లా తిరిగి తిరిగి
భూతమ్ములు వేకువకడ
గోరీలను తప్పకుండ
చేరుననుచు చెప్పుకొంద్రు!'
'మనమూ భూతమ్ములమే'
అని నాడొక కామ్రేడు
"పగటిపూట మన నెలవులు
తగు రహస్య స్థావరములు
పులిసంజలొ ఇటుకుచేరి
తొలిసంజలొ తొలగుతాము"

ఆ మాటలు విన్న లచ్మి
అలసిన నవ్వును నవ్వెను
ఆవలించి మరల ఆమె
అన్నది ఈ తీరున :
"ఎంతో జాగర్తగ మీ
రంతా ఇక మెలగాలి
బువ్వ మీకు చేరేస్తా
పొద్దుగూక రాకూడదు
ఏమరు పాటున మీలో
ఏ ఒకడూ దొరకరాదు"

"మరి నీ సంగతి ఏమిటి"
"సరిసరి నా సంగతికేం!
కాటికి చాచితి కాళ్ళను
కడనిద్రకు కళ్ళులేచె

వాళ్ళు నన్ను హింసిస్తే
తాళ్ళతోటి కట్టేసే
వాళ్ళకేమి వేడుకొను!
గుళ్ళు దండుగను కొందురు!
ఒకవేళను హింసిస్తే
ఒక్క మాటకూడ రాదు
'ఇంకిలాబ్' మంత్రమ్మును
ఈ పెదవులు జపిస్తాయి.
వయసు తప్ప నన్నేదీ
ఎంగ దీయలేక పోయె
అదికూడా నామీదను
అజమాయిషి చేయలేదు
నిటారుగా నిలబడతా
హుటా హుటిని నడుస్తాను
వంగదు నా శిరసు ఇంక
లొంగను నేనెవ్వరికీ!"

'అవునమ్మ లచుమమ్మ'
అన్నారా కామ్రేడులు
"ధైర్యానికి మారుపేరు
త్యాగాలకు పుట్టినిల్లు
పాత పాత అనుభవాల
పాతర నీలో ఉన్నది
నీవు మాకు కవచానివి
నిలువెల్లా వణుకుతాడు
నీచుడు భూస్వామి
సర్కారీ బందూకులు
చచ్చు చచ్చు తాటాకులు"
అంతట ఆఖరు గాధను
అరవ మిత్రుడు చెప్పెను.

# అరవ గాధ

అతని కొరకు గాలించిరి
అతని ఉనికి కనిపెట్టిరి
బంధించిరి బాధించిరి
బందూకులలో చంపిరి

గ్రామస్థుల నిలవబెట్టి
గద్దించెను దండుపెద్ద
"ఏదీ ఇతగాడి భార్య
ఏదీ ఆ పచ్చిలంజ ?"

అరుణాగ్నుల వెలిగ్రక్కుచు
అ సమించె నా సూర్యుడు
ఊరివాళ్ళ కన్నులలో
ఉడుకుతోంది విద్వేషం
నేత భార్య నిట్లు పచ్చి
బూతులతో తిట్టెడి ఆ
పోలీసులమీద నేడు
పొంగుతోంది పెనుకోపం

'ఏదిర ఆ ఆడముండ
ఎక్కడ దాగుంది రండ !'
ప్రశ్న ప్రశ్నలా మిగిలెను
ప్రజమౌనము వహియించెను.

'మారు చెప్పమంటారా ?
మీరు నిజము దాస్తారా ?
మీ గాడిప మెంకుపట్టు
మేము నేడు సడలిస్తాం'

తొందరగా అందరిని
తోలినారు చాణాకు
బాదినారు కొరడాలతొ
ప్రజలు బిగిసిపోయినారు

"లాఠీలా బంధనాకులు
మాటలు చెప్పించలేవు
తిరుగుబాటు తోటలోన
విరగకాయు పళ్ళలాగ
ఎంత మమ్ము బాధిస్తే
అంత ఎర్రనౌతాము"
అన్నాడా గుంపులోని
అతి సాహసి ఒక మానిసి.

"ఎవడుర ? ఆ మాటన్నది
ఎవడికంత దిటవున్నది ?'
'ఎవరా ? నేనే అన్నది
ఇదుగోరా నా ఛాతీ !'

రొమ్మువిరిచి ముందుకొచ్చె
రుద్రునివలె ఆ వీరుడు
కురిసెను తుపాకి గుళ్ళు
ఒరిగెను ఆ పడుచు ఒళ్ళు
కొదమఎర్ర రక్తమేమొ
గుండెనుండి పొంగసాగె
'అరుణతార !' ఇది అంటూ
ఆకాశం స్వీకరించె

"ఏదిర ఆ ఆడముండ
ఏదిర ఆ ఎర్రలంజ !"
పోలీసులు గద్దిస్తే
మూగవడిరి ఊరిజనులు

ఆ గ్రామపు అధరమ్ములు
ఆరోజున మూతవడెను
అందరి హృదయమ్ములందు
ఆశయమ్ము గట్టిపడెను

పడుచు చుక్కలారాతిరి
పట్టినాయి మూగనోము
ఆ రాతిరి చందమామ
నోరు తెరిచి మాటాడదు

ఉన్నది ఆ ఊరిలోన
ఒక ముస్లిము కుటుంబమ్ము

కడుతెగించి వారామెను
కడుపులోన పెట్టుకొనిరి.

కొన్నాళ్ళకు సమరంలో
గుళ్ళవాత పడినదామె
అవివేకులు పోలీసులు
ఆమె 'ఆమె' అని ఎరుగరు !

* * *

వేకువ మధ్యాహ్నమాయె
వేగముగా సంజపడెను
కెంజాయలు మాటువడెను
కీసీడల ఇరులు పెరిగె
చదల నీలికొలనులోన
చందమామ ఈదులాడె
గుడిసెలోన గోడనున్న
గూటిలోన దివ్వె కుమిలె !
దివ్వెలాగ లచ్మి కూడ
దిగులుతోడ కూర్చున్నది.

దిగులా ? నిజమే ! నిజమే !
సగము వెలుగులోన లచ్మి
రాగల ముప్పును తలంచి
రాయిలాగ కూర్చున్నది

సాయుధ పోలీసులామె
సదనానికి అరుదెంచిరి
'ఏరీ ఆ అరుగురూ ?
ఎక్కడ నక్కేరు వాళ్ళు ?'

'అయ్యలార ! మీారనేది
అర్థంకాలేదు నాకు !'
'ప్రతిరాత్రీ నీ గుడిసెకు
ప్రచ్ఛన్నంగా వస్తూ

కడుపారగ తిండి తినే
కమ్యూనిస్టులు ఏరీ ?"
'అయ్యలార మీారనేది
అర్థం కాలేదు నాకు'
'అర్థం నీకవలేదా ?
అతి త్వరలో తెలుసుంది
ఏరీ ? ఆ అరుగురూ ?
ఎక్కడ దాచావు చెప్పు !"

విద్వేషపు కైజారులు
వెలువడె ఆ కన్ను నుండి
పిరికి ఇరుల గుండెలపై
వెలుగు ప్రేట్లు పడసాగెను

'దాచానా ? ఇంతవరకు
నీచులు మీాపైన వెగటు
దాచినాను గాని నిజం
దాచలేదు నేనెపుడూ'

"మాకు తెలుసు నీ సంగతి"
నుదియించిన పోలీసులు
లచ్మిని ఆ నిశీథాన
లారీ ఎక్కించినారు

గ్రక్కున రాణా అనబడు
కబేలాకు చేర్చినారు
ఊరంతా భీతిచెందె
హృదయమ్ములు బరువెక్కెను

ఆమె వారి బల సంపద
ఆమె వారి మాతృమూర్తి
భీతిలేని నేత ఆమె
ప్రేమాస్పద చిరబాంధవి

'క్రూరుడెవరో పనిగట్టుకు
గుట్టు బయటు పెట్టినాడు
రైతువనిత ఆర్గురినీ
రక్షించెను, లచ్మి చిక్కె

నిత్య మృత్యు మందిరమ్ము
నీచపు పోలీసు రాణా!
అచట గాలికూడ మూల్గు
అటుగోడలు నెత్తురోడు!

'ఇనుప కమ్చి ఝుళిపిస్తాం
ఇంక నోరు మూసుకోవు!'
'ప్రళయమైన రానిండు
పల్లెత్తి నేను పలకబోను'

'నూరవ సారడుగు తాము
అరుగురియా దాగిరెచట?
కొల్లగొట్టు దుర్మార్గులు
గొంతులు కోసేటివాళ్ళు
కటికవాళ్ళు తలమాసిన
కమ్యూనిస్టులు ఏరీ?'

పట్టరాని వెగటుతోడ
ఫక్కున నవ్వింది లక్ష్మి
భయమెరుగని గుండెలతో
పలికెను తన శాపోక్తులు

'కొల్లగొట్టు దుర్మార్గులు
గొంతులు కోసేటి వాళ్ళు
మీరే! మీరే! మీరే!
మీరేరా విద్రోహులు

'పరస్త్రీలను చెరచువాళ్ళు
పాతకాలు చేయువాళ్ళు
పేదల బాధించు మీరు
పిరికి చీడ పురుగులురా!

'మీ అంతం మొదలయింది
మీ హజాలు చల్లారును
నిజము నేను ఒరగుముందు
ప్రజావాణి వినిపిస్తా
మూర్ఖులు హింసించితే
బొందికే ఆ బాధలు
బందూకులు పేలిస్తే
బొందికదా వాలుతుంది
బొందికన్న వేరొక్కటి
ఉందిసుమా గట్టిగా
దాన్నెవరూ ఆపలేరు
దాన్నెవరూ చంపలేరు
మంది కొరకు బలి అయ్యే
మంచోళ్ళలో అది ఉంది
చలియించను ఆ నమ్మిక
కలకాలం బతుకుతుంది.
దేహాలను చంపినా
ఊహనెలా చంపగలరు!'

తొడలు రెండు చీల్చినారు
వడివడిగా నెతురుబికె
'అవ్వా ఇపుడేమంటావ్'
'అరవనైన అరవనురా!'

జలగల తెప్పించినారు
జాలిలేక తొడలలోన
జలగల చొప్పించినారు
బిలబిల పీల్చెను నెత్తురు

'ఆహా! పీలుస్తున్నవి
ఆకమ్యూనిస్టునల్ల

ఇంకనిజం కక్కుతుంది
ఎలుగెత్తిన ముసలిముండ !'

'తుచ్ఛులు మీకన్న ఈ
పిచ్చిజలగలే మెరుగు
సంతోషముగా వీటికి
సంతర్పణ చేస్తాను'

'మా బాధలే మీ మృత్యువు
మా మరణము క్రొత్తబతుకు
రాగల యుగముల మనిషికి
ప్రాణవాయు వీ సమరము

మీ పాపం పండుతుంది
మీరాజ్యం కూలుతుంది
ప్రజాబలం సమవాదవు
ప్రభుత్వాన్ని ఏలుతుంది

ఇది జోస్యం కాదు కాదు
ఇతిహాసపు గతితర్కం
అధికారపు పీఠాలను
అది గాలికి ఎగురకొట్టు
సామ్రాట్టుల సామాన్యపు
సమాధులకు పంపించును.

'ఇంకా నువు మాటాడవ ?'
ఇంక ఆమె మారాడదు
గుట్టుదాచుకొన్న గుండె
అట్లాగే ఆగిపోయె

రహస్యాల రంగంపై
వ్రాలుతున్న తెరలలాగ
అంతిమ అంకమ్ము పిదప
ఆ కన్నుల తెరలు వ్రాలె.

ఆ రాణా సమరభూమి
ఆమెకు విజయము దొరికెను
ఆమెకు ముందుగ ఎందరో
అచ్చటనే జయించారు.

తరతరాల ఆశయమ్ము
పరమ పవిత్రము లక్ష్యము
సంకెళ్ళకు విద్రోహుల
శస్త్రాలకు అతీతమ్ము

ధరణిలోన ప్రతిమనిషి
తానే ఒక ప్రపంచమ్ము
పరమావధి సాధిస్తే
నరుడు జగద్బంధువు

మానవలోకమ్ము నిత్య
మానవునికి స్వంత మగును
దేవత లా మనిషియొక్క
దేహ రహిత స్వరూపాలు

మహాకాల పత్రంపై
మానవుడే లోని గుర్తు
వెలుగుతున్న రవిచంద్రులు
వేసినట్టి ఎఱ్ఱసీళ్ళు

ఈ పత్రం ప్రకటించును
ఇలలో అంతిమ విజయం
ఏ తల్లో కన్న కడుపు
ఇక యుద్ధాల్లో చావదు

తనపై తనకే విజయం
తనదేలే ఈ విశ్వం
సమిష్టి వ్యక్తి విజయానికి
సంకేతం ప్రతి ప్రాణం !

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 13 | రు 15 లు లేదా | పదిరెట్లు రు 150 లు లేదా |
| 33 | 6 | మనపై విసరటం జరుగుతున్నప్పటికీ, | మనము ఇతరులపై విసురుతున్నప్పటికీ |
| 47 | 21 | గూటుపాలన్నింటినీ | గుటపలన్నిటిని |
| 47 | 23 | గూటుపాలసంఘం | గుటపలసంఘం (70 వ పేజీలో కూడా) |
| 69 | 9 | బూర్జువావాదంనుండి | ఈ పదాన్ని తొలగించాలి. |
| 82 | 6 | ఐదునుండి మూడు | ఐదు లేదా మూడు |
| 85 | 23 | పట్టుబడింది | చిక్కుకుంది |
| 95 | 11 | కొండుకూరు | కందుకూరు |
| 105 | 17 | గనాపురానికి | గనపురానికి |
| 143 | 26-28 | వాళ్ళకు తమ కుటుంబ .. జోడించి | భూస్వాములకు తమ కుటుంబ సభ్యుల శ్రమతోను, కూలీలతోను సొంతంగా |
| 144 | 6 | దినాడు | ఆనాడు |
| 144 | 7 | అటువు | దిటువు |
| 145 | 11 | భారత యూనియన్ రాజ్యపు | భారత యూనియన్‌లో |
| 147 | 26 | రైతాంగానికి భూమి కోసం | భూమికోసం |
| 148 | 19 | విప్లవానుభవ మొత్త మంతటి | మొత్తం విప్లవానుభవం |
| 150 | 9 | కౌలుహక్కు | కౌలుతీసుకొనే హక్కు |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 170 | 31 | ఉదార భూస్వామ్య వర్గాలకు | భూస్వామ్యవర్గాలకు |

(ఇంగ్లీషులో **Liberal Land Lords** అని ఉంది కాని అది తప్పు, తెలుగులో మరీ తప్పుగా అర్థమవుతుంది)

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 195 | 8 | ఒక దళాన్ని | ఒక గూండా దళాన్ని |
| 214 | 21 | సాయుధంగా నైనాసరే | సాయుధంగా |
| 218 | 16 | ఆయుధాలు సమకూర్చండి | ఆయుధాలను గుంజుకోండి. దళాలకు ఆ నూతన ఆయుధాలు సమకూర్చండి |
| 219 | 27 | వాళ్లు | వళ్లు (ప్రాణాలు) |
| 256 | 14 | మోళ్ల చెరువు | మేళ్ల చెరువు |
| 256 | 26 | అత్వాల | అల్వాలా |
| 271 | 16 | అనియాలి | అంజలి |
| 290 | 26 | బగటు | బాగాతు |
| 294 | 12 | సభ్యులుగల | సభ్యులుగల రెండు పెద్ద దళాలు అటవీ ప్రాంతంలోను, |
| 296 | 23 | అల్లాపల్లి | ఆళ్ళపల్లి |
| 299 | 2వ పేరా | వ్యాపించింది విస్తరించింది | వెళ్ళింది (రిట్రీటు అయ్యింది) |
| 301 | 19 | వాళ్ళకేమిచ్చినా | వాళ్ళేమిఇచ్చినా దళాలు |
| 310 | 7 | కేసనపాడు | కేశనపాడు |
| 311 | 7 | బంజారాదారు | బంజరుదారు |
| 311 | 11 | పొలెంపల్లి | పోలంపల్లి |
| 316 | 5 | అల్లాపల్లి | ఆళ్ళపల్లి |
| 316 | 18 | ంగూడెం | లింగగూడెం |
| 317 | 8 | కోమలి | కోమటి |
| 328 | 30 | దినగానాపురం | చిన గనపురం |
| 329 | 10 | కవ్వాయిల | కారవాయిల |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 330 | 29 | చెంహువానిగూడెం | చెంబువానిగూడెం |
| 331 | 2 | తమకోసం | తమకోపం |
| 331 | 17 | అల్లాపల్లి | ఆళ్లపల్లి |
| 331 | 26 27 | వారు తమ దాడిని కొనసాగించకుండా తప్పుకొని వెళ్ళిపోయింది | దాడిని కొనసాగించలేక తప్పుకొని వెళ్ళిపోవలసి వచ్చింది |
| 334 | 7వ పేరా | తిరుమలగెడి | తిరుమలగండి |
| 336 | 6 | బగటు | బాగాతు |
| 337 | 28 | మేదిరంపల్లి | మేడిరాంపల్లి |
| 340 | 14 | మాసియా | మాసాయి |
| 354 | 7 | బంజానపల్లి | బంజనపల్లి |
| 361 | 22 | మసాయి | మాసాయి |
| 364 | 8 | రాత్రి వచ్చిందెవరు ? | రాత్రి వచ్చేవారా ? |
| 364 | 8 | పగలు వచ్చిందెవరు ? | పగలు వచ్చేవారా ? |
| 376 | 17 | "పాయం" | "పంగూం" 377, 389 లో కూడ సవరించుకోవాలి. |
| 388 | 13–14 | భిద్ జైలు | ఫిడ్ జైలు |
| 405 | 18 | మొండితనం | గట్టితనము, దృఢత్వం |
| 415 | 11 | ధన్నాలీ కావలు | ధన్నాలీ |
| 424 | 10 | కులంవాడు | కులం |
| 476 | 14 | దాని మిగ్ర | దానితో చెరిన |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 483 | 1వ పేరాకు బదులు | | "నేటి భారత విప్లవ దశ, పెట్టుబడి దారీ విధానాన్ని పూర్తిగా అంత మొందించే సోషలిస్టు దశకాదు, జనతా ప్రజాస్వామిక దశమాత్రమే అయితే ప్యూడలు, అర్ధ ప్యూడలు భూస్వామ్య విధానాన్ని, గుత్త పెట్టుబడిదారీ విధానాన్ని, విదేశ సామ్రాజ్యవాద అవశేషాలను పూర్తిగా రద్దుచేసే దశ" అని చదువు కోవాలి |
| 484 | 9 | విప్లవకారుల మాటలలా వుంచి | విప్లవకారులేగాక |
| 485 | 16 | దాని స్వంత ప్రకృతి సాంఘికసంబంధమయిన | భౌతిక పరిస్థితులలోనూ, సామాజిక పరిస్థితులలోనూ |
| 486 | 5 | మొదటి విషయంగా 1927 లోనే | 1927 లోనే |
| 498 | 15 | యుద్ధాన్ని | పోరాటాన్ని |
| 513 | 8 | పాలకవర్గాల సాయుధ గెరిల్లా బలగాలకు వ్యతిరేకంగా | పాలకవర్గాలకు వ్యతిరేకంగా సాయుధ గెరిల్లా బలగాలకు |
| 515 | 1 }<br>2 } | సాధించు ... సాగించాం | సాధించుకున్న వాటిని నిలబెట్టుకో డానికి జరుపుతున్న సాయుధ పోరాటాన్ని చివరకంటా మనమే దెబ్బతినేంతవరకు పొడిగించాం |
| 545 | 22 | రు 30 ల వరకు | రు 3 ల వరకు |
| 617 | 25వ ఐటెం బాజారుగూడ | | బూజారుగూడ లేక బుజారుగూడ |
| 628 | 38-19 | రెండవ కాలంలో | బొల్లేపల్లి |
| 668 | 6 | భూపతి రామారావు | భోగాదుల రామారావు |